# ప్రస్తావము

ఓ రసికవతంసులారా! భోజభూపతిసభాలంకారుండగు మహాకవికాళిదాసుని చరిత్రము కరము రసోదారమగుటం జేసి సకల రసిక జన శ్లాఘనీయంబగుట యెల్లరకుం దెల్లంబకదా! ఇతరులగు నేకవులు గాని యీతనిం బొగడనివారు లేరు. మఱియు నితఁడు పురుషావతారంబుం గాంచినభారతీదేవి యని కొన్ని గ్రంథములు నుడువుచున్నవి. సకలసుకవికులసంస్తుతి పాత్రత గలిగి యుండుటవలన నితఁ డిట్టిమహనీయుఁడనుటకు సందియంబులేదు. "లోకప్రవాద స్సత్యోయం పండితై స్సముదాహృతః" అన్నట్టులు పండితు లగువారు పూర్వపూర్వులు వర్ణించుకొనుచువచ్చినయితనిచరిత్రంబు సత్యం బనుటయు నొప్పిదంబ. కొందఱీమహాత్ము నతిమానుషచారిత్రు మెప్పుకొనరు. వారు తమతమకుంగల బుద్ధిశక్త్యాదులకన్నం జతురము లగునవి యితరులకుం గలవనుటయందు నమ్మికఁ జెందనివారు. కవితాచాతురీధురీణులగు పూర్వు లందఱు నేకకంఠముగఁ బొగడు నంతటి యతివిశాలయశోవిభవం బీమహాకవికిం బోలెఁ దమకేలగలుగదో యను నర్థం బునకుం గారణం బూహింప వారలు వలంతులగుదురుగాత. వీరు తమ ముక్కునకుం జక్కనిద యాకాశము; తమగొందియ లోకం బని యుండువారు. ఈయర్థంబటుండ నిండు!

నేను గురుకులవాసంబు సేయుచు శ్రీకాళిదాసవిరచితము లగుగ్రంథములనుబఠించుచుండిననాటందొట్టి యితనియత్యద్భుత చారిత్రంబు విని యానందించుచుం బూర్వపూర్వులు తమకుం జెప్పినట్లు పండితులగువారు కాళిదాసప్రోక్తములనియుఁ దత్సంబద్ధంబు లనియుం జానతిచ్చినచాటుసమస్యాశ్లోకంబులును వానితోఁజేరినకథలును సంపాదించుకొని యున్నవాఁడనుగానం గొన్నిసంవత్సరములకుం బూర్వమున నాకథలుసేర్చి కాళిదాసచరిత్ర మనుగ్రంథమును రెండుభాగములుగ రచించి ముద్రించియు నప్పటి కామహాకవిచరితము సాకల్యముగ దొరకకయుండుటంబట్టి తృప్తింగాంచక బహుకాలముగ మఱియుఁ బెక్కండ్రం గావ్యనాటకాలంకారజ్ఞుల ననువర్తించుచుం బూర్వము నాకుం దొరికినవానికంటె నతివిశేషరసప్రశస్తంబులగు నామహాకవివరు నత్యద్భుత చరిత్రంబులు పెక్కులు గడించి సమాహితమనస్కుండనై యానూతనసంపాదితము లగుకథలును బూర్వముద్రితగ్రంథములోనికథలును జేర్చి "వినోదకథాకల్పవల్లి"

చరిత్రంబును రససంజీవ మను పేరం బరఁగు నేడంకములనాటకంబుగ నభినయింపఁ జేసి వసుధారిణి యనుమఱియొకరాజకన్యకారత్నంబుతో భోజసుతల నుదయాదిత్యునికిఁ బెండ్లిసేయించె.

## కథాంశములలోనివిశేషములు

మహాకవి వాకిటిలు దాఁటునప్పుడును దాఁదెచ్చినయరఁటియాఁచలకట్ట నత్యావశ్యకముగ విలుచుకొనవలయుననియుం నుపన్యసించినశృంగారపద్యములును; వేశ్యాకన్యకయుఁను గవియును బరస్పరనిజిగీష నొండొరులకు సమస్య లొసంగుచు వాని గూఢార్థంబులఁ దెల్పుచు బ్రతిసమస్య లిచ్చుచు వాగ్వాదంబు సేయుటయు; అతిచతురతతో వేశ్యాకన్యక యొనరించిన మాయోపాయంబులఁ గవి జయించుటయుం; నతినిపుణబుద్ధులగురసజ్ఞుల కత్యంతామోదదాయకంబై యుండు.

నాటకచ్ఛాయయందు భోజునిరాణిలీలావతీదేవి తనయందుఁ గాళిదాసుం డపరాధంబు సేయుచున్నాఁ డన్నదూఱువోవుటకుం జేసినవిస్మయనీయంబగు పాతివ్రత్యధర్మజ్ఞాపనమును; మాయాసుందరీవిజయంబున శ్రీహరి మోహినీరూపంబుం దాలిచి శివుని నలయించుటయుఁ గరము రసోదారంబులయి యుండు. రససంజీవననాటకంబునందుఁ దరుణాంబుజా విరజాంబుజలకు నుదయాదిత్యునికి నేక స్థలసమావేశ మగుటయుఁ దత్కారణంబులును వారలకుం బరస్పరప్రణయనిర్వహణంబును నాటకలక్షణములననుసరించి రసోదారముగ సఖిలభావుకసంభావ్యములు యుండునట్లు వచియింపఁ బడియుండు.

మఱియు నానుషంగికచరిత్రంబులు పెక్కులు గలవు. అందు మదనమాలిని యనురాచకన్నియ తననేర్పేర్పడఁ దనమగనితోఁ బరకీయాభావంబునంగలసి యాయర్థంబు తనమగనికిం దెలియపడకుండనట్లు ప్రవర్తించినశృంగారచరిత్రము విన్నవారిచేత శిరశ్లాఘ సేయింపక మానదు.

దీనియందు నాటకచ్ఛాయ, మాయాసుందరీవిజయము, రససంజీవనము అను నాటకములు మూఁడు గర్భితములై యున్నవి.

శృంగారపద్యములతోడను శృంగారచాటుసమస్యాశ్లోకములతోడను గలసి యుండు నిందలి వచనశైలి పఠియించువారలయుల్లంబులఁ బయింబయి బల్లవింపం జేయుచుండును. కాన నిది యెల్లవారలునదివియు వినియు నానందింపఁదగినయది.

☞ వినోదకథాకల్పవల్లియు నీక్రింది రెండు గ్రంథములును బరస్పర సంబంధము గలిగియుండును గాఁబట్టి యిందొకటిఁగొన్నవారికి మఱిరెం డత్యావశ్యకములు.

# కాళిదాసచరిత్రప్రకరణము.

ఇది రూపకములలో రెండవదియయి నాటకమువలె నఖిలలక్షణములతో నొప్పుచుండు ప్రకరణగ్రంథముగ రచియింపఁబడినది.

ఇందు కరూశదేశాధీశునిమహామంత్రియగు మాధవమిత్రునికిం జనియించి కాళిదాసుండు శాపకారణంబున గాడిదెల మేఁపువాఁడై యుండి పురోహితబ్రాహ్మణుని కపటంబున నొకరాకన్నియకు భర్తయయి దానిసహాయంబున మహామతియగుచుఁ గాళికానుగ్రహంబు వడసియుఁ బురోహితునికపటంబున నారాకన్నియ నెడఁబాసి ధారానగరంబున భోజునికడకుం జేరి విలాసవతియనం బరగు కాంచనమాల యనువేశ్యాకన్యకం జేపట్టియుండి మరల తనపత్నింగూడినచరిత్రము జెప్పంబడియుండును.

ప్రతి 1-కి రూ. 2—8—0

# ఆంధ్రభోజచరిత్రము.

ఇది సంస్కృతభాషయం దుండుభోజచరిత్రమును శ్లోకములకు సరియయిన యాంధ్రపద్యంబులతో సంస్కృతవచనమునకు సరియయినయాంధ్రవచనములతోఁ జేర్చి రచియింపఁబడినది. కాళిదాసునితో భోజునిసభయం దుండినమహాకవులచరిత్రమును భోజకాళిదాసుల చరిత్రము నుండును.

ప్రతి 1-కి రూ. 2—0—0

# శ్రీతులస్యుపాఖ్యానము.

ఇది లక్ష్మీదేవి తులసి యనురాజపుత్రియై జన్మించి శంఖచూడునికిం బత్నియై నారాయణునిచేతఁ బాతివ్రత్యభంగమునుబొంది తత్పత్నియై తులసీపత్రరూపమును ధరించి భగవంతుని కేకాంతకైకర్యప్రవణయైనచరిత్రము. ఇది తులసీదళములచే భగవత్పూజసేయువారలకెల్ల నత్యాదరణీయము. బహుసుందరమైనకథ. శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణములోనిది.

ప్రతి 1-కి రూ. 0—8—0

# చమత్కారకథాకల్లోలిని.

ఇది రోచకుఁ డనురాజకుమారుఁడు మందారమాల, మదనమాల, మదనసేన, వసంతసేన, మదలేఖ, చందనలేఖ లనువిద్వద్రాజకన్యారత్నములను బరకీయాభావంబునఁ బరిణయ మయినశృంగారచరిత్రము. పద్యములును శ్లోకములును గలిసియుండు మనోహరవచనము. వినోదకథాకల్పవల్లివంటిది. ప్రతి 1-కి రూ. 1—0—0

# శ్రీమదాంధ్రవచనబ్రహ్మవైవర్తమహాపురాణము.

ఇది వ్యాసవిరచితమగు సంస్కృతమునకు సరియయినది. సకల శ్రుతీతిహాసపురాణములందుఁ గలసందేహములంబోఁగొట్టుటకుఁ బురాణసూత్ర మనునామాంతరముతోఁ బదవమహాపురాణముగ నితరపురాణాదికథలకు మూలభూతము లగుగోలోక భూలోక రాధాకృష్ణుల కథలును, లక్ష్మీ, సరస్వతీ, దుర్గా, సావిత్రీ, తులసీ, గంగా, వసుంధరాది సమస్తస్త్రీదేవతోపాఖ్యానములు నూఱును, నారాయణ, మహాదేవ, విరాట్పురుష, గణేశాదిచరిత్రము లనేకములును, తన్మంత్రోపాసనాదులును, ఎల్లవారల కతిసులభముగఁ దెలిసికొనునట్లు కథారూపముగఁ దత్త్వమును, జనులకత్యావశ్యకముగ నెఱుంగవలసిన ప్రతివిషయములును మహర్షి దీనియందుఁ జెప్పిరి. ఈవిషయము లితరగ్రంథములందు లేవు. దీనిలోని శాఖాకథలంబట్టి పురాణాంతరములు, నిందలి ప్రమాణంబులఁబట్టి స్మృతులు చేర్పడినవి. దీనిం జదవనివారిపురాణజ్ఞాన మతిశ్రజ్ఞానము లేని భాషాపరిచయమువంటిది. ఇది సమస్తాస్తికులకత్యావశ్యకము. (అచ్చుగుచున్నది)

# ఆంధ్రకల్కిపురాణము.

ఇది శ్రీనారాయణమూర్తి యీకల్యంతమునం జేయంబోవు పదవదియగు కల్క్యవతారముయొక్క చరిత్రము. ఇది శ్రీరామకృష్ణాద్యవతారచరిత్రములవలె నతిమనోహరమైనది. శ్రీవ్యాసవిరచితమైనసంస్కృతకల్కిపురాణము ననుసరించి పద్యకావ్యముగ రచింపఁబడినది. (అచ్చుగుచున్నది)

# ఆంధ్రతనిశ్లోకి.

ఇది ద్రవిడభాషలోఁ బెరియవాచ్చాంపిళ్లగారు రచించినతనిశ్లోకికి సరిగా నాంధ్రీకరింపఁబడి మధ్వోదాహృతము లగుప్రమాణవాక్యములకర్థములతో ముద్రితమై యుండును. దీనియందు శ్రీరామాయణములో ముఖ్యములగుశ్లోకములకు శ్రుత్యాదిసమ్మతము లగు మహార్థము లొక్కొకపదమునకును వాక్యమునకును నలుపదేఁబదివిధముల నుపన్యసింపఁబడియుండు. ఈయర్థములతిమనోహరములయినవి. (అచ్చుగుచున్నది.)

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

శ్రీరామజయము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# వినోదకథాకల్పవల్లి

## ప్రథమగుళుచ్ఛము.



### మంగళాచరణము.

కం. శ్రీరాధాస్తనయుగకా, శ్మీరారుణవక్షునకును శ్రితజనరక్షో,
దారయశోవిభవునకును, నారదమునివినుతునకును నతు లొనరింతున్.

### ప్రతిజ్ఞ.

గీ. వరవినోదకథాకల్పవల్లియందుఁ, దనరుచుండుగుళుచ్ఛసంతతులచేత,
మురహరునిఁ బూజసేయుదు మోద మలర, సుమనసులు మూర్ధమునఁ దాల్చి స్తుతులుసల్ప.

### కథాప్రారంభము.

శ్రీమంతం బై యపరిమితసంపదధరీకృతనాకం బై యొప్పునీభూలోకంబునందు సకల సత్కర్మసమాచరణసముచితభావప్రకర్షంబగునీభారతవర్షంబున నిరుపమవిజయలక్ష్మీ విభాసుర విశ్వంభరాకమనపరిపాలితావకాశంబగు నాంధ్రదేశంబునందు వేదవేదాంగ విజ్ఞానవిత్తములగు బ్రాహ్మణసత్తములును సమధీతవార్తాదండనీత్యాన్వీక్షకీత్రయులగు క్షత్రియులును ధనపతిసంకాశ్యులగు వైశ్యులును సమస్తగుణాఽక్షుద్రులగు శూద్రులును గలిగి యసమానభోగలసమానం బై యొప్పువసుమానసం బనునగరం బొండు గలదు. ఆయుత్తమపత్తనంబును తేజోవధీరితద్విషదాదిత్యుండగు ప్రతాపాదిత్యుం డనునరపతి యేలుచుండెను. అతఁడు గురువులయందు భక్తియు బంధువులం దాసక్తియు ననార్యంబులగు కార్యంబులందు విరక్తియు దుర్జనశిక్షణంబునందు శక్తియు సజ్జనరక్షణంబున ననురక్తియుఁ జతుష్షష్టికళలయందుఁ బ్రసక్తియుఁ గలిగి సత్యంబున హరిశ్చంద్రునితో నోర్పున యుధిష్ఠిరునితో శౌర్యమున నర్జునునితోఁ జాపవిద్యానైపుణ్యంబునఁ బరశురామునితో సౌందర్యంబున నిందిరానందనునితోఁ గాంతిం జంద్రునితో ఘనతం గాంగేయునితో సమానుండని సకలజనులు ప్రస్తుతింపఁ బ్రజలఁ దనప్రజలరీతిఁ బరిపాలించుచుండెను. అతనికి సమస్తశాస్త్రవేదియు నీతిశాస్త్రకుశలుండు నై మహత్తరములగు రాజ్యసంకటములందు నించుకేనియు విషాదంబు నొందక ధరాపరిపాలనం బనునావకుం గర్ణ

ధారుం డై సర్వకార్యములం దప్రతిహత మైన ప్రతిభ గలిగి యొప్పుమిగులు కరహాయనుం డనుబ్రాహ్మణుండు దేవపతికి బృహస్పతివలెను వృషపర్వునికి శుక్రునిచందంబునను దశరథునికి వసిష్ఠునివిధంబునను సర్వమంత్రికులప్రధానుం డై యుండె. ఆరాజు రిపుజనకాననదవానలం బై యొసఁగు తనబాహుబలంబున నశేషధరాతలాధీశుల జయించి వారలఁ దనకు వశవర్తులం జేసికొని యాబాల్యసఖుండు నశేషభూభరణక్షమం బైన శేముషీవిశేషము గలవాఁడునగు కరహాయనునియందు రాజ్యభారంబునిలిపి మదనునిమోహనవిద్యలనం దగి రామణీయకనిధి కధిదేవతలు నా నొప్పుమిగులుచుండు నిండుజవ్వనులం గూడి పుండరీకసాయకసుఖంబు లనుభవించుచుండె. ఆమేదినీకాంతునికి క్షీరసాగరమునకు మందాకినివలెను వింధ్యగిరికివనరేఖచెలువునను సొంపు గలిగించుచు ధరావతి యనునృపకన్యకారత్నంబు సర్వాంతఃపురప్రధానమహిషియై మన్మథునితో రతియుఁ జంద్రునితో రోహిణియు సంక్రందనునితో శచియు మురహారునితో నిందిరయునుం బోలె నాప్రతాపాదిత్యునితో సదృశసమాగమసుఖ మనుభవించుచుండెను. ఇట్లు మానుషలోకసుఖము లనుభవించుచుండఁ గొంతకాలమునకుఁ బుత్త్రుఁడు సంభవింపలే దనుసంతాపంబు గల్గి యనేక పుణ్యకార్యములు జరపియు నవి ఫలప్రదంబులు గామి నార్తిం జెంది యారాజచంద్రుండు తనమనంబున.

సీ. పూర్ణచంద్రుఁడు లేక పొలుపు దక్కినయుడుపథము బాలుఁడు లేనిపతిగృహంబు
రాయంచగమి లేక రహిదొఱంగినసరోవర మనపత్యునావసథభూమి
వెన్నుని నెడఁబాసి చిన్నవోయినదేవసభ శిశుహీనసంసారిగృహము
ముక్కంటి లేక సమ్మోదం బొసంగనికాంత మో మర్భకాకలితసదన
మరియుఁ బ్రజలేనివాఁ డైననరునిబ్రతుకు, హృదయమర్మోపఘాతిదుఃఖైధమాన
సతతసంతాపసంతానసంకులంబు, గాని సౌఖ్యక్రమవివర్ధకంబు గాదు.

చ. అనితలపోయుచు న్నృపతి యాసుదతీమణిసంగసౌఖ్యముల్
మనమున రోసి భూభరణమార్గమున న్రుచి మాని వంతచే
ననుదినమున్ గృశించె బహుళాహ్వయపక్షశశాంకరీతిఁ ద
ఘ్ననతరదుఃఖము న్గనుచుఁ గొంతలు చింతిలుచుండి రాత్మలన్.

ఇట్లు సంతానశూన్యతంజేసి దుఃఖసంతానంబు వెరిఁగి యాధరాకాంతుండు దన పట్టపురాణియగు ధరావతిం దోడ్కొని చని బృహత్సానుపర్వతంబున నొకయెడ రాధారమణునినిలయసమీపమున నాశ్రమముగల్పించుకొని యప్పుణ్యాశ్రమంబునఁ దపంబుసలుపుచు రాధామాధవులచరణకమలసేవఁ జేయుచు బహుకాలము గడఁచియు ఫలము సమకూరమిఁ జింతాసంతాపసంతానదంతురితస్వాంతుండై ప్రాయోపవేశంబొనరించియుండఁగ నయ్యెడ నొకకాపాలికి యేఁగుదెంచి రాజుం గాంచి యోయధిపతీ నీవివ్విధమున నాయాసపడుట కేమి కారణ? మని యడుగ రాజును నమస్కరించి యాయమతో ని ట్లనియె.

చ. అనుపమబాహుగర్వనమితారిధరేంద్రము రాజ్యమాప్తులై
ఘనతరకార్యనిర్వహణకౌతుకితాత్ములు మంత్రులు న్ఘనస
ద్ఘనకుచభారబంధురవికంపితమధ్యలు కాంత లుండి యున్
తనయుఁడు లేమి వ్యర్థ మని తథ్యముగాఁ దలపోసి కుందెదన్.

సీ. అనియతరుదితస్మితాతిముగ్ధం బగుసుతుమోముఁ గాంచనిసుఖ మిదేల
బాలకాంగవిషక్తపాంసురేఖాలంకృతము గాక యుండునీతను విదేల
సుతబాలభాషితామృతధారఁ గ్రోలనికర్ణరంధ్రములయాకలిమి యేల
కిలకిల మని నవ్వి కేళిమై పైఁబడుసుతుఁ గౌఁగిలింపనిబ్రతు కిదేల
తల్లికుచదుగ్ధమానుచోఁ దన్నుఁ బిల్వ, నలరి క్రేఁగంటిచూపుల నాసగొల్పు
నాత్మజుని ముద్దులాడనియట్టివాఁడు, వసుధపైఁ బుట్టి యును జూడ వట్టివాఁడు.

అని తనమనమ్మునం గలయుమ్మలికము బయలుపడం జెప్పిన నాభూమిపతివచనంబులు విని యాకాపాలిక యుం,

చ. ధర ననపత్యునిల్లు ధనధాన్యసమృద్ధ మదైన వ్యర్థ మా
నరయఁగ వాఁ డొనర్చుసుకృతావళి వమ్మయి పోవు నిచ్చలున్
బరభువనోరుసౌఖ్యములు వాయు నిహంబు ను లేదు వానికిన్
సురుచిరుఁ డైనపుత్త్రుఁడు విశుద్ధుఁడు గల్గిన నబ్బు నన్నియున్.

అనిచెప్పి మఱియు నిట్లనియె. ఓరాజా మీకు సంతానము గల్గుటకుం బ్రతిబంధకం బీరాధారమణచరణకమలసేవనంబున నశించినయది. అనతిచిరకాలంబునన బాలసూర్యోదయంబు నీ కయ్యెడును. ఈకఠోరవ్రతంబు మాని మానినితో భవనంబునకుం జనుము.

## ఉదయాదిత్యుని జన్మాదికము

అనిచెప్పిన నప్పలుకులకు సంతసిల్లి యుల్లంబున మనోరథంబులు పల్లవింపఁ బల్లవపాణితో నాభగవతి కెఱఁగి తదాజ్ఞానుసారి యగుచుఁ దనమందిరంబుఁ జేరెను. కొంతకాలమునకు ధరావతికి గర్భచిహ్నంబులు గల్గి నెలలు నిండి యొక శుభదినంబున శుభముహూర్తంబునందుఁ గుమారునిం గనియెను.

ఆబాలకుఁ డుదితుండయినమాత్రమున సూతికాగారంబున నుండెడు మంగళదీపకళికానికరములగాంతి యడంచుచుఁ బవడంపుఁదీవియొ యనం దగి బాలాతపఖండంబుల సొబగున బాగుమీఱిపద్మరాగప్రభాపటలంబులు నానొప్పమిగులుచుండునవయవంబులతో వికసితరక్తకమలరాశి యొక్కొ యనియుఁ బారిజాతపల్లవపటలం బొకో యనియుం సంశయము నింపం జేయుచు నుదయపరిపాటలమండలుం డైనయాదిత్యునిపగిది వెలుంగుచుండుటంబట్టి యాపట్టికి నుదయాదిత్యుం డని నామంబిడిరి. ఆకుమారుండు నుచితకాలంబునం

జూడాకరణ ప్రముఖములగు వైదిక క్రియాకలాపంబులంగాంచుచు న్శైశవలీల జననీజనకుల హృదయంబుల కత్యంతామోదంబుఁగల్పించుచు న్గ్రమక్రమంబున శైశవంబుం దాఁటెను. అప్పు డాప్రతాపాదిత్యుండు తనయుం నఖిలవిద్యాపారంగతులగు నాచార్యుల కొప్పగించి సకలశాస్త్రంబులు సదివించెను. ఆయాచార్యులును దమతమవిద్యావినియోగమున కుత్తమ పాత్రంబు లభించిన దని యుత్సహించుచు నాత్మకౌశలప్రకటనపూర్వకముగ నుపదేశింప నుదయాదిత్యుండు నన్యపరత్వంబు మాని సర్వవిద్యలను గ్రహించెను. మణిదర్పణంబునం దుం బోలె నాతనియం దఖిలవిద్యలును సంక్రాంతంబు లయి వెలసె. పదవాక్యప్రమాణంబులందును ధర్మశాస్త్రమునందును రాజనీతులయందును వ్యాయామవిద్యయందును ధనుశ్చక్రచర్మకృపాణశక్తితోమరపరశుగదాప్రముఖంబు లయినసకలాయుధంబులందును, రథచర్యలందును, గజతురగారోహణంబులందును, వీణావేణుమురజతాళప్రభృతికంబులగువాద్యములందును, నృత్యశాస్త్రంబులందును, గాంధర్వవేదవిశేషంబులందును, చిత్రకర్మంబులందును, ద్యూతకలలయందును, గంధకలలయందును, పక్షివిరుతజ్ఞానంబునందును, రత్నపరీక్షయందును, జలసంతరణంబునందును, లంఘనారోహణంబులందును, ఇంద్రజాలంబునందును, కథలయందును, నాటకంబులందును, కావ్యంబులందు, నితిహాసపురాణంబులందును, సమస్తదేశభాషలయందును, సర్వసంజ్ఞలయందును, ఇతరము లయినకలావిశేషములందును నృపకుమారుండు పరంబగుకౌశలంబుఁ గడించెను. మఱియుఁ బ్రజ్ఞాబలమున నమరగురుని నయిత మపహసింపఁ జాలి యనవరతనీతిశాస్త్రాలోచననిర్మలమానసు లయి లుబ్ధత్వంబు లేక స్నేహంబు గలిగియుండు కులక్రమాగతులగు మంత్రికుమారులును,సమాన వయోవిద్యావిలాసాలంకారంబులు గలిగి యఖిలకలాకలాపంబులందు నాలోచనంబు నందును గతోరమతులయి ప్రేమానురక్తహృదయులును మహాప్రగల్భులును గాలవేదులు నగ్రామ్యపరిహాసకుశలులు నింగితాకారవిదులు నయి యొప్పురాజకుమారులును తనకు సహాధ్యాయులై విద్యల నభ్యసించుచుండినను గరహాయనునికుమారుండు మిత్రసహుం డనుభూదేవవటువు పాంసుక్రీడలందొట్టి సహసంప్రవృద్ధుండును సమానవయస్కుండును నగుటం జేసియు సకలకలాకలాపపరిచయప్రవీణుం డగుటం జేసియు సర్వవిస్రంభపాత్రుం డై యతనికి రెండవహృదయంబు నా వెలయుచుండె. విద్యాపరిశ్రమము సేయుచుండు కాలంబున నాయుదయాదిత్యునికిఁ ద్రిభువనవిలోభనీయం బగుయౌవనప్రాదుర్భావంబు గల్గెఁ. అది క్షీరసాగరమున కమృతరసంబువలె సకలజననయనమనోరంజకంబై ప్రదోషమునకుఁ జంద్రోదయంబుపగిది బహువిధరాగవికారంబై కల్పపాదపమునకుం గుసుమోద్గమంబుచెలువున రమణీయమగు రాగంబు నభివ్యజ్యమానంబుఁ గావించునదై మయూరమునకుఁ గలాపంబుగతిఁ జెలువొందుచుండె. తొలుతటినుండియాకుమారుండు రమణీయుఁ డయి యుండువాఁడగుటం జేసి యప్పు డినుమడించినరామణీయకతం గాంచెను. సమయము దొరకినదని సేవకునిచందంబున మదనుండు మెల్లన డగ్గరిల్లెను.లక్ష్మీతోడ హృద

యము వి స్తరిల్లె. బంధుజనమనోరథంబులతోడ నూరుదండంబులు పూరించుకొనియె. శత్రుసంతానంబుతోడ మధ్యంబు కార్శ్యంబు నొందె. త్యాగంబుతోడ నితంబంబులు ప్రథిమంగాంచె. ప్రతాపంబుతోడ రోమరాజి యారోహించె. అహితకళత్రములయల కలతోడ భుజయుగళంబు ప్రలంబంబై యొప్పె. చరితంబుతోడ లోచనయుగళము ధావళ్యము నొందె. ఆజ్ఞతోడ శిఖరదేశము గురువయ్యె. స్వరంబుతోడ హృదయంబు గాంభీర్యంబు నొందె. ఇట్టు లభివ్యజ్యమానతారుణ్యుం డై యుండుకుమారునిం బ్రతాపాదిత్యుండు యౌవరాజ్యాభిషిక్తునిం జేసెను. ఉదయాదిత్యుండును భువనతలం బెల్లం దనజనకునియాజ్ఞావశవర్తి యైయుండుటం జేసి కర్తవ్యం బొం డేమియు లేక సవయస్కులు బలసికొనియుండ నొకప్పుడు గాయకులతోడ సంగీతకప్రసంగంబులు సల్పుచు నొకప్పుడు మృగయులతో మృగయావ్యాపారంబుల నొనరించుచు నొకప్పుడు విదగ్ధులయినకవులతోం గావ్యప్రబంధంబులు రచించుచు నొకప్పుడు పండితులతో శాస్త్రాలాపంబులు సేయుచు నొకప్పుడు రసికులతో నాఖ్యానాఖ్యాయికేతిహాసపురాణాకర్ణనంబు గావించుచు నొకప్పుడు చిత్రకర్మవినోదంబుల నొకప్పుడు వీణావాదనంబుల నొకప్పుడు దర్శనాగతు లయిన మునిజనులచరణకమలశుశ్రూషణంబుల నిట్లు దివసంబులను; చతురసుహృజ్జనక్రీడాపరిహాసంబుల రాత్రులును గడపుచుండె. ఇట్లుండంగా నొకనాం డచటి రాజకుమారులును మంత్రిసుతులును వినోదగోష్ఠిం బ్రవర్తింపుచుండ నుదయాదిత్యుండు 'నోసత్తములార యిప్పటికి మీమనోగతంబులు యథార్థంబుగ విశదీకరించితిరేని యవి యుత్తమంబు లయి యుండిన నత్తెఱంగున యాచరింపంబడునని చెప్పిన విని యందుండిన యొక సామంతరాజపుత్త్రుం డి ట్లనియె.

## ఉదయాదిత్యుని కవిపండితసంఘము

తే. రాజు ధర్మిష్ఠుం డై యున్న రాజ్యమందుఁ, బ్రజలు ధర్మిష్ఠు లై యుండ్రు నిజము గాఁగ
నట్టితఁడు గాక యుండిన నట్ల యుండ, రెట్లు రా జుండునో ప్రజ లట్ల యుండ్రు.

అని చెప్పిన నది సరి యని యెల్లవారు నభినందించిరి. అంత మఱియొక రాజన్యుం డి ట్లనియె.

క. వసుమతిభర్తలు తమతమ, వసువుల ధాన్యముల నితరవస్తువులం దా
పసులగుపండితవర్యుల, విసరంబులఁ గావ రేని వృథ యగు నవియున్.

అని చెప్పిన నదియును సమ్మతం బని యంగీకరింప ననంతరము పెఱరాజన్యుం డి ట్లనియె.

గీ. అనతిచిరకాలనాశ్యంబు తనువు దానిఁ, గావఁ బెంపు రేఁట యుత్తమక్రమము గాదు
సర్వకాలంబు నెడక యొసంగుచుండు, కీర్తి నార్జింపఁ దగుఁ బుణ్యవర్తనులకు.

అదియును సమంజసం బని యచటివార లాదరింప మిత్త్రసహుం డనుమంత్రికుమారుం డి ట్లనియె.

గీ. విద్యయ నరునికి రూపము, విద్యయ ధనసంచయంబు విద్యయ కుల మా
విద్యయ భోగము సుఖమును, విద్యయ సత్కీర్తికాంత విమృశింపంగన్.

అని చెప్పిన విని యుదయాదిత్యుండు మిత్రసహుని గడు సంతసించి యిట్లు నెప్పం దొడంగె. రాజు ప్రవర్తించిన తెఱంగునం బ్రజలు ప్రవర్తించుట సత్యంబ. రాజులు తమ సంపాదితధనములచేఁ బండితరక్షణము సలుపుట యుక్త మైనదియ. అట్లు సేయం గీర్తికాయంబు నిత్యం బై యనిత్యం బైనయీకాయము వినష్టం బయిన యనంతరమున నయిత మండును. అవ్విధ మత్యాదరణీయం బగుటం జేసి సకలజనంబులకు విద్యావృద్ధి సేయవలయు ననుట మీమీనుడివినపద్యంబుల నూర్జితం బయ్యె. తొల్లి యుజ్జయిని నేలుచుండిన విక్రమాదిత్యుండు సుబంధు, వరాహమిహిరాదిమహాపండిత ప్రవరులం బోషించి కాదె నిరవద్యకీర్తివైభవంబునం దేజరిల్లుచున్నవాఁడు. అవ్విధం బిప్పు డనుష్ఠేయంబ. మననగరంబున విద్వాంసుండు గానివాఁ డుండం జనదు. ఈ నియమము విప్రులక కాని యితరుల కుండం బోలదు. విద్యావంతులకుఁ బరీక్ష చేసి తత్తదధికారానుగుణముగఁ బారితోషికధనంబు లొసంగుచుండునది. అసమానవిద్యా విశేషవిభాసితు లగువారి నీనగరంబున నుండం జేసి యవ్వారిగ వారలకు ధనంబు లిచ్చుచు నిచ్చ మెయిఁ దదీయసల్లాపామృతరసాస్వాదసుఖం బనుభవించుచుండవలయును. అని చెప్పి యారాజన్యుండు తదాదిగ నఖిలదేశములనుండి వచ్చుచుండు విద్యావంతులకు ధనంబు లొసంగుచు సమ్మానించుచుండెను. అనుదిన మపరిమేయ వైదుషీవిభూషితులగు వారు పెక్కం డ్రుదయాదిత్యునిసభ నలంకరించుచుండుటం జేసి యాసభ ధారానగర వల్లభుండగు భోజభూపాలునిసభవలె దిగంతవిశ్రాంతకీర్తిం జెందియుండె. అందు సమధిగత సకలశాస్త్రసర్వస్వు లై యమరగురు నైన శేముషీవిశేషంబున నపహసింపం జాలు పండితుల కెల్ల మేటి యై రాజభట్టారకుండును; అనూనవకుళసుమమంజరీగళదరీణమాధ్వీఝరీధురీణపదరీతులు గల ప్రబంధంబులు రచింప సమర్థు లయి కవి నైన నపహసించు కవుల కెల్లరకు మేటి యై శంకరుం డనుకవియుఁ దామభ్యసించిన పాండిత్యకవిత్వంబు లయుత్తమంబు లని యొండొరులు వివాదపడుచు స్పర్ధించుచుండుదురు. ఒకనాఁడు రాజు విద్వద్గోష్ఠి నుండునప్పుడు కళింగదేశమునుండి కళాఘనుం డనుకవివరుం డేగుదెంచి రాజన్యుం గాంచి యిట్లనియె.

క. ఉదయాదిత్యునిఁ గాంచఁగ, మదవద్రిపుహస్తశస్త్రమండలము కళా
స్పదు లయినకవులకష్టము, ముదితలసరసంపువలపుముడులును వదలున్.

అని చెప్పఁగా విని తనశౌర్యత్యాగసౌందర్యంబులం బ్రతిపాదించునాపద్యభావ గాంభీర్యంబునకు మెచ్చుచు రాజకుమారుఁ డాకవి కపరిమితములగు ధనంబు లిచ్చి గారవించెను. అది గాంచి యోర్వలేక రాజభట్టారకుండు,

చ. అవగతసర్వశాస్త్రచయు లైనమహాత్ములు పండితోత్తముల్
భువనతలంబునం దధికపూజ్యులు వార లటుండఁ గూటికై

నవనవకల్పనావిధిచణత్వము దోఁప నబద్ధ మాడుసీ
కవు లిల దానపాత్రు లయి గౌరవ మొందుట సూవె చిత్రముల్.

అని చెప్పిన విని కవిముఖ్యుండగు శంకరుం డి ట్లనియె.

చ. కవి కమలాసనుండు త్రిజగత్పతి యైనపినాకపాణి యుం
గవియె తలంపఁ గాఁ గవులు గారె పరాశరబాదరాయణుల్
కవికృతవస్తుసంగ్రహణగర్వితచిత్తులె పూజ్యు లైనచోఁ
గవు లఁట దానపాత్రములు గా రఁట యిట్టివె పో విచిత్రముల్.

అని చెప్పఁగా విని రాజభట్టారకుండు గడు నలిగి యోరీ దురాత్మ కవులకంటెఁ బండితులు హీనులా? యనిగద్దించుచు శంకరునితో వాక్కలహంబు సేయుచుండినం గాంచి యుదయాదిత్యుండు వారల వలన దుడుఁగుం డని నివారించి యి ట్లనియె.

చ. గురుకులవాసఖేదమునకుం గడు డస్సి యపారశాస్త్రసా
గరముల నీఁదియు న్వలఁతి గాఁ దలరింపఁగఁ బండితుండు దా
పరకవు లుద్యదిందుకరవారసమాగమపుల్లహల్లకో
త్కరవిగళన్మరందపదకాండముచే నలరించుచాడ్పునన్.

మఱియు వినుండు.

గీ. ఎంచి యెంచి చూడ నిం పయి తోఁచె నీ, మూఁడు లోకమందు ముగ్ధ లయిన
మించుబోండ్లచూపు లించురసంబులు, చతురు లైనకవులసరసమతులు.

అంతియ కాదు.

చ. పలుమఱు శాస్త్రము ల్జదివి పండితుఁడై యఖురాణిసత్కృపా
ఫలమును గాంచి దా రసము బాగుగఁ జెప్ప వలంతి యైనవాఁ
డిలఁ గవి లాఁతివాఁడు కపి యే యని చెప్పఁగ నొప్పు జాయ నాఁ
గులజయ జాయ కాని పెఱకోమలి మాయయ కాక జాయ యే.

అని చెప్పఁగా విని సభాసీను లగువార లందఱును కరంబు సంతసించి యుదయాదిత్యునిబుద్ధివై శారద్యంబుం గొనియాడిరి. అనారతంబు విద్వద్గోష్ఠీపరితృప్తుండై రాజకుమారుం డపరిమితామోదంబుఁ జెందుచుండెను.

## విద్యాసర్వస్వవేదినిచరిత్రము

ఒకనాఁడు సమస్తసామంతమంత్రిపురోహితులు బలసికొని యుండ సభాభవనంబు నలంకరించియుండు తనతండ్రిపాదకమలములకు వందనంబునిర్వర్తింప నుదయాదిత్యుండు మంత్రిసామంతరాజపుత్రసహితుండై వచ్చి నియోగిజనంబులును సామంతమహీపాలురు నూడిగంపువారును దన్నుఁ గని నమస్కరింప వారల కలఁతి లేనగవున నంగీకారసూచనంబు

సేయుచుం జని జనకునిపాదారవిందంబుల కెఱఁగి యాశీర్వాదపూర్వకముగా నాతనిచే నాలింగితుం డై విడువంబడి కరహేయనునిసన్నిధికిం జని యతనికి వందనంబు లాచరించి యంచితాసనంబున నుపవిష్టుం డగుడుఁ దక్కిన సామంతరాజపుత్రులును బ్రతాపాదిత్యుని కభివందనంబు సలిపి తక్కుంగలవారలకు యథోచితాచారంబు రచించి యందయాదిత్యునిం బలకికొని యుచితాసనంబులం గూరుచుండిరి. అతికఠినంబులు నతిపీవరంబులు నయిన స్కంధంబులును; ఆజానువిలంబంబులు నపరిమితబలసంపన్నంబులు నయి యొప్పుభుజంబులును; అతికృశంబు లయి యతిరుచిరంబు లయి యొప్పుచుండుమధ్యంబులును; అతివిశాలంబు లయి యధికోన్నతంబులై వెలయువక్షంబులును గలిగి యొండొరుల ప్రతిబింబంబులనందగి విక్రమైకరసు లయి తోఁచుచు హిమవన్నగకూటవికటశిలాతలాసీనంబు లైన సింహకిశోరంబులభాతి నారాజపుత్రులు తేజరిల్లుచుండిరి. అప్పుడు వామపార్శ్వవిలంబమానమగు మహాఖడ్గంబుతో రోషపరీతంబగు విషధరంబు సేరియుండుచందనలతికవలె నతిభీషణరమణీయమయి వెలయునాకారంబు గలిగి విగ్రహంబుఁ దాల్చినరాజ్యాధిదేవతయో యనునట్లు వేత్రలతాధారిణి యైనప్రతిహారి యాస్థానమండపమున నుండు యంవరాజు సమీపమునకుం జని మోకరించుకొని భయభక్తులతోఁ గరంబులు నేలనూఁది నమస్కరించి యిట్లనియె. 'ఓరాజచంద్రా యవధానం బొసంగి మమ్ముం గృతార్థులం జేయుము. భవదీయకృపారక్షితం బైన కవిపండితసంఘంబున కనుదినము గోక్షీరభాండంబులు మోచితెచ్చుగొల్లలు గుంపులై నను డెంచి ఏలికతో విన్నవించుకొన నున్నవారు.' అన రాజపుత్రుండు 'నోసీ వారలం బ్రవేశపెట్టు' మని యాజ్ఞ సేయ నాద్వారపాలిక యట్ల గావించె. గోపాలకులును ముకులితకరులై సర్వాంగాలింగితభూతలంబుగం బ్రణామము లొనరించి యిట్లనిరి. 'దేవా దేవర యాజ్ఞావశవర్తుల మయి భవద్రక్షితం బయిన పండితసంఘంబున కనుదిన ముదయసమయంబునం బాలకావళ్లు మోచుకొని తెచ్చి వారియిండ్ల నొప్పగించి పోవుచుంటిమి. అవ్విధమున నీదినమునందు రేపకడ గోష్ఠంబులనుండి పాలకావళ్లు మోచుకొని వచ్చుచుండు మామార్గ మడ్డగించి యొకయతివికారరూపియగు నెడ్డెమానిసి చేత నొకబడియ నెత్తికొని బెదరించుచు 'నోరీ యీపాలకావళ్లెవ్వరి' కని యడుగ మేము భయభ్రాంతులమై 'యుదయాదిత్యునిసభ నుండెడు కవిపండితసంఘంబున కీకావళ్లు పోవునవి' యని యుత్తరమిచ్చితిమి. అందు కామోటుమానిసి 'విద్వాంసులా! పండితులా!' యని వెడఁగునవ్వు నవ్వి 'విద్యాసర్వస్వవేదిని యనుభోగముదానివైదుష్యంబున కీవిద్వాంసు లెంతవారు! అశేషవిద్వన్మండలంబులం దన నిరుపమానశేముషీవిశేషంబున నధఃకరించి వారలం దనకుదాసులం జేసికొని విద్యాసర్వస్వవేదిని యనుబిరుదు వహించి యవిజేయం బైనగర్వంబుతో నుండునాయండ జయూనం జయింపక విద్యావంతుల మని పేరుపెట్టుకొని యుండుటకంటె నూరక చచ్చుటయ మేలు! కానిచో దానితో వివాదంబునకుం గడంగి యోడి యాడిగిలంబడి నరవుడులై తదీయ ముఖనిరీక్షణంబు సేయుచుండుటయ చాలు. అట్లు గానిచో వీరల

కీకవులని పండితులని పేరేల? ఇట్టి జ్ఞానవైశ్యుల కీవైభవ మేల? సిగ్గులేదే!' యని యధిక్షే
పించి మమ్ము రానీయక నిర్బంధించె. మేమును పాలకావళ్లు వానికడ డించి కొందఱ బళ
కర ముంచి ఇంతదనుక నీపండితసంఘమునకుఁ బోవుపాలకావళ్ల నడ్డగించినవారు లేరు;
వీఁడేలకో యిట్లు చేసె నని యెండొరుల మనుకొనుచు నేలికతో విన్నవించుకొన నేతెంచి
యున్న వారమని చెప్ప నాగొల్లలపల్కులు విని యుదయాదిత్యుండు తనమనంబున నిది
వింతయై యున్నది యొకయాఁడుది యింత గర్వించియుండఁజనునె యని యనుకొనుచు
నాపశుపాలకులతో నోరీ మీరలు సని యామోటుమానిసితో నుదయాదిత్యుండు
నిన్నుం జూడ వేఁచియున్నాఁ డని చెప్పుఁడు. వాఁడు మిమ్ము నిర్బంధించుట మాని నా
కడకుం జనుదెంచు. వానిం దోడ్కొని రండు; పొండు అనిన వారలు మహాప్రసాదం
బని వినయవినమితోత్తమాంగులై చని యామోటుమానిసిఁ దోడ్కొనివచ్చి యతనికి
రాజుంజూపి యోయయ్య ఇదె రాజును రాజకుమారుండు నున్నవారు. దగ్గఱకుం జని
నీమనోగతంబుల నివేదించుకొను మని చెప్పఁగా నామోటుమనుష్యుండును సభ గలయం
గనుంగొని, తన యుండు తెఱంగుం గాంచి వీఁ డేలకో యిట్లుచేసె నని యఖిలసభాస
దులు దలంచుకొనుచుండ నందుం గలవారలకును రాజునకు రాజపుత్త్రునికినిఁ జేతులు మొగి
డ్చిన నాతనితో నుదయాదిత్యుండు 'నోరీ నీ వెవ్వఁడవు? ఏదేశంబున నుండువాఁడవు?
పండితులపాలకావళ్ల నడ్డగింపఁ గారణం బేమి? విద్యాసర్వస్వవేదిని యనువేశ్యాకన్యక
యెవతె! దానివిషయంబు నీ వుగ్గడింప నేమి కతంబు? ఇది యంతయుం సవిస్తరంబుగ విను
పింపు' మని యడిగిన నామానిసి యిట్లని చెప్పందొడంగె. 'ఓరాజపుత్త్రుఁడా వినుము. నేను
సింహదేశమున సింహపురినిఁ గట్టెలమోపుల నమ్ముకొనుచుండువాఁడను. ఆనగరమునుండి
వచ్చితిని. ఈసంఘంబున నుండువారలకుఁ బండితు లని పేరును గవు లనుప్రసిద్ధియు
విద్యలయందు సామర్థ్యంబును గలదా? ఒకించుకయుఁ గానంబడదే? అట్లుండ మీపండి
తులును కవులును నాకేపాటివారు? అని వారిపాలకావళ్ల నడ్డగించితిని.' అని యిట్లు
చెప్పఁగాఁ బండితులును గవులును వానిని 'ఓరీ యిట్టివిశేషంబునకుం గారణంబుఁ దెలియం
బల్కు' మని యడిగిన నాకట్టెలమ్ముకొనువాఁడు నవ్వి యోయయ్యలారా తూర్పుదిశ నుం
డెడు సింహపురము నేలుచుండుపరాక్రమపాలుండు నాఁ బరఁగుపుడమిఱేనికి భుజిష్య
యైనదానికూఁతురొక వెల్లాటకత్తియ తనకు విద్యలయం దెవ్వఁడును సమానుఁడులేఁడని
గర్వపడుచుఁ బ్రత్యేకముగ నగ రొకటి గట్టుకొని విద్యాసర్వస్వవేదిని యనుబిరుదనా
మంబునం బరఁగుచుఁ దనరూపలావణ్యాదులకు మోహించి యెట్టియెట్టిమండలాధిపతుల
సుతులు వచ్చినను వారలఁ గన్నులుగట్టి వేయి వరహాలు గైకొని యొకపద్యంబు సెప్పి
దానిభావం బడిగి యది యెఱింగి పల్కనినాఁడు వారల నమర్యాదచేసి వారిచే వెట్టి
చేయించుకొనుచుఁ దనకన్యకాత్వమునకు భంగంబు గలుగకుండ సుఖంబునం బ్రవర్తించు
చున్నది. అనేకరాజపుత్త్రులాలంజపడుచుకు గృహదాసులై నీళ్లు మోయుచు బట్టలుతు

కుచు వాకిళ్లం గాచుచుఁ బాదుకలు మోయుచుఁ దక్కుంగలపను లొనరించుచుండెదరు. ఇట్టి పేరుప్రసిద్ధి వడసిన యొకయూఁడుది విద్యాగర్వంబున విఱ్ఱవీగుచుండ మీరునుం బండితుల మనియుఁ గవుల మనియుఁ బేరు పెట్టుకొనియుండుట లజ్జాకరము గాదా! మీరలే యాలోచించి చూడుఁడు.' అని చెప్పిన నది విని పండితకవిసంఘంబువారు 'ఓరీ యిది బాగై యున్నదే! మేము సర్వవిద్యావంతులకుం దలమిన్నల మనియు మాకీలోకమున నీడు లేదనియుఁ దలంపుఁగొని యుండ నొకయూఁడుది విద్యాసర్వస్వవేదిని యను బిరుదు పెట్టుకొని యున్నదనుటయే మహాశ్చర్యము. దానిం జయింపనినాఁడు మాకేగౌరవంబుగాని యెక్కడిది? ఇంతదనుక నెవ్వఁడును మాకుఁ దెలుప లేదు. తెలిపి యిత్తెఱంగున మొర పెట్టుకొన్నదియుం లేదు. మేము విన్నదియుం లేదు. ఇప్పు డీవిట్లు మొరపెట్టుకొనం గారణ మేమి? నీకేమయిన మనంబునం గొఱంత గలదో తెల్పుము' అని యడిగిరి. వాఁడు 'ఓవిద్వచ్ఛిరోమణులార వినుం' డని చెప్పందొడంగెను. 'తూర్పుసంద్రమునకు సమీపమునఁ బినాకినీనదీప్రాక్తటంబున నుండుసింహపురికిఁ బ్రతాపపాలుం డనురాజొక్కరుం డుండెడిని. అతండు తనజనకునియనంతరము సింహాసనం బధిరోహించి ప్రజాపరిపాలనము సేయుచుఁ దనప్రతాపంబునన సామంతరాజులెల్ల నవనతులై యరిపెట్టుచుండ నిరంతరసంపదల సుఖ మనుభవించుచు నతిమనోహారిణు లగునంగనామణులం గూడి కుసుమబాణునిఁ జరితార్థుం జేయుచుండు. అతనికిఁ దనమహిషితోడ శ్వశురగృహంబునుండి వచ్చియుండు మహారూపవతులగు భుజిష్యలు కొంద ఱుండెదరు. వారలలో రతిదేవితో సమానమగు రామణీయకముగలిగి కాంతామణులమానసంబులనైతము మరులుగొనం జేయునసమానలావణ్యంబుతో నొప్పుమిగులురతిరూప యనునొక యతిరూపవతి గలదు. రతియందు మన్మథుండునుబోలె నాసుందరియందతఁ డమితానురాగంబుతో వర్తిల్లుచుండు. ఆరతిరూపకు రతిపతివిజయాస్త్రంబునా నొక్కసుదతి కూఁతురై యసమానవిద్యావైశారద్యంబున శారదకును నిరవద్యరూపరేఖావిలాసంబున క్షీరనీరధికన్యకకునుసాటియై గోమునం బెఱిగి భూపతివలన నాందోళికాదులను ఛత్రచామరగజతురగవాద్యంబులు వడసి యన్వర్థనామములు గలసంగీతసర్వస్వవేదినియు సాహిత్యసర్వస్వవేదినియు ననుప్రధానసఖు లిరువురును దన కాటలఁబాటలఁ దోడ్పడ వేనవేలు వరవుడంపుంబడంతులు గొలువ మెప్పువడయుచుండు. ఇంచుక యమ్ముదితయాభిరూప్యంబు వినుండు.

సీ. నగుమోమునకు నిశానాథబింబము జోడు కనుదమ్ములకు నల్లకలువ లీడు
మెయిదీఁగె క్రొక్కారుమెఱుఁగుఁదీవియఁ బోలు నధరంబు బింబమే యనఁగఁజాలు
కబరికాభారంబు కాలాంబుదము మీఱు పదములు హల్లకపత్త్రిఁ గేరు
గురునితంబయుగమ్ము కుతలమంతయుఁ గ్రమ్ము లలి నడు మాకాశలక్ష్మిపొమ్ము
నాలినూనూఁగునూఁగారు సొఁచుబాగు మానినిగళంబు వరశంఖమంగళంబు

తరుణిమణిమాట లాయమృతంపుఁదేట, పంకజాతాక్షి కుసుమాస్త్రభాగ్యలక్ష్మి.

మఱియు.

సీ. పద మెత్తి పెట్టిన మదవుని మదదంతి యెత్తి వచ్చెడులీల లత్తమిల్లు
బొమ గదిలించినఁ బుంఖానుపుంఖమై యతనుక్రొవ్వాడిశరాళి వెడలు
లలిఁ బల్కఁ దొడఁగిన సలిలజాంబకునిబల్కొత్తతత్తడులు పైకొనఁగఁ బూను
మెయిదీఁగెఁ దోఁచిన మేలిమిక్రొక్కారుమెఱుఁగు లంతట గ్రమ్మి మెలఁగుచుండు
కబరికాభరంబు గళితబంధం బైన, బర్హిబర్హభారభాగ్యలక్ష్మి
యక్షిగోచరత్వ మంది నట్లై యుండు, దానిసొగసు బొగడఁ దరము గాదు.

ఆయంగనామణినృత్తగీతవాద్యవిద్యానైపుణ్యంబునకు మెచ్చి ప్రతాపపాలుండు తననగరోపవనమున నతిమనోహరమగునొకనగరు కట్టించి దాని కనవరత మాయుధధారులగు వీరభటులఁ గావలియుంచి యపరిమేయంబులగు ధనంబు లొసంగి జననితో నాకనకాంగి నందుఁ గాపురముంచియున్నవాఁడు. అనుదిన మావెలచేడియ మణిమయ చతురంత యానారూఢ యై పండ్రెండువేలదాసీజనంబులు గొందఱు పగటిదివిటీలు పట్టుకొనుచుఁ గొందఱు పూసురటీలచే విసరుచుఁ గొందఱు వింజామరలం వీఁచుచుం గొందఱు బిరుదావళులు నదువుచు గొందఱు హెచ్చరికలు సెప్పుచు గొందఱు వీణావేణుమృదంగతాళాదిమంగళవాద్యంబులు వాయించుచు కొంద అడపములను ధరించుకొనుచుం గొందఱు తమ్మపడిగంబు లెత్తుకొనుచుఁ గొందఱు జాలపల్లికలు పట్టుకొనుచుం గొందఱు బంగారుపూర్ణకలశముల మున్నిడుకొనుచు బలసివచ్చుచుండ సాహిత్యసర్వస్వ వేదినియుం సంగీతసర్వస్వవేదినియు నిఱుగెలంకులఁ బల్లకిం బట్టికొని నడిచిరాఁగా ననవృశంబగు మహా వైభవంబుతో ననుదిన మాసుందరి ప్రాతర్మధ్యాహ్నసాయంకాలంబులందు రాజుకొలువునకుం బోవుచు నిలు సేరుచుండు. అప్పుడు.

గీ. దానిఁ గాంచినవారలు దర్పకాస్త్ర, హతుల ధైర్యంబు దిగనాడి యాశలెడలి
డస్సి గ్రుస్సియు వెతలొంది తల్లడిల్లి, మునుఁగుచుండుదు రుబ్బొంగు మోహజలధి.

నేనాయూర నివసించుచు దానికిసమీపమున నుండుమహారణ్యమునకుం బోయి దినదినము కట్టెలు కొట్టితెచ్చి యంగడివీథి నమ్ముకొనుచు నందువలన లబ్ధమగుస్వల్పధనము చేతఁగడుపుఁబూడుచుకొనుచు నన్నగరంబు వాయక యుండువాఁడను. అవ్విధమున నొకనాఁడమ్ముకొనఁ గట్టెలుదెచ్చి రేపకడ నంగడివీథియం దొకగోడకాకట్టెల మోపానించి యొకయెడ నిలుచుంటిని. అప్పు డాలంజకన్నె ముందటఁ దూర్యవాద్యంబులు మ్రోఁగుచుండ ననేక దాసీజనములు కైవారంబులు సెప్పుచు సురటులు విసరుచు వింజామరములు వీచుచుఁ దన్నుం గొలువ మణిమయశిబికయం దారోహించి యింటిం తనరాని మహా వైభవంబుతో నాయంగడివీథినన తనయింటికింజనుటకు రాచనగరునుండి

బయలువెడలి యానాఁడు తననృత్తగీతంబులకు మెచ్చి యారాజవరుం డిచ్చినయమ్లా మాధవీకుసుమమాలికలును ముక్తామణిభూషణంబులు నుజ్జృంభికుంభికుంభోపమకుచకుం యుగముపై వ్రేలాడుచుండ మహేంద్రునికొలువు సాలించి యేతెంచు రంభారంభ రువు విధంబునం దోఁచుచు నత్యాశ్చర్యమగ్నులు నతనుశరపరంపరాహతిపరాయత్తచిత్త లు నయి విటజనంబు లుత్తలంబు నొంద ననన్యసామాన్యరూపలావణ్యంబుతోఁ దే రిల్లుచుం జనుదెంచి.

గీ. తీఁగనీరథి జనియించి చెలులతోడ, వెడలి వచ్చెడుకలుముల వెలఁదిమాడ్కిఁ
దుల్యరూపాభిజాత్య తా తోయజాక్షు, లొలసి తనుఁగొల్వ నేరె నే నుండుకడకు

ఇల్లు సేరి యానారి పణ్యవీథీజనంబులు గుంపులుగూడి తన్నుం జూచుచుండ నన్నుం జూచి గర్వంబుతోఁ జెలులం జేరి యిట్లనియె.

ఉత్సాహ. బాకినోరు భూతముఖము పల్లవన్నెకన్నులున్
చాకిబానవంటికడుపు సాగినట్టిపాచిపం
డ్లోకిలింత వచ్చు వీని నువిదలార చూడుఁ డీ
రూపువానిఁ గూడు నటె తరుణిగ బుట్టినది భువిన్.

అని చెప్పిన నం దొకతె వినయంబుఁ గాన్పించుచు ని ట్లనియె.

కం. ఓచెలి య ట్లన దగునే, చూచియుం నొకనూలితోడ సూత్రపదకపో
నో చెటులేక్షణ విధిచే, సూచిత యగునాతి యుండుచూవె యితనికిన్.

అని తన సఖీమణి సెప్పినవచనంబులు విని యోసీ యేమిసెప్పెదవే కాలినయిం కడయొత్తులవంటి కాళ్లసేతులును మొలకు దిందుగాఁ జుట్టియుండు నడవితీవియలపిం నందుఁ దోఁపియుండెడుకొడవలియుఁ గలిగి బూచివానిపగిఁది నిలువంబడియుండు నీదుఁ గుం గాంచి మఱి కాంచనాంగులు కామింపరటే! చీచీ! యని కేకరించి యుమిసెను. అ గని నే నత్యాగ్రహగ్రస్తుఁడ నై స్త్రీజాతి యైనయిది మనలం గాంచి యుమిసినకారణ బేమి! మగవాఁ డెట్లుండిన నేమి! ఇది లంజయే కదా! ధన మిచ్చినవానితోఁ బొం సేయుంట దీనికి విధినిహితమై యున్నది. ఏవిధమున నైన నొకరాత్రికిఁ దీని కివ్వవలసి ధనమును సంపాదించి యిచ్చి దీనితోఁ బొందుసేయనేని నే నొకమగవాఁడనగుదున యని మనంబునం బ్రతిజ్ఞ చేసికొని యాపడపుచెలిచెలులం జీరి యోలంజలార యీలం కివ్వనగు ధనం బెంత యని యడిగిన వారలు నవ్వి యొక రాత్రికి వేయినిష్కంబు ల చెప్పి వెడలిపోయిరి. అది విని యేనును మనంబునందు దైవమునకుఁ గరుణ రాదా! ఒ వేళ మన కార్య మనుకూలపడకపోదా! చూత మని ధైర్యముదెచ్చుకొని యింతధన విధముగ సంపాదింపనగు నని చింతించుచుంటిని. దైవానుకూల్య ముండునేని సర్వకా ములు ననుకూలించు ననుటకుఁ దార్కాణగా వక్ష్యమాణవిధంబు నామనంబున స్ఫు చినయది.

పూర్వమే నొకనాఁడు వాడుకచొప్పున నడవికిం బోయి కట్టెలుగొట్టి మోపు గట్టిపెట్టి యాపరిశ్రాంతిం బోనడంచుకొన నొకరసాలపాదపముక్రిందం గూరుచుండి కొంతతడ వతిసుఖకర మయినతదీయచ్ఛాయయందు వెలికిలం బరుండి నిదురించి మేల్కాంచి యాపాదపము నొకకొమ్మన వ్రేలాడుచుండుపం డొకటి గనుంగొని దానిం దినవలయు నని యెంచి యాచెట్టెక్కి ఫలముఁ గోసి యొడి నిడుకొని దిగితిని. అప్పుడ యొకయోగిని చేత నాగబెత్తముఁ బట్టుకొని యరుణవర్ణంబులగు జడలతోఁ బేలికలు గట్టుకొనియుండు తపఃకృశ మయినశరీరంబుతో నాయుండుకడకుఁ జనుదెంచి యోరీ నేను మహేంద్రనగమునుండి హిమవన్నగంబునకుం జనుచు బహుదినప్రయాణాయాసంబునం బడలి యాతిథ్యంబుకొఱకు నీకడకేఁగుదెంచి యున్నదానను. జలంబులుగాని ఫలంబులుగాని యొసంగితివేని యవి భుజించి విశ్రమించి చనియెద నని సకరుణంబుగ నడిగిన నేనందు కాయోగినిం గాంచి యోయమ్మా నాయొద్ద నొక్కమామిడిపం డున్నది. దీని నొసంగెదను. దీని భుజించి నా కొనితెచ్చియిచ్చినజలంబులం గ్రోలి విశ్రమించి యథేచ్ఛమునఁ బోవంజనును. అని చెప్పి యట్లుగావింప నామెయుం ఫలంబు భుజించి జలంబులు ద్రావి కొంతతడ వారసాలపాదపముక్రిందం గూరుచుండి నాయొనరించిన యాతిథ్యంబునకు మెచ్చుచు నన్నుం గాంచి యోరీ యియ్యెడ కేఁగుదెంచినప్పుడేను గడుఁబడలియుండినదానను; నీయొనరించిన శుశ్రూషచేఁ గరము విశ్రాంతిం జెందితిని. నీ కొకయుపకారము సేయ మనంబున ననుకొనుచున్నదానను. ఇంతకు నాతిదూరంబున చందనవనం బొండు గలదు. దాని నీకుం జూపెదను. నీ కేదేని యొక యిక్కట్టు వచ్చినప్పు డాయరణ్యంబునకుం జని యాకట్టెలు నఱికి తెచ్చి విక్రయించి తన్మూలముగ ధనముసంపాదించి యాయిక్కట్టు దాఁటుకొనుము. అని చెప్పి యాచందనవనమునకుం బోవుమార్గము నాకుం జెప్పి చనియెఁ గదా! ఇప్పు డావనమునకుం, బోయి కట్టెలు గొట్టి తెచ్చి యమ్మి ధనము సంపాదించి యుద్దిష్టకార్యంబు సమకూర్చుకొనంజను. అని చింతించి వైళంబ యాయోగిని సెప్పినమార్గంబునన చని మలయజవనంబుం గాంచి సంతసించి యాకట్టెలు నఱికి కొనితెచ్చి కట్టలుకట్టి యానగరంబునం గాఁపులయుం దొరలయుం మంత్రులయుం ప్రధానులయుం వర్తకులయుం తక్కుంగలవారలయుం గృహంబులందుఁ దప్పక యొక్కొక్కమోపువంతున వేయుచుఁ బూర్వమునుండిఁ గట్టెలు విలుచుకొన్నవారిచ్చినధనముచేతఁ గడుపుఁ బూడుచుకొనుచుండువాఁడ. నావెలయాలితోఁ బొందు సేయ నెంచియుండుకారణమునం జేసి ధనసంచయము సంపాదింప నెంచి యదిమొదలు విలువ తీసికొనకయ కట్టెలమోపులు వేసిపోవుచు బిచ్చ మెత్తుకొని యాకలి నడంచుకొనుచు నెవ్వరేని పిలిచి కూలి తీసికొని పొ మ్మనిచెప్పిరేని నాకుఁ గావలసినప్పుడు తీసికొని పోఁగల నని వచించుచు నెవ్వరివలనఁ దీసికొనకయ తిరుగుచుఁ గట్టెలమోపులు కొట్టి తెచ్చివేయుచుంటిని. ఇట్లు కొన్ని నెలలు జరిగెను. ఒకనాఁడు వాడుకచొప్పునఁ గట్టెలమోపు వేసి పోవుచుండ నప్పట్టణంబునం గలచందనదాసుం డను బేహారియింటి

యూడిగంపుంబడంతి యొకతె నావెనువెంటనంటి యోరీ నిన్ను మాసెట్టి పిలుచుకొని రమ్మనెను; పోక రమ్ము; నిలువుము అని కూయుచు వచ్చి యేల మాసెట్టి నన్నుం బిలువ నంపె నని నే నడిగిన నందు కాదాసి యిట్లనియె. ఓరీ వినుము నే నాతనియింటిదాసిని. ఈదినము మహానసంబునకుం జని వంటకములు వండ నుపక్రమించి నీవు ప్రతిదినము తెచ్చి వేయుచుండిన కట్టెలమోపులలో నొక్కటి విప్పి యొకనల్లనికట్టెను బొయిం బెట్టి యెరియించితిని. తక్షణము యగురుగంధంబులు నలుదెసలం గ్రమ్ముకొనియె. అందుకే నాశ్చర్యపడుచుండ నాసెట్టిగృహిణియుఁ దక్కుంగలగృహదాసికలును వచ్చి యేమి యిది యనిగుసగుసలాడుకొనుచుండిరి. ఇంతలో నంగడినుండి సెట్టియు వచ్చి తాను వర్తకవ్యాపారమునకై తెప్పించియుంచిన చందనదారువుల నెఱియించుచున్నా రని యాగ్రహించుచు వంటశాలకుఁ జనుదెంచి యోసీ! పొయినేమి వేసితి వని యడుగ నేను నాతనికి భయపడుచు నిట్లంటిని. ఏ నేమియు నెఱుంగను. ఈకట్టెలమోపు విప్పి యిందలియొకయిధ్మము నెఱియించితి. దీన నీవాసనలు గ్రమ్ముకొనెనని చెప్పి యాదారువుఁ జూపితిని. అది గాంచి యావణిజుండు ఓసీ యిది చందనదారువే! ఇది యిచ్చోటకు రాఁ గతం బేమి? యని యడిగిన నిట్టిమోపులు దినదిన మొక్కొక్కటి యొకవెట్టివాఁడు మనయింటికిం దెచ్చి వేసి కూలి తీసికొనకయ పోవుచున్నాఁడు. ఆకట్టెలమోపు లివె యున్నవి యని చూపినం జూచి మాసెట్టి యచ్చెరువొంది యీమల యజదారుసంచయం బొక వెట్టివానికవ్వారిగ దొరకుట యెట్టిది? కట్టెలమోపులు సేసి యాయాపూట కివ్వవలసినకూలితీసికొని జీవనముసేయువాఁడు కూలి తీసికొనక పోవుచుంట యేల? ఇది యొకవింత అని యనుకొనుచు నన్నుంగాంచి యోసీ నీవు వానిని గూలితీసికొనిపొమ్మంటివా యని యడుగ నేను నోయయ్యా! యింతకు ముందు కూలిఁ గొనిచనువాఁ డిప్పుడు కొన్నినెలలనుండి కూలియడుగక యుండుటయే గాక పిలిచి కూలితీసికొమ్మని నిర్బంధించిననాఁ డుసయితము వాఁడు నాకుఁ గావలసినప్పుడు తీసికొనియెదను మీ కేమి దీనివలన భార మని బదులు సెప్పుచుఁ బోవుచున్నాఁడని చెప్పిన విని యాతఁడు మంచిది యెల్లి యాకట్టెలవానిం బట్టి నాకడ కంపునది యని ముదల యిడి వెడలిపోయె. తదీయాజ్ఞావశవర్తినినై యేను నిన్నుం దోడ్కొనిపో వచ్చితి నని యాహెగ్గడికత్తె పచియించి నన్నుం బిలుచుకొనిపోయి యాసెట్టియెదుర నిలువంబెట్టి తనపనికరిగెను. ఆబేహారి నన్నుం గాంచి యోరీ నీవెవ్వఁడవు? అని యడిగె. అందు కేను గట్టెల నమ్ముకొని జీవించువాఁడ నని బదులు సెప్పితిని. కట్టె లమ్ముకొని జీవించువాఁడ వయినచోఁ గూలి తీసికొనక పోవుచున్నాఁడ వట! అదేలా? అని యడిగిన నేను నోయయ్యా తడవులంబట్టియే నొకకార్యంబుఁ దలపెట్టుకొని యుండెదను. అది మీరలు నెరవేర్పంగల రని నమ్మి కూలి దీసికొనకయ పోవుచున్నవాఁడ నని యంటిని. నీ తలపెట్టినపనియేమి యని యాబేరి ప్రశ్నచేసి యుద్దిష్టకార్యంబు సెప్ప సిగ్గుపడుచుండు నన్ను దగ్గఱకుం బిలిచి వెన్నుచఱచుచు భయంపడకుము సెప్పు మని పలుమా ఱడిగిన నే నాచందనదాసునితో నిట్లంటిని.

సీ. కట్టెలమోపు గట్టి యంగడిఁ బెట్టి యూరక నే నిలుచున్నవేళ
కాంతియౌవనమదగర్విత యొకలంజ శిబికపై నెక్కి నెచ్చెలులు గొల్వ
వచ్చి నాకడ నిల్చి విచ్చలవిడి నవ్వి యీదుర్భగునితోడ నెవతె గూడు
నని రోకిలించిన న్గనుచుఁ దూఱాడుచుచుఁ జనియెను లంజ కీఘనత దగునె
పురుషుఁడనై గద యెట్లున్నఁ బోల దేమి, యిట్టిగర్వంబుఁ గొన్నయీయింతితోడఁ
బొం దొనర్చుటె మగఁటిమి పో యటంచు, ధనమునకుఁ ద్రోవలేక యీదారిఁ గంటి.

అన విని యాసెట్టి పక్కున నవ్వి యతఁడు వీనిదౌర్భాగ్యవేష మేమి ? దానిసౌభాగ్యవిశేష మేమి! నక్కయెక్కడ నాకలోక మెక్కడ! దేశాధిపతులు సయితము పెక్కండ్రా భోగము దానికడకుం బోయి దానిదెబ్బలుఁ దిని వెడలిపోయి యున్నారు. ఇంత గర్వముతో నుండుదానిసరసకు వీఁడు జనియెడువిధ మెట్టిది? అయినను వీనికి విద్యానుకూల్య మనునది యెట్లున్నదో యెఱుంగము. ఈయభిప్రాయమును మన మేల నివర్తింపం జేయవలె! నని వచించి యావర్తకుఁడు నన్ను నాయంగడికడ నుండం బలికి యింటికిం జని యంతదనుక నేను దెచ్చి వేసియుండు చందనదారువుల లెక్కించి యవి పదివేలవరహాల విలువకంటె నధిక మయి యుండ సంతసించి వానిని పదిలపఱిచి నన్నుం దనయింటికిం బిలిపించి యోరీ మఱియు నెక్కడెక్కడ నిట్టికట్టెలమోపులు వేసియున్నా వని యడిగి యందఱయిండ్లకడ నిట్లే వేసియున్నా నని నేఁ జెప్పవారల నందఱ సగౌరవంబుగ రప్పించి వారలతోఁ గలయ నాలోచించి ఈకట్టెలవానిని రాజకుమారునిగఁ జేసి యపరిమిత మగు నాడంబరముతో నావెలయాలికడ కంపవలయు నని తీర్మానించుకొని నాపితుని రప్పించి నాకు మంగళక్షౌరముఁ గావించి సంపంగినూనె తలయంటి యభ్యంజనస్నానముఁ జేయించి యుంగరంబులు కంఠసరులు మొలత్రాడు మొదలగు సువర్ణాభరణంబులం గైసేయించి బంగారుసరిగెదోవతులు జరీతలపాగయుఁ గాశ్మీరశాలువలు నంగి దట్టి నిజారులును గట్టించి దివ్యభోజనము పెట్టించి కస్తూరి జవ్వాజి పునుఁగుగలసినకలపం బలఁదించి తాంబూలమిచ్చి యష్టాదశవాద్యంబులు వాయించుచుండ సువర్ణశిబికపై నెక్కించి వేయివరహాలు ముడియకట్టి యాపల్లకిం బెట్టి రథగజతురగపదాతులు ముందు నడువ వేశ్యాకన్యకలు నర్తనంబు సల్పుచు రా నిట్టిమహాడంబర మమరంజేసి యాసెట్టియుఁ దక్కంగలపట్టణపుఁబెద్ద మనుష్యులును గూడి యోరాజా నీవు విద్యాసర్వస్వవేదినితో సంభోగసామ్రాజ్యం బనుభవింపు మని దీవించి చెప్పి నన్నుం బ్రయాణము చేసిరి. ఓ యుదయాదిత్యుఁడా యేఁ జనినయావైభవం బేమి సెప్పుదు.

గీ. రాజరాజకుమారుండు రంభకడకుఁ, ద్రిదశపతి కోర్కి నాశచీదేవికడకు
కామదేవుండు రతిదేవికడకుఁ బోవు, వైభవంబున నేఁగితి వనితకడకు.

ఇట్లపరిమితాడంబరంబుతో నేఁగిననా కాలంజ యొనర్చినపరాభవంబు వినుము. చెప్పెదను.

ఆసుందరీకదంబము విద్యాసర్వస్వవేదినీసమధిష్ఠితము మదీయవైభవముం గనుంగొన సౌధోపరిభాగసమారూఢం బై యుండనోపునని యే మనంబున నాలోచించుచుండ నందొక్కయిందువదన తన నెచ్చెలులం జీఱి యిట్లనియె.

చ. ఘనులగు రాజరాజులను గౌరవధుర్యుల వచ్చియున్నవా
రిని గనుగొంటి మింతవిపరీతము గానము యీతఁ డెవ్వఁడో
వనజదళాక్షులార తలవాకిట డిగ్గి ప్రియం బొసంగినన్
గొని వెస రండు పోం డనుచు గొబ్బున హర్మ్యము డిగ్గిపోయినన్.

ఉ. పండెను నాతపఃఫలము భామినిఁ గూడఁ గఁ గంటి నంచు ను
ద్దండజయస్వనంబులును దందడి మీఱెడువాద్యఘోషముల్
మిండత లాడునృత్యములు మేళము మర్దళధింధిమిధ్వనుల్
నిండి నభంబు వెల్లదర నే నట డిగ్గితి దాని వాకిటన్.

ఇట్లు దిగి యొక్కింతతడ వుండి నాతో వచ్చినయలయూడిగంపువారల వారి వారియిండ్లకనిచి నే నడపగాఁ దందియిచ్చు తెలియాకుమడుపులు విడెము సేయుచు మీసములపయిం జేయివేసి మీసరముగ దువ్వుకొనుచు నా వెలయాలివాకిట హజారంబున నిలిచి యుంటి. అది గాంచి యచటియంగడుదుడుపులు నాకడకుం జనుదెంచి*"యోరాజా మీర లేదేశపుభూదారులరు" అని యడిగి వారలలో వారు సాకూతవచనులై నవ్వుకొనుచుండం గాంచి యేను మనంబున నేదేశపురాజను గా నే యేమి సెప్పుదునని యనుకొనుచు మాటలాడినఁ జేటుసంభవించి నేమో యని మౌనముఁ దాల్చియుంటి. అదిగని యేలకో యితఁడు నోరు దెఱవ కున్నవాఁడని యనుకొనుచు మరల నన్నుం గాంచి†"ఇదిప్రాఁతవిభ్రమమొ! క్రొత్తవిభ్రమమొ! (ప్రాఁతమిణుకరింపో క్రొత్తమిణుకరింపో) అని యడిగిరి. అందుకును నే నూరకుంటిని. మరల వారలు నీవు నిండుకుండవా ? నిండనికుండవా? యని ప్రశ్న చేసిరి. అందుకును బల్కకయుంటిని. అంతటం బోకయవ్వాలుగంటులు దగ్గఱ కేఁగుదెంచి మూఁగవాఁడవా? చెవిటివా? యని యడిగిన నందుకును బదులు సెప్పక యుంటిని. అంత వారలు మనతో నితఁడు పల్కకయుండుటం గాంచఁగా మనయేలికసానితో మాటలాడుకొందమని యొంచియుండువిధంబు గన్పడుచున్నది. అని యనుకొనిరి గాని మాటలాడువిధం బెఱుంగకయున్నవాఁడని నిశ్చయించుకొన్నవారుగారు. అట్లుకొంతతడవు పూరకుండి యావెల్లాటకత్తియలు ఓరాజా నీవు మాతో మాటలాడవేని మాటలాడుమని మేము నిన్ను నిర్బం

* భూదార-అనుశబ్దమునకు రాజు అని పైకిఁదోఁచునర్థము. పంది యని కుత్సితపరిహాసార్థము. † విభ్రమ-అను పదమునకు వస్త్రభూషణాదులవలనికాంతి యని పైకిఁదోఁచు నర్థము. విభ్రాంతిఁగొని మిణుకరించుట యనునది కుత్సితపరిహాసార్థము.

ధింపము. ఇప్పు డియ్యెడ కెవ్వతెకు విశ్వాసం బొసంగ వచ్చితివి ? యని యడిగిన నేనందుకు వారలం గాంచి మాయేలికసాని కని చెప్పి దానికివ్వవలసినబోగమేమి? యని యడిగితిని. వేయివరహాలు బోగ మని వచించిరి. వల్లెయని పల్లకిం బెట్టియుండువిడిముడియు నెత్తియిచ్చితిని. అది గొనిపోయి యాలంజెలు మఱియుం గొంతతడవునకు నాయుండు చోటికింజనుదెంచి యోరాజా నీయొసంగినధనంబు మాయేలికసానిచేతం బెట్టితిమి. దానిం గైకొని యాయింతి నాణెములఁ బరీక్షింపంబంచి కోశాధికారిణుల కొప్పగింప ముదల యిడి నిన్నొకింతసేపు వాకిటియరుగుపై నుండుమనియె. అని వచించిన నేను దన్మందిర బహిర్వితర్దికాతలంబున నుపవిష్టుండనైయుంటి. అంత నొక్కింతసేపటికిం గొందఱు వగవుడుఁ బడంతులు నాయున్నయెడకుం జనుదెంచి యోరాజా మాయేలికసాని నిన్ను నర్తనమండపమునకుందోడ్కొనిరమ్మనియెనని చెప్పఁగా నేను సని వారలతో రెండవకక్ష్యాంతరంబున గడఁచి యయ్యెడ నుండునతివిచిత్రములైనచిత్రపుంబనులను గనుంగొనుచు,

క. అతిరూపవతులఁ గొందఱ, సుతనువులను బీనకుచల సుభగవయశ్శ్రీ
యుతలను నర్తనవిద్యా, చతురలఁ గనుగొనుచు మోహజలధి మునిఁగితిన్.

గీ. మునిఁగి వారలనవ్వులు మోహనంపుఁ, గ్రీడలును నర్తనములు సంగీతములును
భావచేష్టలు జూచుచు భానుఁ డుదయ మగుడుఁదెలివొంది వేగవేగయచటు వాసి.

గీ. లోని కేఁ బోవఁ గడఁగ నాచాన లెల్ల, మోసపోతివి మరలుమీ మూఢయనుచు
కడకఁ బ్రహరించి గళహస్తికాప్రయోగ,ములను ద్రొబ్బిరి వెలికి నామోహమడఁగ.

త్రోపువడి యేనుచు లేచినిలిచి యోలంజలార వేయివరహాలిచ్చిన దిందుకేనా? ఈ ద్రొబ్బులకా ! యింతవిడిముడి ? ఇంతధనమిచ్చి విద్యాసర్వస్వవేదినితోఁ బొత్తుగల యకపోదునా ! నేనిచ్చిననిష్కసహస్రమున కొప్పంజెప్పవలసినది లేదా ! యని యంగలార్వనాపడపుంజెలులు,

క. ఈరేయికె యీవిడిముడి, యోరీ యది చెల్లెఁ బొమ్మ యూరక యింకన్
మారామ రాదు వాదము, గారా దిఁట మోసపోవఁ గలవే ఫలముల్.

నీ వీరేయి మాయేలికసానితోడిపొందుకై ధనం బొసంగినవాఁడ వీనర్తనమంటపమునందు మమ్ముంగనుంగొనుచుఁ గాలయాపనం బగుట యెఱుంగవైతివి. రేయియు గడఁచె. ఇఁక లోనం జొర ముదల లేదు. అనిచెప్పుచు నన్నుం దలవాకిటికిం ద్రొబ్బిరి. అంతటంబోక యేనును పెనురోదనంబు సేయుచుఁ దదీయరథ్యాపర్యటనపరాయణులైనయాతాయాతజనంబు లేలకో యితఁ డాలిం గోల్పడినవానియనువున నంగలార్చుచున్నవాఁడు; సమీపమునకుం జని విచారింతమని వచ్చి నన్నడిగిన నే నాపౌరులతో,

గీ. ధనము గొని చని లంజలు దర్ప మెచ్చి, నిక్కృతి నను మోసపుచ్చి యానీరజాక్షిఁ
గలయనీయక వెలిచిరి కష్టపెట్టి, న్యాయమా యిది పౌరజనంబులార.

అని చెప్పుకొనుచు దుఃఖించుచుంటిని, ఇట్లుకొంతతడ వుండి యేను.

చ. ధనమును గోలుపోయి యలదానిని గూడక మోసపోయి యా
వనితలచేత మొత్తవడి వాకిటికిం బడఁద్రొబ్బఁ దోరి మూఁ
గినఘనశోకభారమునఁ గేకలు వ్రేయుచు మార్గగాములన్
మునుకొని పిల్చి చెప్పుకొని ముండలఁ దిట్టుచు నేడ్చుచున్నచోన్.

చ. అది విని లంజ లరిదఱును హోయితఁ డల్లరిసేయఁ బూనినాఁ
డిది కడుసిగ్గుగాఁ దలఁపఁ డే మని యందఱు బిట్టుబోఁలుచున్
హృదయమునందు రోఁతపడ కివ్విధి నేడుచుచున్నవాఁ డిసీ
పద మనఁ బోఁడు కష్టఁ డిటఁ బల్కుఱు బాధలు వెట్టసాగెడిన్.

అని యొండొరులతో నాడుకొనుచు నాకడకుం జనుదెంచి నన్ను మరల లోనికిం బిలుచుకొనిపోయి యోరీ నీవు గూయున దేమి యని యడిగిన నేను నోలంజలార ధనము గైకొన్నందు కది యొసంగినవాని కొప్పఁజెప్ప వలదా? వానియభిలషితంబున కొడంబడ వలదా? ఊరక కొట్టి తిట్టి తఱిమినచో ధనము గోలుపోయినవాఁడు గూయకుండునా! నేనేమిసేయంజనదని పనవితిని. అందుకు ఓరీ నీచేతినుండిధనముఁ గైకొన్నవాఁడు.నీకొప్పఁ జెప్పవలయుననుటగలదు. అయిన నిప్పటి కేమియుం మించలేదు. మేము నెప్పునట్టిపద్యమునకు భావంబు వచించితివేని విద్యాసర్వస్వవేదినితోఁ బొందు సేయ సందర్భంబుగల్గు నని యారోపడంతులు వల్క నందొక్కతె యొకపద్యంబు సెప్పి దీనిభావం బే మని యడిగిన నందు కే నేమియుందోఁచక భ్రమించుచుండం గనుంగొని యావంచనావనితలు ఓరీమును నిన్నుఁగొట్టినదికల్ల; ఇప్పుడు కొట్టుట నిజము; అని నన్నుం బట్టుకొని చింపిచేటలం బ్రాతమొక్కచీపురలం గొట్టి యొకగాడిదపైఁ గూరుచుండంబెట్టి యూరేగింపుఁజేసి తఱుమం గొట్టిరి. అవ్విధమున మహాపరిభవము నొందినయేను నంతకుఁ బూర్వము విద్యాసర్వస్వవేదినిచేతం బరాభూతులై తమదేశంబులకుం బోవ లజ్జించుచు నానగరంబుననకాఁపుర ముండురాజకుమారులతో మొరవెట్టుకొని యేడిచితిని. వారలు నామొర యాలించి యోరీ నీవే కావు! మేము నివ్విధమున నప్పువుఁబోడిచేఁ బరిభూతుల మయినవారమే. మాతో నీవు విలపించినం బ్రయోజన మేమి యున్నది? దానికి వేయి గాదు! పదివేల వరహా లొసంగినను ఫలము లేదు. దానితో సమానముగ సర్వవిద్యలందు వాదించి దానిం జయించినం గాని కార్యము సిద్ధింపదు. కవితాప్రసంగంబునం దద్దానితో సమానుఁడై యుండుమగవాఁ డొక్కరుఁడైనం జతుస్సముద్రముద్రితధరాతలంబునం గానంబడఁడు. వసుమానసనగరంబున నుండునసమానవైదుషీధురీణుండగునుదయాదిత్యుండుఁదదీయకవిసంఘంబునం జేరినవారును దక్కఁ దక్కినవారి కిక్కమలనయనం జయింప శక్యంబుగాదు.

వైళమ నీవు సని యాతనితో మొరయిడిన నొకతెఱంగున దీనికి గర్వభంగం బగు. గర్వభంగం బగునేని యిది యెల్లవారల నిట్లు పరిభవించుటమానుకొనును. ఇది యీయూరిరాజు సహాయంబునం జేసి యిట్లు విఱ్ఱవీఁగుచున్నది. ఆప్రకారంబు వినుము. ఈకన్య యీఱేనికి భుజిష్యయై బహిఃప్రాణంబు నా నొప్పుమిగులు రతిరూపయనుదాని కూఁతురు. కాన నీ ప్రతాపపాలునివాత్సల్యమునకుం బాత్రురాలు. అతనికిం బట్టమహిషియందుద్భవించినవసుధారిణియుం నీభుజిష్యాసుతయుం నిరువురు నతని ప్రేమంబునకు సమానలు. మఱియు నిది యొకించుక పెచ్చునవచ్చు. ఇది యతఁ డీనాఁటి కొసంగియుండు మహావైభవమున నూహ్యామైయున్నది. ధనముఁ గైకొని మోసపుచ్చునీటక్కులమారి టెక్కులాడిని బట్టి పరాక్రమమున శిక్షించుటకు ననువులేదు. ఇట్లిది మోసపుచ్చుటకు రాజు నొడంబడి యతిక్రమించి ప్రవర్తించినవారిం బట్టిశిక్షింప నతఁడు వీరభటుల నియోగించి యున్నాఁడు. ఇట్టి యక్రమమున కతఁడు సమ్మతించుటకుం గారణము దాని కతఁ డిచ్చియుండువరమే! అట్టి వరమిది వడసినవిధానము వినుము.

ఒకనాఁడు ప్రతాపపాలుండు తనదేవితో నంతిపురంబునందు సంగీతగోష్ఠిజరిపించుచుండునప్పు డందుల కాహూతయై యాచందనగంధి మహావైభవంబుతో నేతెంచి ఱేనికి నమస్కరించి గీతనృత్తంబులం దనకుం గలయసమానచాతురీ విశేషంబుఁ బ్రకటింప నందుకు మెచ్చుచుఁ బండితగోష్ఠి చేసి యాకన్యకం గాంచి యీవిద్వదగ్రగణ్యులతో శాస్త్రవాదంబు సల్పి జయించితివేని నీయభిమతం బేది యేని సమకూర్తునని చెప్పిన మహాప్రసాదం బని పండితులతో శాస్త్రవాదంబులకుం గడంగి వారల నోడించి కవులకు విషమసమస్య లిచ్చి విజితులం జేసిన నందు కలరి భూపతి నీయభీష్టం బేమి యని యడుగ నాసాతి యిట్లనియె. ఓదేవా యేను విద్యలయందు నాకంటెఁ గడునధికుండైన వానితోఁ గాక యితరునితోఁ బొందు సేయను. ఎట్టిమండలాధిపతులగు మహాప్రభువులు సైతము నన్నుం గామించి నన్నుం జేర వచ్చినను వారివలనఁ దొలుత వేయివరహాలొక రాత్రిపడక కని తీసికొని యనంతర మొకసమస్య యిచ్చి దానిభావంబు నెఱింగి పల్కఁడేని వానిం గొట్టి తఱిమి కన్యాత్వమునకు భంగంబు లేకుండ వర్తించుచు విజితు లయిన వారిని దాసులఁ జేసికొని యిట్లనుదినము సంపాదించినధనమ్ములను వేదవిదులగు విప్రులకును బీదలకును సాధువులకును వినియోగించుచు నుండుదును. ఇవ్విధంబున జరుప నాకు సమ్మతి యొసంగ నగు నని ప్రార్థించిన రాజును వల్లె యని తదనుగుణముగఁ గట్టడలు గావించి యున్నవాఁడు. ఈకతమున నాబోగముపడుచు గర్వముఁ జెంది విఱ్ఱవీఁగుచున్నది.

విద్యలయందుఁ దన్ను నోడించినవానిం గాని వరింపదు. అతఁడు పరాక్రమవంతుండును రూపయౌవన సంపన్నుండుగాఁడేని మఱి యేనికృతిచేసైన వానిని వంచింపక

మానదు. అన్నిగుణము లమరియున్నవాఁ డుదయాదిత్యుం డొక్కరుండ. వైళంబచని యతనితో మెరపెట్టుకొనుము. అని వారలు సెప్పఁగా నేను నామనంబున నింతధనము సంపాదించుటకు నే బడినకష్టము నాకుఁ గదా తెలియును. అట్టిమహాకష్టమునఁ గడించిన ధనమూరక వదలిపెట్టి పోదునా! ఆరాజకుమారునికడ కేఁగి విశేషవిద్యావంతుని దోడ్కొనివచ్చి దీనికి గర్వభంగం బైనఁ జేసెదనుగాక యని యనుకొనుచు నప్పుడ బయలు వెడలి యీనీనగరమున కేఁగుదెంచితిని. ఇది నావృత్తాంతము. నీకడనుండువిద్వత్సంఘంబున నున్నవారలలో మగతనము గలవాఁ డుండెనేని యావిద్యాసర్వస్వవేదినిం జయింప సింహపురి కంపుము.” అనిచెప్పి యాకట్టెలమ్మువాఁ డూరకుండెను. సభాసదులగు కవివరులును బండితులును వానిమాటలు విని యిట్లనిరి. ఇట్టియతి ప్రసిద్ధురా లొకతె యుండునేని తద్వర్తమానంబు దేశాంతరాగతులగు కవివరులు సెప్పరా! ఎవ్వరివలనను విన్నది లేదు. వీనివచనములు నమ్మఁ జనదు. ఇది కల్లయో నిజమో యెఱింగినంగదా మీఁదటి కార్యమునకుం గడంగఁ జను. వీని నిచ్చోట నుంచుకొని మఱియొకనిచే వేయివరహాల ముడుపంపి దానివిషయంబుఁ దెలిసికొననగును. అని చెప్పఁగా నుదయాదిత్యుండు వల్లెయని యొకభటునిచేతికి వేయివరహాలమూటయుం కవులువ్రాసినయొక పద్యము గలచీటియుం నిచ్చి వీనింగొని నీవు సింహపురికిం జని యుదయాదిత్యుని కవిసంఘమువా రంపఁగా వచ్చితి నని యావిద్యాసర్వస్వవేదినికిం జెప్పి, విడిముడియుఁ బద్యంబు నొసంగి యన్నెలఁత యిచ్చు ప్రత్యుత్తరంబు గొని రమ్ము, వేగమ పొమ్ము. అని పనిచిన నాభటుండును కతిపయదినప్రయాణంబుల సింహపురికిఁ జేరి విద్యావేదినియింటివాకిట నిలిచినం గాంచి ద్వారపాలికలు నీ వెచ్చటనుండి వచ్చినాఁడవని యడిగిన వసుమానసనగర మేలునుదయాదిత్యుని కవిసంఘమువా రంపగా వచ్చినాఁడనని చెప్పి, ఏమి తెచ్చితి వని యడిగిన వేయివరహాలు నొకపద్యంబును దెచ్చితి నని చెప్పెను. అది విని దాసీజనంబులు వాని నడిగి తీసికొని విద్యావేదినికడకుం గొనిపోయి దానిముందట నుదయాదిత్యునికవిసంఘమువారంపినదట యని చెప్పి యునిచిరి. అతరుణీమణి చీటి విప్పిచూచి యందు

ఉత్సాహ. కన్నె నీవు విల్వ సెప్పి కైతవంబుచేత ము
న్గొన్నసొమ్ము వేయి దానఁ గోరికల్ ఫలింపవే
చన్నెయనక మించుబోఁడి చతుర వసుచు విత్తముం
గొన్నకీర్తి చాలుఁ జాలుఁ గోమలాంగి నీకిఁకన్.




అనివ్రాసియుండుటంగాంచి యాపద్యమునందుఁ దప్పుండిట్టియుండుటకుం గోపగించి వారువ్రాసినపద్యమునకుఁ బ్రతిపద్య మొకటి తాను వ్రాసెను.

మత్తకోకిల. * ప్రత్తి పుట్ట మొసంగు టయ్యది భావ్యమే యగు నైన నా
ప్రత్తి యెంతయుఁ గల్గిన న్మఱి భామ దాల్పఁగ నౌనె పో
క్రొత్తగాఁ గవితారసజ్ఞతఁ గోరి కాంచినమూఢు లా
యత్తులై గెలువం గ నేర్తురె యభ్యసించినవిద్యచేన్.

అనిగ్రాసి యాభటునిచేతి కాపత్రికయు నతఁడు కొసితెచ్చిన వెయివరహాల మూటయు నిచ్చి పంపెను. అదిగైకొని యాభృత్యుండు వసుమానసంబునకుం జని యా విడిముడియుఁ జీటియు విద్వద్బృందముకడం బెట్టఁగా నది పఠించి యావిద్వాంసులు ఆహా ఆలంజ తన్నుం జెప్పుకొనుట మాని మనల నెల్లరను మూఢు లని తిట్టుచున్నది. దానికడకుం జని కవితాప్రసంగంబుఁ జేసి యోర్చి దానియాఁడివ్యభివనంబు నిలాతలం బునం గలపి విద్యాసర్వస్వవేదిని యనుబిరుదనామముఁ దీయించి రాఁగల మని యధిక కోపంబునఁ గోలాహలముఖరితులై విద్వాంసులు లేచినం గాంచి మిత్రసహుండు మంద హాసము సేయుచుం దనమనంబున నొకయుక్తికి మఱియొకయుక్తి దోఁచని యీబడుగు బాపలా! సరస్వతినినైత మాత్మవిద్యావైశారద్యంబున నధఃకరింపం జాలునావిద్యా సర్వస్వవేదినిం జయింపంగలవారు! ఇది వీరికిశక్యమా! ఈవ్యవసాయమువలన వీరిని నివ ర్తింపంజేయుట యుచితము. అని యొంచి యించుపాల మించునంచితవాక్యజాలంబులు వినువారికిం గర్ణపియూషంబై యెసంగ సవినయముగ నిట్లనియె. ఓవిద్యానిధులారా! మీరలు సమస్తవిద్యావిశారదులయ్యును విద్యాసర్వస్వవేదినిం జయింప సమర్థులరు గారు.

శ్లో. స్త్రీణాం ద్విగుణ మాహారః బుద్ధిశ్చాపి చతుర్గుణా,
సాహసం షడ్గుణం చైవ కామమష్టగుణం భవేత్.

---

* ప్రత్తియనునది యుండినచో దానిం గొని వస్త్రమును నిర్మించుకొననగు. అట్లు ప్రత్తిచే నిర్మితమగు వస్త్రము నొకకాంత ధరించుకొనం జనును గాని, వస్త్రముగా నిర్మిం పంబడని ప్రత్తి యెంత యుండినను నాతి దాని ధరించుకొన వీలు లేదుగదా! అవ్విధ మున నే మీకు నూతనమగు కవితారసజ్ఞత; గురుకులవాసశ్రమసంపాదిత మైనది యుండి నను నిరంకుశవిద్యావిశేషవైదుషీవిభూషితలతో వాదంబున నోర్చుటకుం గాదు. అంబుజ భవునిరాణినిరతిశయదయావిశేషనిరర్గళనిర్గళత్కవితాధోరణి గలవారల సహాయంబు చేతనగాక మీకు శక్యంబుగాదు. ఎప్పటికిం గాని యభ్యసించినవిద్య యభ్యస్తమంద గాని యితరార్థంబులందు నిరంకుశత్వము వహింపదు. సమస్తశాస్త్రంబులు నవివి భారతీ కరుణాకటాక్షపాత్రతం గైకొని యుండునాతో సర్వవిద్యావిశేషంబులం దసమాన వైదుషీవిభూషిత యైనదానితో నభ్యస్తవిద్యామాత్రపర్యవసన్నతం గాంచియుండు మీకు వివాదంబు తగదు. ఇది యారయక యిందు కుద్యోగించినమీరు మూఢులరని భావము.

అనువచనము సార్థకమయి యుండు. స్త్రీలు బుద్ధిచేతను సాహసంబుచేతను బురుషుల ననాయాసంబున జయింతురు. ఇందులకు దృష్టాంతమగు కథ యొకటి గలదది వినుండు.

## మదనమాలినీమానపాలురచరిత్రము

ఈవసుమానసనగరరాజ్యంబున కవ్యవహితంబై యుండునది విదర్భరాజ్యము. తదధిపతియై యుండువాఁడు మానపాలుం డనురాజకుమారుండు. అతండు విద్యా,శౌర్య, ధైర్య, సామర్థ్య, గాంభీర్య, సౌందర్య ప్రముఖములగు గుణములు గల్గి తన తేజంబున సామంతరాజుల నెల్లర వశకృతులం గావించికొని షోడశవర్షవయస్కుండై రాజ్యతంత్రముల నతిచతురుం డగుచుం బ్రవర్తించుచుండంగాంచి జలపాలుం డనునతనితండ్రి యాకుమారుని రాజ్యాభిషిక్తునిం జేసి కులక్రమాగతులగు మంత్రివృద్ధుల నతనికి భ్రమప్రమాదంబులు గలుగనీయక మంత్రాలోచనాదికృత్యంబుల సహాయులై యుండ నియమించి గృహంబు వదలి మునిజనచరణశుశ్రూష సేయుచుఁ దపంబు సల్పి సద్గతి యను జన్మసాఫల్యంబు వడయ వనంబునకుం జనియె. మానపాలుండును పిత్రాజ్ఞావశవర్తియై మంత్రివృద్ధానుమతంబున యథాన్యాయముగ రాజ్యము సేయుచుఁ దాను మహాప్రతాపవంతుండై యుండుటంజేసి సామంతభూకాంతులు పాదాక్రాంతులై యరులు పెట్టి తన్నుంగొల్వ నవధీరితసురగురుశేముషీవిశేషవివృద్ధులగు మంత్రివృద్ధు లాలోకించుకయుం ఖేదము పుట్టకుండ కార్యంబు నిర్వర్తింప ననాయాసంబున రాజ్యంబుపూజ్యంబుగ నిర్వహించుచుఁ దనకుసమానకులశీలవయోరూపరేఖావిలాసంబులు గల యుత్తమమత్తకాశినీరత్నంబును సహధర్మచారిణిం జేసికొని తారుణ్యసుఖంబుల ననుభవింపం దలంపు గలిగి,

ఉ. కోమలరూపమాత్ర లగుకోమలు లెన్నఁగఁ జిత్రరూపలే
భామలు భావమాత్రసువిభావిత లాత్మకు నింపుగారు పో
భూమిని రూపసంపదలఁ బూజిత యై యసమానవైదుషీ
గ్రామణియై యెసంగునెలప్రాయపుఁజేడియ చేడె చూడఁగన్.

అని తనమనంబునం జింతించి యట్టిసుందరీతిలకంబును భువనతలంబునం గలయి నన్వేషింప విప్రోత్తములం గొందఱ నన్యదేశంబులకుం బనిచెను. వారలు పెక్కుదేశంబులకుం జని మహారూపకులవయోవిద్యావిశేషంబులు గలకన్యకారత్నంబులయాకారంబులు చిత్రపటంబుల వ్రాసికొని తెచ్చి యిచ్చిన వారికౌశల్యమునకు మెచ్చుచు రాజకుమారుండు నాచిత్రపటంబుల నన్నింటిని దిలకించి యాచిత్రలిఖితలనడుమఁ బండుటాకులలోఁ జిగురుటాకువలెను బుష్పంబులలోఁ బారిజాతంబువలె ననూనరామణీయక

త్వంబున నొప్పుదాని నొకయొప్పులకుప్పం గాంచి దానిరూపరేఖావిలాసంబుల కచ్చె రువు నొందుచు నాయందంపుంగని తనకు సుందరియయిన నపారసుఖాంబుధిం దేల నగు ననియెంచి ద్విజవరులం జీఱి యీవరవర్ణిని యేధరణీపతితనూజాత? దీనినామం బేమి? యని యడిగిన నాబ్రాహ్మణవర్యులు నోరాజచంద్రమా యీమందయాన భవద్భుజపరి పాలితంబగునీవిదర్భదేశమున నుండుసౌధచందననగరమున కధినాథుం డైనవిజయదత్తుని కూఁతురు; మదనమాలిని యనునామము గలది. ఆవిజయదత్తుఁడు కాన్యకుబ్జదేశాధిపతి యాత్మజాతయగు గుణమణిం బెండ్లాడి యామదవతియందు సముద్రుండు సారసవాసి నిం గన్నవిధంబున నీకన్యకామణింగనియె. ఆవిజయదత్తుండు నీ కత్యంతమిత్రుండ; నీ వీకమలలోచన ననురూపరూపవయోవిలాసవతిని పట్టమహిషిం జేసికొనుట కొంకించుకయుం నద్ధ్వము లేదు. అని చెప్పిన విని యాభూదేవులవచనంబుల కభినందించియుఁ దనమానసం బున నీమగువరూపము రతిదేవిసౌందర్యంబు నధఃకరించుచున్నది; వైదుష్యాదు లెట్టివో యెఱుకపడవు. వానిని బరీక్షించి సమ్మతంబు లైనం బాణిగ్రహీతిఁ జేసికొనియెద నని తలంచి యోచించి యొకపద్యార్థంబును బత్రికయందు వ్రాసి యిది కాకన్య యుత్త రార్థంబు వ్రాసి పంపెనేని గాంచి యది సరియైనచో నామదవతిం బెండ్లాడెద నని చెప్పి యావిప్రులచేతికిచ్చి యిదియాకన్యకచేత నిడి సమాచారము దెల్లిడిసేయుం డని ముదల యిడి పంపిన, నావిప్రులు సౌధచందనమునకుం బోయి విజయదత్తునియానతి వడసి కన్యాంతఃపురమునం జొచ్చి యచ్చెలువచేతి కాపత్రిక యిచ్చిన నామదనమాలినియుం నందు,

*శ్లో॥ నిరర్థకం జన్మ పరం నళిన్యా యయా న దృష్టస్తు హిమాంశుబింబః,

అని వ్రాసి యుండుటం గనుంగొని "తనమనంబున నేను నళిని యనియుం నారా జకుమారుండు తాను చంద్రబింబం బనియుఁ జంద్రబింబంబును జూడనినళినిజన్మము వ్యర్థమై యుండువిధంబునఁ జంద్రునికాంతివంటి కాంతిగలతన్ను వివాహమాడి తనతో సౌఖ్యమనుభవింపనిచో నళినివంటియతిసుకుమారశోభావతి నై యుండునాజన్మము వ్యర్థ మే; యనియుం నీపద్యార్థమునకు భావంబు గన్పడుచున్నది. ఇదియె యారాజకుమారుని భావంబుగాని యితరంబు గాదు. దీనికనురూపముగ నుత్తరార్థంబు వ్రాయ నగు" నని యెంచి యోచించి యాయక్షరపఙ్క్తికిం గ్రింద,

---

*యయా=ఏకమలినిచే, తుహినాంశుబింబః=చంద్రబింబము, నదృష్టః=చూడఁ బడదో, అట్టి-నళిన్యాః=తామరతీఁగెయొక్క, జన్మ=జన్మము, పరం=మిగుల, నిరర్థకం= నిష్ప్రయోజనము. చంద్రబింబమును గనుంగొనక యుండుటంబట్టి తామరతీఁగెయొక్క జన్మము నిష్ప్రయోజన మని భావము.

† శ్లో॥ ఉత్పత్తి రిందో రపి నిష్ఫలా హి దృష్టా వినిద్రా నళినీ న యేనన.

అనిద్రాసి యాపత్రిక బ్రాహ్మణులచేతి కిచ్చి వారల కపరిమితధనంబుల బహుమతులు గావించి పంపెను. వా రదిగొని విదర్భదేశాధీశునికడకుం జనుదెంచి యాపత్రిక యీ నదిచూచి యారాజచంద్రుండును దనహృదయంబునఁ "దొలుత నే నంపినపద్యార్థంబుచేత ననుం బెండ్లాడనిచో నారాజకన్యకారూపగుణాదులు వ్యర్థంబు లని సూచింపం జేసినందుకుఁ దా నారాజకన్యక వికసించియుండునళినిని జూడనిచంద్రునియుదయంబు నయితము నిష్ఫలమే యయి యున్నది యని వ్రాయుటవలన నగణితరూపరేఖావిలాసంబులు గలనన్నుం బెండ్లాడనిసీరూపసౌందర్యాదులును నీజన్మమును వ్యర్థమే యగు నను భావము నాకన్యక నాకు సూచితము సేయుచున్నది. ఇది సమస్తవిద్యలయందుఁ జతురరాలై యుండు ననుటకు సందియము లేదు. రూపం బెన్ననో లక్ష్మీసమాన మయి యున్నది. ఆకారమునకు సమానమగు ప్రజ్ఞ గలిగి యుండుట సహజధర్మ మని పెద్దలు సెప్పుదురు. ఈచందనగంధిని సహధర్మచారిణిం జేసికొని నాతారుణ్యంబు సఫలంబు సేయ నగు ననియెంచి యాద్విజవర్యులతో శుభలగ్నంబునం బయనమై సౌధచందనపురమునకుం జని విజయదత్తునిచే సత్కృతుండై యతఁడు పెండ్లిచేసి యిచ్చినమదనమాలినిని బాణిగ్రహణంబు చేసికొని సంతుష్టాంతరంగుండై తనశ్వశురుం డిచ్చినరథగజతురగపదాతులతోడను సర్వాభరణభూషితంబై యొప్పుచుమదనమాలినికి సమానవయోవిలాసాదులు

---

† వినిద్రా=వికసించియుండు, నళినీ=తామరతీఁగె, యేన=ఏచంద్రునిచే, నదృష్టా=చూడఁబడదో, అట్టి-ఇందోరపి ఉత్పత్తిః=చంద్రునియుఁదయమును, నిష్ఫలాహి=నిష్ఫ యోజన మేయగును. వికసించినకమలినిని జూడక యుండుటంబట్టి చంద్రునియుదయము నిష్ఫలమేయగు నని భావము.

ఇచట 'నళినికిని జంద్రునికిని సమాగమము సంభవింపదు. సౌందర్యమాలినీమానపాలురకు సమాగమము సంభవించి యున్నది. ఈయిరువుర కీయుపమానములు పొసఁగవని యాక్షేపము గల్గును. కాంతిసౌకుమార్యాదులచే మాత్రము కాంత నళిని కొప్పయిన దనియున్నట్లె కాంతిసౌందర్యాదులచేఁ గాంతుండు చంద్రునికొప్పయినవాఁ డనియు నిట్టి యనురూపనాయికానాయకులకు సమాగమము సంభవించె నేని తజ్జన్మములు సఫలము లగును గాని; కానిచో విఫలముల యగు'ననియుం నీయర్థము నళినీ, అనుచో స్త్రీలింగము చేతను బింబః అనుచోఁ బుంలింగముచేతను సూచింపంబడు ననియుఁ నిది యప్రస్తుత ప్రశంస యగుటంజేసి యీపద్యమునకు నాయికానాయకపర మైనయర్థమే ముఖ్యము గాని నళినీచంద్రపర మగునర్థము ముఖ్యము కాదనియుఁ జెప్ప నొప్పుం గాన నిది సమాధాన మూహించునది.

గలిగి యుండుదాసీగణంబులతోడను వరాభరణవస్త్రాదులతోడను దనవగరంబునకుం జేరి యాత్మభావానుపాలిక యైనభూమి కామదనమాలినిని పత్నిం జేసెను

ఇట్లామదనమాలిని తనకుం బట్టపుదేవి యగుటతాఁ జేసినసుకృతఫలం బని మానపాలుండును, మానపాలుండు దనకుం బ్రాణప్రియుం డగుట తా నోచిననోములపంట యని యామదనమాలినియుం దలంచుకొనుచుండుదురు రాజకుమారుండు సర్వవిద్యాచతురుం డని యాదేవికిని మదనమాలిని సర్వవిద్యావిశారద యని మానపాలునికిని దాసీజనులు వచించుచుండ నిరువురకును నవనవానురాగసుఖాంబుధిం దేలుటకు మనంబు లువ్విళులూరుచుండెను ఇట్లుండ జ్యోతిశ్శాస్త్రపారంగతులగు బ్రాహ్మణవర్యు లొక శుభదినంబున సుముహూర్తంబు నిర్ణయించి యది రాజునకు విన్నవింప నియోగిజనులందఱును దత్తత్సమయసముచితకృత్యంబులు నిర్వర్తింపఁ జేసిరి శిల్పివరులు శయనాగారంబున నతిమనోహరములగు చిత్రకర్మవిభూషితంబు లొనరించిరి సూర్యుండు నస్తగిరిశిఖరంబునకుం జేరిన దాసీజనులు రతిమందిరంబునం బూలపానుపు వఱచి కృష్ణాగరుధూపధూమంబులం ఘుమఘుమాయితంబు జేసి యుభయభోగోపకరణంబులు నిండించి మణిదీపంబులు పెట్టి చందనకాశ్మీరపంకంబులు నించినమణిమయపాత్రంబుల నునిచి రాజకుమారు నందుఁ బ్రవేశపెట్టిరి మదనమాలినిని ప్రియసఖీజనంబులు బలసికొని కొనితెచ్చి రాజకుమారు నెదుట నిలిపి కొన్నిపరిహాసవచనంబు లాడుచు పురపరంజెప్పుచు నొక్కొక్కతె యేదోయొక మిషంబున నయ్యెడ వాసి చనఁగ నొక్కచెలి తన్ను దృఢముగఁ బట్టికొనియున్న యన్నెలంత నను వదలుము వదలించి వెలికిం జనుదెంచి కటకటా నన్ను దలుపు మూసికొనిరే అప్పుడు మానపాలుండును మందహాసంబు సేయుచు లేచి శయనంబున కొంచుక దూరంబున లజ్జాకుల యగుచు నవనతముఖయై యుండు తనప్రాణనాయికం జేరం బట్టి శయనంబునకుం దార్చి యాప్యాయన రతిసుఖంబుల ననుభవించి యన్యోన్యగుణవిశేషంబులకు మెచ్చుచు నారాత్రి గడపి మఱునాఁడు మొదలుకొని యాగుణవతియుం దానుం గలరాగాతిశయంబున నంతఃపురమున నుండెను ఇట్లు కొన్నిదినంబులు గడచిన నొక్కనాఁడు రాజకుమారుండు తనదేవితో నేకతంబున సరసల్లాపములు సేయుచు భర్తృహరిని వంచించిన యనంగసేనావృత్తాంతము ప్రసక్తమయిన నందులకు,

* శ్లో॥ స్మరోపమ మపి ప్రాప్య వాంఛంతి పురుషాంతరం,
నార్యస్సర్వాస్స్వభావేన నోద్యంతే వ్యాకులాశయాః

---

* స్త్రీలు మన్మథోపముండగు పురుషునిం బొందియుఁ బురుషాంతరవాంఛ గలిగియే యుందురు. ఈ గుణము స్త్రీలకెల్లరకుందు వారలస్వభావము నిశ్చలమని యెవ్వరును జెప్పరు

అనుశ్లోకమును వచింప నందుకు మదనమాలిని యవ్వుచు,

† శ్లో॥ వినాయంత్రేణ మంత్రేణ తంత్రేణ వినయేన చ,
వంచయంతి నరం నార్యః ప్రజ్ఞాధన మపి క్షణాత్.

అని స్త్రీసామర్థ్యమును గుఱించి, యొకించుక వచియించె. అది విని రాజు తన మనంబున స్త్రీలు పురుషుని వంచించుట యెట్టు? మగనిని వంచించి మఱియొకనితోఁ బొందు సేయుటదప్ప మఱి యేమి వీరు సేయఁగలరు. అట్టిగుణంబును దదనుకూలలగు దూతికాదులవలన వారికిం గొనసాగును. అట్టివారిసమాగమము లేకుండఁ జేసినచో నాయబల లేమియు సేయఁ జాలరు. అరసి చూడ నీయింతి వచించినపద్యభావముచేత స్త్రీలకు సామర్థ్యము గలదని మాత్రము సూచితం బగుచున్నను నానుడివినపద్యభావంబు దినిచే నభ్యుపగత మైనది; గానం దరుణులకుఁ బరపురుషాభిలాష యుండుట సహజ మని తోఁచెడిని. ఇది కొనసాగకుండఁ జేయుటకు సాధ్యపడదా యేమి? అనియనుకొనుచు నది మొదలుకొని ప్రొద్దునఁ గాల్యకృత్యంబు లంతఃపురంబునన దీర్చికొని తాను సభాస్థలమునకుం జనుసమయంబుల నాదేవి వసించు భవనకవాటములు ముద్రితములు గావించుకొనిపోయి మరల సాయంసమయమునఁ దా నేఁగుదెంచి తలుపు దెఱచుచు నివ్విధముగఁ జరుపుచుండెను. ఆమదనమాలిని తన పెనిమిటి తా నుండుమందిరంబు కవాటములు ముద్రితములై యుండువేళల మితపరిజనమాత్రసహాయురాలై పంజరనిరుద్ధమగు నాఁడుచిలుకవలెనుండి తననాయకుండు సనుదెంచి తలుపులు దెఱచినయనంతరము తనయుండకుం జేరుచుండుసకలపరిజనవివహంబులఁ గొని భూపతికుమారునికిని తన్నుఁగలవారలకుం గావలసినపనులు కొనసాగించుచుఁ దనకుఁ జేయుచుండినని రోధమునం జేసి మానసంబున నించుకేనియు ఖేదంబుఁ జెందక పతిపాదశుశ్రూషాదులఁ దద్దయుఁ బ్రీతి మెఱయ నత్యాదరముతో సల్పుచు రాజకుమారునిమానసంబున కధికామోదంబుఁ గలిగించుచుండెను. ఇట్లు కొన్నిదినంబులు గడచిన నామదనమాలిని దనమనంబున,

చ. పరపురుషాభిలాష కులభామల కెందును గల్గ దద్ది యుం
దరుణులకుం జనించినను దప్పక జారుని గూడకుండ రీ
భరణిని జారకాములుభార్ష్య మడంపఁ గడంగు టెల్ల యా
సురకరిఁ బట్టి కట్టుటయ సూక్ష్మసరోరుహతంతుసంతతిన్.

మఱియు,

---

† స్త్రీలు యంత్రమును మంత్రమును తంత్రమును, వినయంబును లేక పురుషుని నెంత ప్రజ్ఞగలవాని నైనను క్షణమున వంచింతురు.

మ. పరలోకాదులకుం భయంపడుచు సద్భామాశిరోరత్నముల్
పరుఁ గూడంగఁ దలంప కుండెదరు పో ప్రఖ్యాతి వో నంచు నీ
ధరణిం గామిని జారుఁ గూడఁ గడఁగం దా నెంతవా రైన నూ
పురుషుల్ వారలతప్పుఁ బట్టఁ గల రే పూఁబోండ్లు సంసాధ్యలే.

అదియునుంగాక,

ఉ. జారరతిప్రసంగముల సారసనేత్రలు మానసంబులన్
గోరుచునుండుచందమునఁ గోరరు తా మితర ప్రియంబులన్
కోరికి దీరఁగాఁ బురుషకుంజరు జారుని. బొంది మోదముల్
గూరుట వోలెఁ గోమలులకు న్మది కింపొక టైన లే దిలన్
ఇట్టిసుఖంబు సుభగచరిత్రల కెట్లు లభింపఁ గల్గు?

ఉ. జారునితోడఁ బొందు సుఖసాగర మంచు శ్రుతుల్ వచించె నా
జారరతిప్రసంగములు సత్కులజాతకుఁ గూడ వంచుఁ దాఁ
గూరెను వేదసంచయము కోమలియున్ జతురత్వధుర్యయై
కోరినకోర్కెఁ దీర్చుకొను గుంభినిలోన ననిందితాత్మ యై.

చ. పరసతియంచు నుల్లమునఁ బాణిగృహీతకుఁ దోఁప నేర్పుమై
నరుదుగ నే మెలంగి తమినంతకు నంతకు వృద్ధి చేసినా
పురుషునిఁగూడి సౌఖ్యమును బొందుదు నివ్విధినైనఁ బాపముం
బొరయదు జారుఁ డైనపతిబొందును గందు ముదంబు నందుదున్.

అంతియకాదు,

ఉ. మానవతీమణుల్ మగలు మాన్యత తగ్గఁ జరించిరేని స
మ్మానితచాతురీవిభవమండితబుద్ధివిశేషసంపదం
బూనికఁ జూపుచు న్సరసపుంజము మెచ్చ నటించి మించి త
న్మానసముం గరంచి ప్రియుం మక్కువఁ దక్కఁగఁ జేయఁ జాలరే.

అట్లుగావున నిప్పు డేనును,

ఉ. చారురతిప్రసంగములు శాస్త్రవిరోధము నొందకుండఁగాఁ
బూరుషుమానసంబునకుఁ బోలు నటించును మెప్పు గల్గఁ గాఁ
జారుతరాత్మధీకలితచాతురి జాణలు సంస్తుతింపఁ గాఁ
గోరినకోర్కెఁ దీర్చుకొనఁ గోరెద నేర్పున నెట్టకేలకున్.

అని తలంచుకొనుచుం గొన్నిదినంబులు గడపి తనమనోవృత్తి నెఱవేర్ప ననువేమియుం గానక చింతించుచు నొక్కనాఁడు తనమందిరంబునం దెవ్వరు లేక యుండఁ

ప్రోద్దపోకకు శయ్యాగృహంబున నుండం దలంచి యచ్చోటికిం జని యామందిరంబు నందుఁ గుడ్యంబులపైన శ్రీకృష్ణమూర్తి శరద్రాత్రియందు వేణుగానముసేయ విని గోపికలు తమపతులం బరిత్యజించి రయేతెంచి యామురారింగలసినయతివినోదచరిత్రంబులును దారుకావనియందు రుద్రుండు తపసియిల్లాండ్రకు మరులు పుట్టించ వ్రతభంగంబుఁ గావించిన చిత్రకథలును దాపసకాంతలపైఁ దలంపుగలిగి యగ్నిదేవుండు తదీయవిరహవేదనాపరాయత్తచిత్తుండై యుండఁ దత్పత్నియగు స్వాహాదేవి యాయాఋషిపత్నుల యాకారంబులు దాల్చి తనపెనిమిటిం గలసినకథావిశేషంబులును మఱియు ననేకవిధ విచిత్రచిత్రంబులును దీర్చియుండుట నేత్రానందకరంబుగఁ గనుంగొనుచు నాచిత్రభావంబులఁ దనభావంబునకుం దెచ్చుకొని తనమానసంబున,

ఉ. బాళి సెలంగ శౌరి వ్రజభామలు గూడుట దారుకావన
స్త్రీలు గిరీశుఁ బొందుటయుఁ జిత్రతమంబులు గావు చూడఁ గ
లీల హుతాశుపాత్ని యమలీమసయై పరదార నంచు నా
వాలకము స్ధరించి సుఖవారిధిఁ దేలుట లిచ్చ మెచ్చ నౌ.

అని చింతించి యనంతరంబ,

గీ॥ నామనోహరశేముషీ నైపుణమ్ము, జారిణీధర్మ సంగతి సరసుఁడైన
పతికి విదితంబు సేయుదు భ్రీతము వాయ, వానితో నిష్టలీలల వన్నెఁగాంతు.

అని నిశ్చయించుకొని యామదనమాలిని తనమనోరథపసంబునం బోవ నను వార యుంచుండెను.

ఓపండితవర్యులారా! యంతకుఁ బయివృత్తాంతము కృతరూపా, శ్రుతరూపలసంవాదంబునం గొంతదనుకఁ దెలిసికొనవచ్చు. వారిరువురును మదనమాలినికి, దానిచెలియలికిని బ్రియసఖులు. వారిసంవాదంబు వినుఁడు.

కృతరూప ॥ ఓసీ శ్రుతరూపా నిన్నుం గాంచి యెన్నిదినంబు లయ్యెనే? నేను మనభర్తృదారికయగు మదనమాలిని మానపాలునికిఁ బట్టపురాణి యైనకారణంబున నా ప్రాణసఖియగు నాదేవితోఁ గొంతకాలంబునకు ముందు మానపాలునగరు సేరితిని. నీవు మదనవతికిం జెలికత్తెవు గాన సౌధచందననగరంబున నిలిచితివి. అందువలననే బహుకాలంబుగ మనకిరువురకు నొండొరులం జూచుకొన గూడకపోయె. ఏదేవతానుగ్రహంబుననో యిప్పు డిది సమకూరినందుకు సంతసం బింత యని యనఁజాలను. కరము కుతూహల మయ్యెడిని! ఇందు నాసందియంబుం బాపుము. భర్తృదారికయగు మదనవతిం బాసి యీయూరఁ గాఁపురంబు సేయ వచ్చియున్నమణిమంతునిభార్యయగు సౌందర్యమాలినికిం జెలికత్తెవై యుండునట్లు నీకు సంభవించుటకుం గారణం బేమి! ఆమదనవతి

తనసేస్తగత్తియలకు నించుకేనియుం భేదంబు జనింపకుండఁ బ్రవర్తించుచునుగుణగణంబులు గలదిగదే !సౌందర్యాదిగుణంబుల నెట్లో యట్లే మదనపతియు మదనమాలినికిం దక్కుం గలగుణంబులందును సమాన యనుట తదీయసఖీసమూహాస్సుప్రసిద్ధం బయినదియే కదా! వీ రిరువురును తమప్రాణంబులను నయితము సఖీజనంబున కివ్వం బూనుకొనువారలు. అట్లుండ నాయమం బాసి వచ్చుటకుం గతం బేమొకో! తెలియక యున్నది.

శ్రుతరూప॥ ప్రియసఖి! కృతరూపా! నీవచించినది పరమార్థంబు. ఒకవేళఁ బ్రాణంబులు వాసినను బాయవచ్చుం గాని మదనపతివంటిప్రియసఖిం బాయ మానసం బెవ్వతెకైన నొప్పునే?

గీ. జాగరంబున నిద్రించుసమయమందు, మదనపతిఁబాసి యుండంగ మనసునందుఁ
గోర్కి యుదయించునే నాకుఁ గోమలాంగి, మాకుఁగలభేదములు కాయమాత్రమంద.

కృతరూప॥ ఏమి చిత్రము !

క. ప్రత్యక్షంబునఁ గనియెద, వ్యత్యయ మీవచనములకు వనితరో నీవుక్
సత్యము వల్కెడుదానవె, కృత్యము వే అయ్యో దీనికిం గత మెదియో

గీ. మదనపతికిని చెలి యకాట మానుకొనక, యీవణిగ్జాయచెలి యకాట లెట్లు పొసఁగు
కొన్నిదినములనుండి యాకువలయాక్షి. యీపురంబున వర్తింతు రీవు నదియు,

శ్రుతరూప॥ స్మితసుధామధురంబుగఁ గృతరూపాముఖంబుం గనుంగొని శంకాతంకసంక్రాంతంబులగు క్రేఁగంటిచూపుల నెల్లయెడలం గడుకొనఁగ జేయుంచు నిటునటుం గాంచి మెల్లన, శ్రుతరూపా ప్రియసఖి రాజకులంబునం జరుగుచుండువృత్తాంతం బెఱుంగనిదానివలె నన్నడిగెదవు, నీవు నంతిపురంబున మదనమాలినికడ నుండెడుదానవే కదా?

కృతరూప॥ ఔను మదనమాలినితోడ రాజకుమారుండు వర్తించు కాలంబునన గాక వెఱసమయంబులందు నంతిపురంబునకుం బలుమఱు ప్రవేశింప ననువుపడక యున్నయది. అతఁడు తాను సభాస్థలంబున కేఁగునప్పుడు మదనమాలిని యుండునంతిపురప్పుం దలుపులు ముద్రించుకొని చనును. వచ్చినప్పు డంతిపురంబునన తానుండును. ఒక్కొక్కనాఁ డొక్కొకచెలికత్తెను దనరాణికడ నుండం బనుచు. ఇట్లు సేయుటంబట్టి యేవృత్తాంతంబు గాని మదనమాలినివలనం దెలిసికొన ననువుపడక యున్నది. కాన నాకు రహస్యవృత్తాంతంబు దెలియదు. ఇప్పుడు నీవు వెలువఱచినమంత్రంబు తంత్రసహితంబుగ నుపదేశింపుము.

శ్రుతరూప॥ ఈరహస్యంబు వెలువడిన ననివార్యంబగు కష్టంబు సంభవించు. కాన మనయిరువురమాట లషట్కర్ణంబులై యుండం జను.

కృతరూప॥ ఓచెలీ! యిట్టియర్థంబుల నాకు నీవు బోధింపవలయునటే! రాజకుల సంచారంబున నీవలె నేనును జాతుర్యధుర్యనై యుండెడుదానను గానా?

శ్రుతరూప॥ ప్రియసఖీ! ఔదువు. అందుకు సందియంబు లేదు. ఆత్మహృదయంబునకుసయిత మెఱింగింపంగూడనిదిగాన నీరహస్యంబునం గలగౌరవంబు నన్నిట్లు పల్కించుచున్నది. మదనమాలిని తాఁ బూనుకొన్నతంత్రంబు నీకుం దెల్పక యుండుటం జూడ సమయంబు దొరకక యుంటవలననే యని యనుకొన నగుం గాని యితరమువలన ననియెంచం జనదు.

ఈయర్థంబు నీకు ముఖ్యముగఁ దెలిసియుండం జనును. కానఁ జెప్పెదను వినుము. మానపాలుండు తనరాణిని నిర్బంధమున నుంచియున్నవాఁ డంతియ కాని యాచతురప్రవర్తించుజాడ లించుకేనియు నెఱుంగఁడు.

కృతరూప॥ ఉ. మానవజాతి గాని పెఱమానినులందు నశిక్షితోజ్జ్వలా
నూనపటుత్వవైఖరులు నొప్పచునుండఁ గఁ గానిపింపదే
జ్ఞానము బోధముం గలుగుజన్మముఁ గాంచినవారలందు సం
తానముఁ బ్రోచుఁ గా! పరభృతం బితరాండజజాతిచే ధరన్.

క. స్త్రీ లశిక్షితపాటవశ్రీఁ దనర్తు, రనుట యెఱుఁగక మగవార లాత్మలందు
నబల లంచును విప్రియ మాచరింపఁ, బూని కార్యాంతమున మోసపోవుచుంద్రు.

శ్రుతరూప॥ ప్రియసఖీ! బుద్ధిచాతుర్యం బనునది నీ సొమ్మయి యున్నది. నీనుడినపద్యంబులందు నేఁజెప్పంబూనుకొనువృత్తాంతం బంతయు సూచితంబ. అయినను మన నెచ్చెలియగుజాతరూపకుం గలచాతుర్యం బొకిం దెలిసికొన నసాధ్యంబు. వినుము. ఈ మనరాజకుమారునికిం బాలమిత్రంబును సామంతరాజకుమారుండును సహాధ్యాయియు నగుశ్రీపాలుం డనురాజపుత్రుండు దనదేవియభ్యర్థనం బంగీకరించియాయమం దోడ్కొని వచ్చి మానపాలునిచే సత్కృతుండై యీనగరంబునం దనప్రియురాలితోఁ గొన్నిదినంబులు వసియించియుండెనుగా! ఆరుచిమాలినిని మనదేవి మదనమాలిని ప్రీతిపురస్సరంబుగ హూకరించుటయుం నీకు విదితంబకదా! ఆరుచిమాలినితో వచ్చియుండినప్రధానసఖి యన జాతరూప.

కృతరూప॥ ఔరా! యేమి యీవింత? మనజాతరూప యటే అది! నెలదినము లాచతుర మనదేవికడకు వచ్చుచుం బోవుచుండినను నాకుం దెలియకపోయెనే?

శ్రుతరూప॥ ప్రియసఖీ యట్లు ప్రవర్తించినంగదా రహస్యం బుద్ఘాటితంబు గాక కార్యం బనుకూలించు?

కృతరూప॥ చెలీ యాజాతరూప భర్తృదారికయగు మదనవతికిం జెలికత్తెయై యుండెనే! అది రుచిమాలిని కనుంగుంజెలి యగుటకుం గతం బేమియే! ఇది వినఁ గడుఁ గుతూహలం బయ్యెడిని. వినిపింపవే!

శ్రుతరూప॥ ప్రియసఖీ చందనసౌధనాథునిరాణి గుణమణి దానిని రుచిమాలినికడకంపెను. కాన నాశ్రీపాలునిదేవితో నేస్తంబు జేసినయది.

కృతరూప॥ శ్రుతరూపా! మనరాణి గుణమణి దాని నక్కడ కేల పంపె?

శ్రుతరూప॥ మనప్రతాపపాలునిరాణి గుణమణి తనకూఁతునిర్బంధబు విని చింతించి యను వారసి జాతరూపం బిలిచి యోసి నీవు నీచమత్కారంబు మెఱయ నా ముద్దులపట్టి మదనమాలినికడకుం జని యేకతంబ దానితో నాలోచించి దానిమనోగతార్థంబు విచారించి వచ్చి నాకుం దెలిపెదవేని నీకపరిమితధనంబు లొసంగెదను. మదనమాలినిని దానిపతి కడు నిర్బంధంబునం బెట్టియున్నాఁ డని విందు. ఇందుచే మానసంబున సంతాపంబు గలిగియున్నది. కరము పతినిర్బంధములకు లోనై చేయునదిలేక నాసుత యెంత సంతపించుచున్నయదియో? నీవు రాజకులసంచారకుశలవు. ఈయర్థం బెఱుంగుటకు నీకంటెం జతురలు లేరు. అని చెప్పి దానికిం గొంతధనంబు నొసంగిన నది గైకొని జాతరూప తనమనంబునందు నిట్లు చింతించె. నేను మదనమాలినికడ కిత్తెఱంగునం బోయిన మానపాలుండు నన్నును బూర్వ మియ్యెడనుండి చనినచెలులవలె నాదేవికడకుం జేరనీఁడు మదనమాలిని వారలం జేరనీఁ జన దని యెంచియున్నవాఁడు. అతనిమనంబున సంశయంబు జనింప నీక మెలంగుచు నిషేధింపఁగూడనివిధంబునం జేరవలయుం. అందుల కాజేనికి గౌరవాదులం దుల్యుండును ప్రియవయస్కుండు నైన శ్రీపాలునిరాణికడకుం జేరి మదనమాలినిం జూచుట కాకాంత కుత్సాహంబు పుట్టించిన ననువుపడును. ఆశ్రీపాలునిరాణి రుచిమాలినికడకుం జేరిన నుద్దిష్టకార్యంబు సమకూరక పోదు. అని విచారించి గుణమణి కాయర్థంబు విన్నవించి యభినందితయై తదాజ్ఞం గైకొని సౌధచందననగరంబును బాసి చని శ్రీపాలునిపత్తనంబుం బ్రవేశించి రుచిమాలిని సుగుణవంతురాలు గాన నాయమచే నాదరింపంబడుచు నాదేవికడ నుండి మదనమాలినిగుణంబు లభివర్ణించి చెప్పి యామెం జూడఁ గుతూహలంబు గల్పించి యారుచిమాలిని తనభర్తను బ్రోత్సాహపఱుప నాశ్రీపాలునితో నేతెంచిన యతనిరాణిని వెంబడించుకొనివచ్చి యిం దుండి రుచిమాలిని యందుం దదీయసఖులయందును మానపాలునికి సంశయంబు గలుగుటకు హేతు వేమియుఁ గనంబడదు గాన నారాణితోడ మదనమాలిని కడ కప్పుడప్పుడు సనుచు జాగరూకతమెయి సమయం బారయుచుండి దైవఘటనచే దొరకినరహస్యస్థల సమ్మేళనంబునం దనరాకయుఁ గుణమణి తన్నుం బంపుటయుం నెఱింగించి యాదేవి నెప్పి

పంపినయర్థంబు లెల్లఁ దెలియం జేసి యప్పు డామదనమాలిని తనజననికిం జెప్పు మని నుడివినయర్థంబులం గ్రహియించి రుచిమాలినితోఁ దన్నగరంబునకుం బోయి సౌధచంద నంబునకుం జనుదెంచి గుణమణికి వృత్తంబుం దెల్పినయది.

కృతరూప॥ ఔరా జాతరూపసామర్థ్యం బేమందును. రాజకులంబు సేరినవాటం గోలె నలిచతుర యని పేరు వడసినయది. దానిచాతుర్యశ్లాఘన మటుండనిమ్ము. జాతరూపతో మదనమాలిని యేమి సెప్పి పంపినది. తనసుగుణములగు కార్యంబు లిప్పు డేమి జరుగుచున్నవి. ఇంతకుం బూర్వ మేమి జరిగినవి.

శ్రుతరూప॥ ప్రియసఖి! మదనమాలిని యేమి సెప్పి పంపినదియో యాజాతరూపకుం గాక మఱి యెవ్వ తెకుం దెలియదు. ఇంతకుం బూర్వంబునం జరిగినపనులు క్రమంబునం దేటపడం గలవు. జరుగుచుండువృత్తంబు వినుము. మణిమంతునిభార్య సౌందర్యమాలిని వృత్తాంతంబును దానిగుణగణంబులు నీకుం దేటపడి యున్నయవి కదా?

కృతరూప॥ చెలీ దానివృత్తాంతం బెఱుంగను. కొంద ఱామందయానచెలులు రాజకులసంచారంబునం జనపు గలవార లప్పుడప్పుడు మదనమాలినీమానపాలురసమక్షంబునం దదీయసౌందర్యాదులు వర్ణించి చెప్పుచుండఁగా వినుదును. ఆమదవతులు సెప్పెడి వచనంబులు వినుము.

గీ॥ మదనమాలినిసౌందర్యమహిమ యెన్నఁ, దనరు సౌందర్యమాలిని యనఁగ నదియు
మదనమాలిని యనఁ బోలు మానవతుల, నొక్కపడియచ్చునం జేసె నొక్కయజుఁడు.

అని యివ్విధంబున నావణిక్పత్నీ సౌందర్యాదులు తదీయసఖులు వర్ణించి చెప్పుచుండుదురు. మానపాలుండును మానసంబున ననురాగంబుతో వినుచుండుట మదనమాలినియు మేమును గ్రహించితిమి. ఏకారణంబుననో యెఱుంగము; సౌందర్యమాలిని గుణవర్ణనంబునం బులక లెసఁగు మేనితో ననదృశమగు సాభిముఖ్యంబుతో వినుచుండురాజకుమారునిం గాంచి యసూయపడక సారెసారెకుఁ దద్గుణవర్ణనంబునకు వారలం బ్రేరేపించుచుండు. మదనమాలినియెడం గలుగుభయంబునం జేసి ప్రకాశింపం జేయఁ డంతియ కాని రాజకుమారుండు సౌందర్యమాలినియం దమందానురాగంబుతో నుండెడిని.

శ్రుతరూప॥ నవ్వుచు, ఓచెలీ సౌందర్యమాలిని మదనమాలినియే గాన నట్లను రక్తుం డయినవాఁడు గాని పరస్త్రీ లన్నం దనసహోదరీమణులుగ భావించునీతండు పరదారానురక్తుం డగునే?

కృతరూప॥ ఓసిచెలీ! ఏమేయీవింత! సౌందర్యమాలిని మనమదనమాలిని యఁటే?

శ్రుతరూప॥ ప్రియసఖి ఔను! మనమదనమాలినియె సౌందర్యమాలిని యను పేర మణిమంతునియింట నున్నయది.

వినోద—3

కృతరూప॥ ఓసీ యేమే యీమోసము? మనమదనమాలిని పతివ్రత యని యనుకొంటినే! మానపాలుని వంచించి మణిమంతునితోఁ బొందొనర్చుచున్నదఁటే. ఆహా యేమందును. సత్కులసంజాతలగు కన్యకలే యిట్టికట్టిడితనంబున కొడిగట్టినం బెఱయతివలనే మనం బోలు? పరపురుషాభిలాషగల పడఁతులను బాఱంజూడనైనం గోరనియీరాజకన్యక కిప్పు డీదుర్బుద్ధి గలుగుటకు వగచుచున్నదానను. పిన్ననాఁటంగోలె సుగుణగణంబుల కాటపట్టైనగుణమణిముద్దుపట్టి కిట్టిచెట్ట యెట్టు లుట్టిపడెనే? ఈదుర్మార్గంబునం బ్రవర్తింపం జేయువారలు సమీపవర్తిను లెవ్వరునుంగనంబడరే! కష్టము.

శ్రుతరూప॥ ప్రియసఖి మదనమాలినికడ నిట్టిదుర్గుణంబులు కలయందైనం జేరవు. ఈమాట సత్యముగ నమ్ముము. సమస్తశాస్త్రవిత్తములగు పండితసత్తములకడ గురుజనాజ్ఞ ననేకశాస్త్రంబులు ధర్మశాస్త్రంబులతోఁ జదివినయీమదనమాలిని కీ చెడుగుణంబు గల్గుననుట యెట్టిది? అట్లు దలంపకుము పాపము.

కృతరూప॥ (సంశయంబుతో,) ఓయమ్మ నీమాటల కర్థంబు సంగతంబు గాకయున్నయది. మదనమాలినియే సౌందర్యమాలిని యనుపేర మణిమంతునింట నున్న దనియంటివి. మదనమాలిని కడ నిట్టిదుర్గుణంబులు కలయందైనం జేరరా వనియెదవు. ఈపరస్పరవిరుద్ధంబులగు వచనంబుల కర్థంబు స్ఫురింపకున్నయది.

శ్రుతరూప॥ ఓసి సంశయాపన్నమానసురాల ప్రవృత్తం బగుచుండువృత్తంబునం గలరహస్యంబు నీహృదయంబునందు స్ఫురింపలేదు. అది వినుము. అని కృతరూపచెవిలో నొకరహస్యంబు సెప్పి యిట్లనియె. ఓసి చెలీ యివ్విధంబునం జనుదెంచియుండెడువాఁ డీమణిమంతుం డనువైశ్యకుమారుండు. ఇతరుండు గాఁడు.

కృతరూప॥ (సంతసంబుతో) ఔరా సంవిధానచాతుర్యంబు కరంబు శ్లాఘ్యతరంబై యున్నయది. కాఁబట్టియే మణిమంతునియెడ నట్టియనురాగంబు రాజకుమారునికిం గల్గియున్నది. ఈరహస్యంబునకు భేదంబు గల్గు ననియ కాఁబోలు నావణిక్కుమారుండును దనకు సంవత్సరసమాపనీయమగువ్రతంబు గలదనియు నందు నితరాంగసంస్పర్శంబు పరిహారణీయం బనియుఁ జెప్పి సంతోషకాలంబులందు రాజొనరింపం గడంగునాలింగనాదులను గరగ్రహణంబులను బరిహరించుచు వచ్చుచున్నవాఁడు. ప్రాయికముగ భోజనాదికృత్యంబులు సయిత మొకయెడఁ దీర్చుకొనునంతటి ప్రేమభరంబు వీరలకుం గల్గుటకు నిరువురు నొండొరులకు సమానరూపగాంభీర్యాదులును విద్యావిశేషంబును గలవు గాననదియ హేతు వయ్యె. మఱియుం నొండొరులు మొగంబుఁ జూచుకొన్నవేళావిశేష మట్టిది యని వీరలవర్తనంబులు గాంచినవార లనుకొనుచున్నవారు. ఇప్పు డీమణిమంతుని రూపరేఖాతిశయమున్న రాజకుమారునిమానసంబు ననురాగపరవశంబు సేయంజాలు నను

నర్థంబున సందియం బెడబాసినయది. కరంబు కుతూహలం బయ్యెడిని. ఈమణిమంతుండు తొలుత మానపాలునికడకుం జేరినవిధంబు వినం గోరెదను; వచింపుము.

శ్రుతరూపా॥ ప్రియసఖి వినుము. ఈమణిమంతుండు తననగరమునుండి కతిపయప్రయాణంబుల నీనగరంబున కేతెంచి తనతోడవచ్చినవమ్ము నీనగరబహిరుద్యానంబున నిలిపి తా మానపాలునిసభకుం జనియె. మానపాలుండు నాతనిం గాంచి యతనిసౌందర్యాది గుణంబులకుం బ్రియంపడి యనురాగంబు మెఱయ నభ్యుత్థానంబు గావించి యుంచితాసనముం గూరుచుండం బనిచి కుశలం బడిగి యిట్లనియె. ఓసౌభాగ్యవంతుఁడా నీవెవ్వండవు? నీనామంబునం దగిలి కృతార్థతం గాంచినయక్షరంబు లెవి? ఏపట్టణంపుజనులు సంతతము నిన్నుం గాంచుచుండుభాగ్యం బొనర్చినవారలు! ఏసహాయంబు నావలనం బడసిన స్నానందాంబునిధిం దేలం జేసెదవు? మన్నగరంబున నుండి నన్ను సహాసంచారసంభాషణాదుల ముదితునిం జేయ దయచేయందే! యనిన మణిమంతుం డిట్లనియె. ఓదేవా మానపాలమహారాజా యేను మణిమంతుండను వైశ్యకుమారుండను. నే నుండునది యుజ్జయిని. రత్నవర్తకము సేయుచుండువాఁడ. తన్నిమిత్తంబుగం బెక్కునగరంబులందు సంచరించుచుందును. విదర్భదేశాధీశుండు మానపాలుండు సకలసద్గుణసంపన్నుం డనియు దయామయుండనియుం దీనజనావననిరతుం డనియుం రత్నపరీక్షణంబున నతివిచక్షణుం డనియు నీయశోవైభవంబెల్లచోఁ గీర్తింపంబడుచుండ నది విని భవద్దర్శనంబు చేసి కొన్ని దినంబులు భవత్సాహచర్యంబునం గృతార్థతంగాంచుచునాఁగొని తెచ్చినయనర్ఘరత్నంబు లమ్ముకొనుచు నీనగరంబునం గొన్నిదినంబు లుండం గోరి వచ్చియున్నాఁడ. నాఁగొని తెచ్చినరత్నంబులు చోరగ్రస్తంబులు గాకుండ వీరభటసురక్షితంబై యుండు నంతఃపురసమీపవర్తిసౌధంబున నన్ను విడియించి మత్కాంతాజనంబుతో నుండుటకు నిర్బాధంబు గావింపవలయుఁ నని యడిగిన విని రాజకుమారుండు కరంబు సంతసించి యతని కాంతాజనంబు వసింపందగినచో టని మదనమాలినీసౌధసమీపంబున నుండెడునున్నత హర్మ్యంబున నతని నుండం బనిచె. అంత మణిమంతుండును మమ్ముం దోడ్కొని చని యందుఁ గాఁపుర ముంచెను. మణిమంతుండును నాఁటంగోలె నందు వర్తించుచు రాజసభకుం బోవుచు నందుం గొంతకాలంబు వసించుచు రాజునకు సమ్మోదావహంబుగఁ బ్రవర్తించుచున్నవాఁడు. ఈ మదనమాలిని తనమగం డంతిపురంపుందలుపుల ముద్రితములు గావించుకొని సభకుం జనునప్పుడు రాజకన్యకానైపథ్యంబు నెడల్చి వణిక్కన్యకావేషధారిణి యై మణిమంతునిసౌధంబునకు వచ్చి యందుండి పతి యింటి కేఁగుదెంచుటకు ముంద యంతఃపురంబునం బ్రవేశించు.

కృతరూప॥ చెలీ మానపాలుండు తాఁ జనునప్పు డంతఃపురకవాటంబులు ముద్రితంబులు గావించుకొని చనుచున్నవాఁడుగదా! అట్టుండ నంతఃపురంబు వెడలి వచ్చుటను మదనమాలిని కవకాశం బేది?

శ్రుతరూప॥ ప్రియసఖీ యాదేవి తా నంతిపురంబు వెడలివచ్చుట కుపాయవిరచనంబు సల్పియున్నది. తనకూఁతురు మదనమాలిని జాతరూపతోఁ జెప్పి పంపినప్రకారము గుణమణి తన భర్తయగు విజయదత్తునికిం జెప్పి తన్మూలకముగ నొక యసదృశప్రజ్ఞావంతుండగు శిల్పివరునిం బనిచెను. వాఁడును విదర్భాధిపతికడ కేఁగుదెంచి యాతనిచేఁ బ్రియపూర్వకంబుగ నభినందితుం డై తనకుంగల శిల్పభేదంబులందలి నైపుణ్యంబుం దెలుపుచు జలమధ్యమండపనిర్మాణచాతుర్యంబును విన్నవించిన నది విని రాజు మదనమాలినీమందిరోపవనకల్హారసరోవరాంతరంబున నీ శిల్పనైపుణ్యంబుఁ బ్రకాశింప నొక మణిమండపంబు నిర్మింపు మన వల్లె యని యాశిల్పి యామండపంబుం గట్టుచుం దదంతరంబున బహిర్ద్వారం బేర్పఱిచి యొకసురంగంబు మదనమాలినీసౌధాంతరంబునకుం జనునట్లుగాఁ గావించి యంతర్బహిర్ద్వారంబులు కరము రహస్యంబుగఁ గల్పించి మదనమాలిని కదిసెప్పి వెడలివచ్చి తేనివలన బహుమతులు వడసి విజయదత్తుని నగరంబునకుం బోయెను. ఆ సురంగద్వారంబున నిర్గమించి వచ్చి మదనమాలిని మణిమంతుని యింటం జేరుచున్నయది.

కృతరూప॥ ఓసీ మదనమాలిని మానపాలుని మోసపుచ్చుటకు మంచి యుపాయము గాంచినది. చతురలలో నతిచతురగా నున్నది యీ మదనమాలిని!

శ్రుతరూప॥ ప్రియసఖి యాదేవిచాతుర్యం బేమి గంటివి. ఒకనాఁడు రాజకుమారుండు భోజన మొనరించి కార్యత్వరచేతం దనకనకోత్తరీయంబు మఱచి కవాటముద్రణంబుం గావించి సభకుం బోయె. ఆ యొల్లియంగొని చని మణిమంతునికిచ్చి యిది ధరించుకొని యెదురనిలిచిన నిన్నుంగాంచి యేలిక యేమనుకొనునో! చూతము. అని చెప్పి పంపిన మణిమంతుండు దాని ధరించుకొని కొలువుకూటమునకుం జని యందుచితాసనంబునం గూరుచుండెను. రా జది గాంచి తన కనకాంబరం బితనికడకుం జేరుటకు గతం బేమొకో యని చింతించి యడుగం దలంచియు నీతండు శ్రీమంతుండు గాని పేద గాఁడు. ఇట్టి సువర్ణాంబరం బితని కుండం జనదా! యని యాతలం పుడిగి మదీయోత్తరీయం బంతఃపురంబున లే దేని యీతని నడుగుదమని యూరకుండెను. మణిమంతుఁడును రాజు చే సత్కృతుండై తన కింటికిం బను లున్నవని చెప్పి రాజాజ్ఞవడసి వైళంబ గృహమునకుఁ జనుదెంచె. వెంబడిన దానిం దీసికొనివచ్చి మదనమాలిని యథాస్థానంబున నునిచెను మఱికొంతతడవునకు రాజు నేఁగుదెంచి యథాస్థానస్థితంబై యున్న సువర్ణాం

బరంబుం గాంచి యాహా! మానసం బవిషయంబునం బాపంబు శంకించు నన్నమాట యసత్యంబుగాదు! ఏను ద్వరపడి యా వర్తకుని నీ బంగారపుంబట్టంబు నీ కెక్కడిదని యడిగిన మానభంగంబు గల్గక పోవునే? ఎప్పటికిఁగాని త్వరపడక యాలోచించి చేయుపనులవలనఁ జెట్టసంభవింపదు. అని యెంచుకొనుచుం దనకుఁ దాన సమాధానంబుఁ గావించుకొనియె. మఱియు నొకదినంబున రాజు తాను ధరించుకొనునవరత్నహారంబు మదనమాలినిశయనంబున మఱచి సభాస్థలంబునకుం జనిన రాణి యాహారంబుం గొని తెచ్చి యీ దానిం దాల్చి మణిమంతుఁడు రాజుకడకుం బోయినం గనుంగొని శంకించి ఱేఁడు రత్నవర్తకునికడ నిట్టి యనర్ఘమణిహారం బుండం జనదా! యని సమాధాన పెట్టుకొని తా నేఁగుదెంచునంతలో యథాస్థానంబున నునిచియున్న తన యాదండం జూచి మనస్తాపం బుపశమింపం జేసికొనియె.

కృతరూప॥ ఓచెలీ రాజు తనభార్య యితరానురక్త యగునేమొ యని మనంబున శంకించుచుండువాఁ డగుటంజేసి యీ సందేహంబులుఁగల్గె నంతియ కాని నిర్మలహృదయుం డైనం గలుగునే? అది యట్లుండ రాజకుమారుండు వణిక్పుత్త్రీరూపరేఖావిలాసాపహృతహృదయుండై యున్నవాఁ డంటివే! యా యర్థ మెట్లు జరుగుచున్నది?

శ్రుతరూప॥ మదనమాలినియాజ్ఞానుసారిణి నయి నేను సౌందర్యమాలినిప్రతి బిబంబు చిత్రఫలకంబున వ్రాసి యొక్కదినంబునం గొనిచని రాజకుమారుని కిచ్చితిని. దాని నతిప్రేమగౌరవంబునం గైకొని నాకు బహుమతు లొసఁగి నన్నంపి యా చిత్రఫలకంబునందు సౌందర్యమాలినితోఁ దన్ను లిఖించుకొని యనారతంబును గాంచుచుండు. మదనమాలిని యతనిచేతనుండు చిత్రఫలకంబుం గాంచి యిదెవ్వతె? యని యడుగ నీవేయని రాజు బదులు సెప్పెనఁట. సౌందర్యమాలినింజూడ రాజపుత్త్రుండు కరము కుతూహలంబు నొందియున్నవాఁడు.

కృతరూప॥ అతండు మిత్త్రదార యనియుం నిందుచే నయశంబు గల్గుననియుఁ దనమనంబునం దలంచి యంతకంతకు సంతాపం బతిశయింపం, జేయునది లేక యున్నవాఁడని తోఁచెడిని.

శ్రుతరూప॥ చెలీ రాజకుమారుం డూరకుండలేదు. మన మానపాలుండు ప్రకృతులకష్టసుఖంబులను వాంఛితావాంఛితంబులను దెలిసికొనన్ వేషాంతరధారియై ప్రచ్ఛన్నంబుగఁ బత్తనంబున సంచరించుట గలదు గదా? అప్పథంబునం బోయి సౌందర్యమాలినిం గనుంగొనఁ బ్రయత్నపడి యాపెన ముదయసమయంబున వేఁటకై చనునట్లు తదుచితంబులయిన బలంబులతో వనంబునకుం జని యున్నవాఁడు. తనతో వచ్చిన వారల నొక రహస్యస్థలంబున నా యరణ్యమం దుండం బనిచి వేషాంతరధారియై పత్త

నంబునను రాఁగలండు ఇట్లు వచ్చెడువారలు నగరవృత్తాంతం బారయుట కనువయిన
చోటు పురబహిస్థల స్థితంబగు పద్మసరోవరం బనుకూలమైనయది గాన నయ్యెడకు వచ్చి
చేరుము వణిక్పత్నియు జలాహరణవ్యపదేశంబున నయ్యెడకుం బోవ నమకట్టి సర్వా
భరణభూషిత యై వెడలి పోఁబోవుచున్నయది మణిమంటపంబు నేయించిన క్రొత్త
బొమ్మలను గ్రొత్తగ చేయించినసరిగెబుటేదారుచీరయుం దాల్చి వణిక్కన్యకానైప
థ్యంబులో మన మదనమాలిని కటీతటవిధృతకనకఘటయై వెలువడం బోయెడిని
సురాసురుల కమృతంబు వంచిపెట్టుటకు జనుదెంచిన మోహినికైవడిందోఁచు మదన
మాలినిం గాంచి కాంచనాంగులునయుతము మరులు గొనుదురు అట్టిందరం బురుషుం దన
వెంత! ఈ మదనమాలినీమానపాలురు వేషాంతరధారులై యొకచోటం గూడినప్పుడు
కొన్ని శ్రవణపేయంబులు జరుగకపోవు ఇరువురు నతిచాతుర్యవంతులు అపరిమితాను
రాగపూరితహృదయులు వీరి సమాగమంబు కరము మోదకరమై యుండకపోదు నేనును
వణిక్కన్యకతో నేఁగవలయు ఆ దేవి ప్రయాణసమయంబును సమీపించినయది ఏఁ
జనవలయును నీవును నమరాదితకృత్యంబులందు జాగరూకతతో మెలంగుచుండుము
మనము మదనమాలినిసఖులమగుగానఁ దదనురోధంబునన యుండవలయు ఏఁ బోయి
వత్తును

కృతరూపః॥ ఈ దినమున వేషవన రాజా వెడలిపోవుట యేతన్నిమిత్తమా! వీ
రియువురు పరస్పర వంచనాచణులై ప్రవర్తించుచున్నవారు! మదనమాలినియే జయంబు
నొందంగలదు ఇందు నాయకుని యభీష్టాంతరంబును సమకూరదు అంతఃపురమునం గాచి
యుండవ రాజాముద్రల యమ్మినది గాన నేను నయ్యెడకు రాఁ జనదు ప్రియసఖి పోయి
మరలవచ్చి జరిగిన వృత్తాంతంబు నాకుం జెప్పుము అంతఃపురంబుం గాచియుండ నేనును
జనవలయునని మాటలాడుకొని వారు యిరువురును తమ కార్యంబులకుం జనిరి

అని చెప్పి మిత్రసహుండు పండితులం గాంచి యిట్లనియె ఇంక నా మదనమాలిని
వణిక్కన్యకావేషంబున రాజసుతుని వంచించినవిధం బతిరమణీయం బది వినుండు.
ఇట్లా దేవి వణిక్కన్యకామణి నైపథ్యంబుం దాల్చి బంగరుబిందె గటీతటంబున నిడికొని
జగన్మోహనంబై యొప్పు తనరమణీయత కచ్చెరువంది విస్మయోత్ఫుల్లలోచనంబులతోఁ
బ్రజలు చూచుచుండ జగంబులం గెల్వ విడిచిపుచ్చిన మదనుని మదవంతి చందంబునం
బోఁచుచు మణిమంతునిగృహంబు వెడలి తన ప్రాణతుల్యలగు సఖిమణులు మనోహర
వేషాలంకృతలై బలసికొని రా సాయంసమయంబునం బురబహిస్థలంబునం దభలనగర
కాంతలు జలాహరణార్థం బరుగుపద్మసరోవరసమీపంబునకు బోయి తత్సమీపంబునం
దననాయకుండు విప్రకుమారకవేషంబున సన్నిహితుం డై యుండటం గనుంగొని యతి

విశాలధవళంబు లై యమృతరసనదీప్రవాహపరీవాహంబు లై యంచిత లజ్జాసంకుచితంబు లై యనూనమనోరాగసూచకంబు లై యొప్పువాలారుఁజూపులం జూచి దవ్వుల నుండి తన్నుం గాంచుచున్న కపటవిప్రకుమారు మానసం బుర్వెత్తుగ హరించెను. మఱియు లోకోత్తర సౌందర్యశాలినియగు నా మదనమాలిని సౌందర్యంబుఁ గాంచి జలాహరణార్థంబు సనుదెంచియుండుతరుణులు మనంబుల నచ్చెరు వొందుచుండ సాయంసంధ్యాసమయసుఖమజ్జనంబుగావింపఁ వచ్చియున్నపురుషులు తాము తమ తమకృత్యంబులు మఱచి లజ్జయేది దేహంబులపై స్మృతులు లేక చేసినపనులు మరల మరలఁ జేయుచు నత్యాశ్చర్యమగ్నమానసు లై భ్రమించుచుండ నా యండజయానం గాంచి మానవపాలుండు నీ తరుణీవతంసంబ మణిమంతునికామిని యై యుండనోపు ? మదనమాలినిసౌందర్యంబు దీనియందుఁ బడియచ్చునవోత్తినవిధంబున నున్నది యని దాసీజనంబువలన నే విన్నమాట సత్యంబు. అని తలంచుకొనుచుండ మదనమాలినియుం విలాసంబు మెఱయం జని యంతకుమున్న యా సరోవరావతారంబుకం దిగి సాయం సమయమజ్జనం బాచరించునట్లు నటించుచు నా కపటవిప్రుండు దిగియుండుచోటికిం దఱిసిన నయ్యంగనామణిం గాంచి మించినపంచశరశరవేదనకుం బాల్పడి భూపాల కుమారుండు తనమనంబున నయారె యీ యొయారియాభిరూప్యం బేమని చెప్పంగలను,

సీ. లలిత మై మాంగళ్యలక్ష్మీనివాస మై తద్దయు సొబగొందుముద్దుమోము
కడు దస్సి గ్రుస్సియుఁ బిడికిటి కణఁగి జవ్వాడుచుండెడునన దైననడుము
పిఱుఁదులక్రిందికిఁ బెరిఁగి నల్పెక్కుచుఁ గౌటిల్యము వహించుకచభరంబు
కడు సాఁగి సోగ లై కాంతి వెల్లు బ్బెడునతివిశాలం బైనయక్షియుగ్మ
మరుణకాంతులు గ్రమ్మెడుహస్తతలము, లతులమార్దవ మొప్పారునంగకములు,
చారుసుమమాల్యములవంటి బాహుభుజము, లందగింపఁ జెలంగుఁ బూర్ణేందువదన.
మఱియును,

చ. నడిచిన రాజహంస మని నమ్మఁ దగుక్ సరి పల్కి పల్కినక్
వడిగల మారుతేజి యని వర్ణనసేయఁగ నౌను నవ్వినక్,
గడుకొని చంద్రచంద్రికలు గా మదిఁ దోఁచును దేఱి చూచినక్
బెడఁగుకురంగి యే యనుచుఁ బెక్కుతెఱంగుల నొప్పుఁ జెప్పఁగన్.

ఔరా యీరామామణి నాయుండుచోటికిం దరిసి తటుక్కునం బోడసూపినప్పుడు,

ఉ. అంచితచంచలాలతిక లంతటఁ గ్రమ్మఁగ సాఁగెఁ గాంతిచే
సంచితమల్లికప్రకరసౌరభము ల్వెదచల్లె నంగముల్

నించెను గృష్ణసారరమణీనయనభ్రమ వాలుఁగన్నులన్
మించెను రక్తపద్మరుచి మేదినిపై పదపల్లవచ్ఛవిన్.

అని యనుకొని మఱియును దనలోన,

ఉ. ఈరమణీమణిం గలయ కిక్షుశరాసనసాయకోత్కరా
సారదురంతతాప మది శాంతిని జెంద ది దేటిమాట యీ
సారసనేత్ర యెన్నఁ బరసాంకవగంధియు మిత్త్రదారయుం
జేరఁగ నౌనె దీని నిఁకఁ జేయున దేమియొ తోఁచ దాత్మకున్.

అని చింతించుచుండ నామదనమాలిని యొకకరపల్లవంబునఁ దనపాదములపయిం జీరాడుచుండుసరిగెపావడకుచ్చెలలు మదనునివిజయకాహళీయుగళసంకాశ మగుజంఘాద్వయంబుపై కెత్తిపట్టుకొని జలంబులం దిగి కనకకలశయుగళసంకాశపీవరపయోధరంబు లొండొంటి నొరయ బంగరుకడవ జలంబులపై నునిచి మణివలయఝుణఝుణధ్వానముఖరితంబుగ నూఁచి యూఁచి ముంచె. ఆసొంపు తనమది కింపుఁబుట్టింప మానపాలుండు,

శ్లో॥ * తిష్ఠంతీ జానుదఘ్నే పయసి నివసనప్రాంత ముత్సారయంతీ
కించిల్లక్ష్యోరుకాండా ముఖరితవలయం కుంభ మగ్రే ధునానా

---

* కాపిబాలా=ఒకపడుచు, జానుదఘ్నేపయసి=మోకాలిబంటినీటిలో, నివసనప్రాంత ముత్సారయన్తీ=పావడచెఱఁగుపైకెగఁద్రోసిపట్టుకొనుచు, కించిల్లక్ష్యోరుకాండా, ఒకించుక బయల్పడుచుండునూరుకాండంబులుగలదియై, తిష్ఠంతీ=నిలుఁవంబడి, ముఖరితవలయం=కరకంకణంబులుధ్వనించునట్లు, అగ్రే=ఎదుట, కుంభం=కడవను, ధునానా=ఆందోళనముసేయుచు, స్నాతాన్=మజ్జనమాచరించినవారై, స్వాలోకసక్తాన్ = తన్నుఁగనుంగొనుటయంద యాసక్తిగలిగినవారగుచుండు, శిష్టాన్ = యోగ్యులగువారిని, వారి=జలములను, త్రయాదప్యధికశతతమం=ముమ్మాఱులకంటె మిగుల నూఱునూఱుమాఱులు, సమ్యక్=బాగుగా, ఆచామయంతీ=ఆచమింపంజేయునదియై, మామకంమానసం=నాహృదయమును, మదయతి=మన్మథమదగ్రస్తమైయుండునట్లు సేయుచున్నది.

ఒకపడుచు మోకాలిబంటినీటిలోఁ బావడకుచ్చెలలు పైకెగబట్టుకొని నిలిచి కరకంకణఝుణంఝుణధ్వనులతో బంగారుకడవ నీటిపైఁదూలించుచుండ నొకించుక బయల్పడుచుండు దానియూరుకాండంబులు గాంచుచు సాయంకాలమజ్జనాగతులై యుండు శిష్టులు తాము సేయుకృత్యములు మఱచి ముమ్మాఱు సేయవలసినయాచమనములను మునూఱు మునూఱుమాఱులు సేయుచు మాషమగ్నజలపాన మాచమనోచితమనువిధిం దాఁటి యపరిమితముగఁ గుడుచుచున్నవారు. ఇయ్యవిధం గాంచి నామానసంబు మన్మథోన్మాదంబుం బొందుచున్నది యని భావము.

స్నాతా స్యాత్రి ర్ప్రయాణ వృద్ధిరశరతమం కమ్యగా చామయంతీ
శిష్టాన్యాలోకనక్షాత్ మదయతి హృదయం మామకం కాపి బాలా
అని చెప్పెను

అది విని మదనమాలిని మానసంబున సంతోషించుచు నితండు రసికవతంసుం డగుటం జేసి సమయానురూపవర్తనంబు చతురతరవ్యాజోక్తిసుందరంబుగ రచించె ఈయర్థం బె ఱింగి సంతసించితి నమవిధం బితవికిం జెప్పు నొప్పు నని తాను ఘనాపదేశంబున ని ట్లనియె మదనమాలిని

శ్లో॥ * నాపేక్షా న చ దాక్షిణ్యం న ప్రీతి ర్న చ సంగమః
తథాపి హరతే తాపం లోకానా మున్నతో ఘనః

అని పఠించి యూపవ్యములముగ నీకు నాయెడ నపేక్షయుండవలసినట్లు కనంబడదు హెచ్చుమాట మన్ననేమియుం గానము ప్రీతియనునది కలుగనే లేదు సమాగమము సమకూరినదిగాదు కాన నన్నాదరింపవలసినయక్కర నీకు లేదు అయినను నీవు గొప్పవాడ వగుటం జేసి సుధామధురవచనంబుల తాపం బుపశమింపం జేసితివి ఆనందంబు గల్గుచున్నది యనుభావమును సూచింపం జేసి తనకరకీయాభావంబు దృఢపఱచుకోరికతో స్మితసుధామధురంబులగు కటాక్షమాలికల విప్రకుమారుముఖాంబుజంబుపై బరపుచు భృంగాపదేశమున ని ట్లనియె

శ్లో॥ * అపసర మధుకర దూరం పరిమళబహులేపి కేతకీకుసుమే
ఇహ న హి మధులాభ స్తే భవతి పరం ధూళిధూసరం గాత్రమ్

* అపేక్షా న=అపేక్షలేదు నచదాక్షిణ్యం=దాక్షిణ్యంబును లేదు న ప్రీతిః=ప్రీతియుం గనంబడదు న చ సంగమః=సమాగమమును లేదు తథాపి=అట్లుండియు ఉన్నతో ఘనః = గొప్పదియగు మేఘము గౌరవమువహించినయభిజనుడు లోకానాం=జనుల యొక్క, తాపం=పరితాపమును హరతే=హరించుచుండెడిని

గొప్పవాడు ఆ నపేక్ష లేక యుండియు దాక్షిణ్యంబు ప్రసక్తంబుగాక యుండియును ప్రీతి పొడసూపక యుండియును సమాగమ మొనగూడక యుండినను లోకులపరితాపంబుం బోనడంచునని భావము

ఇచట నన్యాపదేశార్థము మేఘపరమనియు స్వాపదేశార్థము విప్రకుమారపర మనియుం దెలియునది

† మధుకర=తుమ్మెదా, దూరమపసర=దవ్వులకుం బొమ్ము కేతకీకుసుమే = మొగలి పువ్వు, పరిమళబహులేపి = విశేషపరిమళముకలదైయున్నను, తే=నీకు, ఇహ = ఇందు,

అని చెప్పిన విని విప్రకుమారుండు తనమానసంబున నీయింతి మధుకరాపదేశం బునఁ దనసరసతాదుల ననుభవింపం గోరినదన్నును పరిమళబహుళకేతకీకుసుమాపదేశం బున రూపలావణ్యాదులు విశేషించి మదనుభవయోగ్యురాలై యుండుతన్నుం జెప్పి యియ్యెడ నీకు మధువు దొరక దనుటచే నిందు నధరసుధారసంబుం గ్రోల నీ కనువు గాదనియును; మొగలిపువ్వుగాన నిందు మధువు దొరకక పోవుటయట్లుండఁగాఁ గంట కులు గాచియుండుదురుగాన భావానుబంధంబులఁ బ్రకటింప ననువుపడ దనియును రహస్యాభిప్రాయం బగపఱిచి నీశరీరము మాత్రము ధూళిధూసర మగుననుటచే నీకుఁ బరదారాభిలాషచేతను మిత్రభార్యాభికాంక్షచేతను దుష్కీర్తి గల్గ నున్నది యని ప్రకటీకరించినయది. బళీ యీకాంతయె కద చతుర! దీని చతురవచనంబులకుం దగిన యుత్తరం బీక యుండుసేని సరసత్వమునకు లోపంబు గల్గు. నళినివెపంబున నీమగువకుం జెప్ప నగుమాటలు సెప్పెదను.

* శ్లో. విభ్రమ్య కానన మసౌ దివసావసానే
త్వయ్యేవ షట్పదయువా హృదయం బబంధ,
త్వం చాపి చే న్నళిని మాన మురీకరోషి
క స్స్యా ద్గతి ర్మధులిహో హ్యధునా వలంబః.

అని వచించెను.

---

మధులాభః=మకరందప్రాప్తి, నహి=లేదు. పరం=అంతియకాక, గాత్రం=శరీరము, ధూళి ధూసరం=దుమ్ముచేత మలినముగ. భవతి=అగును.

మధుకరమా పరిమళ మధికముగ నున్నదని మొగలిపువ్వుదగ్గఱకు రాఁబోకుము; దానియందు మకరందము నీకు లభింపదు. ఇట్టి యిష్టప్రాప్తి లేక పోవుటయ గాక దుమ్ముచే నీశరీరము మలినమై పోవుటయుఁ గంటకములు గ్రుచ్చుకొనుటయు నిట్టియనిష్ట ప్రాప్తియు నగు నని యన్యాపదేశార్థము. ఓకుమారుఁడా యతిసౌందర్యవతి నైనను బరకాంత నగునన్నుం డాయకుము; ఇందు నీయభీష్టము సిద్ధింపదు. మఱి యీనాచెలి కత్తెలు నిన్నుఁ దూఱుదురు. నీ కపకీర్తి గల్గు నని స్వాపదేశార్థము.

* టీ. అసౌషట్పదయువా = ఈతరుణమధుకరము, కాననం = అడవియందు, విభ్రమ్య=పరిభ్రమించి. దివసావసానే=సాయంకాలమున, త్వయ్యేవ=ఓనళినీ నీయందే, హృదయం=మానసంబును, బబంధ=బంధించెను. నళినీ=ఓపద్మినీ, త్వంచాపి = నీవునుసయి తము. మానం=చిత్తపమున్నతిని, ఉరీకరోషిచేత్ = అంగీకరించెదవేని, అధునాహి = ఇప్పుడే, మధులిహః=భ్రమరమునకు, అవలంబః=ఆధారము-గతి, కఃస్యాత్=ఏది? నళినీ. భృంగపర మగునది యన్యాపదేశార్థము. కామినీకాముకులపర మైనది స్వాపదేశార్థము స్పష్టము.

ఇట్లు నృపాలతిలకంబు వచించినవచనంబులు తనకుం గర్ణరసాయనంబు లైన నామదనమాలిని తనలో నీతండు "షట్పదయువా అనుటచే దన్నును నళిని యనుటచే నన్నును బోధించి; యే ననేక కాంతామణులం గాంచితిని, వారియందు సౌహృదయంబు నచ్చికపడక నీయందయీసాయంసమయంబున ననురక్తం బయి యున్నది, ఇట్టిసమయమున నీవు నాయందుఁ బ్రేమాభిమానంబులుగాన్పింపనిచో నాకు గతిమఱియొకటి లేదు" అనుభావంబుఁ బ్రకటింపం జేసెను. ఇంతటితో నితనికి మానసంబుఁ బట్టియివ్వం జనదు. నామనోరథంబును సిద్ధప్రాయంబ; ఐన నీతనికి నామగండు గడుఁ గ్రూరుండనియుం నిది యెఱుంగక యేల తత్తరపడియెద వనియుం జెప్పి మఱియు మానసతాపంబు వృద్ధిచేసినఁ గరంబు సరసత్వంబు నొందు నని యెంచి కించిల్లజ్జాకలితంబు లైనకటాక్షవీక్షణముల మందస్మితసుందరముఖారవింద యగుచు నతనిం గనుంగొని యిట్లనియె.

* శ్లో. ఛాయాభిః ప్రథమం తతశ్చ కుసుమైః పశ్చాత్ఫలైస్స్వాదుభిః
ప్రీణాత్యేవ తరుర్మహానితి పథి శ్రాంతైస్సమాగమ్యతే,
కో జానాతి తదగ్రకోటరపుటే ప్రత్యగ్రహాలాహల
జ్వాలామాలకరాళఫాలఫలకః క్రూరః ఫణీ వర్తతే.

---

* టీ. తరుః=వృక్షము, ప్రథమం=తొలుత, ఛాయాభిః=నీడలచేతను, తతశ్చ=అనంతరము, కుసుమైః=పుష్పములచేతను, పశ్చాత్=పిమ్మట, స్వాదుభిః = ఆస్వాద్యము లైన, ఫలైః=పండ్లచేతను, ప్రీణాత్యేవ=ప్రియమునింపుచున్నయదియే. కాన-మహాన్=గొప్పది, అని పథిశ్రాంతైః=మార్గము నడిచి శ్రమజెందినవారలచే, సమాగమ్యతే=చేరఁబడుచున్నది. తదగ్రకోటరపుటే=ఆవృక్షముయొక్క కొన నుండు తొఱ్ఱగూటిలో, ప్రత్యగ్ర...ఫలకః, ప్రత్యగ్రహాలాహలజ్వాలామాల=నూతనమగుహాలాహలవిషజ్వాలాపరంపరలచేత, కరాళ=భయంకరమగు, ఫాలఫలకః=పడగవంటిఫణముగలదియు, క్రూరః=క్రూరమునగు, ఫణీ=సర్పము, వర్తతే = ఉన్నది, అని-కోజానాతి = ఎవ్వఁడెఱుంగును. ప్రథమమునఁ జల్లనినీడల నొసంగుననియుం నంతం గుసుమములు గురిపించు ననియుం ననంతరము స్వాద్యములైనఫలముల నొసంగు ననియుం మాత్రమె తలంచి మార్గాయాసపరిశ్రాంతులు వృక్షముకడం జేరుదురు గాని దీనికోటరమున మహాభయంకరమై విషజ్వాలలు నోటఁ గ్రక్కుచుండుసర్ప మొకటియున్నదని యెవ్వఁడును దలంపఁడు. అని భావము.

స్వాపదేశార్థము:—తరు వనఁగాఁ బరకాంత. ఛాయ యనఁగాఁ జూడఁజూడఁ గన్నుల కానేచనకమగు తదీయలావణ్యము. కుసుమము లనఁగా రసవంతంబులగు తద్వచనములు. ఫలము లనఁగాఁ దదురోజములు. సర్ప మనఁగాఁ గ్రోధపరీతుం డగుతత్పతి.

అని చెప్పి యవనతముఖియై యూరకుండెను. ఆపద్యంబు విని నృపకుమారుండు తదీయోక్తిచాతుర్యంబునకును దద్భావగాంభీర్యంబునకును మెచ్చుచుఁదనమానసంబునందు "ఈకాంచనాంగి తన్ను వృక్షంబుగను నన్నుఁ బథికునిగను దనమగనిని సర్పంబుగను జెప్పి కన్నులకుఁ గనుంగొనఁ జల్లనై యుండునాకాంతికిని రసభరితంబులైనయుక్తులకును మనోహరములైన కుచకుంభంబులకును మనసు గరంగి పథికుండ వగుటంజేసి విరహతాపం బడంచుకొనుటకుం దగినగొప్పయాశ్రయం బని నాయం దభిలాష గలిగియున్నాఁడవు. నాపురుషుం డింట మహారోషపరీతుండై యుండువాఁడు వచ్చి నిన్ను బాధించు నని యెఱుంగవు" అనియెడుతనయభిప్రాయంబు సూచితంబు చేసినయది. ఈమదవతి తనకు నాయం దభిలాష యుండుటెఱుఁగును దనపతికిఁ దాను భయపడుటయ కాక తన్నుఁ గూర్చినవానికిం దనపతివలనఁ జెట్ట సంభవించుట తన కిష్టంబుగా దనియుఁ దెలుపుచున్నది. ఇదియుసరియె. అయినను మాట కవకాశంబు గలదు. చూతము అని యనుకొని యిట్లు వక్కాణించె,

* శ్లో. దళాని ముకుళీకృత్య ప్రవేశం న దదాసి చేత్,
పద్మ భృంగస్య కా హానిః ఫుల్లే చూతవనే స్థితే.

అని చెప్పిన విని యామగువయు మనంబున నితఁడు పద్మాపదేశంబున నన్నును భృంగాపదేశంబునఁ దన్నును నిర్దేశించి చూతవన మనుపదముచేతఁ దన కనుభవయోగ్యములగుకాంతాకదంబంబులను నిరూపించుటంజేసి యోమగువా నీవు నాయం దిష్టము సూచింపం జేయక పెనిమిటి యున్నాఁడని భయపెట్టి నాకు నీయందుఁ బ్రవేశ మొసంగక పోయెద వేని యట్లు యుండుము; ఇంతకు నిన్నుఁ బ్రార్థింపవలసినయావశ్యకత లేదు; నీవు నాకుం గూర్పవేని నాకొకహానియు సంభవింపదు; నా కనుభవయోగ్యలగు కాంత లున్నారు; ఈబిగు వేల చేసెదవు అనుభావము సూచింపం జేయుచున్నాఁడు. ఇతనియభిప్రాయము మరలించుట కనువు మెఱయఁ గొన్నిరసోక్తులు వచించి వీని బింకంబు వదలింతుంగాక యని మరల నిట్లనియె,

*శ్లో యావ దేనం న జానాతి పారిజాతం మధువ్రతః,
తావ ద్భ్రమణ మే వాస్య కుంజే కుంజే ద్రుమే ద్రుమే.

---

* టీక. పద్మ=కమలమా, దళాని=ఱేకులను, ముకుళీకృత్య=మొగిడ్చుకొని, ప్రవేశం=చొరనవకాశమును, నదదాసి చేత్=ఈయకయుండెదవేని, ఫుల్లే చూతవనే=వికసించిన తియ్యమామిడిచెట్లవనము, స్థితే=ఉండఁగా, భృంగస్య=భ్రమరమునకు, కాహానిః=చెఱుపేమి? ఇచట పద్మభ్రమరపర మగునది యన్యాపదేశార్థము. సౌందర్యమాలినీ, మానపాలురవృత్తాంతము స్వాపదేశార్థము.

* మధువ్రతః=తుమ్మెద, ఏనం=ఈ, పారిజాతం=పారిజాతపుష్పమును, యావత్ =

అని యిట్లు చిఱునగవుతో వచించిన విని మానపాలుండు తనమానసంబున నాకు భోగ్య లయినకాంతలున్నారు; నిన్నే ప్రార్థింపవలసినయావశ్యకత లేదని నేను దెల్పఁగా నీచూనిని నీవు నాతోఁ గలసి నాజాణతనంబుం దెలిసికొంటివేని నీవితరకాంతలకై తిరుగుట మానుకొనకపోవు; నావలె రసికురాలైనకాంత లేదు; అనుభావమును సూచింపం జేసినయది. ఇక్కాంతారత్నంబు సౌందర్యగర్వితయగునాయిక. దీనివచనంబుల కనురూపవచనంబులచే సమాధానము సెప్పక పోయిన దీనితో నుండునండజయానలు పరిహాసింతురు. తగినయుత్తరం బొసంగం జనును; అని యోచించి యిట్లనియె.

శ్లో. * కిం ఖలు రత్నైరేతైః కిం పున రభ్రాయితేన వపుషా తే,
సలిల మపి యన్న తావక మర్ణవ వదనం ప్రయాతి తృషితానామ్.

అని చెప్పెను. అది విని యామదనమాలిని తనహృదయంబున నీకామి సముద్రాపదేశంబున నన్నును దృషితాపదేశంబునం దన్నుఁ జెప్పి యోసముద్రమా నీ కీరత్నము లుండియు నాకాశమువంటిశరీరముండియు నేమి యుపయోగము? దప్పిఁ గొన్నవారికి నీజలకణ మొకటియైన నోటికిం జొనదు గదా! యను సముద్రాపదేశార్థముచేత నీకు రత్నంబులవంటి సౌందర్యసౌకుమార్యాదిగుణంబు లుండియుఁ బ్రయోజనము లేదు; నీశరీర మాకాశమువలెఁ జూడ ననువైయున్నది గాని యనుభవింప ననువుపడదు; ఇట్టిదర్శనీయమైనయంగకములుండియు నిష్ఫలమె; మదనబాధాపీడితుఁడనగు నాకు నీసంగమం బొకించుకయైన సమకూరక యుండునది గాన నీయిట్టియొప్పిదంబు గల్గియు ననాకాంక్ష్యమైయున్నది యనుభావంబు సూచితంబుఁ గావించె. ఇంతటితోఁ జాలును; ఇంకను మన సీయక పోయిన నితండు మనకు సాధ్యపడఁడు. "శ్లో. ఛిన్నస్నేహరసా భవంతి పురుషా దుఃఖానువృత్త్యా" అని యున్నది. (అనువర్తింప ననువర్తింపఁ బిగువు సేయుమనువ యందుఁ బురుషులు దుఃఖానువృత్తియని స్నేహంబు మానుకొందురు) కాన నింక నితనికి

---

ఎందుచేత, నజానాతి = ఎఱుఁగదో, తావదేవ=అంతదనుకమాత్రమే, అస్య = ఈ తుమ్మెదకు, కుంజేకుంజే ద్రుమే ద్రుమే = ప్రతిపొదరింటనుండు నొక్కొకవృక్షమునందును, భ్రమణం = సంచారము, కలుగును. పారిజాతముయొక్క సౌగంధ్యసౌకుమార్యాదులనారసినచో భ్రమర మితరపుష్పముల వెదకుటకుఁ జన దని తాత్పర్యము.

* తే=నీయొక్క, ఏతైః రత్నైః కిం ఖలు=ఈరత్నములచేత నేమి యుపయోగము? అభ్రాయితేనవపుషా కిం పునః=ఆకాశమువలె నుండు నీశరీరమువలన నుపయోగ మేమి యున్నది? అర్ణవ=సముద్రమా, యత్=ఏహేతువుచే, తృషితానాం= దప్పిగొనియుండువారలకు, తావకంజలమపి=నీ నీరమును, వదనం=నోటికి, నప్రయాతి=పోదో! ఆహేతువునుబట్టి పూర్వోక్తములు వ్యర్థము లని భావము.

విరుద్ధవచనంబు లాడంజనదు. అనిచింతించి జలపూర్ణఘటంబుఁ గటీతటంబున నిడుకొని యాపక్ష్మలాక్షి స్నేహరసనిష్యందమందంబు లగుకటాక్షంబుల సాకపటవిప్రకుమారుం గనుంగొని లజ్జయు ననురాగంబును బెరసి యధరపల్లవము నిర్గమింపనిమందహాసంబున నతనిమానసంబుఁ గరంగింపం జేయుచుఁ దనప్రాణసఖితో,

శ్లో. ఇహ నగరే ప్రతిరథ్యం భుజంగసంవాసరుద్ధసంచారే,
ప్రియసఖి మమ మతమేత న్నకులప్రతిపాలనం శ్రేయః.

అని చెప్పుకొనుచుఁ దనచెలికత్తెలతో మణిమంతునిసౌధంబునకుం బోయెను. కపట విప్రవేషధారియగు మానపాలుండును కపటవణిక్కన్యకాహృతమానసుం డై తదీయ రూపగుణప్రముఖంబులం దలంచుచు సూర్యోపస్థానాదులు రచించి వారలవెనువెంటం జని పురంబున నొకయంబికాదేవాలయంబునం గూరుచుండి యేకాంతంబునం దన మనంబున,

ఉ. సుందరిపొందు కాసపడి సొక్కుచు నున్నది మానసంబు నా
యిందునిభాస్య ప్రేమభర మెంతయు జాణతనంబు దోఁప నా

---

ఈపద్యమునకు నప్రస్తుతార్థమును ప్రస్తుతార్థమును గలవు.

టీ. ప్రియసఖి=ఓసెచ్చెలీ, ప్రతిరథ్యం=ప్రతివీథులందును, భుజంగ...చారే- భుజంగ=(అప్రస్తుతార్థము)సర్పములయొక్క, (ప్రస్తుతార్థము)విటపురుషులయొక్క, సంవాస=వాసముచేత, రుద్ధ=అడ్డగింపబడిన, సంచారే=సంచారముగల, ఇహనగరే=ఈనగరంబున, నకులప్రతిపాలనం (అప్రస్తుతార్థము)నకుల=ముంగిసలయొక్క, ప్రతిపాలనం=కాఁపుఁదల, శ్రేయః=శ్రేయస్కరము. ఏతత్=అనుసీయది. మమమతం=నాయిష్టము. (ప్రస్తుతార్థము) కులప్రతిపాలనం=పాతివ్రత్యాదులచేఁ గులంబుఁ గాపాడుకొనుట, శ్రేయోన=శ్రేయస్కరముగాదు. ఏతత్ = అనుసీయది, మమమతం=నాకు సమ్మతము.

ప్రతివీథియందును బాములు నిండియుండుటంబట్టి సంచారక్షమము గాకయుండు నీయూర ముంగిసలను బెంచి వానిం గాపాడుట (అవి సర్పములంజంపునుగాన) శ్రేయస్కర మని నామతము. అను నిది యప్రస్తుతార్థము.

ఈనగరము విటకాండ్రు విశేషించియుండుటచే ప్రతివీథులందుఁ గులజాత లగు స్త్రీలు సంచారముసేయ ననువుపడక యున్నది. ఎట్టికులపాలికలేని యెచ్చోటని యే వీథిని యేకాలమని యెవఁడని యెన్నాళ్లీనగరమునం దిరుగక యుందురు. ఇట్లు సంచార నిరోధశ్రమ మనుభవించుటకంటెఁ గులమురక్షించుకొనుటలు మానుటయ యుత్తమ మని నాకుఁ దోఁచుచున్నది యనునర్థము ప్రస్తుతము. కులము రక్షించుకొనుటలు మానుట యనఁగా విటకాండ్ర కనుకూలముగఁ గులట యై ప్రవర్తించుట.

కుం దెలివొందఁ డెల్పె నలకోమలికౌఁగిలి యెట్లు లబ్బునో
యిందుధరాభియాతి నను నేవిధి దానినిఁ గూర్చి యుబ్బునో.

అని యనుకొని కొంతతడవునకుం దెలివి దెచ్చుకొని

ఉ. మిత్రునిభాషఁ గూడుటలు మేరిని సాధునిగర్హితంబు నా
గాత్రము మారుబాణహతిఁ గ్రాఁగుచునున్నది యేమి సేయు నా
చిత్ర మొకప్పు డిట్టిపని సేయుటకుం జొరనట్టినామదిన్
సూత్రపడంగ నయ్యెఁ బరశోభనగాత్రిరతిప్రసంగముల్.

క. కట్టా పాపం బివి తల, పెట్టఁగ రానట్టిపనులు పృథివీపతి యీ
కట్టిఁడితనమున కే యొడి, గట్టినఁ బ్రజ లెల్లఁ బాపకర్ములు గారే.

ఉ. ఎప్పుడు ధర్మమార్గమున నించుక దప్పనినామనంబులో
నుప్పతిలంగఁ జొచ్చెను బరోరుకుచారతిరక్తి చిత్ర మా
యొప్పులకుప్పకు న్మనసు నుంచు నొకో గతజన్మమర్మ మీ
తప్పునకున్మదాత్మఁ బలుదారులు గల్గునె లేక యుండినన్.

కట్టా యేమందును! నాఁ జేయంగడంగినబిట్టుకట్టిఁడి కార్యంబు? నాయభ్యసించిన సాధుశీలం బొక్కక్షణంబున నమసింపం జేయఁ బూనితిని.

చ. చదువులకెల్ల నేమిగతి? సాధుపదాంబుజసేవకు న్ఫలం
బెది? పితృశాసనంబునకు నిట్టిది యే తగుగౌరవంబు నా
హృదయము ధర్మబాహ్యవిధి కెక్కనిరీతి కిదే కదా ఫలం
బిదియ సుమీ ప్రజావళుల కెల్లను నమ్మికపుట్టఁ గాచుటల్.

అని యోచించి మరల నాపంచాననమధ్యం దలంచి,

ఉ. ఏవిధి నావినీలకచ నిం కిటఁ గన్నులఁ జూడఁ గల్గు నా
కేవి తదీయసంగసుఖ మిచ్చెడుభాగ్యము లామనోజరా
జ్యావనలక్ష్మి పక్ష్మలదృశాభరణంబు కృపారసార్ద్రిన
ద్భావముతో ననుంగఁ జెలిఁ బంపి ననుం బిలిపించి కావదే.

అని చింతించుచుండెను.

అప్పు డొకమనోహరాంగి యతిమనోజ్ఞవేషాలంకృత యై యాయంబికాలయంబున కేఁగుదెంచి యాజగన్మాతకుఁ దాఁదెచ్చినఫలకుసుమపత్రాదుల నర్పించి వలగొని నమస్కరించి యతఁడుండుచోటికే కేతంబ యేఁగుదెంచి సవినయంబుగ వందనం బాచరించి నీ ప్రాణప్రియురాలు మదనమాలిని యనఁ బోయి యామాట మదనమాలినివంటి రూపసం

పద గలమణిమంతునిరాణి యనిసవరించి యాదినసాయంసమయమున నామె గమలసరోవర సమీపంబున నిన్ను గాంచిన దాదిగ నీయందు మక్కువ యెక్కువయై వెక్కసంబగు నించువిల్తునివేదనకుం దాళక ప్రాణసమాన నగునే ననునయించి యడిగిన నెట్టకేలకు మానసంబు పట్టియీాక యానపయిం బెట్టియడిగిన నందులకు నీయందుఁగలయనురాగంబుఁ గాన్పించి యీారామణీయకశరణం బయినశరీర ముపేక్షింపం గూడదని నానుడివిన యనునయోక్తులకు మెత్తబడి యిత్తాళపత్రంబున నొకపద్యంబు వ్రాసి యిది యాద్విజ కుమారుంగనిపట్టి యతనిచేతి కిచ్చి యామనోహారాంగుం డిచ్చుప్రత్యుత్తరముం గొని రమ్మని చెప్పి నన్నుం బంపె; ఆపత్రిక యిదె కనుంగొనుమని చేతి కిచ్చినం దీసికొని యావంచనావిప్రకుమారుండు దానియందు,

* శ్లో. భ్రమర భ్రమతా దిగంతరాళే క్వచి దాస్వాదిత మీాక్షితం శ్రుతం వా
వద సత్య మపాస్య పక్షపాతం యది జాతీకుసుమానుకారి పుష్పమ్.

అని చదివి యౌరా! దీనిచాతుర్యం బేమనవచ్చు? భ్రమరాపదేశంబున నన్నును జాతీకుసుమాపదేశంబునం దన్నును జెప్పి నీవును సమస్తదిగంతంబులమధ్యంబునం దిరుగుచున్నవాఁడవే కదా! ఎక్కడనైనను నావంటియుత్తమజాతినాయకారత్నంబును నీ వనుభవించి యుందువా? లేక చూచియైన నుందువా? ముందు "ఫుల్లేచూతవనేస్థితే" యని నా కనుభవింపం దగినస్త్రీలు పెక్కండ్రు గల రనియంటివే! వారలు నావలె నతిచతురలై నీసరసత్వంబునకుం దగియుందురా? పక్షపాతంబు మాని వచియింపు మని యావణిక్కుమారికారత్నంబు తనభావంబును జూపినయది. అయిన నింతకే దీనిహృదయంబు

---

* టీ. భ్రమర=ఓీమఠ్ఫదమా, దిగంతరాళే భ్రమతా=దిసలనడుమసంచరించుచుండు నీచేత, క్వచిత్ = ఎక్కడనేని, ఆస్వాదితం = అనుభవింపఁబడియెనా! ఈక్షితం = లేక చూడంబడియెనా? శ్రుతంవా=కాదేని వినంబడియెనా! జాతీకుసుమానుకారి=జాతిపుష్పంబును సరిపోలిన, పుష్పం=కుసుమము, యది=ఉన్నదా? పక్షపాతమపాస్య=పక్షపాతంబు మాని, సత్యంవద=యథార్థంబు దెల్పుము.

అప్రస్తుతార్థము. భ్రమరమా నీవు దిగంతరాళంబులందిరిగి యనేకకుసుమంబులం గనుంగొని యున్నాఁడవు. ఎయ్యెడనైన జాతిపుష్పంబువంటిపుష్పంబును నీ వనుభవించితివా! లేక చూడనైనఁ జూచితివా! లేక విననైన వింటివా? పక్షపాతంబు లేక సత్యము పల్కుము.

ప్రస్తుతార్థము. నీవు భూమిలో ననేక నాయికలం జూచినవాఁడవె? నావంటి యుత్తమనాయికారత్నంబు ననుభవించియుందువా? లేక కంటనైనఁ జూచియుందువా! లేక వినియైన నుందువా! పక్షపాతంబు మాని యథార్థంబు పల్కుము.

నష్టం జనదు. పరకాంతలు సమయానుగుణప్రవర్తనలు గాక యుండరు. వారల మనోగతంబు నిష్కలుషంబుగఁ దెలియందనుక నష్టం జన దని యనుకొని యాపత్త్రికయంద మఱియొకపద్యము వ్రాసి పంపెను. అది గొని చని చేటిక రాజపుత్త్రి కిచ్చిన నందు,

శ్లో. * కుసుమాని లిఖంతు నామ చిత్రే కతిచి త్కాలవిశేషరూఢశిక్షాః,
సురభిత్వ మమూని కిం లభంతే కథ మేతేషు రసం పిబంతి భృంగాః.

అని వ్రాసియుండుటం జదువుకొని యాసుదతి తనహృదయంబునందు నతఁడు చిత్రకుసుమాపదేశంబునఁ దన్నును జెప్పి బాగుగ శిల్పవిద్యయందు సుశిక్షితు లగువారు చిత్రకుసుమంబులు వ్రాసినచో వానికిసౌరభము గల్గునా? భృంగములు వానియందు రసాస్వాదనము సేయం జనునా? యను నప్రస్తుతార్థముచే బ్రహ్మ చిరాభ్యస్తహస్తకౌశలంబున సురూపమమరిచి మదనుభవయోగ్యగానిపరకాంతవుగ నిన్ను సృజియించెఁ బో? నీకు విరహినగు నాయందు మనసు గరంగునా! అది లేనిచో నీయందు సుఖానుభవ మెవ్విధి సేయ నగునను ప్రస్తుతార్థము వెల్లడిచేసియున్నాఁడు. కానిమ్ము! మఱియొకపద్యంబున నితనిభ్రమము మాన్చెద నని యనుకొని దానిక్రింద నొకశ్లోకంబు వ్రాసి యావనితచేత నతనికంపిన రా జది విప్పిచూచి యాపత్త్రికయందు,

* శ్లో. దిఙ్మండలం పరిమళై స్సురభీకరోషి
సౌందర్య మావహసి లోచనలోభనీయం,
ఆహో రసాలఫలవర్య తథాపి దూయే
యద్గ్రంథిలం చ కుటిలం హృదయం బిభర్షి.

---

* టీ. కాలవిశేషరూఢశిక్షాః కతిచిత్=కాలక్రమంబునశిల్పవిద్యావైశారద్యంబుఁ గాంచియుండుకొందఱు, చిత్రే=చిత్తర్వునందు, కుసుమాని=పుష్పంబులను, లిఖంతు నామ=వ్రాయుదురుగాక. అమూని=అట్టిఈచిత్రకుసుమంబులు, సురభిత్వం=పరిమళంబును, లభంతేకిం=పొందుచుండెడినా? ఏతేషు=వీనియందు, భృంగాః=తుమ్మెదలు, రసం=మధువును, కథం=ఎట్లు? పిబంతి=పానముచేసెడిని?

* టీ. రసాలఫలవర్య=ఉత్తమమయినతియ్యమామిడిపండా! పరిమళైః=సువాసనలచేత, దిఙ్మండలం=దిగ్వలయంబులను, సురభీకరోషి = పరిమళింపంజేసెదవు. లోచనలోభనీయం=కన్నులకానందకరమగు,సౌందర్యం=చక్కఁదనంబును, ఆవహసి=కలిగియుండెదవు. ఆహో=కట్టా! తథాపి=అట్లుండినను; గ్రంథిలంకుటిలంచహృదయంయత్ బిభర్షి=ముడులు వాఱినదియుం గుటిలమైనదియు నగుహృదయము గలిగియుండెదవుగాన, దూయే=దుఃఖపడుచున్నాను. మామిడిపండులోనిముట్టె గ్రంథిలంబుగను వంకరగ నున్నది యని యెఱుఁగుదువుగదా.అట్లె నీహృదయంబు సరళముగాక భయంబు గలిగియున్నది యనిభావము.

అని వ్రాసియుండం జదువుకొని యాసుందరీమణిచాతుర్యవిశేషంబున కాత్మం బరమామోదంబు నొందుచు సామానిని మామిడిపండు నెపంబున నాకు ఓమామిడిపండువంటి నాయకోత్తమా! నీశరసత్వాదిగుణంబులను దిశాముఖంబులం బొగడుచున్నారు; కన్నులకత్యానందకరమగు సౌందర్యంబు గలిగి యుండెదవు; ఇన్నియుండియుం నీ హృదయము సరళంబు గాక ముదులువాఱి బహుకుటిలమై కనంబడుచున్నది; గాన నీయశంబునకును సౌందర్యంబునకును దగినసరళ మయినహృదయంబు లేకపోయెనే యని నేను దుఃఖపడుచున్నదానను. నామనోనురాగం బింతఁ బ్రకటించినను నీవు సందేహము నొందియున్నాఁడవివి తగదు; సరళహృదయంబుతో జంకుమాని నాకడకు వచ్చి కోరికలుదీర్చుకొనిపోవచ్చునని తనభావంబు సూచితంబు జేసె. ఇఁక నూరకుంట సారంబు గాదు. అని తలంచి యోచేటీ యాపాటలగంధి నన్నెప్పు డెవ్విధి రమ్మన్నది చెప్పుమని యడిగిన నామగువయు నో బ్రాహ్మణోత్తమా మాదేవి మీకు జెప్పుచున్న మాటలు వినుండు.

శా. భూకాంతుం డతిచండశాసనుఁడు సుభ్రూరాజిదోషావళుల్
వీఁకం దాఁ గనె నేని నిష్కరుణుఁడై వేవేగ శిక్షించు నే
నీకుం జెప్పెదఁ జేటికామనవతీనేపథ్యముం దాల్చి య
న్యాకారంబున నెన్ని రమ్ము పతి కార్యాకాంక్షి వై యేఁగెడిన్.

అనిచెప్పిన నారాజు నోసీ యతిచండశాసనుఁడు భూకాంతుండు గాఁడు మఱి రతికాంతుండ యనివచించి యామగువ తెచ్చి యిచ్చిన చేటికానేపథ్యాదులందుకొని దానిం బొమ్మని యారేయి యతిఘోరమారదవదహనంబున వేఁగుచు నెట్టకేలకుం గడపి మరునాఁడొకవిప్రగృహంబున నభ్యవహారాదులం దీర్చుకొని వణిక్కుమారుండు నిలువాసిపోవుటయెఱింగి దినమణి యపరగిరిశిఖర మలంకరించి పశ్చిమపయోనిధిమగ్నుం డయిన నంతటం జిమ్మచీకటులు గ్రమ్ముకొనం జేటికావేషంబు దాల్చి యావణిక్కుమారుని సౌధమునకుం దరిసి వచ్చుచుండెను. మదనమాలినీనియమిత లైనతదీయసఖీమణులు తత్తత్స్థానాంతరంబుల వేఁచి యున్నవార లతనిం గనిపట్టి పిలుచుకొనిపోయిరి. ఒకటి రెండు మూఁడు నాల్గు కక్ష్యాంతరంబులు గడచి సౌందర్యమాలిని శయనమందిరంబునకుం దరిసి వచ్చుచుండునప్పుడు నారీతిలకంబు లొక్కొక్కతె యొక్కొకపని యున్నట్లు నెప్పుకొనుచు నయ్యెడ వాసి చనిరి. అప్పుడు సౌందర్యమాలిని తనమగండు మానినీవేషంబుతో వచ్చువన్నెలు గనుంగొని మించినయనురాగంబున మంచంబుపయినుండి లేచియెదురేఁగి యుజ్జృంభమాణకఠోరకరికుంభకనకకుంభంబులం బోలుగబ్బిగుబ్బలుఁగుబ్బ లొండొంటితో నొరయఁ బులకలు కనకలతాకమనీయతరంబగు తనూవల్లిం గ్రమ్ముకొన శారదపూర్ణచంద్రబింబంబునకుఁ బ్రతిబింబంబై యొప్పుముఖారవిందంబునం జంద్రికామనోహరంబై చిఱునగవంకురింప విపులతరనితంబబింబచుంబితఘుగళవిగళమానకాంచనకాంచీదామమణిఘంటికాఘణం

ఘణనినాదంబు లున్మత్తమదనమహీపతిపట్టదంతావళఘంటికానాదంబుల ననుకరించుచుం జెవులపండువులు సేయ సమున్నతపయోధరభారవహనపరిక్లిష్టంబై జవ్వాడుచుండుసన్నని కెన్నడుము విభగ్నంబగు ననుసందియంబు గ్రందుకొనఁ గామాంధంబులైనకటాక్షవీక్షణమాలికానివహంబులు నీలనీరజమాలికాతోరణంబులఁ గల్పించుచు నంతరాళమును నిరంతరాళంబు సేయఁ జరణకమలయుగళశింజానమంజుమణినూపురఝుళంఝుళనినాదంబులు మన్మథమహారాజరాజవదనాపరిపోషితమత్తరాజహంసరాజివిరాజితకమనీయకంఠకలితకలకలరవంబుల ననుకరింప భావానుబంధబంధురమగువలపులముడిపీడ నేఁగుదెంచి మించినమోహావేశంబునఁ గనకకంకణఝుణత్కారముఖరితంబుగ బాహునాళంబు లెత్తి యమ్మత్తకాశిని యాయుత్తమునికంఠలగ్నంబులు గావించి బిగ్గ కవుంగలించి యధరసుధారసంబొసంగి కైదండ యిచ్చి కొనితెచ్చి రతిమందిరంబునం బుష్పశయనంబునం గూరుచుండంబెట్టి యతిచిరకాలకాంక్షితంబగురతిసుఖం బనుభవించి యతనితో నేకాసనంబునం గూరుచుండి యతనికరంబు తనకరంబునం దెమల్చుచుఁ దదీయాంగుళీదళవిరాజితంబై మానపాలమహీపాల యనునక్షరపఙ్క్తిచే ఖచితమై యొప్పు నేకవజ్రమణివినిర్మితమగుముద్దుటుంగరముం దనచేతికిం దీసికొని యోవిప్రరత్నమా యీయంగుళీయకము రాజకీయ; మిది భవదీయహస్తసన్నిహితం బయి యుండుటకు గతం బేమకో? ఇది యనర్ఘవజ్రమణినిర్మిత మనునది యట్లుండ రాజకీయేతరహస్తగతంబు గాఁ గూడనిది; నీకెట్లు లభించెఁ జెప్పు మని యడిగినఁ గపటవిప్రాకారంబున నున్న రాజు తాఁ దప్పించుకొను నుత్తరం బొసంగంజాలక నవ్వుచు నోమదవతీ రాజు గాఁడేని రాజకీయముద్ర యేల యుండు నని వచింప నామానినియుం దనమనంబున నీరసికుండు తనగుట్టు బయల్పడఁ జేయుట యిట్టి ప్రేమభరంబునకు విచ్ఛేదము లేక జరుగుచుండవలయుం ననుమనోరథంబు ననే? ఇది నిక్కము; మఱియుం మే లయ్యె; అని యెంచి యోరాజచంద్రమా మహీపతులన నధర్మరతుల శిక్షించువారలుగదా! వారల యిట్టి పారదారికవృత్తియు మిత్రపత్నీపరిగ్రహణంబును జేయం దలచుకొనిన వలదనుటకు వలంతు లెవ్వ రున్నారు?

క. సామజము చెఱకు మేసిన, దోమలు పదివేలు జేరి తోలంగలవే
గ్రామపతి మేఱ దప్పిన, గ్రామంబున నుండువారు గాదనఁ గలరే.

అనిచెప్పిన విని యాకపటవిప్రుండు దానిచతురతరవచనచాతురికి మెచ్చుకొనుచు సమయోచితముగ నిట్లనియె.

*శ్లో. చేతోభువ శ్చాపలతాప్రసంగే కా వా కథా మానవలోకభాజాం,
యద్దాహశీలస్య పురాంవిజేతు స్తథావిధం పౌరుష మగ్ధ మాసీత్.

* చేతోభువః=మన్మథునియొక్క, [illegible] ధనుర్లతాప్రసక్తిగలిగినప్పుడు, యత్=ఏహేతువుచే, దాహశీల[illegible]పురాంవిజేతుః=కర[illegible]ల చేతనదగ్ధము సేయం

అని చెప్పిన నాకప్పురగంధియు నీవచనంబులు మిగుల నొప్పు; నేను నీనగరంబున కేఁగుదెంచిన దాదిగ నీసరసత్వాదులు విని మనంబున నువ్విళులూరుచుంటిని. నీతో నిట్టిరతిసుఖం బనుభవింపఁ గోరుచుంటిని. సాభాగ్యంబున నీతో సరసవచనరచనాచమత్కారరసారస్యసమాస్వాదనంబు సేయం గంటిని. జన్మసాఫల్యంబుఁ గాంచి యుంటిని. నికామకామతాపతప్తపరసకామినీసమాదరణచణుండ వని మెచ్చుకొంటిని. నీసరసతాచాతురీధురీణతాదులఁ బ్రియసఖీజనంబులవలన విని తలంపు నీయంద యునిచి యుంటిని. నామనోరథంబు దీర్చుకొనం గంటిని. ఇవ్విధమున ననవరతము భవదీయసమాగమసుఖ మనుభవింప నోచుకుంటినే యని వగపుం గొంటిని. నీతో నవమన్మథమన్మథాయమానుండై యొప్పువానితో ననుగుణవయోరూపలావణ్యాగణ్య యనం దగి యనారత మానందవారినిధిం దేలు మదనమాలిని యేమిభాగ్యంబుఁ గావించెనో యని యెంచుకొంటిని. మన్మథమారీచక్రూరనారాచపరంపరాపరాయత్తచిత్తనై భ్రమించుచుంటి.

ఉ. నాపతి బట్టి కొట్టినను నన్ను జనంబులు దూఱు వెట్టినన్
కాఁపుర మేమి యైనను వికావిక నవ్విన సాటివారలున్
కోపము లత్తమామలకుఁ గ్రూరత బావకుఁ గల్గియుండినన్
శ్రీపతి సాక్షిగా భయముఁ జెందను బాయఁగఁ జాల నిన్నిఁకన్.

నా ప్రాణనాయకా వినుము.

ఉ. * తోయజనేత్ర వే విటుఁడు దుర్భరనిర్భరమారవేదనం
గాయము గ్రాఁగి క్రాఁగి రతికాంక్షలు పైకొన డస్సి గ్రుస్సి వి

---

జాలినత్రిపురాంతకునియొక్క, తథావిధంపౌరుషం=అప్రతిరథుడనియనిపించుకొన్నయాపౌరుషము,(ఇచటఁబౌరుషపదమునకు శౌర్యమనియుఁ మగతనమనియుఁ రెండర్థములు)అర్థమాసీత్=సగమయ్యెనో, తత్=ఆహేతువుచేత, మానుషలోకభాజాం = మనుష్యలోకనివాసులయొక్కవిషయము, కావాకథా=ఎక్కడికథ?

తా॥ కంటిమంటలచే జగంబులఁ గాల్పం జాలి త్రిపురాసురాదిమహాశూరులం జయించి యుండునాపరమశివునిపౌరుషమే మన్మథుఁడు తనధనుర్లత నెత్తినప్పు డర్ధమై పోఁగా నట్టియాతనిధాటికి మనుష్యు లెంతటివారు? వీరిని వంచుట యతని కొకపనియా? పూర్వము మన్మథుని దహించినపరమేశ్వరుఁడు మన్మథవశంగతుఁడై యర్ధశరీరము తన నాయకియగు పార్వతి కిచ్చె ననుకథ యిచట ననుసంధేయము.

* ఈపద్యమునకు భావద్వయము గలదు.

తోయజపత్రములవంటికన్నులుగలనాయిక; తాను పరకాంతయై యుండునది కాయజతాపంబునం గ్రాఁగి క్రాఁగి రతికాంక్షచేఁ గడుఁ గృశించి దైన్యంబుతో విరహ

ఛ్చాయముఖంబుతో విరహసాగరమందు మునింగి యుండఁగా
డాయఁగ వచ్చెనేనిఁ బరదార మనంబునఁ బాయ నొప్పునా.

అని చెప్పిన విని రాజు నోవగలాడీ స్త్రీపురుషుల కిరువురకుం దగులునట్లుగఁ జెప్పినయీపద్యార్థంబు భావంగమం బయ్యె. నీవచనచాతుర్యంబునకు నారాజ్యం బొసంగి నను జాలదు. ఏన నీకు దాసుండ నై వర్తించెదను. నీ వెప్పు డెప్పుడు సమయం బారసి రమ్మని పంపిన నప్పు డప్పుడ వచ్చి యఖండభూమండలాధిపత్యంబుకంటె నధికం బగుభవత్సంభోగసామ్రాజ్యసుఖం బనుభవించి పోయెదను. నేను లేకుండునప్పుడు మదీయం బగు వస్తు వేదేనిం గనుంగొనుచు మనోవినోదంబు గల్పించుకొనుటకై యీయుంగరము నీకడన యుండనిమ్ము. అని తనముద్రిక నాయంగనామణివ్రేలఁ దాన యిడి దానిహస్తపల్లవంబుఁ దనకరకమలంబునం బట్టుకొని ముద్రికాలంకృతమై యతిరమణీయమై యొప్పు దానియంగుళీదళసౌందర్యంబుం జూచుచు నో ప్రాణాధికురాలా యిది దేవియగు మదనమాలినియంగుళమున నిడినట్టుల యున్నది. అనఁగా భవదీయప్రేమపాత్రల మగుటం జేసి యేము భేదవిరహితలము గాదె! యనిన నతం డందులకు సంతసించి మీయిరువురకు భేదంబు లేకయుండినను మీయొసరించు నించువిల్కానిపనుల నామనంబుఁ గరంగించు భేదము మాత్రము గలదు. దేవి మదనమాలిని;

ఉ. ముద్దుఁ గొనంగఁ బోవ నగుమోము మరల్చుచు నంకపాళిఁ దాఁ ద
ద్దయుం జాఱుచుఁ గరముఁ దార్చిన నూరులఁ బెన్చి సిగ్గుచే
నొద్దకుఁ జేర రాక మదనోత్సవవేళల నీవిఁ జార్పఁగా
నుద్దియ వల్దు వల్దనుచు నువ్విళులూరఁ గరంచు ముగ్ధయై.
నామనోహారిణీ వినుము నీవన్ననో!

చ. వలపున గుబ్బచన్గొనల వక్షము గ్రుమ్ముచు మోవి యానుచుఁ
బలుమఱుఁ గౌఁగిలించి మగపాడిని పీడకు మంచు మ్రొక్కుచుఁ

---

సముద్రంబున మునిఁగి యుండునప్పుడు విటుండు సరసకుం జేరె నేని వానిం బాయుటకు మానసంబున సమ్మతించునా యని యొకభావము.

ఇందుఁ దోయజనేత్ర యనుదానిని గర్తృపదముగఁ జేసికొనవలయును.

విటుఁడు దుర్భరనిర్భరమారవేదనం గ్రాఁగి క్రాఁగి రతికాంక్ష యతిశయింపం గృశించుచు మొగంబున విన్నదనంబు మెఱయ విరహసముద్రమున మునింగి యుండఁగాఁ బరకాంత యైనది సరసకుం జేరె నేని దానిని వదలిపెట్టుటకు మనంబున సమ్మతించునా? యని మఱియొకభావము.

సొలయుచు నంగసౌభగము చూరలు గా నెదురొత్తు లిచ్చుచుఁ
కిలకిలనవ్వుచుఁ సురతకేళికిఁ దార్చెద వాసఁ బ్రోడ వై.

ఆనిచెప్పి మఱియు నిట్లనియె.

క. కొమ్మా రతిసుఖసర్వ,స్వమ్మా సౌందర్యసారసంకేతా గా
రమ్మా మన్మథువిజయా,స్త్రమ్మా నీసరసతం దరం బె పొగడఁగఁ.

ఇట్లు వీరు నర్మభాషణములు సేయుచుండ వారిచెవుల కొకగీతంబు వినంబడియె.

* శ్లో. కిం న పశ్యసి మహేంద్రదిఙ్ముఖే శీతదీధితి రసా వుదంచతి,
మీలి తైవ నళి నీహమాకృథా స్త న్మధు వ్రత ముథా హ్యుపాగతమ్.

అది విని భయసంభ్రమాక్రాంత హృదయుండై రాజు సోమనోహారిణీ యప్రతి విధేయమగుసంకటంబు సంభవించెను సుమా? సుఖానంతరము దుఃఖము దుఃఖానంతరము సుఖము అనువచనము తథ్యంబయ్యె. నీపాణిగృహీత; వాణిజ్యంబున కన్యనగరంబునకుం జనియుండువాఁడు భవదీయ సౌందర్యాదిగుణంబులం బరదేశంబునం దలంచి మరులెత్తి కొని యెకో! వచ్చియున్నవాఁడు. నీప్రాణసఖి చంద్రాపదేశంబున నీభర్తను నళిన్యపదేశంబున నిన్నును భ్రమరాపదేశంబున నన్నును సంబోధించి తదీయాగమనంబు మన

* మహేంద్రదిఙ్ముఖే=తూర్పుదిక్కు మొగంబునందు, శీతదీధితిః = చలివెలుఁగు, (చంద్రుఁడు) అసౌ ఉదంచతి=ఇదెయుదయించుచున్నవాఁడు. నళినీ = తామరతీగె, మీలితైవ=ముడుచుకొనిపోయినదేయాయెను. ఇచట మీలనము భావికాలంబునం గలుగు నదియైనను భూతకాలికంబుగఁ దెల్పుట యుత్తరక్షణమున నే గలుగు ననుటను సూచింపం జేయుటకు. ఇది ఏవకారమున నూహ్యము. తత్=అట్లగుటచేత, మధువ్రత = మధుకరమా, ఇహ=ఇందు=మాకృథాః=(ఆస) ఉంచకుము, ఉపాగతం = నీయొక్కరాక = ముథాహి=వ్యర్థమేయాయెనుసుమా?

ఓ భ్రమరమా నీవు కమలినియందు మధుపానాదరంబున ననుషక్తంబ వైతివి. ఈకమలినిని సంకోచింపం జేయుచంద్రుం డుదయమునొందుచున్నవాఁడు. ఇదె తూర్పు దెసం గాంచుము. ఇయ్యెడ నీకు మధువు దొరకదు. కాన వ్యర్థమే నీరాక; యనునది యప్రస్తుతార్థము.

ఓరీ కాముఁ యిదె సౌధారూఢుండై యీకామినీపాణిగృహీత యేతెంచుచున్న వాఁడు; నీ వితనిం గనుంగొనలేదా! ఈకామినియుం మగనిం గాంచి భయలజ్జాకులిత స్వాంత యై మోము ముడుచుకొనియెడిని. నీ వీయిందువదనతో నీరాత్రియెల్ల నిరాటంకం బగుమనోభవసుఖం బనుభవింప ననువు పడదు. నీయాసయుం గొనసాగనిద యైనది. కాన నీరాకయు వ్యర్థమె యనునది ప్రస్తుతార్థము.

కెచ్చరిక సేయుచున్నది. ఓకాంతా యిట్టిమిత్రద్రోహము చేసి నే నొకనేస్తకాఁడ నని యానీమగని మొగం బెట్లు గాంతు. అసాధువుల శిక్షించి సాధువులం బరిపాలింపను గదా! రా జనువాఁడు ప్రజలచే నేర్పఱుపం బడినవాఁడు. అట్టివాఁడ న యిట్టికట్టిఁడితనం బున కొడిగట్టినవిషయంబు రాష్ట్రజనులచెవుల కెక్కెనేని యింతకన్న నపకీర్తియుం శ్రేయోహానియు నితరము నా కేమి యున్నది? ఈనాతి ప్పొకప్పటి కయిన నితరుల కర్ణపథంబున కందక యుండం జేయుట నీభారము. తొలుతఁ బ్రేమభరంబున న న్నాదరించి కౌఁగిలిచ్చి దేహతాపంబుఁ జల్లార్చితివి. దానికంటె శతగుణంబును దురంతము నగు నీమనస్తాపంబును బోనడంపం గరుణింపుము. సమయానుగుణప్రవర్తనచాతుర్యంబు మీ వంటివారలసొమ్ముగదా! ఇప్పుడు పాలముంచినను నీటముంచినను నీవే! శ్లో. "స్త్రీణా మశిక్షితపటుత్వ మమానుషీషు సందృశ్యతే కిముత.యాః ప్రతిబోధవత్యః" (స్త్రీలకు మనుష్యేతరజాతులందును జాతుర్యము నేర్పకయ కలిగియుండఁగా నితరులం గాంచి నేర్చుకొనందగినవారల కుండుననుట కేమి) అని చెప్పియుండలేదా! యని యుగ్గడించి దీనభావంబుతో వేడుకొనఁగా నతనిం గారవించి వెన్ను చఱచి భయంపడ వలదని యూరార్చి యిట్లనియె. ఓప్రాణనాయకా ఎట్టిమహాత్ము లైనను సమయభేదంబు సంభవించినకాలమునఁ దమతమ తేజంబులం దాఁచుకొని తా మితరుల కెఱుకపడక వర్తింప లేదా! వీరజనాగ్రేసరుం డగునర్జునుఁడు విరాటునింట బృహన్నల యనుపేరం దాఁగి యుండినవిధం బీవు వినలేదా! నీవు నిప్పటికుచితం బయిన చేటీవేషంబుఁ దాల్చి నాయింటం గొన్నిదినంబు లుండుము. నిన్ను నాపతి యెవ్వతె యిది యని యడిగిన నతని కిది నాతల్లియింటినుండి వచ్చినచేటి; నాకుం బ్రాణతుల్యురాలు అని యాతని నీవిషయం బున నొప్పరికింపం జేసెదను. నీవలె నాపతి భార్యయందు సంశయించుచుండువాఁడు గాఁడు. ఎల్లవారలును స్త్రీలను నమ్మనివారలే యుండినం బ్రపంచంబు జరుగుట లెట్లు? సమయం బబ్బిన నిన్ను నితరుల కెరికిం దెలియకుండ నంపివేసెదను. అని చెప్పి చేటీనేపథ్యధారిం జేసి తనయండన యుంచుకొని లలుపులు దెఱచి యెదురుచని వణిక్కుమారుని కిం కైదండ యిచ్చి తెచ్చి పాదంబులుగడిగి తడియొత్తి చేటీజనంబులచే రసవత్పదార్థంబులు రప్పించి భోజనం బిడి పరితృప్తుం జేసి కపటచేటీవేషధారియగు రాజును దనరతిమందిరంబునొద్ద నమర్చియుండుమృదుతల్పంబునం బరుండ నియమించి తాను వణిక్కుమారునిశయనంబున బరుండి నిదురించెను.

మరునాఁడు సాయంసమయమునం దాసౌందర్యమాలిని తానును మణిమంతుండును విలాసార్థము దమవసించుసౌధసమీపంబున నుండునతిరమణీయ మైనయుపవనంబునం బుష్పాపచయంబు సేయుచు విహరించుచుండిరి. రాజునగరున నుండుదాసీజనులు గొంద ఱచ్చోటికి వచ్చి యుండుటం గనుంగొని యామగువ వారలం జీరి దేవి యగుమదన

యుండు నీమొగలిపువ్వుం గాంచి యుత్తమకుసుమరసాస్వాదనంబున నాసక్తమయిన మధుకరము పద్మమువలెనేయుండు ననిభ్రమించి యాకేతకీ పుష్పమధ్యంబునం బడియె. అట్లు పడి యాపుష్పమునందుఁ గలధూళిచేతఁ గన్నులుగాననిదై తదీయములగుముండ్ల చేత ఱెక్కలు చినిఁగి యయ్యెడ నుండుటకును విడిచిచనుటకును శక్తంబు గాకయున్న యది; యనునప్రస్తుతార్థముచేత నీవణిక్కన్యక సువర్ణమువంటిదేహకాంతిగల దనియుం రాసిక్యము గల దనియుం జగత్ప్రసిద్ధ మయి యుండఁగా వినియుండి యట్టిదానిఁ గాంచి యీరాజు రసికుఁడు గాన మోహించి దానియందుఁ దగులమి గలిగి ఈనదేవివలె నిరాటం కముగ ననుభవింపం దగినదని భ్రమించి దీనితో సంక్రాంతుండయ్యె. ఇప్పటికిని దాని చాకచక్యంబుచే మోహంబు వెలిగి యుంత్తాయుక్తవిచారంబులు లేక దానిభర్త సమీప వర్తి యై యుండుటంజేసి సంకుచితుండై తనకు ఱెక్కలవంటిప్రభుమంత్రశక్తుల నేది దానిమగఁ డేమి సేయునో యనుభయంబున నిందుండుటకును మోహంబున విడిచి పోవుటకును శక్తుఁడు గాక యున్నాఁడు:” అనుప్రస్తుతార్థంబును సూచితంబుఁ జేసిన యది. ఇప్పుడు నే నేమి యైనం జెప్పితినేని యావిధంబు సుస్పష్టం బగును గాన మిన్నక యుండుటయ మేలని మౌనంబున నుండఁగా మఱియొకతె కాంచనమాల యనుదేవి సైరంధ్రి యిట్లనియె.

* శ్లో. అమరతరుకుసుమసౌరభసేవనసంపూర్ణసకలకామస్య,
పుష్పాంతరసేవేయం భ్రమరస్య విడంబనా మహతీ.

అని పఠింపఁగా రాజు తనమనంబున నిట్లనుకొనుచున్నాఁడు. ఈచేటి తన చాతుర్యంబుమెఱయ నభిజాత యయినకులకాంతతోఁ బొందు చేసి యన్యకామినిం గల యుంట నీకుఁ దగదని దూఱుచున్నది. దేవపారిజాతపుష్పములందలిసౌరభముసేవించితృప్తిం

* టీక. అమర......కామస్య-అమరతరు = దేవపారిజాతముయొక్క, కుసుమ= పుష్పములయొక్క, సౌరభ=పరిమళమును, సేవన=ఆస్వాదించుటచే, సంపూర్ణ=పూర్ణము లయిన, సకలకామస్య = సమస్తమనోరథములుగలదియగు, భ్రమరస్య = తుమ్మెదకు, ఇయం=ఈ, పుష్పాంతరసేవా = మఱియొకకుసుమమునందు రసాస్వాదనము సేయంగడం గుట, మహతీవిడంబనా=గొప్పదూఱు.

అన్నింటికంటె నుత్తమమగు దేవలోకపారిజాతకుసుమరసం బాస్వాదించి మనో రథపరిపూర్తిఁ గాంచియుండుతుమ్మెద మఱియొక పుష్పంబునందు మధుపానము సేయం గడంగుట నిందనీయము. ఇది యప్రస్తుతార్థము.

అభిజాతయగు మదనమాలినితో రతిసుఖంబులఁ దనివిఁ జెందియుండు రాజ కుమారుని కిప్పుడీవిధంబున వణిక్కన్యకతో సుఖమనుభవింపంగడంగుట చీ యనవలెను,

తెంచియుండు భ్రమరమునకు వన్యకుసుమములందు రసాస్వాదనము చేయం గడంగుట ఏగుల నింద్యము అను ప్రస్తుతార్థముచేత మహారాజకన్యకయగు మదనమాలినితో సమస్త సుఖముల ననుభవించి కాలంబుల నన్నింటిని బరిపూర్ణంబులం జేసికొనినవాం డైన భూపతి కుమారునికిం గాంతాంతరము ననుభవింపం గడంగుట గొప్పదూఱు అను ప్రస్తుతార్థమును వెల్లడిచేసినయది ఇదియు సరియేయని యనుకొని యాగ్రహం గలిగిన సంభ్రమంబును, ఇది వీరలకు విదితం బయ్యెడి దేవీ! సెలవింగించితేని యేమేమి చెప్ప రానున్నదో యనుభయంబును మానసంబునం బెనంగొనం గ్రిందువడనంబు దోషం గాంచిన మణియుం మణిమాల యను నొక్కతె మదనమాలిని ప్రియసఖి యతనిం జూచి యిట్లనియె

*శ్లో॥ నిశ్శంకం గజపతిదానవారిధారా మారాధ్య భ్రమర దినాన్యయాన్యసైషీః
యావ న్న స్ఫురతి కరాళకర్ణతాళ స్తావత్త్వం నవనవపద్మినీ ముపేయాః

అనిన విని రాజు తనమనంబున నీచాటువచనచతురయగు భుజిష్య భ్రమరాప దేశంబున నన్నును గజపతిదానవారిధారాపదేశంబున నీపితృవ్యకుమారునికాంతను చెప్పె దెట్లనఁగ ఓ భ్రమరమా! నీవు ఏగజరాజుమదజలధార నలంకరించుచు నిన్నిదినంబులు గడపితివి ఇట్టి జరగదు మఱియెవరి యుపద్రవించినచో నాగజరాజు కర్ణములచే విసరనేని యూప్రహార మతిక్రూర మయినది నీకుం దగులం బోవును అంతకుముందె గ్రొత్తగ వికసించియుండునట్టి పద్మిని చేరుము అను ప్రస్తుతార్థముచేత నోరాజా! జంకొంచు కయుం లేక నీపితృవ్యకుమారునిభార్య నలంకరించుచు నిన్నిదినంబులు బోఁగొట్టితివి ఎన్ని దినంబులైన నిట్లుండదు నీవు దీనితో నిర్విఘ్నముగ వ్యభిచారముల ననుభవించుచుండుటం గాంచినచో దీని నాయకుండు కోపగించుకొని నీకుం బ్రాణహానిం గావించును ఇట్టి సంభవించుటకు ముందె నీవు దీనిం బాసి నవయౌవనంబు గల నీరాణియగు మదనమాలినిం జేరుము అను ప్రస్తుతార్థమును సూచితంబు చేసె ఈముద్దియ చెప్పినయన్యాపదేశంబు లచే వీరు నావృత్తాంతం బెఱింగినవార లనుటకు సందియంబు లేదు ఎట్టిదైన వీరు రాణికిది తెలుపకయుండరు తరి లేని యూదేవి వైమనస్యంబుం బూనును ఇంక నిరుద్యోగతం బడయుట యుక్తంబు గాదు రాజ్యంబు విడిచి ప్రచ్ఛన్నవేషంబున నాకు

* టీక భ్రమర=తుమ్మెదా, గజపతిదానవారిధారాం=గజరాజుయొక్క మద జలధారను, నిశ్శంకం=జంకులేక, ఆరాధ్య = అలంకరించి, అయాని దినాని = ఇన్ని దినంబులు, అసైషీః=గడపితివి యావత్=ఎంతవఱకు కరాళకర్ణతాళః=కఠోర మగు తాళమువంటి గజకర్ణము, నస్ఫురతి=చలింపదో తావత్=అంతలో, నవనవపద్మినీం = అభినవమగు వికసితమగు తామరతీగెను, ఉపేయాః = పొందుదువుగాక ఇచట "దానవారిధారాం" అనుచో స్త్రీలింగస్వారస్యముచేత స్త్రీవృత్తాంతము స్ఫురించును

దినములు వెలుపల నుంటిని. దేవి యన్యథాగాఁ దలంపక మానదు. అనువుతో నీవణిక్కన్యక యభిమతి వడసి చనియెదనని యెంచి వణిక్పుత్రునిభుజములఁ దనయంసంబుపయి ధరించి విహరించుచుండు కపటవణిక్కన్యకడకుం జేరి యోదేవీ నీతల్లి నన్ను నీకడకనుపునప్పు డియ్యెడ బహుదినములు దడయక వైళంబ రమ్మని చెప్పి పంపినయది. ఇచట నింక నుండుట బాడిగాదు. ఏను నీతల్లికడకుం జన నభిమతి యొసంగు మని యడిగిన సౌందర్యమాలిని యతనిసంభ్రమంబుం గాంచి యిఁక నితని నిర్బంధించుట యురవు గాదని తలంచి మణిమంతునికిం జెప్పి కొన్నిరత్నహారంబులు బహుమతులిప్పించి పంపివేసెను. రాజకుమారుండును దదీయసౌధంబు వడలి చని యాఖేటనంబున కని తొలుత నెపం బిడి నగరంబునుండి వెడలించుకొని తెచ్చి యొక్కచోట నునిచియుండిన తనబలంబునం గలసికొని తననగరంబుఁ జేరెను. ఇట్లుసేరి నగరు సొచ్చి యభ్యవహారాదులు దీర్చుకొని యారేయి యంతఃపురంబునకుం బోయి యచట మదనమాలినిచే సత్కృతుండై తదీయశయనంబునం గూరుచుండి యామగువ యందిచ్చు తెలియాకుమడుపులు గైకొని విడెము సేయుచు నాదేవిచేతివ్రేలం దనముద్రిక యుండఁ గాంచి సంశయించి యీయంగుళీయకము నేను వణిక్కన్యారత్నంబున కిచ్చి వచ్చితిని; ఇది యీరాణిహస్తంబునకు రాఁగతం బేమి? అతినిపుణతరాలోచనగల నాహృదయంబున కిది యందక యున్నది. నిన్న సాయంసమయమున దానిచేత నిది యుండఁగాఁ గుర్తించి చూచి యున్నవాఁడను. ఈదేవి నడిగినచో నీమగువ నన్ను నీచేతినుండి మఱియొకరిచేతి కిది పోక నాచేతి కెట్లు దొరకును? నీచేయి విడిచి పోవుటకుం గారణం బేమి యని యడిగెనేని యందుల కుత్తరం బేమియు లేదు. కాన నీదేవి నడుగుట కనువుపడదు. మానసంబు సంశయాకులంబై యసిర్వృతిఁ జెందియున్నది. అదియునుంగాక వణిక్పత్నికిని యీదేవికి నొకించుకయైన భేదంబు గనంబడదు. ఈరాణియే మణిమంతునింటికి వచ్చియుండునా! యని సంశయించుటకును లేదు. ఈదేవియుండు నంతఃపురకవాటములు మదీయముద్రాంకితములై నావచ్చునంతదనుక యట్ల యుండినయవి. ఈమదనమాలిని యుండువిధంబుం జూడ భర్తృవ్రతపరాయణ యనుట కొకించుక విరోధమును జూపట్టదు. నేను విప్రవేషంబున నంబికాలయంబునం దుండునప్పుడు నన్నుం గనిపెట్టవచ్చినదూతిక తా నచటికి వచ్చినసందర్భము నాకుం దెల్పునప్పుడు తాను మదనమాలిని యంపఁగా వచ్చితి నని చెప్పంబోయి మాటసవరించుకొని మదనమాలినికి సమానురాలైనమణిమంతునిరాణి యని చెప్పినయది. నేను నాయంగరము వణిక్పత్నిచేతివ్రేల నిడి మదనమాలినివ్రేల నిడినట్లున్నది యనఁగా నది తనకును మదనమాలినికిని భేదంబు లేదని వచించి యొకవిధముగఁ దనవచనమును సమర్థించి యున్నది. ఇవియన్నియు నారసిచూడ మర్మ మిట్టిదని బుద్ధిగోచరము గాక యున్నయది.

అని యాలోచించుచు నిదురఁ గూరి మరునాఁ డుదయమున లేచి కాల్యకృత్యంబులు దీర్చి యొకయను వారసి యీదినము మణిమంతుని వానిభార్యను మనయింట భోజనము సల్పం బిలిపించితి మేని మదీయహృదయగతసంశయము వాయుం నని తలంచి విమనాయమానమాన యైయుండు మదనమాలిని మొగంబుం జూచి యేలకో యిద్దేవి తనమనంబున నుమ్మలికంబుఁ జెందుచున్నది యని సంశయించుచుండ మదనమాలిని యి ట్లనియె.

*శ్లో. హేమ్నః ఖేదో న తాపేన ఛేదేన కషణేన చ,
తదేవ హి పరం దుఃఖం యద్గుంజాసమతోలనమ్.

అని చెప్పి యవనతముఖి యై యుండిన నది విని రాజు తనయాశయంబున నిట్లు చింతించె. ఈదేవి వణిక్కన్యకతో నేను గలసినవృత్తాంతంబు సకియలచే వినియున్నది గానఁ దద్విషయమునం గుపితగాఁ గనంబడియెడి. ఇ ట్లగుటం జేసి యీరాణి నేను దాని నియ్యెడకు రప్పించుటయుం, అది వచ్చె నేని దానికిం దగినగౌరవంబు దాను జరుపుటయు నిరువురు సమానభావంబునఁ బ్రవర్తించుటయుం దన కిష్టము గాదు అనుభావము నీ పద్యభావముచేఁ దెల్పినయది. బంగారమునకు నిప్పునం బెట్టి కరగించుటవలననొండె ఖండనము సేయుటవలననొండె ఒఱయిక వేయుటవలననొండె ఖేదము లేదు. మఱి కరము గొప్పతనముగలయద్దానికి గురిగింజతో సమానముగఁ దూఁగ వలసినట్లు సంభవించుట మహాదుఃఖమై యున్నది యనునప్రస్తుతార్థముచేత బంగారమువంటితనకు నంతఃపుర కవాటముద్రణాదులచే నైననిరోధమునం జేసి మనస్తాపంబు గలిగించి, బరితపింపం జేయుటవలన నొండె, నాయందు ఖేదబుద్ధి యిపుడు కలిగినవాఁడనై యుండుటవలన నొండె, దానిదాసీజనులును దూతికలును వచ్చుచుం బోవుచుండుటవలన నొండె, దనకు దుఃఖము లేదు. మఱి కులటయుఁ దగ్గుకులము గలదియు నగునావణిక్పుత్త్రికి నాతో సమానమగుగౌరవము నొసంగి నాయుండునంతిపురమునకు రప్పించి యుంచుట యనునది మహాదుఃఖకరమై యున్నది యనుప్రస్తుతార్థమును దెల్పినయది. ఇది యీదేవి కిష్టంబు గాదు. ఇష్టంబు గానికార్యంబు చేసినచో నింతకే నాయొనరించినయపరాధంబున మిగుల వ్యథితచేతనయై యున్నయీదేవి ప్రాణపరిత్యాగం బొనరించుకొనునో యేమొ, అట్టికార్యంబునకుం గడంగం జనదు అని నిశ్చయించుకొని వణిక్కుమారుని మాత్రము భోజనమునకుం బిలిపించినం గొన్నివిషయంబు లారయ నగు నని యెంచి

---

* హేమ్నః=బంగారమునకు, తాపేన=కాచుటచేత, ఛేదేన=ఖండించుటచేతను, కషణేనచ=ఒఱపువేయుటచేతను, ఖేదః=దుఃఖము, న=లేదు. గుంజాసమతోలనంయత్=గురిగింజతో సమానముగఁ దూఁగుటయనునది యేదియో, తదేవ=అదియే, పరం=మిగుల, దుఃఖం=దుఃఖకర మనితలంచెదను.

యట్లతనిం బిలిపించి సమ్మానంబుచేసి తనపొత్తున భుజియింపం జేసెను. వణిక్కుమారుండును భోజనము చేసి యారాజును దాను నొకవిచిత్రకంబళమునం గూరుచుండి విడెము సేయుచు రాజుం గాంచి యోరాజచంద్రమా యే నీనగరమునకుం జనుదెంచిన దాదిగ నీవు నాకుం బ్రాణమిత్రుండవై నాకు సర్వసహాయంబులు చేసితివి. నేనును రత్నవర్తకంబునకై నిలుచుట యనునది యట్లుండ భవదీయమనోనువర్తనంబు సేయ నిన్నినాళ్లు నీనగరంబున నుంటిని. స్వదేశగమనంబు నా కత్యావశ్యకమై యున్నది. నీకు నాయందు భేదబుద్ధి గల్గక యుండుటం జేసి భవత్పరిపాలితంబగు దేశ మంతయు మదీయంబయి యుండినను మాతృపితలు కడు వృద్ధులు; నాయం దతిప్రీతితోం బ్రవర్తించువారు నన్నుం జూడ నెంచి యీదిన ముదయసమయమున నాకుం బత్రిక వ్రాసి యంపిరి. ఇయ్యెడ నింకం దడయుంట కనువు లేదు. భవద్విరహంబు దుస్సహంబైనను మాతృపితల యాజ్ఞ దుర్లంఘ్యమైనది గానం బోవలసియున్నది. నాకుం బోయిరా నానతిండు, ఎల్లి నాయింటికి వేంచేసి నాసేయు విందారగించి నన్నుం గృతార్థునిం జేయ నామనవి యంగీకరింపుండు. అని ప్రార్థన సేయంగా మానపాలుండు తద్వచనంబుల కులికిపడి వణిక్కన్యకావిరహంబు మానసంబు దహింపనతనికి మా టేమియుం జెప్ప నను వేది యెన్నియేనిం బ్రయాణనిరోధవచనంబులు సెప్పియు నవి కార్యకరంబులు గామి మనమునం జింతించి ప్రియమిత్రనివిరహంబునకును ప్రాణనాయకియగువణిక్కన్యకాపునస్సమాగమవిరహంబునకు నుమ్మలించుచుం జేయునది లేక యామరునాడు తత్ప్రార్థనంబును నిర్వర్తింప నంగీకరించి యావణిక్కుమారుని గంధ, మాల్యా, నులేపన, కనకాంబరా, ఉఉభరణాదుల సన్మానించి యతని నింటికిం బంపెను. ఆదినమును రాత్రియు నంతఃపురముననయుండి రాజు మఱునాడు నిదుర లేచి వణిక్కన్యకాగతమానసుండు గానం గాల్యకృత్యంబు లతిత్వరితగతిం దీర్చుకొని యంతలోనన తన్నుం బిలుచుకొనిపోవుట.కేంగుదెంచియున్న వర్తకకుమారునిం గారవించి మదనమాలిని యుండునంతఃపురము ముద్రించికొని యతని నాత్మరథారూఢుం జేసికొని తదీయసౌధమునకుం జనియె. రాజు వెడలిపోయినతక్షణంబ మదనమాలిని తాను సురంగద్వారంబున నిర్గమించి మణిగుప్తుని సౌధంబునకుం జని తాను వచ్చునంతలో భక్ష్యభోజ్యాదిసహితముగం రసవదన్నంబు వండి సిద్ధపఱిచి యుండం గాంచి యభినవసర్వాభరణభూషితయై బంగరుపట్టుసరిగెబుటేదారుచీరెం గట్టుకొని యిటునటు నాయింటం దిరుగుచు రాజుచక్షుష్పథంబునకుం దగిలితగులనట్టు నటించుచు వణిక్కుమారునికిని రాజకుమారునికిని బాద్యాదిప్రదానంబుం దాన చేసి కనకమయపాత్రంబులం దన్నాదికంబు వడ్డించి తత్కాలోచితవ్యజనాందోళనాదులం గావించుచుండె. మానపాలుం

దర్శనంబు పడ్డించునప్పుడు వణిక్కన్యకాహస్తాగుళంబునం దా నిడినవజ్రాంగుళీయకంబు మెఱయుచుండుటం గాంచి యిది కతదినాంతంబున రాణిచేత నుండం గనుంగొంటిని. ఇది యీవణిక్పుత్రికాకరంబునను గానంబడుచున్నది. అది యట్లుండ నీకామిని యిడిన కూరలును నంజుళ్లును తక్కుంగలభక్ష్యాదులును మదనమాలిని వండించినవియ యని వానియాస్వాద్యతచేతం బ్రకటింపం జేసెడిని. ఇం దేదని నిర్ణయింప నాడెందంబు దార్ఢ్యంబు నొందక యున్నది. ఏమిసేయ నగును. అని సందేహించుచు నింక నీశశాంకముఖిం జూడంబోనుగా! దీనిబిగికౌంగిటిం గాననుగా! దీని నునువాతెరపానకంబు లాననుగా! యనునార్తివెగ్గలంబై మానసంబుం గలంప నెట్టకేలకుం దనమిత్రునితో భుజించి లేచి యారమణి వార్చుజలంబులం గరంబులు గడుగుకొని యామదవతి మడిచి యిచ్చు తెలియాకుమడుపు లందుకొనుచు మణిమంతునితోం దానును విడెముసేయుచుండె. అదియుం రాజుం దాం గాంచిన దాదిగ,

సీ. సొగసుగ మోముం ద్రిప్పి తమి సొక్కుచు రాజును గన్నుగీటుచుస్
నిగనిగలాడుగండముల నిండి బయల్పడు లేతనవ్వుతోం
బొగరుకుచంబులం బయలు పొల్పుగం గ్రమ్ముచుం బైటం జార్చుచుస్,
మగువ గరంచుచుండెం బలిమైమయిం దాంకంగం జెంతం జేరుచుస్.

మఱియుం విడెము సేయుచుండుసమయంబున మణిమంతుండు రాజుతో నోరాజచంద్రమా యే నీదినము సాయంసమయమున నామగుపం దోడ్కొని యీయూరు వెడలి యీనగరసమీపమున నుండెడునవరసాలవనంబున విడిసి యుండి ఎల్లి సూర్యం డుదితుండు గాం బయన మయ్యెదను. ఇందుకు మదల గావలయుం నని చెప్పి తనసుజ్ఞాతుండై ప్రయాణసన్నాహంబు సేయుచుండె. దాసదాసీజనులు కార్యవ్యాపృతులై యుండిరి. అప్పుడు సౌందర్యమాలినియుం,

సీ. ఒంటి నుండెడివేళ యొకత్రుటి దొరకిన వచ్చి కవుంగిటం గ్రుచ్చి యొత్తు
తివిరి పనుల్ సేయంతీరునం దిరుగుచు నచ్చినచో ముద్దులాడిపోవు
నొకకన్ను వణిజుపై నుంచి వేఱొకకంట సయ్యాటములు సల్పు సన్న సేయుం
దవ్వులనుండి మోదంబున నవ్వుచు మోవి యిమ్మని తనమోవి యొగ్గు
కార్యసత్వరభావంబు గన్పడంగ, సురిఁగి చేలాంచలము పయి సోఁకఁజనును
భావివిరహవ్యథను దుఃఖపడెడునృపుని, నింతి యలరించె నీరీతిం గొంతసేపు.

ఇంతలో ఛాయావిటుండును చరమగిరిసాను వలంకరించె. అప్పుడు రాజు తా మానసంబునం బరితపించుచు నెట్టకేలకుం దనరథంబు సజ్జంబు చేసికొని రమ్మన్న నప్పుడు సారథియుం నతిజవాశ్వంబులం బూన్చి తే రాయత్తము చేసి కొనితెచ్చిసౌధబహి

ర్ద్వారంబున నిలిపి యాభూరమణునికిం దెలుప నంపించిన మణిమంతుండు గపటవణిక్కన్యకావేషంబు ధరించి యుండుమదనమాలినితోఁ బ్రయాణసన్నాహంబొనర్చి రథారోహణము సేయం బోవుచు రాజుం గాంచి యోరాజచంద్రమా బహుదినముల నుండి నీతో సహాసనాదుల నెడలేక యుండి నిన్ను విరహవ్యథాకులితునిం జేసియేఁ బోవుచున్నాఁడను. స్నేహపాత్రం బన్ననో యితరుండు గాఁడు. ఏను నొకవ్రతంబుఁ బూనియున్నవాఁడఁ గాన భవదాలింగనాదిసుఖం బనుభవింపకయ చనియెద నని చెప్పిన రాజు నవనతముఖుండై గుర్వాజ్ఞానుసారముగ నడుచుకొనుట యత్యావశ్యకమ యై యుండ నితరము లెట్లు సమకూరు? మీరలు రథారోహణము సేయుఁడు; ఏను నవరసాల కాననమున మిమ్ము విడిచి పురంబున కేఁగుదెంచెదను. ఇంక నొకించుకసేపు మీసహవాసము మాకుండం బోయెడి. అనిచెప్పి కపటవణిక్కన్యకతో మణిమంతుండు రథారోహణముసేయ రాజుదానును వారలతో దానిపై నెక్కి సారథికిఁ దేరు బోనిమ్మని యాజ్ఞ చేసెను. పట్టణవీథిఁ దాఁటి తేరు నొక్కగడియకు నవరసాలకాననసమీపమునకుం బోయె. రథంబుఁ బలసికొని రాజభటులు వచ్చుచుండిరి. కొందఱు రాజకీయోద్యోగులును నగరంబునం గలధనికులును మణిమంతునియందలిసౌహార్దంబుచే సారథము వెంట సముచితయానారూఢులై యేతెంచుచుండిరి. రథావతరణము సేయం దగుచోటును డగ్గరించెను. అప్పుడు కపటవణిక్కన్యక మానపాలునిముఖాంబుజంబును దనకటాక్షంబుల దీనభావంబు దోఁపఁ జూచుచు దదీయవిరహవ్యథకుఁ దాళంజాలని తెఱంగునఁ గనుదమ్ములం బొడమి పక్ష్ముల నిండి యుండుబాష్పంబులతో ని ట్లనియె.

* శ్లో. కంచి దేవ సమయం సమాగమా, త్త్వాం న విస్మరతి శశ్వ దంబుజం,
మానసే విహార హంస మానసే, మా విముంచ పున రస్య సౌహృదమ్.

అనిచెప్పి యతని ముఖకమలవిన్యస్తంబులై బాష్పఝుళఝుళము లగుక్రేఁగంటి చూపుల నెట్టకేలకు మరలించి మఱియొకవలను జూచుచుండె. రాజును దానివచనంబులు విని యిట్లుదలంచెను. ఈయలిచతుర నన్నుఁదా నెడబాసి పోవునప్పుడు చతురతరవచనంబుల నుపచరించుచున్నయది. అంబుజాపదేశంబునఁ దన్నును హంసాపదేశంబున నన్నును మానసాపదేశంబున రాణిని బ్రకటీకరించి యోహంసమా నీవు మానససరో

* హంస = హంసమా, కంచిదేవసమయం=కొంతకాలమే, సమాగమాత్=కలసి యుండుటచే. త్వాం=నిన్ను, అంబుజం=తామర నవిస్మరతి=మరువదు. మఱి-శశ్వత్=సారె సారెకు, తలంచుకొనుచుండును. నీవు-మానసే మానససరస్సునందు, విహార=విహరింపుము. అస్య=ఈకమలముయొక్క, సౌహృదంపునః=స్నేహమునన్నో, మానసే=హృదయంబునందు, మావిముంచ=ఎడబాయకుము.

వరంబున విహరింపం బోయెదవు. కొంతకాలము నీతో సహవాసము చేసి యుండుట చేత నీకమలము సదా నిన్నుఁదలంచుకొనుచుండు నే కాని మఱవదు, కాన దీనిసౌహృదమును హృదయమున మఱువక యుంచుము" అను నప్రస్తుతార్థముచేత నోరాజహంసమా నీ వింక నీదేవియగు మదనమాలినితో విహరింపం బోయెదవు. నీతోఁ గొంత కాలము సమాగమము చేసియుండుటచేత వణిక్కన్యక నైన నేను ని న్నొకప్పటికిని మనస్సున మఱువను? ఎల్లకాలము స్మరించుకొనుచుండెదను? ఈనాతోఁ జేసినస్నేహమును వదలకుము. ఇంతటితో నయినదని యెంచుకొనక నింకను గొంతకాల మంచుకొనుము. అను ప్రస్తుతార్థమును సూచింపం జేసినయది. అయారె యీయొయారి గదా యతిచతుర! ఇట్టి సుధామధురోక్తికుసుమంబులఁ బూజించినయీమానినీతిలకమును వియోగదశాపరిఖిన్న యయియుండుదాని నాదరించి యుపచరింపనివాఁడు నాసరసత విరసతం గదా చెందు. చతురతరోక్తుల మనోనురక్తిం గానిపించెదం గాక యని యిట్లనియె.

*శ్లో॥ నిషీదతు శిరీషకే చరతు వా కదంబే చిరం, సముత్పతతు పంకజే కురవకే కరోతుస్థితిం
దినం నయతు కుందకే నసురసాల కాలక్రమా, న్న విస్మరతి కేవలం తవగుణా నసౌషట్పదః.

అని చెప్పఁగా విని మదనమాలిని యారాజు పరమరసికవతంసుండు గాన నేఁజెప్పినపద్యభావంబునకు మనంబునం గరంగి యతిసరసోక్తుల నన్నుపచరించుచున్నవాఁడు. పారిజాత మని నన్నును షట్పద మని తన్నును నితరకుసుమము లని తన కనుభవయోగ్యలగు నితరకాంతామణులను దెల్పి పారిజాతమా భ్రమరము శిరీషమునందు వసించినను; కదంబమున సంచరించినను; పంకజంబున దుముకుచుండినను; గురవకంబునఁ గాఁపురముచేసినను; గుందమున దినంబుఁగడపినను ఎంతకాలము గడచినను నీగుణము లీషట్పదము మఱచునా! యనునప్రస్తుతార్థముచేత నేను నాకనుభవనీయ లగుకాంతామణులయందుఁ గొందఱితో నివసించుచుండినను గొందఱికడ కప్పుడప్పుడు పోయినను గొందఱితోఁ గ్రీడావిహారాదుల సల్పినను గొందఱితో సదాసహవాసము చేసినను గొందఱికడ

* సురసాల=పారిజాతవృక్షమా, అసౌషట్పదః = ఈతుమ్మెద, శిరీషకే=దిరిసన పుంబువ్వునందు, నిషీదతు=ఉండుఁగాక! కదంబే=కడిమిచెట్టున, చిరం=బహుకాలము, చరతువా=సంచరించిన సంచరించుఁగాక; పంకజే=తామరయందు, సముత్పతతు=ఎగిరి పడునుగాక! కురవకే = గోరింటయందు, స్థితిం=స్థిరవాసమును, కరోతు = చేయుఁగాక! కుందకే=మొల్లయందు, దినం=దినమును, నయతు= చెల్లించునుగాక! ఓపారిజాతమా యీతుమ్మెద;తవగుణాన్ =నీగుణములను, కాలక్రమాత్ కేవలం=కాలముజరిగినందుచేతనే, నవిస్మరతి=మఱువదు.

దినమంత యుండినను బహుకాల మయ్యును పారిజాతకుసుమమువంటి నీసరసతాచాతుర్యాదిగుణంబుల నేనొకప్పటికైన మఱతునా; యప్రస్తుతార్థమును వెల్లడిసేసినవాఁడయ్యెఁ; ఇట్టి యితనిసరసత్వాదుల నిప్పుడీవిధంబునంగాక యితరప్రకారంబున ననుభవింప ననువుపడునా? ఇది యనుభవించి కృతార్థ నైతిని గదా యని మనంబున నామోదంబు నొందుచు సమయోచితకార్యానుగుణంబుగా నించుక మందస్మితంబుతోడను దీనభావంబుతోడను రాజుమోముం గనుంగొనుచు నూరకుండెను. ఇంతలో గమ్యస్థలంబున నవరసాలకాననంబునం గలచంద్రికాసౌధంబునకు రథంబు సేరెను. మణిమంతుఁడును సౌందర్యమాలినియు రాజును రథము దిగిరి. మణిమంతుండు తన్నుం గౌరవించుటకు వచ్చియున్న పౌరజనులను యథోచితసత్కారంబుల గారవించి రాజుం గాంచి యోరాజచంద్రమా పయనమయిపోవువారలతోఁ బ్రోవవిడువవచ్చినబంధువులు జలంబులు దాఁటి రాఁగూడదని పెద్దలు సెప్పుదురు; గాన నిన్ను మరలఁ బురంబునకుం దోడ్కొని పో వేచియుండు నీపౌరవృద్ధులతో వైళమ నగరమునకుం జనుము. భవద్విరహంబున దుర్మనాయమానమానసయై యుండుదేవి నాదరింపుము; పొమ్ము; నాయెడఁ గరుణ యుండనిమ్ము అని సరసవచనంబుల నుపచరించి పంపఁగా రాజును వణిక్కన్యకాగతహృదయంబు మరల్పం జాలకయెట్టకేలకు నతని వీడ్కొని పౌరవృద్ధులతో మరలి తననగరంబునకుం బోయెను. ఇట్లుసని,

మ. తరుణిం బాసినదుఃఖనీరధి దురంతంబై వెసం బొంగ ని
ర్భరతాపంబున వేఁడియూర్పులు వెస న్బైపైన నేపారఁగా
స్మరభూతంబు మనంబుఁ బట్టికొని వేఁచన్సాగఁగా నప్పుడా
ధరణీశాగ్రణి యేమి దోఁచకయ కాంతాసౌధవాసార్థియై.

మదనమాలినిసౌధంబునకుం జని ముద్రలు దీయించి లోనం బ్రవేశించి యంతకుం బూర్వమునఁ దా లోనం బ్రవేశింప నెదురేఁగుదెంచి ప్రణయరసపరిపూరితకటాక్షమాలికలఁ దన్ను నలరించుచుఁ గైదండ యిచ్చి కొనిపోవుతనదేవి మదనమాలిని కానంబడక యుండుటకు మిగుల ఖిన్నుం డగుచు ననారతమును దనదేవితో నందు వసించుచుండ నియమితలైనపరిచారిక లెవ్వరేనియుం బొడసూపమి కచ్చెరువొందుచుఁ బంజరకీరశారికానికరంబులు తన్నుం గాంచి కలరవంబులఁ గోలాహలంబు సలుప వాని నాదరించుచు నీదేవి యేను వణిక్కన్యానురక్తుండ నయినవిధంబు విని కోపంబున నాకడకురాక నన్నుం గారవింపక యున్నది; కాఁబోలు? నంతిపురంబున గలయ నవలోకించెదనుగాక యని రతిగృహంబునకు రచ్చమండపమునకుఁ దక్కుంగలచోట్లకును జని వెదకి వేసరి తదదర్శనంబునకుఁ గతంబు చింతించి చింతించియు నేమియుం దోఁచక కట్టా తా నొక్కటి

దలంప దైవ మొక్కటి దలంచు ననుమాట తథ్యం బయ్యె. స్త్రీలమానసంబు సహవాస దోషంబునం బరపురుషానురక్తం బగు నని యెంచి యిట్టినిర్బంధంబున నాదేవి నుంచితిని; దైవం బది యోర్వక తానె యపహరించెఁ గాఁబోలు! సారతరంబగు వస్తువును గోరుట యెల్లవారికిం గలదు. రూపలావణ్యసార యగుటం జేసి విధియుం దీనియందు ననురక్తుఁడై తాఁ గొనిపోయె నొక్కొ! కాదేని మనుష్యమాత్రులకు దీని నపహరింప శక్యం బగునే! కట్టా నాకుం గలిగినకష్టంబు కడు దుర్భరము.

గీ. ప్రాణనాయిక యిప్పుడ బాసి చనియె, పట్టమహిషియుం నింటఁ గన్పట్ట దకట
హృదయమున కెద్దియును రమ్యమింపు గాదు, దుఃఖసాగరమగ్న మైత్రుం గెమదియుం.

ఈమదనమాలిని నాయందుఁ బ్రవర్తించువిధంబున మహాపతివ్రతాతిలకంబులును దమకమమగలయెడ నడచుకొనఁ జాలరు. పతివ్రతాధర్మంబు లాదేవికిఁ బొల్పడి యుం డుంగాదె.

సీ. నన్నుఁ దాఁ గనినచో నగుమోముతో వచ్చి కైదండ యిచ్చి వే గారవించు
దాసీజనం బుండఁ దానె మత్పరిచర్య, తెలమిఁ జేయుచు మది కింపు నింపు
పెన్నిధి దొరకిన పేదచందంబున నను రాగమున మించి యాదరించు
శ్రాంతుఁడ నై యుండ సరసఁ బాయక యుండి శీతోపచారవై చిత్రి నెరపు
చెలఁగుఁ బితృదేవపూజల శిష్య యట్లు, రాజతంత్రంబులందు మంత్రంబు నెప్పు
మదనతంత్ర ప్రవీణత మనసుఁ గరఁచు, నట్టిదయితావియోగ మే నెట్టు లోర్తు.

అని చింతించుచుండఁ దవ్వులనుండి యొకపద్యంబు వినంబడియె.

శ్లో. * భర్తా యద్యపి కామశాస్త్రనిపుణో విద్వాన్కులీనో యువా
దాతా కర్ణసమః ప్రసిద్ధవిభవ శ్శృంగారదీక్షాగురుః
స్వప్రాణాధికకల్పితా ప్రియతమా స్నేహేన సంవర్ధితా
తం కాంతం పశువ ద్విధాయ తరుణీ జారం పతిం వాంఛతి.

---

* టీ. భర్తా=మగఁడు, కామశాస్త్రనిపుణో యద్యపి = కామశాస్త్రమున సమర్థుం డైనను, విద్వాన్=విద్వాంసుం డైనను, కులీనః=కులీనుం డైనను, యువా=తరుణుం డైనను, కర్ణసమోదాతా=కోరినవాని నొసంగెడుకర్ణునితో సమానుఁడగు నుదారుం డైనను, ప్రసిద్ధవిభవః=ప్రసిద్ధమగు వైభవంబుగలవాఁడయ్యును, శృంగారదీక్షాగురుః = శృంగార మునదీక్షాగురువయ్యును, స్వప్రాణాధికకల్పితా ప్రియతమా = తనప్రాణములకంటె నధిక ప్రియతమయని, కల్పితా=కల్పింపంబడి, స్నేహేనసంవర్ధితా=స్నేహంబునఁ బెంపఁబడినది యయ్యు, తరుణీ=కాంత, తంకాంతం=అట్టిభర్తను, పశువద్విధాయ=పశుప్రాయుం జేసి, జారం పతిం=జారభర్తను, కాంక్షతి=కోరుచున్నది.

అని నుడువంబఱిన నాశ్లోకంబు విని తనమానసంబున నిట్లు చింతింపం దొడంగె. ఈపద్యార్థంబు స్త్రీలకుఁ బరపురుషవాంఛ యుండుట సహజ మనియు నది తన వెనిమిటి సర్వగుణోపేతుం డయి యుండినను దాదృశునిసయితము మోసపుచ్చి జారపురుషునితోఁ బొందు సేయం ననుభావంబును దెల్పుచున్నయది. ఇది సమయసముచితమగు నుపశ్రుతి యగుటం జేసి ప్రమాణ మని యంగీకరింపం జనును. దీనివలన సందిగ్ధార్థనిశ్చయంబును సేయనొప్పు. అదియునుంగాక యీపద్యంబు దేవీవృత్తాంతంబున సంశయించుచున్న నా కక్కామిని జారపురుషవాంఛావంచిత యయి సురఁగినవిధంబు నామానసంబున కవగతం బగుట కొకచతురయగు చేటిక నుడివినవిధంబు సువ్యక్తం బయినది. కానను మదనమాలిని యతిరూపవతియు నతిచతురయు నతిరసికయు నగుటం జేసి యిట్టికృత్యంబులకుం బాలుపడియుండుం గాఁబోలు నని యొకించుక హృదయంబునకుఁ దోఁచుచున్నది. కవాటములు ముద్రితమై యుండ నాదేవి యెవ్విధమున వెలికిం జన ననువుపడు? స్త్రీజనంబుల కిట్టి పనులయందు రూఢ మయియుండు పాటవంబు బహుచతురమనీషిజనదురవగమ్యం బయిన దని వాడుక గలదు. వణిక్పత్నికిని మదనమాలినికిని భేదం బొకించుకయుఁ గనంబడదు. మదనమాలినియె వణిక్పత్నియాకారంబుఁ దాల్చి చతురత్వంబునఁ బ్రవర్తించినవిధంబె యథార్థం బని నిర్ణయించెదను. వణిక్పుత్రుండును గామినీజనంబులకుఁ గన్నులపండువు సేయునభినవయౌవనరూపలావణ్యాదులఁ దద్దయుఁ బెద్ద యయి చెలంగుచుండువాఁడు. ప్రియమిత్ర మగుటం జేసి యతనివిషయంబున నహితప్రవృత్తి సేయం జనదు. ఈయర్థంబు నిశ్చితము గామి నతని నేమియు నన నొప్పదు. ఇందుఁ బరోక్షభావంబుగఁ గలతెఱం గాఱయుట యురవు. ఏన యిప్పుడు చోరభావంబున నవరసాలవనంబునకుం జని చంద్రికా సౌధంబుం జొచ్చి యతనిమచ్చకంటి నపహరించి కొనితెచ్చి మదీయసౌధంబున నుంచితినేని యేరూపమున వ్యక్త మయినను నాకనుకూలమ యగు. నాదేవియె యయ్యె నేని జారగ్రస్త యగుటకుం దగినపనులు సేయఁ జను. వణిక్పత్ని యగు నేని విడిచిపుచ్చెదను. అంతలో నాకాంతాతిలకంబుతోడ నొకింతసేపు కంతులీలల నితాంతవిరహవేదనాతాంతం బయి తపించుచుండుస్వాంతంబును విశ్రాంతంబుఁ జేసికొనియెదను. ఊరక యీయాలోచనచేఁ గాలయాపనంబు సేయుటవలన నుపయోగంబు లేదు. అని నిర్ణయించుకొని తనకు రెండవహృదయంబు నా నొప్పుకొందఱు గూఢచారుల రప్పించి యేకతంబున వారల కావిషయంబు సెప్పి చోరవేషంబులం దాల్చినయవ్వారలతోఁ దాను దదీయాకారంబు ధరించి నవరసాలవనంబునకుం జని స్వనియుక్తులయినరాజభటు లతిజాగ్రతతోఁ జంద్రికా సౌధద్వారంబుఁ గాచుచుండం గనుంగొని దానిపిఱిందికిం జని నిలుచుండి యాసౌధాంతరంబు నిశ్శబ్దం బయి యుండుటం బరికించి తనతోడ నేతెంచినవారల నయ్యైయెడల

దవ్వుదవ్వుల నుండ నియమించి మానపాలుండు తనబుద్ధికౌశలంబునఁ దదీయశయన గృహంబు నిరూపించి యామందిరకుడ్యంబునకుఁ గన్నముపెట్టి తద్భిత్తిశకలంబుఁ జేతులం బట్టి భూమిపయిం బెట్టి తాన యాబిలంబుఁ బ్రవేశించెను. ఆమందిరంబునందు నతిరూపవతియగు నొకకాంతయుఁ గాంతుండును గమనీయమృదుళతరోపధానంబులతో నతిధవళంబయి యతిసుకుమారంబయి యొప్పు ప్రచ్ఛదపటంబుతోడను క్షీరసాగరంబుగూడిక్రిం జెలువారుమనోహరమహనీయతల్పంబునందుం బరుండి నిదురించుచుండుటం గాంచి యీ కామినితోఁ గమనీయశయ్యాతలసుఖప్రసుప్తుండై యుండువణిక్పుత్త్రుం డొనరించిన భాగ్యంబుగదా భాగ్యం బని యనుకొనుచుఁ దత్సమీపమున నతిమనోహరమణిస్తంభంబునం బ్రజ్వలించుచుండుదీపకళిక నించుక మందప్రకాశం బొనరించి యించుకించుక గ్రమ్ముచుండుచీకటులనీడలం బొంచిపొంచి యామించుబోడిమంచంబు దగ్గఱి యగ్గజపతిగామిని సరస నిలిచి తదీయాంగుళీదళంబున నవధీరితభానుప్రభాభాసమానం బయి మరీచిరింఛోళికాపటలంబులం బఱపుచుఁ దద్దయు వెలుంగుముద్దుటుంగరంబుం గనుంగొని యీ యంగుళీయకంబు మదీయంబ;దీని నీవణిక్పత్నీకరంబున నేన ప్రథమసమాగమంబున నిడినవాఁడను; చీకటు లించుక బర్వుటచేత నీముగుదమోముదామరఁ బాగుగఁ గాంచి నిర్ణయించుట కనువుపడక యుండినను వజ్రమణినిర్మితాంగుళీయకం బుండుటం జేసి నమ్మం జనును. రతిక్రీడాపరత్వంబునం బరిశ్రాంతులై యీ యిరువురు గాఢనిద్రాపహృతచేతనులయి యున్నవారు. ఇం దీకందర్పసుందరుని మోమునందంబుం గనుంగొన సౌందర్యమాలిని పోలిక యుట్టిపడుచున్నది. పురుషాకారంబుం బట్టి చూడ నట్లు తోఁచుట యనవరత తదీయభావనా భావితభావానుబంధవిశేష విభ్రమంబయని నిర్ణయించుట యుక్తియుక్తంబు. వణిక్కుమారుని మోముజాడ లీవనితామణిముఖారవిందంబునం జూపట్టుచున్న విందులకుం గతం బవగతంబు గాదు. ఈ విషయంబు నిర్ణయించుచు నియ్యెడఁ దడయుట లగ్గుగాదు. వచ్చినపని చూచుకొని విచ్చలవిడి నాలోచింపం జనును. అని తలంచి యనువు మెఱయఁ గాంతునికరంబును గామినీకుచకలశలగ్నం బయి యుండు దానిని మెలఁకువతో నెత్తి వానియురస్థలంబుననిడి యం దున్నతపయోధరయుగళకనక కలశంబుల సుఖసంస్పర్శంబుభాతిఁ దోఁచిన సస్వేదంబు ససంభ్రమంబును సపులకంబునై కరంబు కంపింప నందుకు మనంబున సంశయించుచు మరల స్పృశించిన నిద్రాభంగంబు గల్గు నొకో యని యనుకొని యతిహస్తలాఘవంబున నా యిరువురియందుఁ దరుణీమణి నెత్తికొని మేలుకొనకయుండ మూఁపుపై నిడికొని సురంగంబునం దూరి యతినిభృతగతిం జని తన యంతఃపురంబున మదనమాలినిరతిమందిరంబున సుకుమారతల్పంబునం బరుండంబెట్టెను. ఇట్లు పరుండం బెట్టి దాని సరసన నిలిచి కలయం గాంచి యాకాంచ

ఉ. సిగ్గును భీతియుం గదురఁ జేరువ నుండెడు రాజుఁ గాంచి యా
దిగ్గజరాజయాన యు మది న్వెఱఁగందుచు లేచి మంచముం
డిగ్గి తొలంగి జాఱి కటిదేశగతం బగుపైట దిద్దుకొం
చగ్గలికం గనుంగొనియె హల్లకరోచులు దేరుచూపులన్.

రాజును మదవతీమణి మంచంబు దిగి చీర సవరించుకొనుచు సంభ్రమించు సమయంబున నాసర్వాంగసుందరిసర్వావయవంబుల నించు కించుక గనుంగొని యిట్లనియె.

సీ. కాదంబచరణవిక్షతులు గాంచనిపద్మకోశంబు లీయింతికులుకుఁజనులు
పుంస్కోకిలసుచంచుపుటము సోఁకనిమంచిలేమావిచిగురాకు లేమమోవి
భ్రమరరాజవిహారపాత్రభూతము గానిపారిజాతసుమంబు భామతనువు
మారుతాలింగనప్రారంభవతి గానిమాలతీలతిక యీమగువమిన్న
అండజవిహార కలితచిహ్నత్రయంబు, గానిశారదపులినంబు చానపిఱుఁదు
చాతకాకాంక్షఁ దీర్పనిజలదపటలి, యనఁగ నొప్పును గ్రొవ్విద యబ్జముఖికి.

గీ. ఈమనోహరాంగి నింతకుఁ బూర్వము, గలసియున్నవాఁడఁ గానె యయిన
నిపుడు దీనిఁ జూడ నింకొక్కయభినవ, కమలనేత్రవోలెఁ గానిపించె.

దీనికిం గతంబు హృద్గతంబు గాక యున్నయది.

ఉ. ఆకమలాక్షి గాదొ యిది యయ్యెడ వేఱొకయిట్టియింతియున్
నాకు లభించెనో యనుట నమ్మఁగ రాదు క్షణక్షణోద్భవా
స్తోకమనోజ్ఞయౌవనవినూతననూతనవిభ్రమాస్పదా
నేక విలాససంపద లనేకవిధంబులు సూపె స్త్రీలకున్.

అది యెట్లనిన.

చ. మదనమహీతలాధిపునిమానితరాజ్యరమావిభూతి కా
స్పదములు రూపకాంతిగుణచారుతరాంబుజనేత్రగాత్రముల్
తదనుచరంబు యౌవనము తద్విషయంబుల నూత్ననూత్నసం
పదలఁ జెలంగఁ జేయ నవి భాసిలుచుండును గ్రొత్తక్రొత్తలై.

కాన.

చ. పలుమఱు కౌఁగిటం జొనిపి బాళి నెలంగఁగఁ గూడుచుండినన్
కులుకుఁగుచంబులందుఁ గొనగోరుల నొక్కుచు సొక్కుచుండినన్
సులలిత మైనమోవిఁ జవిజూచి సుధారస మానుచుండినన్
చిలుకలకొల్కు లమ్మరునిసేతలఁ గ్రొత్తలె నాఁడునాటికిన్

అట్టుగావున నీమగువ పెక్కుమాఱులు మదనుభూత యయ్యు సహజసంభూతమనోహరరూపలావణ్యవంచితసురవిలాసినీవిసర యగుటం జేసి క్షణక్షణవిజృంభమాణాగణితతా

రుణ్యవిశేషవిలాసమై చిత్తంబున దినదినమునకు జాముజామునకు గడియగడియకు క్షణక్షణంబునకు నభినవవైభవమనఁగాఁ దోఁచుచున్నయది. కాని మఱియొండు గాదు. ఈచిలుకలకొలికి మేలుకొని సంభ్రమపడువిధంబుంగన్న ముగ్ధ యయినముద్దులగుమ్మ తనకుం దెలియక యేమఱుపాటున ధవునిచేతం దవులుకొని తత్తరపడుప్రకారంబు గానిపించెడిని. ఈ పరికిప్పత్ని శృంగారనాయికాభేదంబులఁ బలువిధంబుల నభినయించుచుం బ్రవర్తించు బహుచతుర గాన నిప్పుడు నాయెడఁ దాను కన్యకాత్వంబు నటించుచున్నయది కాఁబోలునని తోఁచెడిని. అని యనుకొని దానికడకుఁ జని నవ్వుచు నప్పువ్వుఁబోఁడికేలు తనకేలం గీలించి యొండుకరంబున మొగంబు నివురంబోవుఁడు నాసరసిజాక్షియుఁ దనకేలు విదిర్చుకొని మొగం బోరజేసి యొకించుక యొదిఁగి నిలిచి పలుమఱు రాజుముఖాబ్జంబుపై లజ్జాకలితంబు లగు క్రేఁగంటిచూపులం బఱపుచునవనతముఖియై యధరంబు వెడలలేనిమధుర వచనంబుల నిట్లనియె. ఓమహీపాల మీయంతవారల కీయతిక్రమంబు తగునా? నిరుపహతస్థలం బని నమ్మి యేకతంబ నిదురించుచుండు నుత్తమకన్యకలఁజిత్తజాయత్తుండవై దొంగిలి యుత్తమకులజాతసువ్రతంబుం జెఱుపఁ గడంగుట యుచితంబె! నీకు నీకాంతవలె రక్షణీయను గానె యేనును? అనంగవశవర్తు లయ్యు భూపతులు తమకు నియంతలు లేనివిధంబునం బనులు గావించెదరు. పగతుఱ నలిసంధానంబు సేయ నేర్చుకొనువిద్యలు పడఁతులయతిసంధానంబున నుపయోగించెఁ గాఁబోలు? పెద్దల నడిగి పెండ్లిచేసికొనుటలు మాని యద్దమరేయి నిద్దురఁ గూరుముద్దియం దొంగిలి తద్దయుఁ బెద్దతనంబు సంపాదించితిరి. చాలుం జాలు! "శ్లో.*హృదయవనకుటీరం దగ్ధుకామే స్మరాగ్నా వుచిత మనుచితం వా వేత్తి నో పండితోఽపి" (మన్మథాగ్ని హృదయమను పూఁబొదరింటిని దహింపఁ గడంగినచోఁ బండితుం డయ్యు నుచితానుచితంబుల నారయఁడు)అనువచనంబును యథార్థంబుఁ గావించితిరి. అని చెప్పిన నామదవతీతిలకంబునంచితవచనంబులకు మెచ్చుకొనుచు నాయధిపతి యిట్లనియె. ఓవిలాసినీవతంసమా నీచతురభావంబు చతుర్ముఖుని కైనఁ బొగడ దరంబు గాదు. నన్నుఁ జేటీవేషధారిం జేసి నీసరసన యుంచుకొని నీ వొనరించిన నర్మకార్యంబులు దలంచుకొనిన మదీయమానసంబు మహాశ్చర్యరసపూరపూరితం బగుచున్నయది.

గీ. రమణి యొకనాఁడు నేను సైరంధ్రి నగుచుఁ! బత్త్రములు దీర్చుచోఁ గుచపర్వతోప,
కంఠమునఁ దిద్దినట్టిమత్కరముఁ గాంచి నవ్వి నను వ్రేయవే కేళినళినమునను.

మఱియు నొకనాఁడు.

ఉ. బంగరునిమ్మపండు కరపంకరుహంబునఁ బట్టి సైగసే
యంగ ననుం గనుంగొని ప్రియాక్షియుఁగంబును లీలమైనటం

చుం గడువేడ్క మూసి కృతసూచనయై తగ నామనోరథం
బుం గొనసాఁగఁ జేయవె ప్రఫుల్లనవాంబుజచారులోచనా.

అంతియ కాక యొకదినోదయంబునందు.

చ. కనుబొమసైగలన్ జెలులఁ గార్యనియుక్తలఁ జేసె
దీవు వల్కిన వీస నోటిముత్యములు క్రిందికి రాలునొ యంచు నేనన్
గని రతికాలమత్కృతనికామరదవ్రణదూయమానమై
తనరెడు మోవితో వదనతామరసంబును వాంచి నవ్వవే.

మఱియు నిట్టి ప్రమోదావహంబులగు నర్మకార్యంబులు చేటీ నేపథ్యధారినగ నాతోఁ జరిపినవి పెక్కులు గల వందు నివి యీవు మరచితివో?.

చ. అనుఁగువయస్యనై యొకదినాంతమునం గయిసేత నేను నీ
కును రచియించుచోఁ గనకకోమలకాంచిక నుంచఁబోయిన
ట్లనువున నీవి వీడిచిన నాత్మఁ గరంగుచు సిగ్గుచేత భామిని
కడు సంభ్రమించితివి మేలము లాడి చెలుల్ హసింపఁగన్.

మఱి యొకకాలంబున నీవు నితరసఖీకదంబంబు నేయంకమనీయనేపథ్యరచనాదులకు సంతసింపక నన్నుంగొని యవి దీర్చుకొనుచుండం గని నీచెలు లొండొరులతో

చ. అతివల మేము మీరు మును పండఱము న్గయిసేయ లేదె యీ
యతిశయ మేమి యీమగువ హస్తముఁ దాఁకినయప్పు డెల్ల నీ
సతికి మెయి న్గగుర్పొడుపు చన్నుల నుబ్బును గల్గుచుంటకుం
గత మది యేమియో యనుచుఁ గామిను లెల్లను మేలమాడరే.

అట్టియాకాలంబులం దట్టుముట్టాడుచుండిన యాసిగ్గరితనం బిప్పు డిట్టు లుట్టిపడుటకుం గారణం బేమొకో?

చ. అని యిటు లాడుచుం దమక మాపఁగఁ జాలక డగ్గఱిల్లు నా
మనసిజమత్తు రాజుఁ గని మానవతీమణి సంభ్రమించుచున్
వెనుకకుఁ బోవుచుండఁ గని వేడ్క మనంబున సందడింపఁ గాఁ
దనుతరమధ్య డాసి వెస దానికరంబును బట్టి సెట్టనన్.

గీ. కౌఁగిటికిఁ దార్పఁ గా నంతఁ గమలనయన, చేయునది లేక దళ మైనసిగ్గుచేత
కొసరి బాహ్వంతరమునుండి తుడికిలపడి, పీడ్చుకొనిపోయె ననువున వేగముగను.

అట్టయిన నంత.

గీ. వెంట నంటె రాజు వేడ్కతోఁ జనుదెంచి, మించుబోడిఁ దత్పటాంచలంబుఁ
బట్టి తిగువ నదియుఁ బడె నిలువయి జగ, జెట్టి మరుఁడు రాజు నట్టె తరుమ.

క. చేలము పీడినసిగ్గున, బాలామణి సంభ్రమించి పైతాంచలసం
చాలనమున నార్చెను ద్రీ, డాలయగతదీపకళిక నతివేగమునన్.

సీ. దీప మారంగఁ దద్దేపికరాంగుళీకలితమహావజ్రకల్పితాంగు
ళీయకప్రభలపాళీలీల లప్పుడ యంధకారంబుల నడఁగఁ జేయ
నది తాఁ గనుంగొని మదవతీమణి సిగ్గుపడుచు నుగ్రముఁ దీసి పాన్పుపైనఁ
బడవ్రేయ నదియు భూపాలుండు దా నందుకొని తనకరమునఁ గోర్కెఁ బెట్టి
మందహాసంబు సేయుచు మగువఁ బట్టి, కౌఁగిటికిఁ దార్చి ముద్దాడి కళల నంటి
మోవిపానక మాని సమ్మోహ మెసఁగఁ, గులుకుఁగుబ్బలపయిఁ గొనగోరు లుంచి.

గీ. వలదు వల దటంచు వనితాశిరోమణి, పల్కుచుండఁ బూలపాన్పుఁ జేర్చి
పంకజాస్త్రతంత్రపరతంత్రఁ జేసె భూ పాలతిలక మానృపాలసుతను.

చ. విలులిత మైన పెందుఱుము విహ్వల మై యసియాడుమధ్యముల్
గలయఁగ ఁ బర్వినట్టిపలుగంటులతోఁ దనరారుమోవియున్
వలమగుచిన్నిపచ్చినెలవంకలు గల్గినచన్నుదోయి యుం
గలిగి పడంతిలజ్జమెయి కంపమునొంద మనోజలీలలన్
అంతటఁ గొంతసేపటికి

చ. కలువలఱేనిబింబమునఁ గ్రమ్మెను గ్రొంజెమటల్ దనంతటం
జలనము మానెఁ గమ్మలకుఁ జయ్యన స్రగ్వినిబద్ధ మాతమం
బలవడఁ జాఱెఁ గైతక శిఖాంచితలీలలఁ గాంచె సుస్మితం
బలఘుగలి స్వడం కె నభి మంబుజసాయకసంగరంబునన్.
అప్పుడు.

చ. చెలువ రతాంతమందు బలుసిగ్గునఁ గుందుచు మోముదామరన్
నెలకొనుమందహాసమును నిల్పఁగ లేక సువిశ్లథాంబరాం
చల మది వేగ నందుకొనఁ జాలక కాంతుని నేత్రము ల్కరాం
గుళులను మూసె దేహములు కొంకక సంకలితంబు లై తగన్.
అట్టిసమయంబున వైతాళికుండు.

చ. మదనవతీసతీతిలక మానితనూత్నపయోవిలాససం
పదలను గొల్లలాడి సురపల్లవపాణి యసంగఁ జెల్లునా
మదవతి దేవి యామదనమాలినిభోగరతిం జెలంగునో
మదనమనోజ్ఞమూర్తి నృపమండన మేల్కొనవయ్య వేల్లసన్.

చ. సరసవతీసతీమదన చందనసౌధపురాధినాథుఁ డు
ద్ధురబలుఁడై తదీయసుతఁ దొంగిలి తెచ్చుటఁజేసి నీపయిన్
బరువడి నెత్తి వచ్చె నలబల్లిదు వేగ జయింపఁ గావలెన్
పురము తదీయసైన్యపరిపూరిత మయ్యెను మేలుకోఁ గదే.

అనిన నాయిరువురు వైతాళికులు సెప్పినపద్యంబులు విని మానపాలుండు తన మనంబునందు నీవైతాళికులు ఈవేళవం జెప్పినపద్యంబులయర్థంబులు నామనంబునకు రాలేదు.మదనవతి యనునది దేనియగు మదనమాలినికి వైమాత్రేయి యగుచెల్లెలు. అదియు దేవియుం సమానరూపౌదార్యవయోవిలాసములు గలవారల మదనమాలిని పాణిగ్రహణ కాలంబున మదనవతినిసయితము నేను గోరి విజయదత్తుని నామగువను నాకిమ్మని యడిగియుంటిని గాని మదనమాలినికిది సమ్మతము గాదని యతనిచేఁ బ్రతిషిద్ధుఁడనై తత్పాణిగ్రహణమంగళంబుఁ బడయక యున్నవాఁడను. అట్టుండ మదనవతీసతీతిలక మానితనూత్నవయోవిలాససంపదలనుగొల్లలాడుట యనునది నాకెట్లు సంభవించె?అతండు తనసుతం దొంగిలి తెచ్చితి నని నాపై దండెత్తివచ్చెననుటయు నెట్లు పొసఁగు? అయినను వీరివచనార్థంబులు దినోదయం బగుఁడు విచారింతము; విజయదత్తునిసైన్యములు విదర్భ నగరముననిండినట్లు చెప్పుచున్నారు; అది నిజం బగునేని నగరజనంబులకుఁ గడు గష్టంబు గల్గు. వేగ యరయ నగును. అని తలంచి శయనంబు విడిచి లేచి సమీపమున నుండెడు ఖడ్గ ఖేటకంబులు దాల్చి యుద్ధసన్నద్ధుండై యంతఃపురంబు నిర్గమించి తననగరుహజారంబుం దాఁటి యాత్మీయపురపరిపాలకులగు దండనాయకులు తమసైన్యంబుల నాయత్తంబు చేసి కొని పరసైన్యంబుల నడ్డగించుచుండుటం గనుంగొని యంతలోన యుద్ధసన్నాహముతోఁ దనకుం దోడ్పడినమంత్రిపుత్రుని నభినందించి దండనాయకులం జాగరూకతతోఁ బ్రవర్తింపనియమించి విజయదత్తునిసైన్యంబు లని విన్నవాఁడు గాన "నాతఁడు నాకు శ్వశురుండు, మదనమాలినికిఁ దండ్రి యగువాఁడు; ఇప్పు డతఁడు తనకూఁతు నపహరించిన హేతువుచే యుద్ధమునకుఁ జనుదెంచినట్లు తెలియుచున్నది.ఈపని యేరాజుచేసి నాపయిం బెట్టెనో? ఏభ్రమంబున నాతఁడు నాపయి దండెత్తెనో? తెలిసినదిగాదు. ఇది తెలిసికొను నంతవరకు నన్యోన్యసంహారంబు యుద్ధంబునం గూడ" దని యానతియిచ్చి పురము వెడలి పరసైన్యంబులు పెక్కులు తననగరంబును ముట్టడించి యుండుటంగాంచి చారులం బిలిచి మీర లీసైన్యంబులకు నేతయైయుండువానికడకుం జని నామాటలుగఁ జెప్పునది. మానపాలమహీపాలుండు యుద్ధమునకు సన్నద్ధుండై యిదె వచ్చియున్నవాఁడు; అతనితో యుద్ధంబు సేయం శక్తియుండిన నాతనితో నీవు దొడరనగు. జయాపజయంబులు మనయిరువురయందు నిర్ణయింపం జనును. సైన్యములకు సమ్మర్దము సంభవింపక యుండ

వారివారిబలముల వారు వారు తమతమహద్దు నిలుపుకొనవలయు. మన మొండొరులము విక్రమించి యన్యోన్యసైన్యంబుల వధించుకొనుటచే ఫల మేమి? ఇది నీకు సమ్మత మగునేని నానుడివినపగిదిఁ బ్రవర్తించుట లగ్గు. అని చెప్పి యాచారులం బంపిన వారును జని పరసైన్యనాయకునికిం జెప్పిరి. అందుల కాతండును సమ్మతించెను. పరబలనాయకుండును మానపాలుండును రథారూఢులై నవరసాలవనసమీపంబున నొకవిజనం బగుసైకతస్థలమునం జేరిరి. ఇరువురును ధనుష్టంకారంబులు గావించిరి. మానపాలుఁడు ధనుష్టంకారము సేయం దొడంగుడు పరసేనానాయకునిబాణంబుచేత నతనిచేతివిల్లు విఱిగిపడియె. ఒండువి ల్లెత్తి నన ట్లయ్యెను. మఱి యొండుచండచాపంబుఁ దాల్చిన నదియుం ఖండితంబయ్యె. అంతట నామానపాలుండు మహారోషంబునఁ బ్రచండమగు మండలాగ్రంబు నెత్తి రథంబుడిగ్గ నుఱికి పరబలాధినేతరథంబుపైకి నెక్కం బోయి తదీయచండకాండవిదళితఖడ్గుండై పెచ్చుపెరుఁగురోషావేశంబున నిట్టూరుపులు నిగుడించుచు నొకగదం గైకొని యదయత వ్రేయంగమకించి; తనయభియాతియు నంతలో వేఱొండుగద దాల్చి యిలపయి నిలువంబడి యుండఁ జూచి తదీయధర్మనిత్యతకు మెచ్చుచు గదాయుద్ధంబునకుం బూనిన నొండొరులగదలు నన్యోన్యగదాప్రహారంబులం దుత్తుమురైన నాయిరువురును బాహాబాహవికిం గడంగిరి. అప్పుడు మానపాలుండు పరసేనానేతతో నిట్లనియె.

చ. తనుజను దొంగిలించె నని తప్పులు నాపయిఁ బెట్టి యిప్డు మీ
జనపతి యెత్తివచ్చుట విచారముసేయఁగ నిందు నీనెపం
బునఁ దన విక్రమంబు బలముం జలముం దగఁ జూపి నాపురిం
గొనుటకు వే గడంగుట నిగూఢతరార్థ మటంచుఁ దోఁచదే.

గీ. అతఁడు నాకొకసామంతుఁడగుట బంధుభావమును జూచి కరముకై పన్నుఁడు
కారణంబున దర్పంబు గలిగి నాకె, శత్రువై వచ్చె మఱచె నాశౌర్యగరిమ.

అని చెప్పిన విని పరబలసేనానాయకుండు,

చ. నరపతిచంద్ర నీపలుకు నమ్మఁగ వచ్చునె నీవు తద్ధరా
వరునితనూజఁ దొంగిలుట వాస్తవ మైనది గాదొ యట్లయే
నరు దగుదానియుంగరము హస్తగతం బగు టెట్లు నీకు నా
వరతనుభోగచిహ్నములు పల్లభ మై మెయి నుండ నేలకో.

అనిన విని మానపాలుండు మహాశ్చర్యరసపరవశుం డగుచుం దనచేతిముద్దుటుంగరముం గనుంగొని యది మదనవతీనామాక్షరాంకిత మై యుండుట గుర్తించి చూచి తన మానసంబున నిది నేను వణిక్పత్నీకరంబునుండి యారాత్రి గైకొంటిని; దీనియందు మదనవతి యనునామాక్షరంబు లుండుటకుం గారణం బేమొకో? తెలిసినది కాదు; ఇది యతి

విచిత్రంబై యున్నది. మదనవతిని నేఁ జిత్రపటంబునం జూచియున్నాఁడను. తదీయ లక్షణంబులును గొన్ని మదనుభూతయగు నానాలియందుం దోఁచుచున్నవి. తన్నిర్ధారణమునకును గతంబుఁ గానము. దేవి మదనమాలిని కనంబడక యుండుటకును గతంబు స్ఫురించినదిగాదు. ఈవిచిత్రసందర్భముం గాంచిన మదనమాలినిచాతుర్యకల్పితంబ యని తోఁచెడిని. గతరాత్రియందు నేఁదోంగిలి తెచ్చినది వణిక్పత్నిగానుండిన నావణిక్పుత్త్రుండు గోడు గుడుచుచుండఁడే? అతఁడును గనంబడఁడు. తదీయచిహ్నంబులే గతరాత్రియందు మదనుభూతయందుఁ గానంబడియెడి. అదియునుంగాక యీయెదుటనుండు సేనాపతిం గాంచిన దేవీలక్షణంబులు విశదంబు లయి యుండెడిని. మఱియును.

గీ. స్వరము సుస్నిగ్ధ మున్నత మురము మిగులఁ, జూపు శృంగారరసవర్ష సుభగ మంగ
కంబు చంపకశోభావిడంబనంబు, కాంతి శారదచంద్రికాభ్రాంతికరము.

ఇట్టియీలక్షణంబులు ప్రాయికముగఁ బురుషుల కుండునవి గావు; ఇందుం గల యాథార్థ్యం బరయుట కెట్లనువుపడును. అని చింతించి యాతని నిరూపించి చూచి తదీయ కరాంగుళీదళవిరాజమానంబగు వజ్రమణిమయాంగుళీయకంబును గుర్తించి యది తాను వణిక్పత్నికరంబున నిడినయాత్మీయాంగుళీయకం బని నిర్ణయించి యేమియు నడుగలేక కొంతతడ వుండి మందహాససుందరముఖారవిందుం డగుచు నోసేనాపతీ మదనవతీహస్తముద్రిక నాకరగతంబగుటకుం గారణంబు ననంతరము సెప్పెదను. భవదీయహస్తగతంబయినముద్రిక మదీయంబు. మన్నామాక్షరాంకితం బయి యేకమణివినిర్మితం బగుచుఁ జండకిరణకిరణరింఛోళికామాలికలం బరపుచున్న యిది యితరజనలభ్యంబు గాదు. ఇది నావ్రేలికి సరిపోయెనేని నాది యనుటకు సందియంబు లేదు గదా? ఇది నీవశగతంబుగాఁ వో[illegible]ణం బేమొకో? నావుడు సేనాపతి యోయధిపతీ యీముద్రిక నీదియై యుండిన నీచేంగక యిది యితరుల కెట్లు లభింపంగలదు. అనిన నవనతముఖుండై రాజు లజ్జించుకొను దనమనంబున నాముద్దుటుంగరము వణిక్కామినితోఁ బ్రథమసంగమదినంబున దానికొసంగితిని గాని మఱి యెవ్వరి కీలేదే యని యాలోచించుచు నాసేనాపతితో నిట్లనియె. బలాధినేతా మదనవతీనామాక్షరాంకితం బగుముద్దుటుంగరము నాకడకు వచ్చుటయు మన్నామాంకితమగునంగుళీయకము నీకరమందుఁ జేరుటయు నిది దురూహ్యమ యై యున్నది. నీవుం దెలిసియున్నం జెల్పుమన నాపరసైన్యపతి యోమానపాలమహీపాలా యీరాత్రియంతయుఁ మదనవతితో మదనసామ్రాజ్యంబు నేలిననీకు నాఁడుగుద లజ్జాతిరేకంబునఁ బూసెజ్జం దొరంగినయీయంగుళీయకంబు నెత్తి వ్రేల నిడుకొన్నవానికిం దదాగమనమార్గంబు దెలియకుండునే! యనఁగా రాజును దనయంతిపురంబున నేకతంబునఁ జరిగిన యీవిషయం బితరులకు విదితం బగుట యెట్లొకో! యని చింతించుచు నిట్లనియె. ఓ

సేనాపతీ నీకు నాయంతఃపురంబున నుండునది మదనవతి యని యెట్లు దెలియు ననఁగా నాపరసేనానేత యోరాజా యంపుల కీయుంగ్రమె సాక్షి యని చెప్పిన రాజును నవ్వుచు నోయి మదీయాంతఃపురజనరహస్యంబులు నీ కెఱుకపడియుండవచ్చు నని తోఁచెడిని; నీ కెఱుక గలదేని దెల్పుము; తదీయపితృకులసమాగతుండవు గాన నీ కవగతమై యుండ వచ్చు. తదీయవిరహంబునం జేసి నామానసం బతివిదూయమానం బగుచున్నయది. నాదేవి గతదినాస్తమయంబునుత నాకన్నుల కగపడకయున్నది; అందుకు గతం బెఱుంగను. అనిన నాసేనానాయకుండు నోరాజా స్త్రీలకు మానసంబునఁ గోపంబు గలుగుటకు మగండు పెఱమగువం గామించుటవలననే గాక మఱియొంటఁ గాదు గదా! భర్తృవాల్లభ్యంబగదా పడఁతులకుఁ దొడవు. అది లేనినాఁడు సర్వసుఖంబు లుండియు గాననచంద్రికాతుల్యంబు లగును; మానినీమణులకు మానమేకదా ప్రాణాధికము. ఇతరుల కెఱుకపడక యుండ నీయొనర్చినయపరాధంబు లేవి గలవో యెట్లెఱుంగంజను? అతిగంభీరహృదయయగు నాదేవిమానసంబున నయితము కోపంబుగలుగం బ్రవర్తించితి వని యూహింపం దగియున్నది. ఒకప్రవాదంబు గలదు. ఒక వణిక్పుత్రుండును తదీయపత్నియు భవదీయాభిమానంబునకుం బాత్రు లనియు వారల నూరికిం బనుపునప్పుడు తత్పత్నియుం నీవు నంబుజాతహంసాపదేశమునను పారిజాతషట్పదాపదేశంబునను బరస్పరముపచారోక్తులు పచరించుకొనుటలు సమీపమున నేఁగుదెంచుచుండిన పౌరజానపదులకు విదితం బనియు విందుము. ఇట్టిమర్యాదాతిక్రమములు మీవంటివారికే గలుగుచుండ లోకంబున ధర్మపరిపాలనంబు సేయువారలు మఱి యెవ్వరు గలరు? "లోకప్రవాదస్సత్యోయం పండితైస్సముదాహృతః" అని యున్నది గాన లోకప్రవాద మసత్యమనియుఁ జెప్పం దగదు. అనిన విని రాజును తదీయవచనములకు నిరుత్తరుండై కొంత తడ వూరకుండి మరల నిట్లనియె. ఓసేనాపతీ అది యట్లుండనిమ్ము. నేను గతదినాంతంబున నీనవరసాలకాననమునందుఁ జంద్రికాసౌధంబున విడియించినయావణిక్పుత్రుండును దత్పత్నియుం నేమైరో? వారు స్వనగరంబునకుం జనిన జాడలును గానము. అనిన నాసేనాపతి యోరాజా యాకనిపత్నిని దద్రాత్రియందుఁ దనమగనితోఁ బరుండియుండు దానిని దొంగలు కొందఱు దొంగిలించుకొని పోయిరఁట. అదియుం రాజైననీయెఱుకకు రాకయ భవత్ప్రేరణలేకయ జరిగియుండ దని జనులు వాడుకొనియెదరు. కలగతి యెట్లెఱుంగంజను? అనిన రాజు విచ్ఛాయవదనుండై యేమియుం బచింపక యూరకుండి మఱికొంతసేపటికి వానిం గాంచి యిట్లనియె. ఓయీ అట్లు చోరాపహృతకళత్రుం డైన వాఁడు తా నది యెఱింగి యేమి యొనర్చె? అతఁ డే మయ్యెను? అనిన నాసేనాపతియు మగువం గోల్పడినవాని మగవాఁ డనఁ జనునా? వినుము.

గీ. మగువఁ గోల్పడి వైళ మిమ్మాడికేఁ గాఁగ, మగతనముఁ బూని వచ్చి సామంతభావ
కలితసేనాసమేతతఁ గాంచి ఇప్పు, డియ్యెడన యుండు పొమ్ము తా నిందుకీర్తి.

అని చెప్పిన నావచనంబులు విని రాజు తనమానసంబున నిట్లు చింతించె. ఈతఁడు పఠించినపద్యమునకు భావద్వయం బయ్యెడును. తనమగువను గోల్పడఁగాఁబొను మగవేషము దాల్చి సామంతరాజు ననుచు సేనాసమన్వితుండై వచ్చి యట యున్నవాఁడు. అని యొకభావము. ఇందీవణిజుండు మగవాఁడు గానివాఁడు మగవేషంబుఁ దాల్చి వచ్చెనని విస్పష్టం బగుచున్నది. మఱియుఁ దనమగువ యపహృత గాఁగా యోధుఁడై వచ్చి యెల్లయెడలం బరవియుండు సేనలోఁ దాను నొకఁడై యున్నట్టు భావాంతరమును సువ్యక్తం బయ్యెడిని. నిర్ధారణాయోగ్యంబు గాక యున్నది. భావద్వయబోధకంబుగఁ బల్కినందు కితనిచతురతకు మెచ్చవచ్చు; అని యనుకొని మరల నోసేనాపతీ చోరాపహృతయై యుండునాకాంతామణి దాలిచియుండినభూషణాదులలో నెద్దియే ననితరసాధారణం బుపలబ్ధం బగునేని దానిం గనిపెట్ట నగును; అని చెప్పిన మందహాసంబు సేయుచు నోరాజా మంచిది. అనితరసాధారణం బయినతదీయాభరణంబులలో నొకదానిం గనిపట్టి నీకుం దెచ్చి యిచ్చినవారికి నీయొసంగుపారితోషికం బేమకో యనిన రాజును సంశసించుచు నట్టివారల యభీష్టం బెట్టిదియైన నెరవేర్చెదను; ఈమాటమరలింపను. అని చెప్పిన నాసేనాపతి కించిదంకురితమందహాసరోచిరుపంచితవదనకమలుండై యిదిగో చూడుము; దానియంగుళీయకము దానితోఁ బ్రథమసమాగమంబు సేయుంనెడ నీవాయతిపచేత నిడి యందముఁజూచినది యని చెప్పి తనవ్రేల నుండునవ్రజమణికల్పితాంగుళీయకం బతనిచేతి కిచ్చిన నందుకొని మానపాలుండు ప్రమోదమేదురహృదయుండై యీ యంగుళీయకము నా వ్రేలికిని మదనమాలినివ్రేలికిని సరిపడునట్లు సేయింపఁబడియె; ఇది నీ వ్రేలికిం దగియుండుటం జేసి నీవ మదనమాలిని నని తోఁచెడిని ఇందుకు సందియంబులేదు; అనిన నవ్వుచు నవనతముఖియై యాసేనానేతృ నేపథ్యంబుఁ దాల్చియుండు మదనమాలిని యూరకుండ రాజు లజ్జయు సంభ్రమంబును రాగంబును ముప్పిరిగొన నోదేవీ నీ చతురత కేను మెచ్చితిని; వణిక్పత్నికిఁ బ్రథమసమాగమసమయంబున నీ వొసంగిన దని యీ యంగుళీయకం బిచ్చితివి గాన నావణిక్పత్నివేష మూనినదాన నీవ; యని నిర్ణీతం బయ్యె. ఔరా నీచాతుర్యం బేమనవచ్చును? చతర యన్న నీవ కదా? యని యా దేవిని సంస్తుతించి మదనవతీకరాంగుళీయకము నా చేతికి రాఁ గతం బేమి? యని యడిగిన మదనమాలిని యిట్లనియె. ప్రాణనాథా మీరు నా పసియించునంతఃపురమును ముద్రించుకొనుచు నన్ను నమ్మక యుండుటంబట్టి యొకవాఁడు "వినాయంత్రేణమంత్రేణ తంత్రేణవినయేనచ। వంచయంతినరంనార్యః ప్రజ్ఞాధనమపిక్షణాత్" అని నేఁజెప్పిన

శ్లోకమును సార్థకము సేయంగోరి మజ్జనకప్రేషితనిపుణతరశిల్పికల్పితసురంగద్వారంబున నిర్గమించి నావైమాత్రేయయగు మదనవతిని వణిక్పుత్రవేషంబుతో నాజనకనగరంబు నుండి రప్పించి నీకుఁ జెలికానివలెఁ బ్రవర్తింపం జేసియేన తత్పత్నిగానుండి నీతోఁ గొన్నిసుఖంబు లనుభవించి భవన్నోవృత యగుటం జేసి నా చెలియలిని నీకుఁ బాణిగృహీతఁ జేయం దలంపుఁగొని మదభిప్రాయానుగుణప్రవర్తనులగు జననీజనకులయాజ్ఞ వడసియున్న దానం గాన నేను నవరసాలకాననంబున నీ చంద్రికాసౌధంబునందు మమ్ము మీర లెడబాసి పోవ మీ భావంబు వణిక్పత్నీవశంగతంబు గాన దాని నపహరింప వత్తురని యూహించి వణిక్పుత్రవేషంబుఁ దాల్చియున్న మదనవతి కది వాపి నిజవేషంబు నమర్చి యేను పురుషవేషంబుఁ దాల్చి యరుంటిమి; చోరభావంబున మీరలు మానిద్రించు నింటిలోఁజొచ్చి యచ్చిన్నదానియురోజంబులపయి నిడియుండు నాహస్తంబు మెల్లన నెత్తి సస్వేదసంభ్రమం బైనమీహస్తంబునకు స్పర్శవిశేషంబునం జేసి చిత్తవిభ్రమంబు గాఁగా నంత వజ్రాంగుళీయకంబు గలుగుకతంబున నాకడ నుండునాచెలియలిని మదనవతి నెత్తికొనిపోయితిరి. ఇది యంతయు నే నెఱుంగుదును. మీ యంగుళీయకమునలె నేక వజ్రమణినిర్మిత మిది దానియంగుళీయకము. అది సమయవిశేషమున మీకరగతం బయ్యెను. నా జనకునికిం జెప్పిపంపి సమయసమాగతం బగునట్లు నారప్పించినది యీ సైన్యము. ఈనిగూఢవృత్తంబు వెల్లడిసేయ మీతో యుద్ధంబునకుం గడంగితిని. నా కౌశలంబుం గాన్పించితిని. నా యపరాధంబు క్షమింప నగును; అనిచెప్పిన నా మగువ వచనంబులు విని తదీయచతురత కచ్చెరు వొందుచు నోదేవీ నీవు సెప్పిన వచనంబులు సత్యంబుల; నీయతిచతురతకు మెచ్చుకొంటిని. మిత్రద్రోహంబు చేసితి; నిది నరకహేతువు గదా యని సంతపించుచుంటిని. నీచే సత్యంబు విని మంటిని. అధర్మప్రవృత్తి స్వధర్మప్రవృత్తియై సుఖింపంగంటిని. బహుకాలసంప్రార్థితమగు మదనవతీమనోహరలీలావిశేషసుఖితాంతరంగుండనై మోదంబుం గొంటిని. నీనులవిం బైననీవచనామృతంబులు వింటిని. అని యుగ్గడించి యాదేవిం దోడ్కొని యాదినము చంద్రికాసౌధంబున వసియించి నవోఢయగు మదనవతి నయ్యెడకుఁ బిలిపించుకొని; విజయదత్తుఁడు సమయానుసారంబుగఁ దన కంపినయౌతకంబు నందుకొని యథావిధి నామదనవతిని పాణిగ్రహణంబు చేసికొని శ్వశురగృహసమాగతు లగువారలకు బహుమానంబు లిచ్చి మదనమాలినీమదనవతులతో సుఖం బనుభవించుచు నున్నవాఁడు. వింటిరే యోపండితులారా స్త్రీలసామర్థ్యంబు. అపరిమేయచాతుర్యధుర్యులకు సయితము భ్రమానవహము. విద్యాసర్వస్వవేదినియుం నామదనమాలినికంటె నతిచతుర. దానికిం గొన్ని యసమానశేముషీవిశేషవిలాసంబు లున్న వని వినియున్నాఁడను. దానికంటె నధికుండుగాక దానిం జయింపఁ

జాలఁడు. అట్టివాఁడు మీయం దెవ్వఁడును లేఁడు. అని యిట్లు మిత్రసహుండు సెప్పిన విని యుదయాదిత్యునిపండితసంఘపువారు బళాబళా బాగున్నది! ఇవి యేటిమాటలు! ఒకచెడిపె పుడమియందుఁ గలపండితులను భూమీశ్వరుల నవమానము సేయుచు విద్యాసర్వస్వవేదిని యనుబిరుదముతో విఱ్ఱవీఁగుచుండ మిన్నకయుంట యుక్తమం బగునె? ఏవిధమున నైన దానియాబిరుదు దీయించి పండితదాసి నని యనిపించకపోయిన నీకుఁ బండితులన్నవారికి గౌరవంబు గల్గుట దూరాపాస్తము. కాన నావెలయాలికన్నెం బరిభవపఱుచుట కర్తవ్యంబు. అందుకుం దగినవెర వూహించి నీవ పలుకం జనును. నీవు సమస్తవిద్యాచతురుండ వయి యుండుట యట్లుండ సమయసముచితప్రతిభావిశేషంబుచేతఁ గరము శ్లాఘనీయుండవు. అని యుగ్గడించిరి.

గీ. వరవినోదకథాకల్పవల్లిఁ బొడమి, లోభనీయతఁ గాంచుగుచ్ఛవితతి
నాద్యమున నిన్నుఁ బూజించి తంబుజాక్షు, రాజగోపాలకృష్ణభూరమణుకృపను.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమాణమానస భారద్వాజకులపవిత్ర తిరుమలార్యపుత్ర పెరుందేవీగర్భ జన్మ చిలకపాటి వేంకటరామానుజ శర్మ ప్రణీతంబైన వినోదకథాకల్పవల్లి యందుం బ్రథమగుచ్ఛము సంపూర్ణము.



శ్రీరామజయము

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# వినోదకథాకల్పవల్లి

## ద్వితీయగుచ్ఛము.



### మంగళాచరణము

క. శ్రీరాధానవనవలీ, లారతిసక్తాత్మునకు బలప్రమథనగ
ర్వారంభహరణచణదో, స్సారునకుఁ బ్రణామ మేను సలుపుదు భక్తిన్.

అనియిట్లు పండితులు వల్కిన విని మిత్రసహుండు తనయువరాజు మోముఁ గాంచి కించిదంకురితమందహాససుందరతదీయముఖవికాసవిలాసంబున ననుమతుండై యిట్లు సెప్పం దొడంగె.

### కాళిదాసుఁడువసుమానసమునకువచ్చుట.

ఓపండితోత్తములార విద్యాసర్వస్వవేది నీవృత్తాంతం బారసి చూడ నతిమానుషశేముషీవిశేష యనుటకు సందియంబు లేదు. విద్యయందు మాత్రము గాదు; యుద్ధము సేయుంట మొదలగుశూరకృత్యంబులం దది యతివిచక్షణయై యుండకపోదు. ఈరెంట నతిసమర్థులగువారలే దానిం గెలువఁ జనవలయు. అట్టులు గాక యలంతులు వోయి దానివలంతితనంబునకుం గలంతఁజెంది కలంతకాలము తలయెత్తలేకయుంటకంటె యూరకుండుటయె మేలు. ఇంతపనికి సమర్థుండు మనయువరాజుదయాశ్రిత్యుండు గాని యితరుండు గాఁడు. ఈతండును ధారానగరాధిపతిభోజభూపతిసభాభూషణం బయి మహాకవి యని బిరుదువడసి యుండుకాళిదాసునను గ్రహంబున నాతనిసహాయంబునం గాక జయింప లేఁడు. అమ్మహనీయుండె యస్మాదృశదీనజనులను రక్షింప దక్షుండు. విపక్షవిజయమున నతివిచక్షణుండు. అతనినియ్యెడ కెవ్విధి రప్పింపం జను నని శంకింప నక్కర లేదు. ఇంకఁ గొంతసేపటికి కాసజ్జనాగ్రగణ్యుండు మనపురము నలంకరింపం గలండు. అనిన విని పండితులు నోమంత్రీ యాకాళిదాసుని నొకక్షణం బెడఁబాసి భోజభూపాలుం డుండఁడనియుఁ గవివరుండు నారాజునందపరిమితప్రేమావేశంబుతో వర్తించుచుండు వాఁడగుటం జేసి తద్విరహంబున కోర్వఁజాలండనియు విని యున్నారము. అట్టుండ నాధారాపతి నెడఁబాసి యామహామహుం డిట కేఁగుదెంచుటకుం గారణం బేమొకో యెఱుంగం బల్కు మన మంత్రి

పుత్త్రుం డిట్లనియె. ఓపండితులార వినుఁడు; ధారానగరపతియగు భోజభూపతిసభయందు
బాణ, మయూర, శేషణ, హరి, శంకర, కళింగ, కర్పూర, వినాయక, మదన, విద్యావినోద,
కోకిల, తారేంద్రప్రముఖులు సర్వశాస్త్రవిచక్షణులును సర్వజ్ఞులు నగువారు పంచాశత్సం
ఖ్యలు విద్వాంసు లుండెదరు. వీరలలో దండి, భవభూతి, బాణు లుద్దండకవితాకౌశలా
నల్పసంతోషితధరాకాంతులు. వారలకంటె నతివిచక్షణుండు కాళిదాసుండు. మహాకవి
యనునామం బాతనియందుఁ గాక యితరులయందు సార్థంబు గాదు. ప్రతిదిన మాభూపతి
కాళిదాసుని విశేషముగ గౌరవించుటం జేసి విషణ్ణమానసు లై పెక్కుతెఱంగుల భోజ
కాళిదాసులకు భేదంబు పుట్టించియు నది విఫలంబు గాఁగా దుఃఖితులై యాకాళిదా
సుని నీపురంబు వెడలనడఁచినం గాని తమకు రాజసభయందుఁ బూజ్యత మించ దని నిశ్చయిం
చికొని యంద ఱొక్కటియై యాలోచించి యొకనాపితునిం బిలిచి వాని కపరిమే
యములగు ధనంబు లొసంగి తమకు వశగతుండై నడుచుకొనునట్లు నిర్ణయించుకొనిరి.
ఇట్లుండ రాచనగరునందుఁ బితృదినము సంప్రాప్తం బయ్యె. భోజభూమీశునిజనకుం
డగుసింధులునిమృతాహంబున సాంవత్సరికశ్రాద్ధంబు కర్తవ్యంబు గాన నాదినంబున రాజు
గాళిదాసునినిఁ దక్కుంగలపండితులను నిమంత్రితులం జేసి వస్త్రమాల్యాంబరాభరణమృష్టా
న్నప్రముఖంబులఁ బరితృప్తులం గావించి మించినభక్తి సంస్తుతించి వారల నిండ్లకనిపి
తాను తదాజ్ఞం గైకొని భోజనంబు సేయుటకుం జనియె. కాళిదాసుండు నితరపండితగణ
పరివృతుం డయి స్వగృహంబునకుం జన రాజవీధి నేఁగుదెంచుచుండఁ బూర్వము కృతసం
కేతులగుపండితులచేఁ బ్రేరితుం డగుటం జేసి యానాపితుండు క్షురప్రముఖంబులతో
నుండునడపంబుం జంక నిరికించుకొని వీథిం జనుదెంచి వారలకు దగ్గఱి కాళిదాసునికడ
నిలిచి యోయన్నా మొన్న నీయూరికే వచ్చితిని. నీవు బాల్యమున నస్మత్కుటుంబముఁ
బాసి సంవిభక్తదాయుండ వై తదీయధనంబులం గైకొనివచ్చితి వఁట. భాగ్యవశంబున
భూపతికిఁ బ్రేమపాత్రుండవై నెగడియున్నాఁడవు. నీవు మమ్మెడబాయుటం దొట్టి
నిప్పచ్చరంబున వేఁగుచు నాఁకటఁ గ్రుస్సి నవయుచుం జేయునది లేక జన్మభూమియంద
యుండి నీకుం గలిగియుండు నిట్టిగౌరవంబు విని నిన్నుం గొని రాజానుగ్రహంబునకుఁ
బాత్రుఁడ నగుదునని యెంచి యీయూరి కేఁగుదెంచితిని. అనుదినము నీవు నాందోళి
కారూఢుండవై రాజనగరునకుం బోవుచుండునప్పుడు భటులు కుటిలురై దూరంబునకుం
ద్రోయుదు రనుభయంబున సమీపింపక యీదినమున నట్టివి లేకయుండం గాంచి సుల
భుఁడవై యుంట వని నీకడకిదె వచ్చితిని. నిన్నుం గాంచినవాఁడ నగుటం జేసి నాకష్టం
బులును దీరె. సకలవిద్యలయం దీవు సాటిలేనివాఁడ వని వింటిని. మనకులవిద్య ననాద
రింపక దానియందును బరిచయము సేయుచుండుదువే? ఎన్నివిద్యలు నేర్చినను గులవిద్య

యన్నింటికిం గొప్ప గదా! యనిన విని పండితు లందఱు నొకరిమో మొకరుచూచు కొనుచు నాశ్చర్యపడువారలపగిది నభినయించుచుఁ గాళిదాసున కెడ గలుగ నిలిచి యానాపితునిం గాంచి యోరీ నీ వెవ్వఁడవు? అని యడిగిరి. వాఁడు నేను నాపితుఁడ నని చెప్పెను. ఈకవితో నీ కేమి పనియున్నది యని మరల వా రడుగ నామంగలి యోయయ్యలార యితఁడు నా కగ్రజుండు, ఇతనికి నే ననుజుండను, బాల్యమున నితఁడు పైతృకధనంబు విభజించుకొనివచ్చినవాఁడు. నేను జన్మభూమియందె యుండి బహుదినములు నాయన్నం జూడవలయు నని కోరుచుండి యీదినమున నీతనిం బొడగాంచితిని, సంతసం బయ్యెను. అని పల్కినవార లందఱును ధిక్శబ్దముఖులై యోరిపాపిష్ఠుఁడా కాళిదాస! బ్రాహ్మణుండ వని పేరు వెట్టుకొనివచ్చి బ్రహ్మక్షత్రంబులం జెఱుపవచ్చునా? అధిగతసమస్తవేద వేదాంగులై శ్రుతికథితప్రశస్తాచారపరాయణులై షట్కర్మనిరతిఁ దనరు నీవిప్రము ఖ్యుల సహాసనభోజనాదికృత్యంబులఁ బతితులం జేసితివి. కట్టా యిట్టిపాపంబును గలదా! యని బిట్టు గూయుచు నానాపితునిం దోడుకొని భేనికడకుం జని వృత్తాంతంబు విన్న వించిరి. రాజును విలక్షుండై యిదిమహావ్యతిక్రమం బని తలంచి యాక్షౌరకునివలనఁ బూర్వోక్తప్రకారం బంతయును విని కవియెడ రోషంబు దీపింప నాదిన ముపవసించి యంగరక్షకునిం బిలిచి పురోహితుని రప్పించి ప్రాయశ్చిత్తాదులు రచియించుకొని మరు నాఁడు భుజించెను. కవివరునియందుం గల ప్రేమాతిశయమున నాతని నేమియనక దండ నాదులు విధింపక యూరకుండెను. నాపితునిమాటలు విని యదిమొదలు రాజసభకు రాక మఱియును నావిరోధులు గల్పించిన కపటంబునకు వశంవదుం డైన రాజువలన నాకారితుండై యవమానంబుం జెంది కాళిదాసుండు స్థితా నేమియుం దోఁచక విలక్షుండై యింటికిం జని మనమున నాలోచించి యిఁక నీ పురంబున నుండిన గౌరవహాని యగ్గుండ సకలజనంబులును దూఱుదు రటుగాన నీ యూరినుండి వెడలి పోవుట తగవని యెంచి తనతో రాజసభయందు వారలు చేసినకపటంబుగ నిర్ణయించి యాపద్మజురాణియగు వాణికటాక్షంబునం గానియీరాజునకుం గల్పితం బై యుండు మోహంబును బాపం గూడ దని యూహించి యిఁక నిత్తఱి రాజుం గనుంగొనుట మాన హానికర మని తలంచి యొకనాటిరాత్రి యెవ్వరు నెఱుంగకుండ నద్దుచేసి యాం దోళికారూఢుండై ధారానగరము వెడలి వసుమానసనగరమార్గంబు వట్టి వచ్చుచున్న వాఁడు. అని మంత్రిపుత్రుండు సెప్పిన విని పండితులు నోకుమారకా యింకఁ గొంత సేపటి కామహాత్మునిం గనుంగొనంగల మనసుల్లాసంబు మాయుల్లంబుల నుల్లసిల్లుచు నున్నది. తదీయపాదకమలప్రణామంబునం జేసి మాభవంబులు పుణ్యభవంబులు గాఁగలవు. అట్టియఖిలజగజ్జనన్యపరావతారుండు మనయుండునగరంబునకుఁ దాన యేతెంచుటకుం గతం బెద్దియో యెఱుంగం గోరెదము. వినిపింపు మన మిత్రసహాయం డిట్లనియె. అట్లా

కుహాకవి చతురంతయానారూఢుండై పురంబు వెలువడి తనమనంబున మనకిప్పు డెయ్యెడ కుం బోవుట యగుఁరవు? మన కీరాజాహ్వానంబు మరలఁ గల్గుదనుక నేభూపతికడ నుండ నగును? అని చింతించుచుండఁ దనపల్లకి విషమగమనంబునం జనుడు మహాకవి యాన వాహులను బిలిచి యిది యిట్లు విషమగతిం బోవుటకుఁ గతం బే మని యడిగిన వార లిట్లనిరి. ఓయయ్యా యేము నీయానతిఁ దల మోచి యీపల్లకి మోచుకొని పోవుచున్నా రము. పుడమ నిర్గమించుటందొట్టి యీయొక మానవుండు మేము వలదనినను మానక యీపల్లకి మోచుకొని వచ్చుచున్నవాఁడు. ఏలకో యెఱుంగము. కఠినశిలాసంచయసం కటస్థలంబుల నితండు పదంబు లిడఁజాలక కొంటుకుచుండువాఁడు. మిట్టపల్లములగు చోటులఁ దొడరం బోవు, శీఘ్రగమనంబున నిలుకు ప్రేక్షచు లేచుచుండు. ఈమానిసివలన నీయానము విషమగమనంబుసం బోయెడి నని యొక్కనిం దెచ్చి యెదుట నిలిపిరి. కవియునత్యుదారంబగు తదీయాకారంబుం గనుంగొని,

ఉ. స్వర్ణసపర్ణ మై తనరుచాయయుఁ నెట్టని లేఁత మోవియుక్
గర్ణముల స్పృశించు తెలిగన్నులు సన్నని మధ్యభాగముక్
పూర్ణసుధాంశుబింబమును బోలెడుశుద్ధ మొగంబు పల్లవో
దీర్ణరుచిం జెలంగుకరదీధుతులం గని యెంచెఁ జానఁ గాన్.

అని యిట్లు నిర్ణయించి నిరూపించి చూచి ససంభ్రమంబుగఁ జతురంతయానం బుడిగి యీమహారాజకన్యక యిట్టికష్టంబునకుం బాల్పడుట యేలకో యని చింతించుచు నాకన్యకం గాంచి యిట్లనియె. ఓకన్యకామణీ నీ వీవిధంబునం బురుషాకారంబు ధరించి వచ్చి యీయతిదుష్కరంబగుమహాకష్టంబునకుం బాలుపడుటయేల? నీకు నావలనఁ గావలసినపని యేదేనిఁ గలదా? అది కడు దుర్లభం బయ్యును గరగతంబు చేసెదను. కట్టా నీ వీకఠినపుంబనికిం గడంగుటంజూచి నాహృదయంబు పరితపించుచున్నయది. ఏమందు.

చ. కమలరజంబు సోఁకినను గందెడునీపదపల్లవంబు లీ
క్రమమున శర్కరాస్థలులఁ గాఁరియ పెట్టుట కోర్వఁజాలు నే
యమలమణీంద్రసంగ్రథితహారలతాధర మోర్వ లేనియం
సము లివి యెంత నొచ్చెనొ వెస న్శిబికాభర మూని మోయుటక్.

ఓయంగనామణీ వినుము.

చ. అనుఁగుఁజెలుఁల్ సలీలపరిహాసరసంబున ప్రేయుంపువ్వులుక్
దనువున సోఁకె నేని యది తత్క్షణమాత్ర నితాంతతాంతతక్

గను నటువంటియీాతనుపుఁ గష్టము వెట్టఁ గడంగ నౌనె యీా
ఘనశిబికాసముద్వహనకార్యనియుక్తతఁ జేసి క్రూరతన్.

అని మఱియు ని ట్లనియె.

క. వనజముఖి యీాకఠోరపుఁ, బనికి న్నూనుట యదేల పల్కుము తెలియన్
వననిధిపరివృతపృథ్వీ, ఘనతరశుభపట్టభద్రు గాదిలిపట్టీ.

అని యిట్లు సగౌరవంబుగాఁ బల్కిన నాకవికులతిలకమునకుఁ గామినీకులతిలక మి ట్లనియె.

చ. ఘనతరసంకటంబునను గాచితి నన్నును నామనోహరున్
వనజభూరాణి భారతి య వచ్చి కనంబడఁ జేసి నాకు నా
జనకుని మెప్పు లందిరిటి సాధుజనస్తవనీయకీర్తి యీా
యనఘుని మన్మనోవిభుని నాదర మార నను గ్రహింపుమీా.

చ. అనుపమశేముషీవిభవుఁ డార్తజనావనరక్షణక్షముం
డనఘుఁడు సాధుపాదజలజార్చనభాగ్యపవిత్రమూర్తి పా
వనతరకీర్తి భూభువనవందితుఁ డాతనియింటి కేఁగి యీా
ఘనునిసపర్యలం గను మకారణసత్కృప యున్న నాయెడన్.

అని యిట్లు ప్రార్థింపఁగా విని మహాకవియు నోతొయ్యలీ నీవు కోరినకార్య మదెట్టిదుష్కరంబైనను జేయుదు; అట్లుండ నీయవశ్యానుష్ఠేయంబై యతిసులభంబై యతిసుఖకరంబై యొప్పుకార్యంబు సేయుటకు విచారింపవలయునే? ఏను నీయడరున నెయ్యెడఁ గాలయాపనము సేయ నగు నని సందియ మొందుచుంటిని. భారతీదేవి భవ ద్రూపమున నన్ననుగ్రహించినయది. నీప్రాణనాయకునికి నావలనఁ గాఁగలకార్యంబుల నెల్ల నిర్వర్తించెదను. ఈధారాపురాధిపతికి నాపితుంగొని పండితులు గల్పించియుండు విప్రతిపత్తి నివర్తించునంతదనుక వసుమానసనగరంబునన యుండెదను. అయ్యెడ వసి యించి చేయంగలపనులను నీమనంబునదలంచియుండు వాని నే నెఱుంగుదును. శుభంబు సమకూరు. నీ విట్లు వచ్చినజాడ లితరుల కెఱుక పడకుండున ట్లు మరల నంతఃపురమునకుం బొమ్ము. ఏఁ బోయివచ్చెద నని యాయతివను వీడ్కొని కాళిదాసుండు వసుమానసనగ రపుఁద్రోవం బట్టి వచ్చుచున్నవాఁడు. ఇది యేను గూఢచారులవలన నెఱింగితిని. అని మంత్రికుమారుండు సెప్పఁగా పండితుండు నోమిత్రసహుఁడా ఆపురుషవేషముఁ దాల్చి కొనివచ్చినరాజకన్యక యెవతె? దానిపే రేమి? దానిమనోహరుం డెవఁడు? ఆయిరువు రును రాజునకుఁ గోపము సంభవించునంతటితప్పు నేమి జేసిరి! అది మహాకవి యెట్లు తప్పించినవాఁడు? ఈ వృత్తాంతంబు భక్తపాలనపరతంత్ర యగు భారతీపుణ్యచరిత

పూతంబై యుండుటోపుం గాన సవిస్తరంబుగఁ బల్కు మన మంత్రిపుత్రుండు రాజపుత్రుని మోముఁ గాంచి నవ్వుచు నిట్లు వచియింప నుపక్రమించె.

## భోజతనూజయగు విరజాంబుజాదేవి చరిత్రము.

వింటిరే యోవిద్వాంసులారా! ఇప్పుడు ధారానగరము నేలుచుండు భోజభూపాలునికి సర్వాంతఃపురప్రధానభూతయగు లీలావతీదేవిమన్మథునితో రతియు మధుసూదనునితో లక్ష్మియు శక్రునితో శచియు శంకరునితో నుమయుంబోలె సదృశసమాగమసుఖం బనుభవించుచుండఁ బరిపూర్ణతారుణ్యంబున నుండు నారసికవతంసులకు మూర్తీకరించిన తదీయాన్యోన్యప్రణయరసపరీవాహపరిణామవిభవంబు నా నొకకన్యకామణి యావిర్భవించె. రతిమన్మథులసౌందర్యంబు నధఃకరించునాదంపతులరామణీయకంబ తత్తనూభవాకారంబునఁ దోఁచుచున్నయదియ నా నాకన్యకామణి యెల్లవారలకు నల్లారుముద్దుగఁ బెరుగుచుండెను. ఆకన్యకామణిరామణీయకంబు సుర, గరు, డోరగ, దైత్య, దానవ, యక్ష, విద్యాధర కన్యకామణులందు నుండంబోల దని వర్ణించుట యతిశయోక్తి గాదు. మన్మథునివంటి యతిరూపవంతుం డయినభోజభూపాలునికి రతీదేవినంటియతి సౌందర్యవతియగు లీలావతికిం జనియించిన యామానినీవతంసంబునకు రూపరేఖావిలాసంబులఁ గొంత యేమేని యుండునే! ఆపల్లవపాణి యాకారసౌష్ఠవంబించుక వినుఁడు.

చ. కనకలతాసమాన మగుగాత్రము చంద్రునిబోలువక్త్రముల్
విసుతనవప్రవాళరుచివిభ్రమముల్ మృదుపాదపద్మముల్
ఘనశిఖిరాట్కలాపభరకాంతము క్రొవ్వెద ముద్దుపల్కులున్
విన విన వేడ్క లౌ నధరవిద్రుమ మత్యరుణాభ మింతికిన్.

ఈమనుష్యలోకంబున మాచూచినరాజకన్యకాశిరోమణు లెందఱో కలరు. ఎవ్వతెయేని నాబోటికిఁగోటికైన సాటి యగునది లేదు.

ఉ. క్రొన్నెలవంకయో మరుఁడు గోరికఁ బెంచినగోరువంకయో
కన్నియజాజితీనియయొ కంతునిచేడియతోఁటమావియో
చిన్నెలప్రోకయో సరసఁ జేరినగొజ్జఁగినీటివాఁకయో
పున్నెపుదీవియో యనఁగఁ భోజనృపాత్మజ యొప్పు నీటునన్.

మఱియుం.

చ. మదనుఁడు లోకము ల్గెలువ మానసమందుఁ దలంచి తా జగద్విదితసుశాంబరీమహిమ వేడుక భూభువనంబునందు నీ
మదవతిఁ గా సృజించె నన మానసవృత్తులఁ జూఱగొంచు సం
మ్మదమునఁ బొల్చు నాతరుణిమండలమండన యొప్పులొల్కుచున్.

ఓసభాసదులార యామదేభగమనాభిరూప్యంబు వినుఁడు.

ఉ. ఆరసి చిత్రమందు నను వారఁగ రూపసముచ్చయంబునన్
సారసగర్భుఁ డాత్మ నతిచాతురి మీఱఁగ వ్రాసి ప్రాణసం
ధారణఁ గల్గఁ జేసె నొ నితంబవతీమణిసృష్టి లోకసా
ధారణ మంచుఁ దోఁచదు నితంబినిరూపము నెంచి చూడినన్.

ఓపండితోత్తములార యాకాంతాతిలకంబు దృక్పథంబునం దగిలె నేని పురుషులన నేమి! తరుణులు సయితము చిత్తవిభ్రమంబుం గాంచకపోరు.

ఉ. ఆవరవర్ణినీతిలక మాసఁ గనుంగొని దానిశోభనీ యా
వయవంబులం దగులునక్షులఁ దామ మరల్ప లేక పుం
భావము లాత్మలం గొనుచు బాళి సెలంగఁగమై గగుర్పఁగా
భావములం గరంగుదురు పంకజనేత్రయనుంగుసెచ్చెలుల్.

ఆకన్నియ జననీజనకు లిడినవిరజాంబుజయను నతిమనోహరనామంబునం బేరుపడి యాడైనసకియలతోడఁ గూడి శైశవంబునన వీణా, వేణు, మృదంగ, తాళాది యంత్రంబుగ గానవిద్యాపారంగతత్వంబుం జెంది యభినయశాస్త్రదక్షయై యఖిల విద్వజ్జనవిస్మయనీయమైశారద్యంబునం దేజరిల్లుచు నుండ భోజభూపతి దానిం గాంచి సాహిత్యవిద్యాభ్యాసంబునఁ దదధీతనిఖిలవిద్యలఁ దన్నె కలుగఁ జేయం దలంచి తన యాస్థానంబునం గవిపండితాగ్రగణ్యుండై యుండుబాణభట్టారకుని రప్పించి తనమనోరథంబుఁ జెప్పి యావిప్రవర్యునికిం దనతనూజాత నప్పగించి యపరిమితధనంబుల సంతుష్టునిం జేసి వీడ్కొలిపిన నంత నాబాణభట్టారకుండును విరజాంబుజను స్వసుతానిర్విశేషంబుగఁ జూచుచు సమస్తశాస్త్రంబుల నభ్యసింపం జేయ నాభోజనృపాత్మజయు నాచార్యబోధితంబు లయినయఖిలగ్రంథంబుల నించుకేనియుం భ్రమప్రమాదంబులు లేక నేర్చుకొనియె. విమలమగు మణిదర్పణంబునందుం బోలె నాయంగనామణిచిత్తంబున నఖిలవిద్యలు సంక్రాంతంబు లయ్యె.

శా. నానాలంకృతిభిన్నభావముల విన్నాణంబు వేఁ జెంది వి
జ్ఞానంబు న్గడియించి నాటకపుభాషాతార్థకావ్యంబులన్
భూనాథాత్మజ గామశాస్త్రమున సుభ్రూసౌఖ్యధామంబునన్
తా నత్యంతసమర్థతం గనియె ఛందశ్శాస్త్రసారజ్ఞయై.

ఆమానవతీతిలకంబు బాల్యంబుఁ బాసి తారుణ్యంబు నొందుచుండుతటి తదీయ సౌభాగ్యవిశేషంబు దానిసెచ్చెలులు లీలావతీదేవితో విన్నవించినప్రకారంబుఁ జెప్పెదను వినుండు.

శ్లో. *మాంథర్య మాప నయనం సహశైశవేన రక్తం సహైవ మనసాధరబింబ మాసీత్,
కించాభవ న్మృగకిశోరదృశో నితంబ స్సర్వాధికో గురు రయం సహమన్మథేన.

భోజభూపాలుండును దనతనూజాత యధిగతసర్వశాస్త్రయు సంజాతయౌవనయు నయ్యె నని యెఱింగి సమస్తకవివరులయెదుట దానివిద్యావైశారద్యంబుఁ బరీక్షింపఁ దలంచి యొకశుభదినంబునందు సభాసదనంబును సర్వాలంకారాలంకృతంబుఁ జేసి కాళిదాస, భవభూతి, దండి, శంకర, తారేంద్రప్రముఖమహాకవుల రప్పించి సముచితమణిమయాసనంబులఁ గూరుచుండఁ బ్రార్థించి వందులును మాగధులును స్తోత్రంబులు సలుప భూసురవర్యు లాశీర్వదింప వేదవిదులగు పురోహితులు పుణ్యాహవాచనంబులు సదువ సమీపనిబద్ధయవనికాంతరంబున నమరించియుండురత్నపీఠంబునఁ దన దేవియగు లీలావతి విరజాంబుజతోడ వచ్చి యాసీన యగుడుఁ దానును మహావైభవంబునం జనుదెంచి సింహాసనాసీనుండయ్యె. అప్పుడు మంగళవాద్యంబులు మ్రోఁగెను. అచ్చరవెలందులవంటిబోగపుమచ్చెకంటులు నర్తనంబులు సలిపిరి. అంత బాణభట్టారకుండు భూపతిసమాహూతుండై యేఁగుదెంచికాళిదాసుని వామభాగమున నమరించియుండురతనంపుఁబీఁటపయి నుపవిష్టుం డయ్యె. భోజభూమీశునియానతిం గొని యంతఃపురప్రధానపరిచారికలు నవరత్నపూరితంబులయిన బంగరుపళ్లెరంబులు కరంబుల నిడుకొని వెంటనేఁగుదేర జవనికాంతరంబు వెలువడి యారాజకన్యక సభాభవనంబునకుం జనుదెంచి పురోహితోపదిష్టమార్గంబునఁ బరిచారికలందియిచ్చుమణినిచయంబుల బాణభట్టారకునిపాదపద్మంబులకుఁ బూజలొనరించి యంజలిగావించి కాళిదాసాదిమహాకవులకును జనకునికిని తక్కుంగలవందనీయులకు నభివందనంబు రచియించి యంచితరీతిఁ దనజనకునిసింహాసనంబుకడ నిలువంబడియెను. అప్పు డాయొప్పులకుప్పుం గనుంగొని సభాసదులు తదీయరూపరేఖావిలాసంబులకు మానసంబుల నచ్చెరువందుచు,

సీ. శృంగారరసవరాభంగమహోదారసర్వస్వపరిణామసార మొకొ-
అభినవతారుణ్యవిభవసముల్లాసలక్ష్మీమనోజ్ఞవిలాస మొకొ-

---

దీనికాంధ్రపద్యమును టీకయును.

ఉ. *మానినివాలుఁగన్నుఁగవ మంథర మయ్యెను శైశవంబుతో
మాననిరక్తిమం గనియె మానసవృత్తులతోడ మోవి యంక
చాననితంబబింబ మది సర్వమహత్త్వముఁ గౌరవంబునుం
బూనఁగ సాగె నప్పు డలపొల్తికి మన్మథుతోడ వేడుకన్.

టీక. మృగకిశోరదృశః = మృగశిశువువంటికన్నులుగలదానికి, నయనం=కన్ను, శైశవేనసహ = బాల్యంబుతో = మాంథర్యమాప = మాంథర్యమునొందెను. శైశవము మందప్రవృత్తిగలదాయెను. నయనములువిశాలములయ్యెను. సహోక్త్యలంకార

త్రిభువనవ్యామోహదీపకరతిరాజవిజయలక్ష్మీమహావిభవ మొక్కొ-
అతులితరామణీయక సార్థపావనచారువినూత్నావతార మొక్కొ-
తనరులావణ్యపుంజనిధాన మొక్కొ-, పరగుసౌందర్యసముదాయభవన మొక్కొ-
అభిరూప్యసముల్లాసలాభ మొక్కొ-, యనుచు మనములఁ దలఁచి రాయతివఁ గాంచి.

మఱియుఁ నాసౌందర్యనిధి ననిమేషదృష్టులం గనుంగొనుచు నొండొరులతో నా సభాసీను లిట్లనుకొనిరి. ఔరా యేమందు మీమందయానసౌందర్యంబు!

సీ. అభినవసౌభాగ్యవిభవసంపద లెల్ల సుదతిసెమ్మోమునఁ జూడవచ్చు
మంజుళలావణ్యపుంజవైభవ మెల్ల సుభ్రూమైఁదీగెలోఁ జూడవచ్చు
నసదృశసౌకుమార్యాంచితశ్రీ యెల్ల సుముఖియంగకములఁ జూడవచ్చు
శుక్లకృష్ణవిశాలసురుచిరత్వం బెల్ల సుశ్రోణికన్నులఁ జూడవచ్చు
చారువిపులాతిపీనతాశ్చర్య మెల్ల, సుందరికటీతటంబునఁ జూడవచ్చు
వృత్తసమపీవరమ్యతాసక్తి యెల్ల; సుతనువునురోజములయందుఁ జూడవచ్చు

అని యనుకొనుచుండ నాపుండరీకపత్రాక్షిం గాంచి కవివరులు తమమనంబులంగు;

సీ. శారదపరిపూర్ణచంద్రబింబప్రతిబింబభావమనోహరంబు మోము
అతులితవిద్రుమలతికాప్రతీపసద్భావమనోజ్ఞంబు పడఁతిమోవి
లలితమయూరకలాపభారోదారపరిణామరమ్యంబు భామకబరి
ఉత్ఫుల్లనవహల్లకోదారసాదృశ్యలక్ష్మీధరంబులు లలనపదము
లతనుభుజశౌర్యదీపకం బబలమూపు, రతికళాచాతురీసార మతివపల్కు-
గాన నీచాన తానలంకారగరిమ, సహృదయాహ్లాదవిస్ఫూర్తి సల్పె నిపుడు.

## విరజాంబుజపాండిత్యంబుకవులుపరీక్షించుట.

అట్లు తనచెంత నిలువంబడి వినయభయభక్తులు ముప్పిరిగొన నాజ్ఞాప్రతీక్షణ మొనరించుచుండుతనతనూజాతం గాంచి భోజభూవిభుండు నోతల్లీ నీ వీబాణభట్టార కునికి శిష్యవై యభ్యసించినవిద్యలలోఁ గొన్నింటి నీమహాకవులం పరీక్షింపం దలంచి మదీయప్రార్థనాంగీకారం బొనరించి యీసభ నలంకరించుచున్నవారు; ఈమహనీయుం

ము కొలకుమాంధర్యాదిశబ్దములకు శ్లేషచెప్పనగును. అధరబింబం=దొండపండువంటి మోవి, మనసాసహైవ = మానసముతోడనే, రక్తమాసీత్ = రక్తమాయెను. అధరమెట్టునిద య్యెను. మానసము శృంగారరసముగలదయ్యెను. కించ = మఱియు, నితంబః=పిఱుఁదు, మన్మథేనసహ = మదనునితోడ, సర్వాధికః = అన్నిటికంటెనధికముగను, గురుః = గౌరవముగలదిగను, అయెను. నితంబమతివిశాలమైప్రథిమఁజెందెను. మన్మథుండు తక్కి-నవానికంటె మించి తనకు లోబడం జేసికొనియె.

లడిగినప్రశ్నల కుత్తరంబు వక్కాణించి న న్నానందపయోనిధిం దేలింపం గలవె. ఇన్ని దినములు నీ యభ్యసించినవిద్యలయందలిసారం బీదినమున నీకవులసన్నిధిని బయల్పఱిచి తదీయశ్లాఘాపాత్రతం గాంచినం గదా యుంజివంశంబు వన్నె కెక్కంగలదు! అని మందలించిన విరజాంబుజయుం దండ్రిం గాంచి యోయయ్యా మదమత్తసామజంబులకడ మశకంబు తనశక్తిం గనంబఱుచువిధంబున నీవిద్యావధూహృదయవిదగ్రగణ్యులసన్నిధి నానేర్చినయత్యల్పవిద్యను ప్రకటించుట హనుమంతునెదుట కుప్పిగంతులు వేయం బూనుటయ. అయినను మదీయగురుజనచరణకమలంబుల మానసంబునం దలంచి తదీయప్రభావంబునం జేసి నానేర్చినయది విన్నవించుకొనియెద. వీరలు బుధజనాగ్రగణ్యు లగుటం జేసి నాయుదువులం గలదోషంబులను బాటింపక గుణంబులు గలవేని వానిం గైకొందురు గాక. అని చెప్పిన దానివినయసంపద కెల్లవారు నభినందింప రాజును గాళిదాసుం గాంచి యోయభినవభారతీ శుభావతార! మహాకవీ! యీకన్యక నేడేని యొకటి యడుగు మని వాక్రువ్వం గవియు నట్లె యని విరజాంబుజం జూచి యోకుమారికా మలయమారుతంబు మందమందముగ వీచుచుండుట వర్ణింపుము అని వచియింప నారాజకన్యకయు నప్పుడ యిట్లు సెప్పె.

* శ్లో. లతాం పుష్పవతీం స్పృష్ట్వా స్నాతో విమలవారిషు,
పున స్స్పర్శనశంకీవ మందం చలతి మారుతః.

---

* మారుతః = వాయువు, పుష్పవతీం = ముట్టుతయైన, పుష్పములుగలదియైన, లతాం = తీవియను, లతవంటిస్త్రీని, స్పృష్ట్వా = తాఁకి, విమలవారిషు=నిర్మలములయిన జలములయందు, స్నాతః = స్నానమొనరించినవాఁడయి, పునస్స్పర్శనశంకీవ = మరలఁ దాఁకఁబోదునను శంకగలవాఁడయినట్లు, మందం= మెల్లగ, చరతి = సంచరించెడిని. మారుతుఁడు తాను బుష్పవతి యైనలతను దాఁకి యాముట్టుతం దాఁకినదోషంబు వోవ శుద్ధోదకంబులఁ దానమాడి మరల నాముట్టుతం దాఁక బోదు ననుశంకచేత వేగముగఁ జరింపక మెల్లనం దిరుగుచున్నవాఁడు. తొలుతఁ దెలియక ముట్టుతను ముట్టుకొన్నవాఁడు దాఁ దానమాడి మరల దాని కెడగలుగ మెల్లగ సంచరించుట యిచట వేద్యము. శైత్య సౌరభ్యమాంద్యములను మూఁడుగుణములు మారుతమున కుండిన సుఖకర మగుంగాన నవి యున్నవని భావము. "మందంచలతి" యనుటచే మాంద్యము, "పుష్పవతీం స్పృష్ట్వా" యనుటచే సౌరభ్యము, స్నాతః" అనుటచే శైత్యమును స్ఫురించెడిని.

ఇచట "మారుతః" అనుచోఁ బుల్లింగస్వారస్యముచేతను, "లతాంపుష్పవతీం" అనుచో స్త్రీలింగస్వారస్యముచేతను "స్పృష్ట్వా" యను క్రియాపదస్వారస్యముచేతను ఒకరసికుఁడు పుష్పిణి యయినపూఁబోణిం గూడి యనంతరము పాపభీతిచే నాపాపము వోవం దానమాడి మరలఁ దాఁకుదునో యనుభయంబున నొదిగియొదిగి వర్తించుచున్నాఁ డను నప్రస్తుతార్థము మారుతవృత్తాంతంబున సూచితంబు సేయంబడుచున్నది.

అని చెప్పిన విని సభాసదులు రాజకుమారిక సెప్పిన పద్యంబునందుఁ గల యర్థవైచిత్ర్యమునకుఁ గడు సంతసించిరి. మహాకవియు నాసలిసుడివినపద్యభావంబు శ్లేషానుప్రాణితంబై మనోరంజకం బయ్యె నని యనర్ఘమణిగణగ్రథితం బయినతనకంఠ హారంబును బహుమానించె. అది గని సంతసించి రాజుభివభూతిం గాంచి యోకవివరా నీవు నేదేని దీని నడుగు మనిన నాతండును గామినీకాముకులయుక్తిప్రత్యుక్తిరూపముగ నొక సమస్య యొసఁగె. * శ్లో. కాంతోసి నిత్యమధురోసి రసాకులోసి త్యాలింగితః కిమితి నాథ పరాఙ్ముఖోసి. అని చెప్పిన విరజాంబుజ విని యాపద్యార్థంబునందు నలిమనోహరుండును

* పూర్ణమయినశ్లోకమును దానియర్థాదులును.

శ్లో. కాంతోసినిత్యమధురోసిరసాకులోసి త్యాలింగితఃకిమితినాథపరాఙ్ముఖోసి,
త్వత్పీవరోరుకుచయుగ్మమురోవిభిద్యపృష్ఠాద్వినిర్గతమభూత్కిమితిహ్యావేక్షి.

ప్రోషితభర్తృక యగుకామిని తననాయకుండు రాఁగా వానిం గాంచి తదీయ రూపరాసిక్యాదు తెలియంగియుండునది గానఁ దమి తలకెక్క సఖీజనసమక్షం బని యెఱుంగక పయింబడి కౌఁగిలించి మోవి కాసచేయ నది తనకిష్టం బయ్యె సఖీజనసమ క్షం బని వెరగంది నాథుండు మొగముద్రిప్పికొన నది రసికునికిం దగునా యని నాయిక యడుగుచున్నది. కాంతోసీత్యాదిచేత.

టీక. నాథ = ఓనాయకా, కాంతోసి = స్త్రీలమానసంబును హరించువాఁడవై నెగడెద వనియు, నిత్యమధురోసి = సర్వదాఅనుభవించినను వెగటు గలుగక రసా వహుఁడవై ప్రత్రితు వనియును, రసాకులోసి = పరమురసికుఁడ వనియుం, ఆలింగితః= నాచే నాలింగనముసేసికొనంబడినవాఁడవై, కిమితి=ఏమని, పరాఙ్ముఖోసి = మొగము ద్రిప్పుకొన్నవాఁడ వైతివి. అని యడిగిన నాయికకుఁ గాంతుండు తదీయమానసంబున కధికోల్లాసంబు గలుగునట్లును దాఁజేసినముఖపరావర్తనము లజ్జవలనను మఱిదేనివలనను గాదని సమర్థించుటకును దానితో ని ట్లనుచున్నాఁడు. త్వత్పీవరోరుకుచయుగ్మం = నీ బొగరుమీఱియుండుగబ్బిగుబ్బలకవ, నీవు గాఢాలింగనము చేసికొనఁగా, ఉరః = నా వక్షమును, విభిద్య = భేదించి, పృష్ఠాత్ = వీఁపువలన, వినిర్గత మభూత్కిమితి = దూసి వెడలివచ్చెనేమోయని; అవైక్షి = నాచే మరలి చూడంబడియెను. నేను మోము మరల్చినది నీ కథరమిచ్చుటకు లజ్జించి గాదు. నీవు హఠాదాలింగనంబుఁ జేసికొని కుచం బుల నాయంపంబున మెఱుమఁగా నీబొగరుమీఱినగబ్బిగుబ్బలమొన లురంబు భేదించి నట్టుండ నవి నావక్షంబును భేదించి వీఁపున వెడలె నేమో యని మరలిచూచితి నని నాయకుఁడు సెప్పినట్లు భావము.

ఈ పైశ్లోకమునందును దీనిక్రిందిపద్యమునందును బూర్వార్థము నాయికోక్తి యనియు నుత్తరార్థము నాయకోక్తియనియు నెఱుంగనగును.

సర్వదా మృదుమధురాలాపలీలావిచక్షణుండును శృంగారరసభూషణుండునగు నాథునిఁ గని సఖీసమక్షం బని యెఱుంగక మోహావేశంబున నాతనిపయిం బడి కౌఁగిలించి మోవి పానక మానం గడంగిన నాయకుండు లజ్జించి మారుమోము వెట్టుకొనఁగా రసభంగం బగుటకు వగచి యాయధీర రసికుఁడవగునీ కిది తగునా యని యడిగెడుభావము గానం బడుచున్నది. మంచిది! దీనికిఁ దగిన తెలుఁగున వచింప నగునని యెంచి యిట్లనియె. శ్లో॥ త్వత్పీవరోరుకుచయుగ్మమురో విభిద్య పృష్ఠా ద్వినిర్గతముఖాత్క్రమితి హ్యావేక్షి. అని చెప్పిన సభాసదు లత్యంతచమత్కృతులై విరజాంబుజరసికతావిభవంబును కరముల్ శ్లాఘింపం దొడంగిరి. భోజభూమీశుండును దనకుమారిసామర్థ్యంబున కలరుచు నాచార్యుఁడైనదండిం గాంచి యో కవికులతిలకమా నీవు నేదేని ప్రశ్న సేయుమని వేఁడుకొనిన నాదండియుఁ గన్యకావతంసంబుం గనుంగొని విరహోత్కంఠిత యగునాయిక యవస్థను బోధించుపద్యార్థంబు నుడివెను. *శ్లో॥ "ఏకతో రచితా శయ్యా హ్యేకతో రచితాచితా" అని చెప్పి యాదండి కన్యకామణిం గాంచి నానుడివినపద్యంబున కుత్తరార్థంబువల్కు మనిన

ఈ శ్లోకమునకు సరియగు నాంధ్రపద్యము.

చ. చతురులలోన నెంతయుఁను జాణ పటంచును నిన్నుఁ గౌఁగిలిం
చితి నిటు మారుమో మిడఁగఁ జెల్లునె యోరసికాగ్రగణ్య య
ద్భుత మగునట్టిబంగరపుబొంగరపుంగవఁ బోలునీకుచ
ద్వితయము ఱొమ్ము నాటి వెస వీఁపున దూసెనొ యంచుఁ జూచితిన్.

* పూర్ణమయిన శ్లోకంబు నవతారికయు నర్థాదులును.

శ్లో॥ ఏకతో రచితా శయ్యా । హ్యేకతో రచితా చితా,
అద్యకాంతః కృతాంతో వా । దుఃఖస్యాంతం గమిష్యతి.

విరహోత్కంఠితయగు నాయిక తననాయకునికిం జెప్పిపంపి నాయకుఁడు తా వచ్చెద నన్న కాలంబులఁ దప్పిపోయి రాక పోవుటం జేసి యప్పుడు కడపటిమాటగా దూతికాముఖంబున నాహ్వాన మొనరించి వాఁడు తప్పక వచ్చెద నన్న కాలమునకుఁ దా నాతఁడు సను దెంచెనేని వానితో రతిసుఖంబు లనుభవింపఁ బుష్పశయ్యయు వాఁడు రానినాఁడు హుతాశనునికి దేహ మాహుతిసేయఁ జితయు సిద్ధపఱుచుకొని యున్నది. తదవస్థాబోధక మీ పద్యపూర్వార్థము. ఆయవస్థ కనుగుణముగఁ జేయ నిర్ణీతమైయుండు నాయికా సాహసంబుఁ దెల్పునది యుత్తరార్థము.

టీక. ఏకతః = ఒకవైపున, శయ్యా = పూలపానుపు, రచితా = ఏర్పఱుపం బడినది. ఏకతః = మఱియొకవైపున, చితా = చితయు, రచితా హి = కల్పింపబడియున్నది

నప్పుడ యాసుందరి యిట్లనియె. శ్లో॥ అద్య కాంతః కృతాంతో వా దుఃఖ స్యాంతం గమిష్యతి" అని నుడువఁగా సభాసదు లెల్లవారును మహానందభరితులై యారాజకన్యకబుద్ధి చాతుర్యంబునకును తదీయరాసిక్యంబునకును బలుమఱు శ్లాఘింపం దొడంగిరి. అంత మహా కవియగు కాళిదాసుండు సభాసదు లెల్ల వినంగ నిట్లనియె. ఓ ధారాపురాధిపతీ ఈ భవ భూతియుం దండియుఁ నిచ్చినపద్యార్థములభావంబులు నాక కాక యితరులకు వేద్యంబులు గావు ; మహాదుర్బోధములు ; అట్టిభావంబుల నతిసులభంబుగ గ్రహించి యీ కుమారిక తదనుగుణముగా నుత్తరార్థంబులు వచించినయది. ఓరాజా భవదీయభక్తిభావంబునకు సంత సిల్లి యుల్లంబున నీకులంబుఁ బావనముసేయ నెంచి యీపురంబున నుండుభువనేశ్వరియె యీవిరజాంబుజ యై యవతరించె నని తోఁచెడిని. కాదేని యిట్టి కళాకౌశలంబు సాధా రణకన్యకల కెక్కడిది? ఈకలువకంటివలన నీకులం బుత్తమకీర్తిం గాంచంగలదు. అని నుడివిన భోజభూపాలుండును భవద్విధులగు మహనీయుల యాశీర్వాదంబులకుఁ బాత్రుఁ డనయిననాకులమున కిట్టిసుజనశ్లాఘనీయంబగు నుత్కర్షము సంభవించుట చిత్రమే ? అని వినయంబు దోఁపఁ బలుకఁ గాళిదాసుండు బాణకవిం గాంచి యో ప్రియసఖుఁడా భట్టబాణుఁడా! సుశిష్యాపరిదత్తం బయినసీవిద్య శుక్తిగతం బయినజలబిందువుచందంబున మహార్ఘం బయి యొప్పినయది. కృతార్థుండవైతివి. అని చెప్పిన దండియుం భవభూతియు దక్కంగలవారలును గాళిదాసునివచనంబులకుఁ గర మామోదించిరి. ఇంతలో ద్వార పాలకుండు సనుదెంచి రాజునకు జోహారు సల్పి దేవా కుటుంబకవులు నల్వురు సను దెంచి భవదీయదర్శనంబుం గోరుచు ద్వారదేశంబున వేచియున్నవారు అని చెప్పిన రాజును వారలం బ్రవేశపెట్టునది యని ముదల యిడ ద్వారపాలకుండు నట్లొనరించి తనకార్యంబు సేయుచుండుటకుం జనియె. ఆకుటుంబకవులు బ్రాహ్మణవేషధారులు. వార లలో వృద్ధుండు రాజునకు స్వస్తి యగుం గాకయని యాశీర్వదించి భూపతియిచ్చునర్ఘ్య పాద్యాదులం బరితోషంబుం జెంది తన్నిర్దిష్టాసనంబున నుపవిష్టుం డయ్యె. ఆతనితో నొకవిప్రవేషధరుండగు కుమారుండును బ్రాహ్మణీవేషధారిణి యొకకన్యకయు నట్టిద యొకవృద్ధయుం నుండిరి. వారలును యథావిధి బూజితులైరి. రాజాజ్ఞచే నాకుమారుండు వృద్ధోపవిష్టంబగు నాసనముసమీపమున మఱియొక యాసనంబున నుపవిష్టుం డయ్యె.

---

గదా ? అద్య=ఇట్టి సమయమున, కాంతః=నాయకుఁడుగాని, కృతాంతో వా=యముఁడు గాని, దుఃఖస్య=నాయిక దుఃఖమునకు, అంతం=ముగింపును, కరిష్యతి=చేయఁబోయెడిని. నాయకుఁడు సనుదెంచెనేని రతిసేయుటకు శయనంబును రానినాఁడు పరతిచేఁ బ్రాణ పరిత్యాగంబునకుఁ జితయుఁ గల్పితంబులయ్యెను. ఏప్రకారమునఁ గాని దుఃఖంబును బాపికొన నాయిక గడంగి యున్నదని భావము.

వృద్ధయుఁ గుమారికయు నిలువంబడియుండిరి. అప్పుడు రాజు నానల్వురిలో వృద్ధునిం జూచి మీరు కుటుంబకవుల రని వినియెదను. అట్టయిన నాయిచ్చుసమస్యను పూర్ణము సేయంజను ననియిట్లనియె. శ్లో॥ క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే" [సత్త్వంబు గలిగినమహాత్ములకుఁ గ్రియాసిద్ధి గల్గు, నుపకరణంబులు గావలయుననునావశ్యకతయేమియుం లేదు] అని నుడువఁగా వృద్ధుం డిట్లనియె.

* శ్లో. ఘటో జన్మస్థానం మృగపరిజనో భూర్జవసనః
వనే వాసః కందాదికమశన మేవంవిధగుణః
అగస్త్యః పాథోధిం యదకృత కరాంభోజకుహరే
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే.

---

టీక. జన్మస్థానం = పుట్టినచోటు, ఘటః=కుంభము, మృగపరిజనః = మెకములు పరివారముగాఁ గలవాఁడు, భూర్జవసనః=భూర్జవృక్షపుఁబట్ట వస్త్రముగాఁ గలవాఁడు, వనే=వనమునందు, వాసః=నివాసము. కందాదికం=దుంపలు మొదలగునది, అశనం =అన్నము, ఏవంవిధగుణః=ఇవ్విధములగుగుణములుగలవాఁడు, అగస్త్యః=అగస్త్యుఁడు, పాథోధిం=సముద్రమును, కరాంభోజకుహరే = కేలుఁదామరపల్లంబునందు, యత్ = ఎందుచే, అకృత=నిలిపెనో! తత్ = అందుచే, మహతాం=మహాత్ములకు, క్రియాసిద్ధిః= కార్యనిష్పత్తి-కార్యము నెఱవేఱుట, సత్త్వే=ప్రభావముండఁగా, భవతి=అగుచున్నది. ఉపకరణే=సాధనసంపత్తి, యుండవలయుననుట, న=ఆవశ్యకముగాదు.

తా. అగస్త్యుఁడు కుంభమున జనించినవాఁడు గాన జన్మస్థానప్రాబల్యము లేదు. తపస్వి యగుటచే నరణ్యావాసము సేయుటంబట్టి యారణ్యకములగు మృగములే పరిజనము వలెఁ దోడ్పడును గాఁనఁ బరిజనమువలనం గలిగినప్రాబల్యమును లేదు. వల్కలములు ధరించువాఁడు గాన దరిద్రుఁ డగుటంబట్టి ద్రవ్యబలమును లేనివాఁడు. వనమున నునికి యగుటం జేసి స్థానప్రాబల్యము లేదు. కందమూలాదులు భుజించువాఁడగుటం జేసి యన్నందులవలన నైనదేహదార్ఢ్యాదులును లేవు. ఇయ్యవి జన్మస్థానాదులు. మహాప్రభావసంపాదక మగుకార్య మొనరింప జాలనివే యయ్యును ఎంతటిమహాశూరు లైనను జేయం గూడనిసముద్రచుళికీకరణమును గుంభజమహర్షి యొనర్చెను. గాన మహాత్ములకుఁ గార్యము సిద్ధింప నుపకరణము లక్కరలేదు. మఱి వారిప్రభావంబునలననే నెఱవేఱు చున్నవని భావము.

మిత్రావరుణు లనుదేవతలకు నూర్వశీదర్శనంబు కారణముగాఁ జరమధాతుక్షరణము సంభవింప నది రెండుభాగము లయి యాగభూమియం దుండుఘటంబునందును

అని చెప్పిన విని రాజు నాతనిశ్లోకార్థంబునం గలసరసతకుం గడు నభినందిం చుచు బహుమూల్యంబు లయినషోడశమణులు గలహారం బొక్కటి యతనికి బహుమానం బొనరించి వృద్ధయగు కాంతం గాంచి యోయవ్వా యీసమస్యకు నీకుం దోఁచినది నుడువుమనఁగా నావృద్ధ యిట్లనియె.

* శ్లో. రథస్యైకం చక్రం భుజగనమితా స్సప్త తురగాః

నిరాలంబో మార్గ శ్చరణవికల స్సారథి రపి

---

ఘటబహిఃప్రదేశమునందును బడగా ఘటాంతఃపతితబిందువుచే నగస్త్యుఁడును దరితర ముచే వసిష్ఠుండును జన్మించిరి.

పూర్వము సముద్రమందుఁ గొందఱు మహాక్రూరరాక్షసులు సేరి దాఁగి యప్పు డప్పుడు లోకములను బాధపెట్టుచు రాఁగా నది యెఱింగి యగస్త్యుండు క్షీరాబ్ధిశాయి యగుశ్రియఃపతిం గనుంగొనుదెపుడునున సముద్రునిఁ ద్రోవ యిమ్మని యడుగ నాతం డూరకుండినం గ్రుద్ధుండై యామహర్షి తనయోగశక్తిచే సముద్రునిం దనపుడిసిట నిమిడ్చుకొనియాచమించెను.

ఈపురాణకథలు రెండు నిచ్చోట ననుసంధేయములు.

* టీక. రథస్య=అరవమునకు, ఏకంచక్రం=ఒకచక్రము. ఇంచుక యొడ్డగెడవయి నను భూమిం బడుటకు సిద్ధమయి యుండుననిభావము. భుజగనమితాః=సర్పములచేనియం త్రితములయిన, సప్తతురగాః = ఏడుగుఱ్ఱములు, రథమునకు విషమసంఖ్యగలగుఱ్ఱములు గట్టిన నది విషమగతిఁ జనును. అట్టివానిని సర్పములచేఁ గట్టుటయుం మఱియొక కార్య విఘాతకము. మార్గః=త్రోవ, నిరాలంబః=ఆశ్రయములేనిది, త్రోవ మంచిదిగాను గఠిన ముగానుండక యేవిధమయినపంకాదిదుర్లంఘ్యప్రతిబంధకము లుండినను నడుచుట కష్టమే. అట్లుండ నాత్రోవ నిరాలంబమే యయినచోఁ బ్రయాణముసేయుట యెంత కష్టమో తెలిసికొనవచ్చును. సూర్యుండు చనుమార్గ మాకాశముగాన నిరాలంబము. సారథిరపి=సారథియును, చరణవికలః = పాదములులేనివాఁడు అనూరుఁడు, సారథియైన సమర్థుం డయ్యెనేని సాధ్యమగునంతవరకు సమర్థింప నగును. ఆసారథికిం బాదములే లేవు. అట్టివాఁడేమి సామర్థ్యము రథముతోలుటలోఁగాన్పింపం గలండు. రవిః= సూర్యుఁడు, ప్రతిదినం=దినదినము, అపారస్య=దరిలేని, నభసః=ఆకసముయొక్క, అం తం=కొనను, గచ్ఛత్యేవ=చేరుచునేయున్నాఁడు. కాన, క్రియా...కరణే=మహాత్ము లకుఁ గ్రియాసిద్ధి వారిప్రభావమువలననే యగును? గాన వారి కుపకరణములు గావలసినయావశ్యకత లేదు.

రవి ర్యాత్యే వాంతం ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధి స్సత్వేభవతి మహతాంనోపకరణే.

అని పల్కఁగా విని రాజు సాయమం గరము సంతసించి పదునే డేనుఁగులను ఏడురథంబులను బహుమానమిచ్చి కుమారునిం గనుంగొని నీవును నుడువు మనఁగా నాకు మారుం డిట్లనియె.

* శ్లో. విజేతవ్యాలంకా చరణతరణీయో జలనిధిః
విపక్షః పౌలస్త్యో రణభువి సహాయాశ్చ కపయః
పదాతి ర్మర్త్యోసౌ సకల మవధీ ద్రాక్షసకులం
క్రియాసిద్ధి స్సత్వేభవతిమహతాంనోపకరణే.

---

తా. సూర్యుఁడు తాను ప్రతిదినమును ప్రయాణముచేయవలసినచోటు దరి లేనియాకాశము. దీనియందు దినదినము సంతతయుం బ్రయాణము తప్పక చేయవలసి యున్నది. ఇట్టితుదముట్టనిచోటం బయనముసేయుటకుఁ దగినసాధనసంపత్తి లేదు. రథ మునకో యొంటిచక్రము. గుఱ్ఱములు విషమములు. అవి భుజంగములచేఁగట్టంబడి యున్నవి. నిలువ పీలులేనిది త్రోవ. రథముతోలెడువానికిఁ గాళ్లు లేవు. ఇట్లు సాధన సంపత్తి లేకుండినను సూర్యుఁడు ప్రతిదినము నపార మగునీయాకాశమునందుం బ్రయాణముచేసి తుదముట్టుచుసేయుచున్నాఁడు. కాన మహాత్ములకుఁ గ్రియానిష్పత్తి వారి ప్రభావంబువలననే గలుగును గానవారి కుపకరణములతో నక్కఱలేదు.

* టీక. విజేతవ్యా=జయింపఁదగినది, లంకా=లంకానగరము. నలుగడలజలదుర్గా వృతమైయుండునదిగాన జయింపనసాధ్యమయియుండును.చరణతరణీయః=కాలినడకచే దాఁటవలసియుండునది, జలనిధిః=సముద్రము. కాలినడకచే సముద్రమును దాఁటుట దుస్సాధ్యము. విపక్షః=శత్రువు, పౌలస్త్యః=రావణుఁడు. వీఁడుసురాసురులం గెల్చిన మహావీరుఁడు. పగతుఁడును మహాప్రబలుఁడై యున్నాఁడనుట. రణభువి=యుద్ధభూమి యందు, సహాయాశ్చ=సహాయులన్ననో, కపయః=కోఁతులు. చంచలస్వభావము గలిగి యొకదానితో నొకటి సేరకయుండుకోఁతుల సహాయముగా నుంచుకొని యుద్ధమునకుం గడంగినచో నెట్లు జయము గలుగునో తెలిసికొనవచ్చును. మర్త్యః-మనుష్యుఁడును, పదాతిః=వాహనాదులులేకకాళ్లచేనడుచువాఁడునగు, అసౌ=ఈశ్రీరాముఁడు, సకలం= సమస్తమగు, రాక్షసకులం=రాక్షససమూహమును, అవధీత్=చంపెను. కాన మహాత్ముల కుంగ్రియానిష్పత్తి వారిప్రభావమువలననేగలుగుఁగాన వారికుపకరణములతోనక్కఱ లేదు.

అని వాక్రువ్వగా నాతఁడు నుడివినశ్లోకమునకు నపరిమితామోదంబునం జెలంగుచు రాజు వారు మువ్వురు నుడివినశ్లోకముల కుత్తరోత్తరము రసపుష్టి గలిగియుండుటను శ్లాఘించి కుమారునికిం బదునెనిమిది గజేంద్రములను బహుమతియిచ్చె. అంత నా మువ్వురకడ,

సీ. సౌకుమార్యవిలాససారసర్వస్వ మై మించుఁదీవియఁ బోలు మేనిదాని
శృంగారపూరతరంగమాలికలయి కొమరుమీఱెడువిలాసములదాని
నభినవతారుణ్యవిభవసారం బయి భాసురం బయినరూపంబుదాని
పూర్ణేందుచంద్రికాపూరసంభార మౌలావణ్యమున మించులక్ష్మిదాని
ప్రణయరసపూరకల్లోలభరితలలిత, మధురదరహాససౌభాగ్యమంథరంబు
లగుచు సిగ్గున నసదు జాడ్యంబు వొడమ, క్రాలుఁగ్రేఁగంటిచూపులఁ గాంచుదాని.

గీ. తరుణిఁ గనుఁగొని భోజుండు తనమనమున, నీసరోజాక్షి భారతీనీరజాత
లోచనానవలీలావిలోభనీయ, సౌకుమార్యాకృతి యటంచు సంస్తుతించి.

గీ. దేవి యీసమస్యఁ దెల్పఁజాలుదువె నా, నాసరోజనేత్ర యధరవిద్రు
మంబు వెడలలేనిమధురంపుఁబల్కుల, ననియె మందహాస మందగింప.

ఓదేవా వినుము.

* శ్లో. ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశాం
దృశాం కోణో బాణ స్సుహృ దపి జడాత్మా హిమకరః

---

తా. జయింపవలసిననగర మన్ననో నలుప్రక్కల జల మావరించుటచే దగ్గఱకుం బోఁగూడని లంకాపట్టణము. కాళ్లచే నడిచి నడుమ సముద్రమును దాఁటవలసి యున్నది. ఇది దుర్లంఘ్యము. శత్రు వన్ననో దేవాసురులం జయించిన పౌలస్త్యుఁడు. శత్రువైనను సుసాధ్యుఁడు గాఁడనుట. సహాయసంపత్తి కోఁతులగుటచే నుపయోగపడనిది. రాముఁడు తాను మర్త్యుఁడును పదాతియు నగువాఁడు సమస్తరాక్షసులకులమును సంహరించెను. కాన మహాత్ములకుం గ్రియానిష్పత్తి వారిప్రభావమువలననే గలుగును గాన వారి కుపకరణములతో నక్కఱ లేదు.

* టీక. ధనుః= చాపము, పౌష్పం= పుష్పమునం జేయంబడినది. చాపమునందు దార్ఢ్యము లేకపోయిన బాణములు ప్రయోగించుట సుకరముగాదు. అట్టుండఁ బుష్పమే ధను స్సయ్యె నేని దానింగొని యేమి సేయంజాలును. మౌర్వీ=నారి, మధుకరమయీ= మధుకరములమయము. నారి సరి లేనిచో గుఱితప్పి బాణములు నిరర్థకము లగును. మధుకరము లొకదానితో నొకటి సంబంధింపక చెల్లాచెదరగును. అట్టి,నారి యుండి యేయుపయోగము నుండదు. చంచలదృశాం=చపలములగు కన్నులుగల స్త్రీలయొక్క, దృశాం =

స్వయం చైకో౽నంగ స్సకలభువనం వ్యాకులయతి
క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే.

కన్నులు, కోణః=కొన, బాణః=బాణము. ధనువును గుణము సట్లుండినను బాణమైనను నిభృతముగ నున్నదో యనగా నదియుం లేదనుచున్నది. స్వభావచంచలము లగుకన్నులు గల కలువకంటులకనుగొన లెంత నిభృతమైయుండును? బాణమో యిట్టిది. ఇట్లు సాధన సంపత్తి లేకపోయినను సహాయసంపత్తియయిన నున్నదా యన నదియుం లేదనుచున్నది. సుహృదపి=నెయ్యుండును, జడాత్మా=జడమయుండగు, హిమకరః=చంద్రుడు. దీనికి జడస్వభావము గలవాడనుట ప్రకృతోపయోగియయినయర్థము. జలమయుండనుట విరోధపరిహారార్థము. జడుడు సహాయపడుటవలనం గలుగునుపయోగం బేమియు నుండదు. అట్లయ్యును దానుగాని తనవారుగాని యున్నం గార్యసిద్ధియగును; అదియు లేదనుచున్నది. స్వయంచ=తానును, ఏకః=తనవారెవ్వరును లేనియొంటిరి. మఱియును, అనంగః=అంగము లేనివాడు. తనవా రుండియుం శరీరదార్ఢ్యము గల్గియుం కష్టతరసాధ్యము లయినపనులు సేయుట దుస్సాధ్యమే. అట్లుండఁ దనవారును లేక, శరీరదార్ఢ్యమువరకుంబోనేల? మొదటి శరీరమే లేక యుండువాని కేపని యగు? అట్లుండినను సకలభువనం=సమస్త లోకములను, వ్యాకులయతి=వ్యాకులపఱుచుచున్నాఁడు. మన్మథునికివశంవదుఁడయి వ్యాకులపడనివాఁడు లోకమం దెవ్వఁడు లేక యుండెడిని.

మన్మథుఁడు సకలభువనములను వ్యాకులపఱుచుచున్నాఁ డనుటకు ప్రబోధచంద్రోదయ మనునాటకమునందు సంస్కృతమున కనురూపముగ నారచించినయాంధ్ర పద్యము. మన్మథునివచనము.

చ. సురపతి యాయహల్య యనుశోభనగాత్రికి జారుఁడయ్యె నా
సరసిజగర్భుఁ డాత్మసుత సమ్మతిఁ గూడె నిశాకరుండు దా
గురుసతిఁ బట్టె దుష్పథముఁ గోరి భజింపనివాఁ డెవండు దు
ర్ధరపటుమచ్ఛరావళినితాంతసమాకులమానసంబునన్.

మఱియుం నే నాంధ్రీకరించిన సంకల్పసూర్యోదయ నాటకంబునందు,

చ. తరుణినిఁ బ్రీతి నాద్యుఁడు విధాతయె దాల్చెను నాల్గుమోములన్
వరతను వయ్యె నెప్పటికి వామపుభాగము నాపురారికిన్
పరమ ము నైనతత్వ మది పాల్పడియున్నది గాదె గోపికా
తరుణుల కెవ్వ రీభువిని దర్పకవశ్యులు గానిపూరుషుల్.

తా. లోకమున నలంతిపనులు సేయుటకైన సాధనసంపత్తియుం సహాయసంపత్తి యును మిత్రగణంబులతోడ్పాటును బంధుగులయానుకూల్యంబును తాను దృఢదేహుండై

అని చెప్పిన విని యాతన్వీశిరోమణి నుడివినపద్యభావమునకు సభాసదులు కరము శిరఃకంపనము గావించిరి. భోజుండును బ్రమోదభరితమానసుండై తా ధరించుకొనియుండిన సర్వాభరణంబులను దీసి బహుమతు లొసంగె. లీలావతీదేవియు నాపద్యభావగంభీరతకాత్మ నలరి యాతరుణీశిరోమణిని దనకడకు రప్పించి యాకాంతకుఁ దాఁ దాల్చియుండు భూషణంబుల నన్నింటిని దానికిఁ గైచేసి చందనకుసుమతాంబూలంబుల నొసంగి యాముద్వరకడకంపెను. అంతట నా తరుణి తనవారలకడ నిలువంబడి పలుమఱు విరజాంబుజం గనుంగొనుచుఁ దనమనంబుననుండు కొన్నియర్థంబులు ప్రస్తావించుటకుం గోరిక గలదాని చందంబున నభినయింప నది గనుంగొని రాజు నోపుత్రీ విరజాంబుజా!నీవు విదుషీశిరోమణి నుచితవస్తువుచే సంభావింపుము. ఇమ్ముగుద నీవలన నెద్దియో యపేక్షించుచున్నట్లు దోఁచెడిని. అని నుడివిన విరజాంబుజయుం దనతండ్రివచనంబులు వినయంబునం గైకొని యాతనితో నోతండ్రీ యీభామాతిలకం బపేక్షించువస్తువు నేనొసంగుటకు సిద్ధపడియున్నదానను.ఇచ్చినవస్తువున కేభంగమును గలుగనీక రక్షింపందగుభారము నీది. అందుల కభిమతించితివేని యీఁజాలుదు నన; సభాసదు లది యేమివస్తువో యని యనుకొనుచుండ భోజుండు నోయమ్మ నీవచనంబునకు మరల్పుగలదా? నీయభీష్టంబు నడిపెదను; అని వాక్రుచ్చెను. అంతట విరజాంబుజయుఁ దండ్రిం గాంచి యోయయ్య యీమానవతి నుడివిన పద్యభావంబునకుఁ బారితోషికంబుగ నొసంగందగినవస్తువు లీభూషణాదులుగావు;రాజ్యంబును గాదు; ధనంబును గాదు. మఱి నేను నన్నే యీ కామినీతిలకంబున కొసంగంజను. ఇందుకీ వభిమతింపం జను ననిన భోజుండును గరము సంతసించి యోపుత్రీ యీకాంతామణిని బ్రియసఖినిగా నంగీకరింపు మట్లైన నీమనోరథంబు సిద్ధప్రాయంబ యని పల్కిన సభాసదు లెల్లవారును విదుషీశిరోరత్నం బయినవిరజాంబుజకు నీరసికావతంసం బయినమానినీరత్న మనుంగుంజెలి యగుట దగు నని నుడివిరి. కాళిదాసాదులును కరము సంతసించిరి. విరజాంబుజ యంతటఁ దానుండెడుస్థలము నుండి కదలి యాకాంతకడకుం బోయి యానాతికేలుదమ్మిఁ దనకేలం గీలించి ప్రియసఖి!యిదిసుత నీవు నాకుం బ్రాణతుల్యురాలవు. నీవైదుష్యం బనికరదుర్లభంబు; ఇఁక నాకడన యుండి కావ్యామృతరసా

---

యుండుట యిట్టివి కావలసియుండ గొప్పకార్యముల కివి గావలయు ననుట యనాదరణీయము గాదు. ఈమన్మథుఁడు తాఁజేయుకార్యము సమస్తలోకములను వ్యాకుల పెట్టుట; గాని సాధారణముగాదు. ఇట్టి మహాకార్యముసేయ సాధనసంపత్త్యాదులు లేవు. అట్లుండిన నప్రతిహతముగ నన్ని లోకములను వ్యాకులపెట్టుచున్నాఁడు. కాన మహాత్ములకుం గ్రియానిష్పత్తి వారిప్రభావమువలననే యగుంగాని యుపకరణములతో నావశ్యకత లేదు.

స్వాదనంబునను సంగీతవిద్యావినోదనంబునను భరతాగమపారీణతాప్రదర్శనంబునను నా కనుకూలవై ప్రవర్తింపు మనిన నాదేవియుం విరజాంబుజను గరము గారవించి యోరాజపుత్రీ నీసర్వవిద్యాచతురత్వం బఖిలదిశల నందఱు సంస్తుతింప విని నీతోఁ జెలిమిఁ గోరి వచ్చితిని. నాభాగ్యవశంబున నది యిప్పుడు నాకు సమకూరె. కృతార్థ నైతి నని నుడివెను. అంత రాజును మహాకవుల వీడ్కొని విరజాంబుజతో లీలావతి వెనువెంట చేతేర నారాణిసౌధంబునకుం జని యథోచితాభ్యవహారాదికృత్యంబులను దీర్చుకొని లీలావతి వినుచుండ విరజాంబుజతోఁ దల్లీ నీ వింకం బూర్వపుఁ దెఱంగున నఖిలమనుజ నయనగోచరత్వంబు నందక రాజకన్యోచితం బగుకన్యాంతఃపురంబున నుండం జనును. జననీజనకుల మమ్ముం జూడఁగోరితివేని నీదాసీజనులచేఁ దొలుత మాకు వృత్తాంతంబుఁ బుత్తెంచి మామొదలఁగొని రాఁ జనును. జగన్మాత యగుభువనేశ్వరి పాదారవిందార్చనంబు నకు నేఁగవలసినప్పుడు నాదేవీమందిరంబున దాసీజనంబుంగొని లాఁతివారలు లేకుండం జేసి యాజగన్మాతను దర్శింపం బోవుచుండునది. నీయాదేశంబునం బ్రవర్తించుచుండు చెలులు నూర్వురు కన్యకల నేర్పఱిచి యున్నాఁడను. సహస్రసంఖ్యంబులు దాసదాసీ గణంబులు నిన్నుం గొలుచుచుండును. రాజకన్యకలు రూపలావణ్యాదిగుణసంపన్నలగు వారు యౌవనావిర్భావంబు గలిగినదాదిగఁ బరపురుషుల కక్షిగోచరత్వం బందుట మంచిది గాదని క్షత్రకులవృద్ధు లీకట్టడ సేసియున్నవారు. పూర్వపరికల్పితమర్యాదాపాలనంబును గావించుట యుత్తమలకుఁ జిత్తవిరోధంబు గాదు. నీవును వయోరూపలావణ్యవిద్యా వైభవంబులఁ దుల్యలగు నీనూర్వురుసఖులతో ననుదినమును గావ్యగీతకళావినోదంబులం బ్రొద్దుపుచ్చుచుండవలయును. అనిచెప్పి యందుకుసమ్మతించినవిరజాంబుజను నూతనముగ నిర్మితంబైయుండుకన్యాంతఃపురమునం బ్రవేశపెట్టి యప్పుడప్పుడు వైపరామరికతో నుండనగునని లీలావతి కాజ్ఞచేసి తాను తనగృహంబునందు సుఖంబున నుండెను. ఇట్లు కొన్నిదినంబులు గడచె.

## శుకశారికలు దెల్పిన విరజాంబుజవృత్తాంతము

ఒక్కనాఁడు భోజభూపతి లీలావతీసౌధంబునందు భోజనాదికృత్యంబులు దీర్చుకొని వెన్నెలబయట నమర్చియుండుదంతపుఁగోళ్లమంచంబుపయిం బరుండి లీలావతి యందిచ్చునాకుమడుపు లందుకొని విడెము సేయుచు నాదేవిముఖంబున నించుక చింతాకులత్వంబుం గనిపెట్టి యోదేవీ పూర్ణసుధాకరబింబంబును సయిత మధఃకరించునట్టి నీమోమున నీదినం బొకించుక విన్నఁబాటు చూపట్టుచుండుటకుం గత మేమి? పరిజను లెవ్వారేని నీయాజ్ఞాతిక్రమణంబు సేయరుగదా? అని యడిగిన నాదేవియు నిట్లనియె. ఓప్రాణనాథా నీవు నన్నుఁ బ్రాణాధికఁగాఁ దలంచియుండఁ బరిజనులం దెవ్వారేని మదాజ్ఞావిలంఘన మను

మాటయైన రానిత్తురా? మదీయచింతాజ్వరంబునకుం గారణం బొకటి గలదు. అది యెది యని యంటిరేని విన్నవించెదను. మనకూంతురు విరజాంబుజ బాల్యం బతిక్రమించియౌవ నంబున నున్నది. కన్యక కష్టాదశవర్షంబుల ప్రాయమప్పుడు సంపూర్ణమగు నవయవసౌష్ట వంబు గల్గి నాయకోపభోగ్యదశం గాంచును. అట్టిసమయంబున నతివకు మనోహర సమాగమంబు లేనిచోం దదీయతారుణ్యంబు సఫలంబు గాదు. ఇందు మీకేంజెప్పంగల దాననే? మనము సర్వవిధకామంబులననుభవించుచు యౌవనప్రాదుర్భావబంధుర యయిన తనూజాత నూరక యింట నుంచుకొను టన్యాయ్యముకాదే! యని యనిశ మేను జింతిం చెదను; ఇది యిప్పుడు మీతో విన్నవించితిని. ఇం దాలస్యంబు సేయక యనురూపవర సంపాదనమున దానినుగుణగణంబు సార్థకంబు సేయం జనును. అని చెప్పంగా విని భోజ భూపతియుం నిట్టూరుపు విడిచి యోదేవి యేను నీయర్థంబున ననుదినము చింతించుచుం గ ర్తవ్యతానిశ్చయంబుం గానక యున్నవాండను. మనవిరజాంబుజ యన్నను సర్వవిద్యల యందును సాటిలేక యున్నది. ఇట్టియీకన్యక కనురూపవిద్యావయోరూపప్రాగల్భ్యాభి దుల నొప్పురాజకుమారుం డెవ్వండును గనంబడండు. విద్యావిహీనునికొండె నల్పవిద్యుని కొండె నొసంగెదమేని యిది వానితోననురక్తయైసుఖంబు నొందుచు సంసారంబు సేయ దనుట నిశ్చయము. ఇందు కొకకథ గలదు. అదియనతిచిరకాలంబునన జరిగినది. అది నీకు వినిపించెదను; వినుము. దక్షిణాపథంబున భద్రగిరి యనునొక పురంబుగలదుగదా! దానిని పరాక్రమభద్రుం డనునరపతి యేలుచుండు. అతనికిం గాంతచందనుం డనుకుమారుం డుద యించె. వాని కానామంబు తదీయాకారంబుం గాంచి తల్లిదండ్రులు పెట్టినది. అతండు శైశవంబునం దనయీండుబాలురతో నాడుకొనుచు నాటలయంద మరగి యథాకాలం బునం దనజనకుండు విద్యకఅపుట కని నిర్ణయించియుంచినగురుజనమును వంచించి కన్ను లకుం గానంబడక; విద్యయం దభిరుచి యించుకేనియు లేకుండుటకు వగచి యాచా ర్యులు పలుమఱు సెప్పిదను వినక; వారలనిరాకరించి యసద్బాలకులతో సహసంచారంబు సేయుచుండెను. భద్రగిరియుం గురువులవలనం దనకుమారునిమూఢత్వంబు విని కర మను తపించి చేయునదిలేక యూరకుండినం గాంతచందనుండును దుర్జనసహవాసంబున నగర జనంబులకు బాధలు గల్పింప నుపక్రమించినం గాంచి రాజు వానిం బిలిపించి యోరీ నీ వంటి విద్యావిహీనుండగు కుమారుండు బ్రతికియుండం గన్నులం గాంచుచుండునంతటి కష్టంబు నాకు వేఱొండేమియుం లేదు అని వినికొనిన నాకాంతచందనుండు విని తన తండ్రి తనపయి నేవగించుకొనుటకు వగచి యింక జనకుని మోముంజూడంగూడదనియెంచి యాపురంబు వెడలి దేశాంతరగతుండై యాయాదేశంబులం గలవిశేషంబుల నారయుచు

చుం గొన్నిదినంబు లందుండెను. తత్పురపాలకుండగు నలకానాథుం డను ఱేనికూఁతురు యౌవనము వచ్చుపరువంబును సమస్తవిద్యావైశారద్యంబును గలిగి కళావతి యను పేరఁ బరఁగునది యొకనాఁడు సాయంసమయంబునఁ దనయుండుసౌధోపరిదేశంబునందు సవయస్యలతోఁ గందుకక్రీడావినోదంబు సలుపుచుండ నాసౌధంబుక్రింది కీరాజసుతుండు సని యారాజసుతంగాంచుచు నిలువంబడియుండిన నాకళావతియుఁ గాంతచందనుని గనుంగొని తదీయరూపంబున కచ్చెరువంది యీ యాకారంబునకుం దగిన ప్రజ్ఞ యితని కుండకపోదు; ఈతని నేను వివాహంబుచేసికొనవలయును అని యెంచి తాను సర్వవిద్యాచతుర యగుటంజేసి యతనికిఁ దనయభిప్రాయంబు నెఱింగింపఁ గోరి తనకర్ణంబున నుండుసువర్ణమయంబగు చెవ్వాకుదీసి దానియందలక్తకరసంబున నిట్లు వ్రాసెను.

క. ఓనవమన్మథ పాంథుఁడ, యీనది దాఁటుటకు నీకు నీరేయి దగున్
సూనశరసేవకుం జను, మానితవేతసనికుంజమండపముకడన్.

అని వ్రాసి యదియు విసరి వేసెను. ఇంతలోఁ బెఱకాంత లయ్యెడకుం జనుదెంచిన నవ్వారలం గనుంగొని రాజపుత్రియు గృహాంతరంబునకుం బోయెను. ఆకర్ణపత్రంబును గైకొని రాజకుమారుండు విచ్చిచూచి తన కక్షరములు తెలియవు గాన దీసికొని చని యా యూరం బడి పెట్టుకొనియుండు నొకకుష్ఠరోగికిం గాన్పించి వృత్తాంతముఁ జెప్పెను. వాఁ డది సదివిచూచుకొని రాజపుత్రీసమాగమంబునకుఁ దా నాసచేసి కపటంబుగ నా చందనకాంతుని కిట్లనియె. ఓరీ రాజకుమార్తె నీ కీకమ్మయందు వ్రాసియుండువృత్తాంతము వినుము. నీవు రాజస్త్రీ యైనతన్నుం జూచినందుల కది నీయందు దయగల్గి నీ కొకహితంబు దెల్పుచున్నయది. ,అది యేమంటివేని? నీవు తన్నుఁ జూచిన యర్థంబు దానిచెలులు తెలిసికొనిరఁట. వారు రాజున కీవృత్తాంతంబుఁ దెల్పెదరు. రాజు కోపగించి నిన్ను శిరఃఖండనంబు సేయును. కాన నీ విప్పుడ మఱియొండు నగరమునకుం జనునది. నాయం దాశపడి నాకై శిరశ్ఛేదంబుఁ గాంచఁబోయెదవే! యనుపాపచింతచే నీగతి నీ కెఱింగించితిని. అని యీ కమ్మయందు వ్రాసియున్నది యని కుష్ఠరోగి సెప్పఁగా విని రాజకుమారుం డూరువిడిచి పాఱిపోయెను. అంతఁ గుష్ఠరోగియు రాజకన్యకాభోగంబున కువ్విళులూరుచు రాజసుత తనపద్యమున నీనిశీథసమయమునం దీపురముపగ్గఱం బాఱు నదీతీరమునం బ్రబ్బలితీగెల నడుమనుండుమండపమునకుఁ దా వచ్చెదనని సందేశ మిచ్చినది గాన నే నయ్యెడకుం బోయి యుండం జనునని యెంచి సుగంధంబుగల నలుఁగుపిండి పూసికొని స్నానమాచరించి మేలైనవస్త్రంబులు ధరించి చీకటి పడఁగానే బయలుదేరి యామండపముకడకుం జని యం దొకమూల నొదుగుకొని యుండెను. కళావతియుఁ దనచెలుల వైళమయింటి కంపి స్నానంబుచేసి సర్వాభరణభూషితయై రస

పదన్నంబు భుజించి తనకాంతునికన్నం బెత్తించుకొని వేషాంతరంబుఁ దాల్చి నిశీథ సమయంబున దాసీద్వితీయయై వెడలి యూరికి వెలుపల నదీసమీపముననుండు వేతసీ కుంజమండపమునకుం బోయి మోహావేశంబు తలకెక్కియున్నదిగానఁ దనప్రాణనాయ కుం డెయ్యెడ నున్నాఁడో యనివెదకి యామండపంబున నొకచో నుండుకుష్ఠరోగిం జీకటియగుటం జేసి తెలియక రాజపుత్త్రుండని గాఢాలింగనంబుఁ జేసికొన నా కుష్ఠరోగి యొడల నుండుకురుపులు పగిలి చీమును నెత్తురును గారి యవి యత్తిపాలపలెఁ దన శరీరమున కంటుకొనుటయుఁ బనసశలాటుకంటకములవంటి వానియొడలిపక్కులు గ్రుచ్చుకొనఁగా నా సుందరి యేవగించుకొని తేరిచూచి యిది యేదో మోసమని యెంచి వాని యసహ్యమగు దుర్గంధముచేతను బూర్వము సెప్పినగుణంబులచేతను దావలసిన రాజపుత్త్రుండు గాఁడని నిశ్చయించి యసహ్యమగుచింతాభరంబున నొచ్చి యచ్చిఋత ప్రాయంపుఁగన్నియ తన్నజన్మమును రోసి తత్క్షణమ ప్రాణంబులు వదలెను. వెంట వచ్చిన దాది భయార్దితయై తాఁగొనివచ్చిన పెట్టెలోనియన్నము మొదలగువాని నా కుష్ఠరోగి యెదుటఁ బారవేసి కుమారికాశవంబు నా పెట్టియ నిడుకొనిచని కన్యాంతఃపురంబున మంచముపయిం బరుండఁబెట్టి ఆకస్మికముగ రాజకూఁతురు మరణంబునొందె నని యెఱింగించిన రాజును తత్పత్నులును దుఃఖించి దానికిఁ బరలోకక్రియలు నిర్వర్తించిరి. చందనకాంతుండును రాజపుత్త్రికాహృతమానసుం డగుటం జేసి దానిం గాంచ నగు నన్నతలంపుతోఁ గొన్నిదినంబులు గడచినయనంతరము మరల నాయూరికి వచ్చి క్రమక్రమముగ బయల్పడియున్న రాజకన్యకావృత్తాంతంబు విని తనకై యాయింతి ప్రాణత్యాగంబుఁ జేసినచోటికిఁ జని తానును ప్రాణంబులు వాసెను. వింటివా యోదేవీ విద్య యెఱుంగనివానికిని విద్యావతికిని సమాగమం బివ్విధి ననర్థకరం బగును. మనవిరజాంబుజ కనురూపుండగు విద్వద్రాజకుమారుని నారయుచుఁ గాలంబుఁ గడపెదను. అని యిట్లు భోజభూపతియు నతనిదేవియుం సంభాషణంబులు సల్పుచుండఁగా నొకశారిక యతి త్వరితగతిం జనుదెంచి లీలావతిహస్తంబుపయి వ్రాలఁగా నాయమ దానిని దువ్వుచుఁ జక్కెరలుపెట్టి ముంజేతి కెక్కించుకొని యుపలాలన మొనరించుచుండ నాశారికను వెంబడించుకొని యొకశుకంబు సనుదెంచి ఆనిముంజేతిపయిం గూరుచుండ నందు కలరి రాజును దానికి బింబఫలంబు లొసఁగె తిత్తు తనకరశాఖలం దువ్వుచుండెను. అప్పుడు లీలాదేవి తాను తనకూఁతు కనురూపగుణవిభవంబులుగలమగం డెప్పుఁ డెక్కడ నుండు నని చింతించుచుండునది గాన నుబుసుపోకకు నాశారికం గాంచి యొకపద్యంబు సెప్పుమని యనునయించె నది యిట్లనియె.

1 శ్లో. వాస స్తదేవ వపుషో వలయం తదేవ హ స్తస్య సైవ జఘనస్యచ రత్నకాంచీ,
వాచాలభృంగసుభగే సురభౌ సమ స్త మ ద్యాధికం భవతి మే సఖి కిం నిధానమ్.

అని చెప్పిన విని భోజభూపతి లీలావతిం గాంచి యోదేవీ యీపద్య మొక నాయిక పురుషానురాగము వొడమి తత్సమాగమముఁ గాంచక సిగ్గున దనమనోరథంబు ప్రియసఖులకు నయితము పట్టి యివ్వక తనప్రాణతుల్య యగుసఖితోఁ దనవిరహవేదనం దెల్పుటకుం జెప్పినయదిగాఁ దోఁచుచున్నది. కార్శ్యమనుమదనావస్థ యీనాయిక తా ననుభవించుచుండునట్లు సెప్పిన యీ పద్యమునకు గలభావము సహృదయహృదయంగ మంబై యున్నది. ఈ నాయికయుం సకలకావ్యవిచక్షణయై యుండనోపు. సర్వనాటకా లంకారములు గామశాస్త్రంబు నీ కుమారికకు హృదయగతంబులై యుండకపోవు. చక్షుః ప్రీతిమనస్సంగాదులఁ దెల్పుపద్యము లింతకంటె రసవంతంబులై యుండు. అది య ట్లుండనిమ్ము. ఈ శుకం బేదేని నుడువం గలదా! పరీక్షింతము. అని చెప్పి తన చేలిపయి వ్రాలియుండుశుకమును టెక్కలుదువ్వి ముద్దిడుకొని నీవు నొకపద్యంబు నుడువుమా! యనిన నా శుకం బి ట్లనియె.

2శ్లో. జగతి జయిన స్తే తే భావా నవేందుకళాదయః
ప్రకృతిమధురా స్సంత్యే వాన్యే మనో మదయంతి యే

---

1 దీనికి సరియయిన తెలుఁగుపద్యము.

ఉ. చీరయు మున్ను గట్టినద చేతుల నొప్పెడుకంకణంబులున్
దీరగురత్నకాంచి యువతీమణి తొల్తట నున్నదేకదా
భూరిమదాళిఝంకరణపూర్ణవసంతమహోత్సవంబులన్
వేఱుగఁ దోఁచె నిన్నియును వింతలు! కారణ మేమి దెల్పవే.

టీక. నాయిక తనప్రియసఖితోఁ జెప్పుకొనుచున్నది. సఖి=చెలియా, వపుషః = మేనికి, వాసః=వలువ, తదేవ = ముందుధరించుకొనియుండునదియే. హస్తస్య = చేతికి, వలయం = కంకణము, తదేవ = అదియె. జఘనస్య = కటితటమునకు, రత్నకాంచీ = రతనంపుమొలనూలును, సైవ = అదియే. వాచాలభృంగసుభగే = రొదలుసలుపుచున్న తుమ్మెదలచేత నతిమనోజ్ఞమైయొప్పు, సురభౌ = వసంతఋతువున, అద్య = ఇప్పుడు, సమస్తం = ముందుచెప్పిన వస్త్రకంకణకాంచికలును తక్కుంగలవియును, మే=నాకు, అధికం భవతి=అధికమగుచున్నవి. వదులగుచున్నదనిభావము. దేహమునకు వస్త్ర మధిక మగు చున్నది; చేతులకుఁ గంకణములు వదులగుచున్నవి. మొలకుఁ గాంచియు వదులగు చున్నది; యని యర్థము.

2 టీక. జగతి = ప్రపంచమునందు, తే తే=అవియా, నవేందుకళాదయః=అభినవ చంద్రకళాప్రముఖంబులగు, భావాః=వస్తువులు, జయినః=మన్మథునికి సహాయము లగుచు

మమతు యదియం యాతా, లోకే విలోచనచంద్రికా
నయనవిషయం జన్మ న్యస్మిన్ సఏవ మహోత్సవః.

అని యాశుకము పల్కిన విని భోజుండు లీలావతితో నోదేవీ ఈ శుకంబు నుడివినపద్యంబు వింటివే! ఒక శృంగారి యగుపురుషుండు తనకుం దగిన నాయికారత్నంబు నొక్కదానిం దొలుతం గాంచినవిశేషముఁ దననర్మసఖునితోఁ జెప్పుకొనుచున్నాఁడు. ఇతండు రసికాగ్రగణ్యుండై యుండువాఁడు. లోకమున విరహిజనులను లోఁబఱుచుకొనునట్టి నవేందుకళాప్రముఖంబు లయినమనోహరవస్తువులును, ఔత్సుక్యంబుఁ గలిగించునట్టి తక్కినవియు నుండినను అవి తన కింపుఁ బుట్టింపఁ జాలవు. ప్రకృతపుఁగన్నియ గన్నులకు వెన్నెలవలె నింపు జనింపఁ జేసినయది. దానిం గాంచుటయె యీ లోకంబున మహోత్సవము. అని నుడువుచున్నాఁడు. నాయికానాయకులకుం జక్షుఃప్రీతియు మనస్సంగంబును గలిగినయర్థం బిది. ఈశారిక వచియించుపద్యంబు సెప్పిననాయికయు, ఈ శుకము వర్ణించుపద్యము సెప్పిననాయకుండు నన్యోన్యప్రణయరసపాశబద్ధాశయులై యుండురేని రసికజనశ్లాఘాపాత్రతం బడయుందురు. ఓదేవీ నాతలంచిన యీ యర్థంబు యథార్థం బగునేని యీ రసికశిఖామణులకుం జరిగిన యనంతరవృత్తాంతంబు కరము రసావహంబై యుండకపోదు. ఇట్టి మహోదారులచరిత్రంబుకంటె శ్రోత్రపేయం బేమున్నది? మనకు నిది యత్యుత్సాహజనకంబ యనిన లీలావతీదేవియు నవ్వుచు శారికం గాంచి యోతమాలికా యీ శుకమువచించిన పద్యంబుకంటెఁ గడు రసవంతంబైన

---

విరహిజనులను లోఁబఱుచుకొనుచుండునవి; ప్రకృతిమధురాః = స్వాభావికముగ మనోహరములగునవియును, అన్యే = నా మనంబుననుండు ప్రియతమకంటె నితరములును, యే మనోమదయంతి = మానసంబునం దౌత్సుక్యముఁ బుట్టించునవి, సంత్యేవ = ఉండనేయున్నవి. దానినిఁ జూడనివారికి మనంబున నౌత్సుక్యముఁ గలిగించునవి యంతియకాని దానింగాంచినవారి కివియౌత్సుక్యోత్పాదకములు గానేరవు. మమతు = నాకన్ననో, ఇయంవిలోచనచంద్రికా = ఈ కన్నులపండువు, నయనవిషయం = కన్నులకు గోచరత్వంబును, యాతేతియత్ సఏవ = చెందెననుటయే, అస్మిన్ జన్మని = ఈ జన్మమునందు, మహోత్సవః = గొప్పయుత్సవము.

స్వభావమధురంబు లగుటం జేసి మనంబు హరించుచు మన్మథునికి సహాయములై విరహిజనులను లోఁబఱుచుకొనునట్టివి యగునభినవచంద్రకళాప్రముఖంబు లయినవస్తువులును మనస్సున నుత్సుకత్వము పుట్టించునట్టియభీష్టనాయికేతరవస్తువులును బెక్కులున్నవి. అవి యెల్లను నా మనస్సున కింపుఁ బుట్టింపలేవు. మఱి కన్నులపండువు వైనయీకన్నె నాకుం గనంబడుటయే నాకీజన్మమునందు మహోత్సవంబు. అని తాత్పర్యము.

పద్యం బొక్కటి నుడివి వెండియుం శ్రవణంబులకు సంతసంబు గల్పింపుమని ప్రేరేపించిన నాశారిక యిట్లనియె.

* శ్లో. పరిమృదితమృణాళీమ్లాన మంగం, ప్రవృత్తిః
కథ మపి పరివారప్రార్థనాభిః క్రియాసు
కలయతిచ హిమాంశో ర్నిష్కళంకస్య లక్ష్మీ
మభినవకరిదంతచ్ఛేదకాంతః కపోలః.

అని చెప్పిన విని భోజభూపతి కరంబు కావ్యామృతరసాస్వాదనంబునం దనకు సాటిలేనివాఁడగుటంజేసి మెచ్చుకొనుచు లీలావతింగాంచి యోప్రాణనాయికా వింటివా యాశారిక నుడివినపద్యంబు! విరహిణి యగుతరుణీమణి తన కనురూపరూపగుణవిభవైశ్వర్యంబులు గలనాయకునియం దనురాగంబుం గాంచి కార్యంబు నరలియు నసుమదనావస్థలం జెంది యుండువిధంబును దానిచెలికత్తె లొండొరులతో నాడుకొను నర్థంబు దీని యందు విస్పష్టం బయ్యెడిని. శరీరము కర మవమర్దిత మగుతామరతూఁడువలె వాడియున్నది. పరిజనము ప్రార్థించినం గానియెట్టకేలకు స్నానాదివ్యాపారంబులం బ్రవృత్తినొందదు. విరహాపాండురం బగుటంజేసి దానికపోలము లభినవపాటితకరిదంతకాంతిపాటచ్చరంబులై (చేతంబట్టుకొని తటుక్కునవిఱిచిన యేనుఁగుకొమ్ముఖండంబులవ్వ డుప్పతిల్లువన్నెలవంటివన్నెలుగలవి) కళంకరహితంబులగు చంద్రబింబంబులకాంతి గలవియై యున్నవి యనునాయికామణి విరహావస్థావర్ణనంబు కరము హృదయంగమంబై యున్నయది. మహాభాగ్యంబునం జన్మంబుఁ గాంచిన యొకకుమారునియందు నీకాంతామణికి విరహవేదనావికారంబు బహుదినములనుండి వృద్ధిఁ గాంచుచువచ్చెడువిధంబు శరీరగ్లాని, యరతి, పాండుత మొదలగుగుణంబులు ప్రకటింపఁ జేసెడిని. దీనింగోరిన నాయకుని

* టీక. అంగం=శరీరము, పరిమృదితమృణాళీమ్లానం=అవమర్దితమయిన తామరతూఁడువలె గ్లానిం జెందినయది. క్రియాసు=స్నానపానాదిక్రియలయందు, ప్రవృత్తిః=చొరవ, పరివారప్రార్థనాభిః=పరిజనులు చాటువచనములు సెప్పుచుఁ బాదములపయింబడి ప్రార్థించుటచే, కథమపి = ఎట్టకేలకుఁ గలుగుచున్నదిగాని స్వరసముగఁగలుగుటలేదు. ఇట్టిగుణము లితరకారణములచే నుండవచ్చునని యనుకొనఁగూడదు. ఏలయన? అభినవకరిదంతచ్ఛేదకాంతః = సద్యఃకాలమునవిఱిచినయేనుఁగుదంతపుఖండములవలెనొప్పుకాంతి గల, కపోలః=గండము, నిష్కళంకస్య= కళంకరహితుఁడయిన, హిమాంశోః = చంద్రుని యొక్క, లక్ష్మీం=కాంతిని. కలయతిచ=చెందియున్నది. పాండిమమునయితేము కారణాంతరంబుచేత సంభవించునదైనను నిష్కళంకేందుబింబసాదృశ్యము విరహిణీముఖబింబంబునకే యుండుననిభావము.

గుణంబులును విన్న సత్యామోదము జనించు. అని శుకంబుం గాంచి యోనాసావిజితకింశుకమా శుకమా యీశారిక వచించినపద్యంబుకంటెఁ గడురసోదారంబగు పద్యంబు నుడువు మనిన నంతట శుకం బిట్లనియె.

*శ్లో. ధత్తే చక్షు ర్ముకుళిని రణత్కోకిలే బాలచూతే
మార్గే గాత్రం క్షిపతి వకుళామోదగర్భస్య వాయోః
దావప్రేమ్ణా సరసబిసినీపత్రమాత్రోత్తరీయ
స్తామ్యన్మూర్తి శ్శ్రయతి బహుశో మృత్యవే చంద్రపాదాన్.

అని చెప్పిన విని భోజభూపతి యాపద్యమునర్థగౌరవంబునకుం గరము శ్లాఘించుచు లీలావతిం గాంచి యోసరసవతీవతంసమా వింటివే యీశుకంబు వచించినశ్లోకము. రసికవశ్యం డగునాయకుండు తన కభిమతనాయికాప్రాప్తి సంభవింప దనునైరాశ్యముచే మరణంబనుమన్మథావస్థకుం బూర్వభావిసంజ్వరోన్మాదంబులును మూర్ఛనంబు ననుభవించి ప్రియతమాసంగంబు లేక జీవించుట యశక్యం బని భయంపడుచుం బ్రాణపరిత్యాగంబు సేయుటకుం దెంపుఁగొని తదనుగుణప్రవర్తనంబు సలుపుచుండ నతనివిరహావస్థం గనుంగొని వానిప్రియవయస్యు లొండొరులతో నాడుకొనునర్థం బీపద్యమువలన నవగత మగుచున్నది. కోవెలలు గూయుచుండు లేమామిడిపయిం గన్నుల నిల్పుచున్నాఁ డనుటచేత ముండ్లచెట్టుపైన సన్ననివస్త్రంబు వేసిన నది చిక్కఁగిపోకపోదు; అట్టె ముండ్లవంటిమొగ్గలు గలయెలమావిపైనం బ్రసరింపంచేసినఁ దనకన్నులును జెన్నుదొలంగి పోవుఁగాఁత యని యావిరహి చిన్నియెలమావిపయిం దనకన్నులం నిల్పుచున్నాఁడని తోఁచుచున్నది. మఱియు నాతఁడు పగడపువ్వులవాసనలు గలవాయువువచ్చెడిమార్గమునం దనయొడలు బడవైచుచున్నాఁ డనుటచేత సమరసమయంబునం బయింబయింబడుక్రూరనారాచములకు శరీరం బప్పగించుచున్నట్లు సేయుచున్నాఁడని భావ మగుచున్నది. సరసములగు బిసినీపత్రములుమాత్ర ముత్తరీయముగ ధరించి తామ్యన్మూర్తియై యీతాప మీశిశిరోపచారంబున శాంతంబు గాదని యెంచి విరహిజనులకు దావానలజ్వాలలై యొసఁగుచంద్ర

---

*టీక. ముకుళిని-అరవిరిమొగ్గలుగలిగి, రణత్కోకిలే=కొలకొలగూయుకోవెలలు గల, బాలచూతే=లేమావియందు, చక్షుః=నేత్రమును. ధత్తే=నిల్పుచున్నాఁడు. వకుళామోదగర్భస్య = పగడపూలవాసనలుగర్భమునంగల, వాయోః = మారుతముయొక్క, మార్గే=త్రోవయందు, గాత్రం=శరీరమును, క్షిపతి = పడవేయుచున్నాఁడు. సరసబిసినీపత్రమాత్రోత్తరీయః=ఆర్ద్రము లయినతామరాకులుమాత్ర ముత్తరీయముగఁదాల్చినవాఁడై, తామ్యన్మూర్తిః=గ్లానిం జెందెడుశరీరముతో, మృత్యవే=మృత్యువుకొఱకు, బహుశః = పలుమాఱు, చంద్రపాదాన్=చంద్రకిరణములను, శ్రయతి=సేవించుచున్నాఁడు.

కిరణంబులం గాంచి సంతసించి యగ్నిజ్వాలలను బ్రేమంబునం దక్షిణము మృత్యుప్రాప్తికై వాని నాశ్రయించుచున్నాఁడు అని చెప్పంబడుటచే నీవిరహి ప్రియతమావిరహంబున కోర్వలేక యెంతదుష్కరము లగుపనులును జేయుచున్నాఁడని యీయతిగభీరార్థము స్ఫురించుచున్నది. ఈవిరహి యనుభవించుచుండునవస్థావిశేషంబు వీని ప్రియతమయునను భవించుచుండినఁ గదా కరము రసోత్తరంబై యుండును. ఇట్టి యతిసుకుమారం బగుకుమారుని యందు భావంబు నిల్పినకుమారికయు నింతకంటెఁ గడుదుస్సహం బగుదశయం దుండక పోదు. అది యెట్లెట్లుంగంజను ననుకొనుచుండఁగా నాశుకశారిక లుక్తిప్రత్యుక్తిధోరణిం దగిలి యొకటివెంబడి మఱియొకటి యిట్లు సెప్పందొడఁగె. అందుఁ దొలుత శారిక యిట్లనియె.

* శ్లో. నికామం క్షామాంగీ సరసకదళీగర్భసుభగా
కళాశేషామూర్తి శ్శశిన ఇవ నేత్రోత్సవకరీ
అవస్థామాపన్నా మదనదహనోద్దాహవిధురా
మియం నః కల్యాణీ రమయతి మనః కంపయతి చ.

అని చెప్పఁగా భూపతియును విని తనయూహ కనురూపముగ వచియించిన యాశారికను కర మనుమోదించి దేవిం గాంచి యోవిదుషీరత్నమా కర మభినందనీయ మగునీ పద్యభావంబును మానసంబునకుం దెచ్చుకొంటివే? ఇందుంగల యతిసుకుమారార్థంబు సరసజనులహృదయంబు నుక్కొత్తుగ హరించును' వినుము. ఈవిరహిణి కరము క్షామం బయినయంగముతో సరసమగుకదళీగర్భమువలె సుభగ యగుచు మార్దవ సౌకుమార్య పాండుత్వాదులు దోఁపఁ గృష్ణచతుర్దశినాఁటి కళామాత్రశేషాకార యగుచంద్రకళ వలె నయనానందంబు గల్పించుచున్నది. ఈకల్యాణావయవలక్షణోపేతయగు కన్యకాతిలకము మన్మథదహనంబున విహ్వల యగుచుండునవస్థం గాంచిన మనంబున కాహ్లాదంబు గల్పించుచున్నది; గాని కంపింపం జేసెడిని అని యిది విరహిణిం గనుంగొనినతదీయ లగుసఖియ లాడుకొనువచనము. ఈకామినీరత్న మనుపమరూపలావణ్యసౌకుమార్యా

---

* టీక. నికామం=మిగుల, క్షామాంగీ = చిక్కియుండుశరీరముగలదియై, సరసకదళీగర్భసుభగా = సరసమగుకదళీగర్భమువలెసుభగయగుచు, శశినః = చంద్రునియొక్క, కళాశేషా = కళామాత్రావశిష్టయగు, మూర్తిరివ = ఆకృతివలె, నేత్రోత్సవకరీ=నయనానందంబుఁగల్పించుచు; మదనదహనోద్దాహవిధురాం = మన్మథాగ్నివలనంగలిగినమహాదాహంబుచేవిహ్వలంబగు, అవస్థాం = దశను, ఆపన్నా = చెందియుండు, ఇయం కల్యాణీ = ఈమంగళలక్షణోపేత, నః=మనలను, రమయతి=ఆహ్లాదపఱుచుచున్నది. మనః=మానసమును, కంపయతిచ = కంపింపం జేయుచునున్నది.

దులు గలిగినది తనకభిమతుఁడగు నాయకునియందు బుద్ధి యుంచి తదలాభంబుచే శరీరము చిక్కి లావణ్యావశిష్టయై యుండుటచేఁ గలామాత్రావశిష్టయగు చంద్రకళవలె నయనానందంబు గల్పించుచున్నది; ఇట్టి రూపౌదార్యగుణంబులు గలిగినయీకాంతకుం గల శుభలక్షణము లుత్తమపురుషానురాగంబుం గాంచినకారణంబున సార్థకము లగుటం జేసి యిది మదనదవదహనంబున వేఁగి విహ్వల యగుటంబట్టి నాయకసమాగమంబున కనుకూల యగు ననియెంచి యాహ్లాదంబుం జెందుచు నతిసుకుమార యగుటవలన దుస్సహవిరహవ్యథాదూయమానయై యేదేని యనిష్టంబుం బ్రాపించునోకో యని చెలికత్తెలు కంపంబు నొందెదరు. తనతోడనుండుచెలికత్తెలకే యిట్లు మనోహారిణియై యుండు నీ యండజయాన తన్నుం గనుంగొనినకుమారునిమానసంబు నేవిధంబుగఁ గరఁగించి యుండునోకో! ఇట్టికాంతాతిలకంబుం గనుంగొని యవిదితవిషయాంతరంబుగ నాకుమారుండు నిరంతరతదీయచింతాసంతానదంతురితస్వాంతుండై యుండకపోవునే! యని యనుచుండ శుకం బిట్లనియె.

* శ్లో. లీనేవ ప్రతిబింబితేవ లిఖితే వోత్కీర్ణరూపేవచ
ప్రత్యుప్తేవచ వజ్రలేపఘటితే వాంతర్నిఖాతేవచ
సా న శ్చేతసి కీలితేవ విశిఖై శ్చేతోభువః పంచభి
శ్చింతాసంతతితంతుజాలనిబిడస్యూతేవ లగ్నా ప్రియా.

అని నుడివిన విని భూపాలుండు పరమామోదభరితమానసుండై యాశుకంబును గర మభినందించి తనదేవిం గాంచి మించినయనురాగంబుతో ని ట్లనియె ఓశృంగారరససర్వస్వవేదినీ! వింటివే యీశుకంబు నుడివినపద్యంబు. విరహి యగువాఁడు తనయభిమతనాయికం జూచి యది తనకన్నులకమృతవర్తికవలె నత్యానందకారిణియై యయ

* టీక. సా ప్రియా = ఆప్రియురాలు, నః=మాయొక్క, చేతసి=హృదయమునందు, లీనేవ=లయించినదియుంబోలెను, ప్రతిబింబితేవ = ప్రతిఫలించినదియుంబోలెను, లిఖితేవ = వ్రాయంబడినదియుంబోలెను, ఉత్కీర్ణరూపేవచ = మలఁచినయాకారము గలదియుంబోలెను, ప్రత్యుప్తేవచ=చెక్కంబడినదియుంబోలెను, వజ్రలేపఘటితేవ=వజ్రలేపముచేత బిగితముచేయఁబడినదియుంబోలెను, (వజ్రలేపమనఁగా గుడమాషరసాది ద్రవ్యములచేత భావితమగుగారపూఁత) అంతర్నిఖాతేవచ=లోనఁబూడువఁబడినదియుంబోలెను, చేతోభువః = మన్మథునియొక్క, పంచభిర్విశిఖైః = ఐదుబాణములచేత, కీలితేవ = కీలితముసేయఁబడినదియుంబోలెను, (కీలితము=చీలలచే గ్రుచ్చిఘటితముసేయంబడినది) చింతాసంతతితంతుజాలనిబిడస్యూతేవ = మనోరథములదొంతరలనియెడుదారములగుంపుతోఁ జేర్చి దృఢముగ నేయఁబడినదియుంబోలె, లగ్నా=సంగతయైయున్నది.

స్కాంతమణిశలాక లోహధాతువుంబోలె నంతఃకరణము నుపసంహరింప నత్తెఱంగునం దనప్రియతమాస్మృతిసంతానంబుచేతఁ దన్మయత్వంబుఁ జెంది యాప్రియురాలు తన మనమునందు సంలగ్నయయినప్రకారంబు వచియించుచున్నాఁడు. అది యెట్లనిన? పాంసురాశియందుం బడినజలకణమువలెఁ దనమనమున నాప్రియురా లంతర్హిత యయి నట్టు లున్నది యనియుం; అట్లయిన నెండియుఁ స్ఫురింపక పోవలదా యన! తటాకజలంబు నందుఁ జంద్రమండలంబుభాతిఁ బ్రతిబింబించున ట్లున్నది యనియు, అట్లయిన నంత స్స్ఫురణంబు సంభవించునుగాని బింబసాన్నిధ్యంబు లేనిచోఁ బ్రతిబింబ మెట్లు తోఁచు నన! తనచిత్త మనుభిత్తియందు మన్మథుం డనుచిత్రకారుఁడు చింతయనుతూలికచే నను రాగ మనువర్ణంబున లిఖించినట్టు లున్నది యనియుం, అట్లయినఁ బ్రియతమాచిత్రమే హృదయలగ్నం బయి యున్నది గాని సాక్షాత్ప్రియతమ హృద్గత గానట్లుదోఁచుచున్నదే యన! శిలయందు బొమ్మను మలిచినట్లు తనచిత్తంబున మన్మథశిల్పి ప్రియాకారమును మలిచినట్లున్నది యనియుం; మనస్సునిరవయవవస్తువే! అది యెట్లుపపన్నంబన, బంగారము నందు వజ్రాదిమణులను జెక్కినట్లు విరహాగ్నిం గరంగి తప్తస్వర్ణపిండసదృశంబై యొప్పు తనమనంబున మదనుం డనుసువర్ణకారుం డాస్త్రీరత్నంబును స్థాపితంబు జేసిన ట్లున్నది యనియుం, ఇట్లు స్థాపితము చేసినదానిని విడఁదీయ ననువుపడును గాన నట్లుగాకయుండ వజ్రలేపముచేత బిగితము చేసినట్లున్నది యనియుం; అట్లయిన మానసంబునకును బ్రియతమ కునునడుమ వజ్రలేప ముండునట్లు తోఁచుచుండుటంబట్టి ప్రియతమాసంబంధము హృద యంబున కుండునట్లు స్ఫురింపఁజేయన! భూతలంబునందు నిధివలె హృదయ గర్తంబున నాకామిని పూడ్పంబడిన ట్లున్నయది యనియుం; అట్లయినం బైకిఁ దోఁచ కుండవలయునే యనఁగా! రెండు దారుఖండంబుల నినుపశలాకలచేఁ బిగగొట్టినట్లు తనమనంబునం దతితీక్ష్ణము లగునైదుమన్మథబాణములచేత నిఱుప్రక్కలం జొనిపి గ్రుచ్చి తనప్రియతమ కీలిత యైనవిధంబున నున్నది యనియుం; తనచిత్తము కఠిన మగుట చేత శలాకావేధవ్యథను సహింపంగలదు గాని ప్రియతమ యతిసౌకుమార్యశాలిని యగుటంజేసి తదీయాంగము కుసుమస్పర్శంబునను నయితము ఖేదము నొందునది; శలా కావేధ కోర్వం జాల దని యనుకొని వస్త్రమును పడుగున పేకన నేసినట్లు చింతా సంతానంబు లనుతంతుసమూహంబులతోఁ జేర్చి దృఢముగ నేయంబడినవిధంబున నాప్రియురాలు తనహృదయంబున సంలగ్నయై యున్నది యనియుం ననుచున్నాఁడు.

ఈశుకంబు సెప్పిననాయకుండు కర ముత్కంఠితుండై యుండుటకుం దగినవిధంబున నాయికయు న ట్లుండవలదా యనుచుండ శారిక యిట్లనియె.

* శ్లో. ప్రకృతిలలిత మేత త్సౌకుమార్యైక సారం
వపు రయ మపి సత్యం దారుణః పంచబాణః
చలితమలయవాతోద్ధూతచూతప్రసూనః
కథ మయ మపి కాల శ్చారుచంద్రావతంసః.

అని చెప్పఁగా భోజభూపతియుం విని యాశారికోక్తులఁ గర మనుమోదించుచు లీలాదేవిం గాంచి యోశృంగారవతీతిలకమా యీశారిక నుడివినశ్లోకార్థంబు నీకు భావంగమం బయ్యెఁ గాదె? నాయిక ప్రియతమానురాగంబున విరహాగ్ని పుటపాకరీతిం జెంది దహింపఁ గరము గృశించి యతిగంభీరప్రకృతి యగుటచేఁ బ్రాణతుల్య లగుసకియలకు నైతము తనమానసంబునం గలయర్థంబు నుడువక యుండుటంజేసి వారలు ప్రియతమానయనాదు లొనరించి తాపశాంతి సలుప నసువు గాంచక శీతోపచారంబులు రల్పియుం నంతకంతకుఁ గంతుసంతాపంబు నిరంతరంబై యొసంగుచుండ నది యే యనిష్టసంపాదకం బగునో యని భయంపడుచు; నాయనర్థవిరచనంబునకుం దోడుపడినవసంతకాలంబును గాంచి నాయిక యుండుశోచనీయావస్థకు వెరగంది యి ట్లనుకొనుచున్నారు.

ఈకన్యకామణియంగం బిప్పుడ శృంగారానుగుణ మగుయౌవనారంభంబు వొడమి స్వభావలలితంబై యొప్పునది; యితరసత్త్వంబు లేక సౌకుమార్య మాత్రావలంబనంబైయున్నది. ఈపంచబాణుండు పరమదారుణుఁడు. వీఁ డీసుకుమారవస్తువున కేమి యనిష్టంబు నేయునో యని భయంపడుచుండఁగా కట్టా మెల్లమెల్లనం గదలుచు మలయ

* టీక. ప్రకృతిలలితం = స్వాభావికముగ లలిత మనుయౌవనారంభదశ గలదై యొప్పుచుండు, ఏతత్ వపుః = ఈశరీరము, సౌకుమార్యైకసారం = సౌకుమార్యంబులన మాత్రమే యవలంబన మేర్పడియున్నది. సౌకుమార్యమాత్రావశిష్టమైయున్న దనుట. పంచబాణః = మన్మథుఁడు, దారుణః = కరము ఘోరములగుపనులు సేయువాఁడు. కనికరంబించుకయైన లేక యతిసుకుమారల నతికఠోరదశాపరిణామంబులకుం జొనుపువాఁడనుట. సత్యం = ఇందుకుసందియము లేదు. చలితమలయవాతోద్ధూతచూతప్రసూనః = చలించుచుండు మలయమారుతముచే విదిర్పంబడిన మామిడిపువ్వులుగలదియయి, చారుచంద్రావతంసః = మనోహరుఁడగుచంద్రుండు శిరోభూషణమై యొప్పునట్టిదియగు, అయమపికాలః = ఈకాలమును సంప్రాప్తముకావలయునా ! కథం = కట్టా ! యిది యెట్లగునో ?

లలిత మనఁగా ! స్త్రీలకు భ్రూనేత్రాధరక్రియావిలాసములు గలసుకుమారాంగవిన్యాస మల్లలిణంబు గాక మస్పణమై యుండునేని యట్టిశృంగారానుగుణగాత్రారంభము.

మారుతంబు సహకారతరుకుసుమనికరంబులం గదలించి యామకరందబిందువులు మోచు కొని యాకుసుమరజఃపుంజంబులదుమారమ్ము రేఁపుకొనుచు 'నలుదెసలం గ్రమ్ముకొన మనంబుహరించుచుఁ నందు వెన్నెలలు చెన్నుమీఱి కాయుచుండు నిట్టికాలంబును సంప్రాప్తం బయ్యెనే; ఏమి సేయనగు నని ప్రియసఖులు విషాదపడుచున్నవారు. కట్టా యీ నాయిక యావనారంభదశయందు యుండునది; యిట్టి యతిదారుణ దశాపరిణామంబుం జెందియుండుట కడు శోచనీయము. ఈజగన్మంగళం బై యొప్పు నాయికారత్నంబునకు నభిమతప్రాప్తియగుడనుక నేయనిష్టంబును సంభవింపక యుండం బ్రార్థింపం జనును అని యనుచుండ నింతలో శుకం బి ట్లనియె.

* శ్లో. సంభూయేవ సుఖాని చేతసి పరం భూమాన, మాతన్వతే
యత్రా లోక పథావతారిణి రతిం ప్రస్తౌతి నేత్రోత్సవః,
యద్బాలేందుకళోచ్చయా దుపచితై స్సారై రివోత్పాదితం
తత్ప శ్యేయ మనంగమంగళగృహం భూయోపి తస్యా ముఖమ్.

అని చెప్పఁగా శాశుకంబు నుడివినపద్యంబునందు నభివ్యక్తం బగుచున్నగంభీర భావంబునకు శిరఃకంపంబు సేయుచు రాణిం గాంచి యోప్రియసఖి యీపద్యభావం బెంతచింతనీయంబై యున్నయదియో యెఱింగితివే! ఈకాముకుఁడు తనప్రియతమా ప్రాప్తింగోరి ప్రయత్నించి తదలాభంబుచేత ఖిన్నుండై దానిప్రణయపరిరంభలీలాలాప పరిహాసప్రముఖంబులందు నైరాశ్యంబుం జెంది దానిమొగం బింకొక్కమాఱు కనుం గొనినం జాలు ననునంత్యం బయినతనప్రార్థనంబు వెల్లడిసేయుచున్నాఁడు. తన కాప్రియుం రాలిముఖాంబుజంబు దృష్టిమార్గంబునం దగిలెనేని సుఖసాధనంబు లయిన వెల్ల, నొక్క టిగఁ జేరినట్లువోలె నిరతిశయం బైన యొకవిశేషంబును గల్పించుచుండు. మఱియుఁ

---

* యత్ర = ఏ ప్రియురాలిమొగము, ఆలోకపథావతారిణి=దృష్టిమార్గంబునం దగులఁగా, సుఖాని = సుఖమునకుంగల సాధనములు, సంభూయేవ = ఒక్కటిగఁజేరు కొన్నవియోయన, చేతసి = హృదయంబునందు, పరంభూమానం = నిరతిశయమగునొక విశేషంబును, ఆతన్వతే = కలిగించుచుండునో, మఱియు నేత్రోత్సవః=నయనానందము, రతిం = ఇచ్ఛావిశేషమును, ప్రస్తౌతి=ప్రస్తావమునకుం దెచ్చెడినో, యత్ = ఏ ముఖము, బాలేందుకళోచ్చయాత్ = బాలచంద్రుని కళల సమూహమువలని, సారైః = సారముల చే, ఉత్పాదితమివ=నిర్మితమైనదియుంబోలె నొప్పుచుండునో, తత్ = అట్టి, అనంగ మంగళగృహం = మన్మథునికి మంగళసంపాదకమందిరంబైతగు, తస్యాః = ఆ కామిని యొక్క, ముఖం = మొగమును, భూయోపి = మెండియును, పశ్యేయం=చూతునా,

గన్నులపండువు నగుచు నెద్దియో యొక యిచ్ఛావిశేషంబుం బుట్టించుచుండును. అది సౌకుమార్యం బతిశయించి కళంకరహితంబు లయి యొప్పుచుండు బాలచంద్రుని కళలరాసుల వలన వాని సారంబుల సంగ్రహించి యాసారాంశంబులచేఁ జేయంబడినదియుం బోలె నతిసౌకుమార్యంబుతోడను లావణ్యంబుతోడను జెలంగుచుండుటం జేసి యనంగునికిం ద్రిభువనవిజయమంగళప్రాప్తిమందిరంబై యొప్పు నా ప్రియతమముఖంబును పుణ్యపరిపాకశేషంబుకతంబున నెండియుం జూతునా! ఇట్టి భాగ్యంబు నాకుం గలదా! అని చింతించుచున్నాఁడు. ఓ ప్రియురాలా యీ విరహిహృదయగతమగు నధ్యవసాయంబు రసిక జన హృదయసంస్కార్యంబై యుండలేదా! ఈ కామినీకాముకుల చరితం బారయం దగి యున్నది. ఇట్టి సకలవిద్యావిచక్షణులై యభినవతారుణ్యభూషితులై యనుపమరసికతాసర్వస్వవిదులై వెలయు కుమారులవృత్తాంతంబు వీరలయన్యోన్యదర్శనంబుం దొట్టి యెఱుంగం బోలునది. దీనియందుఁ బరస్పరప్రాప్తివృత్తాంతంబు బహుతరముగ శ్రవణప్రియ్యావహంబై యుండును. ఈ శుకశారికలు నుడువుచుండు పద్యంబుల వలన నదియుం నారయఁ జను ననునంతలో,

క. ఎయ్యెడ కేఁగితివో యని, యయ్యయ్యెడలకును బోతి నన్వేషింపన్
జయ్యన రమ్మా చెలికాఁ, డియ్యెడ నీ వున్నవృత్త మెఱిఁగెను శుకమా.

అని యొకపద్యంబు వినంబడుటయుం శుకం బుప్పరంబున కెగసి యతివేగంబునం జనియె. రాజు నీశుకం బెక్కడిదో? ఎవ్వని పెంపుడుచిలుకయో? ఇది సెప్పుచుండు శ్లోకంబు లెవ్వనిం గుఱించినవియో? వానివృత్తాంతం బెట్టిదియో? సర్వంబు నెఱుంగం గోరుచుండినవాఁ డగుటం జేసి గూఢచారులం బిలిచి తద్వృత్తాంతం బంతయు నారసి రండని యాజ్ఞ సేయ నాచారులు నాశుకంబు రాజుహస్తంబు విడిచి యాకసంబున కెగసిన దాదిగ నది యొకమందిరోద్యానంబునం బ్రవేశించుదనుక దృష్టులు సారించి కని పెట్టి తన్మార్గానుసారులై చనిరి. అంత భోజభూపతి తనమహిషిం గాంచి యో దేవీ! యీశుకంబును శారికయు నెవ్వరివో! తెలియకయున్నది. దవ్వులనుండి యాశుకంబును బిలిచినవాఁడు సెప్పినపద్యంబువలనను అది విని తటాలున నాశుకం బెగిరి పోయిన హేతువువలనను అది యొకవిలాసి పెంచినశుకం బని నిర్ణయింపం జనును. మఱియు నాశుకంబునకు శ్రుతంబు గ్రహించి యెండియుఁ జెప్పఁగల నేర్పు నావిలాసియె కఱపియుండు ననుటయుం నిక్కవంబె. తత్సంబద్ధము లయినపద్యంబుల యాశుకంబువలన నుడువంబడియున్నవి. అదియునుంగాక యాశుకం బొకరాజపుత్రుని చేతిక్రీడాశుకం బని తోఁచెడిని. కాదేని నిర్భయముగ నామం జేతిపయి వచ్చి కూరుచుండునంతటి ధైర్యం బుండదు. ఇంక నీశారికను పెంబడించుకొనివచ్చినది యగుటం జేసి యయ్యది యాశారికతోఁ జిరపరిచయంబు గలదియని

తోఁచుచున్నది. అట్లుండుటంబట్టియె యాశుకంబు దీనిం బలుమఱు జెనకంబోయి మఱి క్రోధంబున నూరకయుండెను. ఈయర్థంబుచేఁ బరస్పరానురక్తు లయిన కామినీ కాముకులు పెంచినశుకశారిక లనియు వారివృత్తంబులు దెలియపఱుచుపద్యంబు లివి వచించినవనియు నిర్ణయింపఁ జనును. అని యిట్లు సెప్పుచుండఁగా నయ్యొడను నిఱువురుకన్యకలు సనుదెంచి దేవికిని రాజునకును బ్రణామములుసల్పి నిలుచుండం గాంచి లీలావతి యోసీ రత్నావళీ యోసీ సాగరికా యీరాత్రివేళ నియ్యెడకు మీరు రాఁగతం బేమి? యని యడిగిన వార లిట్లనిరి. ఈశారిక భర్తృదారికయగు విరజాంబుజ కరము ప్రేమంబునం బెంచుచుండునది. దీని నెడఁబాసియొకనిమిషంబేని యుండం జాలదు. దీని నేమం పంజరనిర్గతం గావించి యింతకుముంద భర్తృదారిక కుపచారంబు లొనరించుచుం గార్యవశంబున మఱచితిమి. పలుమఱు నియ్యెడకు భర్తృదారికతో మేము గొనిరా నియ్యెడకు వచ్చుచుం బోవుచుండునది గాన నియ్యెడకిప్పుడ యిది పఱతెంచె. దీని నన్వేషించుచు మే మిట వచ్చుచున్నారము. అనిచెప్పఁగా లీలాదేవియు నోరత్నావళీ యిదె మీభర్తృదారిక పెంచినశారిక. దీనిఁ బెచ్చరికతోఁ గొనిచని విరజాంబుజకిం డని చెప్పి యాశారికను వారిచేతి కిచ్చెను. ఆకన్నియలు దానిం గొనిచనిరి. అంత రాజు నోమనోహారిణీ యీశారిక నుడివినపద్యంబులయర్థంబులు మనవిరజాంబుజకు సంబంధించిన వని తోఁచెడిని. ఇట్టియత్యుదారప్రకృతియు నతిశయితవిద్యావైభవంబును గరము మనోహరములగుగుణంబులును దానికేగాని యితరకాంతకు లేవు. దానిప్రాయంబును బురుషానురాగంబు బొడసూపునట్టిది. దైవంబు ననుకూలించి దానికిం దగినమగనిం గూర్చెనేని కరం బామోదంబు గల్గును. అని చెప్పి మఱియుం గొన్నిసరసాలాపంబు లాడుచుం బ్రొద్దుపుచ్చి నిదురించి మరునాఁడు మేలుకొని కాల్యకృత్యంబులు దీర్చిసభాస్థలంబునకేతెంచి మంత్రిసామంతదండనాథపురోహితాదులు గొల్వఁ గొలువుదీరియుండఁ బ్రతీహారి సనుదెంచి జోహా రొనరించి దేవా వసుమానసనగరపరిపాలకుం డగు

## విరజాంబుజ నుదయాదిత్యుని కడుగుట.

ప్రతాపాదిత్యునియాజ్ఞావహు లయి కొందఱు విప్రవర్యులు సనుదెంచి వాకిటనిలిచి భవద్దర్శనంబునకు వేచియున్నవారు; అని విన్నవింప భోజుండును దనమనంబునం దమందానందంబుతో నవిళంబంబున నామేదినీసురులం బ్రవేశపెట్టునది యని ముదలయివ్వ నప్పుడా యాప్రతీహారియుఁ జని వారలం దోడుకొని సభకువచ్చి యోద్విజసత్తములారా! యిదె భోజభూపతి భవత్సంప్రాప్తికి సంతసించుచు మీరాకకుం గతం బరయ వేచియున్నవాఁడు. దగ్గఱకుం జనుం డని చెప్పి వాఁడు తనపనికిం బోయెను. అంత నావేదవిదగ్రగణ్యులును భూపతిసన్నిధికిం జని స్వస్తివచనంబుల నాశీర్వదించి తదీయప్రణామంబులు వైకొని

యర్ఘ్యాదివిధుల యథావిధిఁ బూజితులై యతఁడు సూపినయుత్తమాసనంబులం గూరుచుం డిరి. భోజుండు నావిప్రవర్యులం గాంచి యోమహీసురకులాలంకారంబులారా మాభావుకుండు నార్యుండు నగు ప్రతాపాదిత్యుండు సేమంబున నున్నవాఁడే? ఆర్య యగుధరావతియుం గుమారుం డుదయాదిత్యుండును సంతసంబునం జెలంగుచున్నవారలే? ఇన్నిదినంబులకు నాయెడ నాభావుకునికిని నాయగ్రజాతకు నకృత్రిమకంబు గల్గినయది గాఁబోలు? మాకుం బుత్తెంచినసందేశం బేమి! అని యడిగిన నాబ్రాహ్మణు లిట్లనిరి. ఓభోజనరేంద్రా వారల కుదయాదిత్యునిం బోలునుదయాదిత్యుండు కుమారుండును నీకు నంబుజినివంటి విరజాంబుజ కుమారికయుం జనించి సమానరూపవయోవిద్యాదులఁ దద్దయుం బెంపుఁ గాంచుచుండ సేమంబునకుం గొఱంతయేమున్నది? ఆర్యధరావతియుం భావుకుండు ప్రతాపాదిత్యుండును నిన్నుం దలంచుకొననిదినంబు లేదు. అదియునుంగాక నీకు విరజాంబుజ యవతరించుటంబట్టి యాప్రతాపాదిత్యుండు తనసహోదరీమణిలీలావతిబాంధవ్యంబుం దొట్టి తనపట్టికిం బట్టంపురాణిం దెచ్చుకొనంగలిగెఁ గదా యనియుం ధరావతి తనసహోదరుతనూజాత తనకుం గోడలు గాఁగలదు గదా యనియు ననారతంబు నానందంబునం దేలుచున్నారు. ఆయిరువురు నీకుం బుత్తెంచినసందేశంబు వినుము.

సీ. ముంజరాజాన్వయమునకును మావిమలాదిత్యరాజాన్వయంబునకును
సంబంధ మది సమస్తప్రజాకాంక్షిత మంతియ కాదు పూర్వానుగతము
గాన భవద్గర్భకలశపయోరాశి కరవిందవాసిని యైనకన్య
విరజాంబుజను గుణోత్తరుఁ డైనమనయుదయాదిత్యున కొసంగి హార్షగరిమఁ
గాంచఁ జేయుము మమ్ము భూకాంతగణ్య, లలితసౌభాగ్యవతికి లీలావతికిని,
కరము ప్రియ మిది వైశమ కార్య మిందు, మంగళముఁ గూర్చు శైలజార్ధాంగుఁడగ్గి.

అని చెప్పిన విని భోజభూపాలుండు కరముసంతసించి యిట్లనియె. ఓవిప్రోత్తములార యీరెండువంశములకు సంబంధము సర్వజనశ్లాఘనీయంబు. ఇది పూర్వులనుండి జరుగుచున్నది. ఈయర్థంబున నే నతనికిం జెప్పిపంపున దేమనిన?

గీ. పేర్మి నాముద్దుపట్టి నిప్పించుటకును, గూర్మిఁ దనపట్టికిని దీసికొనుట కతఁడ
కర్తయై యుండ నన్నడుగంగ నేల, స్వగృహమున నీవిచారంబు సన్నె సేయ.

అనిపల్కి జాంబూనదాంబరాభరణంబుల నాబ్రాహ్మణుల బహూకృతులం జేయుఁడు వారలు రాజును వీడ్కొని వసుమానసనగరప్రయాణోన్ముఖులైరి. బుద్ధిసాగరుండను మంత్రి భోజునిం గాంచి యోనరేంద్రోత్తమా కన్యకామనోనురాగంబుం గనుంగొనక తత్ప్రదానంబుకొఱకు మాట యివ్వం జనదని మందలించెద నన భోజభూపాలుండును దనకన్యక కనురూపవరుండు దొరికె నను మహోల్లాసంబునఁ బ్రత్యుత్తరం బొసంగఁ

డయ్యెను. మధ్యాహ్నసమయంబు గాఁగాఁ గొలువు చాలించి యాత్మసౌధంబునకుం జని స్నానభోజనాదికృత్యంబులు నిర్వర్తించుకొని తాంబూలము సేయుచుండెను. పూర్వరాత్రియందు శుకవృత్తాంతంబు దెలియంగం బంపియుండుచారులు వృత్తాంతం బారసి వచ్చి యామహీపతితో నిట్లు విన్నవించిరి. ఓదేవా యేము మీయాజ్ఞానుసారముగ శుకంబు చనిన మార్గంబుం బట్టిచని యీనగరమున నొకమహాహర్మ్యంబుకడకుం జేరితిమి. శుకంబును దానిముంగిటం జొచ్చి మందిరాంతరాళంబు జేరినయర్థంబుం దెలిసికొంటిమి. అంత మరునాఁడు మట్టమధ్యాహ్నసమయంబున మేము కొందఱము బ్రాహ్మణవేషధారులమై యాయింటం బ్రవేశించితిమి. తత్క్షణంబ కొందఱు దాసీజనులు సనుదెంచి మాకుఁ బాద్యం బొసంగి పూజించి యోవిప్రవర్యులార పక్వాన్నంబు భక్ష్యభోజ్యాద్యుపేతం బతిథులకు నివేదింపసిద్ధము సేయంబడియున్నది. ఆరగించి మాభవనంబును శుభభవనంబు సేయుఁడనా మేమును వారివినయరూపౌదార్యాదుల కభినందించుచు నోదాసికలార యిదియెవరియిల్లు? వచింపుఁ డని యడిగిన వార్లు నోద్విజోత్తములార భోజభూపాలసభాలంకారం బయిన భవభూతి యనుమహాకవిని మీరు వినియుందురు. అతనిగృహం బిది. అతఁడు శ్రీకంఠపదలాంఛనుఁ డనుబిరుదుగలవాఁడు. బ్రాహ్మణోత్తములు. మీరు విందారగింప సేయనుపపత్తియుండదు. అని చెప్పిన మేము నోదాసికలారా యేము దూరదేశప్రయాణాయాసపరిశ్రాంతులము. అభ్యవహారాదికృత్యంబు మాకిప్పు డపేక్ష్యంబు గాదు. దినకరకిరణతాపతప్తులమై చల్లగ మెల్లనిగాలి వీచుచుండుసరోవరసమీపంబున ఛాయాపాదపంబునీడ నించుక సేపు విశ్రమించి శ్రమ యడంగిన నరిగెదము. ఈహర్మ్యం బపరిమేయమహావిభవాభిరామంబై యొప్పుచున్నది. గాన దీనియందలియుపవనములలో మాకోరినచోటు లుండునని యెంచి వచ్చితిమి. అట్టిచోటు చూపితిరేని మీకుం బుణ్యం బగును. అని యడిగితిమి. అది విని వారలు ఓమహనీయులారా యీమహాకవియింట నతిథులకు యథావిధి ప్రాప్యములు గానివస్తువులు లేవు. గానమీరలు నేతన్మందిరాభ్యంతరవర్తియగునభినవారామమునందలిగుజ్జులేమావినీడ మాధవలతామండపంబునంబద్మసరోవరసమీపముననుండుదానియందుం బరుండి విశ్రమింపం జనును. రం డాచోటు చూపెద మని మమ్మొక కదళీవనమధ్యవర్తిమాధవలతామండపంబుకడకుం బిలుచుకొని చని విడిచిపెట్టి పోయిరి. మేము నామండపమధ్యదేశమునం గొందఱు విప్రకుమారు లుండం గనుంగొని వారికెఱుకపడకుండ గుజ్జులేమావినీడ నతిసుకుమారపుష్పధూళిదూసరితంబై యుండుచోట శయనించితిమి. ఆ విప్రవటువులలో నొక్కఁ డతిరమణీయాకృతి గలవాఁడు భవన్నిర్దిష్టంబగు శుకంబును దన ముంజేతిమీఁద నిడుకొని ఱెక్కలు దువ్వి యోహారీతమా గతరాత్రి యెక్కడికేఁగితివి. ఏల యంతకాలము దడసితివి. అని యడిగి దాని ముద్దువెట్టుకొనుచుఁ గళావంతుం డనునొక సవయస్కునిం బిలిచి యోరీ యీశుకము నీచేయివిడిచి యేల చనియె? ఎయ్యెడ

నెవ్విధి వెండియుం లబ్ధం బయ్యె? నని యడిగిన నొకవిప్రకుమారుండు వానితో నోరి శ్రుతశ్రవుఁడా గతదినంబు రాత్రి నీవు గురుజనాహూతుండవై తత్సన్నిధికిం బోయి యుండుతఱి దీని కభ్యవహారకాలం బగుటం జేసి యని నిర్వర్తింపం బంజరంబు వెలిచి నాచేతి కెక్కించుకొనినం దత్క్షణంబున నిది యుప్పరంబున కెగసెను. నేనును గడువడి దీనిం బరికింప నున్నతసౌధాగ్రసమారూఢుండనై నలుదిశలు గలయం బరికించుచుంటి. ఈశుకము విరజాంబుజాసౌధమార్గంబుం బట్టి సనుచుండెను. ఇదియుం దత్సమీపము నకుం జనుఁడు నాదేవి పెంపుడుచిల్క తమాలిక యనునది కన్యకాంతఃపురోపవనమునుండి నిర్గమించి దీని నెదుర్కొనియె. నీవు విరజాంబుజయందు నాదేవి నీయందును గర మనురాగంబుం గలిగియుండునట్లు యీశుకశారికలు నన్యోన్యప్రేమభరంబునం బరగు చుండునవి యగుకతంబున,

క. ఈశుక మాశారికఁ గని, యాశుగతి స్మరశరార్తమయి ముద్దిడి తా నాశమెయిఁ గలయఁ గడఁగన్, దా శారిక యనువు మీఱఁ దప్పించుకొనెన్.

గీ. వెండియును దాని నీచిల్క వెంబడింపఁ, బఱచి లీలావతీదేవి భవ్యహర్మ్య తలమునకుఁ జేరె శారిక తదనుసరణ, కలితమతి నీవిహంగంబు లలిని జనియె.

అంత నేనును నామనంబున నిట్లు వితర్కించితిని. ఈశుకంబు లీలావతీసౌధంబు నకుం జనియె. దీనికి నో రూరకుండదు. అనవరతము నేదేనిఁ బల్కుచునె యుండు. శారికయుం నట్టిద. ఇవి పరస్పరదర్శనంబున నుల్లాసంబువెరిగి తా మభ్యసించినపద్యంబులు పయింబయి నెప్పుకొనం బూనుటయుం గలదుగదా! అట్లై యంతఃపురంబునను జెప్పం గడంగిన మహానర్థంబు వాటిల్లఁగలదు; భూపతియుం నీసమయంబున రాణికడనయుండు. ఈశుకశారికలం గాంచెనేని యత్యుల్లాసంబునం జేరంబట్టి యీరెంటి నుక్తిప్రత్యుక్తి ధోరణిం దగిలించెనేని యిచటం జరిగినరహస్యం బుద్ఘాటితంబు గాకపోదు. దీనం జెట్ట సంభవించు. ఇందుల కేమి సేయఁ జనును; అని చింతించి గ్రక్కున సౌధంబు డిగ్గి లీలావతీసౌధోద్యానభూమిబహిఃప్రదేశంబులం దిరుగుచుం గొంతతడవునకు రాజునురాణియుం నందుఁ బండువెన్నెలబయట నున్నవృత్తాంతం బారసి తత్ప్రాకారకుడ్యసమీపమున నిలువంబడి యొకింతసేపటికి కీశుకంబును శారికయుం నన్యోన్యోల్లాసంబు మెఱయం గొన్ని పద్యంబులు వచియించుచుండుటయుం విని దీని కంఠస్వరంబు నిరూపించి యేను దీనిం బిలిచితిని. రాకపోయెను. నీ పేరుపెట్టి పిలిచినఁ దక్షణమ గగనంబునన పఱతెంచి యిది వచ్చి యియ్యెడకుం జేరె. అనిన నాశ్రుతశ్రవసుం డనువిప్రవటువు కట్టా మహాప్రమాదంబు గాఁగలదు! ఈశుకపాతకము భోజభూపతికడ నేమేమి వచించినదో? ఏమి సేయఁ జనును. ఇది మహానర్థంబునకు బీజ మగును. గతంబుఁ జింతించి ఫల మేమి? రానున్నది రాక మానదు. కౌశిక! యీసంతాపంబు సహ్యంబు గాక యున్నది. మన

విద్యాగురువు భోజనాదికృత్యంబులు దీర్చుకొని విద్యామండపమునకుం జేరునంతలో నాప్రాణనాయిక యంపినసందేశపద్యంబు పఠించుకొని యుంచుక యాశ్వాసంబుఁ జెందెదను. వేఱొంట నీతాపభరంబు నవ్యావేదనంబు గాదు. ఈపుష్పనికుంజంబునం దమాలపాదపశాఖపై నిడియుండు ప్రియాకరపల్లవలిఖితాక్షరావళీవిరాజితం బగు కమలపత్రంబు నాచేతి కందిమ్ము; అని యడిగిన నాకౌశికుండును వైశంబ యొకకమలపత్రంబు నలక్తకరసవిలిఖితాక్షరవిరాజితం బగుదాని నెత్తియిచ్చెను. అది గైకొని శ్రుతశ్రవుండు మహానురాగంబున నిట్లు పఠించె.

* శ్లో. నవా సోఢుం శక్యం నళినశరబాణా నవిరతాన్
న ధైర్యం తారుణ్యం నవ మధికబాల్యం వితనుతే
సువక్త్వ్యే లజ్జా విరమయతి పూతం కుల మపి
స్వతంత్రత్వం లుంప త్యథ కి మబలావాంఛితశతైః.

---

* ఇందుకాంధ్రపద్యము.

మ. వనజాతాస్త్రకుఁ డేయుసాయకముల న్వారింపఁగా రాదు నూ
తనబాల్యాధికయావనంబు మదికిం ధైర్యంబు రా నీదు స
త్యనిరుక్తి న్మిము బోంట్లకుం దెలుప నాహా సిగ్గు మైకోదు పా
వనవంశంబు స్వతంత్ర మివ్వదు సఖీవాంఛల్ తుదల్ ముట్టునే.

టీక. అవిరతాన్ = నిరంతరముగఁబయింబడుచుండు, నళినశరబాణాన్ = మన్మథబాణములను, సోఢుం=ఓర్చుటకు, నవాశక్యం=శక్యమేకాకయున్నది. అధికబాల్యం = బాల్యమతిశయించియుండునదియగు, తారుణ్యం = యావనము, ధైర్యం=ధీరభావమును, నవితనుతే=కలిగింపదు, సువక్త్వ్యే = మంచిమాటలాడునర్థంబునందు, లజ్జా=సిగ్గు, విరమయతి=ఊరకుండుమనుచున్నది నోరెత్తనివ్వదు. పూతం=పావనమగు, కులమపి = అభిజనమును, స్వతంత్రత్వం=స్వాతంత్ర్యంబును, లుంపతి=త్రుంచివేయుచున్నది. అథ=ఇంక, అబలావాంఛితశతైః=అబలలకు మనోరథశతంబులు గలిగియుండినను, కిం=ఏమియుపయోగము ?

తా. మన్మథుం డవిరతముగ బాణము లేయుచున్నాఁడది సహింపం దరంబు గాకున్నది. బాల్యమే పైకొని యుండుటంబట్టి తారుణ్యము నిండారమింజేసి యేమి సేయుటకును ధైర్యంబు చాలక యున్నది. మంచిమాట లేవేని జెప్పనగు నని యెంచినచో సిగ్గునోరెత్తనివ్వదు. మఱియు నుత్తమ మగు కులంబునకుం గళంకంబు గల్గునే యనుభయంబున స్వతంత్రించి ప్రవర్తించుటకును లేక యుండు. కాన స్త్రీలమనోరథంబులు పెక్కులుండినను ప్రయోజనం బేమియు లేదు.

అని యావిప్రవటుండు సదివి కన్నుల నిండ నీరుదెచ్చుకొని కొంతసే పూరకుండి తలయెత్తి యోప్రాణమిత్రమా కౌశిక యిప్పు డెట్టిదురంతమగు కంతుసంతాపంబునం బొగులుచున్నదో విరజాంబుజ యని నామనంబు ప్రకంపంబు నొందుచున్నయది. అని చెప్పుచుండునంతలో మఱియొకవిప్రకుమారుం డేగుదెంచి గురువగు భవభూతి విద్యామండపమధివసించె; భవదాగమనమునకుఁ బ్రతీక్షించుచున్నవాఁడు. తక్కుంగలశిష్యు లెంద ఱుండినను సంగ్రహణకళాకౌశలంబునం జేసి నీయందు తనసుతునికంటె నధికప్రేమ మునిచియున్నవాఁడు; వేగ రమ్ము; నావుడు శ్రుతశ్రవుండు సవయస్కులతో త్వరాకలితుండై చనియె. కౌశికుండును వానిచేతిపత్త్రంబుఁ దా నందుకొని యూతమాలశాఖాగ్రంబున నునిచి చనియెను. వా రటు వోవ నేము నితరులు లేకున్నారా యని కలయ నవలోకించి యాపత్త్రంబును గైకొని దానిని దాఁచి యించుక బయుండి లేచి భవభూతి సదువుసెప్పుచోటికిం జని కూరుచుండి వారు విద్యాభ్యాసము సేయుటఁ గాంచి యిదె వచ్చి నారము. ఆపత్త్రంబిదిగో అని రాజుచేతికిఁ బత్త్రం బిచ్చిరి. రాజును గైకొని చూచి యాచారులకు బహుమతులొసంగి పంపెను. అట్లు పంపి తనమనంబునందు సాహో యీ విరజాంబుజకు నీబ్రాహ్మణవటువునందుఁ దగులంబు గల్గుట యత్యాశ్చర్యంబు. దీనికంటె సర్వవిద్యాధికుం డగురాజకుమారుని కిచ్చి పరిణయము చేసి దానం గలుగుతదీయగౌరవంబున కాహ్లాదంబుఁ జెందవలయు నని యుండ మన్మథుం డనుచితఘటన సేసి కులంబునకు గౌరవంబుఁ దొలఁగించెను. శాంతాదేవి ఋశ్యశృంగుని లోపాముద్ర యగస్త్యునిఁ బరిణయంబు చేసికొనిరి. వారును బహుకష్టశతసాధ్యంబగు తపంబు సంపాదించిరి గాని కామసుఖసాగరంబులం దేలం గలిగిరే! భోజభూపాలునియల్లుం డొకయోజయడంగిన విప్రవటుం డనఁ గొఱంత గాదే! ఈతలవంపుల కేమి సేయుదు. ప్రతాపాదిత్యుని కుమారుండగు నుదయాదిత్యునికి నీమగువ నిచ్చెదనని చెప్పితిని గదా! దాని కేమి సేయునగు. అది య ట్లుండనిమ్ము. నావలన నించుకేనియుం భీతి లేక యిట్టియకార్యంబులం బ్రవర్తించి కులంబునకుం గళంకంబు సంపాదించువారిం బట్టి శిక్షింపనేని యింక నెట్టి కట్టిడిపనులు సేయఁ బూనరు. సుతావత్సల యగుటం జేసి లీలావతీదేవి కిది విప్రియంబ యగుం గాన నాదేవి చెవికెక్కనీయక కొన్నిదినంబులు విస్ఫుటంబు గానీయక గోపితంబు చేసి వీరియపరాధంబులఁ బ్రత్యక్షమునం బట్టుకొని దండింపం జనును. అందులకొక వెర వూహింపవలయు నని యాలోచించుచు లీలావతికిని విరజాంబుజకును అవగతము గాక యుండఁ గొందఱ గూఢచారులను వీరభటులను గన్యాంతఃపురమునఁ బోతుటేఁగ సయితము చొరఁగూడనీయని యతినిర్బంధంబునం గావలియుంచి తాను పలుమఱు నాభటులపైఁ బరామరిక గలిగి ప్రవర్తించుచుండెను. కన్యాంతఃపురము,

నందు నిర్ణీతలై యున్నవారు దప్ప పెఱవారలు తెఱవలు సయితము ప్రవేశించుట దినక్రమమున నివారింపంబడియె. ఉద్యానాదివిహారంబులు సేయునప్డు డతిజాగరూకులై వీరభటులు తదధిష్ఠితారామబహిస్స్థలంబులఁ గావలి యుండునట్లు నిర్ణయించెను. ఇట్లు కొంతకాలంబు జరిగిన నొకనాఁడు భోజభూపాలుండు విరజాంబుజకు జన్మదినం బని యాజన్మోత్సవంబుం గొనియాడ నగరంబు నలంకరింపం బంపి యాదినంబునఁ గన్యాంతఃపురమునందు బ్రాహ్మణులకుం గర మాస్వాద్యతమంబగు నన్నంబు వెట్టింపఁ బ్రయత్నించి పాకశాస్త్రప్రవీణులైన బ్రాహ్మణుల నియమించి భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయభేదంబులం బరఁగువంటకము సిద్ధముసేయించి కాళిదాస, భవభూతి, దండి, బాణ, ప్రముఖకవివర్గంబును శిష్య, ప్రశిష్యాదిసంఘసహితంబుగ భోజనమున కాహ్వాతంబుచేసి తక్కుంగల ధారానగరమునందలి విప్రసంఘంబును గన్యాంతఃపురమునందు భుజింప రాఁ గట్టడయిడి యాదినమధ్యాహ్న సమయమున కామందిరమునకు వచ్చుచుండువిప్రవర్యుల నర్ఘ్యాదివిధులం బూజించుచుండెను. లీలావతియు బ్రాహ్మణపూజనములం దనపతికి సహాయయై మెలంగుచుండె. దండి, భట్టబాణ, కాళిదాస, శంకర, తారేంద్రప్రముఖు లయినమహాకవులును సనుదెంచిరి. అప్పుడు భవభూతియుఁ దనకొకింతయెడగలుగ వెంబడివచ్చుచుండు శిష్యసంఘంబుతోఁ గన్యాంతఃపురద్వారసమాగతుండు గాఁ రా జతనిం గనుంగొని లేచి సబహుమానంబుగఁ బూజించి తోడ్తెచ్చి కాళిదాసుని సరస నమర్పంబడియుండు సుఖాసనమునం గూరుచుండఁ బెట్టి యతనిశిష్యసంఘంబునందుఁ బండుటాకులలోఁ బడియుండు బాలసహకారపల్లవంబువోలె నతివిలోభనీయమూర్తియై యాజానులంబం బయినబాహాయుగంబును బూర్ణచంద్రసుందరంబగు ముఖారవిందంబును గలిగి విరహావిక్లబంబులగు నంగంబులతో నలసమగు గమనంబున వచ్చుచుండువాని నొకకుమారునిం జూచి యితఁడ తనకూఁతువిషయంబున నపరాధం బొనర్చినవాఁ డయి యుండనోపు నని యూహించి తనభావంబును దృఢీకరించుకొనం దలంచి భవభూతిం గాంచి యోమహాకవీ యీనీశిష్యసంఘంబున నతిగంభీరమనోహరమూర్తియై యేతెంచునాతని పే రేమి యని యడిగిన నాకవియు నీకుమారుండు శ్రుతశ్రవుం డనువిప్రకుమారుండు; మదీయశిష్యులలో నగ్రగణ్యుండు; గురుశుశ్రూషాదులందును విద్యాగ్రహణంబునను దద్దయుం నామనంబున కెక్కినవాఁడు; అని చెప్పిన రాజును కవిం గాంచి యోభవభూతీ యితనియాకారంబుం గనుంగొనిన నీనుడివినగుణంబు లితనియందుండు నని యెఱింగించెడిని. సంతసం బగుచున్నది. ఇతఁ డిప్డు డుండువిధంబు నీ వెఱింగించి కర్ణపీయూషంబు సేయ నడిగెదను. ఇతనియవస్థానంబు నితనింగుఱించి నీమనంబునం దోఁచునభిప్రాయంబును నాకుఁ దెల్పం జనును. అని ప్రార్థింపఁగా భవభూతియు నతని నిరీక్షించి యి ట్లనియె.

*శ్లో. గమన మలసం శూన్యా దృష్టి శ్శరీర మసౌష్ఠవం
శ్వసిత మధికం కిన్న్వేత త్స్యాత్ కిమన్య దతో థవా,
భ్రమతి భువనే కందర్పాజ్ఞా వికారిచ యౌవనం
లలితమధురా స్తేతే భావాః క్షిపంతిచ ధీరతామ్

---

* టీక. గమనం = నడక, అలసం = ఇచ్చోటికిఁబోఁ బ్రయత్నించితి నని యెఱుంగకుండుటంబట్టి యెట్టకేని ధరింపంబడినదిగాఁ దోఁచుచున్నది. అలస్యం బనఁగాఁ గ్రియానిద్వేషము. అది గలిగియున్న దనుట. దృష్టిః = చూపు, శూన్యా = మానసంబునం జింత యతిశయించుచుండుటంబట్టి తాఁ జూడంగడంగినవిషయం బిది యని యెఱుంగక యున్నది. కనీనికలును పుటములును సమము లయి స్నిగ్ధమయి చలింపక దర్శనంబులేక బాహ్యార్థంబుల మాత్రము గ్రహించు మ శ్యామమయి యుండునది శూన్యదృష్టి. ఇది చింతనంబునం గల్గు. శరీరం = కాయము, అసౌష్టవం = బలహీన మగుటంజేసి వ్యాపారానసమర్థమయి యున్నది. శ్వసితం = ఊపిరి, అధికం = విశేషించి యున్నది. మనోరథంబులు పైపైనఁ జింతించుచుండుటంబట్టి సారెసారెకు నిశ్వాసములు గలుగుచున్న వని భావము. ఏతత్ కిన్ను స్యాత్=ఈచింతాలస్యాదులకు నిమిత్తమే ముండునో? అథవా అతః అన్యత్ కిం = మన్మథవికారంబునకంటె వ్యతిరిక్తమే ముండంబోవును. కందర్పాజ్ఞా = మన్మథమహారాజునాజ్ఞ, భువనే = లోకమునందు, భ్రమతి=అడ్డులేక ప్రవర్తించుచున్నది. యౌవనంచ=యౌవనమును, వికారి = వికారములఁగలిగించునది. రతివ్యాయామమున శౌర్యం గలిగి మదమత్తమాతంగంబునకుం గలమత్తతవోలె నొప్పుచుండుయువ భావము యౌవన మనంబడును. లలితమధురాః=నయనసుఖకరములును మనోహరములునగు, తేతేభావాః = ఆయాభావంబులు - చంద్రచంద్రికలు నుద్యానాదులును, ధీరతాం =ధైర్యమును - చాపల్యంబులేక యేవస్తువులనైనను మెచ్చుకొనకయుండుస్వాభావికచిత్తవృత్తిధైర్యమనంబడును, క్షిపంతి = త్రోసివేయుచున్నవి.

తా. ఈకుమారుఁడు దా నిచ్చోటికిం బోవుచున్నా నని యెఱుంగక యప్రయత్నంబున నడుచుటయుం; ఈతనిదృష్టి మానసంబునఁ జింత యతిశయించుటంబట్టి తాఁ జూడంగడంగినవిషయం బిది యని యెఱుంగకుండుటయు; శరీరము బలహీనమై యుండుటయుం; నిట్టూరుపులు పైపైన నతిశయించుచుండుటయు గనుంగొన నీగుణంబులు దేనివలనం గలిగియుండవచ్చునో యని యూహింప దీనికంటె నితరము మఱేమియున్నది; మన్మథవికారమువలననే యివి కలిగియున్నవి; అని నిర్ణయింపనగును. ఏలయన? లోకమునందు మన్మథునాజ్ఞ యడ్డులేక సంచరించుచున్నది. యౌవనమును వికారము గలిగించునట్టిది. కన్నులపండువు లయి మనంబును హరించుచుండు చంద్రచంద్రికోద్యానాదులును ధైర్యము నపహరించునవి. ఇవియెల్లఁ జేరియుండుటంజేసి యితని కీగుణములుగలుగుటకు మన్మథవికారమే కారణ మనిభావము.

అని చెప్పిన రాజు నోకవీ నీనుడివినది యథాదృష్టంబుగ నున్నది. మెచ్చవచ్చు. అని చెప్పి భోజభూమీశుండును గవిని బహూకరించి యతనిశిష్యసంఘం బంతలోసమీప మునకు రాఁగా వారల నుచితస్థలంబులం గూరుచుండ నియమించెను. రాజ నియుక్తులయిన పరిచారకులును బరిచారికలు నపూపసూపశాకాదివస్తువుల నన్నంబును వడ్డించిరి. రాజాజ్ఞ చేత విరజాంబుజ సువేషాలంకృతయై మణిమయభూషణంబులు దొడిగి కనకమయ ఘృతపాత్రంబు హస్తకమలంబునందాలిచి దేవతలకమృతంబు వడ్డింప నమృతకలశహస్త యై బొడసూపినమాయామోహినిరీతిం దోఁచుచు విప్రులకు ఘృతంబువడ్డింప నయ్యోదకుం జనుదెంచెను. ఆచందనగంధిం గనుంగొని తదీయసుషమావిశేషంబునకు నిరవద్యసౌభాగ్యంబునకు నచ్చెరువొందుచు నచ్చటిజను లొండరులతో నిట్లనుకొనిరి. ఔరా యీ రాజతనూజరామణీయకంబు వొగడఁ దరంబు గాదు,

సీ. అడుగు వెట్టినచోటు లభినవపల్లక పఙ్క్తి నిండించినపగిదిఁ దోఁచెఁ
దిలకించునెడ లెల్ల లలితనీలోత్పలమాలికల్ గట్టినమాడ్కిఁ దోఁచెఁ
దిరిగినచోటులు దీప్తసౌదామనీకులములు గ్రమ్మెడుకలిమిఁ దోఁచెఁ
నుండినచో టెల్ల నుత్ఫుల్లశతపత్త్రసౌరభంబులు గ్రక్కుసరణిఁ దోఁచెఁ
కేళి నవ్వినచోటు లక్లిష్టమయిన, బొండుమల్లెలు వోసినపోల్కిఁ దోఁచెఁ
నీలతాబాహసౌభాగ్య మేమి సెప్ప, వచ్చు దేవాంగనలు దీని కెచ్చుగారు.

అని యాశ్చర్యమగ్నమానసులై నిర్నిమేషంబులగు దృష్టులం గనుగొనుచుండఁ గాలిదాసుండును భోజునిమొగంబుం గనుంగొనుచు భవభూతింజీరి యోచెలికాఁడా నీవు పూర్వ మొకవిరహివర్ణనంబుఁ గావించితి వది యతిమనోహరంబై యొప్పుచున్నది. తదను గుణముగ నొక విరహిణీవర్ణనంబును నీనుడివినదాని నాకర్ణింప బ్రియం బయ్యెడు; నని పల్కిన భవభూతియుఁ దనమనంబునందు నీకవి యీరాజతనూజను వర్ణింపు మని ప్రత్యక్షముగఁ జెప్పక పరోక్షంబుగఁ జెప్పెను. వర్ణింపక యుండుట యుత్తమంబు గాదు. వర్ణించినచో భోజునిమనంబున కొండుగాఁ దోఁచు; అయినను విశేషనిర్దేశంబు మాని మానినీమణివిరహదశను వర్ణింతుఁగాక యని యనుకొని యిట్లనియె.

* నీవీబంధోచ్ఛ్వసనమధురస్పందనం దోర్విషాదః
స్వేద శ్చక్షు ర్మసృణముకుళాకేకరస్నిగ్ధముగ్ధం
గాత్రస్తంభ స్తనముకుళయో రుత్ప్రబంధః ప్రకంపో
గండాభోగే పులకపటలం మూర్ఛనా చేతనాచ.

* టీక. నీవీబంధోచ్ఛ్వసనం = కట్టుపుట్టంబుముడివిశ్లథమగుట, దెలియుచున్నది. ఈబాలిక తనమానసమునందుఁ బ్రియతమునితోఁ జేరుచుండునట్లు మనోరథించుచుండు

అని చెప్పిన విని భోజభూపాలుండు తనదేవియగు లీలావతిం గనుసైగతోఁ జూచి యీవిరజాంబుజకుం గలవిరహవ్యథావిశేషము గవి వర్ణించినయది యొకించుక యైన లేక పోలేదు; ఇట్టియపరాధంబునకు భాజనంబైన నీపట్టియెంతదిట్టయో కనుంగొంటివా యను తన యభిప్రాయంబు నాదేవికి సూచింపం జేయ నాదేవియుం నితరులసన్నిధిఁ దా నేమియుం పచింపం గూడ దని యూరక యవనతముఖియై యుండెను. ఇంతలో నావిరజాంబుజయుం శింజానమంజుమంజీరఝుళంఝుళనినాదంబులు రతిపతిపోషితరాజహంసవతం సకమనీయరుతంబుల ననుకరింపఁ బృథుళతరనితంబబింబయుగళ సంక్రాంతకాంచనకాంచికామణికింకిణీఘణంఘణనినాదంబులు త్రిభువనజనమోహనదర్పకధానుష్కధనుర్గుణటంకార విరావంబుల ననుసరింప నీషదవనతగాత్రవల్లరీగుళుచ్ఛచ్ఛాయాకలిత కనకకలశయుంగళ సంకాశపీవరపయోధరభారపరికంప్యమానవిలగ్న యగుచు నవధీరితశారదపూర్ణిమాచంద్ర బింబప్రతిమానమగు ముఖాంబుజాతంబున నత్యభివ్యక్తంబు గాక శోడమమందహాసాంకూరంబులు సుధాధారానుకారు లయి చూచువారలహృదయంబుల నత్యాహ్లాదపరిప్లుతంబులు సేయ జగంబులం గెల్వ శంబరారి యాత్మీయశాంబరీమహిమచే సృజించిన మోహినీ దేవతవిధంబున నామనోహరాంగి యుపవిష్ట శిష్టగోష్ఠీసన్నిధికిం జనుదెంచి

---

నది గాన నతనికరము నితంబబింబసంక్రాంతంబై కాంచీదామాకర్షణంబునకుం గడంగి నట్లు తలంపుంగొనుటం జేసి యట్టిస్పర్శసుఖభావనముచేత వలపులముడి పీడుచున్న దని భావము. ఇఁకఁ జెప్పంబడుగుణంబులెల్ల నీయింతికిసంకల్పరతిసంభావితములని తలంచుకొన వలయుం. అధరస్పందనం = అధరముకదలుటయుం, దోఁచుచున్నది. మోము మోముఁ జేర్చి మోవినొక్క ననుభావన యిందుకతంబున నధరము స్ఫురించుచున్న దని భావము. దోర్విషాదః = భుజలతలు శిథిల మగుటయు గానంబడియెడి. స్వేదః = చిఱుచెమ్మటలు, గ్రమ్ముచున్నవి. నాయకుండు చతురుం డగుటం జేసి పూర్వమె నాయిక తనకు రతి లాభంబు గలిగెనని యెంచుచున్నదని భావము. చక్షుః = కన్ను, మసృణముకుళాకేకర స్నిగ్ధముగ్ధం = అనురాగకషాయితంబులై సుఖోన్మీలితంబులగుకనీనికలును, సవ్యాజంబు లగుభావగర్భస్వభావంబుల వెలయుచు; స్నేహానువిద్ధములయి యరమోడ్పుపైకొనుచుండు క్రేఁగంటిచూపులును గలగియున్నది. ఇవి యన్నియుం సుఖపారవశ్యంబునం గలుగునవి. గాత్రస్తంభః = శరీరము నని శ్చేష్టతయుఁ జూపట్టెడిని. స్తనముకుళయోః=కుచకోరకములందు, ఉత్ప్రిబంధః = నిలువనివ్వని, ప్రకంపః=గాత్రకంపము నున్నది. గండాభోగే = విశాలమగుకపోలమునందు, పులకపటలం = రోమాంచములచాలును బొడసూపుచున్నది. మూర్ఛనా = జ్ఞానము స్తిమితంబగుటయుం దోఁచుచున్నది. చేతనాచ=జ్ఞానంబునుగన్పడుచున్నది

యాయంగనామణియు నాశ్రుతశ్రవుని నుత్తరంగంబులయి ప్రేమరసభరపరిప్లుతంబులై యుద్గాఢరాగసూచకంబులై నిసర్గమధురంబులై స్తిమితవికసితంబులై యుల్లసద్భ్రూలతా మహోదారంబులై యొప్పుకటాక్షవీక్షణంబులం గనుంగొనిన నది గాంచి యానియభిప్రాయంబు గుర్తించి భవభూతి లీలావతికిం దెలియుట కాకన్య యాకుమారునింజూచిన విధం బిట్లు వర్ణించుచున్నాఁడు.

* శ్లో. అవిరళ మివ దామ్నా పౌండరీకేణ నద్ధః
స్నపిత ఇవచ దుగ్ధస్రోతసా నిర్భరేణ
కబళిత ఇవ కృత్స్న శ్చక్షుషా స్ఫారితేన
ప్రసభ మమృతమేఘేనేవ సాంద్రేణ సిక్తః.

అని చెప్పిన విని కాళిదాసాదులు భవభూతికవితాచాతుర్యంబునకు మెచ్చుకొను చుండిరి. ఇంతలో నాశ్రుతశ్రవుండును దలయెత్తి విరజాంబుజం గాంచి చిరకాలము నుండి తనప్రియురాలిం గాంచక యుండినయుద్వేగంబునం జేసి దేహంబుపైస్మృతి యేదినవాఁడు గాన రాజసన్నిధానం బనుటయుం మఱచి పెన్నిధింగన్న పేదచందంబున

* టీ. అతర్కితోపనతమగు తనప్రియతముని సందర్శనంబుం గాంచి యత్యుల్లాసంబుం జెందినమించుబోఁడి యతనిం గనుంగొనిన ప్రకారము వర్ణింపంబడుచున్నది. ఈకుమారుఁడు, పౌండరీకేణ=తెల్లదామరపువ్వులచే నిర్మితంబయిన, దామ్నా=మాలికచే, అవిరళం = అంతరములేక యుండునట్లు, బద్ధఇవ = చుట్టంబడినవాఁడువోలెను, నిర్భరేణసంపూర్ణమగు, దుగ్ధస్రోతసా = పయఃప్రవాహంబుచేత, స్నపితఇవ = అభిషేకింపఁబడినవాఁడువోలెను, స్ఫారితేన = విస్తరింపంబడిన, చక్షుషా = కన్నుదోయిచే, ప్రసభం = బలాత్కారముగ, కృత్స్నః = పూర్ణముగా, కబళితఇవ = మ్రింగఁబడినవాఁడువోలెను, సాంద్రేణ = నిరంతరమగు, అమృతమేఘేన=అమృతమువర్షించుమేఘముచేత, సిక్తఇవ = తడుపఁబడినవాఁడువోలెను, అయ్యెను.

తా. ఈకాంతామణి తలఁచనితలంపుగఁ జిరకాలప్రార్థితుం డగుప్రియతముండు తనకుం గనంబడిన నత్యుల్లాసంబునొంది హర్షపరవశయై యాశ్చర్యంబుం జెందుచుఁ బ్రీతివిస్తారితంబు లయిననేత్రంబులచేఁ జూచునప్పు డతిధవళంబు లయినకన్నులకాంతులు చాలుగట్టి వానిపయిం బడుటచేతఁ దెల్లతామరపువ్వులమాలిక నెడ తెఱపిలేక చుట్టుకొన్నట్లును, పరిపూర్ణమగు పయఃప్రవాహము వెల్లివిరిసి యతని ముంచినట్లును, విషయం బధికమధురం బగుటం జేసి యతని హాఠాత్కారముగఁ బూర్ణముగ మ్రింగినట్లును నిరంతరముగ నమృతమువర్షించుమేఘము గ్రమ్ముకొని తడిపినట్లును కరం బీయతివహృదయంబునం గల ప్రణయరసవిశేషంబు ద్యోతిత మగుచున్నది యనిభావము.

సుశోభింగుచుఁ బ్రీతివిస్ఫారితంబు లగులోచనకమలంబుల, నానందబాష్పబిందుబృందంబు ధారలు గట్టి దర్పణతలంబులం బోలుగండతలంబులఁ బడి సెదరి యుత్తరీయంబు దడప నావరానిప్రేమభరంబున నావిరజాంబుజ నిట్లు వర్ణింపఁ దొడంగెను.

* శ్లో. భూవిక్షేపణరక్తరక్త మభవత్తే పాదపద్మం శుభే
మధ్యో యం కుచకుంభభారనమితః క్లాంతో భవత్కామిని
మ్లానం తే ముఖపంకజం శ్రమజలశ్రీరాజిఫాలస్థలం

అని యీవిప్రవటువు వర్ణింపం దొడంగినం గాంచి భోజభూపతి తనమనంబునఁ గట్టా! వీఁడు మదీయసన్నిధానం బనియుఁదలంపక సుచిరకాలంబున కీవిరజాంబుజం

---

* పూర్ణమగుశ్లోకము.

శ్లో. భూవిక్షేపణరక్తరక్త మభవత్తే పాదపద్మంశుభే
మ ధ్యోయం కుచకుంభభారనమితః క్లాంతో భవత్కామిని
మ్లానంతేముఖపంకజంశ్రమజల శ్రీరాజిఫాలస్థలం
భ్రామ్యంత్యాస్తవ దేవి వాణి దధి విక్రేతుం కఠోరాతపే.

టీ. శుభే = ఓమనోజ్ఞురాలా! తేపాదపద్మం = నీయడుగుదామరలు, భూవిక్షేపణరక్తరక్తం = పుడమియందడుగిడుటచేఁగరముగందిరియెఱ్ఱనివి, అభవత్ = అయ్యెను. అతిసుకుమారము లగుటచే స్వభావరక్తము లయి యొప్పునాయడుగులు కర మెఱుపు మీఱిన వయ్యె ననుట. కామిని = ఓకాంతా! అయంమధ్యః, ఈనడుము, కుచకుంభభారనమితః = కుచకలశములభారమునకు వంగియుండునది; క్లాంతోభవత్ = బడలికంజెందినదయ్యెను. పయోధరభారమునకుం దొలుత బడలియుండులేనడుము నడిచినశ్రమముచేఁ గడు బడలికంజెందియున్నదనుట. తే = నీయొక్క, ముఖపంకజం = మోముదామర, శ్రమజల శ్రీరాజిఫాలస్థలంసత్ = శ్రమమువలనంబొడమినచిఱుచెమటలచాలుచే నందగించులలాటంబుగలదియై, మ్లానం = వాఁడినయది.

దేవి, వాణి = ఓదేవివైనసరస్వతీ! కఠోరాతపే = కడుఁగ్రూరమగునెండయందు, దధి = పెరుగు, విక్రేతుం = అమ్ముటకు, భ్రామ్యంత్యాః = తిరుగుచుండెడు; తవ = నీకు, పాదపద్మము పుడమినిడుటచే నతిరక్తం బయ్యెననియు, లేనడుము క్లాంతం బయ్యెననియుం ముఖపంకజము చెమర్చె ననియుం నన్వయించుకొనవలయును.

తా. రాజకుమారుఁడు తనప్రియురాలిని వర్ణించినవర్ణనావిశేషము కవి కడపటి పద్య పాదముచేత పెరుగమ్ముకొనం బరిభ్రమించుచువచ్చినసరస్వతియం దుండునట్లు వర్ణించి శుభే, కామిని యనుసంబోధనపదములకు విశేష్యవాచకముగ వాణి యనుపదమును జెప్పి సరస్వతిపర మగునట్లు వ్రాక్రుచ్చె.

గాంచినయుత్కంఠావిశేషంబును దెలుపుచు నించుకేనియు భయంబు లేక వర్ణింపంగడం గెను. వీని నీయపరాధంబునం జేసి పట్టి దండింపవలయు నని క్రోధోద్దీపితుండై యతివిశాల ధవళంబులై నకనుదమ్ములందు రక్తకాంతులు గ్రమ్మఁ బ్రస్ఫురితాధరుఁడైన నప్పు డవి గాంచి కాళిదాసుండు తనమనంబునం దీభోజుండు తనకూఁతువిషయంబున నితఁడు జరిపి యుండు మహాపరాధంబు పరోక్షంబున విని వీనిం దండించుట కను వారసి లీలావతికి మనస్తాపం బుపశమింపం జేయ వేఁడి ప్రత్యక్షంబున నపరాధంబుఁ గాన్పించి తనమనో వ్యాధిని జక్కం జేసికొన నెంచి బ్రాహ్మణభోజనవ్యాజంబున నీశ్రుతశ్రవుని బిలిపించి విరజాంబుజాదర్శనంబున మైమఱచియుండు నావిరహికుమారుండు వచించినరాజకుమా రికావర్ణనంబు ప్రత్యక్షాపరాధముగ నిర్ణయించుకొని యావిప్రకుమారుని దండింప సంభ్ర మించుచున్నవాఁడు. ఈకపటం బెఱుంగక యున్మత్తునిభాతి యీతఁ డిందుబింబాననను వర్ణించినవాఁడు. ఈకుమారుని మోహమువలన నీపద్యచతుర్థభాగము నిర్గత మగునంతలో వీనికి శిరశ్ఛేదనం బాజ్ఞాపింపకపోఁడు, అట్టయిన నీతపస్విని యియ్యెడన తనప్రాణంబులు వారును. ప్రత్యక్షాపరాధదర్శనంబున నాగ్రహాగ్రస్తుండై యున్నవాఁ డంతియ కాని యీరాజు తదనంతరము తనకూఁతుకుఁ గలుగునవర్థంబుఁ జూడ నోపక తాన యసు వులు వెసం బరిత్యజించు. అట్టయిన లీలావతీదేవియు మృతప్రాయయ. అంతట నీధారా నగరజనములు తమకుఁదామ యాహారాదులు మానుకొని చావ కుండరు. ఈజరిగినసంక టంబున మహానర్థంబు వాటిల్లనున్నయది. దీని నన్యథాగా వచించి ఱేనిహృదయంబునం గలజ్వరంబును బోనడంచి యావిప్రవటువును గాన నగును; అని యాలోచించి తనయిష్ట దేవత యగుసరస్వతిని మనంబునం దలంచి యావిప్రకుమారుని మోహమువలన నాపద్య తృతీయపాదము వెడలివచ్చిన వెంబడిన యాపద్యచతుర్థభాగంబును దా నందుకొని శ్లో. భ్రామ్యంత్యాస్తవ దేవి వాణి దధి విక్రేతుం కఠోరాతపే. అనిచెప్పెను. అప్పుడది విని భక్తజనులపాలిటికల్పకవల్లి యై యొప్పునాతల్లి;

సీ. సితసరోజాతసంతతుల కాంతులు దేరునతిమనోహరదేహలతికతోడ
శారదపరిపూర్ణచంద్రచంద్రికలతోఁ దులఁదూఁగఁ గలజిల్గువలువతోడ
రాజహంసవిరావరమణీయ మయి యొప్పుచరణహంసకఝుళంఝుళలతోడఁ
గుచకుంభభారసంకుచిత మై జవ్వాదునలికంపులేఁత నెన్నడుముతోడ
సజ్జవీణాక్షమాలికాహస్త యగుచు, రత్నదధిభాండ మొకటి మూర్ధమునఁ దాల్చి
పెరుగు పెరుగో యటంచు నాసరసిజాత, సంభవునిరాణి యాభోజసభకు వచ్చె.

ఇట్లువచ్చినయచ్చెలువం గనుంగొని చతుర్భుజంబులును చంద్రరేఖావతంసంబును గలిగి వీణాపుస్తకధారిణియైశారద పుండరీక షండ కాంతులం గొల్లలాడుచుండుదేహకాం

తిత్తో నొప్పునా యొప్పులకుప్పను భారతి యని నిశ్చయించి శ్రుతశ్రవకాళిదాసులు వచించిన పద్యపాదంబులందు బోధితము లయినలక్షణములు గలిగి వెలుంగుచుండుదేవిం గాంచి మహనీయుండును భక్తజనప్రసన్నుండును కవికులకమలదివాకరుండు నయినకాళిదాసునివచనంబు యథార్థంబు సేయ నియ్యెడకు నరుదెంచి యీవాణి యాత్మదర్శనం బొసంగి మనల నందఱ ననుగ్రహించినయని. ఈకాళిదాసునియందుం గలభక్తవాత్సల్యమునం జేసి వత్సంబునకుం బాలుసేఁపుధేనువు ప్రజలం దనక్షీరంబులఁ బరితృప్తులం జేయుంవిధంబున నీజగదంబికయుం నన్నద్విధులం బునీతులం గావించినయది యని యాదేవిని సంస్తుతించుచు నాసనంబులనుండి లేచి ముకుళితకరకమలులై ప్రణామంబు లొనరించి సంస్తుతులుసల్పు భోజుండు నాజగన్మాతపాదకమలంబుల కెరఁగి యానందబాష్పధారాకలితకపోలుండై సంస్తుతించి యీకాళిదాసుని సహవాసంబునఁ దనకులంబు పావనంబై సరస్వతియుం బ్రత్యక్షంబున వచ్చి యనుగ్రహించునంతటి యత్యౌన్నత్యంబునకుం జొటయ్యె నని యెంచుకొనుచుండ నాభువనేశ్వరి యెల్లవారలు చూడ నంతర్ధానంబు నొందె. పరమసాత్వికమూర్తిఁ దాల్చి కరుణామయ యగు పొడసూపెనమాయగు బ్రాణి సన్నిధానప్రభావంబునం జేసి భోజభూపాలునిమానసంబు శాంతక్రోధంబై నిర్మలత్వంబుఁ గైకొనియె. శ్రుతశ్రవుండును విరజాంబుజపై నుండుమోహంబునం గలిగిన చిత్తవిభ్రమం బడంచుకొని యంతటఁ దద్గతమానసంబును మరల్చి తాఁజేసినయవినయమునకు హృదయంబునఁ గొంకుచు లజ్జాకులితుండై మోము వంచుకొనియుండె. భవభూతియుం దనశిష్యుండు గాళిదాసు ననుగ్రహంబున జీవితుం డయ్యెఁగదా యని సంతసించి యతనిం గొనియాడెను. భోజుండును గాళిదాసునియెడం గలుగు భారతీదేవి వాత్సల్యంబుం బరికించి యతనిమహనీయత కచ్చెరువందుచు నాకవికడకుం జని ప్రమోదమేదురహృదయుండై నమస్కరించి సంస్తుతించి యోమిత్రమా నీవు నావలన నేదేని యొకవరంబుఁ గోరి నన్నుం గృతార్థుఁ జేయవలయునని ప్రార్థించిన నందు కలరి కాళిదాసుండు నోభూపతీ నీవు వరం బొసంగుట తథ్యంబేని యీశ్రుతశ్రవుని యపరాధంబు మన్నింపు మిదియ నాకోరినవరం బనిన రాజును వల్లెయని యందులకు సమ్మతించి యయ్యెడకుఁ జనుదెంచియున్న బ్రాహ్మణసంఘంబునకు మృష్టాన్నభోజనంబు లిడి యమూల్యంబులయిన వస్త్రంబులును ధనంబులు నొసంగి సంతసంబున వారివారియిండ్లకనిచెను. బ్రాహ్మణులును గాళిదాసుని యతిమానుషప్రభావంబును దీనవాత్సల్యంబును సంస్తుతించుచుం జనిరి. వింటిరే యోపండితులార యిదియ భోజభూపతితనూజాత యగువిరజాంబుజను దదీయప్రాణనాయకునిం గాచి కాళిదాసుండు ధారాపతివలన మెప్పులువడసిన చరిత్రము. ఈతని యతిమానుషశక్తియును వింటిరిగదా. ఇతండు

గాక యితరుండు విద్యాసర్వస్వవేదినిం జయింపలేఁడు. అని మిత్రసహుండు సెప్పఁగాఁ బండితులు విని పరమానందభరితులై మంత్రికుమారు నుపన్యాసశుద్ధి కత్యంతము మనంబుల నలరుచుండిరి. ఇంతలోఁ బ్రతిహారి యేగుదెంచి యుదయాదిత్యునికి జోహారు

## కాళిదాసుఁడు వసుమానసనగరమునకు వచ్చుట

రచించి దేవాధారానగరమునుండి కాళిదాసుం డనుమహాకవి మననగరోపవనంబున విడిసి తనరాక యెఱింగింప సందేశహరులం బంపెను. వారును ద్వారంబున వేచియున్నవారని చెప్పిన నుదయాదిత్యుండును దక్కినవారు నపరిమితాహ్లాదంబు నొంది యో ప్రతీహారీ! ఉదయాదిత్యుండు తనకవిపండితసంఘంబుతో నామహాకవి నెదుర్కొన నిదె వచ్చుచున్నాఁడు. మీర లాకవినియోగంబు ననుష్ఠింపఁ జనుఁడు, అని యాసందేశహారులతోఁ జెప్పునది యనిచెప్పి ప్రతీహారిం బంపి జనకుననుజ్ఞం గైకొని పురంబున సమ్మార్జనాది శోభనంబులు రచియింపం బంపి మంగళవాద్యంబులు మోయించినం బ్రతాపాదిత్యుండును గరహాయనుండును పురస్సరులై పాదసంచారంబున నేగుదేర కవిపండితసంఘంబులు బలసికొలిచి రా సువాసినులు మంగళపూర్ణఘటంబు లెత్తుకొని నడువ నచ్చరలంబోలు వెల్లాటకత్తియలు నర్తనంబులు సలుప నుదయాదిత్యుండు మిత్రసహునితో బయలు వెడలి తననగరంబునుపవనమునకుం జని యచట విడిసియుండుమహాకవిం గాంచి యతని యడుగుల కెఱఁగెను. ప్రతాపాదిత్యుండును కవికి వందనంబు లొనరించి యనర్ఘ మణిరత్నంబుల నతనియడుగులం బూజించెను. కాళిదాసుండు వారల కాశీర్వాదంబులు రచియించి యుదయాదిత్యుని కవిపండితసంఘంబువారల యథోచితవిధానంబునం గారవించెను. అంతఁ బ్రతాపాదిత్యకరహాయనసంప్రార్థితుండై కవియుం సర్వాభరణభూషితుండై కనకమయకథాసనాథంబై యొప్పుచుండుభద్రకరిపై నెక్కి యింద్రునిచే సత్కృతుం డగుబృహస్పతిచందంబునఁ దోఁచుచు నుదయాదిత్యుండు తాన యంకుశంబుఁ దాల్చి ధారుణీతలంబున నిలిచి భద్రదంతావళంబును నడిపింప నపరిమితవైభవంబుతో వసుమానసనగరంబునం బ్రవేశించెను. అప్పుడు,

సీ. మణిగణమండిత మహనీయకుండలకలిత కపోలయుగంబువాని
మృగమదపంకసమ్మిశ్రిత మలయజసాంద్రచర్చితతనుచ్ఛాయవాని
కనకదివ్యాంశుకకల్పిత ప్రావరణానూనరుచులచే నమరువాని
శృంగారరస మిట్లు రంగారఁ బరిణామ మొందెనో యని చెప్పనొప్పువాని
కవిత యారీతి దేహంబుఁ గాంచె నొక్కొ, వరవిలాసము మూర్తితో వరలె నొక్కొ
యనుచుఁ జూడఁగఁదగువాని నఖిలజనులు, కాళిదాసుని గాంచిరి కౌతుకమున.

ఇట్లు రాజసదనంబునం దాకవివర్యుండు సొచ్చి యువరాజసౌధంబున విడిసె. మజ్జనభోజనాదులెల్లం గవియుం గవిపండితసంఘంబువారును ప్రతాపాదిత్యకరహోయను లును మిత్రసహాయుండు నుదయాదిత్యునితో యువరాజసౌధంబునన నిర్వర్తించిరి. ఇట్లందఱును కృతకృత్యులై యతిమృదులచిత్రకంబళంబులు పఱచియుండుమండపంబునం గూరుచుండి యతిరూపవతులగు విలాసవతులు కనకకంకణఝుణాత్కారము భరితంబుగ సురటులు వీచుచుండ నెలజవ్వనులగు పువ్వుంబోండ్లు మడిచియిచ్చు తెలియాకుమడుపు లందుకొని విడెము సేయుచు నెల్లవారు నిష్టగోష్ఠిం బరితృప్తులైయుండ నుదయాదిత్యుని కవిపండిత సంఘంబువారు కాళిదాసునిం గాంచి యోకవివరా వింటివే యని మందలించి విద్యాసర్వస్వవేదినిచరిత్రం బంతయుం గట్టెలమోపులమ్ముకొనువాఁడు వల్కినవిధంబునం జెప్పి యాలంజెను జయించి విద్యాసర్వస్వవేదిని యనుబిరుదు దీయించినం గాని కవిపండితులగణంబున కింక గౌరవంబు దక్కదు;ఇది యవశ్యకర్తవ్యంబ యనిప్రార్థించిన వినికాళిదాసుండును వారిప్రార్థన నంగీకరించి యుదయాదిత్యునిం జూచి యోకుమారక యాకట్టెల నమ్మువానిం బిలిపింపు మన నతం డట్ల చేసినం గాంచి కాళిదాసుండు వానితో నోరీ యావిద్యాసర్వస్వవేదిని వసించియుండుసౌధంబును నీవుఁగనుంగొనియున్నాఁడవా? దాని యందుఁ గలవిశేషంబులు వినియైననుండెదవా? తెల్పు మన నాకట్టెలమ్ముకొనువాఁ డిట్లనియె. ఓమహాకవీ వినుము నేను దానిసౌధంబున నర్తనమండపమువరకుం జూచితిని. అంతదనుక నతివిచిత్రంబై దేవసభతోఁ దులదూఁగునట్లున్నది. పోనుపోను పెక్కువిశేషములతో నొప్పుచుండు నని తోఁచెడిని. ఆవిద్యాసర్వస్వవేదినిసౌధంబునం దొక్కొకద్వారంబునకు బద్యములు సెప్పుకొనుచుం బోయి యంతఃకక్ష్యాంతరంబులంజొచ్చి యచ్చటి వినోదంబులం గాంచి వచ్చినరాజకుమారులు సెప్పఁగా నందలివిశేషంబులు వినియున్నవాఁడను. ఆవిశేషంబులు నీతో విన్నవించుకొనియెదను వినుము.

## విద్యాసర్వస్వవేదినిసౌధవర్ణనము.

మహాపావనమగు నుత్తరపినాకినికిం బూర్వతటంబున నుండుసింహపురి కుత్తరపు వైపునం బురోపవనమునందు విద్యాసర్వస్వవేదినిసౌధంబు కట్టంబడియుండు. అది ప్రాకార సప్తకపరివృతంబును చతుష్షష్టిద్వారసంయుతంబు నై యొప్పు. ఆవాకిళు లొకదాని కంటె మఱియొకటి మహావిచిత్రంబులయి ప్రత్యేకవిశేషంబులతో వెలుంగుచుండును. అందు మొదటివాకిట వార్తాహారిణు లుండుదురు. అనంతరము కీలుబొమ్మ లుండునదియుం వెవ్వేఱవ్యాఘ్రములు భల్లూకములు మదకరులు కోఁతులు వేఁటకుక్కలు నుండునవియుం; వాకిళులుగలవు. అవి గడచినఁ ద్రోవకడ్డముగ నూయియుండెడువాకిలి గలదు. ఆనూతిలోఁ దిగఁగాఁ గీలుపలకలు బావిని మూసికొనును. ఆపలకలు వారు తెరిచినఁ గాని బయలు వెడలి వచ్చుట కను వుండదు. అది దాఁటఁగాఁ గుంకుమపంకంబు గలవాకిలి యుండు. దానిని దాఁటి వచ్చినవాఁడు కాళులు గడిగికొనుటకు నాలుగుపలములపన్నీరు వెండితాం

భాళమునందు నిండించి ఆవలిగట్టున నుంచియుండును. దానిం గడంచిన చిత్రమండపపువాకిలి యుండు. అం దత్యద్భుతములగు చిత్రములు కన్నుల నపహరించుకొనునవి వ్రాయంబడినమండపంబులు పెక్కులు క్రమంబున భారతరామాయణాదివృత్తాంతంబులు గలవి నిర్మితంబులై యుండు. అవి దాటినం గ్రమంబుగ జలమధ్యమండపములు స్ఫటికమహామణిమండపములు విద్యావినోదమండపము సంగీతమండపము సాహిత్యమండపము నర్తనవిలోకనమండపము నివి నిర్మించియుండు ప్రత్యేకద్వారంబులు గలవు. అవి యతిక్రమింపఁగా ననంతరము గోడిపుంజులపందెములు విడుచువాకిలియు జెట్టిపోట్లాటలు వేయువాకిలియు పొట్టేళ్లఢీకొను వాకిలియు నాటకశాలలవాకిలియు నుండును. అది యతిక్రమించి చనిన నతివిపులచతురశ్రస్థలంబున నపరిమితాకారములతో నిర్మితంబై యుండు కొలువుమండపము గలదు. దానినడుమ మదదంతిదంతనిర్మితములై స్త్రీకి వేఱుగను బురుషునికి వేఱుగను దూఁగుటుయ్యేలలవలె నమర్పంబడియుండు మణిమయమంచకంబు లుండును. అవి తలకడ యిదియని కాళ్లకడ యిదియని యెఱుంగ ననువుపడక యుండునట్లు మాఱుబాటుగ వేసి తలగడప్రక్కన నిలువుటద్దంబును గాళ్లకడనఁ గీల్బొమ్మలు నుంచంబడి యుండును. ఆమంచముపైఁ దలగడ కాళ్లకడ యెఱింగి పరుండెనేని యాకీల్బొమ్మలెల్ల గొన్ని పాదసంవాహనము సేయు, కొన్ని చేతులొత్తును, కొన్ని వీవనల విసరును, కొన్ని వక్కలాకులు మడిచి యిచ్చును, కొన్ని తమ్మపడిగెంబు పట్టును. ఇట్లు చిరకాలమతిసుఖకరముగ నుపచరించుచుండు. ఒకవేళ యనువెఱుంగక కాళ్లకడఁ దలయుంచుకొని పరుండెనేని యాబొమ్మలలోఁ గొన్ని తలఁబట్టి యీడుచును, కొన్ని కాల్మడి విడుచును? కొన్ని గోరుగును. గొన్ని దీపస్తంభము నెత్తినఁ బెట్టును? కొన్ని దీపము ముట్టించును. ఇట్టి వినోదంబులు మఱెన్నో చేయును. ఈకొలువుమండపమునకనంతర మెన్నెన్నో విచిత్రము లున్నవఁట! అవన్నియు నెవ్వరెఱుంగరు. కరముసమర్థులును బండితులు నగువార లింతదనుకఁబోయినవారల కాని దీనిం గడంచిచని తదీయహర్మ్యంబునం గల విచిత్రవిశేషంబులనైనఁ గాంచినవారు లేరు. ఇది నే విన్నవిశేషంబు లని యాకట్టెలమ్ముకొనువాఁడు సెప్పిన విని కాళిదాసుండు మహాహర్షంబుతో నిన్నియు నుండంజను! మఱెన్నో వినోదంబు లుండక పోవు. తప్పక పోయి యాయొప్పులకుప్పం జూడవలయు. దానివిద్యావైశారద్యంబుఁ బరీక్షింపవలయు నని వాక్రువ్వ సంఘంబువార లతిహర్షభరితహృదయులై యేమును భవత్సహాయులమై యాపడంతిం గెలువ నరుగుదెంచెదము. మమ్ముం దోడ్కొని యరుగు మనిచెప్పినఁ గాళిదాసుండు నోమహనీయులార యిందఱము గూడుకొని చనిన నపకీర్తి సంభవించుంగాని కీర్తిగల్గదు. ఒక పడపుంబడంతిని గెలువఁ గవిపండితసంఘంబు సనుదెంచెనని యాపురివారు పరిహాసింతురు. కాన నిందఱము సనఁ గూడదు. ఏను నీయుందయాదిత్యునిందోడుకొని యరిగి కార్యంబు సమకూర్చెదను. మీకు మోదం బొనగూర్చెదను. మీయాశీర్వాదబలంబ మాకన్నిపనులకు సహాయము. అని చెప్పి

యుదయాదిత్యునిం గాంచి యోకుమార యెల్లి యుదయంబునకు సింహపురికిం జేర్పంగల యుత్తమాశ్వంబుల రెంటిని సర్వసిద్ధంబులు సేసి తెప్పించుము. మఱియు నిమ్మపం డొకటి, దండం బొకటి, గంధకరాయియొకటి, వెదురుబ్రద్ద యొకటి, నూనియందడిసిన గుడ్డపేలిక యొకటి, నాతిస్థూలంబు గానిరాయి యొకటి, ఎఱ్ఱప్రత్తిపూలు, ఇక్షుఖండంబులు, గండు చీమలు, మల్లెపూలు, ఎండ్రకాయ, అరఁటియూఁచ ఇవిసంపాదింపం బంపు మనిచెప్పెను. ఉదయాదిత్యుండును భటులచేఁ దక్షణమ యవి రప్పించె. కాళిదాసుండును కవిపండిత సంఘంబు నిద్దకనిచి యారేయి యువరాజసౌధంబున సుఖనిద్రంగూరి రేపకడ లేచి యుదయాదిత్యునిం దోడుకొని లికుచాదులంగైకొని సింహపురిఁ జేరెను. కాళిదాసునను జ్ఞ వడసి పూర్వపుఁగట్టెలమ్మువాఁడును దురగారూఢుండై వారలకు వెనువెంటఁ దగిలి సింహ పురికిం జనుదెంచె. కాళిదాసుండు నుదయాదిత్యునిఁ గనుంగొని యోరాజకుమారబహుదిన ప్రయాణప్రాప్యమగు నీసింహదేశమున కొకముహూర్తకాలంబునన మనలందెచ్చిన యీ యుత్తమాశ్వరత్నంబులజవసత్వంబులను మిగుల మెచ్చవచ్చును. కరము శ్రాంతంబులయ్యెం. ఈగుఱ్ఱంబుల నీకట్టెలమ్ముకొనువానికప్పగించి మన మీపినాకినీనదిం దానమాడి కాల్యకృత్యంబులు దీర్చి యీయూర నొకవిప్రగృహంబున భోజనాదికృత్యంబులు నిర్వర్తించుకొని సాయంసమయంబున విద్యాసర్వస్వవేదిని యుండుహర్మ్యంబుకడకుం బోవుదము. అదిగో చూచితివా యావెలయాలిమందిరమధ్యసౌధంబుపై కనకరత్నశిఖరంబు కఠోర కిరణప్రభాభాసమానంబయి కన్నులకుమిఱుమిట్లు గొల్పుచున్నయది. పత్తనంబునంజొచ్చి యచ్చెలువయుండు నారామసమీపంబున విడియుందము. గట్టెలమ్మువాఁడు మఱియొందు చోటికిం బోవఁగలఁడు అనిచెప్పెను. అందుకు వల్లెయనిన నాయువరాజుం జూచి కాళిదాసుండు మనము సాయంసమయంబున నీవేషంబులఁ బోవఁ జనదు. కట్టెలమ్మువారివేషంబుతో దానికడకుం బోవునది. అందుకుఁగాఁ గట్టెలమ్మువానివేషము ధరించుటకుందగిన యుపకరణంబులు సంపాదించుకొని రా నీకట్టెలవాని కుత్తరువు సేయుమన నాతఁ డట్ల యగుంగాకయని యాకట్టెలమ్మువానిచేఁ జేలికలును గొడవండ్లును తీఁగెలును దెప్పించిన నవి గైకొని కాళిదాసుండు రాజుతో నగరంబునం బ్రవేశించి యొకబ్రాహ్మణగృహంబున విడిసి యభ్యవహారాదికంబుఁ దీర్చుకొనియెను.

క. అనుపమరసభరితంబై, తనరుకథాకల్పవల్లిఁ దలరుగుళుచ్ఛం,
బునఁ గృష్ణ నిను ద్వితీయం, బునఁ బూజించితిని యాచభూపతికరుణన్.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమాణమానస భారద్వాజకులపవిత్ర తిరుమలార్యపుత్ర పెరుందేవీగర్భజన్మ చిలకపాటి వేంకటరామానుజశర్మ ప్రణీతంబైన వినోదకథాకల్పవల్లియందు ద్వితీయగుళుచ్ఛము సంపూర్ణము.

శ్రీరామజయము

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# వినోదకథాకల్పవల్లి

## తృతీయగుచ్ఛము.



మంగళాచరణము

క. భక్తజనసార్థపాలన, సక్తాత్మక కాదిరాజసంస్తుతసుయశో
వ్యక్తికి రాధాకమలా, రక్తుని కభివందనంబు రక్తి నొనర్తున్.

### కాళిదాసుండు విద్యాసర్వస్వవేదినికిం గట్టెలమ్ముట

ఇట్లు కృతాభ్యవహారులై యిరువురును గొంతతడ వొకయెడవిశ్రమించి సాయంసమయంబగుట లేచి తమవేషంబులు పీడ్చి మసిపేలికలు గట్టి, తీవెలు తలకు మొలకు దిండుగాఁ జుట్టి యందుం గొడవండ్లు దోఁపుకొని కట్టెలమ్మువానివేషములు దాల్చిరి. అందుఁ గాళిదాసుండు చీమలు మొదలగువానిని బదిలముగ మొలబట్టుం గట్టుకొని యరఁటియూఁచలు మోపుగట్టి తలపయిం బెట్టుకొని రాజకుమారుని వెంటఁ దోడుకొని వెడలి విద్యాసర్వస్వవేదినియుండుసౌధము నిర్దేశించుకొనిచని దరియం జొచ్చి యామందిరముఖద్వారము నెదుట నిలిచి యయ్యెడ నుండువార్తాహారిణుల సంగుడుదుడుపులను దేసికలను గాంచి,

క. మోపో కట్టెలమోపో, రూపవతులు విలువుచుకొనుఁడు రుక్మ మొసఁగి తా
మోపెట్టెఁ గాయజుడు విలు, మోపుగ జవ్వనులచూపుములుకులు పర్వన్.

అని చెప్పిన నాయంగన లొండొరులమొగంబులు గనుంగొని నవ్వుకొనుచుండన్నం జూచి ముసిముసినగవులఁ గుసగుసలు వోవుచుండ నాకాంతలతెఱంగుం గని కాళిదాసుండు మొగసాలిహజారంబునం బ్రవేశించి వారింగాంచి యిట్లనియె.

చ. ఉరువిరహాగ్ని వేఁడి యయి యూనుతమిం గడు వాఁడి మీఱి యా
తరుణుల చూపుతూపుగమి దండడి మీఱఁగ వెంబడింప బ
య్యెర పయి పీచుసౌఖ్య మది యించుక గానక యున్నవాఁడ నీ
ఖరకిరణుండు గ్రుంకె నిటఁ గట్టెలు విల్చుకొనుండు గ్రక్కునన్.

అని వారల సంబోధించి చెప్పిన నతనివచనంబులందలిరసికతావిశేషంబు గ్రహించి కాళిదాసరాజకుమారులరూపంబులకు మనంబుల నచ్చెరువందుచు దూతిక లొండొరు

గతంబేమొకో? విద్యాసర్వస్వవేదినియందు నర్థిలిం గొని యీవేషంబున మన్మథవసంతులు ననుదెంచియుండుదురుగాఁబోలు! కానినాఁ డీసరసంపువచనంబు లెల్లర కెక్కడివి? వీరలు కట్టెలమ్ముకొనవచ్చినవారు గారు. నికృతిమెయి వారివేషము ధరించి యేతెంచినవారని తోఁచెడి నని యనుకొనుచుండిరి. అందుం గొందఱు చతురలు ననుదెంచి కాళిదాసుతో నో కట్టెలమ్మువాఁడా నీ వీకట్టెలు విలుచుకొమ్మనియెదవు! వీనిని మే మేల గైకొన వలయునో వచింపు మనఁ గవియు నోమనోహారిణులారా యేను బెక్కుచోట్ల నిట్లు కట్టె లమ్ముకొనుచు వచ్చుచున్నాఁడ; ఏకామినీమణులుగాని యిట్లు నన్నడిగినవారలు లేరు బళీ! మీబుద్ధిచతురతకు మెచ్చవచ్చు నని పల్కి యిట్లనియె.

చ. జత యయియుండుసొంపుఁ గనఁజాలక చూడ మనోజ్ఞమైనసం
హతతయుం లేక తప్తవరహాటకకాంతి య టన్నమాటయే
మితమయి యుండ ఘర్మహిమమిశ్రితకాలసుఖప్రదంబు లా
నతివలయూరుకాండముల కన్నిట నోడినసిగ్గుచేత శు
ష్కతఁ గయికొన్నవృక్షములకట్టెలు సూవె! కొనుండు వేడ్కతోన్.

అని చెప్పిన వారును మందహాసంబు సేయుచుం జనిరి. అంతం గాళిదాసుండు "మోపో కట్టెలమోపో రూపవతులు విలుచుకొనుఁడు" అని బిగ్గరనఱచెను. అదివిని మఱి కొందఱు ననుదెంచి కాళిదాసుంగాంచి యీకట్టెలవలన మా కుపయోగం బేమియో యని యడిగిన నందులకు మహాకవి యిట్లనియె.

ఉ. మోహము మేరమీఱ నగుమోముల ముద్దిడి శంబరారిబ
ల్గాహ మడంగఁ గౌఁగిటికిఁ దార్చి పునారతిఁ గూడునప్డు మీ
దేహలతం జెలంగుశ్రమ దీర నలం దెదుకప్పరంపుసం
దోహ మొసంగుభూజములఁ దోఁచినకట్టెలు సూవె యోలతా
బాహలు మీరు గొండు శుభభావముల న్ధన మిచ్చి వేడుకన్.

అని చెప్పిన నక్కామినులు నవ్వుకొనుచుం జనిరి. అంతం గాళిదాసుండు పెండియు, మోపోకట్టెలమోపోయని బిగ్గరనఱచెను. అంతం గొందఱుకాంత లతనికడకు వచ్చి యో కట్టెలమ్మువాఁడా వీనికింగల యుపయోగం బట్టుండనిమ్ము. ఇవి చీలుపఁబడుటకుఁ గారణం బేమి యనిన నాకవి యిట్లనియె.

ఉ. బాలల కెందు జవ్వనపుఁబ్రాయము గల్గిన దాది గాఁగ నా
గోలల పెన్రుటంపుఁదళుకుందొడలం జెలువారుపన్నెలన్
లీల హరించుచుండి యది లే దనలేక విదారితంబులై
తూలఁగఁ దెచ్చినట్టివివి తొయ్యలులార కొనుండు కట్టెలన్.

అని చెప్పిన నాకాంతలును నేమియుఁ జెప్పం జాలక నవ్వుచుం జనిరి. అంతం గాళిదాసుండు వెండియు, మోపో కట్టెలమోపోయని బిగ్గరనఱచెను. అనంతరము మఱి కొందఱు వనజాననలు వచ్చి యోరీ యివి యెండినచెట్లకట్టెలేనా! యని యడిగిన నందులకుఁ గవి యిట్లనియె.

చ. కులుకురుటంపుఁబెందొడలగోము హరించుటఁజేసి లోనఁ బెం
జలమును బూని వేగ మదసామజహస్తము లాత్మలందుఁ దొ
య్యలులతదూరుసఖ్య మభయంబునఁ గోరుచుఁ ద్రుంప వాడి వ
త్తలు నయి నట్టివృత్తములదారువు లియ్యవి కొండు వేడుకన్.

అని చెప్పిన నాపడఁతియు నించుక హసించుచుం జనియె. ఇట్లు సని యాకాంతలందఱు నొండొరులతో నేమి యీచిత్రము! ఇంతదనుక నిట్టికవితాధోరణిగలవాఁ డొకరుండైనను మనవిద్యాసర్వస్వవేదినిపొందుఁగోరి రాలేదు. మఱి వచ్చినకొందఱును మనయేలికసాని చెప్పియుండుపద్యంబునకు భావం బడిగి యది యెఱుంగలేక తత్తరింప వారిం గొట్టి తఱిమివేయుచుంటిమి. ఇట్లు ధనము గోలుపోయినవారలును దెబ్బలు దీసికొన్నవారలు నెందఱో లెక్కయిడంగూడదు. వీఁడు మాటమాటకుఁ బద్యంబు సెప్పుచున్నాఁడు. వీని నుపేక్షించి యూరకున్న మనల శపింపక పోఁడు. కాన నీవృత్తము మనయేలికసాని కెఱిఁగింప జనును. అని యనుకొని యందఱు నేఁగి విద్యాసర్వస్వవేదినిం గాంచి యోయమ్మ యెవ్వఁడో కట్టెలమ్మువాఁడఁట యొక్కఁడు తానరఁటి యాఁచలు కట్టగట్టి తలమీఁదఁ బెట్టుకొని యమ్ముచు మనయింటిమొగసాలకువచ్చి తొలుత నొకటియు నంత మఱొక్కటియుఁ బద్యంబులం జెప్పి యవి యవశ్యము విలుచుకొనుటకు మఱి కొన్నిపద్యంబులు పఠించెను. ఆపద్యంబులు విను మని యాదూతికలు కాళిదాసుండు సెప్పినపద్యంబులఁ జదివిరి. అది విని యావిద్యాసర్వస్వవేదిని యాపద్యభావములకు మెచ్చుకొనుచుఁ దనమనంబున నీకట్టెలమ్మువాఁడు దానీవేషంబుఁ దాల్చి వచ్చిన యొకకవిగాని సాధారణుండు గాఁడు. వీఁ డీవేషంబుతో వచ్చుటకు గతంబు దురూహ్యమ యయియున్నది. ఐననేమి? అలంతులకు నెఱుంగరానియొకయర్థం బడిగి వీనిం దఱిమివేయవలయు నని తలంచి యాదాసికలతో నోసీ మీర లాకట్టెలమ్మువానిపాలికిం బోయి నావచనంబులుగ నిట్లనుం డని యొకపద్యంబు సెప్పి పంపెను. వారును సనుదెంచి యోయయ్య నీవు కట్టెలమ్ముకొనం జనుదెంచినవృత్తాంతంబు మాయేలికసాని విని నీతోఁ జెప్పం దన్నమాట వినుము; అని యిట్లనిరి.

గీ. ఇద్మ మమ్మ వచ్చి యిడుములు వడనేల, యీసమిచ్చయంబు నిపుడ కొందు
రివి జనించినట్టియింపైనవృత్తంబు, చెవులకుండువుగను జెప్పితేని.

అని వారు సెప్పిన వెంబడిన మహాకవియు నౌరా యీకన్యక కరము సమర్థు రాలుగాఁ దోఁచుచున్నది యనియనుకొని యిట్లు వచియించె.

* చ. మునివరుఁ డాత్మఁగోరి నవమోహనరూపను బెండ్లియయ్యె నా
యనుపమరూపచూపుగమియట్టులు పల్కులు వాఁడి యయిన నా
యనఘుఁడు కోపకీలికిని నప్పుడ యాహుతిచేసి కన్యకా
జనకునిప్రార్థన న్మరలఁ జయ్యన దీని సృజించె నెచ్చెలీ.

అని చెప్పిన నాపద్యంబుం గొనిచని వార్తాహారిణులు విద్యాసర్వస్వవేదినికిం జెప్ప నామెయు బెండుపడి తనమనంబున నీకట్టెలమ్మువాఁడు కడు సమర్థుం డని తోఁచె డిని. వీనివచనంబులచేతన వీనిభావంబు ప్రతిహతంబు సేయం జనును. అందుల కీవెరవరి యేమిసేయం గలండో! కనుఁగొందము అని చింతించి యాకన్యకలతో నోసీ నేఁ జెప్పిన మాట లాకట్టెలమ్ముకొనువానికి మరలఁ జెప్పుఁ డని యర్థపద్యంబు వచించిన నది గొని వార్తాహారిణులు కవికడకుం జనుదెంచి యోరీ మాయేలికసాని నీకుం జెప్పుమన్నమాట విను మని యిట్లనిరి.

క. మునిశాపపాపపాత్రతఁ, గనియుండెడువస్తుచయము గాదు కొనంగా

అని చెప్పిన నది విని కవి యిట్లనియె. ఓసీ దాసికలార మీయేలికసాని నుడివిన పద్యపూర్వార్థంబున కుత్తరార్థంబు వచియింతు; నది దానికిం దెల్పుఁ డని యిట్లు నెప్పె.

క. ఘనమానితహోమహుతభు, గ్జనితమహాశుద్ధిగలది చనుఁ గొన నబలా.

అని వచియింప దాసికలు విద్యాసర్వస్వవేదిని కడి నుడివి యది వెండియు బదులుసెప్పినపద్యంబుఁ గొని వచ్చి యిట్లనిరి. ఓరీ కట్టెలమ్మువాఁడా నీచెప్పినపద్యంబున కుం బ్రతిపద్యం బొక్కటి విద్యాసర్వస్వవేదిని సెప్పిపంపినయది విను మని యిట్లనిరి.

క. లోనఁ దడియుండుఁ బచ్చివి, జానుగ మండ వివి పొగయుఁ జానలు కొనుఁడం
చానికిఁ గూనెడ వేఁట న, జ్ఞానివి పోపొమ్ము సుకవిజాలము దెగడుకా.

అని చెప్పఁగా విని కవియు రెండవకత్యంబుఁగడఁచి యి ట్లనియె.

---

* పూర్వము దూర్వాసమహాముని యొకమునికూఁతును గందళి యనుదానిని బహురూపవతిం గాంచి మోహించి యాకన్యకం దన కిమ్మని యడిగిన దానిజనకుండు బుషికాయము నొసంగె. ఆకన్యక వాగ్దుష్టగావున నాదూర్వాసోమునిని దిట్టుటకుం గడంగినం గుపితుండై మునివరుండు దానిని భస్మమై పోవునట్లు శపించె. అంత దానిజన కుఁడు బుషినిఁ బ్రార్థింప నాకందళిని గదళిగా నుద్భవింపఁ జేసె. అదియె యీయరఁటి. అనునీపురాణకథ యిచ్చట ననుసంధేయము.

గీ. చాల నెండిన దీమోపు జాలకముల, మార్గమునఁ బోవుఁ బోగయును మానవతుల
కసితసరసిజనేత్రల కాఁగి మండుఁ, దనువిలగ్నలు కట్టెలు గొనుఁడు మీరు.

అని వచించిన నావార్తాహారిణులాపద్యంబును నేర్చుకొని చని విద్యాసర్వస్వవేదినికిం జెప్పఁగా నది విని యామగువ యతనికవితాసారస్యంబునుం గొనియాడి తన మనంబున నీతఁడు మంచివిద్వాంసుండును లక్షణ మెఱింగినవాఁడు నై యున్నాఁడు. కవిత్వము రసగుంభితమయి యున్నది. వీనితో మనము కెట్టింప గూడ దని తోఁచెడిని. ఇంతదనుకఁ గన్యాత్వమునకు భంగము లేదని యశంబు సంపాదించితిని. ఇప్పు డితం డేకారణమున నిచ్చోట కేతెంచెనో తెలియదు. వీఁడు మనలం బరిశోధించుటకు వచ్చి యున్నవాఁడని తెలియుచున్నది. అయిననేమి? వీనిసామర్థ్యంబు నంతయుఁ జూచెదము. ఈకక్ష్యాంతరములు దాఁటుకొనుచువచ్చునప్పటి కితనికి భ్రమప్రమాదంబులు పుట్టి తప్పి పోకుండునా! అట్లు దాఁటివచ్చినను నాతోఁ గవితాప్రసంగంబునం దోడక పోవునా! మనకంటె నధికుఁ డని యేర్పడిన నప్పటికిం దగినవెర వూహించుకొనవచ్చును. అని యెంచి కవినుడివిన పద్యంబునకుం బ్రతిపద్యంబుఁ జెప్పి పంపిన నాదూతికలును నను దెంచి కవితో మాయేలికసాని నీతోఁ జెప్పుమన్నపద్యంబు విను మని యిట్లు నెప్పిరి.

గీ. ఇంచుపాల్గార నతికి యెండించి తెచ్చి, కాలఁ దాఁచుచు మోపుగాఁ గట్టినావొ
చాలఁ బోగయునె చెపుమ నిజంబు గాఁగ, వాకిటికి నీవు నను దెంచి వరలుమతిని.

అని వారలు నెప్పగా విని కాళిదాసుండు మూఁడవద్వారంబునం జొచ్చి యావిద్యాసర్వస్వవేదినిపద్యంబునకుఁ బ్రతిపద్యం బిట్లని చెప్పె.

గీ. మించుబోడిరో యార్ద్రత యించుకైన
లేదు మర్మరమయి యిది లేమ దోఁచు
రాత్రి గాఢాంధకారంబు రాక మునుప
వేడ్క మెయి వచ్చి యీమోపు విలుఁచుకొనుఁడు.

అని చెప్పిన నాపద్యంబు వార్తాహారిణులు విద్యావేదినికిం జెప్ప నదియును,

ఉ. కట్టెలు కట్టెలో యనుచుఁ గంటకుఁ డియ్యెడ గూయ సాఁగె లో
గుట్టెఱుఁగంగ మీరు సని కూళను గన్గొని వేడ్క మీఱ నా
కట్టెలవిల్వ యెంత యని కాంతలు గ్రక్కునఁ బ్రశ్నచేసి యా
కట్టెలవానియుత్తరముఁ గౌతుక మొప్పఁగ నాకుఁ దెల్పుఁడీ.

అని వచింప నయ్యది వార్తాహారిణులు కవికిం జెప్పిన నతం డైదవవహాద్వారంబుఁ దాఁటి యి ట్లనియె.

క. లలనామణులారా యీ, యిలఁగలకవివరులు దీని కేర్పఱచిరి నా
తలమోపెడుకట్టెలకుం, గలవిలువ వినుండు వేయిగద్యాణంబుల్.

అని చెప్పుకొనుచు నాయిపద్వారంబుకడకుం జేరెను. ఈపద్యంబును దూతికలు విద్యావేదిని కెఱింగింప నది విని యితఁడు మంచివిద్వాంసుం డనుటకు సందియము లేదనియనుకొని యాయింతి పడంతులతో ని ట్లనియె.

ఉ. పచ్చిద యీసమిచ్చయము బాగుగ నుండదు భూమిఁ జిత్రమీ
యిచ్చకు మేర లేదో యిది యింతటివెల్వకుఁ దాళనే బళా
గ్రచ్చరఁ బోయి దీనికిని గల్గినవిల్వ నిజంబు గాఁగ నా
ముచ్చును జూచి మీ రడిగి ముద్దియలార వచింపుఁ డాదటన్.

అని చెప్పి పంప దూతికలు వచ్చి కవికది యెఱింగించిన నాకట్టెలమ్మువాఁడును సప్తమకక్ష్యాంతరంబు గడఁచి యిట్లనియె.

గీ. వేయి గద్యాణములె దీనివిలువ గాదు, అన్న మటుమీఁదఁ గూరలు నాస నిడఁగ
వలయుఁ మునునేను నెప్పినవచనములకు, భేదము వొసంగునే నిరుపేదలార.

అని చెప్పఁగా విని వార్తాహారిణులు సని విద్యావేదిని కది విన్నవింప యాకాంతయుఁ విని స్వాంతంబున సంతాపంబు నొందుచు వచ్చినవన్నియుఁ రానిమ్ము చూత మనుచు నాదూతికలచేత వేయివరహాలును సేరుబియ్యము నుప్పు మిరపకాయలు కూరలు మిర్యాలు మొదలగునవి యిచ్చి యివి యాకట్టెలమ్మువానిచేత నిడి వాఁ డిందుకు వేయువస్తువుల వేయించుకొని వాని నంపివేయుఁడు. అని చెప్పిన నవ్వారలు వేగవచ్చి వేయివరహాలును బియ్యము మొదలగువానిఁ గట్టెలవానిచేతి కిచ్చి కట్టెలు వేయు మని యడిగిరి. వారడిగిన ప్రకారము తనతలనుండు మోపు నెనిమిదవవాకిటఁ బడవేసి యయ్యెడ నిలువంబడి యుండు నంగడుముడుప్రులం బిలిచి మరల నావేయివరహాలు వారిచేతి కిచ్చి బియ్యము లోనగువాని నొసంగి యీధనము నీరాత్రి మీయేలికసానికి భోగముగఁ బెట్టుకొను మని చెప్పుఁడు. ఈబియ్యము వండి యీరాత్రికి నాకు భోజనము పెట్టునదియని నానుడివిన మాటగా వచింపుఁడు. అని చెప్పి యందు కొకపద్యంబును వచించెను.

ఉ. మిండతలార యీధనము మీయలయేలికసానికిచ్చి యో
యండజయాన భోగమున కాదటఁ గట్టెలనమ్మువాఁడ యిం
దుండి యిదిచ్చి పంపె నని యూర్జితరీతిని బల్కరించి యీ
తండులరాశి కన్న మిడ దానికిఁ జెల్పుఁడు రాత్రివేళకున్.

అని చెప్పిన వార్తాహారిణులు విద్యాసర్వస్వవేదినికడకుం జని వేయివరహాలును బియ్యము మొదలగునవియు నొసంగి కట్టెలమ్మువాఁడు వచించినపద్యముం జెప్పిన నాకాంతయుం నది గనుంగొని విచారగ్రస్త యయి యొకించుకసేపు పొడలెఱుంగక యుండి తెలిసి యిది యేమొ క్రొత్తవిధంబుగ నున్నదే యనుకొనుచుఁ దలయూఁచి దనదాసికలం బిలిచి

యోదాసికలార మీర లీధనమును ధనాగారంబునం జేరిచి బియ్యము మొదలగువానిని పాకశాలకుం గొనిచని వండింపుఁడు. మఱియు నాకట్టెలమ్ము వానిని మనయింటివాకిటి యరుగుపయిం గూరుచుండు మని చెప్పి యచటనతఁ డుండి యేమి వచించునో దానిని మీరలెఱుంగనివారువోలె నిటునటుఁ దిరుగుచుఁ బోవుచు వచ్చుచుం దెలిసికొని నాకతి శీఘ్రమున దెల్పుఁడు. అని చెప్పి పంపెను. ఆదాదులును ధనమును బొక్కసంబున నునిచి బియ్యము పాకశాలకుం గొని చని వంటకత్తెలచేతి కిచ్చి వండం గట్టడచేసి కట్టెలమ్ము వానికడ కలిక్వరితగతి నేఁగుదెంచి యెవరయా ఇక్కడ! ఈవాకిటియరుగుపైఁ గూరు చుండుఁడు. అని చెప్పి తా మేమి యెఱుంగనివారువోలె నిటునటు సంచరించుచుండిరి. కవియుం వారియాజ్ఞకు లోఁబడి యరుగుపయిం గూరుచుండెను. ఆయరుగుకెదుట నొక చింతచెట్టును దాఁటిచెట్టు నొకచోటం బుట్టి పెరిగి యారెండు నేకముగఁ బెనఁగికొని యుండెను. ఆసమయము సూర్యాస్తమయకాలము గాన నావృక్షముపయి నొకకొంగ వచ్చి చేరెను. ఆకొంగను గాంచి మహాకవి యిట్లనియె.

గీ. చింతతాఁటిపైనఁ జేరినయోకొంగ, చింత యేల నీకుఁ జెలిమిఁ దెల్పు ।
కాంతతోడఁ బొందు గాకుండ మము నెడఁ, బాపువారె మిమ్ముఁ బాపినారొ.

అని వచించిన వార్తాహారిణులు విద్యాసర్వస్వవేదిని కది వచింప విని యాచెలువ యాకట్టెలవానినిఁ దొమ్మిదవకట్టులోనికిం బిలుచుకొని వచ్చునది యని యాజ్ఞ సేయ దాదులు నట్ల యొనరించిరి. అయ్యెడ మంచు మించి యుండుచోటు గాన నాకట్టె లమ్ము వాని వేషముధరించిన కాళిదాసుండు దా నిట్లనియె.

గీ. సూదిమొనఁ గూర్చుముత్యాలసొబగు గాంచి, వీచుమంచునఁ జలి మేన విస్తరిల్లె
కాంత నీయుఱికులుకుఁ జన్గవఁ దలంచి, వెతలు వడఁ జేయఁ దలఁచి తీగలిని నన్ను.

అని చెప్పిన విని వార్తాహారిణులు తమయేలిక సానికడకుం జని దానితోఁ జెప్పిన నాలకించి యావిద్యాసర్వస్వవేదిని పరవుడుకత్తెలం జూచి యోదాసికలార యాకట్టె లమ్ము వాని నీవలకుం బిలచుకొనివచ్చి యెండుగడ్డితోఁ బడక వేసి దానియందుఁ బరుండు మనిచెప్పుఁ డని నియోగించి పంపిన నాశంపాలతాంగులు కవికడకుఁ జనుదెంచి యతనిని బిలుచుకొని పదవకక్ష్యాంతరంబునకు వచ్చి యచ్చట సమర్చియుండు నెండుకసవుపాను పుంజూపి యిందుం బరుండి యుండునది యని వచియింపఁ గాళిదాసుం డాకసవుసెజ్జపై నుత్తరీయముగధరించియుండు పేలికను బఱచుకొని యందుం బరుండి యిట్లనియె.

గీ. కసవుసెజ్జపైనఁ గాయమూ పడియుండు । కొంగు మీఁదఁ బఱచుకొని కదంకఁ,
బూలసెజ్జపైనఁ బొలఁతితోడఁ బరుండఁ । గలుగు నీకొకింత కష్టపడిన.

అని వచింపఁగా విని సత్వరంబుగం బోయి పెగ్గడికత్తియ లాకన్యకాశిరోమణి కిం దెల్ప నావిద్యాసర్వస్వవేదినియును నది వినియోనాప్రాణసఖులార మీరలు శీఘ్రంబున

నఱిగి వానినీవలనికిం దోడ్తెచ్చియొకచాపయుం గసవుదిండు నొసంగి పరుండు మనుఁడనఁగా వారలు నట్ల యని వచ్చి కవిం బదునొకండవకక్ష్యనకుం బిలుచుకొనిపోయి యాచాపపయిం బరుండుమనన నతఁడు వచ్చియట్ల యొనరించి యిట్లువచించె.

క. కఱకఱలాడెడుపానుపు, గుఱి సేసినకసవుదిండు కుతుకంబున నా,
మఱదండ్రు సేయుసెయ్యపు, నొఱపులు హృదయమునఁ బాయ కుండవె యెపుడున్.

అని పల్కిన విని దూతికలు విద్యాసర్వస్వవేదినికిం దెల్ప వారలతో నోదాసికలార యాకట్టెలమ్మువానిని బండ్రెండవకక్ష్యకుం గొనివచ్చి యొకయీఁతచాపయుం దిండు నొసంగి పరుండు మని చెప్పుఁడు అనిన వార లట్లు కవిం దోడ్తెచ్చి ద్వాదశతమకక్ష్యయందుం బరుండం బెట్టినం బండుకొని కవి యిట్లనియె.

ఉ. దోమలకాటు పెల్లెసఁగ దూఁకొనుచుం జలిగాలి వీవఁగాఁ
గోమలియుండుమన్న యెడఁ గుందుచు నేఁ బడియున్నవాఁడ నా
రామరుటంపుఁ బెందొడల రాగము మీఱఁగ నంటఁ జాలమిన్
వేమఱు నాతొడల్ దడవి వేసరుటల్ విధి గానకుండునే.

అనిన నచటికన్యకలు విని తమయేలికసాని కెఱింగింప నాయువిద యతఁడు గొప్పవిద్వాంసుండుగాని యల్పుఁడు గాఁడని యెంచి వారలతో "నతని త్రయోదశకక్ష్యయందుం బ్రవేశపెట్టి యం దొకనులకమంచము వేసి దానిపయి నీఁతచాపఁ బఱచి దిండు వేసి దానిపయిం బరుండు మని చెప్పి మనపనికత్తెలలో మిగుల నందకత్తె నొకదానిని శృంగారించి వానికడకుం బంపుఁడు అని చెప్పి పంపెను. వారలు నట్లు మంచము వేసి చాపపఱచి దానిపయిం గవిని బరుండు మని చెప్పి యొకయభినయవేదినిం బిలిచి సర్వవిధాలంకారంబులు రచించి యాకట్టెలమ్మువానికడ కంపిరి. అకులుకులాడియుఁ జనుదెంచి కాళిదాసునియెదుట నిలువంబడిన నక్కాంతం గనుంగొని కాళిదాసుండు,

క. శంభళి పోపొమ్మా యా, రంభోరువు వేష మూనిరాఁ గూడుదునే
జృంభద్వీర్యము మృగరా, డ్డింభము పుల్ దినునె యాకటికి లోనైనన్.

అని పల్కఁగా విని వినతాననయై యావనజాతలోచన సని విద్యాసర్వస్వవేదినితోఁ దెల్పుకొన నామగువ యతనిఁ బదునాల్గవకక్ష్యాంతరంబునకుం దోడ్కొనిరండు; ఒకకపృచీమంచము వేసి దానిపై యీఁతచాపపఱచి దిండు వేసి వానిం బరుండు మనినా నైరంధ్రిలలో నుత్తమురాలైనమత్తకాశినిని భూషణములిడి మంచిచీరగట్టించి వానిసరసకుం బనుపుఁ డని యాజ్ఞసేయ వారు నట్లుపదునాల్గవకక్ష్యకుం దోడ్తెచ్చి మంచము మొదలగువానిని వేసి దానియందుఁ గవిం బరుండం బెట్టి యొకకన్యకను శృంగారించి పంపిరి. అది తనకడ కేతెంచునంతలోఁ గాళిదాసుఁడు దీపవర్తిని దిగసన్రోచి యూదివ్వె

యడఁగిపోవుచుండునట్లుచేసెను. అక్కన్నియ యాఱిపోవుచుండు దీపపు వత్తిని జుట్టిన వ్రేలనెగసనద్రోఁచి యాచమురు తనతలకుఁ దడవుకొనియె. అది గని కాళిదాసుం డిది యాసర్వస్వవేదినియింటిబానిసగత్తె యని నిర్ణయించి దానిం గాంచి యిట్లనియె.

గీ. కట్టెపుల్లల నమ్మెడుకష్టుఁడైన, మీఁకు నేలిక సాని యామీననేత్రఁ,
గలయఁ గోరెడువాఁడు నిన్గలయ సమ్మతించునే యేల పోపొమ్ము మించుబోడి.

అనిన విని యాకనకగాత్రియు వినమితముఖియై లజ్జచేఁ దలయెత్తికొనలేక యచటువాసి చని విద్యాసర్వస్వవేదినికిం దెల్పఁగా నావేదినియుఁ దనపరిచారికల కాకట్టెలమ్మువానినిఁ బదునైదవకక్ష్యాంతరంబునం బ్రవేశపెట్టి తూఁగుమంచంబుపై మెత్తనిపట్టుపఱుపుపఱిచి కుతిసీతలాడ యిడి యందు వానిని శయనింపం బంపుఁడని చెప్పిపంపి తన చెలులలో మదనసేన యనునొక శృంగారవతికిఁ దాను ధరించుకొనెడి జీనిచీనాంబరంబుం గట్టించి తనభూషణము లలంకరించి తనవింజామరంబులును బంగరుకళాచికయుఁ బావ్రకోళ్లు నొసంగి దానిని గట్టెలమ్మువానివేషము దాల్చియుండుకవికడకుం బనుప నాయమయుఁ జిఱునగవుతోఁ గవికడకు వచ్చి యెదుట నిలువ దానిం గాంచి కవియిట్లనియె.

ఉ. దానిదె పట్టుచీరె గనును దానిదె భూషణజాల మెల్లయు
ద్దానివె పాదుకల్ దలఁపఁ దానిదె యీకయిసేత యంతయున్
దానివిధాన వేషమును దాల్చినదానవు దానిదానవే
చానరొ నిన్నుఁ గూడను నిజంబుగ నిల్వకు మీవు నాకడన్.

అని చెప్పిన విని యాపీనకుచాభరణంబు విఫలప్రయత్నయై దుఃఖించుచుం జని తనయేలికసానికిం దెల్పిన నాయమకు దుఃఖోపశమనంబుఁ గావించి యాచంచలాక్షి తనమనంబున నుమ్మలించుకొనుచు నచట నుండునంగుడుదుడుపులం జీరియోపడుచులార మీరలా కట్టెలమ్మువాని షోడశతమంబగు కక్ష్యాంతరంబునకుం బిలుచుకొని వచ్చి వంటసాలలో నన్నము వండి సిద్ధమయి యుండిన నాయన్నము నతని కిడుం డని యాజ్ఞసేయ వారలు నట్లు కవిం దోడ్తెచ్చి పదునాఱవకట్టునం గూరుచుండం బెట్టి యొకపుల్లతో నొకపుల్లెం దోసికొని వచ్చి కవియెదుటఁ బుల్లెలో నుడికియుం నుడకక మట్టియుం రాళ్లును వడ్లును గలిసియుండునన్నంబును వడ్డించిరి. ఆయన్నముం గనుంగొని యది యుండుసవరణ మనంబునకుం దెచ్చుకొని యది భుజించువానిపగిదిఁ దనహస్తంబు నంముంచికొని యామహాకవి యిట్లనియె.

ఉ. మూలిని ముట్టఁగా వెఱతు ముద్దసముద్దకుఁ గూటిలోపలన్
బాలికపాలు సైకతము పచ్చడి కొంచెము యాది యంత్యమున్
జాత నుటన్న లేదు మఱి సున్నముకన్న మృదుత్వ మన్న మీ
రాతిరివంటి భోజన మరాలికి సైనను వద్దు దైవమా.

అనిచెప్పిన నాచోటిదాసికలు వచ్చి యన్న మెట్టున్నది యని యడిగిరి. అందుకుఁగవి,

గీ. కట్టె లిసుము వడ్లు ఘనమైనజొన్నలును, చెత్త యంతఁబట్టి చెప్పనొప్పు
నడవి యుదధితీర మనువైనవాకిలి, కొండ మెట్ట యుద్ది కూటి కగుచు.

అనిన మఱికొందఱు వచ్చి మాయేలికసాని తన నేర్పేర్పడ వండించినది యీ యన్నంబని పల్కినఁ గవి వెండియు నిట్లనియె.

క. ఒకటాయి రెండుపడ్లును, బ్రకటితముగ నిసుము మూఁడు బలుబియ్యము నా
ల్గిఁక నా కల మైదుగ నా, నిక వండించినపడంతి నేర్పేమందున్.

అని చెప్పి యాయన్నము నటు ద్రోసివేసి యావల నుండెను. వార్తాహారిణులది విద్యావేదినికిం దెల్పిరి. అది విని యామగువయుం నాకట్టెలమ్మువానిం గొలువుమండపమునకుం దోడ్కొనిరం డని నియమింప నాదాసికలును చని యాయయ్య నిస్సం గొలువుకూటమునకు వచ్చి యుండునట్లు మాయేలికసాని యానతి యిచ్చె నని చెప్పినఁ గట్టెలమ్ముకొనువాని వేషంబుధరించియుండుకాళిదాసుండు వల్లె యని చనుచుఁ బదునేఁడవకట్టునం బ్రవేశింప నయ్యెడఁ గీలుబొమ్మలు పెక్కు లొక్కుమొగి నేఁగుదెంచి తన్ను మూఁగికొనినం గాంచి చేతనుండుదండంబునఁ బ్రహారింపఁగా నవి యెల్ల వికలంబులై నేలం గూలెను. అది దాఁటి పదునెనిమిదవకట్టునం బ్రవేశింపఁగా నయ్యెడ నిరుప్రక్కలం బులులు నోళ్లు దెఱచుకొని గాండ్రించుచుఁ దనపైకి రాఁగాఁ గవియు నెఱ్ఱప్రత్తిపూలా వ్యాఘ్రములముందట వేయఁగా నాశార్దూలంబులు వానిని మాంసంబు లని యెత్తుకొని చనియెను. ఆవాకిలి దాఁటి పందొంబదవకట్టునం బ్రవేశింప నయ్యెడ నుభయ పార్శ్వంబులను భల్లూకంబులు వెఱతెంచి పయికిం గవిసినఁ గవియుఁ దనచేత నుండు గంధకపుఱాతిని శిలాస్తంభంబునం దగులునట్లు విసరివేయ నం దగ్ని యుదయించుడు నాయెలుంగులు కలగుండువడి చనియె. ఆవాఁకిలి గడఁచి యిరువదవకక్ష్యాంతరంబునం బోవుచుండ నిరువైపులను మదపుటేనుంగులు ఘీంకారంబులు సేయుచుఁ దొండంబులెత్తుకొని యతనిపయికిం బాఱుతెంచినం గని కవియుఁ దనకరంబున నుండునిక్షుఖండంబులు గజములకరంబుల కందిచ్చెను. అవి వైకొని యాదంతులు సంతసంబునం జనియె. అయ్యెడ వాసి యిరువదియొకటవ కక్ష్యాంతరంబునందుం బ్రవేశింపఁ గోఁతులు పెక్కులు పయిం బడవచ్చెను. కవియు వాని ముందటఁ గండుచీమలను కర్కటంబును విడిచిపెట్టెను. వానిం గాంచి వానరంబులు మానసంబున భయంపడుచుం దొలంగి చనియె. అచ్చోటు గడఁచి యిరువదిరెండవకక్ష్యాంతరంబున జొచ్చిన నచ్చట జాగిలంబులు కొన్ని యతనిం జుట్టుకొనియె. కవియుఁ దనచేత నుండుమల్లెపూల వానియెదుటఁ జల్లెను. అన్న మని యెంచి యాకుక్కలు మూర్కొనుచుండెను. ఆస్థలంబును బాసి యిరువదిమూఁడవకట్టు లోనం జొచ్చునెడఁ ద్రోవ కడ్డముగ నొకనూయి యుండఁగాఁ గాంచి దానిఁ గలయ నిరూపించి యిందులో దిగికాని యావలికిఁ జనుటకు శక్యముగాదు; దీనిలోఁ దిగఁగా నీ

వాపికాద్వారంబును పలక యొకటి యావరించుకొనును; లోపలికిం దిగినవాఁడు తప్పించుకొనునుపాయంబు దొరకదు; అని తెలిసికొని తనయెత్తుకొనివచ్చిన పెనుతాటిబండ నందులోఁ బడవ్రేయ నావాపికాద్వారంబు నొకఫలక మావరించుకొనియె. దాని మీఁదుగా నడిచి కవి యవ్వలికిం బోయెను. ఇరువదినాల్గవకట్టునం జొచ్చిన నయ్యెడఁ గుంకుమపంకంబు నిండియుండు త్రోవ గనం బడియె. అప్పు డామహాకవి తాఁగొనిచనిన నూనెపేలికలతోఁ గాళ్లు దుడుచుకొని యాపంకంబునం దిగి నడిచి యవ్వలికిం బోయి పాదంబుల నించుకించుకఁ దగిలియుండు కుంకుమపంకంబును వెదురుబద్దలచేఁ దుడిచివేసి యయ్యెడ వెండితబుకున నుంచియుండు రెండు పలములపన్నీ రెత్తుకొని దాన సగముఁ గొని కాళులు గడిగికొని తక్కినసగమును దనవెనువెంటనే తెంచుమించుబోడులచేతి కిచ్చి యిది కొనిచని మీయేలికసానిశిరంబునం గ్రుమ్మరింపుఁ డని చెప్పి యావాకిలి గడఁచి యిరువదైదవకట్టునం జొచ్చి పోవుచుండఁగా భారతరామాయణాదికథావిశేషంబులు వ్రాయంబడినయతిమనోహరచిత్రంబులం గాంచి యతఁడు మన మియ్యెడ నీవినోదంబులం గనుంగొనుచుండిన మార్తాండుం డుదయంబగునుగాన నియ్యెడ మసలఁ జన దని తలంచుచుఁ ద్వరితగతిం జనుచుండ వెనువెంటం జనుదెంచునంగుడుదుడుపులు కట్టెలమ్మువానితో నీచిత్రములవినోదంబులను జూఁడుము చూఁడుమని బలవంతముసేయఁగా నప్పు డాకవియు వారలతో నిట్లనియె.

చ. కులుకుమిటారిగబ్బిచనుగుబ్బలు వెల్వడఁ బైఁటఁ జార్చి క్రొం
దళుకునిగారపుందొడలదట్టములం దొలఁగించి చూపి నె
చ్చెలిఁ గనుగీఁటి దగ్గఱుఁ జేరి నిగారపుమారుచక్రపు
న్వలఁ దగిలించి సొమ్ముగొనువైఖరి చిత్ర! మిదేమి? చిత్రమా!

అనఁగా నచ్చటిముచ్చికంటులు తమదేవికడకుం జని విన్నవింప నాయన్నులమిన్నయు మనంబున నచ్చెరువందుచు నోచెలులార యతని వైళంబ దోడ్కొని రండని యాజ్ఞ సేయ నట్లు వార లరిగి కవివరుం దోడుకొని వచ్చుచుండ నిరువదాఱవవాకిట జలమధ్యమండపమునం బ్రవేశింపవలసినట్టియున నొకపలక వంతెనగాఁగల్పించుకొని చని యామండపమును దాఁటి యవ్వలి కరుగునప్పు డిరువదేడవకట్టునందు మహాస్ఫటికమండపమును జూచెను. ఆమండపము నూర్ధ్వదేశంబున నిర్మితము లయియుండుచిత్రప్రతిమలను జూచుకొనుచుం బోయెనేని యడుగునఁ జాఱుబండలపైఁగాళ్లుజాఱి పడును. కవి యది యెఱింగి వెరవునం దప్పించుకొని యవ్వలికిం జని యిరువదెనిమిదవవాకిట విద్యావినోదమండపమును దాఁటి యిరువదితొమ్మదవవాకిట సంగీతమండప మతిక్రమించి యంత ముప్పదవకట్టున సాహిత్యవినోదమండపమును గడఁచి యంతట ముప్పదొకటవకక్ష్యాంతరంబున నభినయ వినోదమండపముం గాంచి యయ్యెడఁ గోడిపుంజులయుద్ధమును బొట్టేళ్లజగడం

బును మఱియు ననేకవిధవినోదంబులను బొడఁగాంచి యచ్చటఁ దాళధ్వనులతో మర్దళవికా
వంబులతో నాటకము లాడు నెమ్మెలాడులు నభినయజ్ఞలగు కొందఱు మందయానలు నెదు
రేఁగుదెంచి స్తోత్రములు సల్పుచు నాడుటకు రాఁగా వీరలవినోదములు గాంచుచుండినం
దెల్లవారు నని యెంచుకొని యుద్దిష్టకార్యసాధనత్వరాన్వితుండై వారలం జూచి మీయా
టలు పాటలు మీయేలికసానికే చూపుఁ డని వారలకుం బసదనంబు నొసంగి యచ్చోటు
వాసి కొలువుమండపమునకుం బోవుచుండఁగా దాదులు నని విద్యాసర్వస్వవేదినితో నో
యష్టా కట్టెలమ్మువాఁ డేకత్రింశద్ద్వారంబు నతిక్రమించి యియ్యెడ కఱుదెంచుచున్న
వాఁ డని చెప్పిరి. అదివిని యామదవతి మానసంబున నచ్చెరువంది యింతకాఁపువెట్టి
యుండుద్వారంబుల నెల్ల దాఁటి వచ్చిన యీకట్టెలమ్మువాఁడు దేవుఁడుగా నుండునొప్పు
నని యెంచుచు నచ్చోటినుండి లేచి తనయుండు లోనగరునకుం బోయెను. మహాకవియుం
నాకొలువుకూటమునం బ్రవేశించెను. ఆసభామండపము చతుష్షష్టిహాటకస్తంభంబులు నిలిపి
వానిపై సమర్పంబడి నవరత్నపాంచాలికాసహస్రాంచితము గావించి చీనిచీనాంబరంబులు
గట్టియుండుటంబట్టియు నొకచో మదమయూరవారంబులు నర్తనంబులు సల్పుచు
నొకయెడ పికంబుల కలుషకంఠనినాదంబులు సేయుచు నొకయెడ రాజహంసలు మనోజ్ఞ
గమనంబుల సంచరించుచు భ్రమరకులంబులు ఝుంకారములు సేయుచు రాజకీరంబులు
మనోహరంబుగఁ బద్యముసెప్పుచు మలయానిలంబులు వీఁచుచుఁ గీలుబొమ్మలు నానావిధ
వాద్యంబులు వాయించుచు సాంబ్రాణిధూపధూమంబు లంతట వ్యాపించుచు మల్లెలుమొ
ల్లలు జాజులు పగడలు పొన్నలు మరువములు మొదలగువాసనోపకరణములు గమగమ
వలచుచు నచ్చటికిం జనినవారిమనంబుల నువ్వెత్తుగా నపహరింప నానావిధాలంకారాలం
కృతం బగుచుఁ గరంబు విరాజమానం బయియొప్పుచుండె. ఇట్టియమ్మండపంబున నవరత్న
మయంబులగు తూఁగుమంచంబులు గజదంతనిర్మితంబు లగునవి యొకటిగ జతపఱుపం
బడి కీలుబొమ్మలు బలసి సురటులు మొదలగువానిం గైకొని సజ్జములై యుండుటను
గాంచి దానిరామణీయకమున కాశ్చర్యమునొందుచుఁ దనమనంబున నీవిద్యాసర్వస్వ
వేదిని యిట్టిమహావైభవంబు దనకుఁగలదుగాననే తన కొక్కరుఁ డీడులేఁ డని గర్వంబుం
జెంది యున్నది. దీనిం జయింప నాకుం గాక యితరుల కశక్యంబ. అని యనుకొనుచు
నామంచంబులకడకుంబోయి దాని నిరూపించి యాశ్చర్యపడుచుఁ దనకరంబున స్పృశించి
యిది యపరిమితమార్దవోపేత మగుటంజేసి స్త్రీగూరుచుండునది యనియు; నందు కొంకింత
మృదుత్వమున భేదము గలదిగాన మఱియొకటి పురుషుండు వసించునది యనియుఁ దీర్మా
నించి దానికిం దలగడ కాళ్లకడ యెఱుంగుటకుఁ దనచేత నుండెడునిమ్మపండును నట్టనడు
మ నుంపంగా నది దొరలిచని కాళ్లకడ నిలిచినం గాంచి కాళ్లకడఁ గీలుబొమ్మలును తల
గడ నిలువుటద్దము నున్నవి యని నిర్ణయించి యందుఁ బురుషుఁ డధివసింపం దగుమంచం
బున నారోహించి తాను జుట్టుకొనియుండు నొకషేలికగుడ్డను విప్పి పఱచుకొని పరుం

డెను. ఆమంచంబునందు సంబద్ధము లయినవిగానం గీలుబొమ్మలు గొన్ని పాదసంవాహనము సేయఁ దొడంగెను. కొన్ని చేతులు పిసుకుట కుపక్రమించె. కొన్ని యంగవిమర్దనంబుఁ గావించె. కొన్ని మయూరపింఛికారచితాలవాలంబులును గొన్ని శ్వేతచామరంబులను ధరించి వీఁవ దొడఁగెను. కొన్ని యెదుట నద్దముపట్టుకొని నిలువంబడెను. ఇట్లు కీలుబొమ్మ లాడిగంబులు సేయుచుండఁ బరుండియుండుకవిం గాంచి యచటి యంగుడుదుడుపు లచ్చెరువొందుచుం జని విద్యాసర్వస్వవేదినికిం దెలిపిరి. ఆమానినియుం ననూనవిచారభరాక్రాంతయై యొకింతసేపటికిఁ దెలివిదెచ్చుకొని యెంతటివలంతి యైన నెలంతల మాయలం దగులుకొని కలంతఁ జెందక తనంత సమర్థించుకొనువాఁడును గలఁడే? వీఁడు నామాయలం గొన్నింటిని దాఁటినవాఁడ. అయినను మఱి దేనియందైన మోసపోఁడా? చూతము! అని తలంచి తనప్రియసఖియగు సాహిత్యసర్వస్వవేదినిం బిలిపించి దానికిఁ దనయాభరణంబు లెల్ల నలంకరించి మహాడంబరముతో నతనికడ కంపెను. అదియుఁ దనకడకుం జనుదేరం గనుంగొని కవియు నిది విద్యాసర్వస్వవేదిని గాదని నిర్ణయించి కట్టెలమ్మువాఁ డగుకాళిదాసుండు దానితో నిట్లనియె.

మ. కులుకుంగుబ్బలదాన ప్రాణసఖి వాకుంభోపమోరోజ కీ
యిల నేకాత్మలు మీరు శక్తిశివుల ట్లీ వాపెకుం దాదివే
లలి మీఱన్మదిలోఁ గరంగుచును లీల న్వాంసి నావచ్చుతో
య్యాలి తానుండగ నేల వచ్చితివి కొమ్మా నీవు పొమ్మా వెసన్.

అని యిట్లు సెప్పఁగా నాతొయ్యాలి యోయయ్య నీవు దిట్టినను గాదనం జనదు. అట్లు సేయక బహుమానముగఁ బొమ్మా యని చెప్పి పంపిన యదియ చాలు నని వల్క గృహాంతరంబునకుం బోయి యావృత్తాంతంబు విద్యాసర్వస్వవేదినికిం జెప్పఁగా నది విని మనంబున భయంబుం జెంది యిఁక నీతనికడకు మఱి యెవ్వతెనుగాని పంపంజనదు. నేన చనవలయుం నని నిర్ణయించుకొని తనతల్లియగు రతిరూపను బిలిపించి యోయమ్మ కట్టెలమ్ము వానికడ కేనెవ్వతె నంపినను గనిపట్టి నేనుగానని తిట్టి పంపివేయుచున్నాఁడు. ఇఁక నేన వానికడకుం బోవలసియున్నది. ఇందుల కేమి వచించెద వని యారతిరూప నడుగఁగా నదియు నోకూఁతురా నీవెక్కడ! కట్టెలనమ్మువాఁడెక్కడ? వాఁడు నిన్నుం గోరుట వామనుం డున్నతతరుఫలంబునకుం గేలుసాఁచుట గాదే? ఇది యెంతయుఁ దగనిపని. ఇంతదనుక నీవు విద్యాసర్వస్వవేదిని వని బిరుదు వహించి నీ కీభూతలంబున సాటిలే దను కీర్తిం గాంచి యున్నదానవు. ఇప్పుడు వచ్చియుండువానికిం దగినమగువలఁ జెఱునగవు దేఱుమొగములుగలవారలఁ గొందఱం జిన్నిలేఁబ్రాయంపువగలాడులంబనిచి వానియెదుట నాచానల నాడంజేసి యావినోదంబుం గానిసించుచుఁ దెల్లవారుదనుకఁ గాలయాపనంబు చేసి యనంతర మోరి మోసపోతివిరా యని కొట్టి తఱిమివేయినదియే గాక యాకట్టె

లమ్మువానితోఁ గలయుటయు నీకుఁ దల విధివ్రాసినవ్రాలా యేమి ? నీవు వానికడకుం బోవం జనదు. అని చెప్పఁగా విద్యాసర్వస్వవేదిని దానితో నోయమ్మ వచ్చినవాఁ డెందైన మోసపోయినం గదా కొట్టి తఱిమివేయవచ్చును. వీఁడో యెచటను దప్పిపోలేదు. లక్షణజ్ఞుఁడును మహావిద్వాంసుండును మనకంటె నతిసమర్థుండునయి ప్రతికక్ష్యాంతరంబులందును బద్యములు సెప్పుకొనుచు వచ్చినవానిని మనము మనబలముచేతఁ గొట్టి తఱిమివేసినచో భూమియం దపకీర్తిపాలగుదుము. ఇట్టివాఁడు బలంబునను మనలఁ జయించు సహాయసంపత్తి గలవాఁడయి యుండును గాని రిక్తుయయి యుండఁడు. అది లేకయుండినను వశ్యవాక్కుగానఁ దిట్టయై తిట్టిపోవును. అది యాచంద్రార్కస్థాయియై యుండకపోదు. కాన నన్యాయమున నతనిం దఱిమివేయుట తగదు. చెప్పెదను.

చ. కవిత యెఱుంగనట్టియొకకష్టుని గూడుటకంటెఁ గాంతకున్
కవికిని గొంగువేసి బలుకష్టము లందిననైన మే లగున్
భువనములందు నింబఫలపుంజము మెక్కుటకంటె నిత్యునం
భవరసధార లానుటలె భావ్య మటంచుఁ దలంపరే మదిన్.

అని పల్కిన విని యారతిరూపయు వల్లెయని సమ్మతించెను. అంత నక్కాంతాతిలకంబు నాభరణంబులు వీడిచి మజ్జనశాల కఱిగి సుగంధద్రవ్యంబులు గలసి గమగమ వలచుచుండెడి హారిద్రాచూర్ణంబు నంగంబుల నలందుకొని పన్నీటఁ జలకంబాడి చలువపావడ ధరించి కనుదమ్ములఁ గజ్జలరేఖాలంకృతములఁ గావించుకొని కలపం బలందిదాదులు నైనేయంభూషణంబులు ధరించుకొని కస్తూరితిలకంబు దిద్దుకొని సంగీతసర్వస్వవేదినికిఁ బ్రధానాలంకారంబుఁ గావించి "మరలఁ జనుదెంచెనే! యీమానినియె విద్యాసర్వస్వవేదిని యై యుండనోపు"నని యతఁ డెంచుకొనునట్లు మంగళవాద్యంబులతో వెగ్గడికత్తెలు సెప్పుకెచ్చరికలతో సంగీతసర్వస్వవేదినిని మున్నిడుకొని తా నడపకత్తె వేషమూని దానివెంబడి నిలువంబడి తెలియాకులు మడిచి మడిచి చేయిజాపి యందిచ్చుచు వచ్చెను. కవియుం నాచను దెంచినమించుబోడులలో నతిరుచిరముఖకాంతియుం ననవద్యరూపలక్షణంబులును గలయీచెలువయె విద్యాసర్వస్వవేదిని యై యుండు నని సంభావించి దానింజూచి యిట్లనియె.

*శ్లో. మధ్యం విష్ణుపదం కుచౌ శివపదం వక్త్రం విధాతుః పదం
ధమ్మిల్లః సుమనఃపదం ప్రవిలసత్కాంచీ నితంబస్థలీ

---

*అవతారిక:—కవి కాంతామణి నపూర్వవర్ణనము సేయుచున్నాఁడు. ఇం దుపమానములగు విష్ణుపదాదులకు, నుపమేయములగు మధ్యాదులకు నభేదాధ్యవసాయము, లక్షితలక్షణవలన విష్ణుపదాది శబ్దములకుం బ్రస్తుతార్థము స్ఫురించుచుండును.

వాణీ చేన్మధురాఽధరోఽరుణధర శ్శ్రీరంగభూమి ర్వపుః
తస్యాః కిం కథయామి భాగ్యసులభై ర్మాన్యా సదా నిర్జరైః

---

టీక. తస్యాః=కాంతకు, మధ్యం=నడుము, విష్ణుపదం = విష్ణువుండు శ్రీవైకుంఠము-ఆకాశము. "ఆకాశంగగనంశూన్యం" అనియుండుటంబట్టి ఆకాశపదమునకు లేనిదియనునర్థముస్ఫురించును. అనఁగా లేనదుమతిసూక్ష్మమైయుండుటచేఁ గంటికిఁగనంబడకయున్నది యనిభావము. కుచౌ = కుచములు, శివపదం=శివుఁడుండుకైలాసము-కైలాసమనునది పర్వతముగనుక దీనికుచములు పర్వతములే యనిభావము. వక్త్రం = మొగము, విధాతుఃపదం = బ్రహ్మవసించుస్థానమగుసత్యలోకము - బ్రహ్మకమలాసనుఁడు గాఁబట్టి యతఁడు వసించుస్థానమనుట. అనఁగా ముఖము కమలమేయని భావము. ధమ్మిల్లః = కొప్పు, సుమనఃపదం=దేవతలుండుస్వర్గము-పుష్పములకుంజోటు. సుమనశ్శబ్దమునకు దేవతలును బువ్వములునర్థము-అనఁగాఁగొప్పునంబువ్వులు దుఱిమియున్నవనుట. నితంబస్థలీ= కటిప్రదేశము, ప్రవిలసత్కాంచీ-ఇచట శ్లేష. ముక్తిదాయకపట్టణములలో నుత్తమముగ వెలుంగు కాంచీపట్టణము. ప్రవిలసత్ = ప్రకాశించుచుండెడి, కాంచీ = ఒడ్డాణముగలది. ఉత్తమరత్నకింకిణులుసెలంగు నొడ్డాణమును నితంబస్థలమునధరించుకొనియున్నదనుట. వాణీచేత్ = పలుకులువల్కెనేని, మధురా = మధురానగరము. ముక్తిదాయకపత్తనములలో నొకటియగు మధురాపట్టణము-అది కడుఁబుణ్యక్షేత్రము. శ్లో. అయోధ్యామధురామాయాకాశీకాంచీఅవంతికాపురీద్వారావతీచైవసప్తైతే మోక్షదాయకాః. అనియున్నది. వాణీచేన్మధురా = ఇదిమాటలాడెనేని కడు మధురముగనుండును. అధరః = మోవి, అరుణధరః = అరుణాచలము. అరుణాచలము శివక్షేత్రములలోఁ గరముముఖ్యమయినదొకటి. అది భరతఖండదక్షిణదేశముననున్నది. అరుణధరః = తొవరుమీఱియుండునది. అనఁగా నెఱుపలిశయించియుండునదనుట. వపుః = శరీరము, శ్రీరంగభూమిః = విష్ణుక్షేత్రములలో నత్యంతముముఖ్యమగు శ్రీరంగ మనుక్షేత్రము. ఇది యుభయకావేరీమధ్యగతమైనదగుటంజేసి రంగము నాఁబడును. ఇందు భగవంతుండు నెలకొనియుండి భక్తజనరక్షణము రచించుచున్నాఁడనుట ప్రసిద్ధము. కింకథయామి= ఏమిసెప్పుదును. దీనియొక్క మధ్యాదులయిన యంగములు శ్రీవైకుంఠాది పుణ్యక్షేత్రమయములుగనుండుటంబట్టి దీనిభాగ్యమేమనివర్ణింపనగుననిభావము. భాగ్యసులభైః = శ్రమములేకభాగ్యముసంపాదించినవారగు, నిర్జరైః = దేవతలచేత, సదా=ఎల్లకాలము, మాన్యా = సమ్మానింపందగినది యైయున్నది. ఈకాంతామణి యుత్తమపుణ్యక్షేత్రమయమయియుండుటంబట్టి దేవతలకుఁ గరము సమ్మానింపందగినది. నవయౌవనసంపన్నులు నపరిమితభాగ్యవైభవపరిపూర్ణులునగు రసికుల కసారతము సంభావనీయ యని భావము.

అని చెప్పినవిని విద్యాసర్వస్వవేదిని తనమనంబున నతండు మదీయలక్షణంబులు నిర్వర్ణించి వర్ణించినాఁడు. ఇతం డొనరించినయపూర్వవర్ణనము కర్ణామృతంబై యున్నది యనుకొనుచు నతనిందనవాలుంగన్ను లెత్తి క్రేఁగంటిచూపులం జూచినఁ గవి యిట్లనియె.

చ. పురహరుఫాలనేత్రశిఖిపుంజమునందుఁ బ్రదగ్ధుఁడైనయా
సరసిజబాణుఁ డుద్ధురత సారసలోచనవాలుఁజూపులన్
గరము ప్రవృద్ధిఁ జెంది యిటు గాఁటియపెట్టె బహుస్మరవ్యథా
తురు నను దైవమా కలుపు కుంభకుచాభరణంబుతోడుతన్.

అని చెప్పఁగా విద్యాసర్వస్వవేదిని యతనికవితాచమత్కృతికి మనంబున మెచ్చుకొనుచు స్త్రీగూరుచుండెడు దంతపుమంచంబుపయిఁ బ్రధానగా నేఁగుదెంచిన సంగీతసర్వస్వవేదిని గూరుచుండం దాను క్రింద నిలువంబడి తమలపాకులు మడిచి యాచెలి కందిచ్చుచుండెను. అది గని కాళిదాసుండు దానికపటచేష్టలకుం దలయూఁచి యాయడపగత్తియగా వచ్చినవిద్యాసర్వస్వవేదినిం జూచి యిట్లనియె.

* శ్లో. తాళాకారపయోధరే తనుభువ స్తంత్రాధికారక్రియే
తామ్యన్మధ్యలతే తటిత్సమరుచే తంత్రీసమాలాపినీ
తాటంకాంతతరంగితాక్షియుగళే తన్వంగి తామ్రాధరే
తారానాథనిభాననే తవ కరా త్తాంబూల మానీయతామ్.

అని చెప్పఁగా నాయడపకత్తెగా నుండు విద్యాసర్వస్వవేదిని వెనువెంట నిలువంబడియుండు నొకయుండజయాన తమలపాకుమడుపు లివ్వ వచ్చిన నొల్లనని కవి వెండియు నిట్లనియె.

---

*టీక. తాళాకారపయోధరే=తాళఫలములవంటి కులుకుంగుబ్బలుగలదానా! తనుభువః = మన్మథునియొక్క, తంత్రాధికారక్రియే = రాచతికపుంబనులయందధికారము నెల్లించుకార్యముగలదానా! రతితంత్రముజరుపుదానా యనిభావము. తామ్యన్మధ్యలతే= తీగెవలె సన్ననైకులుకుం గబ్బిగుబ్బలభారమునకోర్వఁగలేక పేదతనంబునంబొరసి శ్రమపడునట్టి లేనడుముగలదానా! తటిత్సమరుచే=మెఱుపుందీవియకొప్పయిన దేహరుచులుగలదానా, తంత్రీసమాలాపిని=వీణియయొక్క తంతితో సమానమయిన పలుకుగలదానా! తాటంకాంతతరంగితాక్షియుగళే = కర్ణాంతాయతలోచనయగుటంజేసి శ్రవణములనుండుకుండలములదనుకఁ బ్రణయరసపూరతరంగంబులు దేరుచుండు కనుదోయిగలదానా! తామ్రాధరే =ఎఱ్ఱని మోవిగలదానా! తారానాథనిభాననే = చంద్రునితో సమానమగు మోముగలదానా, తన్వంగి=సన్ననిమెయిదీఁగెగలయోచిన్నదానా ? తవకరాత్ =నీచేతినుండి, తాంబూలం = తాంబూలము, ఆనీయతాం=ఇవ్వంబడుంగాత. ఇమ్మనిభావము.

* శ్లో. రాజీవారుణచారుపాణియుగళే రాకేందురమ్యాననే
విద్యుద్వల్లిసమానదేహాలలికే మత్తేభకుంభస్తనీ
రంభోరూ రమణీయఫాలతిలకే కౌసుంభవాసాన్వితే
ముక్తాహారధరే ప్రియే తవ కరా త్తాంబూల మానీయతామ్.

అని చెప్పఁగా నచ్చట నుండుమత్తేభయానలు కవిం జూచి యోయయ్య తాంబూల మిచ్చెదుదాని వర్ణించెద వంటియ కాని తాంబూలంబును వర్ణింపక యున్నాఁడ వట్లయిన నెట్లు తాంబూలంబు లభించు నని చెప్పినఁ గవి మఱియు నిట్లనియె.

† శ్లో. కస్తూరీపరిమోదపూగశకలం కర్పూరఖండాన్వితం
ముక్తాచూర్ణసమేత మిందుకిరణైః స్వచ్ఛాయవల్లీదళం

---

*టీక. రాజీవారుణచారుపాణియుగళే=ఎఱ్ఱదామరపువ్వువలెఁగడురక్తమై మనోహరమైన కేలుదోయిగలదానా! రాకేందురమ్యాననే = పున్నమనాటిచందమామకన్న నతిమనోహరమగు మోముగలదానా! విద్యుద్వల్లిసమానదేహాలలికే = మెఱుపుఁదీవియ కొప్పయిన మెయిదీవెగలదానా! మత్తేభకుంభస్తనీ=మదించియుండు నేనుఁగుల కుంభముల వంటికుచములుగలదానా! రంభోరూ = అరఁటికంబములవోలు తొడలుగలదానా! రమణీయఫాలతిలకే=మనోహరమగు నెన్నొసట నింపైనతిలకము దిద్దుకొనియుండుదానా! కౌసుంభవాసాన్వితే=కుసుంభవస్త్రముదాల్చియుండుదానా! ముక్తాహారధరే= ముత్తియంపుంబేరులు ధరించియుండుదానా! ప్రియే=ఓప్రియురాలా,తవకరాత్తాంబూల మానీయతాం=నీచేతినుండి దాంబూలం బొసంగుము.

† టీక. కల్యే=సమర్థురాలా! కల్పలతాసమే=కల్పకవల్లితో సమానురాలా! ప్రియతమే = కరమిష్టురాలా! కస్తూరీపరిమోదపూగశకలం = కస్తురిగలిపియుండుటంబట్టి గమగమవాసించునట్టి పూగములఖండంబులతో వెలయుచు, కర్పూర ఖండాన్వితం= పచ్చకప్పురపుశకలములతో మిళితముసేయఁబడి, ముక్తాచూర్ణసమేతం = ముత్తియంపు సున్నముతోఁగూడి, ఇందుకిరణైః=చంద్రకిరణములతో, సచ్ఛాయవల్లీదళం = సమానమగుచాయలు దేరుచుండు తాంబూలీదళంబులుగలిగి, తత్తాదృశ్యదనాగమోక్తసురతప్రస్తావవిస్తారకం = మదనశాస్త్రప్రతిపాదితమగునానావిధపుసురతప్రస్తావములను విస్తరింపం జేయుచునదియయి యొప్పు, తాంబూలం = తాంబూలము, ఆనీయతాం = ఒసంగంబడుఁగాత. తాంబూలము పూర్వోక్తగుణములు గలదియనుటకుం బ్రమాణము. శ్లో. తాంబూలంకటుతిక్తముష్ణమధురం క్షారంకషాయాన్వితం వాతఘ్నంక్రిమినాశనం కఫహారం కామాగ్నిసందీపనం, స్త్రీసంభాషణభూషణంశుభకరంశోకస్యవిచ్ఛేదనం తాంబూలేజని తాస్త్రయోదశగుణాస్స్వర్గేపితేదుర్లభాః. అని వైద్యశాస్త్రము.

తత్తాదృక్షదనాగమోక్తసురతప్రస్తావవిస్తారకం
కల్యే కల్పలతాసమే ప్రియతమే తాంబూలమానీయతామ్.

అని చెప్పినవిని యడపకత్తెగానుండువిద్యాసర్వస్వవేదిని యాకులు మడుచుచు వానికి సున్నము రాయుచు నిట్టిపనులచే జాగుసేయుచుఁ గాలంబు గడుపుచుండుటం గాంచి కవి వెండియు నిట్లనియె.

*శ్లో. ముగ్ధే చంద్రవిరాజమానవదనే సంఫుల్లనేత్రోత్పలే
కాంత్యానిర్జితపద్మరాగశకలే సంసారసంజీవనీ
గత్యానిర్జితరాజహంసగమనే స్వర్ణాంబరాలంకృతే
ముక్తాహారపరిష్కృతే ఝుడితి మే తాంబూల మానీయతామ్.

అనిచెప్పఁగా విని యయ్యెడ నుండువనజాననలు సనుదెంచి యొకవివరా తాంబూలమును దానింబట్టుకొనియుండుదానిని వెవ్వేరుగ వర్ణించిరివి. తాంబూలంబును దాంబూలకరండంబుఁ దాల్చియున్నదాని నొకపద్యంబున వర్ణింపు మని చెప్పినం గవియు విద్యాసర్వస్వవేదినిం జూచి యిట్లు సెప్పం దొడంగె.

† శ్లో. త్వన్నేత్రాంచలవత్ప్రపంచితరసం త్వన్మధ్యవ స్సుక్ష్మినా
గ్రాహ్యం త్వత్కుచకుంభవన్ముఖముఖవ్యాపారలీలాస్పదం
త్వచ్చేతోవ దమందరాగజనకం త్వద్గాత్రవత్కామదం
స్వాద్విష్టంచ తవోష్ఠవత్తరుణి మే తాంబూల మానీయతామ్.

---

*ముగ్ధే=ఓముద్దరాలా! ఉదయద్యౌవనాముగ్ధాలజ్జావిజితమన్మథా, అనియున్నది. తారుణ్యశ్రీయంకురితమై=లజ్జచే మన్మథవికారంబులు బయల్పడక యుండునది. చంద్రవిరాజమానవదనే = పరిపూర్ణచంద్రునివలెఁ గాంతులుదేరుమొగముగలదానా! సంఫుల్లనేత్రోత్పలే = వికసించిన నల్లకలువలవలెనుండు కన్నులుగలదానా! కాంత్యా = దేహచ్ఛాయచే, నిర్జితపద్మరాగశకలే = పద్మరాగమణిఖండంబును జయించినదానా! సంసారసంజీవినీ = సంసారమును జీవింపజేయుదానా! గత్యా=గమనముచేత, నిర్జితరాజహంసగమనే = రాజహంసముయొక్కనడకనోడించినదానా! స్వర్ణాంబరాలంకృతే = కనకాంబరముధరించుకొని యలంకృతయైయుండుదానా! ముక్తాహారపరిష్కృతే=ముక్తాహారమయాలంకారంబులుగలదానా, మే = నాకు, ఝుడితి=వేగముగ, తాంబూలం = తాంబూలము, ఆనీయతాం = ఇవ్వంబడుఁగాత.

†టీక. త్వన్నేత్రాంచలవత్ = నీక్రేఁగంటిచూపులవలె, ప్రపంచితరసం = రసమును విస్తరింపజేయునదియై, దానిక్రేఁగంటిచూపులు శృంగారరసమును వృద్ధిసేయునది యనియుఁ దాంబూలము ఆస్వాద్యతనువిస్తరింపజేయునదియనియు నర్థము. త్వన్మధ్యవత్

అని చెప్పిన విని విద్యాసర్వస్వవేదినియుఁ గవిసామర్థ్యంబునకు నాశుకవితాచమత్కారంబునకు వర్ణనాతిశయంబునకు రసికభావనంబునకు నెద మెచ్చికొనుచు నితఁడు నే నంపియుండుశంపాలతాంగుల నెల్లర నొల్లనని పంపివేసినవాఁడు. అదియునుం గాక ప్రధానవేషంబుఁదాల్చి వచ్చియున్నదానిం గన్నెత్తియైనఁ జూడకయుండెడిని. మఱియుఁ ప్వచ్ఛబ్దంబుచేత నన్నె చూపుచున్నవాఁడు. ఇట్టి కారణంబులంబట్టి విచారింపఁగా నేను విద్యాసర్వస్వవేదిని నని యితఁ డెఱింగినాఁడనుటకు సందియంబు లేదు. పూర్వము తనకడకుం జేరినసారసనేత్రలం గొందఱఁ దిట్టియుఁ గొందఱఁ గొట్టకయు విడిచిన యాతఁడు నన్నుం గాంచి యపూర్వవర్ణనంబుఁ గావించెను. కాన నితని నిఁక మోసపుచ్చ ననువుపడదు. నాకవితాచాతుర్యంబున నోడింపనగును. అని యెంచి యాతని నెగాదిగం జూచి యోకట్టెలమ్మువాఁడా నేఁజెప్పెడుపద్యంబునకు భావంబుఁ దెల్పెదవేని నీకుఁ దాంబూలం బొసంగెదను. చెప్పలేనివాఁడ వైన నివ్వను. అనినఁ గవియు వల్లె యని యోమించుబోఁడీ నీచెప్పెడిపద్యంబులు సెప్పు మనఁగా విద్యావేదినియుఁ బురుషుఁడు వసించుమంచంబునకును స్త్రీవసించుమంచంబునకును నడుమ నీహారావరణసదృశం బయిన దోమతెరగట్టించి విద్యాసర్వస్వవేదినీత్వమునకుం దగినసర్వాభరణంబులుదాల్చి యలకంబుల మొల్లమొగ్గలు దుఱిమి సర్వావయవంబులందుఁ గస్తూరీకుంకుమాదిమిళితం బయి గమగమవలచుచందనం బలంది కాంతికలాపవిభాసిత యయి సంగీతసర్వస్వవేదిని నంతఃపురంబున కంపి యది గూరుచుండియుండిన గజదంతమయమంచంబుపయిం గూరుచుండి కవితో వివాదంబు సేయఁ గడంగి యిట్లనియె.

---

= నీమధ్యమువలె, ముష్టినా=పిడికిట, గ్రాహ్యం=పట్టుకొనందగినదియుం, స్త్రీలకుఁ బిడికిట నడంగియుండునడుముగలిగియుండుటయుత్తమలక్షణము. తాంబూలమును జేతఁబట్టుకొని విడెము సేయుటయును నది విదితమైనదియే కదా! త్వత్కుచకుంభవత్ =నీకుచకలశములవలె, నఖముఖవ్యాపారలీలాస్పదం = కొనగోళులపనులలీలల కెడమైనది. అనఁగాఁ గుచములు నెలవంకలుగలిగించునప్పుడు కొనగోళులిడుశృంగారచేష్టలకనువైనవనియు, తాంబూలము నఖముఖవ్యాపారములవలనఁ జీల్చుట సిరలెత్తుట మొదలగువానికిం దగిన దనియు నెఱుంగునది. త్వచ్చేతోవత్ = నీమానసంబువలె, అమందరాగజనకం = అధికమగురాగమును గలిగించునది. హృదయము ఆశనుగలిగించునది యనియు, తాంబూలము ఎఱుపును గలిగించునది యనియుం దెలిసికొననగును. త్వద్గాత్రవత్ = నీశరీరమువలె, కామదం= కామోద్దీపకమయినదియు, తవ = నీయొక్క, ఓష్ఠవత్ = వాతెరవలె, స్వాదు = ఆస్వాద్యమయి, ఇష్టంచ=ఆస్వాదింపనాస్వాదింపఁబైపైనం బ్రియంబు వెలయింపం జేయు నదియైయుండు. ఇట్టి తాంబూలం = తాంబూలము, ఆనీయతాం = ఇవ్వఁబడుఁ గాఁత.

## కాళిదాసుండువిద్యాసర్వస్వవేదినితోవాగ్వాదముసేయుట

ఉత్సా. ఐతి నైదు నైదు నైదు నైదు నైదు గల్గినన్,
భాతి గుమ్మితీలు నైదు పాకజాస్త్రం డేసినన్.
చేతి నైదెఱుంగనట్టిచీఁకుపోతుఁగూడు నే
నీతి మేని నైదు లేనినీరజాక్షి వేడుకన్.

అని పఠించి దీనిభావంబు వెల్లడిసేయఁజను ననినఁ గాళిదాసుఁడును ఓకన్యకా వినుమని యిట్లు వివరించె. మొదటినైదు అరణ్యసంభవంబు లయినలక్క, మద్యము, తేనె, నెమలిపురి, మృగమదము అనునవి. రెండవనైదు సముద్రభవంబు లయిన గవ్వలు, శంఖము, ప్రవాళము, ముక్తాఫలములు, ఉప్పు అనునవి. మూఁడవనైదు దేశజంబు లయినశాలిధాన్యము, ముద్గములు, నారికేడంబులు, కదళి, ఇక్షువు అనునవి. నాలుగవనైదు నగరసంభవంబులగు దర్పణము, ఉన్మత్తుఁడు, నల్లకోతి, వనగజము, మహీపతి. ఐదవనైదు పర్వతభవంబు లయిన మాణిక్యము, మరకతము, వైడూర్యము, నీలము, బంగారము అనునివి. మన్మథునిబాణములయిదు. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునవి. చేతినైదనఁగా లెక్కించుట, వ్రాయుట, ఆకులుగోయుట, పువ్వులుగట్టుట, వీణవాయించుట అనునవి. మేనినైదనఁగా నావలింత, నెటిక, ఘూర్ణిలుట, కుబ్జత, గ్రుడ్డితనము అనునివి. అరణ్య సంభవాదు లయిన యైదయినగా నుండు వస్తువు లొసంగినను; మన్మథుఁడు కడు ముమ్మరముగ నైదుబాణములం గ్రుమ్ముచుండినను; కాయజంబు లయిన యాలస్యాదులు లేని యుత్తమకాంతాతిలకము వ్రాయుట మొదలగువాని నైదింటి నెఱుంగనివాని, మగవాఁడ నని పేరుపెట్టుకొనియుండువానిని; బెండ్లాడునా? అనుటయే దీనిభావము. అని యిట్లు తాఁజెప్పిన పద్యమునకు భావంబు వెల్లడిసేయఁగా విద్యాసర్వస్వవేదినియుం నోకవివరా మఱియొకపద్యంబు సెప్పెదను దానిభావంబు సెప్పంగలవా! యనిన సదుగం గలవారుగల్గినఁ జెప్పఁగలవారు లేకపోయిరా! యనఁగా నామగువయుం,

క. వండిన యొండిన దొక్కటి, ఖండించినపచ్చి దొకటి కాలిన దొకటౌఁ
దిండికి రుచియై యుండును, ఖండితముగఁ దీనిఁ దెల్పు కవియును గలఁడే.

అనినఁ గవియుం నవ్వి యోమగువా దీనిభావంబు దెల్పుట యొకదుష్కరమా! వినుమని యిట్లనియె.

క. శిలవృక్షలతలఁ బుట్టిన, చెలువలు ముగ్గురును గూడి చిడిముడిపడుచున్
తలవాకిట రమియింతురు, సలలితముగఁ దీని నెఱుఁగుసరసులు గలరే.

అనఁగా నాపడఁతియుం దనపల్కిన తాంబూలవర్ణనంబునకుఁ బ్రతిగా నద్దానిని గవి వర్ణించుటకు మిగుల నంతసించి మఱియు నిట్లనియె.

క. శుద్ధకులజాత యొకసతి, యుద్ధరణిం దండ్రిఁ జంపి యొసఁగువిశుద్ధిన్
బుద్ధి బితామహుఁ బొందుచు, సిద్ధముగాఁ దండ్రిఁ గనియెఁ జెప్పుము దీనిన్.

అనఁగాఁ గవి యిది తక్రము; ఇది శుద్ధమగు క్షీరవంశమునం జనించినది. తండ్రి యగుదధిని చంపుట యనఁగా మథించుట. దీనికిఁ బితామహుఁడు క్షీరము. దానితోఁ జేమిరి యిడుట పితామహుంబొందుట యని చెప్పి కవి తా నిట్లువచించెను.

ఉ. ఊరువు లంట రాఁ దిగిచి యున్నత మైనకుచద్వయంబుపైఁ
జీరెచెఱంగుఁ దీసి సతిఁ జేరి చనుంగవఁ బిగ్గఁబట్టి తాఁ
గోరినకోర్కెఁ దీర్చుకొనెఁ గోమలిఁ బొందక యున్నమాత్రనే
సారము దెల్పుమీ సురతసౌఖ్య మెఱింగినజాణ వైనచోన్.

అని చెప్పఁగా విద్యాసర్వస్వవేదినియను మేఁక చన్నులకుఁ జుట్టినసుచ్చుపాఁతెలు పీడిచుట భావ మనియుం దానివెనుకటికాళ్లు పాలుపితుకువాఁడు దిగిచి తనరెండుతొడల నడుమ నిఱికించుకొని నుచ్చుపాఁతలు చన్నులనుండి విడఁదీసి చన్నులు గట్టిగఁబట్టి తాఁ గోరినక్షీరదోహంబుఁ గావించుటయ యీపద్యార్థం బని చెప్పి మరలఁ దా నిట్లనియెం.

క. అంచిత చతుర్థజాతుఁడు, పంచమమార్గమునఁ బోయి ప్రథమతనూజన్
గాంచియు నచటఁ దృతీయుం, బుంచి ద్వితీయంబుఁ దాఁటి యొంచెను రాజున్.

అని చెప్పఁగా విని కవియు నోచతురా పంచభూతంబులగు పృథివ్యప్తేజో వాయ్వాకాశములలో నాల్గవవాఁడగు వాయువునకుం జనించినవాఁడు హనుమంతుఁ డయిదవదియగు నాకాశపుఁద్రోవం జని ప్రథమమగు పృథివికిం జనించినసీతాదేవిం గనుంగొని యామె యుండిపలంకయందు మూఁడవది యగునగ్ని నుంచి రెండవదియైన జలతత్త్వమయమగుజలనిధిం దాఁటి రామునికడకుం జనుదెంచె నని దీనిభావము. అని చెప్పి యోమతిమతీ నావచియింపుపద్యమునకు భావం బిమ్ము కాదేని యిం దుడుగు మని యిట్లు వచియించె.

ఉ. కన్యకు నైదు పాదములు కన్యకు నేడు విలోచనంబులున్
కన్యకు నాల్గు కన్బొమలు కన్యకు నాఱు కుచద్వయంబునున్
కన్యకు ద్వాదశం బనఁగఁ గారణమధ్యమ మున్నయట్టియా
కన్యకు నీకు నాకుఁ బది గావలెఁ గా! యిపుఁ డంగనామణీ.

అని చెప్పిన విని వనజానన నవ్వుకొనుచుఁ దనమనంబున నీతండు నన్నుఁ బయిఁబయిఁ బోనీక యుడుపుచున్నాఁడు.ఇతండు నుడివినపద్యమునం దొకకన్యకకుఁ బాదములు మొదలగునవియైదాఱునిట్టివిగానున్న వని విరోధార్థము పైకిఁ దోఁచుచున్నది. అది యట్లు గాదు. కన్యారాశికైదవది మకరము.దానివంటివి పాదములు. ఆకన్యక కాఱవది కుంభము.

దానివంటిపై స్తనద్వయము. దానికి నాల్గవది ధనుస్సు. దానివంటివి కనుబొమలు. దానికి నేడవది మీనము. దానివంటివి లోచనములు. కన్యకు ద్వాదశమగు సింహమువంటికౌను గలకన్యనగునాకును తనకును కన్యకకును బదవది యగుమిథునము గావలె నని యీకవి యడుగుచున్నాఁడు. దీనికిం బదులు నెప్పుట కనువు లేదు. ఇతఁడు తాను నాపచియించు పద్యమునకు భావం బిమ్ము కాదేని యిం దుచుగు మని చెప్పి యున్నాఁడు. కాన నీయాంధ్ర భాషయందు వివాదంబు మానుకొని యిఁక సంస్కృతమున నుపక్రమించి వివదింతుంగాక యని యనుకొని యిట్లు చెప్పె. ఓకవీ నీ చెప్పినపద్యమునఁ గన్యారాశి కైదవది యని యి ట్లర్థంబు వర్ణించిన సరి యగును. నీ నుడివిన పద్యభావం బదియ. ఇఁక నేఁగొన్ని సమస్యల నిచ్చెదను. వానిని బూర్ణము సేయం గలవే! యనినఁ గవియు నవ్వుచు నట్ల కానిమ్ము. ఈవు విజిత వగుదు వేని నా నుడువు తెలుంగునం బ్రవర్తించెదవే! యేను విజితుండ నగుదు నేని నీయింటం గావలివాఁ డనై నీయిడినయన్నంబు భుజియించుచు నీకు దాసుం డనై యుండెదననిన నా వనజముఖియు నోకవివరా మీచేత విజితనగుదు నేని మీ చెప్పినచొప్పున నడుచుకొందు. ఇందుకు సందియ ముండదు. అనినఁ గవియు సరే! యట్ల కానిమ్మని నీ నుడువుసమస్య తెలియో వచింపు మనఁగా నాకనకాంగి యి ట్లనియె.

సమస్యా॥ "అదత్త మభుక్త మసుప్తం,

[దత్తముగాదు. భుక్తముగాదు. నిద్రయుఁగాదు.]

అనఁగాఁ గవియు,

శ్లో. వేదవిదే కిల దత్తం దత్తం బంధుజనైస్సహ భుక్తం భుక్తం,

ప్రియతమయా సహ సుప్తం సుప్తం అన్య దదత్త మభుక్త మసుప్తమ్.

[వేదము లెఱింగినవాని కివ్వఁబడినదే దత్తము. బంధుజనులతోడి భోజనమే భోజనము. కడునిష్టురాలైనకాంతతో నిద్రించుటయ నిద్ర. ఇట్లుగానిచో; దత్త మదత్తము. భుక్త మభుక్తము. నిద్ర యనిద్ర.]

అని చెప్పిన విని యాకాంత వెండియు ని ట్లనియె.

సమ. "మా యాతి నాఽఽయాతి నయాతి యాతి"

[పోఁడు. రాఁడు. పోడు. పోవుచున్నది.]

అనినం గవి యిట్లు వచియించె.

శ్లో. పీటీకరాగ్రా విరహాతురాంగీ చేటీ మవాదీ దిహ చిత్తజన్మా,

ప్రాణేశ్వరో జీవిత మర్థరాత్రం మాయాతి నాఽఽయాతి నయాతి యాతి.

[తననాయకుఁడు వచ్చునని శయ్యాగృహంబున నుండి యెదురుచూచుచుండ నాయకుఁడు రాక పోఁగా సంతపించుచుండు నాటకనజ్జికావృత్తాంత మిందుఁ జెల్పం బడు

చున్నది. తాంబూలము చేతంబూని యొక నాయిక తననాయకుఁడు వచ్చునని ప్రతీక్షించుచుండి యతఁడు రామింజేసి విరహావిక్లబంబులగు నంగంబులతోఁ జేటిం జూచి యోసీ! యిందుం జిత్తజన్ముఁ డైనమన్మథుఁడు కడు బాములు పెట్టుచున్నాఁడు గాని నన్నుంబాసి పోఁడు. ఈ వేదనవలన నిస్తరింతునన్న నో ప్రాణనాయకుండురాఁడు. ఇట్టి నాయకప్రేమవంచితం బగున దేల యుండవలయును! నన్నుంబాసి పోఁగూడదా? యటన్న నీ జీవితము పోదు. ఇంక నైనను గొంతసేపటికిఁ బ్రాణనాయకుండు వచ్చి గారవించునేమో యటన్న నా ప్రత్యాశయు లేదు. అర్ధరాత్రంబును గడచి పోవు చున్నది. ఇంతదనుక రానివాఁ డింక రాఁబోవునే యని భావము.]

అనఁగా విద్యాసర్వస్వవేదినియుం మనంబునఁ గవికౌశలంబునకు మెచ్చుకొనుచు నిట్లనియె.

సమస్యా. "త్రయం యది భవే దతిచిత్ర మేతత్"
[మూఁడు నుండునేని యిది మహాశ్చర్యము]
అని చెప్పిన నందుకుం గవి యిట్లనియె.

శ్లో. త్యాగో గుణో గుణశతా దధికో మతో మే
విద్యావిభూషయతి తం యది కిం బ్రవీమి
శౌర్యం హి నామ యదితత్ర నమోస్తుతస్మై
తచ్చ త్రయం యది భవే దతిచిత్ర మేతత్.

[దానగుణము తక్కినగుణములు నూటికంటె నధికమని నా మతము. అట్టిత్యాగ ముండువానిని విద్యయు నలంకరించెనేని యేమందును? అతనియం దింక శౌర్యంబు నయిత ముండునేని యతనికి నమస్కారంబు సేయునగును. త్యాగము విద్యయు శౌర్యంబు నను నీమూఁడు నొక్కనికిం గలిగియుండిన నది మహాచిత్రము]

అని చెప్పఁగా నా మానవతియుఁ గవివచనంబులు శ్లాఘించి వెండియు నిట్లనియె.

సమస్యా. "నహి కృత ముపకారం సాధవో విస్మరంతి"
[సాధువులు తమకుం జేసినయుపకారంబును మఱువరు.]
అని చెప్పిన నందుకుం గవివరుండు వచించె.

శ్లో. ప్రథమవయసి పీతం తోయ మల్పం స్మరంతః
శిరసి నిహితభారా నారికేళా నరాణాం
సలిల మమృతకల్పం దద్యు రాజీవితాంతం
నహి కృత ముపకారం సాధవో విస్మరంతి.

[నారికేళవృక్షములు తమకుఁ జిన్ననాటంబోసిననీళ్లు త్రాగియున్నవిగాన నవి స్మరించుకొనుచు శిరంబున బరువు మోచుకొని తమజీవిత ముండుదనుక నమృతతుల్యంబు

లగు జలంబులను నరుల కొసంగుచున్నయవి. ఇవి చిన్ననాటం దమకుఁ జేసినయుప కారంబు మఱవక మహావిశేషమగు ప్రత్యుపక్రియయ ట్లొనర్చెడిం గాన సాధువులు తమ కొనరించిన యుపకారంబును మఱవరు.]

అనఁగా నాపద్యంబు హృద్యం బగుటకు సంతసిల్లి యాపల్లవపాణి యిట్లనియె.

సమస్య. "స్వయం యాతి విస్తారం వస్తు రక్షితమ్"

[రక్షితము సేయంబడిన వస్తువు తనకుఁ దాన విస్తారంబు నొందుననియుఁ దాఁచఁ బడినవస్తువు స్వయమే ప్రకాశమునకువచ్చుననియుఁ రెండుభావములు.]

అని చెప్పఁగాఁ గవియు,

శ్లో. జలే తైలం ఖలే గుహ్యం పాత్రే దానం మనాగపి,
ప్రజ్ఞాదానం స్వయం యాతి విస్తారం వస్తు రక్షితమ్.

[జలంబులం దైలంబును ఖలునియందు రహస్యంబును నుత్తమపాత్రమునందుం జేయఁబడినదానమును జ్ఞానప్రదానంబును అనునీవస్తువులు స్వల్పమయ్యును రక్షితంబు లయ్యుఁ దమకుఁదామ విస్తారమునొందును.]

అని చెప్పఁగా నాపద్యప్రతిపాదితంబగు లోకన్యాయంబునకు సంతసించి యాకుటిలకుంతల యిట్లనియె.

సమస్య. "యయో స్తు మైత్రీ న తయో ర్హి దూరమ్"

[ఎవ్వారలకు మైత్రి గలదో యవ్వారలకు దూరము లేదు.

అనినఁ గవియు నిట్లుసెప్పె.

శ్లో. గిరౌ మయూరా గగనేచ మేఘా లక్షాంతరేర్క స్సలిలేచపద్మం,
లక్షద్వయే క్ష్మాః కుముదాని భూమౌ యయో స్తుమైత్రీ నతయోర్హిదూరమ్.

[మయూరంబులు గిరులయందును మేఘంబులు గగనమునందు నున్నవి. లక్షయో జనాంతరమున సూర్యుండును సలిలంబున బద్మంబును, రెండులక్షలదూరంబునఁ జంద్రుం డును భూమియందుఁ గలువలు నున్నయవి. ఇందు మయూరపద్మకుముదంబులందు దూరంబున నుండును మేఘసూర్యశశాంకులు సమీపమున నుండెడునారివలె మైత్రిం జెంది యున్నారు. అనిన నామదవతి యతనివచించినయుపమానంబుల కనుమోదించుచుమరల నతని కిట్లనియె.

సమస్య. "రతిసమయే వేదపాఠ ఇవ"

[రతికాలంబున వేదపాఠంబువలె.]

అని చెప్పఁగాఁ గవియు నిట్లనియె.

శ్లో. అనవసరే యత్కథితం సుభాషిత మపి భవతి హాస్యాయ
వసతౌ ప్రౌఢవధూనాంరతి సమయే వేదపాఠ ఇవ.

[అవసరము గానిచోఁ జెప్పంబడినమాట సుభాషిత మయ్యును అపహాస్య మగును. స్మరునిచే మందీకృతప్రీడలై సంపూర్ణయౌవనలై నవవిల్తుశాస్త్రవిచారసారచతురగోష్ఠీకుతూహలలై యొప్పుప్రౌఢకామినులు వసించుస్థలంబున నవ్వారలతోఁ బొందుసేయుచు నలిపై దర్థ్యంబు మెఱయ ననురాగపేశలంబుగ సంభాషించుచు వారలముద్దుపల్కులను; ప్రణయరసపరీవాహమేదురంబులగు వానిని వినుచుండునప్పుడు వేదపాఠంబు స్త్రీలకును బురుషులకు నపహాస్యం బగును. వేదపాఠము సుభాషిత మయ్యు ననవసరంబునం బ్రవృత్తం బగుటం జేసి యపహాస్యం బగువిధంబున ననవసరంబునం జెప్పినది మంచిమాట యయ్యును బరిహాసింపంబడును]

అని చెప్పఁగా నాయొప్పులకుప్పయుఁ గవి వచించినయుపమేయంబునకు శిరఃకంపంబు సేయుచు మఱియు నిట్లనియె.

సమస్య. "వృద్ధస్యభార్యాకరదీపికేవ"

[వృద్ధునికి భార్య చేతంబట్టుకొన్న దీపమువంటిది.]

అనిన నప్పుడ కాళిదాసు డిట్లనియె.

శ్లో. కరే గృహీతాపి పురస్థితాపి స్నేహేన సమ్యక్పరివర్ధితాపి
పరోపకారాయ భవ త్యజస్రం వృద్ధస్య భార్యా కరదీపికేవ.

[దీనికిం గరదీపికా కులటల పరములుగ రెండర్థంబులుగలవు. కరదీపిక యయినది హస్తమునం బట్టుకొనంబడినదియు నెదుట నుండునదియు నూనియచేఁ బాగుగనింపంబడినదియు గానుండి యెల్లప్పుడును బరులయుపకారంబునకే యగును. అనఁగా నదియొవఁడు చేతఁబట్టుకొనియుండునో వాని కుపయోగింపదు. తదితరుల కుపయోగించుననుట. వృద్ధునిభార్యయు నట్లె యెల్లప్పుడు పరుల కుపకారంబు సేయుటకే యుపయోగించును. ఆవృద్ధుఁడు దానిం దనచేతం బట్టుకొనియుండినను తనయెదుట నుంచుకొనియున్నను స్నేహపూర్వకముగఁ దత్కాంక్షితవస్తువుల నొసంగి పోషించుచుండినను వానిని వంచించి పరులతోనే గూడును.]

అని వచియింపఁగా నావిద్యావేదినియుఁ గవి సెప్పినలోకానుభవోక్తికిఁ గరంబలరుచుఁ దాను మరల నట్లనియె.

సమస్య. "ఇతి సంచిత్య వై శంభు రర్ధాంగే కామినీం దధౌ"

[అని తలంచియె శంభుం డర్థాంగంబునందుఁ గామినిని ధరించె.]

అని చెప్పఁగాఁ గవియు నిట్లనియె.

శ్లో. అసారభూతే సంసారే సారభూతా నితంబినీ,
ఇతి సంచింత్యవై శంభు రర్ధాంగే కామినీం దధౌ.

[అసారభూతమగు సంసారమందు సారమైనది నితంబినియ, యని తలంచియె శం

అనఁగా నతనియుత్ప్రేక్షితవస్తువు, సరి యని యెంచి యాపంచాననమధ్య మఱియు నిట్లనియె.

సమస్య. "సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః"

[ఇల్లు రగులుకొని మండుచుండఁగా నూయి ద్రవ్వుటకు యత్నించుట యెట్టిది?]

అనఁగా గవి యిట్లనియె.

* శ్లో. యావ త్స్వస్థ మిదం శరీర మరుజం యావ జ్జరా దూరతః
యావ చ్చేంద్రియశక్తి రప్రతిహతా యావ త్క్షయో నాయుషః
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః.

[ఈశరీర మెందనుక రోగంబులేక సుస్వస్థమయి యుండునో; ఎందనుక జర దూరమునన యుండునో; చక్షురాదీంద్రియములపాటవ మప్రతిహతమై యెందనుక నుండునో; ఎందనుక నాయువునకు సంక్షయంబు గల్గదో; అంతకు లోపలన విద్వాంసుం డాత్మశ్రేయంబుకొఱకు మహాప్రయత్నం బొనరింపంజనును. రోగములును జరయును సంభవించి యింద్రియపాటవంబు తగ్గి యాయువును క్షయంబునొందినయనంతర మాత్మ శ్రేయంబుకొఱకు యత్నింపం బ్రయోజన ముండదు. ఇంటికి నిప్పంటుకొనుటకుముంద యిట్టియాపదలం బాపికొనుటకు నూయి ద్రవ్వించుకొని యుండవలయు. అట్లుగాక యిం టికి నిప్పంటుకొని మండుచుండునప్పుడు నూయి ద్రవ్వుటకై యత్నించుట యనునది యెట్టిపని? నిరుపయుక్తమని యర్థము.]

అని చెప్పిన విని సంతసించి యామించుబోఁడి మఱియు నిట్లనియె.

సమస్య. "దారుభూతో మురారిః"

[మురాసురునిం జంపినవాఁ డగువిష్ణుండు దారు వయ్యెను.]

అనగాఁ గవి యిట్లనియె.

---

* టీ. ఇదంశరీరం = ఈశరీరము, యావత్ = ఎంతదనుక, అరుజం=రోగములు లేనిదై, స్వస్థం=సుఖావహముగనుండునో! యావత్ = ఎంతదనుక, జరా=ముసలితనము, దూరతః=దవ్వులనుండునో! యావత్=ఎంతదనుక, ఇంద్రియశక్తిః = చక్షురాదీంద్రియ ములపాటవము, అప్రతిహతా=అడ్డగింపఁబడదో! యావత్ = ఎంతదనుక, ఆయుషః = జీవితమునకు, క్షయః=హాని, న=సంభవింపదో! తావదేవ=అంతదనుకనే, విదుషా=విద్వాం సునిచే, ఆత్మశ్రేయసి=తనయొక్క క్షేమమునంగు, మహాన్=గొప్ప, ప్రయత్నః=ప్రయ త్నము, కార్యః=చేయఁదగినది. భవనేసందీప్తేతు=ఇల్లునిప్పంటుకొనిమండుచుండునప్పుడు, కూపఖననం ప్రతి=నూయిద్రవ్వుటకుఁగా, ఉద్యమః=ప్రయత్నము, కీదృశః=ఎట్టిది?

* శ్లో. ఏకా భార్యా ప్రకృతి రచలా చంచలాచ ద్వితీయా
పుత్రో నంగ స్త్రిభువనజయీ మన్మథో దుర్నివారః
శేష శ్శయ్యా ప్యుదధిశయనం వాహనం పన్నగారిః
స్మారం స్మారం స్వగృహచరితం దారుభూతో మురారిః.

[ఒకభార్య యచలప్రకృతి. అనఁగా జడస్వభావముతోఁ గదలకయుండునది. రెండవభార్యయన్నచో చంచలురాలు. ఒకచోట నుండదు. పుత్రుం డన్ననో యనంగుఁడగుమన్మథుడు. శరీరములేనివాఁడును ముల్లోకములంజయించువాఁడును నివారింపంగూడనివాఁడు నై యుండెడిని. వానికి శరీరములేనికొంత యొకటి యట్లుండ ముల్లోకములను జయించి తనవశము జేసికొనుసామర్థ్యంబు గలిగి వలదనిన నుడుగువాఁడు గాకయుండెడిని. పానుపు సర్పము. "ససర్పేచగృహేవాసోమృత్యురేవనసంశయః" అన్నట్లుసారతమును మనంబున నతనివిషయ మగునులుకు మానక యుండు. శయనమందిరము గాంచఁగా జలనిధి. "కూపస్యతీరేనివసన్నపాయంకోవానధత్తే" అన్నట్లు ఏతట్లు కొరిగిన నపాయము గల్గునో యనుభయము బాయక యుండు. వాహనము సర్పములతో నెల్లకాలము పగబట్టి పోరాడుచుండు. ఇతఁడు వాహ్యాళి వెడలునప్పుడు సర్పముం గాంచెనేని దానితో జగడమునకుం బోవును గాని యితనిగంతవ్యస్థలంబునకుఁ బోఁడు. ఇట్టి తన గృహచ్ఛిద్రంబులం దలంచి తలంచి విష్ణుండు దారుభూతుం డయ్యెను. ఒకభార్య యచలప్రకృతి యనఁగా భూదేవి; రెండవభార్య చంచల యనఁగా లక్ష్మీదేవి; దారుభూతుం డయ్యె ననఁగా భగవంతుండు శ్రీపురుషోత్తమక్షేత్ర మనంబడుజగన్నాథస్థలంబున దారుమయార్చారూపియయి చేతనసంరక్షణ మాచరించుచున్నవాఁ డనునర్థ మనుసంధేయము.]

అని చెప్పిన నాకలువకంటియుఁ గవివచించినయర్థవిశేషంబునకు మెచ్చుచు వెండియు నిట్లనియె.

సమస్య. "వినాశకాలే విపరీతబుద్ధిః"
[చెడుకాలంబునకు బుద్ధియు విపరీతం బగును.]

---

* టీ. ఏకాభార్యా=ఒకభార్య, అచలాప్రకృతిః = స్థిరప్రకృతిగలది. (భూదేవి) ద్వితీయా=రెండవభార్య, చంచలాచ=చపలురాలు (లక్ష్మి) పుత్రః=కుమారుఁడు, అనంగః=అంగహీనుఁడును, త్రిభువనజయీ=ముల్లోకములనుజయించువాఁడును, దుర్నివారః = అనివార్యుఁడునగు, మన్మథః=మన్మథుఁడు, శయ్యా=పానుపు, శేషః=శేషుఁడనుసర్పము, ఉదధిః=సముద్రము, శయనం = పరుండుస్థలము, పన్నగారిః = పాములకుశత్రుఁడు, (గరుత్మంతుఁడు) వాహనం = వాహనము. ఇట్టి-స్వగృహచరితం = తనయింటికథను, స్మారంస్మారం=స్మరించిస్మరించి, మురారిః=విష్ణువు, దారుభూతః=కొయ్యయయ్యెను.

అనఁగా గవి యిట్లనియె.

శ్లో. న నిర్మితో నైవచ దృష్టపూర్వః నశ్రూయతే హేమమయః కురంగః,
తథాపి తృష్ణా రఘునందనస్య వినాశకాలే విపరీతబుద్ధిః.

[కనకమయమగు మృగము నిర్మింపఁబడియున్నదని యింతకుం బూర్వమున కన్నది యుం లేదు; విన్నదియుం లేదు; అట్లయ్యును రఘుపతి కట్టిమృగంబున నాసగలిగెను. అది మారీచమాయ యని తలంపకపోయె. చెడుటకుఁ గాలము వచ్చినప్పుడు బుద్ధియుం విపరీతమగును.]

అని చెప్పఁగా నామగవరయుం మరల నిట్లనియె.

సమస్య. "పాపాయ పరపీడనమ్"

[పరులను బీడించుట పాపముకొఱకు.]

అనఁగాఁ గవియుం,

శ్లో. శ్రూయతాం ధర్మసర్వస్వం యదుక్తం శాస్త్రకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

[కోటిశాస్త్రములచేఁ జెప్పంబడినధర్మప్రముర్మము వినుము. పరుల కుపకారము సేయుట పుణ్యంబుకొఱకును; పరులను బీడించుట పాపంబుకొఱకు నగును.]

అనిన నాకనకాంగి యిట్లనియె.

సమస్య. "శాకాయ లవణాయ వా"

[కూరకొండె నుప్పుకొండె.]

అనఁగాఁ గవియుం,

శ్లో. ఆశాతురంగ మారుహ్య నిత్యం ధావతి యాచకః,
యల్కించిత్తండులార్థాయ శాకాయ లవణాయ వా.

[యాచకుఁడు తా నాశయనుతురంగమంబు నెక్కి ప్రతిదినము నొకించుక తండులంబులకొండె గొంచెపుం గూరలకొండె నుప్పు కొండెఁ బరుగిడుచున్నాఁడు.

అనఁగా నాకలకంఠియు,

సమస్య. "కృశే కస్యాస్తి సౌహృదమ్"

[చిక్కియుండువానియం దెవ్వనికి సౌహృదం బుండు.

అనఁగాఁ గవివరుండును,

శ్లో. వనాని దహతో వహ్నేః సఖా భవతి మారుతః,
సఏవ దీపనాశాయ కృశే కస్యాస్తి సౌహృదమ్.

[వహ్ని వనంబులు దహించుచు విజృంభించు చుండునప్పుడు చండమారుత మత నికి సహాయుఁడై యతనిని మఱియుం వృద్ధిసేయుచున్నది. ఆచండమారుతమే దీపమును నశింపఁజేయును. కానఁ జిక్కియుండువానియం దెవ్వనికి సౌహృదం బుండు!

అనఁగా నాకాంతయు నిట్లనియె.

సమస్య. "మనుష్యరూపాః పశవ శ్చరంతి"

[మనుష్యరూపంబులం జరించుపశువులు నా నొప్పుచుండుదురు.]

అనఁగాఁ గవియు,

శ్లో. ఏషాం నవిద్యా నతపో నదానం నచాపి శీలం నగుణా నధర్మాః,
తేమర్త్యలోకే భువి భారభూతాః మనుష్యరూపాః పశవః చరంతి.

[ఎవ్వారలకు విద్యయుఁ దపంబును దానంబును శీలంబు నుత్తమగుణంబులును ధర్మంబునుండవో; అమర్త్యులు భూమికి భారభూతులై మనుష్యలోకంబున మనుష్యరూపం బులతోఁ జరించుపశువులు నా నొప్పుచుండుదురు.]

అనఁగా నాసుదతియు,

సమస్య. "శిరసి లిఖితం లంఘయతి కః"

[తలవ్రాలుదప్పించుకొనువాఁడెవ్వఁడు?]

అని వచించెను. అందుకుం గవి యిట్లనియె.

*శ్లో. త్రిలోకేశ శ్శార్జ్గీ శబరశరలక్ష్యత్వ మగమ
ద్విధాతా లోకానా మలభత శిరఃకృంతనవిధిం
ప్రయాతౌ తౌ రాహో ర్దినకరశశాంకౌ కబళితాం
ప్రభు ర్నగ్న శ్శంభు శ్శిరసి లిఖితం లంఘయతి కః.

[త్రిలోకనాథుఁడైనవిష్ణువు శబరునిశరంబులకు లక్ష్యం బయ్యెను. శ్రీకృష్ణావతార సమాప్తియందు నేకతంబ యాకృష్ణుండు తనపదమును మఱియొకపదంబుపై నుంచుకొ

*టీ. త్రిలోకేశః=ముల్లోకములకుఁ బ్రభువగు, శార్జ్గీ=విష్ణువు, శబరశరలక్ష్యత్వం= ఎఱుకువానిబాణమునకుం గుఱియగుటను, అగమత్ = చెందెను. లోకానాంవిధాతా = లోకములనుసృజించినవాఁడగునలువ, శిరఃకృంతనవిధిం-శిరముగిల్లి వేయుటను, అలభత = పొందెను. ఇందుకుంగారణము పలువిధములుగనున్నవి. తౌదినకరశశాంకౌ = ఆచంద్ర సూర్యులు, రాహోః=రాహువునకు, కబళితాం=కడియగుటను, ప్రయాతౌ=చెందుచు న్నారు ప్రభుః = సమర్థుఁడగు, శంభుః = రుద్రుఁడు, నగ్నః=దిసమొలతోనున్నాఁడు కాన, కః = ఎవఁడు, శిరసిలిఖితం = తలయందువ్రాయఁబడినదానిని, లంఘయతి= దాఁటెడిని.

బోటనవ్రేలు గదలించుచుం బరుండియుండ వ్యాధుం డొకండు గాంచి జింక చె వ్వాడించుచున్న దని యెంచి దాని లక్ష్యంబుచేసి బాణంబు విడిచిన నది భగవంతుని యంగుష్ఠంబునం జొచ్చెను. అనంతరము శ్రీకృష్ణావతారసమాప్తి యయ్యెను. ఇది పురాణ కథ. లోకములకు సృష్టికర్తయగు నలువశిరము గిల్లివేయంబడె. పూర్వ మీశ్వరుండు బ్రహ్మకుం గలశిరంబును గిల్లివేసె నని పురాణకథ. సూర్యుండును చంద్రుండును రాహువుచే మ్రింగంబడుచున్నారు. గ్రహణకాలంబున రాహువు సూర్యచంద్రుల మ్రింగు నని పురాణకథ. సర్వశక్తుం డయిన శంభుండు వస్త్రములేక దిసమొలతో నున్న వాఁడు. కాన నింతటిగొప్పవారికే యిట్టివిపత్తులు కలిగి నొసట వ్రాసినవ్రాతను మీఱు టకు శక్యము గాకయుండఁ దక్కినవా డెవ్వఁడు గాని దానిఁ దాఁటం గలఁడే.]

అనఁగా నాజవ్వని వెండియు

సమస్య. నాఽదత్త ముపతిష్ఠతే,

[ఇచ్చి పెట్టనిది దొరకదు.]

అనఁగాఁ గవియు,

శ్లో. యస్య రత్నాకరస్తాతః యస్య లక్ష్మీ స్సహోదరీ
శంఖో రోదితి భిక్షార్థీ నాఽదత్త ముపతిష్ఠతే.

[దేనికి రత్నాకరుం డనిచెప్పంబడుసముద్రము తండ్రియో; దేనికి సర్వసంపత్ప్ర దాయిని యగులక్ష్మి సహోదరియో; అట్టిశంఖము ప్రతియింటివాకిటను బిచ్చమునకు రోదనము సేయుచున్నది. కానఁ దొలుత నిచ్చిపెట్టనిది దొరకదు. "తనవారి కెంతగల్గినఁ దనకలిమియ తనదిగాని" యనున్యాయమనుసంధేయము. శంఖము సముద్రమునఁ జనించునది గాన సముద్రుఁడు తండ్రి యనియు లక్ష్మి సహోదరి యనియుఁ జెప్పం బడినది.]

అని చెప్పఁగా నాలలనామణి మఱియు నిట్లనియె.

సమస్య. ప్రాకృతం కేన భుంజతే,, అనఁగాఁ గవియు,

[ప్రకృతి సంబంధంబునంగలిగెడు దుఃఖంబు నెవ్వరేని యనుభవింపని వారు గలరే!]

శ్లో. మాతా లక్ష్మీః పితా విష్ణుః స్వయంచ విషమాయుధః
తథాపి శంభునా దగ్ధః ప్రాకృతం కేన భుంజతే.

[తల్లియో! లక్ష్మి. తండ్రియో! విష్ణుండు. తానో! విషమాయుధుఁడు. కానం దల్లిదండ్రుల బలమును దనయస్త్రబలంబు నుండియును శంభునిచేత నామన్మథుండు దగ్ధుండయ్యెను. అట్లగుటంజేసి ప్రకృతిసంబంధంబునం గలదుఃఖంబు నెవ్వారేని యను భవింపక పోఁగలరే?]

అని చెప్పఁగా విద్యాసర్వస్వవేదినియుఁ దాను సమస్య చెప్పిముగియక ముందకవి శ్లోకం బుపక్రమించి వచించుటకు నాశ్చర్యపడుచు నితనిం జయించుటకు శక్యంబు గాదని తలంచి "ఇనను జాతము; విషమసమస్యలఁ గొన్నింటి నడుగుదము" అని యను కొని యిట్లనియె.

సమస్య. మోక్షంతు సేవమానః పత త్యధః,,

[మోక్షధర్మములను సేవించువాఁ డధఃపతనంబు నొందును.]

అనఁగాఁ గవియుం నవ్వుచు నోకామినీ నీ విందు జయింపం బోయెదవో చూతు నని యిట్లనియె.

శ్లో. ఋణాని త్రీ ణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్
అనపాకృత్య మోక్షంతు సేవమానః పత త్యధః.

[మానవుఁడు దేవఋణము పితౄఋణము మనుష్యఋణము అనుఋణత్రయ మును యజ్ఞములు చేసియుం సంతానము వడసియుం వేదాధ్యయనమొనరించియుం దీర్చు కొని యనంతరము మోక్షచింతనము సేయం జనును. ఈఋణత్రయమును దీర్చుకొనక మోక్షధర్మమును సమాచరించెనేని యధఃపతితుం డగును.]

అనఁగా నామానినియుం మరల నిట్లనియె.

సమస్య. మక్షికాపాదఘాతేన కంపితం భువనత్రయమ్,,

[ఈఁగెకాలిదెబ్బచేత ముల్లోకంబులును గంపము నొందెను.]

అనఁగాఁ గవియుం,

శ్లో. స్ఫురితే జఠరే విష్ణోః నవనీతభుజ శ్శిశోః
మక్షికాపాదఘాతేన కంపితం భువనత్రయమ్.

[శ్రీకృష్ణుండు శిశు వయి యుండునప్పుడు నవనీతంబు భుజించె. ఆనవనీతంబున నీఁగె యుండెను. అది లోపలికిఁ బోఁగా వెన్నునికిఁ గడుపు గలియఁబెట్టెచు. అతని యుందరంబునం ద్రిలోకంబు లున్నవి కాఁబట్టి యప్పు డామక్షికకాలు దాఁకి ముల్లోకం బులును గంపంబు నొందెను.]

అని చెప్పఁగా విని యావనజాతనయన తనమనంబున నితండు విషమసమస్యల యందును విజితుండు గాఁ డని తోఁచెడిని. గూఢార్థం బయినశ్లోకంబు సెప్పి వంచింప నగునో! యదియుఁ జాత మని యిట్లనియె.

శ్లో. హతో హనుమతా రామః సీతా సా హర్ష నిర్భరా
రుదంతి రాక్షసా స్సర్వే హా హా రామో హతో హతః.

[హనుమంతునిచే రాముఁడు చంపఁబడియె. ఆసీత సంతోషభరిత యయ్యెను. అక్కటా! రాముండు హతుండయ్యెనే యని రాక్షసు లందఱు నేడుచుచుం డెదరు.]

అనిచెప్పఁగా విని కవియు నోమానినీతిలకమా నీవు చెప్పినశ్లోకంబునందు హానుమతా+ఆరామః అని పదవిభాగంబు చేసిన సరిపడు నని చెప్పి;

[ఆరామః=తోట, హానుమతా=ఆంజనేయునిచే, హతః=పాడుచేయఁబడినది. అనియర్థము, తక్కినవి పూర్వమువలె.]

ఓకాంతా నీవు మాత్రమే యడుగుచుండ నేనింతదనుకం జెప్పుచు వచ్చితిని. ఇంక నీ వడిగినదానికి నేనును నేనడిగినదానికి నీవును జెప్పుకొనుచు రాఁ జనును. అట్లయిన మనయిరువురతారతమ్యంబు విస్పష్టం బయ్యెడి నని చెప్పఁగా నామానినియు వల్లె యన నానుడివెడు శ్లోకంబునకు బదులు సెప్పంజనునని గవి యిట్లనియె.

శ్లో. కేశవం పతితంద్దృష్ట్వా పాండవా హర్షనిర్భరాః,
రుదంతి కౌరవా స్సర్వే హా హా కేశవ కేశవ.

[కేశవుండు పతితుండు గాఁగాఁ గనుంగొని పాండవులు సంతోషభరితులైరి. కౌరవులందఱును అక్కటా యోకేశవా యోకేశవా యని యేడుచుచున్నారు.]

అనఁగా నాసర్వస్వవేదినియు, కం అనఁగా జలము. దానియందుఁ బతితంబైయుండు శవంబును గాంచి పాండవము లనుపక్షివిశేషంబులు దానిం దినసగు నని సంతసించుచున్నవి. ధార్తరాష్ట్రంబు లనుపక్షివిశేషంబులును నీటియందుండు శవమా! శవమా! యని కూయుచున్నవి యని దానిగూఢార్థంబును స్పష్టంబుగా విడదీసి చెప్పి యావిద్యావతి యిఁక నిందు నితని జయింప ననువుపడ దని యెంచి శ్లేషార్థంబుగల శ్లోకంబు జెప్పం బూని యిట్లనియె.

శ్లో. అనేక సుషిరంవాద్యం కాంతంస్త్రీముఖపంకజం,
చక్షుశ్శ్రోత్రప్రియకరం యోజానాతి సపండితః.

[వాద్యము పెక్కురంధ్రములు గలది. స్త్రీముఖకమలము కాంతము. చక్షుస్సులకును శ్రోత్రములకుఁ బ్రీతి గల్గించునది. ముఖము కన్నులకును వాద్యముచెవులకును బ్రియము సేయును. ఇది యేమో యెఱిఁగినవాఁడే పండితుఁడు. ఇది యొకదానితో నొకటికి సంబంధము లేనట్లు నుపయుక్తార్థము లేనట్లును దోఁచుచున్నది.]

అని చెప్పఁగాఁ గవియు నీవు వచించినది పుట్టగాని యొం డేమియుం గాదు. అదెట్లన! పుట్ట పెక్కురంధ్రంబులు గలిగి యుండు. దానికి వల్మీక మని సంస్కృతమునఁ బేరున్నది గాన వకారము మొదటి యక్షరముగాఁ గలది యగుటం జేసి వాద్యం బయ్యె. స్త్రీయనఁగాఁ జదలుపురుగులకుఁ బేరుగలదు. వానిముఖమున నుండుపంకముచేఁ బుట్టినది గాన స్త్రీముఖపంకజం బయ్యె. చక్షుశ్శ్రోత్రము లనఁగా సర్పములు. వానికిఁ బ్రియావహము అని యర్థవివరణంబు సేసి తానిట్లనియె.

శ్లో. సువర్ణాలంకృతా నారీ హేమాలంకారవర్జితా,
సానారీ విధవాజ్ఞేయా గృహే రోదితి. తత్పతిః.

[సువర్ణాలంకారములు గలవారి హేమమయాలంకారము లేక యున్నది ఆనారి విధవ యని యెఱుంగనగును. దానిభర్తయింట నేడుచున్నాఁడు. సువర్ణాలంకారములుగలది హేమాలంకారవర్జితయై యుండుట యెట్లు? అది విధవ యయియుండదాని భర్త యింట నేడుచుండుటయెట్లు? ఈరెండర్థములు పరస్పరవిరుద్ధములుగాఁ బైకిఁ దోఁచును.]

అనినఁ గవిపల్కులవిని విద్యాసర్వస్వవేదిని యిట్లనియె. సువర్ణమనఁగా మంచి దేహచ్ఛాయ. దానిచే నలంకృత యయియుండుకాంత; బంగారుభూషణములు ధరింపనిది అనఁగాఁ దనదేహకాంతి తగ్గునని యాభరణాదులు ధరింపనిది యనియర్థము. ఆనారి విధవ యనఁగా విశేషించియుండు మగలుగలది. ఇది అంతతనముకకుం బోవుచుండఁ గని దానిమగఁ డింట నేడుచున్నాఁడు. అని యీపద్యార్థంబు. అని యిట్లు పచియించి యూహించుబోడి దీనియందు నికనినోడింప నలవి గాదు. పదములకు భాషాంతరమున నర్థము స్ఫురించుటచేఁ జిత్తభ్రమము గల్పించునట్లు వచింప నగు నని తలంచి యిట్లనియె.

శ్లో. అంబలిద్వేషిణం వందే ఊరు పిండీకృతాసురం,
ఉరగాయకృతత్రాసం పాలనేతి ప్రియంగవామ్.

[అంబటియందు ద్వేషము గలవాడనియు, ఊరుపిండిగాఁ జేయఁబడినదైత్యులు గలవాఁ డనియు ఊరగాయకుగా భయముపడువాఁ డనియు గోవులపాలును నేయియు ప్రియపడువాఁడనియుం నట్టివానికి నమస్కరించెదనని సాధారణార్థము.అంబలి,ఊరుపిండి, ఊరగాయ, పాలు, నేయి ఈపదము లాంధ్రభాషాపదములు. అవి చేరియున్నవి గాన శ్లోక మసమంజస మనితోఁచుచుండును.]

అనఁగాఁ గవియుం మందహాసంబు సేయుచు వినుమనిచెప్పె. అం+బలిద్వేషిణం అని పదవిభాగము సేయ బలిని ద్వేషించినవాఁడును అకారవాచ్యుండు నైనవిష్ణుని నమస్కరించెద ననియుం, నతఁడు తనయూరువులచే నసురులగు మధుకైటభులను వారల నలిపివేసినవాఁ డనియుఁ గాళియోరగంబునకు భయంబుగొల్పియమునను విడిచిపోవునట్లు చేసినవాఁ డనియుం గోవులపాలనంబున నతిప్రియము గలవాఁ డనియుం నీయర్థము. పాలనే+అతిప్రియంగవాం, అనివిభాగంబుసేయ నగుననియుం నిట్లాపద్యార్థంబు వర్ణించిచెప్పి తాను బదులుగా నొకశ్లోకంబు వచించె.

శ్లో. భాండే జలంవా తక్రంవా నీరోమోరో వదాంగనే,
మార్గమాలోక్య గంతవ్యం ముల్లు స్యాత్తత్ర కంటకమ్.

[ఒకపురుషుఁడు తక్రభాండంబు నెత్తుకొనివచ్చుదాని నడుగుచున్నాఁడు.భాండంబునందు జలమా! తక్రమా! లేక నీరమా! మోరా? ఓయంగనా వచింపుము. ఓసియో

వనమదంబుచేతఁ ద్రోవం జూడకపోయెదవు. మార్గముం జూచుకొని పొమ్ము. అట్లు విమార్గంబునం బోదువేని యందుఁ గంటకము ముల్లుండును. ఇందు జలం అనుపదమునకు వెండియుఁ నీరో అనియుఁ తక్రంఅనుపదమునకు వెండియు మోరో యనియుఁగంటకం అను పదమునకువెండియుం ముల్లు అనియుంజెప్పంబడియున్నది. ఇది యిచట భ్రమజనకము.]

అనిన విద్యావేదినియుం నొకపీ యీపద్యంబునందు అంగనే యనుసంబోధనమునకు నీరోమోరో అనుదానిని విశేషణంబు చేసినట్లుతైన నీరోమ+ఊరో అని రోమములు లేక తళతళలాడుతొడలుగలదానా యనునర్థవివక్షయందు సరిపడుచున్నది. "ముల్లు" అనుదానికి ముదమును బోఁగొట్టునది యనునర్థవివక్షయందు నదియు సరిపడును. అని వచియించి యీచంపకగంధి తనమనంబున నిందు నీతండు విజితుండు గాఁడు; గూఢభావంబుగల ప్రత్యుక్తి సెప్పవలసినవాక్యములు గొన్నివచియింతు. అందీతం డెంతటివాఁడో కనుగొందము. అని యనుకొని యిట్లనియె.

శ్లో. అర్థాస్వాదనవేళాయాం శబ్దోత్పత్తివిచారకాః,,

[కావ్యములయం దర్థస్వారస్యమును దా మాస్వాదనము సేయు వేళలయందు శబ్దములయుత్పత్తినిగుఱించి విచారము సేయువారు.]

అని చెప్పఁగాఁ గవియుం,

శ్లో- నీవీమోక్షణవేళాయాం వస్త్రమూల్యవిచారకాః,

[నవరసరసికయగు శృంగారనాయికలతో బాహ్యోపభోగంబులు సలుపుచుండమితలకెక్కి మోవినొక్కి చెక్కిలులు ముద్దాడి యక్కునం జేర్చి యనువు మెఱయఁ దటుక్కున వలపులముడిజార్చి లజ్జాకులత్వంబున సంభ్రమించు నామించుబోడుల కమనీయ విలాసంబులను గనుంగొనవలసినయుద్వేలమోదభరావహంబగు నాకాలంబున నీవివదల్చి యాపీరవిలువ యెంతయుండు నని వస్త్రమూల్యమును విచారించువారే! కవి వచించియుండు నవనవకల్పనామనోహరంబులగు నర్థంబుల ననుభవించు వేళల నర్థాస్వాదనము మాని శబ్దము లేధాతువువలనంబుట్టిన వని విచారము సేయుట కడు విరసము. అట్లే వలపులముడివీడుచుకాలమందుఁ గామినీమణిశృంగారంబు లనుభవించుట మాని యావస్త్రమును జేతం బట్టుకొని దానివిలువను విచారించుటయుఁ గడువిరస మని భావము.

అని చెప్పఁగా విని కనకాంగి కవివచించినయర్థంబునం గలరసవంతంబగు భావంబునకు సంతసించి మఱియు నిట్లనియె.

శ్లో॥ ద్వావేవ కోమలౌ పథ్యౌ,,

[లేఁతవి రెండే పథ్యములు].

అనఁగాఁ గవియుం,

శ్లో॥ వార్తాకవనితాధరౌ,,

[వంకాయయును వనితమోవియును లేతవి రెండే మంచిపథ్యములు.]

అనఁగా విద్యాసర్వస్వవేదినియును,

శ్లో॥ ద్వావేవ కఠినౌ పథ్యౌ,,

[కఠినములయినవి రెండే పథ్యములు.]

అని వచింపఁగాఁ గవియును,

శ్లో. కూశ్మాండకుచమండలౌ,,

[కూశ్మాండమును గుచమండలమును గఠోరము లయినవి రెండే పథ్యములు.]

అనఁగా సామగువయు సంతసించుచు,

* శ్లో. కళారత్నం,, అనియెను.

అందుకుఁ గవి,

శ్లో. గీతం,, అనిచెప్పెను.

ఇట్టిశ్లోకము నాయిరువురు నుత్తరోత్తరసారప్రశ్నోత్తరరూపముగ ముగించిరి.

అందు విద్యాసర్వస్వవేదిని. కళారత్నం! కవి. గీతం! విద్యా. శ్రవణసుఖరత్నం! కవి. హారికథా. విద్యా. రణేరత్నం! కవి. వాజీ! విద్యా. గగనతలరత్నం! కవి. దినకరః విద్యా. నిశారత్నం! కవి చంద్రః. విద్యా. శయనతలరత్నం! కవి. శశిముఖీ. విద్యా. సభారత్నం! కవి. విద్వాన్. విద్యా. నృపతికులరత్నం! కవి. రఘుపతిః.

[చతుష్షష్టికళలలో నుత్తమ మగునది యెది యనఁగా గానము అని బదులు. ఇట్లే వుయిం బయి నేర్పఱుచుకొనవలయు. శ్రవణసుఖములలో నుత్తమము హారికథ. యుద్ధమునఁ బ్రకాశించునది హయము. ఆకాశతలంబునకు నలంకారభూతుఁడు సూర్యుఁడు. రాత్రిని బ్రకాశింపఁ జేయువాఁడు చంద్రుఁడు. శయనతలంబునం దామోదావహం బగునది చంద్రముఖి. సభను బ్రకాశింపం జేయువాఁడు పండితుఁడు. రాజసమూహములలో వన్నెకెక్కినవాఁడు శ్రీరఘురాముఁడు.]

---

* పూర్ణమగుశ్లోకము.

శ్లో. కళారత్నం గీతం శ్రవణసుఖరత్నం హరికథా
రణేరత్నం వాజీ గగనతలరత్నం దినకరః,
నిశారత్నం చంద్రః శయనతలరత్నం శశిముఖీ
సభారత్నం విద్వాన్ నృపతికులరత్నం రఘుపతిః.

అనఁగా నామానవతీమణియుం దనమానసంబున నీతఁ డెందును విజితుండు గాక యున్నాఁడు. వీరిపాండిత్యంబును గవితాశక్తియుం జూడఁ గాళిదాసమహాకవివరునికిం బోలె నవిజేయంబై యున్నది. ఇందు కేమి సేయనగు? వీనిం జయించుమార్గంబు మదికిం దోఁచదు. అయినను గానిమ్ము. ఈతనిం దిట్టిచూచెదను గాక యనుకొని యిట్లనియె.

శ్లో. కఠిన,,

[ఓకఠినుఁడా]

అనఁగాఁ గవియు,

శ్లో. కుచౌ తవ బాలే,,

[ఓబాలికాతిలకమా నీకుచంబులు కఠినంబులు గాని నేను గాను కఠినుఁడను. అనియెను.]

అంత నాకామినియు,

శ్లో. చపల,,

[ఓచంచలస్వభావముగలవాఁడా.

అనఁగాఁగవియు,

శ్లో. చకోరాక్షి తావకే నయనే.

[ఓచకోరములవంటికన్నులుగలదానా! నీకన్నులు చపలములు గాని నేను చపలుఁడను గాను.] అని యనియెను.

అంత నాచతురయు,

శ్లో. కుటిల,

[కౌటిల్యముగలవాఁడా.

అనఁగాఁ గవియు,

శ్లో. సుకేశ్యలకాస్తే,

[మంచివెండ్రుకలుగలదానా! నీముంగురులు కుటిలములు గాని నేను కుటిలుఁడను గాను.] అని యనెను.

అంత నాకాంతామణియు,

శ్లో. మిథ్యావాదిన్

[మిథ్యనుబల్కువాఁడా.

అనఁగా నావనితతోఁ గవియు,

శ్లో. నతాంగి తవ మధ్యం.

[ఓనతాంగీ నీమధ్యము మిథ్యావాది గాని నేను మిథ్యావాదిని గాను. మిథ్య యనఁగా లేనిది. మధ్య మతిసూక్ష్మ మని భావము.]

అని చెప్పఁగా నావిద్యాసర్వస్వవేదిని యెవ్విధినైన నతని జయింపలేక చింతాక్రాంతయై యోచించి నిగూఢభావకలితములుగఁ గొన్నింటి నడిగి చూతమని యనుకొని యిట్లనియె.

* శ్లో. గుంజాకుంజే కుబ్జమాకందశాఖా మాలం బ్యాలం వల్లరీ రుల్లునంత్యాం,
లీలావత్యాం శౌరిణా సంలపంత్యాం శాఖాంశాఖాం మార్గతేఽసౌ బిడాలీ.

[ఒకలీలావతి బండిగురిగింజపొదరింట గుజ్జులేమావికొమ్మను బట్టుకొని లేఁదీవియ గోటంగిల్లుచు శ్రీకృష్ణునితో సరససంలాపములు సేయుచుండ నొక యాఁడుపిల్లి యచటఁ బ్రతికొమ్మను సారెసారెకు వెదకుచున్నది.]

అని చెప్పి యోకవీ యీపద్యంబునకు భావం బేమి? ఆపిల్లి ప్రతిచెట్టుకొమ్మను సారెసారెకు వెదకుటకుం గారణం బేమి? యని యడిగినఁ గవియు నలఁతిలేనగవున నవగణన సేయుచు నిట్లనియె. ఓకాంతా యాలీలావతి శుకవాణి గాన దానిపలుకులు చిలుక పలుకులవలెఁ దోఁచుచుండుటంజేసి బిడాలికి చిలుక భక్ష్య మయినవస్తు వగుటంబట్టి తల్లోభంబునంజేసి యది యాకుంజసదనంబునఁ బ్రతికొమ్మను వెదకుచున్నది. మాకందశాఖ నూఁతగాఁగొని నిలువంబడి మాటలాడుచున్నదిగానను చిలుక చెట్టుకొమ్మన నుండునది గానను శాఖలందు వెదకుచున్నది యని యిట్లు వచియించి వెండియు నామహాకవి యా విద్యావేదినిం గాంచి యోమగువా నీనుడివినపద్యంబున కేను భావవర్ణనంబు గావించితి. నానుడువుపద్యంబున కట్టీవు సేయం జను. అని యిట్లుచెప్పె.

† శ్లో. ఇందీవరాక్ష్యా స్స్ఫుటవిద్రుమోష్ఠ్యా స్సంకేత ముద్దిశ్య నిశి ప్రయాంత్యాః,
చోరా స్సమస్తాఽభరణాని హృత్వా నాసామణిం నాపహరంతి చిత్రమ్.

---

* టీక. గుంజాకుంజే = గురిగింజతీవె లల్లుకొనియుండు నొకపొదరింటియందు, కుబ్జమాకందశాఖాం = గుజ్జులేమావికొమ్మను, ఆలంబ్య = పట్టుకొని, వల్లరీః= తీవెలను అనఁగా వానియందలిపుష్పములను, ఉల్లునంత్యాం=గిల్లుచుండెడు, లీలావత్యాం=విలాసవతి, శౌరిణా = శ్రీకృష్ణునితో; త న్నదిరమ్మన్నసంకేతస్థలంబుగాన నయ్యెడకే తెంచియుండువానితో, సంలపంత్యాం = మాటలాడుచుండఁగా, అసౌబిడాలీ = ఈయాఁడుపిల్లి, శాఖాంశాఖాం=ప్రతికొమ్మను, ప్రేక్షతే=చూచుచున్నది.

† టీక. ఇందీవరాక్ష్యాః = నల్లకలువఱేకులంబోలుకన్నులుగలదియు, స్ఫుటవిద్రుమోష్ఠ్యాః = పవడంపుఁదీవియవోలె నెఱుపుమీఱులేమోవిగలదియు, సంకేతం=సా

[నల్లకలువరేకుల కొప్పయినకన్నుదోయియుఁ బవడంపుఁదీవియ ట్లొప్పయిన నును మోవియుం గలయొకకాంత తననాయకుండును దానును నిర్ణయించుకొనియుండుసంకేత స్థలంబుఁ గూటిచి పోవుచుండఁ ద్రోవయందు రాత్రివేళఁ జోరులు, దాని నడ్డగించి దానియొడలనుండు యాభరణంబుల నన్నింటిని నపహరించిరి గాని ముక్కున నుండు ముత్యమునుమాత్ర మపహరింపరైరి. ఇది కరము చిత్రము.]

అని నుడివిన విని విద్యాసర్వస్వవేదిని సుస్మితంబు గావించుచు నోకవివరా దీని భావంబు వచించెదను విను మని యిట్లనియె. ఇందుఁ జోరులు నాసామణి నపహరింప మఱచిపోయిరనుభావంబు శ్రోతృబుద్ధిభేదజనకంబుగఁ దోఁచుచున్న దది దీనిభావము గాదు. ఈకాంత యిందీవరాక్షిగాన దీనికనుదోయిడాలు నల్లకలువలచాలుం బోలి నాసామణి యూర్ధ్వభాగంబుపై నొలయుటం జేసి యాభాగము నల్లనిదయి కనంబడు చున్నది. మఱియు నది విద్రుమోష్ఠి గాన నాయోష్ఠబింబపుందొవరుఁజిగి యధోభాగం బున నుప్రసరించుటం జేసి యాభాగము రక్తవర్ణంబై కనంబడుచున్నది. కొంతభాగము నల్లనై కొంతభాగ మెఱ్ఱనై యుండునది గురిగింజ గనుక నిదియుం గురిగింజగా నుండ నోపు ననుభ్రాంతిచే నాసామణి నపహరింపరైరి. ఇదియ దీనికి భావము. ఇది ఇందీవ రాక్ష్యోః విద్రుమోష్ఠ్యాః అను పదములయందు స్ఫురించుచున్నది. అని చెప్పినం గవియుం సంతసింప నావిద్యావేదిని వెండియు నిట్లనియె.

* శ్లో. కాచి న్మృగాక్షీ పతివిప్రయోగే నిశీథినీపార మపారయంతీ
ఉద్గాతు మాదాయ కరేణ వీణా మేణాంక మాలోక్య శనై ర్ముమోచ.

[ఒకమృగేక్షణ తనపతివియోగకాలంబున రాత్రి యపారముగఁ దోఁచఁగా వినోదంబునకు వీణ వాయింపుఁ దొడంగి బిగ్గరగ గానము సేయం బూని మృగాంకుం డైన చంద్రునిం గనుంగొని మెల్లన నాసంగీతంబుఁ జాలించుకొనియె.]

---

యకునితోఁదానుజెప్పినసంకేతస్థలమును, ఉద్దిశ్య = ఉద్దేశించి, నిశి = రాత్రియందు, ప్రయాంత్యాః = పయనమయిపోవునట్టిదియు, నగునొకకాంతామణియొక్క, సర్వా భరణాని=సమస్తాభరణములను, హృత్వా = అపహరించి, చోరాః=దొంగలు, నాసా మణిం=ముక్కుననుండుముత్తియంబును, నాపహరంతి=తీసికొనరైరి. చిత్రం=సమస్తాభరణ ములనుదీసికొని యీనాసామణిని మాత్రముదీసికొనక పోవుటవిచిత్రము.

* టీ. కాచిన్మృగాక్షీ=ఒకకురంగనయన, పతివిప్రయోగే = భర్తృవిరహంబు నందు, నిశీథినీపారం = రాతిరితుదను, అపారయంతీ = కనిపెట్టనిదై, ఉద్గాతుం=ఒకింత యుబుసుపోకలకై గానముసేయుటకు, కరేణ = హస్తమున, వీణాం = వీణియను; ఆదాయ=కైకొని, ఏణాంకం=చంద్రుని, ఆలోక్య = చూచి, శనైః = మెల్లనః ముమోచ, వదలిపెట్టెను

అని చెప్పి దీనిభావంబు వర్ణింపు మనఁ గవియు సామ్యగేక్షణ చంద్రునిం జూచి సంగీతంబు నిలుపుట యేల యనఁగాఁ జంద్రుఁడు మృగాంకుఁడు; మృగమునకు గానమునందుం బ్రియ మధికము; ఈకాంత దాను కంఠంబెత్తి పాడఁగా మృగాంకుని నడుమ నుండెడిజింక చంద్రునిం దిగిచికొని తనయందకుం జేరును; చంద్రుఁడు విరహోద్దీపకుఁడు గానఁ దత్సాన్నిధ్య మనర్థావహం బగును; కాన నీవియోగదశయందు రాత్రి మృగాంకునెదుట గానము సేయం జన దని యాసంగీతకమును మానుకొనియె. ఇదియ దీనిభావం బనుచుం జెప్పి కాళిదాసుండు నోమాననీ యిఁక నొకటి యే నుడివెదను. తదీయభావంబుఁ దెల్పుమనఁగా నక్కామినియు వల్లె యనినం గవి యిట్లనియె.

1 శ్లో. మణిమయమండపమధ్యే రమమాణా కాపి కామినీ ముగ్ధా
అపరాధేన వినాఽహో కాంతం చరణేన తాడయామాస.

[మణిమయ మయినమండపమునడుమ రమించుచుండిన యొకముగుద యగు కామిని యపరాధంబు లేకయ కాంతునిం జరణంబునఁ దాఁకెను.]

అని చెప్పఁగా నాకప్పురగంధియుం మండపము మణిమయ మైనదిగాన దానినడుమం గ్రీడించుచుండినదంపతులప్రతిబింబంబులు దర్పణతుల్యంబు లగుమణిమండపకుడ్యంబులందుం దోఁప నందు ముగుద యగుకాంత యదిగాంచి తనప్రతిబింబం బన్యకామిని యనియుం నాకామినితోఁ దనభర్త క్రీడించుచున్నాఁ డనియుం నెంచి ముగుదగావున వాస్తవముం దెలిసికొనలేక కోపంబుచేఁ దనపతిని జరణంబునం దాఁకె. ఇది యీపద్యభావము అనిచెప్పి మరలఁ దా నిట్లనియె.

2 శ్లో. కాచి త్తృషార్తా తరుణీ నిదాఘే గంగాం సమభ్యేత్య సుధాసవర్ణాం,
ఆదాయ తద్వారి కరద్వయేన విలోకయంతీ నపపౌ కిమేతత్.

---

1 టీ. మణిమయమండపమధ్యే=రత్నమయమగుమండపమునడుమ, రమమాణా= క్రీడసలుపుచున్న, ముగ్ధా=ముగుదయగు, కాపికామినీ=ఒకకాంత, అపరాధేనవినా = అపరాధంబులేకయ, కాంతం = నాయకుని, చరణేన = పాదంబున, తాడయామాస = తన్నెను. అహో=అశ్చర్యము.

2 టీ. తృషార్తా = దప్పిచేత నార్తింజెందియుండు, కాచిత్తరుణీ = ఒకనిండుజవ్వని, నిదాఘే=గ్రీష్మర్తువునందు, సుధాసవర్ణాం=అమృతముతో సమానవర్ణముగలదియగు, గంగాం=గంగానదిని, సమభ్యేత్య=దగ్గఱి, తద్వారి = ఆగంగాజలమును, కరద్వయేన=కేలుందోయిచేత, ఆదాయ = కైకొని, విలోకయంతీ = ఆజలంబులం గనుంగొనుచు, నపపౌ=త్రాగకయుండెను. కిమేతత్=దప్పిచే నీరంబులం గైకొని యవి గనుంగొనుచు వానిం బానము సేయకుంట యేల?

[ఒకనిండుజవ్వని గ్రీష్మసమయమున దప్పికిం దాళలేక గంగానదికిం జని సుధకు సమానమగువర్ణము గలిగినయాగంగోదకంబులను దనకేలుదోయిటం గైకొని యాజలంబులం గనుంగొనుచు దానిం బానముసేయదయ్యె. ఇదియేమి?]

అనినం గవియు నోయెలజవ్వనీ! యానిండుజవ్వనికన్నులు వాలుగలంబోలునవి కేలుదోయి నెత్తికొన్ననీటం బ్రతిబింబితంబులై యుండుకారణంబునం జేసి తనకన్నుల బెళుకు మిథోబద్ధస్పర్ధస్ఫురితశఫరయుగళంబ యని నిర్ణయము గలిగింప నాజలంబులు ద్రాగకయ చూచుచుండెను. అని యీపద్యభావమని చెప్పి యాభామావతంసంబుం గాంచి తా నిట్లనియె.]

*శ్లో. దయితోరసి శయితా మపి దయితా మభితాపయాంచక్రే
ఉత్ఫుల్లకమలకాననపరిమళసంభారమేదురః పవనః.

[వికసించినకమలవనపుఁబరిమళభారముచే మంపుఁగొనియున్నవాయువు ప్రాణనాయకునివక్షస్థలమునం బరుండి సుఖించుచున్నదైనను నాయకునిప్రణయపాత్ర మగు వల్లభను గడుం బరితపింపం జేసెను. కమలవనవాయువులు నాయకుఁడు సమీపమున లేని విరహవతినిం గాఱియ పెట్టుట గలదు గాని మగబాడిం గూడుచు దయితునివక్షమున కెక్కియుక్కవ నెక్కొను మోహంబున జొక్కవకవా బోలునిక్కుగుబ్బల నతని యురంబుఁ గ్రుమ్ముచుండుదానికి శ్రమాపనోదనంబునం జేసి సుఖావహంబులై తోఁచవలసియుండఁ బరితాపకరంబులై తోఁచుట యేల యని ప్రశ్న.]

అని చెప్పఁగా నంగనయు నోకవికులకుంజరమా యామానిని పద్మినీజాతిదిగాన దానికిఁ జతుర్థయామము రతికాలంబు. అందుఁ దనదయితునితోఁ బునారతికిం గడంగి మగపోడుములఁ దనవిన్నాణంబు చూపుచుండెను. ప్రత్యూషము గాకమునుపు కమలములు వికసింపవు. కమలములు వికసించి యాకమలవనవాయువులు తదీయపరిమళభారభరితంబులై వీవఁగాఁ గాంతయుఁ దెల్లవారుచుండుసమయం బని యెఱింగి గురుజనంబులు నిద్రమేల్కొనకముంద కేళీమందిరంబు వాసి పోవలసిన దగుటం జేసి ప్రియవిరహంబునకు విషణ్ణయై రతితృప్తగామిఁ బరితపించుట యొప్పును. ఈభావ ముత్ఫుల్లకమలకాననపరిమళసంభారమేదురః పవనః" అనుపదముల నున్నది.

---

* టీక. దయితోరసి=నాయకునియురంబునందు, శయితామపి = పరుండియుండునదయ్యును, దయితాం = ప్రియురాలిని, ఉత్ఫుల్ల... మేదురః=ఉత్ఫుల్ల=వికసించిన, కమలకానన = కమలవనములందలి, పరిమళ = సువాసనలయొక్క, సంభార=ప్రోఁగున, మేదురః = మంపుఁగొనియుండు, పవనః = మారుతము, అభితాపయాంచక్రే=కరము తపియింపం జేసెను.

అని వచించి యాకాంచనాంగి మఱియు నిట్లనియె.

* శ్లో. నవకువలయశ్రేణీం నాఽణీయసీం కబరీభరే
బహు ధృతవతీ నీలం చేలంచ కించన బిభ్రతీ,
ఉపవనతలే కృష్ణేనా లింగితా రతిసంగతా
నగరయువతి ర్జాతా చంద్రోదయే పరితాపినీ.

[ఒకనాగరకాంత క్రొత్త నల్లకలువలమాలికలు మెండుగఁ గొప్పుఁడిందుఱుము కొని యొకనీలవస్త్రంబును ధరించుకొని యుపవనస్థలంబునందు నల్లనివాఁ డగుకృష్ణునిచే నాలింగిత యయి రతిం గలసి యప్పుడు చంద్రుం డుదయింపఁగానే పరితపించెను.]

అనఁగా గవి యోమగువా యానాగరకాంతకృష్ణునిచే నాలింగితయై రతియందుఁ గలయుచుండు వేళలఁ జంద్రోదయమునకుం గరంబు సంతసింపవలసినట్టులేకాక చంద్రోదయసమయమునం బరితపింపవలసినట్టు లేకున్నను బరితపించుటయేల యిని నీ వడిగెదవు. వినుము. ఇది పరకీయాత మోభిసారిక యనునాయిక. ఈకాంత మెండుగం గొప్పునందుఁ దుఱుముకొన్న క్రొత్తకువలయములు చంద్రుండుదయించుటచే వికసించిపరిమళములు నలుగడలం బఱపును. దానిచే నిదియుండుచో టెఱుకపడును. మఱియుఁ జీకటియందుం దెలియపడకుండం దాల్చినవన్నియుం జ్యోత్స్నయందుఁ దన్ను నెఱుకపఱుచుటకు సాధనములయి యొప్పును గాన నవియెల్లం దలంచియె యాకాంత దానునాగరిక యగుటం జేసి తనగుట్టుబయలుపడిన నలువురిలోనవ్వుఁబాటులగునుగదా యని పరితపించె ననిభావము. చీకటివేళఁ దెలియపడకుండని త మోభిసారికావేషము; నల్లకలువలు దుఱుముకొనుటయు నల్లనివస్త్రంబులఁ దాల్చుటయు ననునివియే! త మోభిసారికావేషము జ్యోత్స్నయందు విపరీతమగుటకుం దా నాకాంత పరితపించెను. అనిచెప్పి కాళిదాసుండు తనమనంబున నీ వెలది యిట్లుత్తరోత్తరయుక్తులు సమస్యలు నిగూఢభావంబుగలపద్యములును జెప్పుచుం దెల్లనార్చి మనలం దఱుముఁగొట్టనున్నది. ఇట్టిమగువతో మాటలాడుచుఁ గాలయాపనముజేసి దీనివిడిచిపెట్టిపోవుటయుం నుచితంబు గాదు. దీనిం జయించి విద్యాసర్వస్వవేదిని యనుబిరుదు దీయించి దీనిగర్వంబడంచకపోయినఁ గీర్తిగల్గదు.కవివరులును నన్ను బహూక

---

* టీక. నాణీయసీం = కడునధికమగు, నవకువలయశ్రేణీం = క్రొత్తకలువల మాలికలను, కబరీభరే = కొప్పున, బహు = మిక్కుటముగ, ధృతవతీ = ధరించినదియు, కించన = ఒక, నీలం = నల్లని, చేలంచ=చీరెను, బిభ్రతీ = తాలిచినదై, ఉపవనతలే= ఉద్యానవనస్థలియందు, కృష్ణేన = నల్లనివాఁడగు శ్రీహరిచేత, ఆలింగితా = ఆలింగనముచేసికొనంబడినదై, రతిసంగతా = కామలీలయందుఁగలయుచుండు, నగరయువతిః= నాగరికురాలైనజవ్వని, చంద్రోదయే = చంద్రుండుదయింపఁగా, పరితాపినీ=పరితాపము గలదిగ, జాతా=ఆయెను.

రింపరు. ఉషఃకాలంబు సేరుడుఁ గార్యహాని గల్గును. ఇప్పటికి యామం బొక్కటి గడఁచి నది. ఈకన్నియయన్ననో యపరసరస్వతివంటిదిగాని, విద్యలయం దించుకేనియుఁ దక్కువ గాదు. ఏనుగాఁబట్టి దీనితో నింతదనుక నోర్చితిని. ఎట్టినిగూఢభావంబునైన నిది తెలిసికొని మనకుఁ బ్రతి సెప్పుచున్నది. ఇఁక నిది తెలిసికొనఁ గూడనిది గానము. ఇది తెలిసికొనంగూడినను నోట నుడువంగూడనివ్యంగ్యార్థవిశేషంబు గలపద్యం బొక్కటి వచించి దానిభావం బడిగినంగాని యిదివిరమించుకొనదు. చేయవలసినపని యిదియ. ఇట్లు గాక యితరవిధంబున నిది విజిత గాదు. అని తలంచి తలపంకించి యిట్లనియె.

ఓవిద్యాసర్వస్వవేదినీ నీకుం గలకవితాచమత్కృతికిని విద్యావిచక్షణత్వంబునకు నేను మెచ్చుకొంటిని; నీవంటిచతురలగు కాంతల నీచతురుదధివేలావలయితం బగు భూమండలంబునం గన్నదియుం లేదు. విన్నదియుం లేదు. కరము శ్లాఘనీయ వయితివి. స్త్రీలకుం గల లజ్జావినయవివేకశీలంబులకే హాని కలిగె ననునపయశంబు నీసకాశంబునం జేరకుండ నా నుడువంగలయొకపద్యంబునకు భావంబు దెల్పుము. దెల్పవేని నీవు విజితవే యగుదువు. దెల్పితివేని నేన విజితుండ నగుదును. పూర్వ మొనరించినమనయిరువుర ప్రతిజ్ఞయు నంతటం జెల్లు నగును. అనిన నావనజాననయు మహాకవీ నాతోడ నింతదనుక వివాదంబున నోడక పయింబయి సమస్యలకుఁ బూరణములు నుక్తులకుఁ బ్రత్యుక్తులును బద్యంబులకు నిరవద్యంబులగు మాఱుపద్యంబులును జెప్పుకొనుచు నాతో సమానముగ విద్యావైశారద్యంబుం జూపినవాని నిందనుక నేఁ గాంచలేదు. మహాకవి కాళిదాసుం డొక్కరుండ నన్నుంజయించువాఁ డని వినియుంటిని. నీ వెవ్వఁడవో యెఱుంగను. ఆతనిచేతం గాక యితరులచేత నే విజితం గాను. నిన్ను మెచ్చవచ్చును. నీనుడువు పద్యంబు వచింపుము! చూతము. అనినం గవి యిట్లనియె.

శ్లో. నవకువలయపాళీకల్పితానల్పచూళీ
కమితు రుపరికేళీకారిణీ కాపి చోళీ,
అమితతిమిరజన్యాం మధ్యమాయాం రజన్యా
మమలకమలగంధై ర్వాసయామాస సౌధమ్.

---

* టీక. నవ........చూళీ = నవ=క్రొత్తగఁగోసితెచ్చిన, కువలయ=నల్లకలువల, పాళీ=మాలికలచేత, కల్పిత=తుఱుమంబడిన, అనల్ప=గొప్ప, చూళీ=తుఱుముగలది, కమితుః=దయితునికి, ఉపరికేళీకారిణీ=మగపోఁడుములుసలుపునట్టి, కాపిచోళీ=ఒకచోళకాంత, అమితతిమిరజన్యాం=అధికమగునంధకారమువర్వునట్టి, మధ్యమాయాంరజన్యాం=నడిరేయియందు, అమలకమలగంధైః=నిర్దోషములగుకమలగంధంబులచేత, సౌధం=హర్మ్యమును, వాసయామాస=పరిమళింపంజేసెను.

[ఒక చోళకాంత నవకువలయమాలికలను మెండుగఁ దనతుఱుమునం దుఱుముకొనినదై తనకాంతునితో మగపోఁడుములు సలుపుచుండునది యపారమగు గాఢాంధకారమును గలిగించునర్ధరాత్రమునందుఁ దనకేళికాసౌధంబు నంతయుం నిర్దోషమగు వికచకమలగంధంబులచేత గమగమలాడునట్లొనర్చెను.]

అని చెప్పిన విని యావిద్యాసర్వస్వవేదిని మందహాససుందరముఖారవింద యగుచుం దలవాంచుకొని యూరకుండెను. సమీపమున నుండెడుదానిసఖులు మనవిద్యాసర్వస్వవేదినిం దలవంచుకొనం జేయఁగలవాఁడు నొకఁడు వచ్చెను చూచితిరా! యనుచు నచ్చెరువందుచు ఆశ్చర్యపడి చూచుచుండిరి. కవియుం నోవిద్యాసర్వస్వవేదినీ యీపద్యభావంబు వచింప వేల! యని యడిగిన నాపడఁతి యేమియు వచింపలేక తనమనంబున నిట్లనుకొనియె. ఈకవి నుడివినపద్యమునందు నాయిక నవకువలయమాలికలు తుఱుమునఁ దుఱుముకొనియుండుటఁజేసి రతిసమయంబునఁ బరిచ్యుతమగు కబరికాభరంబునుండి యాకుసుమమాలికలు జారఁగా నాయాకువలయవాసనలు సౌధంబునం బ్రసరించె నని చెప్పవలసినట్టియుండ నట్టిసమయంబునందు వికచకమలవాసనలు సౌధంబునఁ గ్రమ్మంజేయుట యెట్లు? నిశీథసమయంబునందుఁ గువలయములు వికసించునుగాన నావాసనలు గ్రమ్మవచ్చును. కమలములు ముకుళించుసమయ మగుటంజేసి యావాసనలు బ్రసరింపవు. కువలయవాసనలు గ్రమ్మెనని చెప్పక కమలవాసనలు గ్రమ్మెనని వచించుట యేల యనునిది విరోధముభంగిగఁ దోఁచును. దీని కర్థం బిది గాదు. ఆకాంతామణి పద్మినీజాతిది. అది నిశీథసమయంబునం దనభర్తతో మగపాడి సల్పుటకుం బూని మూఁడవజామున భావాపసానంబుం జెంది కృతార్థత్వంబు నొందె. శ్లో॥ ఫుల్లరాజీవగంధస్ఫురతపయసియస్యాస్సౌరభం,, అని పద్మినీలక్షణముగాన దదనుగుణముగ వికసితతామరసగంధంబు రతిక్షుభితతదీయచరమధాతుగతంబు కేళికాసౌధంబును సువాసితంబుఁ జేసెను. అని యీపద్యభావము. ఇవి కులజాతలగు కాంతలు పురుషులయెదుటం జెప్పిన లజ్జాహీన లని యనక పోరు. ఈభావం బీతనితోనేఁ జెప్పిన నాకుం గన్యాత్వమునకు భంగంబు గల్గినట్లయగు.

శ్లో॥ స్మరణం కీర్తనం కేళిః శ్రవణం గుహ్యభాషణం
సంకల్పో ధ్యవసాయశ్చ క్రియానిష్పత్తి రేవచ,,

అని చెప్పంబడునష్టవిధరతులలో రహస్యవిషయంబులం గుఱించినసంభాషణము గుహ్యభాషణ మనురతియందుం జేరును. ఈభావంబు నోట నుడివితినే నష్టవిధరతులలో గుహ్యభాషణం బనురతి సల్పినదాన నగుదు; కాన నాకన్యాత్వంబు నెడును. లజ్జావిహీనత్వమును విస్పష్టం బగును. చెప్పకపోదునేని యితనికి విజిత నగుదును. ఎట్లును గడలుటకు లేక మిణకరింపవలసియున్నది. ఈగుహ్యభాషణంబుచేసి శీలంబు గోలుపోవుటకన్నను విద్యాసర్వస్వవేదిని యనుబిరుదు వోయినను సమ్మతమే? మఱియుం నోడిపోతి నని చెప్పుట

యు నిష్టమే! యని యిట్లు చింతించి యాదంతపుమంచంబు దిగ్గన డిగ్గి యగ్గజరాజయాన తనయుండు లోనగరునకుం జనియె. ఇట్లు సని చింతాభరాక్రాంతయై చేయునది లేక తన మనంబున నిట్లు వితర్కించెను. ఔరా! యేను నిన్ని దినంబులదనుక నెంతవలంతులనైన జయించి విద్యాసర్వస్వవేదిని యను బిరుదు గాచుకొనుచుంటిని. ఇట్టియీనావైభవం బొక కట్టై లమ్ముకొనువానివలనం జెడిపోవలసినట్లయ్యె. ఇంతకంటె నవమానము మఱేమి యున్నది? ఇది సమర్థింప నసువును లేక యున్నది. మహాకవి కాళిదాసునివలనఁ గాక యితరులవలన నా కపజయంబు గల్గ దన్న దేవతావరంబును గల్లయయ్యె. ఆజగదంబిక యొసంగినవరంబు నమ్మి యీవేశ్యాకన్యకావేషంబునం బ్రవర్తించుచున్నదాన నంతియ కాని కులశీలంబులను వ్రతంబును గోలుపోలేదు. ఉదయాదిత్యుండు నాకు భర్త గావ లయునని నే నోచిననోములును నిష్ఫలంబు లయ్యె. ఏమి సేయ నగును. ఈకట్టెలమ్ము వానికిం బత్నిని గావలసినట్లు నాతలయందు విధి వ్రాసియున్నది యేమొ! ఇట్లనుచితఘట నంబున దైవంబు కరం బాసక్తంబయి యున్నది కాఁబోలు! విధిసేతలకుఁ దప్పించుకొను వారలును గలరే! యని యిట్లు చింతించి యొకదాసిం బిలిచి నీవు పోయి యాకవిని ముప్పదిమూఁడవకట్టునకుం బిలుచుకొనివచ్చి యయ్యెడ నుండునతిమృదులశయ్యాతలం బునం బరుండుమని యొకింతసేపాతనికిఁ బూసురటులచే విసరుచుం గొన్ని యుపచారం బులు సల్పుచు నుండుఁ డతఁడేమేని వచియించిన నది యప్పుడ నాకుం దెల్పుమని కట్టడ యొనరించి పంపఁగా నది కవికడకుం బోయి విద్యాసర్వస్వవేదిని మిమ్ము ముప్పదిమూఁడవ కట్టునకుం దోడ్కొని రమ్మన్న దనఁగా విని దానితో ముప్పదిమూఁడవకట్టునం బ్రవే శించి యాదాసి సూపినమనోహరశయ్యాతలంబున నుపవిష్టుండై యాదాసి సేయు నుప చారంబులకు సంతసింపక తనమనంబున నీసైరంధ్రి కాలయాపనంబు సేయుటకిప్పు డివ్వి ధంబు సల్పుచున్నది యనియెఱింగి యిట్లనియె.

చ. మదవతిచేతివీడియము మున్ననఁ గాంచక యుండ వాసరం
బది హరివాసరం బగుచు నాత్మకుఁ దోఁచెఁ బయోజగంధి యిం
పొదవఁ గఁ గౌఁగిటం బొదివి యున్నతపీనకుచంబులందు శ
ర్మదగతిఁ జేర్చుదాఁక శివరాత్రియె రాత్రి యటంచు నెంచెదన్.

అని వచియింప విని యాదాసికయుఁ జని విద్యాసర్వస్వవేదినికిం దెల్పిన నామె గువయుఁ దనమానసంబున నీకవివచియించినపద్యమునందుం గలభావంబు కరమభినందనీ యము. స్త్రీచేతితాంబూలము తనకు లభింపమిం జేసి వాసరము హరివాసరముగఁ దోఁచె ననఁగా హరివాసరము భోజనములేనిదిన మగుటంబట్టి యీదినము తా భుజియించియుం వెలఁది యిచ్చువీడియ మందమిం జేసి భోజనము సేయన ట్లున్నది యనియు; ఇప్పుడు తరుణీ మణి నాలింగనము చేసికొనుదనుక నీరాత్రి శివరాత్రి యని తలంచెద ననఁగా శివరాత్రి

నిదురలేనిరాత్రి గాన నీమదవతి నాలింగనముచేసికొనక కంటికిఁ గూరుకు రాకున్నయది యనియెడు భావము గనంబడుచున్నది. ఔరా యీతని కవితాచాతుర్యంబు కర మభినం దనీయంబు. ఇతండు మహాకవియగుకాళిదాసుం డేమొకో? కానినాఁ డిట్టికవితాచాతుర్యం బెక్కడిది? అతండైన నిట్లు నీచునివేషంబుతో రాఁగతంబు స్ఫురింపదు. ఎట్టిచతురులును ముప్పదిరెండవకట్టున నాతో వివాదంబుచేసి యోడనివారు లేరు. అంతకుం బైన నింత దనుక మీఁదటి కక్ష్యాంతరంబులందుం జొరఁ బ్రసక్తియు లేకపోయె. కాళిదాసుండు గానినాఁడు తక్కినముప్పదికక్ష్యాంతరంబులం జొర మనుష్యమాత్రులకు దుస్సాధ్యంబు. ఈతండును మహాకవిగాని సాధారణుండుగాఁడని తోఁచెడిని. అట్లయ్యును ఏదియే నొక నెపంబు వెట్టుచుఁ గాలయాపనంబు సేయుచుండం జనును గాని యూరకుండం దగదు. ఊరకుండినం దిట్టినను దిట్టుంగాక. ఎంతవలంతియైన నొకకపటంబునం గాకపోయినను మఱియొంటనైన మోసపోకపోవునే! బుద్ధిమంతుండు దాఁ జేయుప్రయత్నంబులందు విరమించుకొనం జనదు. ఎందాక బుద్ధి నెగడు! నందాకఁ బ్రయత్నించుచుండవలయును. పయింబయిఁ బ్రయత్నించుచుండెనేనిఁ గార్యంబు ప్రాయికంబుగ సిద్ధిం బొరయక పోదు. విరమించుకొనినం గార్యహాని యనివార్యం బగుంగాదె! యని యాలోచించి కార్యంబుఁ జింతించి తనకడనుండునతిచతురయగు దూతికం బిలిచి యోసీ నీ వామహాకవికడకుం జని నీదూతీకళాకౌశలంబు ప్రకాశింప ననువు మెఱయ సమయోచితార్థంబు నిగూఢముగ వచించి యది యెఱింగి యతఁడు ప్రవర్తించిన నాతనిం దోడ్కొని వచ్చి ముప్పదినాల్గవ కక్ష్యాంతరంబునం బ్రవేశపెట్టి రమ్ము పొమ్మని మొదల యిడ నాదూతికయుఁ జని వినయ భయభక్తులు దోఁపఁ గవికడ నిలిచి మందహాససుందరవదనారవింద యయి యోకవివరా యేను విద్యాసర్వస్వవేదిని యంపినదూతికను; నీకడకే తెంచితిని. ఒకయర్థంబు విన్నవించుకొన వచ్చియున్నదానను. కరుణయుంచి యాలకింపు మని చెప్పి యిట్లనియె.

* శ్లో. సంతప్తా దశమధ్వజాస్త్రనికరైః స్సమ్మూర్ఛితా నిర్జలే
తుర్యద్వాదశవ ద్వితీయగతినా చైకాదశాభస్తనీ
సా షష్ఠీ కటిపంచమాచ నవమభ్రూః సప్తమీవర్జితా
ప్రాప్నో త్యష్టమవేదనాం త్వ మధునా తూర్ణం తృతీయో భవ.

---

* టీక. సాషష్ఠీ = రాసులలోనాఱవది; అనఁగాకన్య; కన్యాశబ్దముచేతమగువ యనునర్థమువివక్షితము. కటిపంచమాచ=ఇచటఁగటిశబ్దమునడుమునకుపలక్షణము. నడుము నైదవది. అనఁగాసింహమయిదవరాశిగనుకదానినడుమువంటినడుముగలది. నవమభ్రూః= తొమ్మిదవది ధనూరాశి. ఆధనుస్సువంటిబొమలుగలది. సప్తమీవర్జితా = ఏడవరాశితుల, తులయనఁగాసామ్యము. అదిలేనిది. ఏకాదశాభస్తనీ = పదునొకండవదికుంభరాశి. కుంభమనఁగాఘటము. దానివంటి కుచములుగలది. అట్టియాకన్య, ద్వితీయగతినా = రాసుల

అని యిట్లు సెప్పఁగా విని యాదూతికకుం గలయుక్తిచాతుర్యంబునకు మెచ్చుచు దానింగాంచి యోకాంచనాంగీ యాపంచాననమధ్యకుం దగినకించిద్విలగ్నపీవెదూతికవు. నీ సెప్పినపలుకులు రసికజనైకవేద్యంబులు. విరహిణియగు కామినికిం గలిగియుండు విరహావస్థను ద్వాదశరాసులతో వర్ణించుట కవిజనశ్లాఘనీయంబు. దీనియర్థంబును జతురేతరజన దురవగమ్యంబు. ఏ దీన సెఱింగినయర్థంబు వచింతు వినుము. 'షష్ఠిసా' అన రాసులలో నాఱవది అది కన్య. దానికిం గన్యక యనునర్థంబు వివక్షితము గావించుకొని తక్కినప్రథమాంతంబులగు స్త్రీలింగపదముల 'సాష్టమీ' యనుపదమునకు విశేషణములుగ నొనరించి యష్టమతృతీయశబ్దములకు వృశ్చికమిథునములు వాచ్యంబులు చేసిన; నాకన్యక పురుషర్షభుఁడ వగునీకొఱకు సింహామువంటినడుమును ధనుస్సులవంటి కనుబొమలును కుంభములవంటి కుచములును గలిగి తనకు సాటిలేనిసౌందర్యంబుతో నొప్పుచుండునది మకరకేతనునిశరపరంపరలచే సంతప్తయై నిర్జలస్థలంబునం బడినకటకమీనంబులువోలె మిట్టిపడుచు సహింపంజాలక తేలుగుట్టినట్లు దుస్సహంబగు వేదనం బడుచున్నది. వైశంబ నీవు మిథున మగుము అనుటయు యీశ్లోకార్థం బనిన నాదూతికయుఁ దనమనంబున నతనిబుద్ధికౌశలంబునకు సంతసించుచు నాతనిం దోడ్కొని పోయి ముప్పదినాల్గవకట్టనం బ్రవేశపెట్టి యావృత్తాంతంబు విద్యావేదినికిం జెప్పుటకుం బోయెను. అయ్యెడ నొకముసలిది తనతో నొకనిండుజవ్వనిని నొకయెలజవ్వనినిం దోడ్కొనివచ్చి కవికడ నిలిచి యోకవికులవతంసమా

---

లో ద్వితీయము వృషభము. వృషభమనగా నాఁబోతు. దానివంటిగమనముగలవాఁడవగునీచేత, అనఁగాఁ బురుషపుంగవుఁడవగునీచేత ననిభావము. దశమధ్వజాస్త్రనికరైః=రాసులలోఁ బదవది మకరము. మకరమనఁగా మొసలి. అది ధ్వజముగ నొప్పువాఁడు మకరధ్వజుఁడు. మన్మథుఁడు. వానియస్త్రసమూహముచేత, సంతప్తా=తపింపంబడినదై, నిర్జలే=జలములేనిచోట. తుర్యద్వాదశవత్=ఆ రాసులలో నాల్గవది కటకము. ఎండ్రి. ద్వాదశము = మీనము, చేఁప. ఈరెంటివలె, సంమూర్ఛితా=మూర్ఛనుజెందినదై, అష్టమవేదనాం=అష్టమరాశి వృశ్చికము. తేలు. దానివలనఁగలుగుబాధవంటిబాధను. ప్రాప్నోతి = పొందుచున్నది. అధునా=ఇప్పుడు, త్వం=నీవు, తూర్ణం=శీఘ్రముగ, తృతీయోభవ = రాసులలో తృతీయము మిథునము. మిథునమనఁగా దంపతులు. నీవు మిథున మగుము.

తాత్పర్యము. సింహామువంటి నడుమును, ధనుస్సువంటి కనుబొమలును, ఘటమువంటి కుచంబులునుగలిగి తనకుసాటిలేని సౌందర్యవతియై యొప్పునాకన్యక వృషభమువంటిగమనముగల నిన్నుంగాంచి మోహించి మన్మథుడు శరనికరంబులు పయింబయిం గుప్పఁగా మూర్ఛితయై మిట్టమీనై పడుచుఁ దేలుగుట్టినట్లు బాధపడుచున్నది. ఇప్పుడు నీవు వైశంబ యాకామినికి జతగాఁడ వగుము.

నీవు శృంగారశాస్త్రపారీణుండవు; నీవంటిరసికోత్తముని గానలేదు; సుందరుండును సుకవియు నైన వాఁ డెట్లుండినను సుందరీజనవ్యాసంగంబు లనురక్తంబులు గాక యుండునే? అట్లు మదనశరతాపతప్తలగు ముగుదల నేలుకొనకపోయినం బాపంబు గదా! తమకుఁదామ వలచివచ్చినకులుకులాడులఁ గౌఁగిలించుకంటె నింద్రభోగంబు వేఱొండు గలదా! మాప్రార్థన మంగీకరించి మమ్ముం గృతార్థలం జేయుమీ యని యిట్లనియె.

ఉ. మొల్లలగంధి కూఁతు రది ముంగిట నున్నది దాని జూఁడు ము
త్ఫుల్లసరోజనేత్ర యిది పుత్త్రికపుత్త్రిక దీనిఁ జూఁడు నే
నెల్లవిధంబుల న్రతుల నేలినదానను నన్నుఁ జూఁడు నీ
వల్లుఁడ వయ్యెదో మగఁడ వయ్యెదవో మనుమండ వయ్యెదో.

అని పలికినం గవియుఁ దనమానసంబున నీనాతి యీనెపంబునఁ గాలహరణంబు సేయ వచ్చినది. దీనికి బదులు సెప్పి పరావృత్తం గావించి యీహజారంబు దాఁటుదుం గాక యనుకొని యిట్లనియె.

ఉ. మొల్లలగంధి కూఁతు రది ముంగిట నున్నది దాని మాన ను
త్ఫుల్లసరోజనేత్ర యిది పుత్త్రికపుత్త్రిక దీని మాన నీ
వెల్లవిధంబుల న్రతుల నేలినదానవు నిన్ను మాన నే
నల్లుఁడ నయ్యెద న్మగఁడ నయ్యెద నే మనుమండ నయ్యెదన్.

అని చెప్పిన విని యావృద్ధవారాంగన తలవంచుకొని తనమనంబున నితండు నేఁ జేసిన నీచకార్యంబునకు రోసి యిట్టిదుష్టచేష్టలు సలుపుభోగమువారికిం దగులునట్లు నిందింపం గడంగి వేశ్యలు వావివరసలులేనివార లనుభావంబును నానుడివినపద్యమునకుం బదులుసెప్పినపద్యంబుచే నెఱింగించె. ఇఁక నీతనితోఁ దర్కింప రాదు. ఇంతటితోఁ దప్పించుకొనుట మేలు. అనితాఁ దోడ్కొనివచ్చినసెలంతలం దీసికొని చనియె. కవియుం ముప్పదైదవహజారంబుం దాఁటెను. అయ్యెడం గొందఱు మందయానలు జూదమాడుచుండువారలు లేచి యతని నెదుర్కొని యోయయ్య మాతో నోటువడక జయించి గాని యీవాకిలి దాఁటంగూడదు. ఇదిమాయేలికసానిముదలయనినఁ గవియు నట్లకానిండనఁ గా వారలలో నతిచతురయగు మదవతి కపటద్యూతంబాడి పరాజితయై యతనితో నోయయ్యా; మీరుదాతలు; మేము యాచకులము; కరుణించిమాకోరినదాని నూరక యొసంగి పొండని వేఁడుకొనఁగాఁ గవి తనమానసంబున నీచతురను నీ ప్రార్థితం బేమని యడిగితి నేని యుద్దిష్టకార్యవిరోధంబగును. గాన దీనిని నిష్కృతిమెయి నివృత్తం జేసిపోవలయునని తలంచి యోసి! యొకమానికఁ దెమ్ము నీవడిగినదానిని నూరకనీకొసంగెదనని యదియొకమానికం గొనిరా దానియందు నీరు నిండించి యీమానిక యెట్టున్నది యనియడిగెను. జలభరితమై యున్నదని

నాకుం బని లేదు; నీవలన నాకుఁ బిడికెడన్నంబ యపేక్షితము. అదియు నిడలేక యిట్లు తిరిగుచుండువాఁడ వేల వివాహంబు చేసికొనవలయుం? న్యాయమా యిది! యని యిట్లు వల్కుచు శిశువులం దనపైకిం దోలఁగాఁ గవియుం మనంబునఁ గరం బచ్చెరు వొందుచు నో! నీవు నాకు భార్యవగుట నిజంబగునేని నానుడివిన ప్రకారంబునం బ్రవర్తింపం దగునుగదా ఈశిశువులం దీసికొని నావెనువెంట రమ్ము. మాఱుమాట వల్కకు మనిన నాయనాగరికాంతయు నాశిశువులం దోడ్కొని యాకవివెంటం జనుచుండెను. వారలతో ముప్పదేమిదవహజారంబుం దాఁటి యతివేగంబునం బోవుచుండె. అయ్యెడ నొకసువేషాలంకృతుఁడొక్కరుండు సనుదెంచి యోయయ్యా నీ పేరేమి? యని యడిగినఁ గవియును దారుశిరుడనువాఁడ ననఁగా నతఁడు నీయుద్యోగం బేమి? యేయూర నుండువాఁడవు? ఏమిపనికై యిచ్చోటికిం జనుదెంచితివని ప్రశ్న సేయఁ గవియు నోరీ నాకుం గట్టెలుగొట్టి తెచ్చియమ్మకొనుట యుద్యోగము. ఈసింహపురి నున్నాఁడను. విద్యాసర్వస్వవేదినికడకుం జనుచున్నవాఁడ నని బదులు సెప్పెను. ఇంతలో మఱియొక్కరుండు తాటాకులకవిలెకట్టయొకటి యెత్తుకొనివచ్చి పూర్వపరిచితుండువోలె సెగాదిగఁ జూచి చూచి బహుకాలమయినట్లు లభినయించుచు నతండు కవిపాలికేతెంచి యోయయ్యా నిన్నుం గాంచి యెన్నిదినంబులయ్యె; నాకడ నప్పు దీసికొనునంతదనుకఁ బ్రతిదినము వచ్చుచుంటివి. నెయ్యుండవని నేన నప్పుడగక యిచ్చుచు వచ్చితిని. నీసహోదరుని పెండ్లికి వస్తువులు గావలయు నని కోరియుంటివి. పెండ్లికాఁగానే వత్తు ననియుఁ నాఋణము సెల్లింతు ననియుం నెదురుచూచుచుంటిని. ఇన్నిదినములదనుక రాకపోతివి. నాఋణమచ్చవలసియుండి యిప్పుడు దైవవశంబున వచ్చితివేమొ? యెఱుఁగను. నాయప్పు నాకిచ్చి యడుగువెట్టుము ఇదిగో! నీపేరనుండు లెక్క చూచుకొమ్మని చేతికిచ్చినం గాంచి మహాకవి లోన నవ్వుకొనుచుఁ దనహృదయంబున నిట్లనుకొనియె. ఇట్టి దుస్తరంబులగు కపటంబులం దగులుకొని యెవ్వండేని నిస్తీర్ణుండగునే! భళిరా! యీకపటరచనాచమత్కారము. అని తలంచుకొనుచు నాతాటాకుల కట్టలవానితో నోయన్నా! నేను నీకచ్చవలసినఋణంబు సత్యంబ కదా! యని యడిగి యందు కతండౌ ననినఁ గాళిదాసుండు ఋణముదీసికొన్నవాఁడు ధనహీనుం డయ్యెనేని యప్పిచ్చినవాఁడు తనధనంబును రాఁబట్టుకొనవలసినవిధంబు నీకుం దెలిసియుండునుగదా! ఇట్లెందఱికో నీవప్పు పెట్టియుం బెంచియు రాఁబట్టుకొని యుండువాఁడవే. దీనికి నదుపాయం బేమియో నీవే వచింపుము. అని యడిగెను. అందుల కాతఁడు మనంబున నీతండు తనకపటంబునకుం జిక్కుపడినవాఁ డని యుబ్బొంగుచు నోరీ యప్పుసెల్లింప ధనము లేకున్న సొత్తులు తాకట్టువెట్టి చనవలయు నంతియకాని యొం డేమియు నుండ దనినం గవియుం నట్లయిన నాసొత్తు లిప్పు డియ్యెడ నుంచునవియెల్ల నీకుం దాకట్టుపెట్టినవాఁడ ననిన నాతండు నీకుంగల సొత్తు లేవి యని యడుగఁగాఁ గవియుఁ దన వెంబడిన వచ్చు

ననాగరికకాంతను దానిబిడ్డలనుం జూచి నేను సాధనము సెల్లించుదనుక నాభార్యాపుత్రులను నీకుం దాకట్టువెట్టియుంస్నాఁడ నిందులకీ వనుమతింపకపోవుటకు న్యాయంబు లేదనిన నాగణకుండు నివ్వెఱపడి తనమనంబున "నయ్యవారిని జేయఁ బోవం గోఁతిపిల్ల యాయెనే" యని యనుకొనుచుఁ దనకుఁదాన మోమువంచుకొనిపోవుచుండం గవియు నా యనాగరికకాంతం జూచి యోసీ నిన్ను నీసుతులను నే నీతనికిం దాకట్టువెట్టియున్నాను. వానికడన మీ రుండం జను నని తఱుమంగొట్టి ముప్పదితొమ్మిదవహజారంబుఁ దాఁటి చనుచుండెను. ఈవృత్తాంతంబులెల్ల సకియలు విద్యాసర్వస్వవేదినికిం దెల్పఁగా నా కాంతయుఁ దనమానసంబున నిట్లు చింతించెను. ఔరా! యిన్నికపటోపాయంబులు వన్నియుం నివియెల్ల నాకవివరునిబుద్ధిచతురతకు ఖరకిరణునికిరణజాలంబునకు హిమంబు వోలె నడంగెడిని. కవితాచాతుర్యంబునందు మాత్రమే కాదు. కపటోపాయంబునందు సైతం మతఁడు సాటిలేనివాఁ డనుటకు సందియం బేమియు లేదు. నీచలగు వేశ్యాకన్యకలు సేయుకపటప్రయత్నంబులు సయితము చేసితిని. అందులకును మోస పోక యున్నాఁడు. ఏ నీతనికిం గొంగువేయక యుండుమనట్టియుపాయంబు లెన్నియేనిం జేసి నాశీలంబుం గాచుకొనియెదనుగాక. ఇప్పటికి సమయోచితముగ నే నియ్యెడ వాసి వేఱొకచోటికిం జనుట యురవు. అట్లయిన నితఁడు తక్కినహజారంబుల జయించియుం నేమిసేయంజాలు ? పురుషవేషంబుతోఁ బోయి యతఁడు సూచుచుండ నీమందిరంబు వాసి చనియెద. అని యాలోచించి తాను పురుషాకారంబునకుం దగిననేపథ్యంబుం దాల్చి నలువదవకట్టునఁ గవి ప్రవేశించునంతకు నాతని కెదురేఁగుదెంచిన మహాకవియుం నామగువం గాంచి మొగంబునంగలలక్షణంబుల గుఱితించి విద్యావేదినిగా నెఱింగి తనమనంబునందు ఆహా! దీనిచతురతయేమందును ? వేషాంతరము దాల్చి తన యుండుసౌధంబును రిత్తసేసి వెడలిపోవసమకట్టినయది. దీనిం బోనిచ్చిన నింతదనుక నాపడినప్రయాసంబునకు ఫలంబు లేకపోవును. ఇప్పుడిది వచ్చియుండుకపటమున కనురూపముగ మాటయిచ్చి యుద్యుక్తకార్యమునందు విరత యగున ట్లొనర్చెదం గాక యని యిట్లాలోచించి యాపురుషవేషధారిణిం జీరి,

శ్లో. క్వ భ్రాన్త శ్చలితోసి
[ఓయన్నా యెక్కడ కేఁగెదవు.]
అని యడిగెను.

అందుల కావిద్యాసర్వస్వవేదిని తనమనంబున నితఁడు నన్నెక్కడ కేఁగెదవని యడుగుచున్నాఁడు. అవశ్యకముగఁ బోవలసినకార్యం బొక్కటి వచ్చినం గాని యింతఁడు వోనివ్వఁడు. ఆకార్యము భేషజార్థముగం బోయెద ననుటయ యనివార్యము అని యూంచి,

శ్లో. వైద్యకగృహం

[వైద్యునియింటి కేఁగెదను]

అని బదులు సెప్పెను.

అందుకుం గవి

శ్లో. కిం తత్ర,

[అచట నేమిపని.]

అని యడిగెను.

అందులకాయువిద,

శ్లో. శాంత్యై రుజాం,

[రోగములను శాంతిపఱుచుకొనుటకు.]

అని పల్కెను. అది విని యాకవి మరల నిట్లనియె.

శ్లో. కిం తే నాస్తి గృహే తవప్రియతమా సర్వం గదం హంతి యా
వాత శ్చే త్కుచకుంభమర్దనవశాత్ పిత్తంచవక్త్రామృతాత్
శ్లేష్మాణం వినిహంతి హంత సురతవ్యాపారకేళిశ్రమాత్.

[ఓయన్నా నీకు నీయింటం బ్రియురాలు లేదా! రోగశాంతికి వైద్యునింటి కేలపోవలె! సమస్తరోగంబులను భార్యయ హరింపంజేయును. అ దెట్లనిన! సర్వరోగములకును వాతపిత్తశ్లేష్మము లనునవి మూఁడు దోషములు కారణములు. ఆమూఁడిటిని బోఁగొట్టినఁ దజ్జనితములైనరోగంబులును శాంతి నొందకపోవు. ఆమూఁటిలో వాతరోగంబయ్యేనేనిఁ గుచకుంభములమర్దనంబునను, బిత్తం బయ్యేనేని యధరామృతం బొసంగియుం శ్లేష్మం బయ్యేనేని రతివ్యాపారముల శ్రమపఱిచి తన్మూలకముగను త్రిదోషంబులను హరించును. నీవేల యిందుకు వృథాయాసంబుఁ జెందెదవు. ఇంటికే కేఁగుము]

అని చెప్పిన నాకవివాక్యంబులకు మాఱు పల్కక వెఱచి ఇయ్యేడ నిఁక నుండినఁ దనకపటంబుఁ బ్రత్యక్షమున వచించి పరిభవించునోకో యని సంశయించి వేగ తనయింటికిఁ బోయి యావేషం బుజ్జగించి యాకవివలనం దప్పించుకొనునుపాయం బొం డేమి గల దని విచారించి యిఁక నీతని సామంబున వంచింతు నని నిర్ణయించి తన దాదులం బిలిచి యోసీ మీర లాకవి నలువదొకటపకక్ష్యాంతరంబునం బ్రవేశించుటకు ముంద యచటికిం జనియుండి యచట నతిమనోహరముగ నిర్మితంబై యున్నప్రాసాదోపరిభాగంబునం గలచంద్రశాలయం దతిమృదులపుష్పశయనంబునందుం గూరుచుండం బెట్టి మదీయంబగు నాకేళికాగృహంబున వీణావేణుమృదంగాదివాద్యంబులతో మీరలు గానంబు సేయుచుండం జనుఁడు. అది వినుచుం గాలంబు జరపిన మేలయ్యె. అట్లుగాక యుతఁడు దేదేని పఠియించినచో నతిశీఘ్రంబున నాకుం జెప్పునది యనిన వారలు నని కవి

సెమర్కొని తోడ్తెచ్చి యత్యున్నతప్రాసాదోపరిభాగంబునం బరఁగుచంద్రశాలయందు నతిమనోహర మయినకేళికాగృహంబునం బూలపానుపుపయిం గూరుచుండం బెట్టి యా మానినీతిలకంబులు కవిం బలసికొని వీణాదివాద్యస్వరంబులతోఁ దమకంఠనినాదంబు మేళగింప నతివైదగ్ధ్యంబు మెఱయం బాడఁగా విని కవియు నాసంగీతకంబునకు మెచ్చుచు నిట్టికార్యంబులం గాలహరణంబు సేయుచు వీరలు తన్నుం దఱుమఁగొట్టుటకు సిద్ధపడియుండుట యెఱింగియున్నవాఁడుగాన నప్పు డామందయానలు విన నిట్లనియె.

* శ్లో. ఆసాయం కథమ ప్యనాయి దివస స్సంకల్పజాలై ర్మయా
దీప్య త్యద్య వియోగదీపకళికే చేతః పతంగాయతే
ప్రాసాదేపి శిరోగృహేపి సుమన స్తల్పేపి కేళీగృహే
నిద్రా నైతి నిశా న యాతి తరుణీ నాయాతి కా యాతనా.

అని చెప్పఁగా నది విని యాసుందరులలోఁ గొందఱు విద్యావేదినికిం దెలుపం జనిరి. కవియు నది వ్రాసి నలువవిరోడవహాజారంబునం జోరం బ్రయత్నించుచుండెను. అప్పుడు విద్యాసర్వస్వవేదిని తనదాదులవలనఁ గవిచెప్పినశ్లోకంబు విని దానియర్థంబునకు మనంబున శ్లాఘించుచు శ్లోకార్థం బొకటి వ్రాసి తన చెలికత్తెలచేతి కిచ్చి యిది మీరు గొనిచని యాకవిచేతి కిచ్చి దీనికిం బదులు వాఁడేమి వ్రాయునో తీసికొని రండని పంప నది గొనిచని దానిసఖులు విద్యాసర్వస్వవేదినిచీటి యిది యని చెప్పి యీ నది యందుకొని కవియు నందు,

---

* టీ. ఆసాయం = సాయంకాలముదనుక, మయా = నాచేత, దివసః = దినము, కథమపి = ఎట్టకేలకు, సంకల్పజాలైః = మనోరథములపరంపరలచేత, అనాయి = గడపఁబడెను. రాత్రి కాఁగానే కాంతామణితో ననేకవిధములసుఖంబనుభవింపవచ్చు ననుమనోరథములను మనోరథించుచు నందువలన నూరాడుచు దినంబు గడుఁగష్టపడుచుం గడపితి ననిభావము. అద్య = ఇప్పుడు, వియోగదీపకళికే = విరహమనియెడిదీపకళిక, దీప్యతి = జ్వలింపఁగా, దానియందు, చేతః = హృదయము, పతంగాయతే = శలభమై దాని యందుఁబడుచున్నది. దీపమునందు శలభమువలెవిరహాగ్నియందు మానసముదగ్ధమయి పోయెడిననిభావము. ప్రాసాదేపి = మిద్దెయింటను, శిరోగృహేపి = చంద్రశాలను, సుమనస్తల్పేపి = పూలపానుపునను, కేళీగృహేపి = కేళికామందిరంబునను, మనంబునకును శరీరమునకును సుఖకరముగునిట్టిచోటులం దన్నుంచినను అనిభావము. నిద్రా = నిదుర, నైతి = రాదు. నిశా = రాత్రి, నయాతి = గడవదు. తరుణీ = జవ్వని (విద్యావేదిని) నాయాతి = రాదు. కాయాతనా = ఏమి? యీబాధ! విద్యాసర్వస్వవేదినిరాక మీఁద నిట్టిమనోహరస్థలంబుల నిట్టియుపచారంబు లొనర్చినను సుఖముగలుగదు. మఱి బాధయతిశయించుచున్న దనిభావము.

శ్లో. అల మతిమలినత్వాత్ స్వప్నమాయోపమత్వాత్
పరిణతివిరసత్వాత్ సంగమేన ప్రియాయాః,

[అతినీచం బగుటంజేసియు స్వప్నమాయాసదృశం బగుటంజేసియుఁ బరిణామ విరసం బగుటంజేసియుం బ్రియాసంగమంబుఁ గోరుట మానుకొనుము.]

అని వ్రాసియుండుటఁ జూచి దానియందుఁ గవి యిట్లు వ్రాసెను.

శ్లో. వయ మపి శతకృత్వ స్తత్వ మాలోచయామ
స్తదపి న హరిణాక్షీం విస్మర త్యంతరాత్మా.

[మేము పెక్కుశాస్త్రంబులు సదివినవారమే. ఏమును పలుమఱు తత్త్వమాలోచించుచు నున్నవారమే. అట్లయ్యు నంతరాత్మ మాత్ర మాహరిణశాబకనయన నొకప్పటికిని మఱువక యున్నది.]

అని వ్రాసి యిది యావిద్యాసర్వస్వవేదిని కొసంగుం డని యీ వారలును దాని కడకుం బోయి యాశ్లోకార్థంబు నొసంగిన నదియుం విచారగ్రస్తయయి తనహృదయంబున నీతనికి నేను గాంతానురాగము కల్మల మగుటం జేసి మానుకొనుట పండితుండ వగు నీకుం దగు నని చెప్పఁగా నాతఁడు నేను సదివినది తథ్యంబ యైన నిందు బుద్ధి నివర్తింపక యున్నదని బదులు సెప్పియున్నాఁడు. ఇఁక నిట్టిపత్త్రంబులు మానుకొని శాస్త్రవిచారంబున దించి యీతని సామర్థ్యంబు గనుంగొన నగును. కాలయాపనంబునకేని వేఱొం డుపాయంబు గానము. అని యాలోచించి తనకడ నుండువిదుషీశిరోమణులం జీరి మీర లాకవిసనుదెంచుమార్గంబున నాయాస్థలంబులం దాయామతానుగుణవేషభాషాభూషణాదులు దాల్చినవారగుచు నిలువంబడి యుండి మీమీవేషభాషాదులం గాంచి తత్తత్స్థానంబులఁ దత్తన్మతాభిప్రాయంబులు మీఁ డడుగకయ యాతండు దెలిసికొని యాయాసిద్ధాంతాసనంబుల పయిం గూరుచుండి యయ్యయ్యెడల మతసిద్ధాంతంబులు సెప్పఁ గొనుచు వచ్చునేని నిషేధింపక వినుచు నాకుం దెలియఁబఱచునది. సిద్ధాంతం బుపన్యసింపనిచో నైన నన్యథా యుపన్యసించిననైన మార్గనిరోధంబు సేయునది యని మొదలయిడి పంపఁగా వార లాయామతానుగుణవేషంబులు దాల్చి యాయాస్థలంబుల నుండిరి.

గీ. ఈవినోదకథావల్లి నింపుమీఱు, మూఁడవగుళుచ్ఛమునభక్తిముఖ్యముగను
పూజచేసితి హరి నిన్ను నోజ యెసఁగఁ, దనరువెలుగోటియాచభూధవునికృపను.

ఇది శ్రీరాధానాథచరణకమల చంచరీకాయమానమానస భారద్వాజకులపవిత్ర తిరుమలార్యపుత్త్ర పేరుందేవీగర్భజన్మ చిలకపాటి వేంకటరామానుజశర్మ ప్రణీతంబైన వినోదకథాకల్పవల్లియందుఁ దృతీయగుళుచ్ఛము సంపూర్ణము.

---

శ్రీరామజయము

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# వినోదకథాకల్పవల్లి

## చతుర్థగుచ్ఛము.



### మంగళాచరణము.

క. శ్రీరాధానవనసలీ, లారంభవిరాజమానహారిసులక్ష్మో
దారసుకుమారసుందర, నీరదతనురుచికి హరికి నే బ్రణమింతున్.

### కాళిదాసుండు మతతత్త్వంబుల సిద్ధాంతీకరించుట.

అప్పుడు మహాకవి నలువది రెండవకక్ష్యాంతరంబునం బ్రవేశింప నయ్యెడం గొందఱు,

చ. తిలకము ఫాలభాగములఁ దిద్ది సుదర్శనపాంచజన్యసం
కలితసరోజలక్ష్మపరికల్పితకాంతిని కాంతసుందరో
జ్జ్వలతనువుల్ నవీనమృదువర్ణితపీతపటంబు లొప్పఁగా
లలిఁ దులసీస్రజంబులు గళంబులఁ దాల్చినవైష్ణవాగ్రణుల్.

వినయసంభ్రమంబులు మెఱయఁ దమతమయాసనంబులనుండి లేచి శ్రీహరిస్మరణంబులు సేయుచుఁ దత్కథాకథనంబులతో మహాకవి నెదుర్కొని పాదంబుల కెఱఁగి ప్రణయరసపూరితమానసులువోలె నాతిథ్యంబున సత్కరింప నలరుచుఁ బురుషవేషధారిణుల నావిద్యాసర్వస్వవేదిన్యాజ్ఞాకారిణుల నెఱింగి తనమానసంబున నీకాంతాతిలకంబు తనకడనుండువిదుషీశిరోమణుల నీయాకారంబులచేఁ గాలయాపనం బొనరింపం బంచినయది యని తలంచి కాని విష్ణుమాయలా! నన్నడ్డగింపంగలవు; వీరలమతంబునం గల సారాంశం బీసభ నుపన్యసించిన నంతట వీరినిర్బంధంబు మానకపోదు. అని తలంచి తత్ప్రార్థితుండై యయ్యెడనుండు నతివిశాలస్ఫటికశిలామండపమధ్యభాగంబున నమర్చిన మణిమయాసనంబున నుపవిష్టుం డగుచు వారలం గాంచి యి ట్లనియె.

* శ్లో. ఈషన్మీలితలోచనో దృఢతరప్రారబ్ధయోగాసనో
యద్బ్రహ్మాదిసురేంద్రవందితపద శ్శంభు స్స్వయం ధ్యాయతి,

---

* టీక. యత్ =ఏవస్తువును, బ్రహ్మాదిసురేంద్రవందితపదః=బ్రహ్మ మొదలగు దేవనాథులచే సేవింపంబడినపాదములుగలవాఁడగు, శంభుః = శివుఁడు, దృఢతరప్రారబ్ధయోగా

వైకుంఠైకనికేతనం జగ దభివ్యాప్య స్థితం లీలయా
తద్బ్రహ్మాఖ్యవపు స్సదైవ ముదితం చేత స్సమాలంబతామ్.

అని యిట్లుపన్యసింప విని వైష్ణవవేషధారిణులగు విద్యాసర్వస్వవేదినీనిదేశకారిణులు వైష్ణవమతతత్త్వోపన్యాసంబున నించుకేనియుం భేదము లేకుండుట కచ్చెరు వందుచు విరచితాంజలులై యుగ్గడింప వారల వీడ్కొని యయ్యెడనుండి పయనంబయి నలువది మూఁడవకక్ష్యాంతరంబునం జొర నందు.

చ. అరుణజటాకలాపముల నందము మీఱెడు మౌళిభాగముల్
నిరుపమభూతిభూషితవినిర్మలముగ్ధతనుద్యుతుల్ ధృత
స్ఫురదరుణాక్షమాలికలు సొంపులు గుల్కెడువ్యాఘ్రచర్మ మం
బరముగఁ దాల్చి యుండుకటిభాగములుం గలశైవపుంగవుల్.

తన్నుం గనుంగొని ప్రణయపరిపూరితాంతరంగంబులతో యథోచితసపర్యావిశేషంబులు సలుప నాశైవదీక్షావిచక్షణులవేషంబులు ధరించినవిద్యాసర్వస్వవేదినీనియుక్తలగు పక్ష్మలాక్షులం;దనకుం బతిప్రదానంబు సలుపం బ్రార్థించి శైవదీక్ష వహించి యనేకతనువులం బరిగ్రహించి యోగంబున నిలిచి తదేకధ్యాననిష్ఠం బూనుటం జేసి భ్రమరకీటన్యాయంబునం దన్మయత్వంబుం గాంచినంతిపతిసతులో యన నొప్పునెలజవ్వనులం గరం బభినందించి వారలవేడికోలున కియ్యకొని తన్మధ్యమున నొకవటవిటపిమూలంబున నమర్చి యుండునొకబ్రుసిం గూరుచుండి తన్నుం బలసికూరుచుండినయవ్వారలభావంబులం గలయఁ బరికించి యిట్లనియె.

---

సనః = కరము దృఢతరముగ యోగాసనంబమరిచికొనినవాఁడును, ఈషన్మీలితలోచనః= ఇంచుకమూసికొనిననేత్రములుగలవాఁడునై, స్వయం=తాను, ధ్యాయతి=ధ్యానించెడినో! వైకుంఠైకనికేతనం = శ్రీవైకుంఠమే ముఖ్యమగుస్థానముగావసించుచు, లీలయా=విలాసార్థము, జగత్=జగంబును, అభివ్యాప్య = వ్యాపించికొని, స్థితం=ఉండెడు, తత్=ఆ, బ్రహ్మాఖ్యవపుః = బ్రహ్మమను పేరంబరగుచుండుశరీరముగలవస్తువును, చేతః= మానసము, సదా=ఎల్లప్పుడు, ముదితం సదేవ= మోదమునొందినదియగుచు, సమాలంబతాం = ఆశ్రయించుఁగాఁత.

శ్రీవైకుంఠంబునందు నారాయణుండు వసించి చేతనసంరక్షణముఁ గావించుచుఁ దాను లీలార్థముగ సృజించియుండు నీజగమున నంతరాత్మస్వరూపముచే వ్యాపించి బ్రహ్మమనియుం విష్ణువనియుం వాసుదేవుండనియుఁ జెప్పంబడుచుండును. అట్టియా బ్రహ్మమయుండగు నారాయణుని శివుండు దాను వైష్ణవాగ్రణియగుటం జేసి యోగాసనంబుననుండి హృదయకమలంబున ధ్యానించుచుండును. అనునిది వైష్ణవమతము.

* శ్లో. యం గాయంతి సదా సమస్తనిగమా ధ్యాయంతి యం యోగినో
యస్యాజ్ఞా మధిగత్య దైవతగణాః కుర్వంతి సృష్ట్యాదికం
సోయం త్వా మవతా న్నిరాకృతి రపి త్రాతుం జగ త్సాకృతిః
ధ్యాయన్ స్వం స్వయమేవ సర్వజగతీరక్షాకర శ్శంకరః.

అని నుడువంగాఁ గవివచనంబు లాలకించి శైవమతతత్త్వంబు నొకించుక భేదప డక యుండుటకుఁ దా మంతరంగంబుల సంతసంబు లందుచు సాధువాదంబులు సలిపినం గని మహాకవి వారల వీడుకొని యచ్చోటు వాసి నలువదినాల్గవకక్ష్యాంతరంబునం బ్రవే శింప నయ్యెడ,

చ. అరుణజపాసుమంబు శిరమందును మల్లెలదండ లాసఁ దా
మురమునఁ దాల్చి ఫాలముల నొప్పికఁ జేఫ్రుఱు మీఱుగందపుఙ్
గరగరనైనబొట్టిడి ఘనం బగుభక్తి సెలంగ దేవి నా
దరమున సంస్తుతించుచు ముదంబున శాక్తులు గొంద ఱుండఁగన్.

మహాకవియు వారలం గనుంగొని తనమనంబునం దియ్యెడ నుండువీరలు శాక్తులు; పరబ్రహ్మమహిషీధ్యాననిష్ఠాగరిష్ఠులు వీరలు; సాక్షాత్కరించినబృహస్పతుల యనం జెప్ప నొప్పుబుద్ధివిశేషంబున నెసంగుచుండుదురు. ఆ దేవియనుగ్రహంబునకుం బాత్రులయి యుం డుదురుగాన వీరలతో వివాదంబునకుం గడంగుటకు శక్యంబు కాదైనను నాయభీష్టప్రద

* టీ. యం=ఎవ్వనిని,సమస్తనిగమాః=ఎల్ల వేదములును, గాయంతి=గానము సేయు చున్నవో;యం=ఎవ్వని, యోగినః=యోగముసల్పువారు, సదా=ఎల్లకాలము, ధ్యాయంతి= ధ్యానము సేయుదురో, యస్య=ఎవ్వనియొక్క, ఆజ్ఞాం=ఆనతిని, అధిగత్య=పొంది, దైవత గణాః=దేవతలసమూహంబులు, సృష్ట్యాదికం=సృష్టి మొదలగు కార్యములను, కుర్వంతి = చేయుచుండెడినో; సోయం = అట్టివాఁడు, నిరాకృతిరపి = రూపములేనివాఁడయ్యు, జగత్=ప్రపంచమును, త్రాతుం = రక్షింప, సాకృతిః = ఆకారముఁదాల్చినవాఁడును, స్వం=తన్ను, స్వయమేవ=తానే, ధ్యాయన్=ధ్యానించువాఁడును, సర్వజగతీరక్షా కరః=ఎల్లజగంబులకు రక్షణముసల్పువాఁడును అగు, శంకరః=శంకరుఁడు, త్వాం=నిన్ను, అనఁగానీతోఁ జేరినయందఱను, అవతాత్=రక్షించుఁగాత.

వేదంబులనన్నిట శివునిమాహాత్మ్యము ప్రతిపాదింపంబడియున్నది. ఇతనిని యోగీశ్వ రులు సర్వకాలములందును ధ్యానించెదరు. ఇతనియాజ్ఞంగైకొనియె బ్రహ్మాదిదేవతలు సృష్ట్యాదికార్యంబులం జేయుచుండెదరు. ఇతనికి వాస్తవాకారంబున రూపంబులేదు. భక్తులనుగావ నాకారంబుఁ దాల్చియున్నవాఁడు. తన్నుఁదానె ధ్యానముసేయుచు సర్వజగంబులను రక్షించుచున్నాఁడు. అని యీశ్లోకముతాత్పర్యము.

యము నాదేవియుం గాన నే నియ్యోడం బరాభవంబు నొంద నని తలంచుచు వారలకడకుం బోయి యధోచితాలాపసత్కారాదులం బూజితుండై యపరిమితవైభవాధరీకృతపురమథనసుందరీక్షీరసాగరమధ్యమందిరంబగు సభామందిరంబునం బంగరుదీపస్తంభంబులనడుమం బెక్కువిధంబులగు దేవీయంత్రంబులు గల్పితంబులయి యుండుచోట నొకమనోహరాసనంబునందుం దత్ప్రార్థితుండై యుపవసించి వారలభావంబు లెఱింగి యిట్లనియె.

* శ్లో. యా మాసాద్య విధీయ తే హరిహరబ్రహ్మాదిభి ర్దైవతైః
స్వీయం స్వీయ మతీవ దుష్కరతరం కర్మ క్షణా ల్లీలయా
సా దుర్గా భవభీతిరీతిశమనీ లోకత్రయత్రాయిణీ
భూయా ద్వః ప్రతిపక్షపక్షదళనీ వాంఛాఫలోల్లాసినీ.

---

* టీ. యాం=ఏదేవిని, ఆసాద్య=పొంది, హరిహరబ్రహ్మాదిభిః=విష్ణువు, శివుఁడు, బ్రహ్మ మొదలగు,దైవతైః=దేవతలచేత, అతీవ=కడు, దుష్కరతరం=చేయుటకసాధ్యంబయిన, స్వీయంస్వీయం=వారివారి, కర్మ=పాలన, సంహార, సృష్ట్యాదిక మగుకార్యమును, క్షణాత్=క్షణమున, లీలయా=అనాయాసంబున, విధీయతే=చేయఁబడుచున్నదియో సాదుర్గా=ఆట్టిదుర్గాదేవి; భవభీతిరీతిశమనీ=సంసారభయంబురీతులనడంచునదియు, లోకత్రయత్రాయిణీ=ముల్లోకంబులరక్షించునదియుం నైయొప్పునది; వః=మీయొక్క, ప్రతిపక్షపక్షదళనీ=శత్రుపక్షంబుల నాశనముసేయునదిగాను, వాంఛాఫలోల్లాసినీ=కోరినఫలంబులనొసంగి యుల్లాసముఁజేయునదిగాను, భూయాత్=అగుంగాత.

పరమపురుషుఁడు సృష్ట్యాదికార్యంబులు సేయంబూని తనకంటె పభిన్నంబయినప్రకృతికింగలసత్త్వరజస్తమోగుణంబులంగలసికొని హరి, విరించి, హరులనుసాకారంబులం దాల్చి సృష్ట్యాదికార్యంబులు సలుపుచున్నాఁడు. ఇందుకు శ్రీభాగవతము. "సత్త్వంరజస్తమ ఇతి ప్రకృతేర్గుణా స్తైర్యుక్తః పరఃపురుష ఏక ఇహాస్యధత్తే, స్థిత్యాదయేహరివిరించిహరేతిసంజ్ఞాః" అని. ఆప్రకృతి ప్రళయంబున నాపరమపురుషుని కనుదమ్ములనధిష్ఠించియుండి యతండు సృష్టిసేయంబూనుకొన లక్ష్మీ సరస్వతీరాధాదిరూపంబులం దాల్చి మరల దుర్గారూపంబునుదాల్చినయది. ఆయమ యొకకారణంబుచే పార్వతియై యవతరించె. ఈదుర్గాదేవి ప్రకృతిరూపిణిగాన ప్రకృతితో సంబంధపడక హరిహరబ్రహ్మాదులరూపంబులు పరమపురుషునికిలేవు. అప్పుడు సృష్ట్యాదికమును లేదు. ప్రకృతితో సంబంధపడినప్పుడే పరమాత్మకు సృష్ట్యాదికర్మంబులు సంభవించును. సృష్ట్యాదికమునకు ప్రకృతియే ముఖ్యకారణము. పరబ్రహ్మమహిషియగు ప్రకృతిస్వరూపిణియైన దుర్గాదేవియె సృష్ట్యాదికమునకుఁ గారణము. ఇది శాక్తమతము. ఈదుర్గాదివిషయంబులంగుఱించి నేను చెనిఁగించియుండు శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమునందు విశదముగఁ దెలిసికొనవచ్చును. అది యష్టాదశమహాపురాణములలోఁ బదవపురాణము.

అని వచియింప నతని దేవీమాహాత్మ్యబోధకం బగు సూక్తి నాలకించి యాశాక్తవేషధారిణు లేమియుఁ బ్రతివచనంబులు పల్కలేక ఫాలభాగవిరచితకరకమలపుటంబులతో నను మోదింప నవ్వారల వీడ్కొని కవిగారు నలువదైదవకట్టువం బ్రవేశించి యయ్యెడ.

క. ఒకవంకఁ దులసిమాలిక, లొకవంకను భస్మలేప మొప్పశరీరం
బకలంకమై వెలుంగఁగఁ, బ్రకటితమురహరశివైక్యభావులు వరుసన్.

హరిహరాద్వైతవాదంబులు పలుపుచు వచ్చి తన్నెదుర్కొని సత్కారంబు లొనరింప వారల నభినందించుచుం దత్ప్రార్థితుండై వారలు "హరిహరాశరణీకరవాణి" యనువాక్యంబుల విస్ఫుటంబుగం బల్కుచుండుట కనురూపముగ నిట్లనియె.

శ్లో. బ్రహ్మావిష్టమనా స్సదైవ కమలాసక్తో విషాదో విభుః
కావాసోఽథ విభూతిమాన్ గిరివరాధారో భయావల్లభః

---

* ఈశ్లోకమునందుఁ బ్రతిపదమునకును విష్ణుపరముగ నొకయర్థమును శివపరముగ నొక యర్థమును శ్లేషచేఁ జెప్పవలయును.

బ్రహ్మావిష్టమనాః=విష్ణుపరమగునర్థము. బ్రహ్మచే నావేశింపంబడినహృదయముగల వాఁడు. మనశ్శబ్దమునాభి కుపలక్షణము. నారాయణుని నాభియందు బ్రహ్మజనియించెనను నర్థమనుసంధేయము. శివపరమగునర్థము. బ్రహ్మమునందావేశితమగు మనస్సుగలవాఁడు. యోగీశ్వరుండుగాన బ్రహ్మమునందుఁ దనహృదయంబునునిచి ధ్యానముసేయుచుండు వాఁడని భావము. సదైవ = ఎల్లప్పుడును, కమలాసక్తః = వి. లక్ష్మియందాసక్తిగలవాఁడు, శి. జింకయందాసక్తిగలవాఁడు, లీలార్థము సారంగమునుంచుకొని యుండువాఁడని భావము. అవిషాదః=వి. దుఃఖములేనివాఁడు. శి విషాదః=విషమునుభుజించినవాఁడు. ఇచట సక్తోవిషాదః అనుపదములకు విష్ణ్వర్థమున అవిషాదః అనియుఁ శివార్థమున విషాదః అనియుఁ బదవిభజనము. విభుః=ప్రభువగువాఁడు, కావాసః=వి. జలమున వాసముగల వాఁడు, నీటిపైఁబరుండియుండువాఁడు, శి. గంగాజలముదాల్చినవాఁడు. విభూతిమాన్ = వి. ఐశ్వర్యముగలవాఁడు, శి. భస్మధారణముగలవాఁడు. గిరివరాధారః=వి. గోవర్ధనమునకు మంథానపర్వతమునకు, ఆధారమగువాఁడు. కృష్ణావతారంబున గోవర్ధనము నెత్తిపట్టుకొన్నవాఁడు, కూర్మావతారమున సముద్రమథనము సేయ దేవతలు నిలిపినమంథానపర్వతము మునిఁగిపోఁగా మరలదానిని వీఁపున నెత్తినవాఁడు. శి. కైలాసపర్వతము నాధారముగఁ గలవాఁడు. అభయావల్లభః=వి. యమునయందుఁ బ్రీతిగలవాఁడు, శి. పార్వతికి నాయకుఁడగువాఁడు. సర్పాధీశధరః. వి. కాళీయుఁడను సర్పరాజును బట్టుకొన్నవాఁడు. శి. సర్పరాజైన వాసుకిని భూషణముగఁ దాల్చినవాఁడు, విహంగవచరః=వి. పక్షిరాజైన గరుత్మంతునిచే సంచరించువాఁడు. శి. విశేషముగ నాఁబోతుచే సంచరించువాఁడు, లోక

సర్వాధీశధరో ద్విపుంగవచరో లోకత్రయానందకో
భూయా ద్వో హృదయం గతః ప్రతిలవం కృష్ణోఽథవా శంకరః.

అని చెప్పఁగా నచ్చోటివారలు శివకేశవులను సమానముగ స్తుతించుటం జేసి యాకవితో నేమియును వివాదంబు సలుపం జాలక నిటలతటఘటితనిజకరకమలపుటులై యాతనియుక్తులను సంస్తుతించుచుండఁ గాళిదాసుండును గడుఁగారవంబున వారల వీడ్కొని నలువదాఱవకట్టునం బ్రవేశించుచుండ నయ్యెడ.

గీ. సకలకాలతత్త్వసంవిదు లతిదూర, దృష్టు లఖిలభూశవృత్తవర్త
మానముఖవివేకమహితులౌ కార్తాంతి, కులు భశాస్త్రవాదకుశలమతులు.

మహాకవిం గాంచి మించినగౌరవంబు దోఁప నెదురేఁగి దెంచి యంచితభక్తిప్రశ్రయంబులు నూపుచుం దోడ్కొని చని యచట నిర్మితంబై వెలయుజ్యోతిషాలయంబునందు నానావిధజ్యోతిర్యంత్రంబు లునిచియుండునెడ నొకరమ్యప్రదేశంబునం గూరుచుండం బ్రార్థించినం గవి యట్ల యొనరించి వారలం గాంచి యిట్లనియె.

*శ్లో. సూర శ్శూరపదం రుచిం హిమరుచి స్సన్మంగళం మంగళో
బోధం బోధన ఆతనోతు లలితా వాచశ్చ వాచస్పతిః
కావ్యః కావ్యకళాకలాపనిరతిం మందో ద్విషన్మందతాం
దుర్వృత్తేషు తమ స్తమో జయకరీం కేతుశ్చ కేతుశ్శ్రియమ్.

అని చెప్పిన నచ్చోటివార లాకవి నవగ్రహకార్యము నెఱిఁగి తత్తత్కారకులుగ నేర్పడియుండు సూర్యాదిగ్రహములు తత్తత్ఫలముల నొసంగువిధంబును బోధించినందుల

---

త్రయానందకః = ముల్లోకములను సంతసింపఁజేయువాఁడు, అగు-కృష్ణః = విష్ణువౌండె, అథవా=కానిచో, శంకరః=శివుండౌండె, ప్రతిలవం=ప్రతిక్షణమును, వః=మీయొక్క, హృదయం=మానసమును, గతః = చెందినవాఁడు, భూయాత్ = అగుఁగాత.

* టీక. సూరః=సూర్యుఁడు, శూరపదం=శూరపదవిని, హిమరుచిః=చంద్రుఁడు, రుచిం=కాంతిని, మంగళః=కుజుఁడు, సన్మంగళం = ఉత్తమమగుశుభమును, బోధనః = బుధుఁడు, బోధం = జ్ఞానమును, వాచస్పతిః = గురువు, లలితాః = మనోహరములగు, వాచశ్చ=వాక్కులను, కావ్యః = శుక్రుఁడు, కావ్యకలాకలాపనిరతిం=కావ్యములయందుం జతుష్షష్టికళలయందు సమూహంబులందు సర్వకాలమువ్యాసంగమును, మందః= శని, ద్విషన్మందతాం = శత్రువులహీనత్వమును, తమః = రాహువు, దుర్వృత్తేషు = దుర్మార్గప్రవర్తనములందు, తమః = మబ్బును, కేతుశ్చ = కేతువు, జయకరీం = జయప్రదమగు, కేతుశ్శ్రియం=ఎల్లవారికిం దలమిన్నయగుసంపదను, ఆతనోతు=కలిగించుఁగాత.

కమందానందంబుం జెందిరి యందఱును సంస్తుతింప వారలకై వారంబులు గొనుచు నచ్చోటువాసి నలువదేడవకట్టునం జొచ్చి యయ్యెడ,

గీ. అతిగభీరమూర్తు లఖిలదేహిత్రాణ, నిరతు లమృతకిరణనిభులు భోగ
రాగజనకు లుదితరాగులు వైద్యులు, కొంద ఱందుఁ గూడుకొని కడంగి.

అవ్వారలు సుధచే సుధాకిరణుండుఁబోలెఁ దమగుణంబులచే సకలజగంబులకు నాప్యాయనముం గల్పించుచు రోగపీడితులకుం బ్రసన్నం బైనయాయువులుఁబోలెను వ్యాధుల కలివ్యాధుల తెఱంగునను దోఁచుచుం జనుదెంచి యామహాకవి గేలువట్టుకొని కొనిచని యయ్యెడ నుండు భేషజమందిరంబునం దతిమనోహరముగఁ గల్పితంబై యుండు నున్నతాసనంబునం గూరుచుండం బెట్టినం గాంచి కవివరుండును వారలు సేయునత్కారంబుల కెదమెచ్చుచు నందుండి యిట్లనియె.

* శ్లో. ప్రజాచకోరాయితదృఙ్మృగాంక రూపేణ కామేశ్వరతుల్యమూర్తే,
స్వస్త్యస్తు తే సర్వరసాయ నిత్య మర్థ్యైకచింతామణయేచ విష్ణవే.

అని పల్కఁగా నావైద్యులు విష్ణుండు సముద్రమథనకాలంబునందు ధన్వంతరియై యావిర్భవించిన చరితము నతఁ డాయుర్వేదప్రవర్తకుండగుటం జేసి శ్లేషానుప్రాణితముగ

* టీ. ప్రజాచకోరాయితదృఙ్మృగాంకరూపేణ = ప్రజలయొక్క చకోరములై యొప్పుకన్నులకుం జందురుండై యొసఁగునట్టి చక్కఁదనంకాబుచేత, మేశ్వరతుల్యమూర్తే = మన్మథునికిసమానమగుమూర్తిగల వాఁడవగునోధన్వంతరీ! సర్వరసాయ = సమస్తరసాత్మకుండవై, అర్థ్యైకచింతామణయే = యాచకులకుముఖ్యముగఁజింతామణివైయెలయుం వాఁడవై, విష్ణవే = విష్ణుస్వరూపివై, ఉఁరారుచుండు. తే = నీకు, నిత్యం = ఎల్లప్పుడు, స్వస్తి = మంగళము, అస్తు = అగుఁగాక.

ఇందు 'మృగాంక' అనుపదముచేత మహారాజమృగాంక మను రసంబును, 'కామేశ్వర' అనుపదముచేత కామేశ్వర రసంబును, సర్వరస, అనుపదముచేత సర్వరసంబును, చింతామణియనుపదంబుచేతఁ జింతామణిరసంబును బోధితములగుచున్నవి. ఇవి వైద్యశాస్త్ర ప్రక్రియాబోధకమగువైచిత్ర్యము.

క్షీరసాగరమథనకాలంబున నమృతఘటంబుఁ గరంబునఁ దాలిచి విష్ణుండు ధన్వంతరిరూపంబున నావిర్భవించి జనోపకారార్థ మాయుర్వేదము బ్రవర్తింపఁజేయుటంబట్టి వైద్యశాస్త్రాభిజ్ఞులు కరముభక్తితో నాధన్వంతరిని సంస్తుతించెదరు. ఆధన్వంతరి విష్ణ్వవతారమగుటం జేసి సర్వరసాత్మకుం డని నుడువఁబడియున్నది. భగవంతుఁడు సర్వరసమయుం డని వేదములు నుడువుచున్నవి.

మృగాంక, కామేశ్వర, సర్వరస, చింతామణిరసంబు లనియెడిమహౌషధుల రూపముగ వర్ణించుట కంతరంగంబుల నలరుచుం గర మభినందింప వారలు ప్రియపూర్వకంబుగ వీడ్కొని యచ్చోటు వాసిచని నలువదెనిమిదవకక్ష్యాంతరంబుం జొచ్చి యచ్చట,

క. చారుతరగద్యపద్యము, లారీతులు వృత్తిశయ్య లని యొప్పగునలం
కారికులు భారతీసతి, వారక నర్తింపఁజేయుచున్వైఖరితోడన్.

తమకవితానైపుణ్యంబుం గానిపించుచు వృత్తి, రీతి, పాక, శయ్యా, ప్రసాద, మాధుర్య, కాం, తోజః ప్రకటితవాక్యపద్ధతులం బ్రవర్తితంబులు సేయుచు శృంగార హాస్య కరుణాదినవరసభేదంబులు బ్రస్తాపితంబు లొనర్చుచు నామహాకవికడకుం జనుదెంచి యాతనిం గారవించి మించినప్రణయరసభరంబునం దోడుకొనిచని యాలంకారిక గోష్ఠీపరివృతంబగు నొకమణిమండపమధ్యంబున నమర్చియుండు స్ఫటిక మణిమయాసనంబునం గూరుచుండం బ్రార్థించిన నట్లొనరించి కవి వారలం గాంచి యిట్లనియె.

* శ్లో. శృంగారహాస్యసహితాద్భుతరౌద్రవీరాః
సంప్రాప్య కాల ముచితం భవతో భవంతు
కించ ద్విషాం గిరిదరీవినివాసభాజాం
భీభత్సభూరికరుణాభయశాంతయ స్స్యుః.

అని యుపన్యసింప నామాలంకారికులు విని నవరసవర్ణనంబు ప్రస్తుతానుగుణంబుగ సమకూర్చి శృంగారాదిరసంబులు తమకును భీభత్సాదులు తమశత్రువులకు నుండునట్లు వర్ణించుటకుం గరం బలరుచు రసవత్కవిత యాతనిసొమ్మయి యున్నదని కొనియాడుచుం దన్ను బహూకరింపం గవియు వారల నడిగి లేచి యచ్చోటు వాసి నలువదితొమ్మిదవకక్ష్యయందుం బ్రవేశించి,

క. విమలాంబుజపత్రాక్షులు, సముపార్జితయోగశాస్త్రసారవివేకుల్
కమనీయధామనిధులు, ద్యమమాంసలపూర్వకాయధారులు వరుసన్.

---

* టీ. శృంగారహాస్యసహితాద్భుతరౌద్రవీరాః = శృంగారరసము, హాస్యరసము, అద్భుతరసము, రౌద్రరసము, వీరరసము అనునివి, ఉచితంకాలం = యోగ్యకాలమును, సంప్రాప్య=పొంది, (ఆయారసముల కుచితములైనకాలంబులందు) భవతః = మిమ్మును, భవంతు=పొందియుండును గాత. అనఁగా శృంగార, హాస్య, అద్భుత, రౌద్ర, వీరరసము లాయాకాలములందు మిమ్ముఁబొందియుండుఁగాతయనిభావము. కించ = మఱియు, గిరిదరీవినివాసభాజాం = అపజయంబునొంది దేశత్యాగముఁజేసి గిరిగుహాలయందు వాసము సేయుం, ద్విషాం = మీశత్రువులకు, భీభత్సభూరికరుణాభయశాంతయః = భీభత్సరసమును, అధికమగుకరుణారసమును, భయానకరసంబును, శాంతియును, స్యుః = అగుఁగాత.

యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, మనన, సమాధు లం దతివిచక్షణులు యోగాసనంబులం గూరుచుండి నాసికాగ్రనిశ్చలదృష్టు లగుచు నుండం గనుంగొని వారలు సాంఖ్యపాతంజలమతవేత్త లని నిశ్చయించి యచ్చోట నా యోగులనడుమ నమర్పంబడియుండు దర్భాసనంబునం గూరుచుండి వారలం గాంచి యిట్లనియె.

* శ్లో. పద్మపత్రాంబునిర్లేప పురుషస్యానుకారిణీ
ప్రకృతి స్తే మహత్తత్వం సంవర్ధయతు సర్వదా.

అని చెప్పఁగా నచ్చటివారలు "ప్రకృతిఃకర్త్రీ; పురుషః పుష్కరపలాశవన్నిర్లేపః"

[సర్వముగల్పించునది ప్రకృతి. పురుషుఁడు తామరపాకునందు జలంబువలెఁ బ్రపంచ సంబంధము లేనివాఁడు]

అను నది సాంఖ్యపాతంజల సిద్ధాంతంబు గాన నీకవి వచించినది తన్మతంబునకు సరిపోవుటంబట్టి యందఱును శ్లాఘించుచు నాతని నతిప్రణయగౌరవసూచకంబులగు కటాక్షంబులం గారవింపం గనుసన్నలన వారియభిమతి వడసి యచ్చోటు విడిచి చని యేఁబదవకక్ష్యయందుం జొచ్చి యచ్చట

గీ. సత్కథాప్రవాహసంతతి జిహ్వాగ్ర, సీమ వెల్లివిరియఁ జిత్తమందు
శాంతి ధర్మనిరతి సచ్చరిత్రంబును, గలుగుసత్పురాణకథనచణులు.

విశుద్ధవాసోధారులు నారాయణనామోచ్చారణాదరకలితరసనాప్రవర్తనులు వినయవివేక శీలార్జవాదిసద్గుణగణోపేతులు సకలపురాణకథాప్రసంగపారీణులు పాప కర్మపరాఙ్ముఖులు నగువారు తన్నుం గని యెదురేఁగుదెంచి వందనంబు లొనరించి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి తోడ్కొనిచని యష్టాదశమహాపురాణేతిహాసంబు లందు ద్వైపాయనుండు సెప్పిన శివవిష్ణుభాస్కరాదులచరిత్రంబు లెల్లను బహురుచిర వర్ణసంకలనమనోహరంబుగఁ జిత్రరూపంబులతో వ్రాసియుండు నొకమహోత్తుంగసౌధం బున నతివిశాలంబగు తన్మధ్యసీమం బొలుపారుమహనీయాసనంబునం గూరుచుండం బ్రార్థించినం దత్ప్రార్థనాంగీకారం బొనరించి యవ్వారలం గనుంగొని యిట్లనియె.

---

* టీక. పద్మపత్రాంబునిర్లేపపురుషస్య = పద్మపత్రంబుననుండుజలంబువలెనంటు లేనిపురుషునికి, అనుకారిణీ = అనుసరణముసేయునదియై, యొప్పు, ప్రకృతిః=ప్రకృతి, మహత్తత్వం = మహత్తత్వమును, సృష్టికున్ముఖమగుప్రకృతి మహత్తనిచెప్పఁబడును. (గొప్పఁదనమును) తే=నీకు, సంవర్ధయతు=వృద్ధిసేయుఁగాత.

* శ్లో. వేదా యేన సముద్ధృతా వసుమతీ పృష్ఠే ధృతా ప్యుద్ధృతా
దైత్యేశో నఖరై ర్హతః ఫణిపతే ర్లోకం బలిః ప్రాపితః,

---

* టీక. యేన=ఎవ్వనిచే, వేదాః=వేదములు, సముద్ధృతాః=ఉద్ధరింపంబడినవో? (సోమకుం డనునసురుఁడు వేదముల నపహరింప మత్స్యావతారంబుఁ జేసి భగవంతుం డా యసురునింజంపి వేదంబుల నుద్ధరించెను.) వసుమతీ = భూమి, పృష్ఠేధృతాపి = వీఁపునఁ దాల్పంబడినదయ్యు, ఉద్ధృతా = ఉద్ధరింపంబడినదో; (భగవంతుఁడు ఆదికూర్మమై భూమినిఁదనపృష్ఠంబునధరించియున్నాఁడనుటపురాణప్రసిద్ధము. ఇదిదశావతారములలోఁ జేరనిదియైనను గూర్మావతారమనిమాత్రము బోధించుచున్నదని యెఱుంగనగును. మందర పర్వతముచే దేవతలు సముద్రము మథింప నది జలంబులమునింగినంగాంచి భగవంతుండు కూర్మమైయామంథానాచలమునుదనవీఁపునధరించినిలిపెను. ఈకూర్మావతారమేదశావతారములలోఁజేరినది. కూర్మావతారమని సూచనామాత్రము చేయంబడుటం జేసి దశావతారసంఖ్యాతమగు కూర్మావతారమే యిందు గ్రాహ్యము. మఱియు నీభూమిమహాప్రళయజలంబులందుమునింగిపోఁగావరాహరూపముఁదాల్చిభగవంతుండు దానినుద్ధరించియథాస్థానంబున నునిచెను.) దైత్యేశః = దితిసంతానపువారలకుం బ్రభువగు హిరణ్యకశ్యపుఁడు, నఖరైః= నఖములచేత, హతః = చంపంబడెనో; (తనభక్తుఁడగు ప్రహ్లాదునిబాధింపఁగా నరసింహరూపముందాలిచి హిరణ్యాక్షునిసంహరించె.) బలిః = బలియనుదైత్యుఁడు, ఫణిపతేః లోకం=పాతాళలోకమును, ప్రాపితః=చేర్పంబడియెను. (ఇంద్రునైశ్వర్యం బపహరించిన బలి యాగముసేయ భగవంతుండు వామనాకారంబున మూఁడడుగులనేల యతని యాచించి త్రివిక్రముండై కొలిచి యంతయు నాక్రమించుకొని బలినిపాతాళంబునకుం బంపివేసెను.) క్ష్మా = భూమి, అక్షత్రా=క్షత్రియులు లేనిదిగా, కృతా=చేయఁబడినదో; (పరశురాముఁడై క్షత్రియులనందఱ నిరువదొక్కమాఱు సంహరించెను.) జగతీ=భూమి? దశాస్యరహితా=రావణవిరహితముగ, కృతా=చేయంబడినదియో; (శ్రీరాముఁడై యవతరించి దశవదనుని నీభూమిలో లేకుండఁజేసెను.)రోహిణీ=రోహిణి యనువసుదేవునిభార్య, మాతా=తల్లిగా, కృతా=చేయఁబడినదో; (బలరాముఁడై రోహిణికవతరించి శ్రీకృష్ణాగ్రజుండై భగవంతుండుండెను.) హింసా=హింస, దోషవతీ=దోషముగలదిగా, కృతా= చేయఁబడినదో! (బుద్ధావతారంబుం జేసి 'అహింసాపరమోధర్మః' అనుదానిని స్థాపించెను.) ధరాపి=భూమియు, అయవనా=యవనులు లేనిదిగా, కృతా=చేయఁబడినదో; (ఈకల్యాంతమునందు విష్ణుయశుండనుబ్రాహ్మణునికింజనించి భగవంతుండు యవనులసంహరించి క్షత్రియరాజ్యంబును వెండియు స్థాపింపంబోయెడిని (ఈకల్క్యవతారచరిత్రము నేనాంధ్రీకరించియుండు కల్కిపురాణమునందు విశదముగఁ జూడవచ్చును.) సః=అట్టిదశావతారములఁదాల్చినవాఁడగు, నారాయణః=భగవంతుండు, పాయాత్ =రక్షించుఁగాత.

త్యక్త్వా క్షత్రా జగతీ దశాస్యరహితా మాతా కృతా రోహిణీ
హింసా దోషవతీ ధరా హ్యయవనా పాయా త్సనారాయణః.

అని చెప్పిన విని యచ్చటిపౌరాణికులు భగవంతునిదశావతారంబులు తత్తదవతారకృత్యంబులచే నెఱింగించిన నైచిత్ర్యంబునకు గరం బలరుచు నాతనిని విశేషసత్కారంబుల బహూకరించిరి. కవియును వారలమన్ననల నంగీకరించి యించుకేనియును సంకోచంబు గానక యేబదియొక్కటవద్వారంబు నతిక్రమించి యందు మహావిశాలమార్గస్థలంబున,

క. లలితపరస్పరతర్క, జ్వలనస్థై వాగ్దేవి రసన వరఖేలనముల్
సలుపఁగ ధిక్కృతపండిత కులులై తార్కికులు వాదకుశలతఁ జూపన్.

కనుంగొని వీరలు తార్కికులు గాన నితరపండితులం దృణీకరించుచు వివాదకౌశలంబున వాగధిదేవతను భారతినిం దమరసనాగ్రదేశంబుల నర్తనములు సలుపం జేయువారలై వెలయుచుండెదరు. కానిమ్ము. వీరినడుమ జొచ్చి తత్త్వతత్త్వంబు బోధించి వీరల గారవంబుం గాంతు నని యెంచి డాయంజని నిలువంబడి నైయాయికమతం బిట్టుపన్యసించె.

*శ్లో. యస్సృష్టిస్థితిసంహృతీ ర్వితనుతే బ్రహ్మాదిమూర్తిత్రయైః
యస్యాఽధీనతయా స్థితాని సదసత్కర్మాణ్యపి ప్రాణినాం
నిత్యేచ్ఛాకృతిబుద్ధిమా నథ పరో జీవా త్సగాత్మా స్వయం
సోయం వో విదధాతు పూర్ణ మచిరా చ్చేతోగతం యద్భవేత్.

*టీక. యః=ఏపరమాత్మ, బ్రహ్మాదిమూర్తిత్రయైః=బ్రహ్మ, హరి, హరుండు నను మూఁడుశరీరములచేత, సృష్టిస్థితిసంహృతీః= సృష్టియును పాలనమును సంహారమును, వితనుతే = చేయుచున్నాఁడో; ప్రాణినాం= జీవాత్మలయొక్క, సదసత్కర్మాణ్యపి = పుణ్యపాపరూపములయినకర్మంబులును, యస్య=ఎవ్వనియొక్క, అధీనతయా = స్వాధీనముగ, స్థితాని = ఉన్నవో; నిత్యేచ్ఛాకృతి బుద్ధిమాన్=నిత్యములయిన ఇచ్ఛయు నాకారంబును బుద్ధియుఁగలవాఁడును, జీవాత్ = జీవాత్మకంటె, పరః = అధికుఁడై, స్వయం=తాను, పరాత్మా=పరమాత్మయై, యొప్పుచుండునో; సోయం = అట్టివాఁడు, వః=మీకు, చేతోగతంయద్భవేత్ = మానసమునందుండెడుదానిని, అచిరాత్ = స్వల్పకాలమునన, పూర్ణం=పరిపూర్ణముగ, విదధాతు=చేయుఁగాక.

జీవాత్మకంటెంబరుండుగఁ బరమాత్మగలఁడు. అతఁడు నిత్యములయినయిచ్ఛాకృతిప్రముఖములుగల్గినవాఁడు, బ్రహ్మాదిరూపంబులందాల్చి సృష్ట్యాదికార్యంబులు సేయుం పుణ్యాపాపఫలంబులు తదధీనములై సంప్రాప్తములగుచుండును. ఇదినైయాయికమతము.

అని చెప్పిన నతనివచనంబు లాలకించి 'నిత్యము లయినయిచ్ఛాదులు గలిగి జీవాత్మ కంటెం బరుండై బ్రహ్మవిష్ణుమహేశ్వరుల యాకారంబులం దాల్చి సృష్టిస్థితిసంహారం బులు సేయుచుండువాఁడు పరమాత్మ,' యను నైయాయికమతం బుపన్యస్తం బగుటకుం గరంబలరుచు నాతని ననేకవిధంబుల గౌరవించి పంపిరి. కవియుం వారల వీడ్కొని యచ్చోటు వాసి చనియెను. ఇట్లు మహాకవి సర్వమతంబు లుపన్యసించుచు నిరాటంకం బుగ మహాద్వారంబులు దాఁటి వచ్చుచున్నటుల దూతికలు విద్యాసర్వస్వవేదినికిం దెల్పిరి. అది విని యావిదుషియుం భయసంభ్రమంబులు పెనఁగొనుచుండఁ దనమనంబునం దిట్లను కొనియె. ఔరా మనుష్యమాత్రుం డగువానికి సర్వవిద్యావిచక్షణత్వంబు గల్గుటయే యరుదు. అట్లుండినను ఇట్టియనన్యాదృశం బయినసామర్థ్యంబు దృష్టశ్రుతపూర్వంబు గానిదియ. భోజభూపాలసభాలంకారంబయిన మహాకవి కాళిదాసుండొక్కరుండు దక్కఁ దక్కినవారి కిట్టిసామర్థ్యంబు లేదని విందు. ఎవ్వఁడేని సర్వమతతత్త్వంబు లెఱింగినవాఁడు గలఁడే? ఆహా యేమందు నీతనిచందంబు! ఇతనిం జయించుట శక్యంబు గాదు. అయి నను నానేర్పుకొలఁదిఁ గాలయాపనం బొనరించుచుండెదను. తుద కెది యెట్లు గాఁగలదో యెఱుంగ ననువుపడకున్నయది. చేతనయినంత దనుకఁ బ్రవర్తింతము. అని తలంచి తనదగ్గఱ నుండెడి కొందఱ మందయానల నతివిద్యావిచక్షణల నవధీరితసురగురుబుద్ధిచాతుర్యలం జీరి యోసీ చెలులారా యేఁబదిరెండవకక్ష్యాంతరంబునం గవి ప్రవేశించునంతలో మీరలు పురుషవేషంబులు దాల్చి యయ్యెడకుం బోయి యుండి యాతని బహూకరించి యుచి తాసనంబునఁ గూరుచుండంబెట్టి మీరలొండొరులు వివాదంబునకుం బూని యతని మధ్యస్థునిం జేసి కలహించుచుం గొంతదనుకం గాలంబు గడపుఁడని యాజ్ఞాపించి పం పఁగా నావిదుషీరత్నంబులు నని పూర్వము వైష్ణవవేషధారిణులై యతనివెనువెంటం జను దెంచుచుండు నండజయానలయందుం జేరికొనిరి. మఱియుం గొందఱు శైవాదివేషధారి ణులతోఁ జేరుకొనిరి. ఇంతలోఁ గవియుం నేఁబదిరెండవమహాద్వారంబునం బ్రవేశించిన నావిదుషీ శిరోరత్నంబులును కవికడకుం జని యయ్యా! మీరలు సర్వశాస్త్రపారంగతులు; మీ రెఱుంగనివి లేవు. పెక్కుదినంబులుగ మేము మామామతతత్త్వంబుల యుత్తమంబు లని తలంచి యన్యమతంబులయందు నసూయపడుచుండుదుము. అయ్యది మాకుం బాపి నెయ్యంబు గానిపింపు మనం గవియుఁ దనమనంబున వారలకపటోపాయంబు లెఱింగియుఁ గానిమ్ము వీరలకు నన్నడ్డగింప ననువుపడునా! యని తలంచి తలయూఁచి యోవిద్వచ్ఛి రోరత్నంబులార మీమీమతంబు లుపన్యసింపుఁడు. మీవివాదప్రకారంబు విని యేను తీర్మానించెద నని చెప్పిన నందు వైష్ణవుండు తొలుత నిట్లనియె.

క. హరిసేవ లేక ముక్తికిఁ, గరమరుదుగఁ జనఁగఁ దాను గడఁగుజనుఁడు సం
తరణము లేకయ జలనిధిఁ, దరియింపఁ గడంగువాఁడు తథ్యము గాఁగన్.

[శ్రీహరిపాదపంకజార్చనంబు లేకయ మోక్షంబునకుం జనం గోరువాఁడు నౌకాసాధనంబు లేక సముద్రంబు దాఁటం గోరువాఁడు. నౌక లేక సముద్రంబు దాఁటుట దుష్కరము. అట్లే శ్రీహరిసేవ లేక మోక్షము గలుగుటయుం సంభావ్యము గానిదియ యని భావము.]

అని చెప్పఁగా విని శైవుండు నో వైష్ణవా! నీనుడువుపద్యార్థంబు సమంజసంబు గాదు. హరిసేవ లేక ముక్తిం జన ననువుపడ దని వచించెదవు; అందుకు సంతరణము లేక సముద్రమును దాఁటుట కనువుపడదనుట సమర్థకంబుగాఁ జెప్పితివి. అది యుపపన్నంబు గాదు. సమర్థకం బుపపన్నంబు గానినాఁడు సమర్థితంబు నుపపన్నంబు గాఁ జాలదు. వినుము.

క. తరుణేందుధరునిఁ గొల్చుచు, నరుదుగ సేతువు రచించి యారాముఁడు దాఁ
దరణి యది లేక జలనిధి, దరియించినరీతి జనులు దాఁటుదు రుదధిన్.

అని చెప్పఁగా వైష్ణవులలో రామోపాసకుండు శైవునిం జూచి యోరీ మహాత్ముం డగురాముఁడు శివునిం గొలిచి యతనికరుణ వడసి సేతువుం గట్టి జలధిం దాఁటెను. అట్లె లోకులు సముద్రంబు దాఁటుటయందు నీశునిదయం గొని దాఁటవచ్చు నని చెప్పితివి. ఇందు రాముఁడు శివునిం గొలిచె ననుట యసంభావితము. తస్మాలకి ముగ నీనుడివినపద్యార్థంబు నసంభావితము. ఎట్లనిన?

ఉ. రామ యటంచుఁ జెప్పినఁ జిరంబుగ నీ భవసాగరంబు ను
ద్దామరయంబునం జనులు దాఁటఁగఁ జాలుదు రామహాత్ముఁడుక్
భూమిని నన్యునిం దనకుఁ బోడిమితో శరణంబు వేఁడునే
యామురవైరి లోకముల కన్నిటికి న్విభుఁడౌ టెఱుంగ రే.

శ్రీరామనామంబు నోటనుడివినమాత్రాన యీదరిలేని సంసారసాగరంబును దరించు నట్లగు; నట్టిమహాత్ముండు తా నన్యుని శరణంబు వేఁడు ననుట గర్హితము. మఱియుం నారాముఁడు త్రిలోకనాథుం డైనలక్ష్మీవల్లభుండ గాఁడె!

క. కల వతనికి బహురూపము, లలరూపులలోన శిల మమరినవాఁడై
వెలసినరామునికంటెను, గలఁడే యధికుండు దథ్యగతి వివరింపన్.

అని చెప్పిన కృష్ణోపాసకుండు లేచి యోరీ! నీనుడివినయుక్తులలో శ్రీవిష్ణునవతారంబులందు శ్రీరాముం డధికుం డని పల్కుట యాదరణీయంబు గాదు. ఏలయన?

శా. శ్రీరాధాముఖగోపికాజనదృశాశ్రేణీచకోరాళివి
స్ఫారచ్ఛారదపూర్ణమాశశికిఁ గంసప్రాణసంహారికిన్
శ్రీరాజన్మురళీనినాదహృతదుర్దీపస్ఫురత్పాపసం

అని వచియింప నది విని రాధోపాసకుండు లేచి యో నేస్తకాఁడా నీనుడివిన శ్రీకృష్ణునిమాహాత్మ్యంబు సత్యంబు. శ్రీగోపికాజన నయనచాతకపూర్ణచంద్రుండు శ్రీకృష్ణుండు. అతఁడు నేయుంపంశీనినాదంబు సకలపాపిపాపపుంజదళనచణంబు. ఆతండు పురాణపురుషుం డనుటయుం నొప్పుకొనం దగు. మఱి 'శ్రీరాధాముఖగోపికా' యని రాధను సాధారణగోపికాగణంబునం జేర్చి చెప్పుట యొప్పిదంబు గాదు. తదీయగౌరవం బెఱుంగక పల్కితివి. వినుము.

క. నందకిశోరుండు వనం, బందు గృహంబందు యమునయందును రాధా
సుందరపదపద్మార్చన, మందంబుగఁ జేయుచుండెఁ డనుదిన మాసన్.

అదియునుంగాక.

ఉ. ఆనళినాక్షి నీశ్వరిగ నాచర మెప్పు రచించి దాసుఁడై
తాను నటించుచుం జరణతామరసంబులఁ బూజసేసి యా
మానవతీలలామకృతమానితసత్కరుణాకటాక్షసం
తానముఁ దాను గైకొను ముదంబున మూర్ధము వంచి భక్తితోన్.

మఱియు నాగోపాల బాలకుండు శ్రీరాధను దనపుణ్యాలతాఫలంబుగఁ గల్పించియున్నవాఁడు. అట్టి యాదేవి ననన్యసామాన్య యని యెఱుంగక గోపికలలో నొక్కతె యని చెప్పితివి. ఇందుకు ని న్నేమనవచ్చును. అనినం గృష్ణోపాసకుండు నోయయ్యా! నీవెప్పినవచనంబు తథ్యంబు. ఏ నా వేళవిశేషంబున నట్లు పల్కితి నంతియకాని యితరంబునం గాదు. వినుము.

గీ. దేవకీదేవిసుతుఁ డైన దేవదేవు, ప్రాణనాయిక రాధికారాజముఖియె
యిపుడు నాదేవితోఁ గృష్ణుఁడింపు మెఱయఁ,దాను గ్రీడించుచుండు బృందావనమున.

ఈకతంబునం గాదె శ్రీరాధాకృష్ణుల నొండొరులం బ్రత్యేకంబ యుపాసింపం జనదని మహర్షులు సెప్పియున్నారు. ఎట్లనిన?

శ్లో. రాధాం వినా ధ్యాయతి యశ్చ కృష్ణం కృష్ణం వినా ధ్యాయతి యశ్చ రాధాం
ఇహా వృథావ ప్యుపపన్న మోహశ్చ వృథాజనీ భక్తిరసానభిజ్ఞో.

అన్నట్లు రాధాదేవి వినాగా శ్రీకృష్ణుని ధ్యానించువాఁడును శ్రీకృష్ణునివినాగా రాధను ధ్యానించువాఁడును మోహసంప్రాప్తు లగుటం జేసి తమ జన్మంబు నిరర్థకంబుగా భక్తిరసంబు నెఱుంగనివార లని చెప్పంబడుదురు. ఇందుకుం గారణంబు వినుము.

గీ. కృష్ణుఁ డుండఁడు రాధికాకృష్ణవేణిఁ, బాసి రాధిక యుండదు పద్మనయనుఁ
బాసి యాయిర్వు రన్యోన్యభ్[illegible]మాన, నవ్యరసపూరమగ్నమానసులు దలఁప.

అని చెప్పఁగా విని రామోపాసకుండు నవ్వుచు నోరీ! కృష్ణుని కంతట శృంగార రసప్రాధాన్యంబునన మహత్వంబుం బ్రతిపాదించితివి ఏమందును. అనినం గృష్ణోపాసకుం డిట్లనియె.

ఓరీ కృష్ణునికి మాత్రము గాదు. శ్రీరామచంద్రునికి నయితము శృంగారరస ప్రాధాన్యంబు గలిగే యున్నది. కృష్ణునిశృంగారమువలె సంయోగంబుం గొన్నది గాక; రామచంద్రునిశృంగారము విప్రలంభంబుం గొన్నది యని యిదియ భేదము.

అని చెప్పఁగా మహాకవి కాళిదాసుండు వారలవాగ్వాదంబు దన్నుం గాలయాప నచే మోసపుచ్చం బ్రయత్నించుటయకాని యన్యంబు గాదని యెంచి యావాదంబుడిపి పోఁదలంచి యిట్లనియె. ఓవైష్ణవులార! మీలోనన వృథాకోలాహలం బేల? చెప్పెదను వినుండు.

శ్లో. య ఏవ రామో హి స ఏవ కృష్ణః యఏవ కృష్ణోహి సఏవ రామః
అన్యోన్యభిన్నౌ నహి రామకృష్ణౌ నారాయణస్యా వతారౌ య దేతౌ.

[టీ. యఏవ = ఎవ్వఁడు, రామః = రాముఁడో; సఏవ = వాఁడే, కృష్ణోహి = కృష్ణుఁడు. యఏవ=ఎవ్వఁడు, కృష్ణః=కృష్ణుఁడో, సఏవహి=వాఁడే, రామః=రాముఁడు. యత్=ఏకారణమునుబట్టి, ఏతౌ = వీరలు, నారాయణస్య = నారాయణునియొక్క, అవతారౌ=అవతారములో! ఆకారణమునుబట్టి; రామకృష్ణౌ=శ్రీరామకృష్ణులు, అన్యోన్య భిన్నౌ=ఒండొరులతో భేదించినవారు, నహి=కారు.]

అని వచింపగాఁ గృష్ణోపాసకుండు సవినయముగ నిట్లనియె.

ఓమహాత్మా! రాముఁడే శ్రీకృష్ణుఁడు; శ్రీకృష్ణుఁడే శ్రీరాముఁడు; వీరిరువురు నారాయణునియవతారముల యని తమపల్కినయది ప్రామాణికంబ. ఐనను నారాయ ణునియవతారము లగుటంజేసియె రామచంద్రునికిని శ్రీకృష్ణదేవునికిని సామ్యంబు గల్గె నేనియుఁ బూర్ణావతారమగుటం జేసి శ్రీకృష్ణదేవునికిఁ బ్రాధాన్యం బుండునదే! అతఁడు పూర్ణావతార మనుసర్థము కార్యమాణ మయియున్నను క్రియావిశేషంబులచే నున్నీ తంబు నయ్యెడిని, వినుము.

సీ. చక్ర గదా శంఖ శార్ఙ్గ నందకములు దాల్చి చతుర్భుజోదారుఁ డగుచు
బ్రహ్మాదినుతు లతిభక్తితో నులియింప నావిర్భవించెఁ బీతాంబరుండు
బాలుఁ డాయమున నుల్లోలవారిపూర నల్పోదకం బట్టుదా నుత్తరించె
గోకులకులరాజుతోఁతు మహామాయ మధురకుఁ బంపె నప్పుడము మీఱ
గీ. పూతనాదిమహాసురపుంజ మణఁచి, తల్లికిని లోక మంతయుఁ దనకడుపున
జూపి ప్రాగల్భ్యమున గోపసుదలిపిందుఁ, గూడి క్రీడించె శిశువయ్యుఁగుతుకమునను.

చ. గిరి దనకేల నెత్తి హరికి న్గలగర్వముఁ బాపె నంత ను
ద్ధురబలుఁ గంసునిం దునిమెఁ దోడ్కొనివచ్చెఁ గృతాంతఘోరమం
దిరమునసుండి బాలుర సుదీర్ఘరయంబున నిద్రవోవు మా
ధురులను జేర్చె ద్వారవతి దుర్ధర మాతనమాయ ప్రేల్మిడిన్.

గీ. వేడ్కఁ లిగురెత్తఁ బదునాఱువేలరాజ, కన్యకలతోడ భోగంబుఁ గాంచెఁ దివిరి
యన్నిమూర్తులు దాల్చె హరిణనయన, లందఱకునింట నొక్కొక్కఁ డగుచుదోఁప.

మఱియు నాసర్వజగన్మయుండు తనమొగంబులు గొన్ని మనోహరము లగుదంత ముకుళంబులును భ్రూభంగలీలానిర్జితకార్ముకంబు లయిన చారులోచనంబులును గలిగి స్మేరసుందరంబులై సౌమ్యంబులై తేజోవంతంబులై వెలుంగుచుండం గొన్నివదనంబులు కరము వర్తులంబులయి కోఱలఁ గెంపు పెంపార నుగ్రంబులై యొప్పు ననేకచక్షుర్జ్వాలికలతో దీపించుచు నలికరాళదంష్ట్రాభయంకరంబులై తనరారుచుండ మఱియుం గొన్ని శ్యామపీతసితరక్తంబులయి రక్తంబులు గ్రోవుచుఁ గాలానలజ్వాలామాలికలం గ్రక్కుచుండ నాత్మీయంబగు విశ్వరూపంబును ధనంజయునికిం జూపె. అదియునుంగాక యా దేవుండు దైత్యస్వరూపులగు రాజులం జంపి భూభారం బపనయించి తనకులంబు నుప సంహరించుకొని తనతేజంబున నెల్లలోకంబులం గలయ వ్యాపించి దివంబున కరిగె. శ్రీరామప్రభృతులును శ్రీహర్యంశావతారంబుల. అయినను అవి యెల్లను శ్రీకృష్ణ దేవునితో సామ్యంబుఁ గాంచునే! అని వచియించి యూరకుండె. అంత రామోపాసకుం డిట్లనియె. కట్టా! శ్రీరామచంద్రునిమహిమం దెలియంగనివాఁడవు; చెప్పెదను వినుము.

ఉ. పీతదుకూలధారి యయి పీవరబాహుచతుష్టయంబుతో
నాతతసూర్యకోటికలితాంశువిరాజదుదారతేజుఁడై
భూతలమందుఁ గోసలునిపుత్రికకుం గనుపట్టె నంత నా
భీతకురంగనేత్ర తనుఁ బ్రేమ నుతింప శిశుస్వరూపి యై.

గీ. పెరిగి బాలుఁ డయ్యుఁ బెరలకుఁ దలఁపఁగా, రానితాటకాదిరాక్షసాళి
వధ మొనర్చి మౌనివరుమఖ మఱఁ గాచి, శిలను బాలఁ జేసెఁ జెలువ మొప్ప.

అంత.

సీ. ముల్లోకముల నుండు మొనగాండ్ర కేరికి నవిచాల్య మాపురహరునిచాప
మవలీల విఱిచి జనావనిప్ దమలోన నచ్చెరు వందఁ గా నంత దైవ
కల యైనయొకకన్యఁ గామరూపను భూమిసుత నయోనిజను భాసురశుభాంగి
సీతను బెండ్లాడి ఖ్యాతితో జగదేకమాన్యుఁడై క్షత్రియమండలికిని

గీ. గాళరాత్రి యనఁగ ఘనతఁ గాంచినమహా, బలుని బరశురాము భంగపఱిచి
దీప్తి వైష్ణవంబుఁ దేజంబుఁ గొనియెను; రాముఁ డఖిలసుగుణధాముఁ డగుచు.

గీ. తండ్రివచనంబుఁ గావఁ గాఁ దలఁచి రాజ్య
మఖిలమును బాసి పత్నితో ననుజుతోడఁ
గానలకు నేఁగి జటియు వల్కలియు నగుచుఁ
గ్రూర మయినట్టిరాక్షసకులముఁ ద్రుంచె.

క. జనకజ యంతర్హిత యై, చన సురకార్యంబుకొఱకుఁ జయ్యన మాయా
కనకాంగి సీత రావణుఁ, డనురక్కసుఁ డపహరించె నాసురవృత్తిన్.

క. లీలావశగతి రఘుభూ, పాలుండు ప్రియావియోగపరిపాటిఁ బ్రజా
పాళికిఁ గాన్పింపఁగఁ దన, శీలము పెంపొంద దుఃఖశిఖిఁ దపియించెన్.

గీ. అపుడు పురహరునవతార మైనహనుమ, దాసుఁడై చేరి కోఁతులదళముఁ జేర్చ
దుస్తరం బగుజలనిధిఁ బ్రస్తరముల, వేగ బంధించెఁ బ్రతిబంధవిరహితముగ.

ఉ. దానవదేవతావిభు లుదారబలుల్ సెగలేనిలంక స్వ
ర్థానినిలోకబంది మదమత్తనిశాచరకోటివాటికన్
ఖానిక మీఱ వృక్షచరపుంగవపుంజముతోడఁ జొచ్చి స
స్వానతబాహుశౌర్యరమ మానులు సిద్ధులు వేల్పు లెన్నఁగన్.

గీ. లంకయం దుండి యెవ్వాఁడు లలిని స్వర్గ
మందుఁ జరియించుమదహస్తిహస్తముసల
మంటి తెగిచెడి నట్టిమహాబలాఢ్యుఁ
గడపె నొకభల్లమునఁ గుంభకర్ణు నసురు.

చ. బలి యయి యెవ్వఁ డీభువనపఙ్క్తులఁ గాఱియపెట్టి దేవతా
కులములఁ గొట్టి దిట్టయయి కోరిక నాశివుఁ డుండునట్టియా
కులగిరి వే పెకల్చిన యకుంఠితబాహుబలాఢ్యు రావణున్
జలమున నొక్కకోలను వెసం బరిమార్చె సుర లున్నతింపఁగన్.

క. ఆరావణుతమ్ముని లం, కారాజ్యంబందు నిల్పి గ్రక్కున మాయా
కారను సీతను శిఖిఁ జొరఁ, బారంజేసెడినెపానఁ బడసెఁ దనసతిన్.

గీ. కమలభవుఁడు రుద్రగణములు మునులును, సిద్ధసాధ్యగణము సేరి కొల్వఁ
బుష్పకంబు నెక్కి పురి కయోధ్యకు వచ్చి, రాజ్యమేలె దినకరప్రభుండు.

క. లోకత్రయభారంబును, సాకేతేశ్వరుఁడు వాపి చనియె దివికి నా
సాకేతవాసిజంతువు, లాకులపాటేది వెంట నరుదేరంగాన్.

'ఇయ్యది మా రామమహీపాలచరిత్రంబు. శ్రీకృష్ణదేవునిచరిత్రంబు నంతంబునం గరము పరితాపకర మది వినుము.

మ. హతులై బందుగు లంద ఱొక్కమొగిఁ బ్రాణాపాయముం జెందఁగా
ధృతి వోయన్ దనపత్ని లోవనితలం దెల్లంబు గొంపోవఁగా
వితతంబై కలిరీతి పర్వ దివికి న్వేంచేసె నొక్కండ ని
శ్చిత మెట్టారఘురాముఁ డన్న ఘనుఁడా శ్రీకృష్ణదేవుం డగున్.

అని చెప్పిన విని వైష్ణవుండు వారలం గాంచి కట్టా! మీకు నింతదనుక నీవ్యామోహంబు నివర్తింపకయ యున్నది. మీరలు విష్ణుసిద్ధాంతము విన్నవారలుగా రని తోఁచెడిని. ఏఁజెప్పెదను వినుండు.

* శ్లో. లోకే గృహీతాకృతికస్య తస్య న వాస్తవః కోపి వికార అస్తే
పదం జనస్యేవ సమస్తకార్యే లీలావిలాసః పురుషోత్తమస్య
త్యాగోహి రాజ్యస్య వనే నివాసో దారాపహారోంబుధిసేతుబంధః
రక్షోవధాదిశ్చ విలాసమాత్రం చకార భూమా వవతీర్య రామః
ప్రకామఖేలా వ్రజసుందరీభి స్త్యాగోహి తాసాం జలధౌ నివాసః
భూభారనాశ స్స్వకులక్షయశ్చ దారాపసంగాదిచ కృష్ణలీలా.

---

* టీక. గృహీతాకృతికస్య=ఇచ్ఛాగృహీతమగుశరీరముగల, తస్య = ఆతనికి లోకే=ప్రపంచమునందు, కోపి వికారః=ఏవికారమును, న వాస్తవః అస్తే=వాస్తవముగాని దై యున్నది. పురుషోత్తమస్య=శ్రీవిష్ణునికి, (మీఁదటఁ జెప్పంబడునవి) సమస్తకార్యే = సర్వకార్యంబులందు, జనస్య=ప్రజకు, పదమివ=వ్యవసాయంబువోలె, లీలావిలాసః = క్రీడార్థమగు చేష్టలు. జనులుప్రొద్దువోకలకై యేకార్యంబులందైనను బ్రవర్తించెదరుగదా! అట్లై యుత్తరమునఁ జెప్పంబడుచేష్టలును విష్ణునిక్రీడార్థమగు చేష్టలు. అందు, రాజ్యస్య = రాజ్యముయొక్క, త్యాగోహి=పరిత్యాగమును, వనే=వనంబునందు, నివాసః=వాసము సేయుటయు, దారాపహారః=భార్యనితరుఁడపహరించుటయు, అంబుధిసేతుబంధః=సముద్రమునకు సేతువుగట్టుటయు, రక్షోవధాదిశ్చ=రక్కసులంజంపుట మొదలగునవియు, విలాసమాత్రం=వేడుకకై చేయఁబనులుమాత్రమే. ఇవి; రామః=శ్రీరాముఁడు భూమౌ = భూమియందు. అవతీర్య=అవతరించి, చకార=ఒనరించెను. వ్రజసుందరీభిః=గొల్లపల్లవాధరులతో, ప్రకామఖేలా=విశేషముగ విహారణముసల్పుటయు. తాసాం=వారలయొక్క, త్యాగః=వదలుటయుఁ; జలధౌ=సముద్రమున, నివాసః=ద్వారవతియనుపట్టణము నిర్మించుకొని వసించుటయు; భూభారనాశః=భూమియొక్క భారమును నశింపఁజేయుటయు, స్వకులక్షయశ్చ = తనకులమునశింపఁజేసికొనుటయు. దారాపసంగాదిచ= భార్యలుబోయలచేతంజిక్కుపడుటయు నివిమొదలగునవి, కృష్ణలీలా=శ్రీకృష్ణునిలీలలు.

అనుప్రామాణికోక్తులంబట్టి యారసిచూడ భగవంతుం డగుకృష్ణుండు తనయిచ్ఛచే లీలార్థము లోకంబున ననేకవిధాకారంబులం దాలిచి యవతరించుచుండువాఁడు. అతని కీచెప్పంబడినవికారంబు లేవియును లేవు. ఉండినట్లు తోఁచుచుండిన నవి వాస్తవంబులు గావు. లోకులకు సర్వకార్యంబులందు వ్యవసితంబు వొందుపడు చందంబున నివి యెల్ల నాపురుషోత్తమునిలీలావిలాసంబు లయి యుండును. అందు రాజ్యపరిత్యాగంబును వనవాసంబును దారాపహారణంబును జలధిసేతుబంధనంబును రాక్షసవధయుం ననునివి రాముండు భూమియం దవతరించి కావించినలీలామాత్రములు. వ్రజమానినులతోఁ గడుననురాగంబునం గ్రీడలుసల్పుటయుం వారలం బరిత్యజించుటయుం జలనిధియందు వసించుటయుం భూభారంబు నశింపంజేయుటయుం స్వకులనాశంబును దారాపహరణంబు ననునివి శ్రీకృష్ణునిలీలలు నై యొప్పుచున్నయవి. కాన నీకార్యంబులచేత భేదబుద్ధి గావింపం జనదు. శ్రీరామభక్తుండును శ్రీకృష్ణభక్తుండును శ్రీనృసింహాదిభక్తుండును వీరలెల్ల వైష్ణవులనియె వైష్ణవశాస్త్రం బెఱింగినవారలు వల్కుదురు.

శ్లో. యో ద్వేష్టి రామం భజతే తు కృష్ణం యో ద్వేష్టి కృష్ణం భజతే తు రామం
ఇమా ఉభౌ వైష్ణవసర్గమార్గే బహిర్ముఖత్వేన నివేదితౌ స్తః.

అని ప్రామాణికోక్తి గలదు గాన శ్రీరామునియందు ద్వేషబుద్ధి సేయుచు శ్రీకృష్ణుని భజియించువాఁడును; శ్రీకృష్ణునియందు ద్వేషబుద్ధి సేయుచు రాముని భజియించువాఁడు నీయిరువురు వైష్ణవసిద్ధాంతమార్గంబునందు బహిర్ముఖు లని చెప్పంబడినవార లగుదురు. కాన నెవ్వని కెవ్వని కేరూపంబునందు; భక్తిభావం బుండు; నాయారూపమునవుండు తానాయారూపంబులను భక్తిభావంబుల భజియించుచుండ నగుం గాని యితరాకృతుల యందు భేదబుద్ధి సేయం జనదు.

ఉ. కాన మహేశ్వరుండును నిరామయమాశ్రితభక్తిభావనా
ధ్యానమున న్విభేదమతితత్పరభావము లేక కృష్ణునిన్
గానకళాధురంధరునిఁ గార్ముకదీక్షితుఁ డైనరామునిన్
మానవసింహరూపుని రమాసఖునిన్ హయవక్త్రుఁ గొల్చెడిన్.

అనిన విని శైవుండు కరము కుపితుండై యోరీ! నీవె శివుండు మహేశుండనిపల్కెదవు. అతం డితరుని భజియించువాఁ డనియు నుడువుచున్నాఁడవు. నీవచనంబులు పరస్పర విరుద్ధంబు లగుటం జేసి దూష్యంబులు.

శ్లో. ఈశో మహేశః పరమేశ్వరో వా, మహేశ్వరః కేవల మీశ్వరో వా
సమాఖ్యయా కః కథితో మహద్భిః, శ్వి వాద్య తే వేదపురాణవిద్భిః

అని యుండుటంబట్టి యీశుండనియొండె మహేశుం డనియొండెఁ బరమేశ్వరుం డనియొండెమహేశ్వరుండనియొండెఁ గేవలమీశ్వరుండనియొం డెనీసమాఖ్యలతో మహాత్ము

లగు వేదపురాణవిదులచేతఁ జెప్పంబడువాఁడు శివునికంటె మఱి యెవ్వండు గలఁడు? అని చెప్పిన విని వైష్ణవుండు నవ్వుచు నిట్లనియె.

ఓరీ యీశ్వరుఁ డని పేరు గలుగుటంబట్టియే యైశ్వర్యంబు గల్గునా? భగవంతుం డగువిష్ణునైశ్వర్యంబు వేదపురాణాదిసిద్ధంబు. అయ్యది నీకుం దెల్పెదను వినుము.

చ. సిరులకుఁబుట్టినిల్లయినచేడియ భార్య చతుర్ముఖాండముల్
వరుసను సృష్టిసేయఁగలవాఁడు సుతుండు సమస్తదేవతా
వరనికురుంబముల్ సుభటవర్గము స్తోత్రలు సర్వవేదముల్
పరమపదంబు వాస మలపంకజనేత్రుని కెన్న నెప్పుడున్.

ఇట్టిమహనీయునికిం గౌస్తుభభూషణునికిఁ గనకాంబరధారునికి లక్ష్మీస్వయంవర పతికి నీశ్వరుం డనునామంబున వ్యవహారంబులేమి యొక కొఱంతయే? కపాలమాలికా ధారికి దిగంబరునికి నాదిభిక్షుకునికి నీశ్వరుం డన్నపే రుండినమాత్రానం జేరిమి గల్గునే? ఎఱుంగనిదియే యాశివునికిం గలయైశ్వర్యంబు?

మ. చితిభస్మం బనులేపనంబు జ్వలదస్థిప్రాయహారంబు లం
చితభూషల్ భుజగంబు లుత్కటపిశాచీప్రాయభృత్యాళి యు
ద్ధతభేతాళమహాశ్మశానమున భూతవ్రాతసంయుక్తి సం
తతవాసంబును నీశ్వరత్వమునకుం దార్కాణయే యెన్నఁగన్.

గీ. ఈయమంగళరూపంబ దెపుడు గలిగి, యుండునాతఁడు మంగళ మొదవఁ జేయఁ
గలఁడె యాతనిఁ గొల్చిన మనపిశాచ, భావము లభించునే కాక పరము రాదు.

క. ఈరూపున నీసంపద, నీరమ్యక్రియల నుండునితనికిఁ గలిగెన్
చారుమహేశసమాఖ్యయు, నారయఁగ యథార్థ మగునె యది యాతనికిన్.

అని యివ్విధంబున నెల్లవారలకు విస్మయంబు గలుగ నుడివి వైష్ణవుం డుండిన మహా కోపంబుతో శైవుం డిట్లనియె.

ఉ. ఆతఁ డనంతరూపుఁడు విహారరతుండు విచిత్రచేష్టఁ దన్
ఖ్యాతిగలాఁడు గావున నొకప్పటి కింద స్వరూపహాని యే
రీతిని గాంచుఁ జిన్మయశరీరుని కంద మదేల యావిభుం
డాతతచిత్రరూపముల నాసఁ జెలంగుచుఁ గ్రీడ సల్పెడిన్

గీ. చిత్రరూపాళిఁ దాల్చి విచిత్రగతుల, భక్తపరిపాలన మొనర్చుభవునితోడ
సమ్ముఁ డనం జెల్లునే హరి సారసాక్షుఁ, డాత్మనయనాబ్జమునఁ బూజ లాచరించె.

అనిన నది విని యయ్యోధనుండుకొందఱు వారలవాక్కలహంబు వారించి మహా కవిం గాంచి యిట్లనిరి.

ఓమహాత్మా నీవు సమస్తవిద్యార్ణవకర్ణధారుండవు! నిన్నుం గాంచిన నాభారతీదేవి ప్రగల్భ మగుపుంరూపంబుం దాల్చి సాక్షాత్కరించినట్లు దోఁచుచున్నది. నీ తేజోవిశేషంబునన నీయసదృశసామర్థ్యం బనుమితం బయ్యె. ఈశైవవైష్ణవులకు వివాదంబు సాంప్రతము సంప్రవృత్తం బయియున్నది. శైవుండు శివునికి మహత్వంబు నుడివెడిని. వైష్ణవుండు విష్ణునికిం జెప్పుచున్నాఁడు. ఈయర్థంబున మీరు మాధ్యస్థ్యం బంగీకరించి మాకుం గలసంశయముల నివృత్తంబులు సేయుఁడు. అని యడుగఁగా సకలవిద్యానిధి యగుకాళిదాసుం డిట్లనియె.

మ. కలికాలంబు కరంబు తుచ్ఛతర మీకాయం బి దేమాత్ర మీ
యిల సంపత్తి యి దెంత బుద్ధి యిది తా నేపాటి దిట్లుండఁగా
బలవన్మోహమహత్వ మెట్టిదియొ కోపస్ఫూర్తితో మానవా
వళి సర్వంబు నఖర్వగర్వకలనావార్యంబు గాఁ బొల్చెడిన్.

ఎవ్వారలైనఁ బరస్పరకోపంబుఁ బరిత్యజించి గర్వపర్వతంబుల భేదించి పర్యాలోచన మొనర్చిరేని యిట్టివాదంబులు ప్రవృత్తంబులు గావు. కలిబలంబునం బలుఘోరం బయి యొప్పునీకలియుగంబునం గొన్నిశాస్త్రంబు లభ్యసించి పాషండప్రాయులై యొప్పు పండితంమన్యులచే విమోహితులై వైష్ణవులు శివుని శైవులు విష్ణుని నిందించుకొనుచు భక్తివిశేషాభిమాను లయి ముక్తిం గోరుచుండెదరు. వస్తుగతి యెట్టిదనిన! నేను పురాణంబుల వేదంబులం దదంగంబుల శాస్త్రంబులఁ గలయ నవలోకించినవాఁడను. ఎయ్యెడనైన శివవిష్ణుభేదంబు గన్పట్టినది గాదు. ఇయ్యెడ నుండుపండితమండలి నడిగెద. ఎచ్చోట నేని శ్రుతియందొండె స్మృతియందొండె శాస్త్రపురాణములనొండె శివవిష్ణుభేదంబు సూపట్టెడినే? యని వారల నడిగి వారలు గన్పట్ట దని ప్రత్యుత్తర మొసఁగ మహాకవి మఱియు నిట్లనియె.

* శ్లో. శివస్య విష్ణోః పర ముక్తిరేషా పురాతనీ శ్రూయత ఏవ సర్వైః
య శ్చానయో ర్భేదధియం కరోతి నర స్సఘోరం నరకం ప్రయాతి.

అన్నట్లు లాశివకేశవు లిరువురును దమవిషయంబున నెవ్వరు భేదబుద్ధిఁ జేయుదురో; వారు ఘోరమగు నరకంబునకుం జనియెద రని। చెప్పియుండుపురాతనోక్తి యెల్లవారు వినియుండునదేకదా! యని నుడివి మఱియు నిట్లనియె.

---

* శివస్య=శివునియొక్కయు, విష్ణోః=విష్ణునియొక్కయు, పరముక్తిః = ఉత్తమవచనమగు, ఏషా=ఇది, సర్వైః=అందఱిచే, శ్రూయతఏవ = వినంబడుచునేయున్నయది. యశ్చ=ఎవ్వఁడు, అనయోః=శివకేశవులనగుమాకు, భేదధియం = భేదబుద్ధిని, కరోతి = చేసెడినో! సఃజనః = ఆజనుఁడు, ఘోరంనరకం = ఘోరమగునరకమును, ప్రయాతి = పొందుచున్నాఁడు.

గీ. కాన భేదబుద్ధి గలుగనీయక భక్తుఁ, డాదరమున హరిని హరుని నొండెఁ
గొలువవలయుం హృదయకుహరంబునందుఁబ్ర, సాద మొంది భక్తి సలుపుకొనుచు.

గీ. భుక్తిముక్తులం దానిచేఁ బొడముచుండు, భక్తి శివునందు హెచ్చిన భవుని నదియ
విష్ణునందు నెసంగిన విష్ణుఁ గొలువఁ, బూనుకొన నగు సాధకపురుషుఁ డెలమి.

క. హరి గొలుచుచుండు హరునిన్, హరుఁడును దాఁగొలుచుచుండు హరినిం దను కొం
డొరులకు భేదము లే దని, తిరముగ నెఱిఁగింప వారలత్ప్రీతిమెయిన్.

అని నుడివిన నెల్లవారును సాధువాదంబులం బ్రస్తుతించిరి. మహాకవియుం వారలచే సత్కృతుండై యేఁబదిరెండవ కక్ష్యాంతరంబుం గడచి యేఁబదిమూఁడవహజారంబునం బ్రవేశించి యయ్యెడ.

క. ధృతయజ్ఞదీక్షులై సం, తతసువ్రతకలనపూర్ణకలితాదరులై
నతశిష్యతతికిఁ గర్మము, గతిఁ దెల్పుచునున్న వారిఁ గనియె న్సోరిన్.

ఇట్లు గని యామీమాంసాశాస్త్రదక్షులసమీపంబున కేఁగి తత్సమాహూతుండై నృక్సప్రవాదిసహితు లయినయాపండితులనడుమ నుండునొకదారుమయాసనంబునం గూరుచుండి మహాకవి యిట్లనియె.

* శ్లో. యేనాఽభవ చ్ఛతమఖో ధిపతి స్సురాణాం
యేనాఽప్యయం దినకరోఽధిపతి గ్గ్రహాణాం,
రాజాథ భూమివలయేఽధిపతి ర్నరాణాం
తస్మిన్ పున ర్భవతు కర్మణి తే ప్రయత్నః.

అని చెప్పఁగా నచ్చటివారలు కవి వచియించినశ్లోకంబునందు సర్వంబునకుం గర్మంబ ప్రధానం బని యుక్తమగుటంబట్టి యూతని నతిసమాదరంబునం గారవింప వారల

* టీ. యేన=ఏకర్మముచేత,శతమఖః=నూఱశ్వమేధములురచించిన యింద్రుండు, సురాణాం=దేవతలకు, అధిపతిః=అధికారిగ, అభవత్=అయ్యెనో? యేనాపి = దేనిచేత, అయందినకరః=ఈసూర్యుఁడు, గ్రహాణాం=చంద్రకుజబుధగురుశుక్రశనులకు, అధిపతిః= అధికారిగ, అభవత్ = అయ్యెనో? అథ=మఱియుం నేకర్మముచేత, రాజాపి = రాజును, భూమివలయే=భూమండలమునందు, నరాణాం=జనులకు, అధిపతిః=అధికారిగ-అయ్యెనో? అస్మిన్=ఇట్టిదియగు, కర్మణి=కర్మమునందు, తే = నీకు, అనఁగా మీకందఱకుననుట. ప్రయత్నః=ప్రయత్నము, భవతు=అగుంగాత. శతమఖప్రముఖు లాయాయధికారములకు వచ్చుట తత్తత్కృత పుణ్యకర్మఫలము గాన నట్టిపుణ్యకర్మంబు రచియింప నెల్లవారును ప్రయత్నపడుచుండనగు నని భావము.

వీడుకొని మహాకవి యామీమాంసకులు వెనువెంటం జనుదేర నాహాజారంబుఁ గడచి యేఁబదినాల్గవహాజారంబునం బ్రవేశించి యయ్యెడ.

ఉ. సంసృతిఘోరవారినిధిసంతరణం బొనరించి వేగ వి
స్రంసితభోగరాగులయి సర్వజనంబులఁ గావ నాశ్రమో
త్తంసముఁ బూని కుండికయుఁ దండము దాల్చి కషాయచేలులై
కంసరిపు స్మరించుజితకాముల వేదశిరోవిచారులన్.

కొందఱను; సాక్షాత్కరించినబ్రహ్మవిద్యావివర్తంబులం బోలినవారి; సన్న్యాసివేషధారులం జూచి యాశ్రమోచితధర్మంబు సలుపుట తగవని యవ్వారల కంజలి యొనరించి మించినయనురాగంబున నాదేశికవతంసంబులు నిర్దేశించినస్థలంబున నొకయెడం బ్రుసియం దధివసించి వారలం గాంచి యిట్లనియె.

* శ్లో. యస్మిన్ త్రైలోక్య మేత న్మహసి దినపతే ర్వారివ ద్భాసమానం
త్వం చాహం చా య మిత్థం వ్యవహరతి యదజ్ఞానత స్సర్వఏవ
విజ్ఞానానందరూపం విమల మవిదితం సర్వగా మ్యద్వితీయం
నిత్యం చాపేత్య మాయాం కలయతు సహసా తద్భవాన్ స్వస్వరూపమ్.

---

*టీ. యస్మిన్=ఏబ్రహ్మమునందు, ఏతత్త్రైలోక్యం=ఈముల్లోకములును, దినపతేర్మహసి=సూర్యునికిరణజాలరూపమగు మరుమరీచికలయందు, వారివత్ = నీరువోలె. భాసమానం=తోఁచుచున్నదియో; సర్వఏవ=ఎల్లజనులును, యదజ్ఞానతః = ఏబ్రహ్మము నెఱుంగకయుండుటచేత, త్వంచ=నీవనియుం, అహంచ=నేననియు, అయంచ=వీఁడనియు ఇత్థం=ఇవ్విధముగ, వ్యవహరతి = వ్యవహరించెదరో; విజ్ఞానానందరూపం = విజ్ఞానమయంబై యానందమయంబై, సర్వగామి=అంతటనుండునదియు, అద్వితీయం=తనకంటె భిన్నములేనిదియై, నిత్యంచ=నిత్యమై, విమలం=దోషవిరహితమై, అవిదితం=ఎఱుకపడనిదై, స్వస్వరూపం=ఆత్మస్వరూపమై యొప్పు, తత్ = ఆబ్రహ్మమును, భవాన్ = నీవు, మాయాం=మాయను, అపేత్య=విడిచి, సహసా=వేగముగ, కలయతు = ఉపాసింతువుగాత.

మరుమరీచికలయి చూపట్టుమధ్యాహ్నకాలపుసూర్యునికిరణములయందు నీరు గనంబడుచున్నది. అది భ్రాంతి. అట్లే బ్రహ్మమునం దీజగంబు మిథ్యాభూతంబై తోఁచుచున్నది. అదియు; నీవు, నేను, వాఁడను వ్యవహారము నాపరమాత్మ తానని యెఱిఁగిన నశించును. అట్టి యెఱుకలేమిం జేసియే యిట్టి వ్యవహారము గానంబడుచున్నదనియు, ఆ బ్రహ్మము విజ్ఞానానందాదిరూపమయి యంతటనిండియుండి యాత్మాకారంబై యొప్పుననియుం వేదాంతులయభిప్రాయము.

అని యుపన్యసింపఁగా విని యచ్చోటనుండుపరివ్రాజకులు కవివచించినశ్లోకంబున కుం గరంబలరుచు బ్రహ్మం బొక్కటియె సత్యం బనియుం దానియందె జగంబుమరుమరీచి కలయందు జలంబులువోలెం దోఁచుచుండుఁ గాన మిథ్యాత్మకం బనియు విజ్ఞానానంద రూపంబును సర్వగామియుం నద్వితీయంబునగు నాబ్రహ్మంబు నెఱుంగమి నీవు నేను నన వ్యవహారంబు గలిగియున్నదనియుం మాయ యనునది యిట్లు సేయుచుండుంగాన నదినిః ర్తించెనేని స్వస్వరూపజ్ఞానంబు సంభవించు ననియునిట్టియర్థం బుపనిషత్సంతతిప్రతిపా ద్య మగుటంబట్టి తదుపన్యాసంబున నీకవి మహానీయుండుగా నుండు నని యతనివివేకం బును గొనియాడి యథార్హంబుగ సత్కరించి సంస్తుతింప నయ్యెడకుఁ దరుణుండు,

గీ. ఘనమయూరవాలకలితకరాబ్జుఁడై, యిలను దుడిచి యడుగు లిడుచు హింస కంతరంగమందు నతిభీతిఁ జెందుచుఁ, వచ్చె బౌద్ధుఁ డొకఁ డవార్యగతిని.

ఇట్లు నను దెంచి యాతండు “అహింసాపరమోధర్మః” అని చెప్పుచుఁ గవికడకుం బోయిన నాతనిం గాంచి మీమాంసకులు ఓరీ! హింస సేయకయుండుటయ పరమధర్మం బనియెదవు. అట్లు నుడువం జనదు,

శ్లో. వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః
వేదో నారాయణ స్సాక్షా త్స్వయంభూ రితిచ శ్రుతిః.

అని ప్రామాణికవచనం బుండుటంజేసి వేదచోదితమగునది ధర్మమనియుం దానికి విపర్యయ మగునది యధర్మ మనియుం జెప్పనగు ననిన వారలం గాంచి యాబౌద్ధుండు నవ్వి హేళన మొనరించుచు నిట్లనియె.

శ్లో. దేవా నర్చయ సంచయ ప్రతిదినం పుణ్యాని జన్మాంతరే
భోగాయ ప్రయతో మహాక్రతువిధౌ స్వర్గాయ హింసాం కురు.

---

* టీ. దేవాన్ = దేవతలను, అర్చయ=పూజింపుము. ప్రతిదినం = అనుదినము పుణ్యాని=పుణ్యములను, జన్మాంతరే=మఱుసటిజన్మంబునందు, భోగాయ=సుఖానుభవము నకు, ప్రయతః=ప్రయత్నించినవాఁడవై, సంచయ=సంపాదింపుము. స్వర్గాయ=స్వర్గము నకు, క్రతువిధౌ=యాగమునందు, హింసాం=హింసను, కురు=చేయుము? ఇత్థం=ఇవ్విధ ముగ, వంచకవంచనోత్పథగతా=వంచకులు సేయువంచనలచేత దుష్టమార్గమునందుం బ్రః ర్తించియుండు, త్వదీయా=నీయొక్క, బుద్ధిః=మతి, అచిరాత్ = వేగముగ, అప్రత్యక్ష పదార్థసార్థరహితం=కంటికింగానరాని వస్తువులగుంపులు లేనట్టి, పంథానం=మార్గమును ఆరోహతు = ఆరోహించుంగాత. అప్రత్యక్షవస్తువులు లేని మార్గమనఁగా ప్రత్యక్షమే ప్రమాణము అను బౌద్ధమార్గము ననిభావము.

ఇత్థం వంచక వంచనోత్పథగతా బుద్ధి స్త్వదీయా చిరా
దప్రత్యక్షపదార్థసార్థరహితం పంథాన మారోహతు.

అని,, లోకమునం గొందఱు వంచకులు తా మితరులకు మీరు దేవతలం బూజిం పుఁడు; పుణ్యంబు సంపాదింపుఁడు; జన్మాంతరమున సుఖం బనుభవింపం గోరి వ్రతాదు లను ష్ఠింపుఁడు; స్వర్గమునకుఁగా మహాయజ్ఞంబు లొనరించుచు నందుఁ బశువులను జంపుఁ డంచు నివ్విధమునం జెప్పుదురు. వారలం నుడువు దుష్పథంబునందు నీబుద్ధి ప్రవేశింపం జనదు. ఆమార్గ మ ప్రత్యక్షపదార్థసార్థము గలది గాని ప్రత్యక్షవస్తువులం జెప్పునది కాదు. అని యిట్టియర్థంబు లుపన్యసించునాబౌద్ధుండు నుడివినశ్లోకంబు విని సామాజికు లెల్ల వారు నపహాసంబు సేయుచుఁ గట్టా! యీపాపుండు, దురాత్ముఁడు ఎచ్చోటనుండు వాఁడో; ఎయ్యెడనుండిచను దెంచెనో క్కా! అని ప్రకటముగనాడుకొనిరి. అదివిని యా నాస్తికుం డిట్లనియె; అ! నీను పాపుండనే! కానిండు! మీరలు నిరర్థకంబుగఁ బశువులం జంపువారలు కరము పుణ్యశీలురరు. అనిన మీమాంసకుండు మహాకోపంబుతో,

శ్లో. స్వర్గ్యా గతిః క్రతుహతస్య పశోశ్చ తస్య
తృప్యంతి దైవతగణాః పరివారవర్గైః
స్వస్యాపి వాంఛితఫలాని భవంతి నూనం
పాపాయ కిం భవతి త ద్విధిజాతహింసా.

అని,, ఓరీ నిరర్థకంబుగఁ బశువులను జంపెద మని యనియెదవు. క్రతువునందుం జంపంబడినపశువునకు స్వర్గగతి సంభవించుచున్నది. ఆపశువిశసనము సేసి యాగంబొనరిం చుటవలన దేవతాగణంబులు తదీయపరివారకులంబులతోఁ దృప్తిం బడసెదరు. అది రచి యించినయజమానుం డగుతనకును వాంఛితఫలంబులు సిద్ధించు. వేదచోదిత మగుటం జేసి యాగమునం జేయఁబడినహింసవలన; నిట్టిసత్ఫలముగలిగించుదానివలనఁ బాపంబు సంభవిం చునా! యనునర్థంబు వెల్లడి యగునట్లు నుడివిన నాస్తికుండు.

---

* టీ. క్రతుహతస్య=యాగమునందుంజంపంబడినదగు, పశోశ్చ=పశువునకును తస్య=ఆయజ్ఞము సేయుయజమానునికిని, స్వర్గ్యాగతిః=స్వర్గప్రాప్తి, గలదు. తస్య=వాని యందు, దైవతగణాః = దేవతలసమూహంబులు, పరివారవర్గైః = పరిజనములగుంపులతో, తృప్యంతి=తృప్తిఁజెందుచున్నవి. స్వస్యాపి=తనకును, అనఁగా యజమానునికిని, వాంఛిత, ఫలాని=కోరంబడినవియగు ఫలములు, భవంతి=కలుగుచున్నవి. నూనం=నిజము తత్ = అట్లగుటం జేసి, విధిజాతహింసా=వేదములందు విధించుటవలనంబ్రవృత్తమగుహింస, పా పాయ=పాపమునకు, భవతికిం=అగునా?

1 శ్లో. స్వర్గః కుత్రచ కుత్రదైవతకులం కుత్రాఽథ జన్మాంతరం,,

అని,, స్వర్గ మనునది యెక్కడనున్నది! ఆస్వర్గఫలప్రదాతలని నీవెప్పుడు దేవత లెక్కడివారు? జన్మాంతరంబున భోగం బనుభవింప బుణ్యంబు సేయుమనియెదరే! ఆజన్మాంతర మనునది లేనేలేదు. అనునర్థంబు విస్పష్టం బగునట్లు వచింప మీమాంసకుండు వానిం గాంచి,

శ్లో. అహో వేదపురాణమధ్యవిలసద్వస్తూని కిం నిందసి,,

అని,, యోరీ! కట్టా! వేదములయందును బురాణములయందును బ్రతిపాదింపంబడినవస్తువులను నిందించెదవా? వానియందు స్వర్గ మున్నదనియు దేవతలు తృప్తులై స్వర్గఫలం బిత్తురనియు మఱుజన్మంబు గలదనియుఁ జెప్పంబడియుండలేదా? అనునర్థంబు విశదపడునట్లు నుడువఁగా నది విని వెండియు నాస్తికుండు,

శ్లో. ప్రామాణ్యం కిము యాంతి వంచకకృతా వేదాః పురాణాదయో,
యేచాతీంద్రియసర్వవస్తుకథయా వంచంతి సర్వం జగత్.

అని,, ఓరీ! ఆవేదములును బురాణాదులును లోకమును వంచింప వంచకులు రచించినవి; అట్టివి ప్రమాణంబు లగునా? ఆవేదపురాణాదులయందుం బ్రతిపాదింపంబడువస్తువు లెల్ల నతీంద్రియంబు లయి యున్నవి. అట్టివస్తువులను జెప్పుచు సమస్తలోకములను వంచించెదరు. అనునర్థంబు గన్పడ వచియించిన వెండియుం మీమాంసకుండు,

2 వాక్యం. కథ మహో వినైవ కర్మ సుఖదుఃఖాదిభోగీ పురుషః,,

అని, ఆహా! అతీంద్రియమగు కర్మము లేదంటివేని యది లేక పురుషుండు సుఖదుః

---

1 టీ. స్వర్గః=స్వర్గమనునది, కుత్ర=ఎక్కడనున్నది? దైవతకులం=దేవతలసమూహము, కుత్రచ = ఎక్కడనున్నది? అథ=మఱియు, జన్మాంతరం = మఱుజన్మమనునది, కుత్ర=ఎక్కడిది? అహో=కట్టా! వేదపురాణమధ్యవిలసద్వస్తూని=వేదములయు పురాణములయుం నడుమఁ బ్రతిపాదితంబులై యుండు వస్తువులను, కిం నిందసి=నిందించెదవే! యేచ=ఎవి, అతీంద్రియసర్వవస్తుకథయా=ఇంద్రియములకగోచరములగు సమస్తవస్తువులనే నుడువుటంబట్టి, సర్వంజగత్=సమస్తలోకంబును, వంచంతి=వంచించెడినో; అట్టి- వేదాః=వేదంబులును, పురాణాదయః=పురాణాదులును, ప్రామాణ్యం=ప్రమాణత్వమును యాంతికిము=చెందెడినే? చెందవనుట.

2 టీ. అహో=ఔరా! వినైవకర్మ = కర్మములేకయ, పురుషః = పురుషుఁడు, కథం=ఎట్లు, సుఖదుఃఖాదిభోగీ=సుఖముదుఃఖము మొదలగువానిని ననుభవించువాఁడుగా; నగుట? కథం=ఎట్లు?

ఖాదుల ననుభవించుటయెట్లు? పురుషుం డొనరించిన సుకృతదుష్కృతంబులకు నతీంద్రియం బగునదృష్టం బొకటి కలిగి యది సుకృతమురచించినవానికి సుఖానుభవమును, దుష్కృతమురచించినవానికి దుఃఖానుభవము నిచ్చుచుండును. అట్టి యదృష్టం బొక్కటి గలదని యొప్పుకొననిచో జీవుల కందఱకు నొకవిధమగు భోగంబు గలుగుచుండవలదా? యను నాపత్తి సంభవించును. అట్లు గాక జీవుల కందఱకును భోగంబు భిన్నంబై యుండుటదృష్టంబు. జీవులు పెక్కండ్రు పెక్కు తెఱంగులఁ గర్మంబు రచియించుటం జేసి కారణభేదంబునం గార్యభేదంబు గా నుండుభోగభేదంబును గల్గు ననుట యనుభవంబునకుం దగును. అనునర్థంబులు దోఁచునట్లు వచియింప నాస్తికుండు,

* వాక్యం. అహో కుత్ర కర్మ? కేన దృష్టం? కదా వా కేన వా ఉపార్జితం? జన్మాంతరే కృత మితిచేత్! తదేవ నాస్తి; ప్రమాణాభావాత్. సుఖదుఃఖాదికం పునః ప్రవాహధర్మతయా శరీరిణా మనియతమ్. వస్తుతో జగ దేత దసత్. ఇతి సర్వ మిదం భ్రమఏవ.

అని,, కర్మ మెక్కడిది? ఎవఁడు గాంచె? ఏనాఁ డెవ్వఁడు సముపార్జించె? జన్మాంతరమునందుఁ జేయఁబడియున్నదని యంటివేని! అట్టిజన్మాంతరంబనునదియే లేదు. అది కలదనుటకుం బ్రమాణంబు జూపట్టదు. సుఖదుఃఖాదికంబులన్నో ప్రవాహధర్మంబు లగుటం జేసి దేహధారులకు నియతంబులు గావు. వాస్తవాకారంబున నీజగంబసత్యంబు. అంతయు నిది భ్రమంబె? అనునీయర్థంబులు గలవచనంబులు వక్కాణింప మీమాంసకుండు; విని జీవునికి జన్మాంతరంబు గల దనుటకుఁ బ్రమాణంబు లేక; సుఖదుఃఖాదికంబులు ప్రవాహధర్మంబులు గా వనుటకు యుక్తిలేక; జగం బసత్యంబు గా దనుటకుఁ గారణంబు దెల్ప

---

* టీ. అహో=ఔరా! కర్మకుత్ర=కర్మ మెక్కడిది? కేనదృష్టం=ఎవ్వనిచేఁ జూడఁబడెను? కేనవాఉపార్జితం=ఎవ్వనిచే సంపాదింపంబడియెను? జన్మాంతరేకృతమితిచేత్=జన్మాంతరమునందుఁ జేయఁబడినది యందువేమొ! ప్రమాణాభావాత్=ప్రమాణము లేకపోవుటంబట్టి, తదేవనాస్తి=ఆజన్మాంతరమనునదియే లేదు. సుఖదుఃఖాదికం పునః=సుఖముదుఃఖము మొదలగునవియన్నో! ప్రవాహధర్మతయా=ప్రవాహధర్మములగుటం జేసి. [ప్రవాహధర్మ మనఁగా "పూర్వపూర్వస్వరూపనాశేసతి ఉత్తరోత్తరస్యతత్సమానరూపత్వం" అనియుండునట్లు తొలుతటి తొలుతటి స్వరూపమునశింపఁగా మీఁదమీఁదఁ గలుగుచుండు దానికిఁ బూర్వపుదానితో సమానమగురూపముగలిగియుండుట.] శరీరిణాం=జీవులకు, అనియతం=నియతములు గావు. వస్తుతః=వాస్తవాకారమున, ఏతత్=ఈ, జగత్=జగము, అసత్=మిథ్య. ఇతి సర్వమిదంభ్రమఏవ=అను నిదియంతయుఁ భ్రమంబు.

లేక;స్వర్గ మొకటి గలదనుట భ్రమం బని నుడివినవచనంబునకుం బ్రతి పల్కంజాలక పరాభూతుండై మిణకరించుచు నూరకుండెను.

అంత వేదాంతి నాస్తికునిం గాంచి యిట్లనియె.

1 వాక్యం. అహో జగ దేత న్మృషైవేతి సత్య ముక్తం శ్రీమద్భిః. కింతు ఏకం బ్రహ్మ సత్యభూత మాస్తే. యస్మి న్నేత న్మిథ్యాభూత మపి సత్యతయా ప్రతిభాతి,,

అని., ఆహా మీర లీజగం బసత్యం బని చెప్పినమాట సత్యంబు, అయినను సత్యభూతమగు బ్రహ్మంబొక్కటి యున్నది. మిథ్యాభూతమగు నీజగం బా బ్రహ్మమునందు సత్యంబుగఁ దోఁచెడిని. అని పల్కిన నాస్తికుండు;

2 వాక్యం. సాధుసాధు! కించిన్మన్మత ప్రవిష్టోసి. పరంతుకీదృక్ తద్బ్రహ్మభవతామ్.

అని, సరే సరే! ఓరీ యొకించుక మన్మతంబునం బ్రవేశించినవాఁడవె. జగం బసత్యం బనుట మనయిరువురకుం దుల్యంబు. అదిగాక బ్రహ్మ మొండు గలదంటివి. మీర లా బ్రహ్మం బెట్టిదందురు? అనిన వేదాంతి యిట్లనియె.

3 శ్లో॥ క్రియాహీన మనాకారం నిర్గుణం పరమం మహః,
తత్ బ్రహ్మ పరమానంద మవాఙ్మానసగోచరమ్.

అని,, క్రియా శూన్యము; ఆకారరహితము; గుణములు లేనిది: తనకంటెం బరము లేనిది; తేజస్స్వరూపమయియుండునది యాబ్రహ్మము. అది యపరిమితానందమయమై వాఙ్మనంబులకు విషయంబుగాక యుండు. అనునర్థం బగునట్లు వేదాంతి సెప్పిన నా బౌద్ధుండు వెండియు నిట్లనియె.

---

1 టీ. అహో=బళా ! జగదేతత్=ఈజగము, మృషైవ=మిథ్యయే, ఇతి=ఇట్లని, సత్యం = వాస్తవము, శ్రీమద్భిః=మీచేత, ఉక్తం=చెప్పఁబడినది. కింతు=కాని, ఏకం= ఒకటి, బ్రహ్మ=బ్రహ్మమనునది, సత్యభూతం = సత్యముగ, ఆస్తే=ఉన్నది. యస్మిన్=ఏ బ్రహ్మమునందు, మిథ్యాభూతమపి=అసత్యమయ్యును, ఏతత్=ఈప్రపంచము, సత్యతయా =సత్యముగ, ప్రతిభాతి=తోఁచుచున్నదియో ! అట్టి బ్రహ్మమనునది యొకటి సత్యముగ నున్నదని పూర్వముతో నన్వయము.

2 టీ. సాధుసాధు=మేలు మేలు! కించిత్ మన్మత ప్రవిష్టోసి=ఒకించుక నామతంబునం బ్రవేశించినవాఁడవయితివి. పరంతు=అయినను, భవతాం=మీయొక్క, బ్రహ్మ=బ్రహ్మము , తత్=అది, కీదృక్=ఎట్టిది?

3 టీ. తత్ బ్రహ్మ=ఆబ్రహ్మము, క్రియాహీనం=క్రియలు లేనిది.అనాకారం=ఆకారము లేనిది. నిర్గుణం=గుణములు లేనిది. పరమం=తనకంటెఁబై దిలేనట్టిది. మహః=తేజస్స్వరూపము. పరమానందం=పరమానందమయము, అవాఙ్మానసగోచరం=వాక్కునకును, మానసంబునకును విషయము గానిది.

1 శ్లో. జగన్మృషైవేతి భవన్మతం చేత్ కిం కథ్యతే బ్రహ్మ నిరర్థకం తత్,
ఆకారశూన్యేన గతక్రియేణ కర్తవ్య మేతేన కిమస్తి లోకే.

అని,, జగం బసత్యం బని నీమతంబయ్యెన నీవింక నేమియుఁ జెప్ప నొప్పదు. ఆబ్రహ్మ ముండియు నిరర్థకంబ. అసత్యమగు నీజగమునకుఁ గావలసినదియు నసత్యమే. కాన నీజగంబునకుం గావలసినది యేమియు లేదు. నీనుడివిన బ్రహ్మం బాకారశూన్యంబును క్రియావిరహితము నయినదగుటం జేసి యది యేమియుఁ జేయ వలంతి గాదు. మిథ్యాభూతమగు లోకమునకుఁ గావలసిన దేమియుం లేదు గానను, బ్రహ్మ మనునది యేమియుఁ జేయ వలంతి గాదు గానను, ఆబ్రహ్మ ముండుటకుం బ్రయోజనంబు నూపట్టదు. అను నర్థంబు గన్పట్టునట్లు చెప్పఁగా విని వేదాంతియుఁ దనమనంబున నాబ్రహ్మమునుగుఱించి వేదము ప్రమాణ మని చెప్పం జనును. అది నాస్తికుఁ డొప్పుకొనఁడు; ఏమి సేయుందును; అని విచారించుచు నేమియుం జెప్పలేక మిణకరించుచు నూరకుండఁగా నచ్చోటిసభాసదు లెల్లవారును నాస్తికునిచే వేదాంతి పరాభూతుం డగుట యెఱింగి నవ్వుకొనుచు మహాకవి మొగంబుం గాంచిరి.

కాళిదాసుండును వారలయభిప్రాయం బెఱింగి తనమనంబున నిట్లు తలంచె. ఈ నాస్తికుండు కరము సమర్థుండుగాని యలంతి గాఁడు. లీలమెయి నీమీమాంసకుని వేదాంతిని సముచితయుక్తిచేఁ బరాభూతులం గావించె. వీనిఁ బరాభూతుం జేయ నీసభాసదులు వేఁడుచున్నారు. వీని నవమానితుం జేసి జగత్కారణవస్తు వున్నదని నిర్ధారణ సేయక యీహజారంబు దాఁటి పోనవుపడ దని తోఁచుచున్నవి. ఈబౌద్ధునికి నైయాయిక మతావలంబనమున నైళంబ సమాధానము సెప్పనగును. మఱియొంటం గాలహరణం బగును; అని యిట్లు నిర్ణయించుకొని తనయెదుట నుండునాస్తికునిం గాంచి,

2 వాక్యం. కథ మహో కిం బ్రూతే భవాన్ స్వమత మపరిష్కుర్వన్నేవ.

---

1 టీక. జగత్=ప్రపంచము, మృషైవేతి = మిథ్యయేయని, భవన్మతంచేత్=మీమతమగునేని, కింకథ్యతే = చెప్పవలసినదేమి? ఆకారశూన్యేన = ఆకారములేనట్టిదియు, గతక్రియేణ=చేష్టలులేనిదియునగు, ఏతేన = ఈబ్రహ్మముచేత, లోకే=లోకమునందు, కర్తవ్యం=చేయఁదగినది, కిమస్తి= ఏమున్నది.

2 టీక. కథమహో=ఏమియాశ్చర్యము! స్వమతం=స్వకీయమగు మతమును, అపరిష్కుర్వన్నేవ=పరిష్కరించుకొనకయు, భవాన్=నీవు, కిం బ్రూతే = ఏమిచెప్పెదవు? నిజోక్తిదోషాన్=తనమాటలయందుఁగల దోషములను, అభాలయన్నేవ=పోఁగొట్టుకొనకయు, అన్యోక్తిం=పరులవచనములను, ఉక్త్యా=మాటలచే, తరళీకరోషి=తొట్రుపడఁజేసెదవు, అయం=వీఁడు, అసుందరాక్షః=అందములుగాని కన్నులుగలవాఁడు, అని-బ్రువా

శ్లో. అభూలయన్నేవ,నిజోక్తిదోషా।నన్యోక్తి ముక్త్యా తరళీకరోషి,
అసుందరాక్షోయ మితి బ్రువాణః కాణోహి హాస్యాస్పదతా ముపైతి.

[ఓరీ! నీవు నీమతమును బరిష్కరించుకొనకయ పలికెదవు! కట్టా! యిట్లులే నీవు నీనుడువుచుండువచనంబులం గలదోషంబుల నిరూపింపకయ యన్యులవచనంబులను మాటకారితనంబునం గెలువం జూచెదవు. చీకువగువాఁడు విరూపాక్షునిని గనుల సొంపులేనివాఁ డని నుడువ నతని నందఱుఁ బరిహాసింపరే!] అని నుడువఁగా నాస్తికుండు తనమనంబున నిట్లు చింతించె: అహా మనము యుక్తిధారాసహస్రంబులు పర్షించుచుండం బ్రచండసమీరణంబుభాతి మనలఁ గడకుం ద్రోయ నితండు గడంగుచున్నాఁడు. అయినం గానిమ్ము. శక్తిగలకొలందిం బోరాడెద. అని చింతించి మహాకవిం గాంచి యిట్లనియె.

* వాక్యం. అకర్ణయతావన్మతమస్మాకమ్.

శ్లో. న స్వర్గో నైవ జన్మాన్యదపి న నరకో నాప్యధర్మో నధర్మః
కర్తా నైవాస్య కశ్చి త్ప్రభవతి జగతో నైవ భర్తా నహర్తా
ప్రత్యక్షాన్య న్న మానం న సకలఫలభు గ్దేహభిన్నోఽ స్తి కశ్చిత్
మిథ్యాభూతే సమస్తే ప్యనుభవతి జన స్సర్వ మేత ద్విమోహాత్.

[ఓరీ! మామతమును బరిష్కరించుకొనకయ చెప్పుచున్నాఁడ వని నన్నంటివి. మామతంబు సెప్పెదను వినుము. స్వర్గమనునది లేదు. జన్మాంతర మనునదియు లేదు. నర

---

ణః=పచించు, కాణః = గ్రుడ్డివాఁడు, హాస్యాస్పదతాం = గేలికిఁబాత్రుఁడగుటను, ఉపైతి=చెందుచున్నాఁడు.

* టీక. అస్మాకంమతంతావత్=మామతమును, ఆకర్ణయ=వినుము.

స్వర్గః = స్వర్గము, న = లేదు! అన్యదపిజన్మ = మఱియొకజన్మమును, న = లేదు. నరకః=పాపమునకుఁగాఁజేయు శిక్షాస్థానమును, న=లేదు. అధర్మః=పాపము సేయుటవలనఁజనించిన దుష్టఫలసంపాదకమగు నదృష్టమును, న=లేదు. అస్యజగతః = ఈప్రపంచమునకు, కర్తా=సృజించినవాఁడు, న=లేఁడు. కశ్చిత్=ఒకిఁడేని, నప్రభవతి=ప్రభువయియుండలేదు. మఱియు-భర్తా=పాలించువాఁడు, నైవ=లేనేలేఁడు. హర్తా=సంహరించువాఁడును, న=లేఁడు. ప్రత్యక్షాన్యత్ =ప్రత్యక్షమునకంటె నితరము, నమానం=ప్రమాణముగాదు. సకలఫలభుక్ = సమస్తములగు ఫలంబులను భుజించువాఁడై, దేహభిన్నః = శరీరమునకంటె భిన్నుండైయొక్క, కశ్చిత్=జీవుండనిచెప్పంబడు నొక్కఁడు, న=లేఁడు. సమస్తే=సర్వము, మిథ్యాభూతేపి = అసత్యమయియుండినను, దీనియందు-జనః=జనుఁడు, ఏతత్సర్వం=ఇట్టిదంతయును, (అనఁగా స్వర్గమనియు నరకమనియునిట్టి వన్నియును) మోహాత్=అజ్ఞానముచేత, అనుభవతి = అనుభవించెడిని.

కంబును లేదు. అధర్మంబును లేదు. ధర్మంబును లేదు. ఈ ప్రపంచమును జేయువాఁడు మఱియొక్కరుండును లేఁడు. (ఈజగంబును బుట్టించినవాఁడును లేడు.) దీనికిం బ్రభువును లేఁడు. భరించెడువాఁడును లేఁడు. సంహరించెడివాఁడును లేఁడు. ప్రత్యక్షమునకంటె నితర మగుప్రమాణమును లేదు. దేహమునకంటె భిన్నుండై సకలఫలంబులననుభవించెడు వాఁడును (ఆత్మ) లేఁడు. సర్వ మిది మిథ్యాభూతం బయ్యును దీనియందు జనుఁడు వివోహంబువలన నిదియంతయు ననుభవించుచున్నాఁడు.]

అని వచియించి మఱియు నిట్లనియె.

*కించ. శ్లో. అహింసా పరమో ధర్మః పాప మాత్మప్రపీడనం,
అపరాధీనతా ముక్తి స్స్వర్గో భిలషితాశనమ్.

[మఱియు మామతంబు దేటపడం బల్కెదను. హింస సేయకయుండుటయ పరమ మగుధర్మము. వ్రతాదుల ననుష్ఠించుచు నాత్మను బాములు వెట్టుచున్నారుగదా ! అట్లు లాత్మను బాధపెట్టుటయ పాపము. పరులకు స్వాధీనుఁడు గాక యుండుటయ మోక్షము. ఇష్టములగు వస్తువుల భుజించుటయ స్వర్గము. హింససేయువాఁడు తనబాధవంటిదియ యన్యునిబాధ యని యెఱుంగఁడు. హింస సేయ నివర్తించుకొనువాఁడు తనవంటికష్ట మితరుల కుండుననుసాధుభావంబు గలిగియుండు. అది సేయకయుండుట యనేకజంతువులకుఁ గరము సుఖకర మగుటం జేసి యహింసయ పరమధర్మంబనియు ; పాపమువలనఁ గష్టము లనుభవింపంగలుగు, నట్టికష్టములు వ్రతాద్యనుష్ఠానంబులవలనం దన్నుఁబొందును గానం దన్నుఁ గష్టపెట్టుటయ పాప మనియు ; పరునికిం బరతంత్రుఁడై యుండువాని కానందం బుండదు. స్వతంత్రుఁడై ప్రవర్తించువాఁడు బరమానందంబుగలవాఁడు, ముక్తి యనునది యానందమయంబు గాన నపరాధీనత్వమే ముక్తియనియు; అభిలషితములగు వస్తువులను భుజించుటవలనఁ దృప్తిగలుగును. స్వర్గంబునను దృప్తియే గల్గునది, కాన నభిలషితవస్తువుల భుజించుటయ స్వర్గ మనియు బౌద్ధాభిప్రాయము.]

అని చెప్పి తానుడివిసస్వర్గసుఖాదుల ననుభవించుప్రకారమును వచియించుచున్నాఁడు.

---

* టీక. మఱియును అహింసా = హింససేయమి, పరమోధర్మః = ఉత్తమమగు ధర్మము. పాపం=పాపమనునది, ఆత్మప్రపీడనం = అనశనాదివ్రతములచేతను ఇష్టప్రవృత్తికి నిరోధంబుగల్పించుటచేతను, తన్నుబాధించుటయ. అపరాధీనతా=ఇతరునికిం బరతంత్రుఁడుగాక స్వతంత్రుఁడైయుండుటయ, ముక్తిః=ముక్తి. స్వర్గః=స్వర్గమనునది, అభిలషితాశనం = కోరినవస్తువు లనుభవించుటయ.

నాస్తికుఁడు. 1 శ్లో. స్వదారపరదారేషు యథేచ్ఛం విహరేత్సదా,
గురుశిష్యప్రణాళీం చ త్యజేత్స్వహిత మాచరన్.

[ఇట్టిస్వర్గాదులయ్యవి యెయ్యెడన జనుఁడు తా ననుభవింపవలసినది గానఁ దనభార్య లనియుఁ బరునిభార్యలనియుం జూడక తన కభిమతలగు కాంతలతోఁ దనయిచ్ఛ మెయిఁ గ్రీడింపంజనును. గురుశిష్యప్రణాళికయందు గురువు సెప్పినవిధంబున శిష్యుండు నడుచు కొనవలసియుండుట యీపూర్వోక్తసుఖంబున కంతరాయంబు గానఁ దనసుఖమునకు విరోధము లేకయుండ నాగురుశిష్యప్రణాళికం బరిత్యజించునది. ఇదియ మామతంబు.]

అని నుడివి నాస్తికుం డూరకున్న నప్పుడు మహాకవి యిట్లనియె.

2 వాక్యం. సాధురే ! సాధు ! యది ప్రత్యక్షాన్య న్నమానం తర్హి”
శ్లో. భవాదృశే దూరవిదేశ మాగతే చరంతు వైధవ్యవిశేష మంగనాః,
అదర్శనే నైవ యత శ్శరీరిణో విదేశయానస్య మృతేశ్చ తుల్యతా.

[ఓరీ! మేలు! మేలు! ప్రత్యక్షమునకంటెం బ్రమాణము లే దంటివి! అట్లయ్యె నేని! నీవంటివారు తమయిండ్లు వాసి దవ్వయినపరదేశమునకుం బోవుదురుగదా! అప్పుడు మీభార్యలు వైధవ్యం బనుష్ఠింపంగలవారు. ప్రత్యక్షమునకంటె నితరము మీకుఁ బ్రమాణము లేమింజేసి కన్నులకగపడనివస్తువు లేదనియే యొప్పుకొనంజనును. విదేశంబునకుం జనినవాఁడును మరణమునొందినవాఁడు నిరువురును బ్రత్యక్షగోచరులుగారు. కాన విదేశ

1 టీక. స్వదారపరదారేషు=తనభార్యలయందు నితరులభార్యలయందును, సదా=ఎల్లప్పుడు, యథేచ్ఛం=ఇష్టప్రకారము, విహరేత్=విహరింపఁజనును. స్వహితం=ఆత్మహితంబును; ఆచరన్=చేయువాఁడై, గురుశిష్యప్రణాళీం=గురువు, శిష్యుఁడు నను ననూచానాచారమును, త్యజేత్=విడువనగును.

2 టీక. సాధు! రే! సాధు!=మంచిదిరా; మంచిది! యది ప్రత్యక్షాన్యన్నమానం తర్హి=ప్రత్యక్షమునకంటెం బ్రమాణంబు లేకపోయెనేని? భవాదృశే=నీవంటివాఁడు, దూరవిదేశం=దవ్వులం దేశాంతరమునకు, ఆగతే=వచ్చియుండఁగా, అంగనాః=స్త్రీలు, వైధవ్యవిశేషం=పతిలేని సతి యుండవలసిన యవస్థావిశేషమును, చరంతు=ఆచరింతురుగాక, యతః=ఏహేతువునుబట్టి, శరీరిణః=దేహధారికి, అదర్శనేనైవ=కనులంగనుంగొనమిచేతన, విదేశయానస్య=దేశాంతరగమనమునకును, మృతేశ్చ=మరణమునకును, తుల్యతా=సామ్యమో, ఆహేతువుచేత వైధవ్యవిశేషము ననుష్ఠింపవలయునని యర్థము. కనులం గాంచకయుండుట విదేశగమనంబునందును మరణమునందును గలదుగాన నీరెండిటికిని సమానత్వము.

గమనంబును మరణంబు నొక్కటియ. విదేశగతుండును మృతుండును మీ కేకాకారు లగుటం జేసి మీవంటివారు విదేశగతులయి యుండ మీభార్య లింట వైధవ్యంబుం జరిపించుచుండవలయు.]

అని మహాకవి నుడువఁగా నాస్తికుండును,

1 వాక్యం. అహో మృతస్య న పునర్దర్శన మితి నిశ్చయః; శరీరనాశస్య స్వయ మేవ సాక్షాత్ కృతత్వాత్. విదేశం గతస్యతు పున ర్దర్శన మస్తీతి న సామ్యమ్.

[ఓరీ! మరణమునొందినవానిని మెండియుం జూడ మనుట నిక్కము. శరీరము నశించిపోవుట ప్రత్యక్షమునఁ గానంబడుచున్నది. విదేశగతుఁడు మెండియుం నేఁగుదెంచెడిని. కాన మృతునికిని విదేశగతునికిని సామ్యము వచింపం జనదు.]

అనఁగా గవియు నిట్లనియె.

2 వాక్యం. కథ ముత్కటకోటికసంభావనయా నార్తి ర్భవతి?

[విదేశగతుండగువాఁడు ప్రత్యక్షమునఁ గానంబడఁడు గాన నట్టివాఁడు జీవించి యుండునో జీవించియుండఁడో యనుసందేహమునందు జీవించియుండఁ డనునొకకోటి యుత్కటంబై యా యుత్కటకోటికసంభావనచే (అనఁగాఁ జచ్చియేయుండుననునిశ్చయకల్ప మధికమగుతలంపుచే) నార్తి యేల కలుగదు! ప్రత్యక్షమున లేనప్పుడు చచ్చియేయుండవచ్చుననితలంచి యార్తిం జెందవచ్చుం గాదే!]

అని వచింపఁగా నాస్తికుఁడు,

3 వాక్యం. పత్రాదిద్వారాఽధిగతవార్తానాం కథ మార్తిః.

---

1 టీ. అహో=ఔరా! మృతస్య = మరణముఁనొందినవానికి, పునర్దర్శనం = మెండియుఁగనుంగొనుట, నాస్తి=లేదు, అనుట-శరీరనాశస్య = శరీరవినాశము, స్వయమేవ=తానే, సాక్షాత్కృతత్వాత్ = సాక్షాత్కరించుటంజేసి, నిశ్చయః = నిజము. విదేశం గతస్యతు=దేశాంతరగతుండగువానికన్ననో, పునర్దర్శనం=మెండియుఁగనుంగొనుట, అస్తీతి=కలదని, సామ్యం=సమానత్వము. న=లేదు. మృతునికిఁ బునర్దర్శనములేదు; దేశాంతరగతునికిం బునర్దర్శనంబుగలదుగాన మరణమునకును విదేశయానమునకును సామ్యము సంభవింపదు.

2 ఉత్కటకోటికసంభావనయా = చచ్చియే యుండవచ్చునను కల్పము హెచ్చిన యూహచేత, ఆర్తిః=దుఃఖము, కథం నభవతి=ఎట్లు కలుగదు?

3 టీ. పత్రాదిద్వారా = పత్రప్రముఖములమూలముగ, అధిగతవార్తానాం = వృత్తాంతమెఱుంగుచుండినవారలకు,ఆర్తిః=దుఃఖము, కథం=ఎట్లుకలుగును? కలుగదనుట.

[దేశాంతరగతుం డగువానినిగుఱించి పత్రికాప్రముఖములచే వృత్తాంతం బవగతం బగుచుండుటంజేసి యార్తిం జెంద నవకాశంబు లేదు.]

అనినం గవి మఱియు నిట్లనియె,

* వాక్యం. స్వాగతమేవ తర్హి అనుమాన మపి ప్రమాణమ్. యత్తదీయలిప్యాదినా జీవత స్తస్యావధారణేన నార్తి ర్భవతి. ఏవం శబ్దస్యా ప్యప్రమాణత్వే! ఆప్తవాక్యాదౌ విశ్వాసాభావా న్నిఖిలప్రవృత్తినిరోధః స్యాత్. స్యాచ్చ భవాదృశాం మూకత్వైవ శ్రేయసీ. ఇతి శబ్దోపి ప్రమాణత్వే నాంగీకార్య ఏవ శ్రీమద్భిః.

[అట్లైన మంచిదియే యయ్యె. అనుమానము నయితము ప్రమాణ మని యొప్పుకొన్నవాఁడవైతివి. ఆదేశాంతరగతుండు వ్రాసినలిప్యాదులవలన నతండు జీవించి యున్నాఁడని యవధారణ మొనరించుటంజేసియేకద యార్తి గలుగ నవకాశంబు గనుపట్టదు. దీనిచే దేశాంతరగతుండు స్వహస్తలిపిపంపియుండుటంబట్టి జీవించియుండెనినాఁడదిసంభవింపదను నన్వయవ్యతిరేకంబులు గలయనుమానప్రమాణంబు సిద్ధించుచున్నది. శబ్దంబును బ్రమాణంబు గాదనియంటివేని యిట్లు యగును. శబ్దప్రమాణం బన్న నాప్తుని వాక్యము. అది ప్రమాణంబు గాదన్న నందు విశ్వాసంబు గలుగకయుండం బోలును. అట్లు విశ్వసింపనినాఁడు సర్వలోకవ్యవహారమునం బ్రవృత్తి జనింపక యూరకుండవలయుం. ఇతరునిమాటయందు విశ్వాసములేనినాఁడు సర్వంబును దాన ప్రత్యక్షమునం జరపుకొనవలసిన ట్లగును. అట్లు లోకవ్యవహారంబు జరగదు. కాన ననుమానంబును శబ్దంబును ప్రమాణములుగ నొప్పుకొనంబడును.]

అనిచెప్పినశాస్త్రికుండు కడు సంక్షోభంబునొందుచు

---

* టీ. స్వాగతమేవ=మంచిత్రోవకువచ్చితివే! తర్హి = పత్రాదులచే దేశాంతరగతుల వృత్తాంతములను దెలిసికొనుచున్నారందుచే నార్తిం జెందరనియంటివేని! అనుమాన మపి=అనుమానమును, ప్రమాణం=ప్రమాణమని యొప్పుకొనంబడుచున్నది. యత్=ఎట్లనఁగా? తదీయలిప్యాదినా=దేశాంతరగతునియొక్క లిపి మొదలగువానిచే, తస్యావధారణేన=వాఁడున్నాఁడని నిర్ణయించుటంజేసి, ఆర్తిః=దుఃఖము, నభవతి=కలుగదు. ఏవం=ఇట్లె, శబ్దస్యాపి=శబ్దమును, అప్రమాణత్వే=ప్రమాణముగాకపోయె నేని, ఆప్తవాక్యాదౌ=ఆప్తునివాక్యము మొదలగువానియందు, విశ్వాసాభావాత్ = నమ్మకములేమిచేత, అఖిలప్రవృత్తినిరోధః = సమస్తవిధప్రవృత్తులకు నడ్డంకి, స్యాత్ = అగును. భవాదృశాం = మీవంటివారలకు, మూకత్వైవ=మాటలాడకయుండుటయ, శ్రేయసీస్యాత్=శ్రేయస్కరమగును. ఇతి=ఇట్లగుటంజేసి, శబ్దోపి=శబ్దంబును, ప్రమాణత్వేన=ప్రమాణముగ, శ్రీమద్భిః=మీచేత, అంగీకార్యః=అంగీకరింపఁదగినది.

1 వాక్యం. భవతు నామాऽనుమానం శబ్దోపి ప్రమాణం. తథాపి కథ మీశ్వర సిద్ధిః ?

[సరే! కానిమ్ము. అనుమానంబును శబ్దంబును బ్రమాణంబులు. అట్లయ్యు నీశ్వరుం డొకరుం డున్నాఁ డనుట యెట్లు సిద్ధించును]

అనఁగాఁ గవియు వానిం గాంచి యిట్లనియె.

2 శ్లో. కార్యాద్యై రనుమీయతే, సభగవాన్ కార్యంచ సృష్ట్యాదికం,
నాస్తిచే దయ మీశ్వరః కథ మహో సృష్ట్యాదికం జాయతే.

[కార్యప్రముఖంబులచేత నీకార్యములగువస్తువులం గలిగించినవాఁ డొకఁ డుండుండనగు నని వీనికిం గర్తగా భగవంతుం డొకఁ డనుమింపఁబడును. ఈకార్యంబని చెప్పంబడునది సృష్ట్యాదికము. సృష్టములగువస్తువులకు సృష్టికర్త యొకఁ డుండంజను ననుట యనుమానము. ఇట్టి యీశ్వరుఁ డుండనిచో నీసృష్ట్యాదిక మెట్లు గల్గుచుండెడిని. "కార్యాత్కారణ మనుమీయతే" (కార్యముండుటంబట్టి కారణముండం బోలుననుట) యనుటంబట్టి కార్యమగుసృష్ట్యాదికంబుం గొని కారణభూతుఁ డగుభగవంతుండు గలఁ డని నిశ్చయింప ననువుపడియున్న దని భావము.]

అని యిట్లు నుడివినఁ గవివచనంబులు విని నాస్తికుం డిట్లనియె.

3 శ్లో. కా సృష్టౌ పరిదేవనా యది పునః పిత్రో రపత్యోద్భవః,

1 టీ. భవతునామ=అగుంగాక, అంగీకారమేయనుట. అనుమానం శబ్దోప = అనుమానమును శబ్దంబును, ప్రమాణం=ప్రమాణంబులు. తథాపి=అట్లయ్యును, కథం = ఎట్లని, ఈశ్వరసిద్ధిః=ఈశ్వరుఁడు సిద్ధించుట అగును.

2 టీ. సభగవాన్ = అభగవంతుఁడు, కార్యాద్యైః = కార్యరూపములగు వస్తుప్రముఖంబులచేత, అనుమీయతే=అంకురాదికంసకర్తృకంకార్యత్వాత్ ఘటవత్" అనియెడి యనుమానముచేత నూహింపంబడియెడిని. కార్యంచ = అకార్యంబన్ననో, సృష్ట్యాదికం=సృష్టిమొదలగునది. అయమీశ్వరః=ఇట్టియీశ్వరుఁడు, నాస్తిచేత్=లేకపోయెనేని, సృష్ట్యాదికం = సృష్టిప్రముఖము, కథం=ఎట్లు, జాయతే = కలుగుచున్నది, అహో=ఆహా!

3 టీ. సృష్టౌ=సృష్టివిషయంబున, కాపరిదేవనా = ఈయేడుపేల? పిత్రోః = తల్లిదండ్రులకు, అపత్యోద్భవః = సుతులుసంభవించుట, యదిపునః = అగుచున్నదిగదా, అష్టే-అమీకుండాద్యాః=ఈఘటము మొదలగునవి, సంతతం=సర్వకాలము, తత్తత్కులాలాదితః=ఆయాకులాల ప్రముఖులవలన, ప్రభవంతి=కలుగుచున్నవి.

కుండాద్యాః ప్రభవంతి సంతత మమీ తత్తత్కులాలాదితః.

[ఓరీ యీసృష్టినిగుఱించినయెడుపు ఎందుకు? తల్లిదండ్రులవలనఁ గుమారులు గలుగుచుండెదరు. ఘటశరావాదు లయ్యవి యాయాకుమ్మరుల ప్రముఖులవలనం గలుగుచున్నవి. ఆసృష్టియందును దల్లిదండ్రులవలన నపత్యంబులును గులాలాదులవలన ఘటాదులు గలుగుచుండ నిది ప్రత్యక్షమై కనంబడఁగా సృష్టినిగుఱించి కార్యములగువానికిం గర్తగా భగవంతుం డొకఁడు వేఱుగ నున్నాఁడనుట యేల యొప్పుకొనవలయును? కాన నీనుడివినయనుమానం బొప్పుకొనం జనదు.]

అని నాస్తికుండు నుడువఁగా నంత మహాకవి

1 వాక్యం. సత్యం! సత్యం! శ్లో. కర్తారౌ పితరౌ సుతస్య కలశాదీనాం కులాలాదయః,
కర్తారౌహి యథా తథాస్తి కతమః కర్తా వనే శాఖినామ్.

[ఓరీ నీనుడివినపల్కు సత్యమే! సత్యమే! సుతునికి మాతాపితలును ఘటాదులకుం గులాల ప్రముఖులును గర్తలుగదా! అట్లయగుంగాత. వనంబునం గలవృక్షములకుం గర్త యెవ్వఁడు? అపత్యములకు మాతాపితలును ఘటాదులకుం గులాలాదులును గర్తలుగఁ బ్రత్యక్షమునం గనంబడుటం జేసి యొప్పుకొంటివి. అట్టె వనంబునం గలవృక్షములకుం గర్తయగువాఁ డుండవలదా! ఆకర్త యెవ్వఁడు? ప్రత్యక్షమునం గనంబడు మాతాపితృకులాలాదులవలె వనవృక్షములకుం గర్త గనంబడకయున్నవాఁ డందుకుంగర్తయ ప్రత్యక్షుఁ డొక్కరుం డుండు నని నిర్ణయింపవలసియున్న దని భావము.]

అని వచియింపఁగా నాస్తికుండు.

2 శ్లో. జాయంతే స్వతఏవ తే ఖలు యథా స్వేదోద్భవాః ప్రాణినః,

[ఓరీ! యావనవృక్షములు తమకుఁ దామె యుత్పన్నము లగుచున్నవి. స్వేదము (చెమట) వలనం జనించుమశకాదు లగుప్రాణులు ఎట్లు కుమారాదులవలెఁ దల్లిదండ్రుల వలన జనింపక యుండునో; యట్లే వనవృక్షాదులును తమకుఁదామ కలుగుచున్నవి. కానఁ గార్యంబునకుం గర్త యొక్కఁ డొరుఁ డుండనగు ననుట లేదు.]

---

1 టీ. సత్యంసత్యం=వాస్తవము వాస్తవము! సుతస్య=కుమారునికి, కర్తారౌ = కర్తలు, పితరౌ=తల్లిదండ్రులు. కలశాదీనాం = ఘటప్రముఖంబులకు, కులాలాదయః = కుమ్మరీఁడు మొదలగువారును గర్తలు. కర్తారౌహియథా = సుతునికిం దల్లిదండ్రులును ఘటప్రముఖంబులకుం గులాలాదులును ఎట్లుండెదరో, తథా=అట్లు, వనే = అరణ్యమునందు, శాఖినాం=వృక్షములకు, కర్తా=కర్తయగువాఁడు, కతమః=ఎవ్వఁడు?

2 టీ. తేఖలు = ఆవృక్షములన్ననో! స్వేదోద్భవాఃప్రాణినఃయథా = చెమటవలనంగలిగెడు జంతువులువోలె, స్వతఏవ = తమకుఁదామె, జాయంతే = సంభవించుచున్నవి.

అనఁగా నిని మహాకవి యిట్లనియె.

1 శ్లో. స్యాదిత్థం యదితద్విసైవ పితరౌ పుత్ర స్స్వతో జాయతామ్.

[ఓరీ కార్యంబునకుం గర్త యొక్కరుం డొరుం డుండనగు ననుట లేదంటివి. అట్లయినచో! తల్లిదండ్రులు లేకయ పుత్రుండు తనకుఁదాన జనియించుంగాత. కార్యమనుగణించి కర్త యావశ్యకుఁడు గాఁడని నీనుడివినదాన నేర్పడినయది. కానఁ దల్లిదండ్రులు లేకయ కుమారుండు గలుగఁబోవు ననునాపత్తి గలిగియున్నది.

అనఁగా మహాకవివచనంబులకు నాస్తికుం డిట్లనియె.

2 వాక్యం. కేషాం చి ద్దేహినా మయం స్వభావః; యథా స్త్రీపురుషసంసర్గా దే వోత్పత్తిః; యథా మానుషపశుపక్షిణామ్. కేషాంచిత్పున ర్వినైవ శుక్లశోణితసంపాతం స్వేదాదినా; యథా మశకాదీనామ్. కేషాంచిత్పున ర్బీజజలభూమివిశేష సంసర్గేణ; యథాతరుసస్యాదీనామ్. తథాహి కాననవాసినా మపి తేషాం యదృచ్ఛయాఽపతతా మిహ వారిదవారిక్షితిసంసర్గా దబాధై వోత్పత్తి రితి స్వభావఏవ విలక్షణాఽనేకకార్యోత్పత్తౌ శరణమ్.

[వినుము. దేహధారులలోపలం గొన్నింటికి మానుషపశుపక్షులకుంబోలె స్త్రీపురుష సంసర్గంబువలన నుత్పత్తియగుట యనునది యిది స్వభావము; కొన్నింటి కన్ననో మశకాదులకుంబోలె శుక్లశోణితసంపాతంబు లేకయ స్వేదాదులవలన నుత్పత్తియగుట స్వభావము; మఱి కొన్నింటి కన్ననో సస్యతరుగుల్మాదులకుంబోలె బీజజలభూమివిశేష సంసర్గంబువలన నుత్పత్తియగుట స్వభావము; అట్లె కాననంబున నుండు వృక్షాదులకు నయితము యాదృచ్ఛికముగ సంప్రాప్తము లయిన మేఘజలంబులకును భూమికిని గలిగిన

1 టీక. ఇత్థంయది=ఇట్లయ్యెనేని,స్యాత్=అగుఁగాత, తత్=అట్లైనచో, పితరౌ వినైవ=తల్లిదండ్రులువినాగా, పుత్రః=కుమారుఁడు, జాయతాం=కలుగుఁగాత.

2 టీ కేషాంచిత్ దేహినాం కొన్నిజంతువులకు, మానుషమృగపశుపక్షిణాంయథా = మనుష్యులకుమృగములకు పశువులకుఁ బక్షులకుంబోలె, యథాస్త్రీపురుషసంసర్గాదేవోత్పత్తిః=స్త్రీపురుషసంబంధమునన యుత్పత్తియగుట, అయం=ఇది, స్వభావః=సహజము. కేషాంచిత్పునః=కొన్నిజంతువులకన్ననో, యథామశకాదీనాం=దోమలు మొదలగువానికింబోలె, శుక్లశోణితసంసర్గంవినైవ=శుక్లశోణితములసంయోగము లేకయు, ఉత్పత్తియగుట స్వభావము. కేషాంచిత్పునః=మఱికొన్నిటికన్ననో, తరుసస్యాదీనాంయథా=వృక్షములు సస్యములు మొదలగువానికింబోలె, బీజజలభూమివిశేషసంసర్గేణ = బీజవిశేషంబులయు జలవిశేషంబులయుస్థలవిశేషంబులయు సంబంధంబునంజేసి, ఉత్పత్తిఁగాంచుటయు స్వభావము. తథాహి=అట్లే, కాననవాసినామపి=అరణ్యంబుననుండునవియగు, తేషాం=అవృక్ష

సంసర్గంబువలన నుత్పత్తి నిర్బాధముగ సంభవించుచున్నది గాన విలక్షణములగు ననేక కార్యంబు లుత్పత్తియగుటకు స్వభావమే కారణంబు; స్వభావమునకంటె భిన్నం బగు కర్తయొక్కఁడున్నాఁ డని నుడువవలసినయావశ్యకత లేదు].

అని నుడివిన విని మహాకవి యతనిం గాంచి యిట్లనియె.

1 వాక్యం. సత్యం స్వభావ ఏవాయం పరంతు.

శ్లో. సమాలికః కేళిమహీమహీరుహాం ప్రసేచనార్థం ఘటకో యథాఽంబునః,
తథాస్తి కో వన్యకృతే పయోముచా మచేతనానాం ఘటకస్సచేతనః.

[ఇట్లగుట స్వభావమే యని నీవు వల్కినది సత్యమే! అయినను క్రీడార్థముగ నుంచుకొనియుండు నుద్యానవనములయందు నచటిమహీరుహంబులకుం బ్రసేచనముగావింపజలంబులు వోయుటకు మాలికుం డొక్కరుం డుండునట్లు వన్యంబు లయిన వృక్షంబులకు జలంబులు వోయుమేఘములను ఘటకుం డొక్కరుం డుండనగుం గదా; వాఁ డెవ్వఁడు? అచేతనంబులకు చైతన్యంబుగలవాఁడు ఘటకుం డనుట సిద్ధమే! వన్యవృక్షములకు జలములు వోయుమేఘము లచేతనంబులయి యుండ వానిని ఘటింపంజేయువాఁ డొకరుండు సిద్ధింపవలసియున్నది. అట్లు సిద్ధించువాఁడ యీశ్వరుఁడు.]

అని వచియించి మఱియు నిట్లనియె.

2, వాక్యం. కించ అసౌ స్వభావః స్వస్వరూపః కశ్చి దపరో వా? నాద్యః స్యస్యైవ స్వం ప్రతి కారణత్వప్రసంగాత్. నాపి ద్వితీయః భవన్మతే దేహాభిన్నాభావాత్.

ములు మొదలగువానికి, యదృచ్ఛయాపతతాం = యాదృచ్ఛికమగుసంప్రాప్తిగలిగియుండువానికి, ఇహ=ఇందు, వారిదవారిక్షితిసంసర్గాత్ = మేఘపునీటియొక్కయుభూమియొక్కయుంసంపర్కమువలన, ఉత్పత్తిరితి=ఉత్పత్తికలుగుచున్నదనిచెప్పంబడుటంబట్టి, విలక్షణానేకకార్యోత్పత్తౌ=నానావిధములగుపెక్కుకార్యంబులు సంభవించుటయందు, స్వభావ ఏవ=స్వభావమే, కారణం=హేతువు.

1 టీ. సత్యం = నిజము. అయం=ఇది–ఇట్లు కలుగుట. స్వభావఏవ = స్వభావమే. పరంతు = అయినను, కేళిమహీమహీరుహాం = ఉద్యానభూమియందుండెడివృక్షములకు, ప్రసేచనార్థం=తడుపుటకుఁగా, అంబునఃఘటకః=నీళ్లువోయువాఁడగు. సమాలికః=ఆమాలికుఁడు, యథా=ఎట్లో. తథా=అట్లే, వన్యకృతే = అరణ్యసంభవములగువృక్షములకు. పయోముచాం=నీళ్లువోయుమేఘములను, ఘటకః=ఘటింపజేయువాఁడు, కః=ఎవఁడు. అచేతనానాం=చైతన్యరహితములగు జడపదార్థములకు, సచేతనః=చైతన్యముగలవాఁడు, ఘటకః=ఘటింపఁజేయువాఁడై యుండనగును.

2 స్వభావవాదులమతమున స్వభావమనుదాని "స్వస్వరూపమా? పరస్వరూపమా అని వికల్పించి రెండుపక్షంబులను నిరసించుచున్నాఁడు.

యది దేహాభిన్నోఽపి కశ్చిద్విలక్షణసకలకార్యకారీ స్వీక్రియతే తర్హి సఏవ హ్యాస్మాకమీశ్వరః. అతఏవ నద్వితీయః పక్షః.

[అదియునుంగాక ఈస్వభావ మనునది స్వస్వరూపమా? (అనఁగాఁ దానే యాస్వభావమా?యనుట) లేక స్వస్వరూపముకంటె భిన్న మగుమఱియొక్కటియా? ఈస్వభావము స్వస్వరూప మనుపక్షమునం దనకుఁదాన కారణము గావలసినట్లగును. స్వభావమువలన నన్నియుం జనించుచుండును. ఆస్వభావమునది తానే యన్నచో నుత్పన్నములగువస్తువులు తమకుం దామ కారణంబులు గావలసినట్లగు ననిభావము. ఇట్లగుటం జేసి మొదటిపక్షము సరిపడదు. ఆస్వభావము తనకంటె భిన్నమగు మఱియొకటి యను రెండవ పక్షమును సమంజసము గాదు. నీమతంబున దేహమునకంటె నతిరిక్తము లేదు గనుక స్వభావ మనునది మాత్రము దేహమునకంటె వేఱుగా నెక్కడిది? విలక్షణములగు సర్వకార్యంబులం జేయునదియై యొప్పునొకటి దేహమునకంటె భిన్నంబై యుండునది గలదని యొప్పుకొనియెదవా! అట్లయిన నదియ యీశ్వరుం డని మేము వచించెదము. కావున రెండవపక్షమును సరిగాదు.]

అనిన నాస్తికుం డిట్లనియె.

* వాక్యం. ఇయానేవాఽఽవయో ర్మతభేదః య ద్భవానీశ్వర మేకం నిత్యం దేహవ్యతిరిక్తం విలక్షణాఖిలకార్యకారిణం బ్రవీతి. అహం పున ర్విలక్షణసకలకార్యకర్తౄ న్నిత్యాన్ దేహవ్యతిరిక్తా ననంతా నంగీకరోమి.

---

కించ = మఱియును, అసౌస్వభావః = ఈస్వభావము, స్వస్వరూపః = స్వాత్మకమా? (అనఁగాఁదానేయా) కశ్చిదపరో వా=తనకంటె వేఱైనదొకటియా? నాద్యః=స్వస్వరూపమను మొదటిపక్షము సరిపడదు. స్వస్యైవస్వం ప్రతికారణత్వప్రసంగాత్ =తన్నుగుఱించితనకే కారణత్వముసంభవించు ననునాపత్తిగలుగును. కావనసరిపడదు. నాపిద్వితీయః=తనకంటె వేఱైనదొకటియను రెండవపక్షమునుసరిపడదు. భవన్మతే దేహభిన్నాభావాత్ =నీమతంబునందుశరీరమునకంటె భిన్నంబు లేదు. కనుకసరిపడదు. దేహాభిన్నోఽపి=దేహమునకంటెభిన్నుండును, విలక్షణసకలకార్యకారీ = విలక్షణములగుసమస్తకార్యములను జేయువాఁడునగు, కశ్చిత్ =ఒక్కరుఁడు. యదిస్వీక్రియతే = అంగీకరింపంబడియె నేని? తర్హి=అట్లయిన, సఏవ=ఆతఁడే, అస్మాకం=మాకు, ఈశ్వరః=ఈశ్వరుఁడు. అతఏవ=ఈస్వభావము దేహమునకంటె భిన్నమనుటచే విలక్షణసకలకార్యకారి యీశ్వరుఁడుసిద్ధించుటం జేసియే, నద్వితీయఃపక్షః=రెండవపక్షము నుపపన్నంబు గాదు.

* టీ. ఆవయోః=మనకు, మతభేదః = మతభేదము, ఇయానేవ=ఇంతియయ. భవాన్ =నీవు,ఈశ్వరం=ఈశ్వరుని,ఏకం=ఒక్కనిని, నిత్యం=నిత్యుండగువాని, దేహవ్యతిరిక్తం=దేహమునకంటె భిన్నుండగువాని, విలక్షణాఖిలకార్యకారిణం=విలక్షణములగు

[మనయిరువురమతంబులకుం గలభేదం బింతయ; నీవు ఈశ్వరుం డొక్కరుండ నిత్యుండు దేహవ్యతిరిక్తుండు విలక్షణంబులగు సర్వకార్యంబులకుం గర్త యగువాఁడ గలం డనియెదవు; నేనన్ననో నిత్యంబులును దేహవ్యతిరిక్తంబులును విలక్షణములు నగుసకలకార్యంబులకుఁ గర్తలు నగునవి యనంతంబులు గల వని చెప్పెదను. భిన్నభిన్నములగుకార్యములకుం గర్త యొక్కరుం డని నీమతము. అట్టికర్త లనంతంబులని నామతము. అని భావము.]

అనినం గవి యిట్లనియె.

* శ్లో. ధన్యా భవంతో యదనంతకర్తౄ ననంతకార్యం ప్రతి కీర్తయంతి,
వయం వదామః ఖలు సర్వకార్యకర్తార మేకం పరమేశ మేవ.

వాక్యం. ఇ త్యనయో ర్మతయోః శ్రేయఃపర్యాలోచనం స్వాలోచనై ర్భవద్భి రేవ కరణీయమ్,

[మీరలు కరము మహాత్ములరు (అనఁగా బుద్ధిహీనులరనుట) అనంతములగు కార్యములంగుఱించి కర్త లనంతంబుగ నుండెద రని నుడివెదరు. ఒక్కొకకార్యమునుగుఱించి యొక్కొక్కకర్తవిధముగ నవియ దేశకాలాదివిభేదంబున భిన్నముగ నుండుటంజేసి యనంతంబులుగ నుండు నని చెప్పెద రని భావము. మేము సర్వకార్యంబులకునుగర్త పరమేశ్వరుం డొక్కరుండ యని నుడివెదము. కాన మనయిరువురమతంబులలో నెది శ్రేయం బగుననుట మీబుద్ధివలన మీరల యాలోచింపుఁడు.]

అనిన విని నాస్తికుఁడు సంకుచితముఖుండై,

---

సమస్తకార్యంబులొనర్చువానిని, బ్రవీతి=వచించెదవు. అహంపునః=నేనన్ననో, విలక్షణసకలకార్యకర్తౄన్=విలక్షణములగు సమస్తకార్యంబులకుం గర్తలగువానిని, నిత్యాన్=నిత్యంబులయి, దేహవ్యతిరిక్తాన్=దేహమునకంటెభిన్నంబులయియొప్పువానిని,అనంతాన్ అనేకంబులను. అంగీకరోమి=ఒప్పుకొనియెదను.

* టీ. యత్=ఏహేతువుచేత,అనంతకార్యం ప్రతి=అనంతములయినకార్యములను గుఱించి, అనంతకర్తౄన్=అనంతకర్తలను, కీర్తయంతి=చెప్పెదరో ! ఆహేతువుచేత, భవంతః=మీరు, ధన్యాః=కృతార్థులరు. దీనికివ్యతిరేకంబునభావము. బుద్ధిహీనులనుట. వయం=మేము, సర్వకార్యకర్తారం=సమస్తకార్యములనుజేయువానిని, పరమేశమేక మేవ=పరమేశ్వరునొక్కరునే, వదామఃఖలు = చెప్పెదముగదా? ఇతి = ఇట్లని, అనయోర్మతయోః=ఈరెండుమతములయందు, శ్రేయఃపర్యాలోచనం = శ్రేయంబెదియోదానినారయుట, స్వాలోచనైఃభవద్భిరేవ=మీకన్నులచే మీవలననే, కరణీయం=చేయందగినది.

1 వాక్యం. భవతు లాఘవా దేక ఏవ కర్తా: పర మస్య నిత్యతాయాం కిం మానమ్.

[అగుంగాక. లాఘవం బుండుటం జేసి యొక్కరుండె కర్తగ నొప్పుకొందుము. మఱి యతండు నిత్యుం డనుటకుం బ్రమాణ మేమి గలదు?]

అని యడిగిన మహాకవియు.

2 వాక్యం. య ద్యసా వనిత్యః క స్తస్య ఉత్పాదకో నాశకో వా. అస్తిచేత్ కశ్చి త్తాదృశో ప్యేకః తస్యా ప్యనిత్యత్వే అనవస్థా ప్రసంగః. నిత్యత్వేచ సఏ వాయ మస్మాక మీశ్వరః.

[గాఁ డనిత్యుం డంటివా! వాని నుత్పాదకుం డెవ్వఁడు? నాశకుం డెవ్వఁడు? ఉన్నాఁడని యనియెదవేమొ? అట్టివాఁడు మఱియొక్కరుం డుండంజను. వాఁడు ననిత్యుండయని యనవస్థా ప్రసంగం బగును. నిత్యుం డంటివా! యాతఁడ యీశ్వరుండని మామతము.]

అని చెప్పిన విని నాస్తికుం డూరకయుండఁగాఁ గవివరుండు మఱియు నిట్లనియె.

3 శ్లో. వినా ధర్మాధర్మౌ రచయతి కథం వా స భగవా
నిహాఽనందక్లేశై రుపచిత మహో జీవ మఖిలం,

---

1 టీ. భవతు=అగుఁగాక. లాఘవాత్ = లఘుత్వముండుటవలన, కర్తా=కర్త, ఏక ఏవ = ఒక్కరుండే! అనేకకర్తల నొప్పుకొనుటకన్న నొకకర్త నొప్పుకొనుటయందుఁ బాహుళ్యము లేకపోవుననిభావము. పరం = అయినను, అస్య = ఈయీశ్వరునికి, నిత్యతాయాం=నిత్యత్వమున్నదనుటయందు, కింమానం=ప్రమాణ మేమి?

2 టీ. అసౌ=ఈయీశ్వరుఁడు, అనిత్యోయది=అనిత్యుండేయగునేని, తస్య=అతనికి, ఉత్పాదకోవా=పుట్టించువాఁడుగాని, నాశకోవా=నశింపఁజేయువాఁడుగాని, కః=ఎవఁడు? అనిత్యుండగువానికిఁ బుట్టించువాఁడును సంహరించువాఁడునుండనగుంగదా? ఈ యీశ్వరుఁడనిత్యుఁడంటివేని వానికుత్పాదకుండును నాశకుండు నెవ్వఁడనుట. తాదృశో ప్యేకః=అట్టివాఁడునొక్కరుండు, (అనఁగా నీశ్వరునికిని కర్తయగువాఁడు) అస్తిచేత్ = ఉన్నాఁడంటివేని? తస్యాపి=వానికిని, అనిత్యత్వే=అనిత్యత్వము సంభవింపంజనును. అట్లైన-అనవస్థా ప్రసంగః = అవ్యవస్థా ప్రసంగంబగు. నిత్యత్వేచ = నిత్యుండంటివేని, సఏవ=వాఁడే, అస్మాకం=మాకు, ఈశ్వరః= ఈశ్వరుఁడు.

3 ధర్మాధర్మములు లేవనువచనమును ఖండించుచున్నాఁడు.

టీ. సభగవాన్ = ఆభగవంతుండు, ధర్మాఽధర్మౌవినా = ధర్మాఽధర్మములు లేక, ఇహ=ఇందు, ఆనందక్లేశైః=ఆనందముచేతను దుఃఖముచేతను, ఉపచితం=వ్యాప్తమయియుండు, అఖిలంజీవం = సమస్తజంతువులను, కథం=ఎట్లు, రచయతి=చేసెడిని. అహో=

జగత్స్రష్టు స్సృష్టిం కిమపి సమదృష్ట్యా రచయతో
న రాగో న ద్వేషః క్వచి దపి జనే తస్య జయతి.

[ఈజగంబునందుఁ గలజంతుసంతాన మంతయు నానందక్లేశసముపచితంబై యున్నది. ఇట్టిజంతువ్రాతంబును భగవంతుండు తాను ధర్మాధర్మంబులు లేక యెట్లు గలిగించు? ధర్మంబుచే నానందంబు నధర్మంబుచేఁ గ్లేశంబు ననుభవించునట్లు సమస్తజంతువుల నాభగవంతుఁడు సృజియించెడి నని యొప్పుకొనవలసియున్నది. లేనిచో జంతుసంతానంబంతయుఁ గేవలానందంబునొండెఁ గేవలక్లేశంబునొండె ననుభవించుచుండనగు ననునాపత్తి గలుగును; కాన ధర్మాధర్మంబులంగొని తత్తత్పుణ్యపాపానుసారముగ నానందక్లేశంబు లనుభవించుచుండునట్లు జీవులను భగవంతుండు సృజియించుచున్నాఁ డని వచింపవలయు. దీనివలన ధర్మాధర్మము లున్నవని సిద్ధించెడిని. అట్లేల వచింపవలె? భగవంతుండు కొందఱను సుఖభాగులనుగఁ గొందఱఁ గ్లేశభాగులనుగ సృజియించెడి నని చెప్పిన సరిపోదా! యనఁగా! జగంబులను సృజియించునాభగవంతుండు సర్వజనంబులందును సమదృష్టిచే సృష్టి గావించుచున్నవాఁ డంతియకాని యాతం డొక్కనియెడ ద్వేషంబు నొక్కనియెడ నాశయుఁ గలిగియున్నవాఁడు గాఁడు. అట్టున్నాఁడని చెప్పుదురేమొ? అట్లుండు ననిచెప్పుట యహేతుకంబు. ఇట్లు కొందఱయెడ ద్వేషంబుం గొందఱయెడ ననురాగంబు నతనికిం గలదనుట వికల్పించిన నిలువం జాలదు. కాన రాగద్వేషంబులులేక సర్వజీవులయందు సమదృష్టితో వర్తించుచు సృజించుభగవంతుండు కారణాంతరములేక జీవులను సుఖదుఃఖభాగులుగఁ గల్పించుననుట యుక్తంబు గాదు. ధర్మాధర్మంబులు గొనియే యట్లు సృజియించుచున్నాఁ డనుట యుక్తి సహము. ఇందువలన ధర్మాధర్మంబులు గల వనుట సిద్ధించెను.]

* వాక్యం. ఏవంయది స్వర్గనరకాదికం నాస్తి; తదా భవానపి కథం చైత్యవందనాదౌ ప్రవృత్తో హింసాతో బిభేతి. నహి వినా భయాభిలాషా ప్రవృత్తినివృత్తీ.

---

ఔరా! ధర్మాఽధర్మములులేకయె జంతుసంతానంబును కొంతదుఃఖోపచితంబుగను మఱికొంతసుఖోపచితంబుగను రచియించునని చెప్పఁబోవుటనుఖండనము వల్కుచున్నాఁడు. కిమపి=ఏదేనొక, సృష్టిం=సృష్టిని, సమదృష్ట్యా=సమదృష్టిచే, రచయతః = చేయుచుండునాతనికి, క్వచిదపిజనే = ఒకానొకజనునియందేని, రాగోనజయతి = ఆశలేదు, ద్వేషోనజయతి=ద్వేషమును లేదు.

* స్వర్గము నరకమును లేవనువచనమునుఖండించుచున్నాఁడు.

టీ. ఏవం=ఇట్లు, స్వర్గనరకాదికం = స్వర్గమునరకము మొదలగునవి, నాస్తియది= లేనట్లైన, తదా=అట్లగుచో, భవానపి=నీవును, కథం=ఏల; చైత్యవందనాదౌ = ఆలయం

[మఱియును స్వర్గంబు నరకంబు మొదలగునవి లేవంటివేని నీవును జైత్యవందన ప్రముఖంబులందుం బ్రవర్తించుచున్నవాఁడవు. హింసవలన భయంపడుచున్నాఁడ విది యేల? భయంబు లేక నివృత్తియును అభిలాషంబు లేక ప్రవృత్తియును గలుగనేరవు. నీకుం జైత్యవందనాదిప్రవృత్తి గలుగుటకుఁ బారలౌకికసుఖాభిలాషయుం, హింసవలన నివృత్తిగలుగుటకుఁ బారలౌకికబాధాభీతియును గలిగియుండుటయ కారణ మని వ్యక్త మయ్యెడిని.]

అని చెప్పి మఱియు సాహసాంకవి యిట్లనియె.

* వాక్యం. తత్ఫల మపి నైహికం; అననుభూయత్వాత్. తస్మాత్ పారలౌకిక మేవ స్వర్గనరకాదిరూపమ్. ఫలజనకావపి ధర్మాధర్మౌ నేహజన్మన్యేవ కృతౌ; జన్మత ఏవ ఫలోదయాత్. తస్మా దస్త్యేవ జన్మాంతరమ్. ధర్మాధర్మౌ పునః ప్రతిపాదయంతీ శ్రుతిః తదనుయాయిమునిప్రణీతస్మృతిపురాణాదయః ఇతి. వేదవిహితైహికఫలానుకార్యభిచారాదికర్మభి ర్జాయమానవృష్టిశత్రుచ్ఛేదాదిరూపఫలైః పారలౌకికకర్మణ స్సాఫల్య మనుమీయతే. ఏవ మేతదభిహితగ్రహణగ్రహోదయాదిదర్శనా త్తత్తద్దర్శితాఖిలవస్తునః ప్రామాణ్యం సిద్ధ్యతి.

[అట్టి చైత్యవందనాదులవలననగు పుణ్యఫలంబును హింసాదులవలన నగుపాప ఫలంబు ననుభవంబునకు రామింజేసి యైహికంబు లనం జనదు. మఱి స్వర్గనరకాది రూపములగు పారలౌకికములు వానిఫలంబులు. ఫలంబులు గల్పించుధర్మాధర్మంబులు నీజన్మమున నయొనరించినవి గావు. జన్మంబుదొట్టి సుఖదుఃఖాదిఫలంబులు సంప్రాప్తము లగుచుండుటం జేసి పూర్వజన్మంబులం జేసినవియగు పుణ్యాపుణ్యంబు లాసుఖదుఃఖాదుల నొసంగుచుండు నని చెప్పం జనును. కార్యంబునకుం బూర్వభావిగఁ గారణ ముండం జనును గాదె! జన్మముఁదొట్టిసుఖదుఃఖాదిఫలంబు లొసంగుధర్మాధర్మంబులు పూర్వజన్మంబులం జేసినవై యుండునని సిద్ధించుటంబట్టి జన్మాంతరంబును సిద్ధం బయ్యె. అట్టిధర్మాధర్మంబు

---

బునందువందనాదుల సేయ, ప్రవృత్తిః=ప్రవర్తించెడువాఁడవగుచున్నాఁడవు. మఱియుం హింసాతో బిభేతి=హింసవలననుండి భయంపడియెదవు? స్వర్గము లేదనువానికిఁ దత్ప్రాప్తికై చేయుచైత్యవందనాదు లేల! నరకము లేదనువానికి అది ప్రాప్తింపకయుండుటకై చేయవలసినహింసానివృత్తియేల యనిభావము. కారణము లేకయ చేయుచున్నార మనువచనమునకుఁ బ్రతివల్కుచున్నాఁడు. భయాభిలాషౌవినా = భయమునభిలాషయును లేక, ప్రవృత్తినివృత్తీ=కార్యమునం బ్రవృత్తియుఁ దన్నివృత్తియు, నహి=కలుగవు. అభిలాష లేకప్రవృత్తియు, భయంబులేక నివృత్తియుం గలుగవనుట.

*టీ. తత్ఫలమపి=చైత్యవందనాదులకును హింసానివృత్త్యాదులకునుగలఫలము, నైహికం=ఇహలోకసంభావ్యముగాదు, అననుభూయత్వాత్=అట్లుఅనుభవింపంబడకయుండుట

కెవ్వి యన? శ్రుతియును దదనుసారములుగ మునివరులు రచించియుండుస్మృతిపురాణా
దులు నా ధర్మాధర్మంబు లిట్టివి యని ప్రతిపాదించుచున్నవి. ఐహికఫలంబులగు శత్రు
వినాశంబును వృష్టియును గుఱించి వేదవిహితంబు లయినయభిచారాదిక్రియ లొనరింప
నని సంభవించు చుండెడిని. అవి ఐహికము లగుటంజేసి ప్రత్యక్షదృష్టంబులు. అట్టి
క్రియలచేతం బరలోకఫలప్రదము లని వేదమునం జెప్పంబడినకర్మంబులకును ఫలంబు
గలదనుట యనుమానంబునం దెలియనగును. సూర్యోపరాగాదులును శాస్త్రప్రతిపాదితం
బులు గనంబడుటంజేసి తత్తద్దర్శితంబు లగువస్తువు లెల్లను ప్రమాణంబుల యనుట
సిద్ధము.

కాన నీవు "నస్వర్గో నైవ జన్మాన్యదపి ......దేహాభిన్నోఽస్తి కశ్చిత్", అని
నుడివినవచనంబు సర్వజనహాస్యాస్పదంబు. యనంగా నయ్యెడ నుండువార లుల్లాసంబున
గరతలధ్వని లొనరించుచు నట మర్మము దూఱిపోవు నాడెడువచనములతో వసింప
బౌద్ధుండును జేయునది లేక మిన్నక తలవాంచుకొనియుండె. ఇట్లు నాస్తికపరాభ
వంబుఁ గావించి మహాకవి తన వెనువెంటం దన్ను సంస్తుతించుచు నాయామతతత్త్వవేత్తలుఁ
గూడికొని చనుదేర నేఁబదినాల్గవకక్ష్యాంతరంబుఁ బాసి మహామోదంబున నేఁబదియైదవ
హజారంబుఁ జొచ్చి యచ్చట నొకమహోన్నతమణిమయాసనం బొండు స్ఫటికమణిమం
డపమధ్యంబున నుండుటయుం దానిం బలసికొని పెక్కుమణిమయాసనంబు లమర్పంబడి
యుండుటయుం గని యందు నలబలం బేమియు లేక రిక్తమయి యుండుటకుం
జింతించుచుఁ దనమనంబున నిట్లు వితర్కించె. ఈకక్ష్యాంతరంబున నాతో వివాదంబు
నేయంగడంగువార లెవ్వారేని లేకుండుటం దలంచి చూడ నీవిద్యాసర్వస్వవేదిని నాచే
నన్నిట విజిత యయి యిఁక వివాదంబునకుం గడంగక విరమించుకొన్నవిధంబు గానం

---

వలన నదియొప్పుకొనందగు. తస్మాత్ =అట్లగుటం జేసి, స్వర్గనరకాదిరూపం= స్వర్గనరకస్వరూప
మగునది, పారలౌకిక మేవ = పరలోకమునం గలుగునదియ, (దీనిచే స్వర్గోభిలషితాశనం,
అన్న మాటనిరస్తము.) ఇఁక జీవునికి జన్మాంతరము గలదనుచున్నాఁడు. ఫలజనకావపిధర్మా
ధర్మౌ=ఫలమునొసంగునవియగు ధర్మాధర్మములు, ఇహాజన్మన్యేవనకృతౌ = ఈజన్మమునం
జేయఁబడినవియేకావు. జన్మతఏవఫలోదయాత్ =పుట్టువుందొట్టియే ఫలంబుగలుగుచున్నది
గాన నీపుట్టువునం జేయునది కాదనవలయును. తస్మాత్ =అట్లగుటం జేసి=జన్మాంతరం=మఱి
యొకజన్మము, అస్త్యేవ=ఉండునదియే. ధర్మాధర్మౌపునః=ధర్మాధర్మస్వరూపంబులన్ననో?
శ్రుతిః=త్రయి, ప్రతిపాదయంతీ=ప్రతిపాదించుచున్నది. తదనుయాయిముని ప్రణీతస్మృతి
పురాణాదయః=శ్రుతిననువర్తించుమహర్షులు రచించినస్మృతులును పురాణము మొదలగు
నవియును ప్రతిపాదించుచున్నవి. వేదవిహితకర్మముస్వర్గాదిఫలము నొసంగుననుటకుం
బ్రమాణముపచించుచున్నాఁడు. వేదవిహితైహికఫలానుకార్యభిచారాదికర్మభిః=వేదవిహి

బడుచున్నది. అయిన నియ్యెడ సమర్పంబడియుండు నాసనప్రముఖంబులసన్నివేశంబుం గాంచినం గాలయాపనంబునకుం దాను గరము విస్మయనీయమగు ప్రయత్నంబు సల్పిన రీతి విస్పష్టం బగుచున్నయది. ఇంతదనుక రెండుయామంబులు గడచె. మూఁడవయామం బుపక్రాంతంబునయ్యె. కానిమ్ము. నాపరమదైవతంబగు భారతీదేవిదయయుండుదనుక నాసేయం గడంగినకార్యంబునందు విఘ్నం బేదేని చూపట్టఁ జాలదు. ఇప్పు డియ్యెడ నుండు నీమహోన్నతాసనంబుపైఁ గూరుచుండి మదీయజయం బుద్ఘోషించితినేని యనంతరం బేమేమి కాఁగలదో చూతము. అని తలంచుకొనుచుం జని యాయున్నతాసనంబునం దాను గూరుచుండి నాస్తికుండు తనయెదుట నొకపీఠంబునను దక్కినవారలు తక్కిన పీఠంబుల పయినను సుఖాసీనులై తన్నుంజూచుచుండ వారలం గాంచి కాళిదాసుం డిట్లనియె.

* శ్లో. సిద్ధోయం పరమేశ్వరః ప్రభుతయా సర్గస్థితిధ్వంసకృత్
నిత్యో నిత్యమతి ర్గతి స్తనుభృతాం కుర్యా జ్జగన్మంగళం,

---

తంబులగు నైహికఫలంబులనొసంగెడునభిచారప్రముఖములగు కర్మములచేత, (అభిచారకర్మము చేసిన శత్రుక్షయమును ఇంద్రయాగాదులు చేసిన వృష్టిప్రముఖములును గలుగునని వేదమునం జెప్పంబడియున్నది.) జాయమానవృష్టిశత్రుచ్ఛేదాదిరూపఫలైః=కలుగుచుండు వర్షముశత్రువినాశము మొదలగుఫలంబులచేత పారలౌకికకర్మణః=పరలోకమునొసంగునట్టి కర్మమునకును, సాఫల్యం=ఫలప్రదత్వము, అనుమీయతే=అనుమానప్రమాణముచేనూహింపంబడుచున్నది. వేదవిహితమగు నైహికకర్మమునకు ఫలము ప్రత్యక్షమున ననుభూయమానంబగుటం జేసియట్టి వేదవిహితమగు పారలౌకికకర్మమునకును ఫలముగలదనియనుమాన ప్రమాణంబున నూహింపంబడుచున్నదనిభావము. ఇఁక శాస్త్రము ప్రమాణమనిసాధించుచున్నాఁడు. ఏవం ఇట్లే, ఏతదభిహితగ్రహణగ్రహోదయాత్ = శాస్త్రమునం జెప్పఁబడిన సూర్యోపరాగంబును గ్రహోదయములును గలుగుచుండటం జేసి, తత్తద్దర్శితాఖిలవస్తునః= ఆయాశాస్త్రములందుఁ బ్రదర్శింపంబడినసమస్తవస్తువులకును, ప్రామాణ్యం=ప్రమాణత్వము, సిధ్యతి=సిద్ధించుచున్నది.

* టీ. పరమేశ్వరః=పరమేశ్వరుఁడు, సర్గస్థితిధ్వంసకృత్ = సృష్టిస్థితిసంహారములొనరించువాఁడు, సిద్ధః=సిద్ధించినవాఁడయ్యె. అయం=ఇతఁడు, నిత్యః=నిత్యుఁడు నిత్యమతిః=నిత్యమగుబుద్ధిగలవాఁడు, తనుభృతాం=జీవులకు, గతిః = దిక్కయినవాఁడు, జగన్మంగళం=లోకములకు మంగళమును, కుర్యాత్=చేయుఁగాక. వయం= నేను, అద్య= ఇప్పుడు, జేతారః=జయించినవారము. ద్వేషిణః=శత్రువులగు,పరానపి=ఇతరులను. నాస్తికకులప్రధ్వంసనాత్=నాస్తికకులంబును ధ్వంసనముచేయుటంబట్టి, తదీయేచ్ఛయా=ఆనాస్తికునియిచ్ఛచేత, పరాభూతాన్=అవమానింపఁబడినవారలను, సహసా=సాహసమున,

జేతారో వయ మద్య నాస్తికకులప్రధ్వంసనా ద్వేషిణో
జానీమ స్సహసా పరా నపి పరాభూతా న్స్వదీయేచ్ఛయా.

అని,, తాను నాస్తికునియుక్తులకుం బ్రతియుక్తులు సెప్పి వానిం బరాభూతునిం గావించుటచే సృష్టిస్థితిసంహారములు సేయువాఁడును నిత్యము లయినయిచ్ఛాబుద్ధిప్రయత్నప్రముఖంబులు గలవాఁడునగు పరమేశ్వరుండు జీవులకుఁ గతిగాను జగంబులకుం బ్రభువుగా నున్నాఁడని సిద్ధించుచున్నది. అట్టి యాపరమపురుషుండు జగంబులకుమంగళంబుఁ గూరుచుంగాక. ఏ మిప్పుడు విజయంబుం గాంచితిమి. ఈనాస్తికకులంబుం జయించుటం జేసి ద్వేషంబుగలిగియుండుపరులును నాస్తికునికి వశగతులైనందున నాచేఁబరాభూతు లయినవారలే! మేమందఱుం జయించితిమి. అనునర్థంబు విస్పష్టం బగునట్టు లుపన్యసింపనదివినియానాస్తికుని మోముం గనుంగొనుచు విన్ననగు మోములతో నెల్లవార లేమియు ననలేక యూరకుండిరి. అప్పుడు మహాకవియు నుదయాదిత్యునిం గనుంగొని యోరీ యస్మజ్జయంబు పురంబునం గలయెల్లజనంబులకు వెల్లడియగుటకు జయశంఖధ్వానంబు సేయుఁడని యనిన నారాజనందనుండును విద్యాసర్వస్వవేదినిసౌధం బదరునట్లుగను అకాలఘనఘటాసంఘట్టనజనితమహానాదంబు ననుకరించునట్లుగను విజయశంఖధ్వానంబుఁ గావించిన నదివిని యచ్చటివారు భయసంభ్రమాక్రాంతహృదయులయ్యు నాస్వరం బతిగభీరమేదురం బగుటం జేసి యించుకసేపటికి సుస్వస్థచిత్తులై యొకరితో నొకరు "ఏమి! యావింత; ఈశంఖధ్వానంబు విన్నం బ్రళయజలధరధ్వానఘుర్ఘురంబై యున్నయది. ఇట్లు శంఖనినాదంబుఁ గావించుట పరిపాలితసర్వసర్వంసహాచక్రుండై మథితమదరిపుయూథనిర్వక్రపరాక్రముండై యొప్పును త్తమక్షత్రవంశసంజాతుం డగురాజన్యునికిం దగును గాని సాధారణునికిం దగదు. ఈకవి యెట్లు విద్యావిశేషసర్వస్వపారీణుండై కనుపట్టెడినో! యట్లే యితనితో నేఁగుదెంచియుండుకుమారుండును సకలశస్త్రాస్త్రపారంగతుండై పార్థునితోఁదులఁదూఁగువాఁడై యొప్పునని నిర్ణయము గలుగుచున్నది. భారతీప్రథమమానుషావతారంబగు నీకవియు వీరరసప్రథమావతారసరణియగు నీకుమారుండు నగ్నిమారుతంబులట్లు పరస్పరసంగతులయి పరుల కజేయులయి యొసంగెడరు. విద్యయందు మాత్ర గాదు. పరాక్రమమునందు సయిత మీవిద్యార్వస్వవేదని వీరల కోడిపోకపోదు. ఇది నిక్కము. మనమిందఱము స్త్రీలము. కేవలము పైకిఁ బురుషవేషంబులు దాల్చియున్నార మంతియ కాని రణంబున మెలుమెయిఁ గలసినప్పుడు మనయబలాత్వంబు బయల్పడకపోదు. ఇప్పుడిందు విద్యాసర్వస్వవేదిని దడయుచున్నది. ఇఁకఁ దప్పించుకొన నేవెరవు పరి

పరాభూతాన్ = నాచేతనవమానింపంబడినవారలనుగా, జానీమః = ఎఱింగెదము. నాస్తికుఁడు నాకోడిపోయెను. నాకోడిపోయిననాస్తికునికోడిపోయియుండుటంబట్టి తక్కినశత్రువులను నాకోడినవారలే! మేము ఎల్లవారలం జయించినవారమనిభావము.

కించుచున్నదో యెఱుంగము. అదియునుంగాక యీజయశంఖధ్వానంబు విద్యాసర్వస్వవేదినిసౌధంబునం బొడమినదని యెఱింగి పురంబునంగలజనంబులు నిశీథసమయం బని యెంచక యంచితాశ్చర్యరసపూరతరంగితాంతఃకరణులై యయ్యెడకుం జనుదెంతురు. ఇంతదనుక విద్యాసర్వస్వవేదినియింట విద్యావైశారద్యంబున నడ్డంకిలేక ప్రవేశంబుం గాంచి దాని నోడించి జయంబుం గాంచి మించినవాఁ డెవ్వఁడును లేఁడు. ఈనాఁ డేమి వింతయిది యని పౌరజనంబులు చిత్తవిక్షేపంబు నొందకపోరు. అని యిట్లు దలంచుకొనుచుండఁ బ్రాసతోమరఖడ్గపరశ్వథముసలముద్గరపరిఘాద్యాయుధధారులును కంచుకోష్ణీషకవచంబులు దాలిచి యుద్ధసన్నాహంబున నొప్పుచుండువారలునగు వీరభటులు సహస్రసంఖ్యులు గరంబు రయంబున సేనాపతినిర్దిష్టమార్గంబునం జనుదెంచి బారులు దీరి నిలువంబడుచుండఁ గనకవేత్రలతాహస్తులై కొందఱు ముందఱఁ బరాబరులు సేయ నవధీరితసురసుందరీసౌందర్యవిలాసలగు విలాసవతులు నిర్భరపరిశ్లథమణిమయభూషణరాజివిరాజమాన లగుచుఁ గరదీపికాసహస్రంబులు ధరించి పురోభాగంబున నడువఁ గొందఱు మందయానలు వాలవ్యజనతాలవృంతకళాచికాప్రముఖంబులం దాలిచి యుభయపార్శ్వంబులం బలసికొని రా శారదపూర్ణిమాశశాంకమండలంబువోలె విలసిల్లు ముక్తాతపత్త్రంబు నొకకనకలతాకమనీయకాయ ధరించి వెనువెంటం జనుదేర నప్సరోగణపరివృతుండగు శచీపతిచందంబునం దోఁచుచు మహావైభవంబులో నాసింహపురాధ్యక్షుండు గవియుండు నేఁబదియైన కక్ష్యాంతరంబునం బ్రవేశింప నాతనిం గాంచి విద్యాసర్వస్వవేదినిదాసికలు నిటలతటంబులు భూతలంబు సోఁకఁ బ్రణమిల్లి విరచితాంజలులై పురోభాగంబున నిలువ వారలంగనుంగొని రాజచంద్రుండు నో దాసికలారా! ఈనిశీథసమయంబున నీవిద్యావేదినీసౌధంబునందు జయశంఖధ్వానంబు గావించినవాఁ డెవ్వఁడు? ఆకామినీరత్నంబుచేఁ జతుష్షష్టి ద్వారంబులందు నియమితులైయుండు విదుషీమండలిని జయించిన యపూర్వభారతీమానుషావతారంబుగాదే! యిట్టి విజయశంఖధ్వానంబు సేయంగలవాఁడు. ఇన్నిదినంబులదనుక నీవిదుషీశిరోమణిసౌధంబున నిట్టివిజయంబు నొందినవాఁడు లేకయుండె. ఇప్పుడీధ్వానంబు విని మానసంబు శంకాతంకమోహాశ్చర్యంబులం బొరసెడిని. కుమార్గప్రవర్తనంబున నెవ్వఁడేని యీసౌధంబునఁజొచ్చి స్త్రీజనంబులఁ గలఁతవెట్టి యిట్టికట్టిఁడిపనులు గావించెనోకో? వానిం బట్టి జట్టిసంబునఁ గొట్టి బెట్టివంపుదండనకుఁ బాల్పఱుపం దలంచియీసైనికవీరభటసమూహంబుతో నేఁగుదెంచితి. ఈవీరభటవర్గంబు నాసౌధంబును బలసికొని రాత్రివేళ పర్యాయంబులు దాలిచి సమరసన్నాహంబుతో నుండునది. అట్లు దుర్వినీతుం డెవ్వండేని యీకక్ష్యసంప్రాదనంబున కొడిగట్టియుండునేని వానింబట్టి బంధింపం బనిచెదను. కలవృత్తాంతంబు వినిపింపుం డనిన నాదాసీజనంబు రాజునకు వందనంబు లాచరించి యిట్లనియె.

సీ. ఆశకట్టెలమ్మువాఁ డిందీవరాననఁ గోరి పద్యంబు లపుంతగతిని
బలుకుచు నిరంటియూఁచలకట్టె వేయువరాల కీయింతికి రాణ నమ్మి
మగుడ సాధనమిచ్చి మదవతిఁ గూడంగ సమకట్టి ద్వారముల్ సరవి గెలిచి
భామినీమణిని ముప్పదిరెండపహాజారమునఁ గవిత్వవిశేషమున జయించి

గీ. యంత వేవేగ సర్వసిద్ధాంతతత్త్వ
రీతుల నుపన్యసించుచు ఖ్యాతితోడ
నితని బౌద్ధుని జితుఁ జేసి యెల్లవారు
తనకుఁ జితులౌట నీజయధ్వని యొనర్చె.

క. ఇదె యీగద్దియ నాకవి, మదదంతిమృగేంద్ర మధికమహిమ మొఱయ స
మ్మదమున నెలకొనియున్నది, మదిరాక్షీమణిని గోరి మనుజాధీశా.

అని యిట్లు సెప్పిన విని రాజచంద్రుండు పారలు సూపెన కవివరునివలనికిం జూడ్కులు నిగుడించి యాతనియతిదుర్భగవేషంబునకు నేవగించుకొనుచు నిట్టియతి వికృతాకారుఁడా! మనవిద్యాసర్వస్వవేదినిం గామించివచ్చినవాఁడు. ఎట్టివిద్యావిశేషం బుండినను వీఁడు కట్టె లమ్ముకొనువాఁడ గదా? ఈయతిదుర్భగంబగు కిరాతత్వంబు లేక యున్న నీవిద్యయు సుజనశ్లాఘ్యత వహించును. ఈమహాదోషం బుండుటంజేసి యీతండు కవివరుం డయ్యు నిగ్రాహ్యుండు గాని యాదరణీయుండు గాఁడు. జలంబు లాస్వాద్యంబు లయినను జండాలకూపంబునం బడెనేని యవి పరిత్యాజ్యంబు లయిన విధంబున నీదుర్భగునియందుం గలవిద్యయు ననాదరణీయంబ యని నుడివిన నింతలో రాజునకు మహోన్నత రత్నమయాసనంబుం దెచ్చి సభామధ్యంబున సమర్చిరి. రాజును రత్నపీఠంబుపయిం గూరుచుండె. అంత నాభూపతిఁ గాంచి మహాకవి యిట్లనియె.

*శ్లో. ఖ్యాతశ్శక్రో భగాంగో విధురపి మలినో మాధవో గోపజాతః
వేశ్యాపుత్రో వసిష్ఠో రతిపతి రతను స్సర్వభక్షీ హుతాశః
వ్యాసో మత్స్యోదరీయో లవణజలనిధిః పాండవా జారజాతాః
రుద్రః ప్రేతాస్థిధారీ త్రిభువనవిషయే కస్య దోషో నచాస్తి.

---

*టి. శక్రః=ఇంద్రుఁడు, భగాంగః = శరీరమునసంతట భగములుగలవాఁడని, ఖ్యాతః= ప్రసిద్ధిఁజెందినవాఁడు. తన్నువంచించి తనభార్యయగు నహల్యతోఁబొందుచేసిన కారణమునుబట్టి గౌతముఁడు దేహమునసంతటభగములుగలుగుఁగాతమని శక్రునికిశాప మిచ్చెను. విధురపి=చంద్రుండును, మలినః=మాలిన్యముగలవాఁడు. కళంకియనిభావము. మాధవః=శ్రీకృష్ణుఁడు, గోపజాతః=గొల్లనికొమరుఁడు. వసిష్ఠః=వసిష్ఠమహాముని, వేశ్యాపుత్రః= వేశ్యయొక్కకుమారుఁడు. పూర్వము నిమియనుచక్రవర్తియయు వసిష్ఠుండును బుల్వ

అని,, యింద్రుఁడు శరీరమునం దంతట భగములు గలవాఁడు; చంద్రుఁడు మలినుండు; శ్రీకృష్ణుండు గొల్లవాఁడు; వసిష్ఠుండు వేశ్యయగు నూర్వశికిం బుట్టినవాఁడు; మన్మథుఁడు శరీరము లేనివాఁడు; (అంగహీనుఁడనుట) అగ్ని సర్వంబును భక్షించువాఁడు; వ్యాసుఁడు మత్స్యగంధికిం జనించినవాఁడు; జలనిధి యంతయుం నుప్పు; పాండవులు జారులవలనం జనించినవారు; శివుఁడు ప్రేతములయస్థులం దాల్చువాఁడు ఈమహాత్ములకే యిట్టిదోషములుండఁగా నిఁక ముల్లోకంబులను దోషములేనివాఁ డెవ్వఁడు? వారలయందాయాదోషము లున్నచందంబున నాయందును గిరాతత్వ మనుదోషం బున్నది. శ్లో. 'ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః' అన్నట్లు గుణసమూహమునం దొక్కదోషము చంద్రునికిరణంబులం దుం గళంకంబుభాతి నణఁగిపోవు ననునీయభిప్రాయంబు దోఁపం బల్కఁగా మహాకవివచనంబులు విని రాజు ప్రతివచనం బేమియుం బల్కలేక యతఁడు వచించినపద్యంబునకుం గలభావవిశేషంబునకు మెచ్చుకొనుచు నిట్టిసమస్తవిద్యావిశేషవివర్తం బయినయీకవికులవతంసంబునకుం గులహీనత గల్పించిన నలువకు రసికవతంసోపలాలనీయంబగు యౌవనంబునకుం జరయును; దరుణజనహృదయహారియగు మదవతీకుచయుగళంబునకుం బతనంబును సృజియించినయపయశం బుడివోవకుండు. విద్యాసర్వస్వవేదిని యొనర్చియుండు ప్రతినకుం దగినమహావిద్యావైభవం బితనికుండియు రాజకుమారునిన చేపట్టుదు నన్నయానాటివచనంబునకుం దగనివాఁడై యుండెడిని; ఏమి సేయనగును. ఈసంకటంబువలనం దప్పించుకొనును పాయాంతరంబు దోఁపదు. అని యిట్లు చింతించుచుండునవసరంబున,

---

జత్వమునుగుఱించి రోసగించుకొని యొండొరులశరీరంబులుఁ బోవునట్లు శపించుకొనిరి. అందు వసిష్ఠుండు చతుర్ముఖునివరంబున మిత్రావరుణులూర్వశింగాంచి మోహించి స్ఖలితవీర్యులయిన యజ్ఞశాలయందుం బడినయాయిరువురవీర్యంబునకు వెండియునుద్భవించె. రతిపతిః=మన్మథుఁడు, అతనుః=అంగహీనుండు. రుద్రునికంటిమంటల చే మన్మథుండంగహీనుండయ్యె. హుతాశః=అగ్ని, సర్వభక్షీ=సర్వమునుభక్షించువాఁడు. వ్యాసః = వ్యాసభగవానులు, మత్స్యోదరీయః=మత్స్యగంధి యుదరమునఁ జనించినవాఁడు. ఉపరిచరవసువీర్యంబునకు మత్స్యోదరంబున దాశరాజకన్యక పుట్టె. ఆమెయందువ్యాసుండుదయించె. లవణజలనిధిః=సముద్రము ఉప్పు. పాండవాః=పాండుపుత్రులు, జారజాతాః = జారులయిన ధర్మాదులకుంజనించినవారు. దూర్వాసోమునిదత్తమహామంత్రజపంబునం బ్రసన్నులయిన ధర్మాదులకుఁ గుంతియందుంబుట్టినవారు. రుద్రః=రుద్రుఁడు, ప్రేతాస్థిధారీ=ప్రేతములయస్థులందాల్చుకొని యుండువాఁడు. కాన-త్రిభువనవిషయే = ముల్లోకంబులందు, కస్యదోషోనచాస్తి=ఎవ్వనికిదోషములేదు.

సీ. అసితదీర్ఘారుణ మయి యొప్పుకనుదోయి జడిగొని బాష్పముల్ వోడముచుండ
పీననితంబోరుబింబభారంబున వడిమీఱుగమనంబు జడనుపడఁగ
గురుతరకుచకుంభభరమున కోర్వక యలఁతి లేనడుము జవ్వాడఁ దొడఁగ
లక్ష్మీనివాసమై లలిఁ గూర్పు నెమ్మోము దైన్యతాప్తికి నికేతంబు గాఁగ
గీ. మొగిని కరముల వక్షంబు మోఁదుకొనుచు
ప్రాణసఖి! నిన్నుఁ బాసి నే బ్రతుకఁగలనె
యనుచు విలపించు చొకకాంత యతిరయమున
సభకుఁ జనుదెంచె జనములు సంభ్రమింప.

అప్పు డప్పడంతిం గాంచి,

సీ. జలదఘర్షణముచే జాఱితత్తఱ మందు క్రొక్కారు మెఱుఁగు నాఁ గొమరుమిగిలి
నటనశ్లథమహానటజటాగళిత వరాసింధురేఖ యో నాఁగ నందమొప్పి
జేజేలముగుదలచేదప్పిపడిసట్టిసుమదామ మో యన సొంపుఁగాంచి
యిహలోక సందర్శనేచ్ఛచే వచ్చిననాగకన్యక యొ నా బాగుమీఱి
గీ. తోఁచుచున్నది మదికి నీతోయజాక్షి
యీవరోరుప్రియసఖి యెవతె యొక్కొ
యేల యెడబాసె నొక్కొ యీయిందుముఖిని
యని సభికు లాడుకొనుచుండి రబ్బురమున.

అది గాంచి యానరపతి కరము మనంబున నరమరికం జెంది విద్యాసర్వస్వవేదిని దాసికలం బిలిచి యోసీ యీకుమారికామణి యెవతె? ఇది యేల యిట్లు వగలం బొగులుచున్నది? దీనికి సఖి యెవ్వతె? ఇప్పు డేహేతువుంబట్టి దానికిని దీనికిని వియోగంబు సంభవించినది? ఈవృత్తం బెల్లం దెలిసికొనుఁ డన వారును రాజుం గాంచి యిట్లనిరి, ఈమనవతీమణి మనవిద్యాసర్వస్వవేదినికిం బ్రాణసమానయగు చెలి. దీని పేరు సాహిత్యసర్వస్వవేదిని. దీనికిం బ్రియసఖి విద్యాసర్వస్వవేదినిగాని మఱియొక్కతె గాదు. దీని వృత్తాంతం బింతదనుక నే మెఱుంగుదుము. అని పల్కుచుండ వారలవచనంబులు మీఱి యాసాహిత్యసర్వస్వవేదిని రాజుం గనుంగొని యిట్లనియె. ఓయధిపతీ! యేను విద్యాసర్వస్వవేదినికి సర్వవిద్యలయందును సహాయనై దానికి బహిశ్చరంబగు ప్రాణంబు నా నుండుదానను. ఒకింత సేపటికి మున్దు నేను తన్నియుక్తనై తత్ప్రేషితంబగు విద్వన్మండలికి నండఁగా నియ్యెడకు వచ్చియుండి యీమహాకవికిని తక్కుంగలవారికిని జరుగుచుండిన నిరవద్యవిద్యావిశేషచర్చాచాతుర్యంబుం గనుంగొనుచు నాప్రియసఖి తన కప్పుడప్పుడు కట్టెలమ్మువానికిని విద్వన్మండలికిని జరుగుచుండువృత్తాంబుఁ దెల్పుచుండుమన్న మాటమఱచి యీయాస్తికనాస్తికులవివాదంబున నేమియుం బుద్ధికిం దోఁపక స్థాణుప్రాయనై

యుండి యిప్పు డియ్యెడ కేలిక విజయము సేయ నీవృత్తాంతంబు నాప్రియసఖి కెఱింగింప నతిత్వరితగతి నాయంగనామణియుండుసౌధంబునకుం బరువిడితి. ఆయ్యెడ నాప్రియసఖి గానంబడదయ్యె. ఇంతకుం దొలుతఁ దనయుంట సౌధాంతరంబునందు మదితరపరిజనప్రవేశంబు నామదవతి నిషేధించియున్నది. ఈకట్టెలమ్మువానితో నాముగుద సర్వవిద్యలయందును వివాదంబునకుం గడఁగి యోటువడి యితఁడు నీచుండు గానఁ దనప్రతినమేరకుఁ గలయ నిష్టపడక యితనివలనఁ దప్పించుకొన ననేక కపటోపాయంబు లొనరించియు విఫలప్రయత్నయై తా నిన్నిదినంబులదనుకఁ గన్యకాత్వంబునకు భంగంబులేక విద్యాసర్వస్వవేదిని యనుబిరుదుఁ గాచుకొనుచు ననమానవైభవంబునవిఱ్ఱవీఁగుచుండి నేఁడొక్క కట్టెలమ్మువానికడ నివి యెల్లం గోలుపోయి యెల్లి యెవ్వరికి మొగంబైన నేవిధి గనుంగొందు ననితలంచి ఘనంబగునవమానంబున నీమేనిపైయాసయెడబాసి యెట్టికతోరదశావివర్తముఁ జెందెనో! ఎయ్యెయ్యెడల నన్వేషించినం గానంబడకయున్నది. నిక్కముగ నామదవతి యీమానభంగంబునకు రోసి యీకట్టెలమ్మువానికి లోఁబడుటకంటెం గాయంబు దొరంగుట మేలని రజ్జువిషాగ్నిజలంబుల జీవలోకదుఃఖనివర్తాంతంబుం జెందియుండును. అట్టియభిమానంబుగలమానినీతిలకంబు భూలోకంబున నిఁక జనింపంబోదు. స్నేహంబన్నది దానియంద యుండు. ఆరమణీశిరోమణి యీలోకంబుననుండునంతదనుకయ ఈ సంసారంబు సారవంతంబు. అరామణీయకనిధి లేకున్న నీముల్లోకంబుల నిఁక రత్నంబనునది లేదనవచ్చు. ఆసౌందర్యసారసముదాయసంకేతనంబుం గాననినాఁడు లోకంబులయాలోకంబులు నిరాలోకంబులు గాకపోవు. ఆలావణ్యసారశరణంబు నెడబాసిన బాంధవజనంబు మరశైకశరణంబు గాకపోదు. ఆసౌభాగ్యవతీవతంసంబు వోయెనేని కందర్పునికిఁక దర్పం బన్నమాట యుండదు. ఆ సర్వాంగసుందరివికచశతపత్త్రలక్ష్మీనివాసం బగు ముద్దుమొగంబుంగనుంగొననిచో సకలజననయనంబులనిర్మాణంబు విఫలంబ యగు. వేయేల? ఆయెలనాగ లేకుండిన నీజగం బంతయు జీర్ణారణ్యంబ యగును. అంతట విద్యలకు భూలోకంబునందు వసతి నశియించు. సుగుణంబుల కాకరంబు వొలంగు. ఆవిద్యాసర్వస్వవేదిని నాకేగాదు! తక్కినవారలకు సముతము జీవితసర్వస్వమ్మయి యుండునది. ఎట్టు నాప్రియసఖి ముద్దుమోము వెండియుఁ గాంతు. ఎట్టు దానిసుధాధారామధురంబులగు వచనంబులు వెండియువిందు. ఎట్టుహరిచందనపల్లవరసనంసేకంబుంబోలినదానియాలింగనంబు వెండియుఁ బడయుదు. నారత్నం బేమయ్యెనో! నాజీవితం బేగతిపట్టెనో! నాసర్వస్వం బేయవస్థం బొందెనో! హా! ఏమి సేయుందు? ఎటు వోదు! ఎవ్వని శరణువేఁడుదును? ఎవ్వని నడుగుదును? ఎవ్వనితోఁ జెప్పుకొందును! ఏవిధి వర్తింతును? ఎయ్యెడ నుందును? ఏమి యీనాకుసంభవించినవిధివైపరీత్యము. అని మఱియుం ననేకవిధంబులం బ్రలాపింప నాసాహిత్యసర్వస్వవేదినివచనంబులు విని యయ్యెడనుండు నెల్లవారును తమతమమనంబులం

దీవిద్యాసర్వస్వవేదిని యీకట్టెలమ్మువానికి విజితయైనకతంబున నితనికి వశవర్తినియై వర్తింపవలసిన దైనహేతువుంబట్టి మనంబునం గుందుచు నభిమానహానికి రోసి ప్రాణంబులం బరిత్యజించునో యనుసంశయంబు గలవారలై యుండుటం జేసి తదనుసారముగనీ సాహిత్యసర్వస్వవేదిని వల్కినపల్కులచేత విద్యాసర్వస్వవేదిని మరణంబు నొందియుండు నని నిర్ణయించి మించినశోకంబున మూర్ఛాక్రాంతులై కొంతవడికిం దెప్పిరి లేక నుదమ్ములం బొడముబాష్పజలధారావారంబులతోఁ బయిఁబయివెడలు వేఁడినిట్టూరుపులతో సర్వాంగసంగతం బైనకంపంబుతో సమున్ముక్తార్తనాదంబులతో మహీపతికడకుం జేరి యోరాజేంద్రా! గ్రక్కున నావిద్యాసర్వస్వవేదిసిని వెదకింపం బంపుము! ప్రాణపరిత్యాగ వ్యవసాయంబునందు విధివశంబుగ నేదేని యభ్యంతరంబు సంప్రాప్తం బయిన జీవితంబుతోడన ప్రియసఖిం బడయవచ్చు నని ప్రార్థించిన మహీపతియుం వీరభటులచేత జలమజ్జనాదిచతురులగు ననేకుల బెస్తలను రావించి వారల వాపీకూపతటాకాదుల వెదకునట్లును తక్కుంగలగూఢచరుల నాయూరిరహస్యస్థలంబులను వెదకునట్లు కట్టడయిడెను. వారలు నెల్లయెడలం గలయ నన్వేషించి యెందునుంగానక తద్వృత్తాంతంబు భూపతికి విన్నవించిరి. ఆవృత్తాంతంబు విని యెల్లవారును కరంబు పరితపించుచుఁదమమనంబుల నిట్లనుకొనిరి. మానహానికి వెఱచి యీమానినీతిలకంబు ప్రాణంబులు వాసి యుండునేని మృతకళేబరంబైనను దొరకదా! అదియును గనంబడదు. ఇది యెట్లు? ఏమైయుండునో తోఁచక యున్నది. అప్రతివిధేయం బయినయీయనర్థంబునందుఁ గార్యం బిదియని యవగతముగాదు. అని యీరీతినాడుకొనుచుండ రాజు మహాకవిం గాంచి యిట్లనుకొనియె. ఇతండు కరము ప్రయాసమునొంది విద్యాసర్వస్వవేదినిని తనయనవద్యవిద్యావైదుషీవిశేషంబున జయించినవాఁడు; దానితోఁ గలయంగోరిక గలవాఁడు; తా నది గన్పడకపోయె నన్నుక్రించుదనం బొకించుకయు మొగంబునం గానిపింపక ప్రమోదమేదురహృదయుండై యుండెడిని.తన చేయలంతిం జిక్కినచక్కెరబొమ్మ బెడిసిపోయిన నెవ్వండేని కరం బార్తిం బొరయకుండునే? ఏమి యీవింత! అది పోయినవల నితండు మనంబున నెఱింగియుండని వాఁడు గాఁడు. పూర్వము వేషాంతరంబుఁ దాలిచి వెడలిపోఁ బ్రయత్నించినదానిని నితం డడ్డగించి యుండలేదా? అట్టిసూక్ష్మదృష్టి యిప్పు డియ్యెడరున నూరకుంట యారసి చూడ నిదియితనికి విదితంబయి యుండక పోదని తోఁచెడిని. ఇతని నడిగిన నంతయుం విస్పష్టంబు గాఁగలదు. అని చింతించి మహాకవిం గాంచి యాభూపకులాధ్యక్షుం డిట్లనియె. ఓమహాత్మా! నీవు సర్వవిద్యావిచక్షణుండవు; భారతీదేవి నూతనమానుషావతారంబ వని తోఁచెడిని. నీవు సర్వజ్ఞుండ వగుటకు సందియంబు లేదు. కాన నీ వెఱుంగని దే మున్నది. ఇప్పు డీ విద్యాసర్వస్వవేదిని నీకు సమస్తవిద్యలయందు విజితయై యతిదుర్భగం బయినయీకట్టెలమ్మువానివేషంబుతోఁ దోఁచుచుండు నీతోడఁ గలయుట కేవగించుకొని యేవిధంబుననో

యంతర్హితయైయున్నట్లు దోఁచుచున్నది. ఆ గీతినైపుణ్యసీమంబట్టి మాయెదుటం బెట్టితి వేని నేన యూయింతిని నీ కర్పించువాఁడ. గ్రక్కున నక్కమలానన నిక్కడకు రప్పింపుము. ఆ విద్యాసర్వస్వవేదిని మున్న నీకు విజితయౌట నీకు లోఁబడియుండు నా నిబంధనం బొకరేయిక కాని యంతకుం బయిని జరగదు. ఇప్పు డట్లు గాక కలకాలంబును నీకు వశవర్తినియై యుండం జేసెదను. కరుణించి యానాతి పోయియుండువలను గానిపింపుము. ఈ విద్యాసర్వస్వవేదినిసౌధంబును దీనిసమస్తపరిచారికాజనంబును ఆ విద్యావేదినిచే జయింపఁబడి గృహదాసంబై యూడిగంబు సేయుచుండు నీరాజకుమారచక్రంబును ఆ రామామణి గడించిన యఖిలధనసంచయసంబాధంబగు కోశనిచయంబును దానిగజాశ్వరథతురగవ్రాతంబును నీయధీనంబుఁ గావించితిని. ఇఁక నీవ యావనితారత్నంబునకు నధినాథుండవు. ఏదియే నొకకారణమును బట్టి యిట్టివికృతవేషంబుఁ దాలిచి వచ్చియుండు దేవతవు గాని నీవు సాధారణమనుష్యమాత్రుండవు గావు. మనుష్యమాత్రుండవయ్యెన భువనేశ్వరీనిర్నిద్రకరుణాకటాక్ష వీక్షా విశేషవివర్ధమానానుపమానా నూనకవితాచాతురీనిరస్త నిఖిలపండితకవిమండల సంకీర్త్యమానవిమలయశోమృతధారాసారధవళితదశదిశావకాశ యగు నీరాకాశశివదనను జయింప నీకుం దరంబగునే? మహావికృతరూపంబుతో నలుండును బృహన్నలరూపంబుతో నర్జునుండును ఋతుపర్ణమత్స్యపతులకడఁ గార్యార్థంబు సేరిన యట్లు లీకిరాతవేషంబున నెవ్వఁడవో మహాపురుషుండవు దీనివిద్యాగర్వం బడంచుట కొఱకా! దీనియతివిలోభనీయంబగు నవయౌవనంబు; సకలకళాచాతురీవిశేషంబునం జేసి యతులితామోదంబుం జెందిన సువర్ణంబుభాతి ననూనరసికజనాదరణీయతం గాంచి యుండునది; కాననచంద్రికయై జానుదొఱంగక మాననీయతం గనం జేయుట కొఱకా! ఏతద్వ్యాజంబున నస్మాదృశదీనజనరక్షణంబు సలిపి యాత్మీయనిష్కారణ కారుణ్యరసపూరంబు వెల్లివిరియం జేయ నొక్కొ యిక్కడ కరుదెంచి యున్నాఁడవు. నీ కసాధ్యంబొం డేమియుం లేదు నామానసంబును నీయందు నచ్చియున్నది. అని యిట్లు భూమీశ్వరుండు వేఁడికొనినఁ గాళిదాసుండు విని మానసంబున సంతసించుచుఁ గించిదంకురితమందహాసరోచిరుదంచితముఖారవిందుండై యోధరాపతీ యింత యుగ్గడింపనేల? జయాపజయంబు లెల్లవారికిం గలిగినవియకదా? నాకోడినమాత్రాన యీతనుమాత్రమధ్య దుష్కీర్తిపాత్రతం గాంచునే? ఇన్నివిధంబుల నాకోడియుం నాపదఁతి నాకుం జిక్కకయ తప్పించుకొనుచున్నది. ఇట్టిచాతుర్యసీమలగు భామల నెందేనిఁ గాంచినది లేదు. కరం బరుదై యొప్పునీయొప్పులకుప్ప నేర్పరితనంబు సకలమనీషిజనసంశ్లాఘ్యం బయినదియ. ఈ వగలాడిమాయలు నాయందుమాత్రము కార్యకరంబులు గాక కడుపడి నెడయుంచున్నవి. ఇప్పుడు నేను దానిం గాన్పింపంగలను గాని యది విశ్వాసార్హంబు గాదు. ఈ యుండునందజయానలందు నాఁగోరినకీరవాణులఁ గొందఱ నధిగతభరతశాస్త్రతత్త్వవిత్త

మల నాకఅపూర్వవృత్తాంతంబు నభ్యసించి నాటకచ్ఛాయం దేటపఱుపఁ గలవారలఁ గైకొ
వారలంగొని యొకవృత్తాంతంబు మీకుం బ్రదర్శింపం జేసి దాన మీయభిప్రాయంబ
నమకూర్పం గలను. అని చెప్పి యయ్యెడనుండు కొందఱ సుందరాంగులం బ్రత్యేకం
చీరి వారలకుం గఱపవలసినది వివరించి యే బదిరయాఱవకక్ష్యాంతరంబునందు రంగస్థల
బలంకరింపుఁ డని వారలకు ముదలయిడి పనిచి తక్కుంగలదాసదాసీజనంబులకు సభికో
వేశసముచితంబుగ నాసనాదుల నాయత్తంబు సేయఁగట్టడయిడి వార లట్లుసేయం జన
డొకింత తడసియుండ యాసనంబు విడిచి లేచి రాజును తక్కుంగలవారలను తనవెం
రాఁ బ్రార్థించి వెనువెంటం జనుదెంచుచుండు భూపతితోడను నాస్తికునితోడను విద
న్మండలితోడ నేఁబదియాఱవకక్ష్యాంతరంబునం జొచ్చి యెల్లవారల నుచితాసనోపవిష్ట
లం గావించి తాను రంగస్థలంబున కభిముఖంబుగ నుదయాదిత్యునితోఁ గూరుచుండెను
అయ్యెడ నాటకచ్ఛాయయుం బ్రవృత్తం బయ్యె.

## నాటకచ్ఛాయ.

నేపథ్యంబున

గీ. కలువకంటులయందును గవులయందు
జనులు దోషైకదృష్టులై మెలఁగుచుంద్రు
వాక్కులయును కాంతలయును గుణవ్యక్తి కరము
కష్టలభ్యంబు సుజనైకకాంక్షితంబు.

అని యొక్క గీతంబు వినంబడ నది సభాసదు లెల్లవారలు తమమనంబులందు
వినంబడినగీతంబునకు నుపమానోపమేయసాంగత్యంబువలనఁ గవులవాక్కులయందు సర
జనులును దోషంబ గణించుచుండుచందంబునఁ గలువకంటులయందును దోషంబుల
గణింపుచుండుదురు. వాక్కులగుణము ప్రకాశించుట కరము కష్టలభ్యమయినట్లు కాం
లయు సుగుణప్రకాశము బహుప్రయాసంబునం గాని కలుగదు. అదియును సుజనుల
మాత్రము శ్లాఘింతురు గాని తక్కినవారు శ్లాఘింపరు. అనునర్థంబు వెల్లడియగుచుండ
టంబట్టి యొకయుత్తమపతివ్రతాతిలకంబునైఁ గొందఱు దోషైకదృష్టులు దోషం బారో
పింపనది బహుప్రయాసంబునఁ దనసాధుగుణంబు బయలుపఱచి సుజనశ్లాఘ్యత వడసెనన

కొనుచుండ సంగీతావసానంబునం బటాక్షేపంబుఁ గావించుకొని యొకకాంతాతిలకంబు వచ్చి రంగంబున నిలువంబడి సామాజికులం గనుంగొని యిట్లనియె.

*శ్లో. కిం చిత్రం యది రాజనీతికుశలో రాజా భవేద్ధార్మికః
కిం చిత్రం యది వేదశాస్త్రనిపుణో విప్రో భవేత్పండితః
త చ్చిత్రం యది రూపయౌవనవతీ సాధ్వీ భవేత్కామినీ
త చ్చిత్రం యది నిర్ధనోపి పురుషః పాపం నకుర్యాత్క్వచిత్.

అని చెప్పి నేపథ్యంబువలనికి మరలి చూచి.

ఔరా! ఏమి యీయనుకూలసందర్భంబు! సామాజికోక్తి కనురూపముగ లోకచిత్రం బేను నుడివితిని. మదుక్తి కనురూపముగ నిచ్చోటం గొందఱు బ్రాహ్మణులు రహస్యాలోచనంబునకుం గుంపుగూడి యేదియో యొకమహాపాపంబు సేయం బ్రవర్తించుచున్నవా రనితోఁచెడిని. కట్టా దారిద్ర్యంబుగదా వీరల నిట్టిగట్టడితనంబున గొడికట్టం జేయుచున్నది. పేదఱికం బెట్టిపాపంబులనైనఁ జేయింపక పోదు. వీర లెవ్వరో కనుగొందము.

(నిరూపించి చూచి, గౌరవాసూయాసంభ్రమంబులతో.)

ఔర! వీర లీధారానగరవాసులు. భోజభూపతి సభాలంకారంబైన కవిపండిత సంఘంబులోనివారు. వీర లిట్టికార్యంబులకుం గడంగుటేలకో? భోజభూపాలదత్త ధనకనకవస్తువాహనప్రముఖంబులచేతఁ బరితృప్తిఁ గాంచియుండినవారలు గారె!

(విమర్శించి)

సరి! సరి! వీరల కామహీపతి యెంతయిచ్చిన నేమి? తమలోఁ గొందఱఁ గడు గౌరవించుచున్నాఁ డనునసూయ వీరలం గారియపెట్టుచుండ మానసతృప్తిఁబడయని వారలు గాన వీరలు దరిద్రులే. ఇందుశంకరుండును గోవిందుండును తారేంద్రుండును గోకిలుండును మయూరుండును హరియుఁ గళింగుండును భూరుండును వినాయకుండును మఱియుం గొందఱును జేరియున్నవారు. వీరలు నేమనాలోచనం బెట్టినదియో తెలిసి

* టీ. రాజనీతికుశలః=రాజనీతియందుసమర్థుండగు, రాజా=రాజు, ధార్మికోభవేద్యది=ధార్మికుండై యుండెనేని, కించిత్రం=అదియేమిచిత్రము? వేదశాస్త్రనిపుణః=వేదములందును శాస్త్రములందును సమర్థుండగు, విప్రః=బ్రాహ్మణుఁడు, పండితోభవేద్యది=సర్వశాస్త్రప్రతిపాదితమగుజ్ఞానముగలవాఁడై యుండునేని, కించిత్రం = అదియేమిచిత్రము? రూపయౌవనవతీ = రూపమునుదారుణ్యముగలదియగు, కామినీ=కాంత, సాధ్వీభవేద్యది=పతివ్రతయైయుండునేని, తచ్చిత్రం=అదిచిత్రము. నిర్ధనోపి=ద్రవ్యములేనివాఁడయ్యును, పురుషః=పురుషుఁడు, క్వచిత్=ఒకచోటనైనను, పాపం=దోషమును, నకుర్యాద్యది = చేయకుండునేని, తచ్చిత్రం=అదిచిత్రము.

కొందము. రాజకులమునకు సంబంధపడినదయినచో నుచితసంవిధానంబునం బ్రయత్నింపం జనును. శారదపుండరీకషండాపచయంబునకై వచ్చినదాన; నేనును వీరలకడకుం బోయి చాతుర్యంబు మెఱయ వృత్తాంతం బారయుదును. అని నిష్క్రాంత యయ్యె.

అప్పుడు సభాసదు లది నుడివినపద్యంబు విని ఈపద్యంబుచేత రాజనీతికుశలుండగురాజు ధర్మమార్గమునం బ్రవర్తించుటయు వేదశాస్త్రంబు లభ్యసించినబ్రాహ్మణుఁడు శాస్త్రజన్యజ్ఞానము కలిగియుండుటయుఁ గడు విచిత్రంబులు. దీనికంటె రూపయౌవనములు గలకలువకంటి పతివ్రతయై యుండుట కరము చిత్రము. అట్లె నిర్ధనుం డగుపురుషుండు పాపము సేయకుండుటయు చిత్రమే యని *కావ్యార్థసూచనంబు సేయంబడియెనని యనుకొనిరి.

---

## ప్రస్తావన.

---

### ప్రథమాంకము

అంత బ్రాహ్మణులు రంగరంబునం బ్రవేశించిరి.

అందొక్కండు-మిత్రులార! యేను గొన్నిదినంబులకు ముందు ధారానగరంబుఁ బాసి విద్వన్మండలమండితమండలాధిపతులసభాస్థలంబులం గాంచం గోరి చని తన్నైకస్త్రీభూమి యంతయుం దిరిగి మరలి గతదినంబున నీపత్తనంబు జేరితిని. భవన్నియుక్తయగుచేటిక గతదినసాయంసమయంబున మన్మందిరంబునకే తెంచి ప్రణమించి యెల్లి భువనేశ్వరీదేవాలయంబు వెనుకటి వటవిటపినికుంజంబునం గవివరులు సేరి యచ్చ్యుల కేరికి నెఱుకపడకుండం గొన్నిరహస్యార్థంబులు చర్చింపం గలరు. మీరలు నచ్చోటికివిచ్చేయం జను నిది మూకవివరులమాట యని పల్కి చనియె. దానం జేసి యే నియ్యెడకు రానయ్యె. ఓవరరుచి మయూర శేషణ హరి శంకర కళింగ పూర వినాయక మదన విద్యావినోద కోకిల ప్రముఖులారా! శారదసమయసముత్ఫుల్లపుండరీకషండమండితంబులై యొప్పుచుండు మీముఖబింబంబులు చెన్నుఁ దొఱంగి యుంటకుం గారణం బేమకో? కవిజనకల్పకం బగుభోజభూపతి మిమ్ము ననుదినమ్ము సమ్మాననలం దనుపఁచు చుండెడినే!

మయూరుండు-ఓతారేంద్రా! ఇప్పుడీవిన్న దనంబునకుం గారణంబుగలదు! వినుము.

గీ. కాళిదాసకీర్తిఘనతరచంద్రికా, విసర మఖిలదిశల వెల్లివిరియ
మొగిని నస్మదీయముఖసారసంబులువ, స్నెదొఱఁగి మొగుడుచున్న విపుడు.

---

* కావ్యార్థసూచన మనఁగాఁ బ్రతిపాదింపఁబడుకావ్యంబునం గలయర్థంబు సంగ్రహముగఁ దొలుతఁ దెల్పుట. ఇది నాటకములందు ముఖ్యముగ నుండవలయు.

తారేంద్రుండు. ఓకవికులతిలకంబులారా!

ఉ. ఆకవికల్పకంబు సరసాగ్రణి స్నేహపరస్పైకపాత్రమీ
భూకమనానురాగపరిభుక్తవినూతనభోగభాగ్యల
క్ష్మీకలితుండు సాధుజనసేవధి దీనజనానుకంపనుం
డాకవివర్యుపై మనములందు విరోధము గల్గ నేటికిన్.

మయూరుండు.

గీ. సర్వవిద్యాగరిష్ఠులై శర్వసములు, కవులు పెక్కండ్రు సభలోన గరిమ నుండఁ
గాళిదాసుండు సస్థానగౌరవమునఁ, బెంపువడయుంట వైరంబుఁ బెంపకున్నె?

తారేంద్రుండు. ఈవైరంబు సాధింపం గోరి భూపతి కాళిదాసునిం గౌరవింపక యుండ మీరొనర్చినకపటోపాయం బేమి? అది యెవ్విధిఁ బరిణతం బయ్యె?

మయూరుండు. ధారాపతికిఁ గాళిదాసుండు వేశ్యాలంపటుండని రాజకులసంచార నిరతులచే నెఱింగించితిమి; ధరారమణుండు నొకనాఁడు కాళిదాసునిం గాంచి సమస్త విద్యావిచక్షణుండగు నీతని కీవేశ్యాలంపటత్వం బుండుట కరము ఖేదకరం బని మానసం బునం దలంచె. అది గాంచి సీత యనురాజుచామరగ్రాహిణి చేనిం జూచి యిట్లనియె.

*శ్లో. దోష మపి గుణవతి జనే దృష్ట్వా గుణరాగిణో న ఖిద్యంతే,
ప్రీత్యైవ శశిని పతితం పశ్యతి లోకః కళంక మపి.

అనిన విని భోజుండు తనమనంబునందు గుణపక్షపాతము గలుగువారు గుణవంతుం డగుమనుజునియందు దోషంబుం గాంచియుఁ వానియందు ఖేదజ్ఞానంబు నొందరు. మఱి గుణవంతుండగు చంద్రునియందుం బడియుండుకళంకంబునుసయితయుఁ ప్రీతిమెయిం గాంచువారువోలె దోషంబునుసయితఁ మాదరింతురు. అనునర్థంబుగలపద్యంబుచేత నీ చతురయగుచామరగ్రాహిణి కాళిదాసునియందు గుణంబులు గలవు; ఒక్కదోషంబునకుఁగా ఖేదబుద్ధి యొనర్పం జనదు; మఱి యాదోషంబును చంద్రునియందుఁ గళంకంబును లోక మాదరించుచందంబున నాదరింప నగు ననుభావంబు సూచితంబుచేసినయది. బళిరా! మెచ్చ వచ్చు దీనికవితాచమత్కారంబున కని యెంచి యాసీతకు లక్షవరహాలు బహుమాన మిచ్చి యితరకవులతోఁ గొంతతడవు సంభాషించుచుండి కొలువుసాలించి యంతఃపురంబు సొచ్చె. రా జంతఃపురంబు సొరఁగాఁ గాళిదాసుండు తనకు రా జొనరించినయవమాన మునకు మనంబున విషణ్ణత్వముం జెందుచుఁ దనగృహంబునకుం జనియె. ఏ మెల్లవారము సంతసంబున మామాయిండ్లకుం బోతిమి.

ఇట్లు రూపకవస్తువు ప్రవృత్తం బగుచుండ నది గాంచి సామాజికులలో నొక్క రుండైయుండునాస్తికుం డిట్లనియె.

* గీ. గుణముగలవారలందుదుర్గుణముఁగనియుఁ, ఖేదమొందరుగుణముల నాదరించు
సరసులమృతాంశుపతితమైవరలుచుండు, నాకళంకంబుఁగాంచరేయాసజనులు.

* శ్లో. యం యం నృపోఽనురాగేణ సంమానయతి సంసది
తస్య తస్యో త్సారణాయ యతంతే రాజవల్లభాః.

అని చెప్పిన నాసభాసదు లందఱును రాజు తా నెవని నెవని ననురాగంబుతో సభయందు సమ్మానించునో అట్టివారి నందఱను రాజునొద్దఁ జనువుగలవారు తఱుమం గొట్టుటకుఁ బ్రయత్నించుచుందురు అనునర్థంబుగల యీశ్లోకంబు ప్రకరణంబునకుం దగినది. కర మభినందనీయ మని కొనియాడిరి.

(రంగస్థలంబునందు.)

మయూరుండు. అట్లు విమానితుండై యింటికిం బోయినవానికి మఱునాఁడు గలిగినమహాసమ్మానంబు వినుము. ఆమఱునాఁడు రాజు కాల్యకృత్యంబులు నిర్వర్తించుకొని సభామండప మలంకరించె. పండితులును గవులును గాయకులును వందిమాగధబృందంబులును సమస్తప్రకృతులును సభాస్థలంబునకుం జేరిరి. ఏమును జని రాజుచే సత్కృతుల మై యథోచితాసనంబుల నుపవిష్టుల మైతిమి. కాళిదాసుం డొక్కరుండు రాఁడయ్యె. అందుల కేము సంతసించుచుంటిమి. అప్పుడు రాజు తనసేవకుని నొక్కనిం బిలిచి కాళిదాసునిం దోడుకొని రమ్మని మదలయిడ నాభటుండు వేశ్యాగృహంబునకుం బోయి కాళిదాసునిం దోడుకొనివచ్చె. దవ్వుల నఱుదెంచుచుండు కాళిదాసునిం గాంచి మహీపతి మహానందంబు నొందుచు నాసనంబుడిగ్గి ఓమహాకవీ! మన్మిత్రమా! యీదినంబున నేల విలంబంబుఁ గావించితి వని చెప్పుకొనుచు నాతని కెదురేగ్గి నైదాఱడుగులఱిగెను. రాజు తోడ నప్పుడు సభ యంతయు స్వాసనంబునుండి యుత్థితం బయ్యె. అప్పుడు రాజు తన కరకమలంబున నతనికరంబు పట్టుకొని తనసింహాసనం బుండుచోటికిం దోడ్కొని తెచ్చి యాయాసనంబున నాతని నుపవిష్టునిం జేసి తాను నతనియానతింగొని యాయాసనంబునం గూరుచుండెను. అది గని మామొగంబులు వివర్ణ్చాయంబులయ్యె. పూర్వము ప్రధూమితం బగుచుండునై రానలంబు మామానసంబులం బ్రజ్వలింపం దొడంగె.

ఇట్లు ప్రవృత్తం బగుచుండురూపకవస్తువును విని నాస్తికుండు సభికులం గాంచి యిట్లనియె.

గీ. అపరభారతి యనఁ దగునట్టిరాణి, యామహాకవియోగ్యత యరసి యుండుఁ
గాన భూనాథునకుఁ జెప్పి కరము కవిని, గారవింపంగఁజేసె నికామరక్తి.

అనిన విని సభాసదు లెల్ల నతనిసమయోచితప్రతిభావిశేషంబునకు మెచ్చుకొనిరి.

(రంగంబునందు)

---

క. నరనాథుఁడుసభలోనొరు, నరు నెవ్వనిగారవించునర్మిలిమీఱన్
దిరముగనాతనిఁదఱుమం, గరముప్రయత్నింతురధిపగౌరవకలితుల్

తారేంద్రుండు. మిత్రమా అనంతర మేమయ్యె? వృత్తంబుదెల్పుము. అట్టు తొలుదినంబున విమానితునిం జేసినయతని మఱునాఁడు నిరుపమసన్మానంబున గారవించుటకుఁ గారణం బేమియో? కని పెట్టితిరే?

మయూరుండు. అంతం గొంతతడవుండి మేము మాగృహంబులకుం బోతిమి. ఇందులకుం గారణంబుఁ దెలిసికొనుట కెన్నియో ప్రయత్నంబులు గావించితిమి. బహుదినంబులదనుక నిది యవగతంబు గాకయ యుండెను. కొన్నిదినంబులకు ముందు కళావతి యనులీలావతీదేవిపరిచారిక నాకడను సాహిత్యవిద్యాభ్యాసం బొనర్చి యతి చతురయై యాదేవికి విద్యావినోదకాలంబునందు వీణా వేణుమృదంగాదివాద్యంబులం దననేర్పేర్పడ సంతసంబు గల్పించి యారాణిమన్ననలు వడయుచు నుండునది గురుజనపాదాభివందనమునకుం జనుదెంచి నన్నుం గని నమస్కరించి యోగురూత్తమా మీరు పూర్వపురీతిఁ బ్రసన్నముఖారవిందంబుతో నుండమికిం గతం బేమొకో! యని యడిగిన నేను ఓకళావతీ! కాళిదాసుండు మాతో నేవిద్యయందును సరిపోలఁ డట్టివానికి భోజుండు తనయర్ధాసనం బొసంగి గారవించె; మఱియు నపరిమితధనరాసు లొసంగుచున్నవాఁడు; వేశ్యాలంపటుం డని కవియం దనాదరము సేయుచున్నవాఁ డిప్పు డిట్టివిశేషగౌరవంబునకుం బాత్రుం జేయ గతం బేమొకో; యీవిధంబునం బ్రవర్తింపఁ గతం బుండునేని యది నీకవగతంబయి యున్నం దెల్పు మన నాకళావతి యిట్లనియె. ఆర్యోత్తమా యిది యంతయుం లీలావతీదేవి కాళిదాసునియందుం జెందియుండునిస్సీమప్రేమభరంబున నయిన కార్యముగాని యితరంబునం గాదు చెప్పెదను వినుము. మీర లందఱును రాజకులసంచారనియుక్తులం గొని కాళిదాసుండు వేశ్యాలంపటుం డని రాజున కెఱింగించితిరి. ఆదోషంబు మనంబునం బెట్టుకొని రాజు కాళిదాసుని నుపేక్షింప సీత యనుచామరగ్రాహిణి తెలియం జెప్పియుం భూపతి మనంబునకుం దెచ్చుకొనక కాళిదాసునితో సంలాపంబు సేయక కొలువు చాలించి యాదినంబున నిత్యకృత్యంబులు దీర్చి లీలాదేవి గృహంబునకుం జని కరము ఖిన్నుండై యుండెను. దేవియుం ప్రాణనాథ! మీమొగంబు శారదపూర్ణిమాచంద్రసుందరంబై యుండునది యిప్పుడు నీహారావృతమగు కమలంబువోలెఁ గానుపించుటకుం గతం బేమి? యని యడిగెను. అందులకు రాజు దేవిం గాంచి యోలీలావతీ! కాళిదాసుండు సకలకవికులవతంసుండు; ఇట్టియీమహనీయుండు సర్వకాలము వేశ్యాలంపటుండై యుండుటకుఁ గడు ఖేదపడుచున్నాఁడను; ఈదిన మాతనిని సభాస్థలంబునం బల్కరించుకొనక యవజ్ఞఁ గావించితిని అని చెప్పెను. అది విని లీలావతి యిట్లనియె. దేవ! ప్రాణనాథ! నీ వెల్లయర్థంబుల నెఱింగినవాఁడవు.

1శ్లో. స్నేహో హి వర మఘటితో న వరం సంజాతవిఘటిత స్స్నేహః
హృతనయనో హి విషాదీ నవిషాదీ భవతి సఖలు జాత్యంధః.

అని చెప్పఁగా భోజుండు తనమనంబున నీదేవి స్నేహము సేయకుండుట యుత్తమము. స్నేహముచేసి యెండియు దాని విఘటింపఁజేయుట యుత్తమంబు గాదు. కొన్ని దినంబులు కన్నులుండి యవి చెడిపోయినవాఁడు దుఃఖంబుం జెందును గాని జాత్యంధుం డొకించుకయు విషాదంబు నొందఁ బోఁడని వచించినది. దీనివలన నీకాళిదాసునియెడ స్నేహంబు చేసి యున్నవాఁడ విప్పుడది విడనాడుట విషాదకరంబని సూచింపం జేయుచున్నది. ఈదేవిభావంబును రసికజనాదరణీయంబ యని యనుకొని యోప్రాణదయితా! నీచెప్పినది యొప్పునైనను నా కతనియందుం గలదోషంబుం దలంప మనంబు సమాధానపడక యున్నది. అనఁగా దేవియు నోప్రాణనాథ! కాళిదాసుండు భారతీదేవి పురుషావతారంబుగాని సాధారణుఁడు గాఁడు గాన గవులకందఱికన్న నాతనిం గరము విశేషముగ గారవింపుము దోషం బొండు గల దని యనాదరింపకుము.

2శ్లో. దోషాకరోపి కుటిలోపి కళంకితోపి మిత్రావసానసమయే విహితోచ్ఛ్రయోపి,
చంద్రస్తథాపి హరవల్లభతా ముపైతి నైవాశ్రితేషుగుణదోషవిచారణా స్యాత్.

అని చెప్పిన విని భోజుండు తనమనంబున నీదేవి యీపద్యంబుచేత దోషాకరత్వంబుండియుఁ గుటిలత్వంబు గల్గియుఁ గళంకియై తోఁచినను మిత్రవినాశకాలంబున వృద్ధిం జెందుచుండినను చంద్రుండు హరుని కిష్టుఁడై యున్నవాఁడు. ఆశ్రితులందు గుణదోషవిచారణ యుంచఁ జనదు. అని కాళిదాసుం డాశ్రితుండు గాన నాతనియందు దోషముండినను హరుఁడు దోషాకరత్వాది దుర్గుణములు గలచంద్రునియందుఁ బ్రియంపడు విధంబున గుణదోషవిచారణ సేయక ప్రీతుండవై యుండం జనునర్థము సూచితము చేసినది. ఇది యత్యాదరణీయం బయినవచనంబ. అని తలంచి యోప్రాణవల్లభా! నీనుడివిన యర్థంబు సత్యంబ. నీచెప్పినయట్ల యెల్లి కాళిదాసుని సంతోషపెట్టెదను. అని చెప్పి యానాఁడు లీలావతితో సుఖంబుండి మఱునాఁడు సభకు వచ్చి లీలాదేవి చెప్పిన చొప్పునన జరిపెను.

కాళిదాసునికి రాజు తనయర్ధాసనం బొసంగి గారవించిన దాదిగ మీరు రాజసభకువచ్చినవారు గారు. కాన వృత్తం బెఱుంగరు. లీలావతిసెప్పినవచనంబులను రాజు

---

1 క. సెయ్యము సేయమివరమగు, నెయ్యంబొగిఁ జేసినీఁడ నెంజిలి వెరుగుక్
చయ్యనఁగన్నులువోయిన నయ్యదిజాత్యంధతార్తి కధికముసూవే.

2గీ. కూర్మి దోషాకరుండయ్యుఁ గుటిలుఁ డయ్యు,నోలి మిత్రావసానకృతోచ్ఛ్రయుండునై కళంకియు నగుశశి హరుఁడు గూర్చు, నాశ్రితులయందు గుణదోష మరయజనదు.

దాను గాళిదాసునియం దమితానురాగంబునం జెలంగుచున్న వాఁడ. కవిమాత్రము కతిపయ దినములనుండి రాజసభకు వచ్చుట లేదు. ఈకవిపండితసంఘమువారు కొందఱు గాళిదాసుండు మంగలి యని వెల్లడిచేసిరి. ఆకారణమునన యుండంబోలును.

అని చెప్పి యాకళావతి యోకవివరా! రాజకులంబునకుఁ గ్రక్కునం జనవలయు; నేఁ బోయివచ్చెద నని వీడ్కొని వెడలిపోయెను.

అని మయూరుండు పల్కుట విని మీఁదటిరూపకవస్తువు తనమనంబునకు రాఁగాఁ సామాజికులలో నుండునాస్తికుం డిట్లనియె.

గీ. కామినియు సాధుభావంబుఁ గాంచి యొకనిఁ
బ్రేమఁ గీర్తించెనేని యారామయందు
దోషచింతన మొగిఁ జేయఁ దోఁచుఁ గాని
కాదు భావంబు విమలంబు కాంతలందు.

అని చెప్పిన సభాసదు లందఱును విని లీలావతీదేవి కాళిదాసునియందుం గల సుగుణవిశేషంబులంబట్టి యాతని నుగ్గడించినయది. ఇది యాదేవియందు దోషంబు నారోపింప హేతువు గాఁబోయెడిని. అనుభావం బీతండు సూచింపం జేయుచున్నాఁడు. వీని బుద్ధిచతురత చతురజననందనీయం బని చెప్పిరి.

రంగస్థలంబునందు

తారేంద్రుండు. మయూరుఁడా! "భోజునికిని గాళిదాసునికి నిఁక నెన్ని భేదంబులు గల్పించినను లీలావతీదేవి తనకుం గవియందుం గలగౌరవజ్ఞానంబున నడంచి పయింబయి నాతనియందు రాజునకుం బ్రేమభరంబును బెంచుచుండును. లీలావతీకాళిదాసులయెడ దోషజ్ఞానంబు భూపతిమానసంబునందుఁ గల్పించినం గాని కాళిదాసుని వెడలనడుచుటకుం దరంబు గాదు. తదనుకూలం బయినకపటం బన్వేషింపం జనును. ఇది యిప్పుడు సేయం జను కార్యంబు" అని నీయభిప్రాయము గన్పడుచున్నది. మాళవపతి శాలివాహనునిపైఁ బ్రయోగించినయడిదంబు వెండియుం వచ్చి యావిక్రమాదిత్యునివక్షంబుఁ బగిలిచినట్టులు మహాపతివ్రతాతిలకంబునకును మహనీయుం డగుకవికిని గల్పింపంబోవు నిష్కృతి సుకృతహీనులగు నీవిప్రులకు నిక్కృతిం బొరయింపకపోదు.

విద్యావినోదుఁడు. ఓతారేంద్రా! వైరివర్గంబును జయింపం గడంగువాఁడు శత్రువులందుం గలసుగుణంబులను జేకొని పాపచింతనంబు సేయుచుండినఁ గార్యంబు గడమట్టఁగలదె! అని సుడివి పండితులం జూచి యెల్లవారికిని లీలావతీకాళిదాసులయందు రాజునకు భేదంబు పుట్టించుట యభిమతంబకదా! యని యడిగిన వార లందఱు నభిమతంబయని పల్కిరి.

మయూరుఁడు. మనము సేయంగడంగుకపటంబునకు నిప్పు డీరాణి కవియందుఁ ప్రేమభరంబున నతని నుగ్గడించినవిధంబును నయితము దోడ్పడి రాజునకు లీలావతీకాళిదాసులయందు భేదబుద్ధిని దృఢము సేయ ననుకూలింపం బోయెడిని. ఇది మన ప్రయత్నంబునకుం గరం బనుకూలంబకాని ప్రతికూలంబు గాదు.

మదనుఁడు. ఓకవికులవతంసంబులార! యిందు కనురూపమగు వృత్తంబు లీలావతీకాళిదాసులయందు భోజునికి సంశయంబు గల్పింప ననువై యొప్పునది యొకటి సంప్రవృత్తంబై యున్నయది. అది యెద్ది యంటి రేని! ఈధారాపతియుఁ నతనియంతఃపురమహిళాజనంబు నన్యోన్యప్రణయగౌరవంబులం గరం బనితరసులభానుకూల్యంబునం జెలంగుచున్నవారది యెల్లరకు సువిదితంబ కదా! అందు,

సీ. పద్మవాసినియట్లు భక్తిమై భర్తకుఁ దాని శుశ్రూష మోదమునఁ జేయుఁ
భారతీసతిభాతిఁ బతిని నానావిధసత్కళా సారస్యసరణిఁ దేల్చు
రతివిలాసినిరీతి రమణుని బహువిధరతికళాలీలానురక్తుఁ జేయుఁ
బౌలోమివిధమునఁ బ్రాణనాథు నపారభోగభూతి ముదంబుఁ బొందఁ జేయుం
గీ. నిట్టిసుగుణగణంబులపుట్టినిల్లు, గానఁ దక్కినకాంతలకంటెఁ గరము
భర్తృవాల్లభ్యమును గాంచి ప్రాణదయిత, యగుచు లీలావతీదేవి యతిశయిల్లు.

ఇట్లు లీరసికశిరోమణు లన్యోన్యప్రణయరసభరపరిపూరితాంతరంగులై యకఠోరతారుణ్యసుఖంబుల ననుభవింపుచు ననుపమానప్రమోదమేదురంబుగఁ బ్రవర్తించుచుండిరి అట్లుండ నొకప్పుడు.

సీ. మందహాసాంకూరసుందరంబై మించుముద్దులుగుల్కు నెమ్మోముదాని
నిఱుపేదతనమున కిరవై నయిరవయి నకనకల్గుడుచు నెన్నడుముదానిఁ
దప్తహాటకనవద్రవము లొల్కుచు నింపుదీపించుకులుకుమైఁదీఁగెదాని
వాలారుబెళుకురువారంపుఁజూపులఁ దమిఁగొల్పునేత్రమీనములదాని
గీ. సకలసౌందర్యసంకేతసదన మగుచు, లలితసౌభాగ్యసారైకనిలయ మగుచు
బరఁగులీలావతిని జిత్రఫలక మందుఁ, దాను వ్రాయించి చూడంగఁ దలఁచి విభుఁడు.

ఈధారానగరంబున నున్నరంగకారుం డనుచిత్రకారునిం బిలిపించి తనయభిప్రాయం బాచిత్రకారునికిం దెల్లంబుచేసి లీలావతీదేవిసౌందర్యంబంతయు నంగప్రత్యంగసౌష్ఠవంబుతోఁ దేటపడం దెలిపి వానికి నోరీ! యీలీలావతీదేవికింగల రూపరేఖాదులు నానుడి వినవిధంబునం జిత్రరూపంబున నించుకేనియు భేదంబుం బొరయక సర్వవిధంబుల సమానమై యుండునట్లు లిఖించుకొని రమ్ము. ఇంచుక యెక్కువయొండెఁ దక్కువయొండెఁ దీననుం డంజన దని కట్టడ చేసి యారంగకారుఁ రసికిం బెక్కుధనంబు లొసంగి యప్పటప్పటికి విచా

రించుచున్నవాఁడు. ఆచిత్రకారుండు కడు సమర్థుం డయ్యె నతిరూపవతియగు నాసతి నిరవద్యంబగునంగప్రత్యంగసౌష్ఠవంబు చిత్రరేఖయందుఁ బొందించి వ్రాయుచుండం గొంతకాలంబును గడచె. నాకు నారంగకారుండు మిత్రుం డగుటం జేసి యప్పుడప్పు డేను నాతనియింటికిం బోయి వచ్చుచుందును. చిత్రరూపసౌష్ఠవంబును గాంచుచుందును. అవ్విధంబునన గతదినాంతంబునందుఁ జిత్రకారుని నిలయంబునకుం బోయియుండి తత్సమానీతంబయిన లీలావతీచిత్రఫలకంబును నయనానందకరంబుగఁ జూచుచుండి యాచిత్రరేఖయందు మథితామృతఫేనపిండపాండరం బైనజిలుఁగువలువలోనం బొడసూపునవధీరితకనకరంభాస్తంభసంరంభారంభంబు లయియొప్పునూరుకాండంబులం దొక్కట నొకయెడఁ దిలప్రమాణంబగు నీలంపుమచ్చ యొకటి గనుపట్టినం గనుంగొని యాచిత్రకారుని నిది యియ్యెడ నున్న దని నీ కెట్లు తెలిసె; భోజుండు దెల్పఁగా లీలావతియంగప్రత్యంగసౌష్ఠవంబునుదద్గతలక్షణంబులును దెలిసికొన్నవాఁడవు; ఈలక్షణంబియ్యెడ నాదేవికున్నట్లు రాజువచించె నని నీవు నా కింతదనుకఁ జెప్పినవాఁడవు గావు. ఇ దేలకో యిట్లు వ్రాసితివి; ఇది గాంచెనేని రాజు నీయందభిప్రాయభేదంబుం గాంచి రోసగించుకొనక పోఁడు; ఇది యేల వ్రాసితి వని యడిగిన నాచిత్రకారుం డిట్లనియె. ఓవిద్వద్రత్నమా వినుము. ఏను భోజభూపతియాజ్ఞానుసారినై యాయేలిక చెప్పినచొప్పునన యీలీలావతీచిత్రరేఖ వ్రాసి పూర్ణము గావించితిని. సర్వావయవసౌష్ఠవంబు రాజుసెప్పినవిధంబున నమర్చితిని. శారదచంద్రికాధవళం బైనదుకూలంబు వ్రాయం గడంగి మఱచి నల్లనివర్ణంబుఁ దీర్చు తూలిక నెత్తికొంటిని. అదిచెదరి యానల్లనిచుక్క యాతొడలోఁబడినయది. అంతం దటాలున నే నాక్షిప్తహృదయుండ నై యిట్లగుటకు వగచుచు నది యాయూరువు కందం బై యుండుటవలనను, తుడిపితినేని వర్ణసాంకర్యంబు గల్గి చిత్రరేఖకుం గలసొంపు రాణింప దని తోఁచుటవలనను జేయునదిలేక చింతాకులస్వాంతుండనై యుంటిని. అప్పుడు మహాకవికాళిదాసుండు వీథివెంటం జనుచు నాయింటికే తెంచి వాకిటనిలిచియుండునన్నుం గాంచి యోరీ రంగకార చిత్రఫలకంబువ్రాఁత సంపూర్ణ మయ్యెనా? యని యడిగెను. అప్పుడేమనోగతవేదనచే నేమియుఁ బల్కక యుంటి. ఏల దీనాననుండవై యుండెదవు? చిత్రఫలకంబున నేదేని విపర్యయంబు గల్గెనా! ఏది చూతము! తీసికొని రమ్ము చిత్రఫలక! మ్మనిన నేనును ఫలకంబుఁ దెచ్చి చూపి యూరుమధ్యపతితంబగు నల్లనిచుక్కం గాన్పించి యదిపడినవిధంబుఁ దెల్పి చింతించితిని. అప్పుడు కవి యోరీ రంగకార యీనల్లనిచుక్క తిలప్రమాణం బైనది యాదేవితొడయం దుండునదే! రాజది యెఱుంగఁడు గాన నీకుం జెప్పఁడయ్యెను. దైవవశమున నీమచ్చ యిచ్చటం బడినయది. దీనినిగుఱించి నీవు చింతం గూఁకుము. దీనిని పరీక్షించి నీకు రాజు విశేషసన్మానంబు సేయంగలఁడు. రాజు నిన్ను నది నీ వెట్లెఱిఁగితి వని యడిగినచోఁ గవిసెప్పెనని వచింపుము. అని చెప్పి వెడలిపోయె,

ఆమహాకవివచనంబులు విని యవి తథ్యంబులై యుండవపో వని నిశ్చయించి మానసంబున నేను సంతసంబు నందుచు నీఫలకంబు వ్రాసి ముగించితిని. అనియాచిత్రకారుండు సెప్పె.

అక్కాలంబున రాజసంప్రేషితుండగు పరిచారకుం డొక్కరుం డయ్యెడకుం జనుదెంచి యోరీ! రంగకార లీలావతిచిత్రఫలకంబు పూర్ణంబుగ వ్రాయంబడిన దని మహీపతి విని యాఫలకంబుతోడ నిన్నుం దోడ్కొనిరమ్మని నాకు ముదలయిడి పంపినవాఁడు. రాజాజ్ఞయొనరింపు మని చెప్పఁగాఁ జిత్రకారుండు చిత్రఫలకంబుం గైకొని నన్ను వీడ్కొనిచనియె. కాళిదాసుండు సెప్పినది యథార్థం బగునేని యాకవియందు మానని సంశయంబు భూపతికిం గలుగకపోదు. ఇది రాజు క్రీడాసమయంబునందుఁ గడచినరాత్రి పరీక్షించియుండును. మచ్చయుండుట తథ్యమో యతథ్యమో తెలియకయున్నది. అతి గంభీరప్రకృతిగానఁ గారణంబులు పెక్కులు గనుపట్టినంగాని యర్థనిర్ణయంబు సేయఁడు. మానసమునందుమాత్ర మతని కీమెరమెరపాటు జనించియుండును. ఇదియు లీలావతీ కాళిదాసులయెడ భేదంబు పుట్టింపం గారణంబు గాఁగలదు.

మయూరుండు. ఓకవులార! కాళిదాసుండు లీలావతితోడ నుండుమచ్చను దెలిసి చెప్పెంగాన రాజునకు లీలావతీకాళిదాసులకు నిగూఢంబుగం బ్రణయకార్యంబు సంప్రవృత్తం బగుచుండు నని మానసంబునం దోఁచక పోదు. ఈభావంబును దృఢపఱుప మన మనుకూలప్రయత్నంబునం గపటోపాయంబు లొనర్పం జనును. ఏతదర్థము మనము రంధ్రాన్వేషణము సేయుచుండవలయు. భువనేశ్వరీదేవాలయమునకు సాయంసమయసేవార్థులు నాగరజనంబులు చనుదెంచువేళ యయ్యెను. మనము నింక నియ్యెడ నుండఁ జనదు. ఇందులకు సమీపమున నుండుకమలసరోవరంబునకు సాయంసమయమజ్జనార్థ మరిగినట్లు తత్ప్రాంతదేశసంచారాదులు గావించి యిండ్లకుం బోవుదము. మఱియు రేఫణప్రముఖు లీదినంబునం గొన్నికపటంబులు సల్పి రాజకులంబునకుం జని యున్నవారు. వారలు సేయునికృతియు మనకార్యంబునకుఁ దోడ్పడవచ్చు. అనుచు నిష్క్రాంతు లైరి.

నాటకచ్ఛాయయందుఁ బ్రథమాంకము సంపూర్ణము.

---

## ద్వితీయాంకము.

అంతం దరంగవతి ప్రవేశించి. (సవ్యాకుల యగుచు.) ఏ సెల్లప్పుడును భోజభూపతి శయనాగారాధికృతనై యయ్యెడన యుండుదాన; నీదినము లీలాదేవిదర్శనార్థంబారాణి కడకుం జని శరచ్చంద్రపూజార్థము భువనేశ్వరీమందిరపశ్చాద్భాగంబున నుండుకమలసరోవరంబునం దోఁచినపుండరీకవారంబులు గోసితెర నాదేవిచే నియోగింపంబడి యాసరో

పరసకాశంబునకుం బోయియుంటిని. తన్నిమిత్తంబునం జేసి మనంబునన్నైనం దలంపరాని మహాపాతకంబొండు సేయం బాల్పడవలసివచ్చె. కట్టా! దైవమా! యెట్టికఠోరంపుంబనికి నన్నొడిగట్టించితివి. తీర్థోదకంబులును వహ్నియు నేపరమపతివ్రతాతిలకంబుసంస్పర్శంబునం బావనత్వంబుం జెందునని తలంపంజను; నట్టిభూభువనాలంకారంబునందా? దోషంబుగల్పింపవలసివచ్చె. హా! విధీ! యొకవంకం గనుంగొనిన ననేకబ్రాహ్మణవధపాతకంబు, నొకవంకం గనుంగొనిన మహాపతివ్రతాతిలకంబున కవచనీయం బయినదోషకల్పంబు సేయుం మహాపాపంబును గలుగనున్నది. ఏల యీదినమున దేవీదర్శనార్థం బరిగితిని. ఏల యీరాణి నన్నా సరోవరంబున కంపె. ఏల నేను పుండరీకషండంబుం గొని రా నయ్యెడ కరిగితిని. అట్లరిగినదానను నలుదెసల నవలోకింపక పోయినకార్యంబుఁ దీర్చుకొని యేల రానైతిని. ఆహా! ఆబ్రాహ్మణులు సేయుకపటం బారయ వారలకడ కే నేల పోతిని. బ్రాహ్మణు లని నమస్కరింపం బోయినదానను. తత్పాదాభివందనంబు సేసి తక్షణము మరలి రాక వారలవైవర్ణ్యకారణం బేల యడిగితిని! అడిగినదాన నంతటితో నొప్పరికింపక వార లోతరంగవతి! మామనోగతం బగుదుఃఖంబుం బోకార్ప నీవ వలంతివి; ఇందులకు సమ్మతించెదవేని వక్కాణెదము అని యడిగినందు కే నేల యట్లకానిం డని సమ్మతించితిని. కట్టా! ఆవిప్రులు సేసినకపటం బేమందును. సశపథంబుగ నాచే నొప్పించిరి. ఆవిప్రులంతటఁ గడు బెట్టిదంపుంబని నాతలపయిం బెట్టిరి. అది విని యేను వారలదుర్వ్యవసాయంబున కేవగించుకొనుచుఁ గడుఁబాపావహంబగు కార్యంబు గాన దానికి మనంబున నులుకుచు నామాతృజనతుల్య యగుపతిభక్తయందా! యిట్టికఠోరాపరాధంబు సేయుమంటిరని వారలం దిట్టుచు విప్రులై పుట్టి యిట్టిరట్టడిపనులకుం గడంగితిరే యని దూఱు వెట్టుచు పట్టరానిదుఃఖభరంబున నేడ్చుచు నీదుర్వ్యవసాయనిర్బంధంబుననుండి నన్ను విముక్తం జేసి రక్షింపుఁ డని వారలయడుగులపయి ప్రాలి వేడుకొంటిని. నావిధివైపరీత్యంబు వారలకు మహాకఠోరమతిఁ గల్పింపఁ "దొలుత నీ వేల యొప్పుకొంటివి; ఒప్పుకొని కాదనినం బోవునే! యిందఱబ్రాహ్మణులకుఁ బ్రియం బైనయీకార్యంబు నీ వొప్పరికించితివేని ప్రాయోపవేశంబుఁ గావించి యే మందఱము మృతి నొందంగలవారము; అనేకబ్రాహ్మణవధ మహాపాతకంబు నీకుం జుట్టుకొనును. ఈబ్రాహ్మణహితంబునకుం గడంగి నీ వీకార్యంబవశ్య మనుష్ఠింపవలయును. అని సాకలికఠినంబుగఁ గట్టడియిడినవారు. ఇది దాటిన బ్రాహ్మణవధమహాపాతకంబగును. ఒనర్చిన మిత్రద్రోహపరమపాతకంబగును. ఒక్క త్రుటిలో విధి నన్నిట్టిసంకటంబునం జిక్కించె! అక్కటా! నాప్రాణపరిత్యాగంబుం జేసికొనినయైన నీసంకటమువలన విముక్త నగుదాన నని యెంచెదనేని యప్పటికిని విముక్తిం గాంచు విధంబు గానరాదు. కట్టా! యేను మానసంబున నొక్కటి దలంచుకొనిపోవ మఱియొక్కటి సంప్రాప్తంబయ్యెనే! ఏమి సేయుదు! వీరలయాలోచనంబు రాజకులమున నేరికేనవిష్ట

సంపాదకం బగునేని యది తెలిసికొని తత్ప్రతివిధానంబునకుం బ్రయత్నింప నెంచియే నఱుగ నేన యాయనిష్టంబు సేయ వలసివచ్చెను. ఇఁకఁ జేయక తీరదు.

అని యొకింతతడవు చింతాక్రాంతయై నిర్ణయించి చేయంగలకార్యంబు నిశ్చయించి నట్లభినయించుచు భూకాంతునిశయనాగారంబునకుం బోయెదను అని యా తరంగవతి నిష్క్రాంతయయ్యె.

## ప్రవేశకము

---

చంద్రశాలయందు శయనస్థుండై భోజుండు ప్రవేశించుచున్నాఁడు.

భోజుఁడు. (చింతించుచు.) ఔరా! యేమి యీయాశ్చర్యము! నేను రంగకారునికి లీలాదేవిచిత్రఫలకంబు లిఖింప ముదల యిడితిని. ఆచిత్రపటంబునందుఁ దదూరుతలంబున వర్ణతూలిక సెదరి నల్లనిమచ్చ యొకటి పడుట యేమి? అందుకై వగచుచున్నయాచిత్రకారునితోఁ గవి యీమచ్చ యాదేవితొడ నుండునదే! దానిని దుడువం జనదు; అది దైవాయత్తంబుగఁ బడవలసినదియే పడినది యని వచించుట యేమి? పూర్వదినంబురాత్రి వెన్నెలబయట నాదేవితోఁ గ్రీడించుచు నేను కరము గుఱితించి చూడఁగా నాదేవిలోఁ దొడయం దీమచ్చ యుండుట యేమి? ఇన్నిదినములదనుక నిది నేసుఱుతుగాఁ జూడక యుండితి ననవచ్చు! ఇది కాళిదాసుని కెఱుకపడుట యెట్లు? ఈయర్థంబు కడు దవ్వు చింతించినను ఇట్టి దని నిర్ధారణ సేయ ననువుపడక యున్నది. లీలావతీదేవియందు దోషంబుఁ దలంతు నన్ననో! యది యొకించుకయు సంభవింపదు. ఈరాత్రి యంతః పురమున కేరానగునా! యీయర్థంబు దేవి నడిగి రమ్మని తరంగవతిని కొంత ప్రొద్దుండ నప్పుడ పంపితిని. అది యింతదనుక రాకయున్నది. కారణం బేమొకో యెఱుంగను.

తరంగవతి. (ప్రవేశించి.) మహారాజ! వందనంబు రచించెదను.

భోజుఁడు. ఓసీ! తరంగవతి! లీలావతీసౌధంబునుండి రా నేల యింతతడ వయ్యె?

తరంగవతి. దేవ! మహారాజునాజ్ఞను తలమోచుకొని దేవీసౌధంబునకుం బోతిని. దేవియుం శారదచంద్రపూజనంబు సల్ప నీదినంబున నాదృతనియమయై భుజింపకయ వ్రతానుష్ఠానంబున కనుకూలకార్యంబులు సేయించు నన్ను భువనేశ్వరీదేవాలయంబునకుం బశ్చిమదిశ నుండుకమలసరోవరంబునం గలపుండరీకంబులు గోసికొని రమ్మని యానతి సేయఁ దదాజ్ఞ ననుష్ఠింపం జని కమలంబులు దెచ్చి యిచ్చి యిదె వచ్చుచున్నదాననుు.

భోజుఁడు. అట్లయిన నాదేవి వ్రతానుష్ఠానంబున నుండుటం జేసి యే నయ్యెడ కుంజన నావశ్యకంబు లేదు. మానసంబును నిరంతరచింతాదంతురితంబై సుఖం బెడవాసి యున్నది. ఇయ్యెడన చంద్రశాలయందు నిద్రించెదను. అని శయనంబునం బరుండెను.

తరంగవతి. రాజు పరుండినశయనంబునకుం గుఱంగటనమర్చియుండు ముక్కాలిపీటపయిం గూరుచుండి యతనియడుగులొత్తుచుండె. రాజును జింతాకులస్వాంతంబుతో నాలోచించుచు నించుక నిద్రఁగూరెను.

కొంతతడవు నిదురించి రాజు నీషజ్జాగరూకతఁ జెందుచుండగాఁ జరణసంచలనాదుల నెఱింగి తరంగవతి తనమనంబునందు రాజిప్పుడు నిదురఁగూరి మేల్కొనుచున్నాఁడు. ఇప్పుడు నిదురించుదానియట్లుగన్నడి బ్రాహ్మణహితంబుఁ దీర్చెదను అనియనుకొని యాశయనంబు దగ్గఱ నుండుకంబంబుపై సానుకొని నిద్రయభినయించుచున్నది. రాజు నిదురలేచి తరంగవతిం గాంచి యిది కార్యనిర్వహణ శ్రమభరంబున నిద్రించుచున్నదని యనుకొని దేవీగతంబగుపూర్వోక్తచింతతో నుండెను. అప్పుడు తరంగవతి యవిస్పష్టాక్షరంబుగాఁ గలవరించునదియుం బోలె నిట్లనియె. ఓసీ! కాళిదాసుం డెంతదురాత్ముఁడే! అనిన నది విని రాజు ఓసీ! తరంగవతీ! మేలుకొనియుండెదవా! అని రెండుమూఁడుమాఱు లడిగినను బలుకక నిదురించునదియుంబోలె నుండిన భోజుండు నిది నిద్రావ్యాకులయయి కలవరించుచున్నది; ప్రాయికముగ ననుభూతార్థంబులు స్వప్నంబున స్ఫురించెడిని; ఇవి వినందగినవియ; అని యనుకొని యుండగాఁ దరంగవతి మఱియుం గొంతతడవునకు ఆపాపాచారుండు స్త్రీవేషంబు ధరించుకొని యంతఃపురంబు సొచ్చి,, అని యూరకుండెను. రాజు విని చింతాకులస్వాంతంబుతో నిది యపధ్వనిగ నసమాప్తార్థం బగు వాక్యంబు వచించెను; దీనిని నిదురలేపినచో నీరహస్యార్థంబు నెఱుంగ ననువుపడదు; నిద్రావశంబున నిది మఱియు నేమేనిఁ జెప్పవచ్చునని యూరకుండెను. తరంగవతి మఱియుం గొంతతడవునకుం బూర్వోక్తప్రకారంబుగ "అన్యాయంబుసేయుచున్నాఁడు; దేవియు నిట్లయ్యెను" అని వచియించె. అది విని రాజు వేదితవ్యం బగునర్థంబు నెఱింగితిని. ఇదికలవరించుచున్నదా! లేదా! యీయర్థంబు నిర్ణయించుకొనికాని యీతదుక్తార్థంబు నిశ్చయింపం జనదు అనియనుకొని, తరంగవతీ! తరంగవతీ! అని పలుమాఱు పిలిచియుం బలుకక యుండఁగా నిది గాఢనిద్రం జెందినయది యని దానిం బిలుచుట మాని తనమనంబున నిట్లనుకొనియె. తఱుచుగ జాగ్రద్దశయం దనుభవించినయర్థంబునే కలలో వచింతురు; గాన నివి యథార్థంబులు. స్త్రీవేషంబుతోఁ గాళిదాసుం డంతఃపురంబు సొచ్చుట సంభావ్యమైనదియే. ఇది యిట్లు జరుగుచుండ నిన్నాఁడు లీలాదేవిలోఁదొడలోనిమచ్చ యెట్లతని కెఱుంగం బోలు. ఇందుచే నితఁడు లీలాదేవితోఁగలయుచున్నాఁడని నిర్ణయింపం జాలియుండియుం నామనంబాయిరువురయపరాధముఁ బ్రత్యక్షమునం గాంచుదనుక విశ్వాసంబుం జెందకయున్నది. ఎల్లి యాయిరువుర నొకయెడకు రప్పించి వారలయాకారవికారంబులు పరీక్షించి శిక్షింప నగు.

అని తలంచి తరంగవతిని నిద్రలేపి యోసీ! తరంగవతీ! యిప్పుడు రాత్రి నాల్గవ యామంబు ప్రవృత్తం బగుచున్నది. ఈరాత్రి నిదురరామింజేసి శిరోవేదన యధికమయి నది. నీవు లీలాదేవి యంతఃపురమునకుం బోయి యాదేవితో రాజుశిరోవేదనాపీడితుండై యుషఃకాలంబునంద పథ్యంబు భుజింపం గోరెడిని; ఉచితమగు పథ్యముం దీసికొని రానాజ్ఞయిడె నని చెప్పుము. ఆయుషఃకాలంబునకుఁ గాళిదాసుని నియ్యోడకుం దోడ్కొని రమ్ము అని మొదలయిడి దానిం బంపి కాల్యకృత్యంబులు జరుపం బోవలయు నని నిష్క్రాంతుడయ్యెఁ.

నాటకచ్ఛాయయందు ద్వితీయాంకము సంపూర్ణము.

---

## తృతీయాంకము

రతిసేనయుం రాగసేనయుం బ్రవేశించిరి.

రతిసేన. (శోకముతో.) ప్రియసఖి రాగసేనా! ఏమే యీయత్యాహితము? మనదేవి లీలావతితో రాజు సంభాషణాదులం బరిత్యజించి యీయింతి యంతఃపురంబునకుం బోక యీదేవి యెన్నిమాటలుసెప్పిపంపినను బ్రత్యుత్తరమీక యూరక చింతాక్రాంతుండు వోలె నుండెడిని. ఆదేవిమాటయన్నం జవదాటకయుండువాఁ డిప్పు డివ్విధంబున దేవి యం దుపేక్షించి యుండుటం గనుంగొనిన నేదియేనొకదోషం బాపతివ్రతాతిలకంబునం దలంచియున్నవాఁడని తోఁచెడిని. ఒకప్పుడైన నిట్టిభేదము మనదేవికిని రాజునకును గలి గినదటే! ఎట్టి మహాపాపులుం రాజున కేమేమి దోషంబులు సెప్పి యిట్టిపాపంబున కొడి గట్టికొనిరో?

సీ. అతిథుల సురలఁ దా నర్చించువేళల శిష్యయై పనులెల్ల జేయుఁచుండు
రాజతంత్రముల స్థైర్యంబుతో మంత్రియై కష్టంబులను వేగఁ గడపుచుండుఁ
కడురోషయుక్తుఁడై కాంతుండు దోఁపంగ ననువున ధవుని శాంతునిఁగఁ జేయు
నార్తుఁడై భూనాథుఁ డాయాస మొందంగ బంధువై యూరార్చి పట్టువఱచు
గీ. నసదృశాసేచనక మైనయట్టిరూప, గరిమ నానందభరితహృత్కములఁ జేయు
చెలిమి నిలుందీర్చుచుండునీకలుపకంటి, యేమియపరాధము రచించె నింపు దొఱఁగి.

ఈదేవి యనుగుణప్రవర్తనయై వర్తించుటకుం దగినవిధంబున భూకాంతుండును గర మాదేవియం దనురాగపూరితాంతఃకరణుండై యింతదనుకనుండినవాఁడు.

సీ. ఎట్టిశ్రమంబైన నేణాక్షిఁ గనుఁగొన్నఁ గడుసుఖం బందు హృత్కమలమందు
రాజ్యతంత్రముల సారాసారచ్చంద్రముఖికిఁ దెల్పక కార్యముల నొనర్పఁ

డాత్మశుశ్రూషాదు లానిరవద్యాంగి సల్పినఁ గాని సంతసము గాంచఁ
డాఖేటకాదుల కరిగి వియోగాగ్ని సంతపించుచు వచ్చి సకియఁ గూర్చు
గీ. సురుతరప్రేమభరమున కుబ్బుచుండు, శీలసౌభాగ్యములకు వోఁ జాల నలరుఁ
బరమపతిభక్తి కనురాగభరితుఁ డగును, రసికతాచాతురికి లోఁ గరంగుచుండు.

ఓసీ రాగసేనా! సర్వకాలము సకలశోభనపరంపరలవలన నతులామోదంబు నొసంగుచుండునీ రాజమందిరంబిప్పు డిట్టు లనుపమానానూనదీనతాభాజనంబై యుండుట కరము దుఃఖకర మయి యుండలేదా? వినుము.

సీ. ఎయ్యెడఁ గనుఁగొన్న నెలమి వీణావేణుగానంబులను నింపుఁ గాంచువార
లేచోటఁ గనుఁగొన్న నెపుడు మంగళకార్యసంచయంబులను గావించువార
లెయ్యెడఁ గనుఁగొన్న నేలికపనులకై కడు సంభ్రమమునఁ బోఁ గడఁగువార
లెయ్యెడఁ గనుఁగొన్న నెలమి లీలావతీదేవిసౌధమున వర్తించువారు
గీ. గలిగి యీరాజనగ రధికప్రమోద, కర మగుచు మించి కలకలాక్రాంతసకల
భాగ మయి యొప్పునది మూకభావ మగుచుఁ, జిదగోదంగొనివైశమ చెలువ మెడలె.

సీ. మటమటలాడుచుఁ గటకటపడువారు మాటిమాటికి మోము మలఁచువారు
హాతవికాసము లగునాస్యములు గలవారు దైన్యదేవతలట్లు తనరువారు
చీటికిమాటికిఁ జీకాకుపడువారు చీ! చీ! యనుచు నోటఁ జెప్పువారు
మలినవేషములతో మూగుడుపడువారు మంతనములలోన మసలువారు
గీ. నగుచు నగరున నుండెడునఖిలజనులు, గోడుగుడుచుచునున్నారు కుతుకములను
మాని రాజగృహంబు నిమ్మాడ్కిఁ గాంతి, యెడలి యున్నది చూచితేయిందువదన.

రాగసేన. ఓచెలీ రతిసేనా! జంతువులకు విధి యేయేకాలంబుల నెట్టెట్టు కష్టసుఖంబు లనుభవింపం బెట్టియున్నవాఁడో; అవి తప్పక యాయాజంతువులం జెందుచుండు. ప్రాణులకుసుఖదుఃఖంబులు విపత్సంపదలు మానావమానంబులు కోపప్రసాదంబులు సంయోగవియోగంబులు రాగద్వేషంబులు హానివృద్ధులు కలిమిలేములు మొదలగునవ్వి విధివిహితంబులయిసంప్రాప్తంబు లగుచుండు.భోజుండును లీలావతియు సంతసంబున నుండఁగాఁ గాంచి కడు సంతసించుచుండదీయదయాపాత్రతం బడిసినధనకనకాదులంగొని యనంతసుఖంబులం దేలుచుంటిమి. ఇప్పు డాదంపతులకు భేదంబు వొసఁగియుండుటంజేసి యది లేక సంతపించెదము. ఇందులకు మన మెంతతడవు చింతించియు నేమి సేయం గలవారము. ఈశ్వరుఁడువోలె సర్వజ్ఞుండై యొప్పువాఁడుగాన రాజు సాధారణుండు గాఁడు. అతనికడకుం బోయి మనదూతికాచాతుర్యంబు మెఱయ నేమేనిసెప్పం గలవారమా! చతురతరదూతీచాతురీవిశేషంబునకు లోఁబడువాఁడా! భూపతి.

రతిసేన. చెలీ! నీవుచెప్పినదియథార్థంబ. అనితరభేద్యమగు ప్రణయభరంబునం బొదలుచుండిన యీయిరువుర కొకింతకాలంబున కిట్టిభేదంబు పుట్టుటకుం గారణం బేమే! నీవు సర్వకాలము లీలాదేవికడనుండుదానవు గాన నీ కెఱుకపడియుండును వచింపుము.

రాగసేన. చెలీ! నేను నీభేదంబు పుట్టుటకుం గారణం బెఱుఁగను. కేవల మా యిరువురకు జరిగినవృత్తాంతంబునంతంబు మాత్ర మెఱుంగుదును. రెండుదినములకుం బూర్వదినంబున నుదయకాలంబునందు రాజు తరంగవతిచేత దేవికిం దాను జ్వరబాధవలనఁ బీడింపఁబడినవాఁడనై యున్నాఁడ నుదయంబునన పథ్యంబు భుజింపవలయునని చెప్పిపంపె దేవియు పథ్యంబు సజ్జంబు సేసి రాజుకడకుం గొంపోయినయది. తరంగవతీసమాహూతుండై కాళిదాసుండు నయ్యెడకు వచ్చె. కవిని గాంచి మిత్రమా కొన్నిదినములనుండి సభకు రాకయున్నాఁడ వేమి యని యడిగి యుచితసంభాషణములు జరిపె. ఇంతలో లీలావతి రజతపాత్రమందు రసవంతంబగు నన్నం బిడి యాయన్నంబునం బెసలపప్పు గలిపెను. అప్పుడు రాజది గాంచి లీలావతీమొగంబును కాళిదాసునిమొగంబును జూచుచు నాయిరువుర యభిప్రాయంబుఁ బరీక్షింపం దలంచినవాఁడువోలె నొకశ్లోకార్ధంబు వచించె.

* శ్లో. ముద్గదాళీ గదవ్యాళీ కవీంద్ర వితుషా కథం, (గీ. మొగిని గదసంచయవ్యాళి ముద్గదాళి, కవికులోత్తమ వితుషయై గ్రాలు టేల?) అని యడిగెను. అందుకుం గాళిదాసుండు శ్లో. అంధోవల్లభసంయోగా జ్ఞాతా విగతకంచుకా. (గీ. గరిమ నంధోవిభునితోడఁ గలయుకతన, విగతకంచుకయై యొప్పె విదితకీర్తి.) అని బదులు సెప్పెను. ఆయిరువురవచనంబులు విని లీలావతీదేవియు సర్వవిద్యలయందు సరస్వతింబోలినయదిగాన విజ్ఞాతసర్వార్థయగుటం జేసి రాజడిగినయుక్తియందును దానికిం గవి నుడివిన ప్రత్యుక్తియందును గలయర్థచమత్కారంబున కలరుచు మణిదర్పణప్రతిమాన కపోలతలస్ఫురితకమనీయరుచిరుచిరంబుగ నించుక మందహాసంబు గావించిన రాజు గనుఁగొని యిట్లు చింతించె. కట్టా! వీనిదుర్నయం బిట్టిది యని చెప్పం జనదు. దేవి సమీపముననుండునప్పుడ వీఁ డిట్లు వచించినవాఁడు. వీనివచనంబుల కీదేవియుం స్మితంబు గావించినయది. ఈకారణంబులంబట్టి యార్యయ నీయిరువురకును సంయోగంబు యథార్థంబ యనుటకు సందియంబు లేదు. అని తలంచుకొని దేవి నంతఃపురంబునకుం బనిచి కాళిదాసునిం గాంచి యిట్లనియె. కాళిదాస! నీవు దారుణాపరాధంబు సలిపినవాఁడ వయ్యు బ్రాహ్మణవేషధారి వగుటం జేసియు విశేషముగ సరస్వత్యవతారమ వగుటం జేసియు నిన్నుం జంపక విడిచితిని. ఇఁక నా.

---

*శ్లో. ముద్గదాళీగదవ్యాళీ కవీంద్రవితుషాకథం
అంధోవల్లభసంయోగా జ్ఞాతావిగతకంచుకా.

గీ. మొగినిగదములవ్యాళియీముద్గదాళి, కవికులోత్తమవితుషయైగ్రాలుటేల
గరిమ నంధోవిభునితోడఁగలయుకతన, విగతకంచుకయైయొప్పెవిదితకీర్తి.

దేశంబున నీ వుండం జనదు. ఇందుకుం బ్రతివచనంబు వలుకక నాయాజ్ఞ ననుష్ఠించు నది. నిన్నుంబస్థుండని కవివరు లెఱింగి చెప్పినప్పుడ వెడలనడుచుట భావ్యమై యుండ నీయందుం గల విద్యావిశేషంబునకుం బ్రియంపడి యట్లుగావింపనైతి. ఈ కారణంబున నీకు నాకడకురా మొగముసెల్లక యుండుటయు నెఱుంగుదు. ఈ దినమున భవదీయాప రాధంబు నిర్ణయింపనే దాసిచేత నిన్నుం బిలిపించితిని గాని మఱిదేనికింగాదు. మహా పరాధి వని యెఱింగితిని. ఇఁక నీ మొగంబుం గాంచ నొల్లను. అని కఠినంబుగఁ బల్కినఁ గాళిదాసుండును కరము రయంబున నచ్చోటువిడిచి లేచి తనగృహంబునకుం బోయె. భూపతియు నాదినంబుండొట్టి లీలావతి యుండునంతఃపురంబునకుంబోక యున్నవాఁడు. లీలావతి రాజు తనయం దుపేక్షించిన కారణమునం జేసి చింతాసంతతిదంతురమానస యయి పలువురఁ బ్రియవయస్యల రాజుకడ కంపియు నాతనికిం గలకోపకారణంబుఁ దెలిసికొనం జాలక యతినిపుణమగు బుద్ధివిశేషంబున నారసి కాళిదాసునికి నతినిష్ఠురం బుగఁ దనదేశము వెడలిపొమ్మని రాజు చేసియుండుముదలయును దనగృహంబున కతఁడు రాక యుపేక్షించి యుండువిధంబును బరికించి కాళిదాసుండు తనవిషయంబున దారు ణాపరాధంబు సల్పియున్నాఁ డనియు తానునందుల కొడంబడి యున్నదాన ననియు రాజు గ్రహించి యున్నాఁ డనిమాత్రము నిశ్చయించి యాత్మహృదయంబునందుఁ బరి తపించుచున్నయది. ఈదిన ముషఃకాలంబున నాదేవి నన్నుం జేరి యోసీ! ప్రియసఖి రాగసేనా! యేయనువుననైన జేనిమనోగతం బెఱింగినంగదా యతనిమనంబునం గల యన్యథాభావంబు మఱల్పంజనును; భూపతి యుపేక్షించినవిధంబున మనము నుపే క్షించియుండిన నతనికి మానసంబునం దోఁచినదోషంబు నిర్ధారితంబై యతిప్రయాసం బున నేనిఁ బోకార్పం గూడక నిరూఢత్వంబుం జెందు. ఇందులకుం ద్వరితగతిం బ్రయ త్నింపం జను నని చెప్పి పంపినయది. రాజు మనోగతం బెఱుంగుట కెట్లనువుపడును? ఇందుల కేమి సేయనగు?

అని పురోభాగంబునకు దృష్టులు నిగుడించి, ఇదె! మనసఖి మధుసేన వచ్చు చున్నయది; దీనికి రాజసన్నిధి సంచారనైపుణ్యం బధికము. తరంగవతి రాజునకును లీలావతికిని భేదము పుట్టినదాదిగఁ దనకు శిరోవేదనాపదేశంబుం గల్పించుకొని రాజ శయనాగారాధికారం బీమధుసేన కొప్పగించి తానింట నున్నది. ఇది రాజానువర్తనం బున నతిచతుర గాన ననువున భూపతిమనోగతంబుఁ దెలిసికొని యుండకపోదు. కాన దీని నడిగి ప్రస్తుతార్థంబుం దెలిసికొన నగును. అని యనుకొని యో మధుసేనా ప్రియ సఖి! మేము లీలావతీదేవి పరిచారికాజనం బని యొకో మమ్ముం గన్నులనైనం గనుం గొనక యేఁగుచున్నదానవు.

మధుసేన ప్రవేశించి. ప్రియసఖి! లీలాదేవి పరిచారికాజనంబయ్యేనేనిఁ గాంచఁ గూడదా!

రాగసేన. ఓసి లీలావతియందు రాజునకుఁ గోపంబు జనించియున్నదిగానఁ దత్పరిజనంబునకు సయితమట్లు లీలావతీపరిజనమందు కోపంబుండునోకో యని సంశయించి మందలించితిని.

మధుసేన. ఇవి యేటిమాటలే? ప్రభువులకు ఖేదంబు గలిగినప్పుడు కృతజ్ఞతగల పరిచారికాజనంబు వారలకుం గలిగియుండిన ఖేదంబు వోనడంపం బ్రయత్నంబు లొనరించియది నెరవేర్చినం గదా యేలికలకుం బ్రీతిగల్గినప్పుడు వారల సమ్మానగౌరవంబులం బడయవచ్చు. నేను రాజకులకార్యచింతాకులత్వంబుతోఁ జనుచుండి నిన్నుం గాంచక యపోవుచుంటిని. దేవికిం బ్రాణతుల్యవయిన దానిని నిన్నుం గాంచితిని. దీన నాచేయం గడంగుకార్యం బుచితాలోచనానియతినిర్వర్తితంబై సుఫలంబుం గలిగింపక పోదు.

రాగసేన. ప్రియసఖి! రాజకులంబుతో సంబంధించినకార్యం బెట్టిది? తదర్థము నీవు చింతాకులత్వము నందుచు ననుం గాంచి యది యుచితవిధి నిర్వర్తింపం బడునని తలంపునం దలంచిన ప్రకారం బెట్టిది? వచింపవే.

మధుసేన. ప్రియసఖి! రాగసేనా! భోజభూపాలుండు దేవిని గాళిదాసుని నిరాకరించుటందొట్టి కేవలచింతా సమాక్రాంతంబగు చిత్తంబుతో సారెసారెకు నిట్టూరుపులు నిగుడించుచు రాజ్యచింత మాని భోజనాదికృత్యంబుల నొల్లక పరిజనంబులు సపాదపతనంబుగఁ బ్రార్థింప స్నానాదికృత్యంబులు గావించుచు నెవ్వరితోఁగాని మాటలాడక మదితరపరిచారికాజనంబును దనకడకుం జేరఁగూడదని నిషేధించి యున్మత్తునిచందంబునను పిశాచావిష్టునివిధంబునను శాపోపహతునివగిదిని నతికృపణతాజనంబై యలయుచుఁ బ్రాణదయితావిరహవ్యథాదోధూయమాన మగుమానసంబుతో నతిదుర్బలంబులై యధిగతపాండిమంబులై పొడసూపు నవయవంబులతోఁ గడుకఠినంబుగఁ గవివరుని నుడివిన వచనంబులకు లజ్జించుచు హా! యెట్టికఠినుండను! హా! యెట్టిమహాపాపిని? హా! యెట్టివంచకుండను! హా! యెట్టియవిమృశ్యకారిని! అని యిట్టి యాలాపంబులు సేయుచు నతిదుర్భరావస్థం జెందియున్నవాఁడు. ఇది గాంచి నేను భూపతి యేకతంబున నుండునప్పుడు పాదంబులపయింబడి యిట్లు ప్రార్థించితిని. దేవా నీ విధంబున నతిదూరసమారూఢప్రియావిరహవ్యథావివశాంతఃకరణుండవై యున్నవాఁడవు; ఇంకం గొన్నిదినంబు లిట్లుండిన నోర్వంజాలక సకలజననయనానందకరం బగునీశరీరంబు నతికఠోరదుర్దశాపరిణామపరిహీణం బయి యస్మాదృశజనమనోవేదనావివర్ధకంబు గాఁబోయెడిని. భవద్విరహంబునం జేసి దేవియు నీదినత్రయంబుందొట్టి స్నానంబు లేక భోజనంబుమాని ప్రాణనాయకునికిం బరిహర్తవ్యం బైనయాజన్మం బేల? ఆతనిమనంబునకు సమాధానంబు గల్పింపలేని యాశీలం బేల? నాయకునిచిత్తంబునఁ గ్రొత్తయై యుదయించినయావిపర్యయంబుఁ బోనడంపంజాలనియీపాతివ్రత్యం బేల? నాథుని కుపయోగంబు గానియీనాసౌభాగ్యం బేల?

నాకాంతునిమనోగతంబగు ఖేదకారణంబుఁ దెలిసికొని యామహీపతికి మనస్సమాధానంబుఁ గల్పించి యారసికవతంసుని నిందుకొఁగిటం జెలంగుచుండుటయొండె; నది తెలియని నాఁడు రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణంబులు వాసి యాభూపతికిఁ బ్రియంబు గల్పించుట యొండెఁ దనకుం గర్తవ్యంబు లని యెంచి సఖపక్షంబుగ సఖీసమక్షంబునం బల్కె భవదీయచరణసంస్మరణమాత్రావలంబనప్రాణ యైయున్నది. భవన్మనోగతంబగు ఖేదకారణంబు దెలిసిన నది పరిహృతంబు సేయ సిద్ధపడి యున్నయది; కరుణించి యది దెల్పం జనుమ. మీర లిరువురు నట్లు విరహవ్యథాకులితులై యుండుటవలన రాచనగరు నిరానందంబై సొంపు దొరంగి యున్నది. భవత్పరిచారకజనం బెల్ల నతినిష్ఠురదుఃఖసంతతులం బొందుచున్నది. పౌరజనం బంతయు నుత్సవంబులు మాని దుఃఖసంతానంబులచేఁ జింతించుచున్నయది. అనియు మఱియు ననేకవిధంబుల ననునయించి యడుగ భూపతి నావచనంబులకుఁ గరఁగి ప్రియాదురవస్థాశ్రవణంబుచేఁ గనుదమ్ములనుండి వేఁడిబాష్పంబులు గార నన్నుంగనుంగొని యోమధుసేనా చెప్పెదను వినుమని యిట్లు వచించె. ఓసీ! మధుసేనా నాకుం దేవియగు లీలావతి ప్రాణంబుకంటె నధికురా లనియుఁ గాళిదాసుండు పరమమిత్త్రంబనియు నమ్మియుంటిని. అట్టియీరెండువస్తువులును నాకుంగాకపోయె. ఇంక నీశరీరంబుతో నొండె నీరాజ్యంబుతో నొండె నాకుం గావలసినది యేమియు లేదు. ఈరాజ్యంబు నీధనకనకవస్తువాహనసంపదయు బ్రాహ్మణసాత్కృతంబులు గావించి కాననంబులకుం జని కమలామనోహరునిపాదారవిందంబులం దలంచుచు శరీరం బుండునంతదనుకఁ గాలయాపనంబు సేయం దలంచియున్నవాఁడను. అనిన నే నాభూపతితో దేవా! దేవి లీలావతియుఁ గాళిదాసుండును మీవిషయంబున నేయపరాధం బొనర్చిరి? ఏదేని యపరాధంబు గల దని యెవ్విధంబున మీరు నిర్ణయించితిరి. అట్లు నిర్ణయించిననాఁడు వారి నడిగిగదా దండింపవలయుఁ? అసూయాకులితహృదయు లెందఱో యెవ్వియో కపటంబులు సేయుచుండుదురు. వారల కది సైజగుణంబు. దేవా నీ కేఁ జెప్పవలయునే? అన రాజిట్లనియె. ఓమధుసేనా జరిగినవృత్తాంతంబు నీకెఱింగింతు వినుము. దేవి లీలావతి కాళిదాసునియం దెప్పుడును బ్రేమంబునం బ్రవర్తించుచున్నయది. ఇందుకుం దార్కాణగా నతఁడు వేశ్యాలంపటుం డని నే నుపేక్షింప నాదేవియుఁ గవింగుఱించి కర మనురాగంబు మీఱ నాతని సన్మానింపు మని పల్కినయది. లీలావతిచిత్త్రఫలకంబు వ్రాసినరంగకారునితో నీలీలాదేవి తొడయందు నల్లనిమచ్చ యుండునట్లు కవి సెప్పియున్నాఁడు. పరీక్షించిచూడ నది వాస్తవంబ యయ్యె. మఱియుం గొందఱవలనఁ గాళిదాసుండు స్త్రీవేషంబుఁ దాల్చి వచ్చి లీలావతితోఁ బొం దొనర్చుచున్నవాఁ డని వినియున్నవాఁడను. కవివరులు కాళిదాసుఁడు మంగలి యని కనిపెట్టినదిసుత నామనంబు వానియెడ సంశయాకులంబయయి యుండియు తదీయవిద్యావిశేషంబునందుసంప్రీతిచేనాతనినేమనకయుండియాయపరాధపరీక్షణంబునకుం భయంపడి నాయెదుటికి రాకయున్నయాకవినిదూతికాముఖంబుగ

రప్పించి లీలావతీకాళిదాసులయెడం గలుగుదోషంబుఁ బరీక్షింపవలెంచి చమత్కార సమస్య నొకటి కవి నడిగిన నాతఁడు నాయడిగినపద్యార్థంబున కుత్తరార్థంబు వచించె. అట్టు కవి దేవి సమీపముననుండునప్పుడు నెప్పుటయును ఆవచనంబునకు దేవి నవ్వుటయుం గాంచి వారలయెడ దోషంబు నిర్ణయించితిని. దాక్షిణ్యంబునం జేసియు దేవి పతివ్రతైక పరాయణ యని దృఢముగ నెఱింగి యున్నవాఁడను గాన నీదూఱు నివర్తింపం జేసికొను నేమొ యనుసందేహంబుచేతను దేవిని నేనేమి సేయక యున్నవాఁడ. ఇది వృత్తాంతంబు. అని చెప్పి రాజూరకుండెను.

ఓసి! రాగసేనా! యీభేదము దురాత్ము లెవ్వరో భోజలీలావతులకుం గల్పించి యున్నవారు. రాజమనోగతంబగు భేదకారణము దేవి కెఱుకపడిన నాపతివ్రతాతిలకము రాజుహృదయంబునకు సమాధానం బేదేని యొనరించు. ఇది దేవి కెవ్విధి నెఱిఁగింప నగును! అని చింతించుచుం బోవుచుండ నీవెదురైతివి. నీవు దేవికిఁ బ్రియసఖివి గాన నిది యెఱింగింపం గలవు. రాజిప్పు డార్యుండగు బుద్ధిసాగరునితో నేదియో రహస్యాలోచనము జరుపుచున్నవాఁడు గాన నన్నుం బిలువఁ డని యిప్పు డింతదనుకఁ దడసితిని. బుద్ధిసాగరుండును సభాభవనంబునకుం బోయియుండు. ఏను రాజసమీపమునకుం బోవలయుం. మీరును దేవికడకుం జని వృత్తాంతంబు నివేదింపుఁడు. అని చెప్పి వారలతో నిష్క్రాంత యయ్యె.

నాటకచ్ఛాయయందుఁ దృతీయాంకము సంపూర్ణము.

---

## చతుర్థాంకము.

బుద్ధిసాగరుండు ప్రవేశించి. కష్టము! కష్టము! నా కీయధికారము గలిగి యింత దనుక నెంతసుఖావహం బైయుండెనో యిప్పు డంత దుఃఖావహంబయి మునిగినయది. కట్టా! యిది యప్రతివిధేయం బైనసంకటంబుసంప్రాప్తం బయినయది. ఎట్టిసంకటకార్యంబులయందు నయితె మనాయాసంబుగఁ బ్రవర్తించి కార్యంబు నెరవేర్పంజాలిన నా బుద్ధివిశేషంబు దీనియందుఁ గుంఠితం బై చేయునది లేక సంభ్రమించుచుండెడిని. సకలకలావిచక్షణుండును సర్వసర్వంసహాచక్రధూర్వహుండును మూర్తిమంతుం డైనమన్మథుఁడు వోలె వెలయుచుండువాఁడునగు నీభోజకుమారునికి మన్మథునికి రతీదేవియుంబోలెను పురందరుని కింద్రాణియుంబోలెను మురహారునికి క్షీరసాగరకన్యకవోలె ననూనరూపగుణవిభవకళాప్రముఖంబులం దద్దగు సమానయగు నీలీలావతీదేవి దేవి యయినకతంబున వృద్ధరా జగుసింధుళునివంశంబు సర్వజనాభినందనీయం బై యమందానందంబును సమకూర్చుచున్నయది యని యుబ్బుచున్నందుకు మహాశోకసాగరంబున మునింగి పోవలసివచ్చె.

రాజునకును దేవికి నేను బుద్ధిసెప్పి యొప్పింపంగలవాఁడనై యున్నాఁడను. ఇంతదనుక నవ్విధి జరుగుచువచ్చినదిగాని యిప్పుడు ప్రవృత్తంబైనభేదంబునందు నావచనంబు నభ్యుపగతంబు గాక యున్నది. భూపతియైన నావచనంబు నిషేధింపకయున్నవాఁడు. దేవి కే నిట్టి మహాఘోరవ్యవసాయంబునుండి నివర్తింపంజను మని యెంతసెప్పినను ఆర్య! బుద్ధిసాగర! నీవచనంబు నా కనతిక్రమణీయంబ యయ్యును నిందు నాయతిక్రమాపరాధంబు క్షమింప వేఁడెదను. మద్విషయంబున నయినయీకౌలీనంబు సమస్తజనులకుం దెలియక మహారాజుచెవి కెక్కి యుండదు. అట్టియపరాధంబు సర్వజనసమక్షంబున లేదని యనిపించుకొని జీవించినం గదా సింధులరాజువంశంబు ప్రజాపవాదోపహతంబు గాక వన్నె కెక్కు. మెట్టినయింటికిం బుట్టినింటికిని గీర్తి సంపాదించి మించుట మించుబోడికిం దగవు గాని యంచితరీతిఁ దొలంగి సంచలితకీర్తి యయి యుండుట యుచితంబు గాదు. ఇప్పుడు నేను రాజుసెదుట సకలపౌరజనంబులు చూచుచుండ హుతాశనునిం బ్రవేశించి నాయెడం గలిగినదూఱు వోఁగొట్టుకొందును. ఇందు భూపతి సమ్మతింపఁడేని రజ్జువిషాగ్నిజలంబులనైనఁ బ్రాణపరిత్యాగంబుఁ జేసికొనియెదను. ఇట్టి మహాఘోరమగు నపవాదంబు నామానసంబు సైరింపఁ జాలదు. నీవు నాశ్వశురుండగుసింధులభూపతికిం బ్రియమిత్త్రం బవగుటం జేసియతనివంశంబునకు సేమంబ కాంక్షించువాఁడవు. ఇట్టియపయశం బామహనీయునికులంబునకుం జేరనీకుండఁ జేయవలసినభారంబు నీదియయియున్నది. నీవు నాకు శ్వశురతుల్యుండవు. నాయొనర్పంబూనినదోషసంశోధనకార్యంబునకు సహాయుండవై యుండంజనును. నాసేయుప్రణామం బంగీకరించి నామనోగతంబు నెరవేర్పఁ బ్రార్థించెదను; అని పచించి తనపట్టు వదలక యున్నది. ఈదూఱు వోవం జేసికొనుట భోజునికి నిష్టంబుగఁ దోఁచెడిని. కాదేని యిందు దేవీమనోవృత్తికి విరోధంబు సలుపఁ దన కిష్టం బుండ దని యనునా? ఆయిరువురయభిప్రాయంబు నట్లగనంబడుచున్నది. దీన నెట్టియనర్థంబు లయ్యును నానేర్పునఁ దప్పింపం గూడనివియ. లీలావతియన్న భోజునికిం బ్రాణంబ. ఆదేవి కేదేని యపాయంబు సంభవించునేని రాజు జీవింపలేఁడు. రాజున కేమైనఁగీడు గలిగినఁ బౌరులు నిరశనాదివృత్తులం బ్రాణంబులు సాలించుకొందురు. సర్వంబునొక్కయెడుగున నష్టంబయి పోవ నున్నది. రాజాజ్ఞకర్తవ్యంబు. లీలాదేవి కగ్నిశుద్ధిఁ గావింపఁ జేయవలసినపనులు సేయక నాకుఁదలవ్రాఁతతప్పదు. సర్వవిధంబుల ధర్మంబు జయంబు నొందుంగాత. ఇదె భోజుండును కతిపయజనపరివృతుండై భువనేశ్వరీదేవాలయపురోభాగంబున నున్నవాఁడు. లీలాదేవియుఁ దక్కమలసరస్నాతయై యిదెహుతాశనునికడ కేఁగుదెంచుచున్న యది.కట్టా! రాజనియోగంబతికఠినంబు. ఇట్టిమహాఘోరసంకటంబులందు సమీపమునన నుండవలయునన్నవిధిసేతలకుం దప్పించుకొన నాకుం దరంబు గాకయున్నది. అనుచు నిష్క్రాంతుండయ్యె.

శుద్ధవిష్కంభము.

పౌరపురోహిత ప్రముఖపరివేష్టితుండై భోజుండు ప్రవేశించుచున్నాఁడు.

భోజుఁడు. (సాస్రముఖుఁడగుచు.) కట్టా! యెట్టిబెట్టిదంపుంబని కొడిగట్టవలసివచ్చె;

మ. నవసౌభాగ్యవిలాసలక్ష్మి కిరవై నాళీకముగ్ధంబునై
యవనీలోకవిలోచనోత్సవమునై యానందసందోహమై
భువనస్తుత్యమనోజ్ఞమంగళరమాపూర్ణావతారంబునై
యవదాతం బగుదేవిసెమ్మొగము నాహా చూడఁబో నిం కిలన్.

లీలావతియందు లోకాపవాదంబు ప్రవృత్తంబయి యుండుటంజేసి యీదేవి యకలుష యని యెఱింగియుం నగ్నిశుద్ధికిం బూన్పవలసివచ్చె. ఈదేవి యగ్నింబడిన నే జీవింపశక్తుండను గాను. వెంబడిన యాహుతాశనునిం బడి దేవియందుఁ జేసిన యపరాధంబువలనం దప్పించుకొనియెద.

ఉ. నారమణీయగేహరమ నానయనామృతవర్తి నాయశ
శ్శారదచంద్రికానిచయసారసుధాకరరేఖ నామన
స్సారసుప్రభాతరుచిసంతతి నాహృదయైకసారవి
స్ఫారవేందుకాంతమణిభాసురహారముఁ బాయనోర్తునే.

పురోభాగంబునను దృష్టులునిగుడించి. ఇదె బ్రాహ్మణోత్తములు హుతాశనునిఁ బ్రజ్వరిల్లం జేసి యథావిధి విధివిహితమంత్రంబుల వ్రేల్చి యగ్నిదేవునిం బ్రార్థించుచున్నవారు.

నేపథ్యంబున.

చ. అనుదిన మేము నిన్ను నియతాత్మతఁ గొల్చుచునుండుటన్ భవ
న్మననమునఁ దృప్తి గల్గుట క్రమంబుగ నిక్కవ మయ్యె నేని యీ
మనునిభకీర్తికి న్భువనమాన్యునికి న్బ్రియ మారఁ జేసి యీ
వనజదళాక్షిఁ గావుము జవంబున నియ్యెడ హవ్యవాహనా.

వెండియు నేపథ్యంబున.

చ. పరమపతివ్రతామణిని భాసురసద్గుణజాలమండితన్
నిరుపమసద్యశోవిభవనిర్మలవృత్తను గావుమయ్య యో
వరద దయానిధీ జ్వలన వాయుసఖా సురవంద్య యిప్డు నీ
నిరుపమధర్మవత్సలత నేఁడు గదా గనుగొందు రీభువిన్.

భోజుఁడు. ఔరా! పౌరజనంబులు సంతత మీదేవియందు భక్తిమెయి నిట్లు ఘోషించుచున్నవారు. వీరికిం గలప్రేమంబు దేవియందు నాకు లేకపోయెఁ గదా! నావంటి యతికఠినుండును కృతఘ్నుండును నెందును గలఁడే?

ఉ. ఈరమణీయగాత్ర శరదిందునిభాస్యను ప్రేమ మీఱ ని
చ్చారతిఁ జంద్రశాలల నిశాకరకాంతవినిర్మితంబులన్
సారసకల్పసంతతులఁ జందనపల్లవకల్పితంబులన్
జేరిచి నే సుఖంబుఁ గని చిచ్చునఁ ద్రోచెద నిష్ఠురుండనై.

నేపథ్యంబునంగలకలంబు

భోజుఁడు. (దృష్టులనిగుడించి.) ఇదె దేవియు స్నాతయై భువనేశ్వరికి వలగొనుచు,

ఉ. మంగళమాత్రభూష యయి మానితధౌతదుకూలచేలయై
సంగతనవ్యపాండురుచిచారుసుదుర్బలగండభాగయై
యంగజరాజ్యలక్ష్మి యగునంగన యిష్టు కరంబు క్లిష్టయై
యంగముఁ గొన్ననవ్యవిరహవ్యథ యోయన నేఁగుదెంచెడిన్.

ఈదేవిం గాంచియే యిచటం జేరియుండు వారు సందడి సేయుచున్నారు.

అంత యథానిర్దిష్టవేషంబుతో లీలాదేవియు సఖి రాగసేనయుఁ బ్రవేశించిరి.

దేవి. సఖి రాగసేనా! సాయందుంగలిగిన యీదూఱు సమస్తజనంబులకుం దెలియక రాజుచెవి కెక్కునా! ఇందు రాజు తా నేమి సేయంగలఁడు? అతనికి వంశంబునం గలిగినకళంకంబుఁబోనడంచుకొనుట భావ్యంబుగాదె! ఇందఱయెదుట హుతాశనునిం బ్రవేశించి విశుద్ధనయ్యెద.

రాగసేన. దేవీ ఇట్టి సాహసంబు సనునా! బాష్పపూరసమాకులేక్షణయై సమీపమున నిలువంబడి దుఃఖభరంబున రోదనంబు సేయుచుండు వత్సను విరజాంబుజ నూరడింపుమా? వెక్కసంబగు భవద్విరహంబు సహింపం జాలక యీవసుమారిక పటాంచలావృతముఖియై యేడ్చుటం బా! నన్నుఁ దల్లిలేనిప్రజగాఁ జేసి పోయెదవే? ఒక్కనిమిషంబైన నిన్నుం జూడక నే నెట్లుందునే! ఒకక్షణంబు గాంచకపోయిన వత్సంబును బాసిన ధేనువుచందంబున నెయ్యెయ్యెడలనో వెదకుచుండుదువు! అట్టి నీప్రేమం బిప్పు డెట్లుపోయెనే? నన్నుం బాసిపోవ నీకుం గాళ్లెట్లాడుచున్నవే? నీవు నిక్కముంగ సుతావత్సలవయితివేని నన్నును వెంటం గొనిపొమ్మా! అమ్మా! అని యిట్లు వగచుచున్నది. కనుంగొనుము.

దేవి. (బాష్పగద్గదంబుతో) సఖి రాగసేనా! నేను సమస్తబంధుజనంబులందునాశ వదులుకొన్నదానను. ఎవ్వరిని గుఱించియుం నాతో మందలింపకుము. నాకుం గన్నులు చింతాజడంబులై కానరాకున్నవి. ఆర్యపుత్రుని గాంచి తత్పాదప్రణామంబునం గృతార్థనై యుద్దిష్టకార్యంబునకుం గడంగెదను. అతనికడ కేఁగుదము.

రాగసేన. దేవీ యిటు రమ్ము. అదె భూపతి మంత్రిప్రముఖు లెడగలుగ నిలువం బడియుండ నొంటరియై నేదిష్టవటవిటపిక్రిందఁ గూరుచుండి తలవాంచుకొని భవద్విర హావేదనాసహిష్ణుతం దోపింపఁ జేయుచున్నవాఁడు.

దేవి. (రాజుకడకుంజని.) ప్రాణనాథ అని సగముచెప్పి మాట మరల్చుకొని. మహా రాజ! యని సంబోధించి. నేను నవమన్మథమన్మథాయమానుండవైన నీకుంబత్నినైతిని. నిన్నుం జేపట్టితిం గాన నాకంటె ధన్యయుం మాన్యయు లేదు.

గీ. లలన లాత్మప్రియులతోడఁ గలయువేళ, నిన్ను మనములఁ దలఁచుచు నీరజాత సాయకసుఖంబుఁ గందురు వాయ కెప్డు, డిట్టినినుఁ గూడినది పరు నెట్లు గోరు,

ఇది భవన్మానసంబునకు విదితంబై యుండు నాకుం గాంక్షితంబు. పరలోకగతంబ య్యును నీజనము స్మర్తవ్య మని యనుకొనుటయ చాలును. అని వందన మొనరించె.

భోజుండు తలవాంచుకొని దేవిం గనుంగొనకయ బాష్పాయమాణేక్షణంబుల భూమి వలనికిం గాంచుచుండె.

అప్పుడు సభలోనుండునాస్తికుం డిట్లనియె. ఔరా!

గీ. మహిని లోకోత్తరుల వైనమానసములు, వజ్రములకంటెఁ గఠినత్వవైఖరులను గుసుమసంతతికంటెను గోమలత్వ, మందుచుండును దెలియంగ నగునె వాని.

అనిన సభాసదులు "భోజునికిం దనదేవియందుఁ బ్రణయభరం బెంత యుండియుఁ బరాపవాదభీరుత్వంబునం జేసి యగ్నిం బడంబోవుదేవిని నివర్తింపం జేయక యున్నవాఁడు. లోకోత్తరుండు గాన నాదేవిగుణగణంబులకుం బ్రియంపడి మనంబునం జింతం గూరుచు న్నవాఁడు. అపవాదభీరుత్వంబునం జేసి యతికఠినుండై యగ్నిశుద్ధి కొడంబడినవాఁడు" అని యితఁడు సెప్పినవచనంబు ప్రస్తుతార్థానుసారంబై తోఁచుట కరం బభినంద నీయంబయని యనిరి.

రంగస్థంబున.

దేవి. (సూర్యుని గనుంగొని.) భగవంతుఁడా! నీవు జగచ్చక్షువవు. సర్వంబును నీవె యుంగుదువు. సర్వసాక్షివి. నానుడువువచనంబు సత్యంబైన నన్ను రక్షింపుము.

శ్లో. జాగ్రతి స్వప్నకాలేపి సుషుప్తౌ యది మే పతిః,
భోజ ఏవ పరం నాన్యో మచ్చిత్తే భావితోపి న.

[టీ. జాగ్రతి=మేలుకొనియుండునప్పుడును, స్వప్నకాలేపి=స్వప్నావస్థయందును, సుషుప్తౌ=సుషుప్త్యవస్థయందును, భోజఏవపరం=భోజభూపతియే గాని, అన్యః=ఇతరుఁ డైన, పతిః=భర్త, మచ్చిత్తే=నా హృదయంబునందు, భావితోపిన = తలంపఁబడిన

గీ. జాగరణకాలమందును స్వప్నమందు, మఱిసుషుప్తిని భోజుఁడే మగఁడుగాని
యన్యనరు మానసంబుననైనఁ దలఁప, నాకు నొల్లమి తెల్లంబ నళినబంధు.]

అని వచించి హుతాశనునియందుఁ బ్రవేశింపఁ బోయెను. పౌరజనంబులు హాహాకారంబులు సలిపిరి. నాస్తికుండును శోకవిహ్వలుండగుచు లేచి యోయంబా! యోయంబా! యీసాహసంబువలన విరమించుకొనుము. నేనును విరజాంబుజయుఁ దల్లిలేని బిడ్డల మయితిమే! ఓతండ్రీ నీ కింతకఠినత్వము గూడునా! ఈకఠోరవ్యవసాయంబునకుం బూనినమాతల్లిని వలదని నుడువం జనదా? మాయొనరించినపాపమా! యిట్లు నిన్ను వాగ్బంధన మొనర్చె? ప్రాణములకంటె అధికురా లని యీదేవిని భావించుచుంటివే? ఆ ప్రణయం బేమయ్యె? ఆబహుమానం బెట్లు వోయె! ఆ దాక్షిణ్యం బెక్కడకుం జనియె? అయ్యో దైవమా! నీకు దయలేదా! కష్టముకష్టము! అక్కటా! నాయంబ జ్వలనంబునం బ్రవేశించె; హా! యని మూర్ఛవోయి భూమిపయిం బడియె.

నాటకచ్ఛాయయందుఁ జతుర్థాంకంబును
సర్వము సంపూర్ణము.



అప్పుడు సభాసదు లెల్లవారు నాస్తికునిపాటుం గనుంగొని యచ్చెరువందుచు నొండొరులతో సంతాపవచనంబుల నిట్లనుకొనిరి. లీలాదేవి జ్వలనంబునం బ్రవేశింప నీ నాస్తికుఁడు మూర్ఛవోవుట యేల? మఱియు నీతఁడు తానీదేవిని యంబ యని సంబోధించుచున్నవాఁడు; వస్తుసందర్భవిశేషంబునం గలిగినరసపారవశ్యతచే నితం డిట్లు మూర్ఛం జెందినను జెందవచ్చుంగాని యంబ యని లీలాదేవిని సంబోధించుటయుం; విరజాంబుజయు నేనును తల్లిలేనిశిశువుల మైతిమే యని వచించుటయుం; భోజునిఁ దండ్రీ! యని పిలుచుటయుం గారణములేక సంభవింపం జాలవు. మఱియు నితండు గాఢమూర్ఛాక్రాంతుండై యుండుటంజేసి నిజముగ నాస్తికుండు గాఁడనియు భోజభూపాలునిసుత యనియుం దోఁచెడిని. ఇందుం గలిగినసందియంబు వోనడంచుట కీమహాకవి గాని యితరుండు శక్తుండు గాఁడు. ఇంత తడవయ్యు నితనికి మూర్ఛ నివర్తింపకయ యున్నది. ఇది నివర్తింపం జేయునుపాయంబు నాతండ యెఱుంగును. అని కలయ నాలోచించి సింహపురాధ్యక్షుండు మొదలగువారు మహాత్మా కవికులతిలకమా! నీవలనం బ్రవర్తితంబైనయీనాటకచ్ఛాయ కరము రసావహంబై యున్నది. లీలాదేవిచరితంబు కడముట్టం గాంచవలయు నని యత్యుత్కంఠాసంభ్రమములతో నుండ నీనాస్తికునికథ దానికంటెం గుతూహలావహం బయ్యె. తొలుత నితనిమూర్ఛ నివర్తింపంజేసి వీనివృత్తాంతము వ్యాకుం

గర్ణపియ్యూషము గావింపుము. అని వేఁడికొనఁగాఁ గవివరుండును పీఠంబు విడిచి లేచి యంతకుం గొంతదూరంబున నతిగంభీరాకృతియై నికామక్షామతం జెందియుండు నంగవల్లితో ధూళిధూసరంబులగు కలకావళులతో నతిమలినం బయిన చేలంబుతో నిరాభరణసుందరంబగు నెమ్మొగంబుతో నతిక్లిష్ట యగుమాలతీమాలికయుంబోలె నొప్పుచుండు కాంతావతంసంబుకడకుం జని యోదేవీ! నీప్రియతనూజాతం దీని నూరడింపుము. ఇది యీనాస్తికవేషంబుఁ దాల్చివచ్చినవిద్యాసర్వస్వవేదిని గాని పురుషుండు గాఁడు. భవత్పుత్రారత్నంబగు తరుణాంబుజ యియ్యెడ నీవిద్యాసర్వస్వవేదినీవేషంబుతో నున్నది. బహుకాలముగ నీ పీసుతావిరహంబునం బరితపించుచుంటివి. ఇప్పుడు నీ కుఁ బ్రియతనూజాప్రాప్తిం జేసి భోజభూపాలునితో నధికకౌతుకంబున ముదంబు వడయం గలిగె; వైళంబ ప్రియతనూజ నూరడింపుము. అనిన నాయంగనామణియుఁ గనుదమ్ములవలన బాష్పబిందుబృందంబులు ధారలుఁగట్టి స్తనతటంబులంబడి విశీర్ణతం గాంచి యిలపయిం బడ నత్యాయతంబులు నతిధవళంబులు నవిరళపక్ష్మమాలికలు నగుకనుదమ్ముల నంతకుం జెంత నుండుతనభర్తమొగంబుఁ గాంచి యవిరళగళితబాష్పంబులై యొప్పునతనికటాక్షవీక్షణంబుల నభిమతి వడసి సంభ్రమంబున నేతెంచి మించినశోకవేగంబున నలయుచు నాతరుణాంబుజ నెత్తి తనయంకతలంబున నిడికొని వత్సా! తరుణాంబుజా! ఊరడిల్లుము! ఊరడిల్లుము! ఈశోకంబు మానుము. ఇదె నీ వవ్వతె యగ్నియందుం బడియె నని పరితపించి మూర్ఛం జెందితివో ఆ నే నిదె నిన్ను నూరడించుచున్నదానను. కనుదమ్ములు దెఱచి కనుంగొనుము. ఈ చేరియుండు నీ ప్రణయిసఖులకు ముదం బొనగూర్పుము. అని చెప్పుచు దానిమొగంబుఁ దుడిచిన నప్పుడు నాస్తికవేషంబుతో నుండువిద్యాసర్వస్వవేదిని మూర్ఛ దెలిసి కన్నులు విప్పి చూచి తన్ను నంకతలంబున నిడుకొనియుండు కాంతామణిస్పర్శంబు తనజననిశరీరస్పర్శం బని నిశ్చయించి యాదేవి యియ్యెడకు రాఁగతంబు దోపమికిం జింతించుచుఁ గలయ నవలోకించుచుండఁ బ్రతాపపాలుం డది గాంచి మానసంబున నత్యాశ్చర్యంబు నొందుచు నోమహాత్మా కవివరా! యీకాంతాతిలకంబు ధారానగరనాథుం డయినభోజభూపాలునిదేవియగు లీలావతియా! యని యడిగిన మహాకవియు నౌ నని యుత్తరం బొసంగ నారాజు కడు సంభ్రమించుచు నోదేవీ! లీలావతీ నీ విట్టు లొంటరివై వేషాంతరంబుఁ దాలిచి యిట్టిదైన్యవృత్తితో సంచరింపఁ గతం బేమి? ఏమ యుంటియు ద్రుపదతనూజయు నెట్టు లతిక్లిష్టదశం బొంది యిట్లు వచ్చియున్నదానవని తోఁచెడిని. ఈమహాత్మునివలన నీవృత్తాంతంబు నెఱింగితిని. ఈతనిని వైళం బనుచ్చుము. భోజభూపాలుండు నిన్ను నెట్లైజూసి యుం[illegible]ఁడు? అని యడిగిన నా యంగనాతిలకంబు లజ్జాకులితాననయైయుండె. నాదేవి[illegible] జనుదెంచియుండు దాగ కీ[illegible]

యనునది యోరాజా! ఏ రిపుపుర నొకకారణముచేత నగరంబు వాసి యియ్యెడకుం జను దెంచియున్నారు; ఇదె యామహీంపతియుం దనసుతకు సంభవించినకష్టంబునకు వగచుచు నికటస్థలంబున నిలువంబడియున్నవాఁడు; అని యతనిం జూపెను. అప్పుడు సింహపురాధ్యక్షుం డపరిమితామోదంబునం జెలంగుచు సమీపమున నుండు భోజభూపాలు నాలింగనము గావించుకొని యానందబాష్పబిందుబృందంబు లొలుక వత్సయగు విరజాంబుజం దోడ్కొనివచ్చితిరే యని యడుగ నింతలో సమీపమునకుం జనుదెంచి ప్రణత యయి తనపేరు సెప్పుకొను నా భోజసుతం గౌఁగిటం జేరిచికొని యాదల మూర్కొని యంకతలంబునం గూరుచుండం బెట్టుకొనియె.

గీ. ఈవినోదకథావల్లి నింపులొలుకు, నాల్గవగుళుచ్ఛమున రమానాథ నిన్నుఁ,
బూజచేసితి యాంధ్రభూభువనభర్త, రాజగోపాల శుభకీర్తి రంజిలంగ.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమానమానస భారద్వాజకులపవిత్ర తిరుమలార్యపుత్ర వెంకందేవీగర్భజన్మ చిలకపాటి వేంకటరామానుజశర్మ ప్రణీతంబైన వినోదకథాకల్పవల్లియందుఁ జతుర్థగుళుచ్ఛము సంపూర్ణము.

---

శ్రీరామజయము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# వినోదకథాకల్పవల్లి

## పంచమగుచ్ఛము.



### మంగళాచరణము

క. శ్రీరమణీరాధాముఖ, సారసనయనావిలాససతతానుభవో
దారశుభవిభవబంధుర, చారిత్రుని కేను నతులు సలుపుదు భక్తిన్.

అంతబౌద్ధవేషధారిణియగు విద్యాసర్వస్వవేదిని యం నామహాకవిం గాంచి యో మహాత్మా నీబుద్ధిచాతుర్యంబునకుం గరంబు మెచ్చవచ్చు; నూతనసంగ్రథిత మగువస్తు సందర్భవిశేషంబున రసపారవశ్యతఁ గల్పించి; నాస్తిక వేషంబుధరించికొని నీకడన యుండి నిన్ను మోసపుచ్చుచుం దెలియంబడక యున్ననన్ను విద్యాసర్వస్వవేదిని నని యందఱకు నిస్సంశయంబుగఁ దెలిపితి వంతియ కాదు; నేను భోజభూపాలునికూఁతురఁ దరుణాంబుజ ననియుం విద్యాసర్వస్వవేదినివేషంబున నిట్లు వర్తించుచున్నదాన ననియుం నీయర్థం బతి రహస్యంబు దీనిం దెలిసికొంటివి గాన నీవు పురుషావతారంబుం దాల్చినభారతీదేవివే యనవచ్చును; అయినను భవద్గ్రథితవస్తువగు నాటకంబున నాజనని లీలాదేవి హుతాశనుని యందుం బడినది యని యొఱింగించితివి; మఱియుం నీయవ్వ నాజనని యనుచుం దెలియఁ జెప్పితివి. ఇది పూర్వోత్తరసందర్భములకు విరుద్ధంబయి కానంబడుచున్నయది. దీనికి సమాధానంబు దెల్పనగు ననిన నాకవియు నోసుందరీతిలకమా! నీచతురతకు నేను గరంబు శ్లాఘించితిని. నీవంటియతిచతురబుద్ధియుఁ దదనుగుణమగు నేర్పును చతుస్సముద్రముద్రిత ధరావలయంబునం గలకలువకంటులయందు లేదని విస్పష్టంబయ్యె. భోజభూపాలునితనుజాత వనుటకుం దగినసకలకళాచాతుర్యంబు నీకొప్పియున్నది. నీజనని హుతాశనునియందుం బ్రవేశించినయనంతరము జరిగినవృత్తాంతంబు నీరాగసేన యనునీజననిప్రియసఖి సెప్పుచున్నది వినుము. అని యారాగసేనం జూపఁగా నాకాంతాతిలకం బిట్లనియె. ఓ భర్తృదారికా వచించెదను వినుము. దేవియగులీలావతి ప్రజ్వలించుచుండుహుతాశనునికిం బ్రదక్షిణంబులాచరించియంబరతలచుంబికరాళజ్వాలామాలికాభీలంబై యొప్పునాకీలియందుర దుమికెను. చూచుచుండుజనంబులు కష్టము కష్టముని హాహాకారంబులు సేయుచు బిట్టు మహాకలకలంబు గావించిరి. ఇంతలో నాహుతాశనుండు నాత్మీయజ్వాలాజాలంబు

నుపసంహృతము గావించుకొనిచందనపంక శీతలుండై విద్యుత్తేజఃపుంజంబుభాతిఁదోఁచుచు నాదేవి కించుకేనియుఁ దాపంబు గల్పింపక యుండె. లీలావతియు వికచారవిందసందోహమునుండి యావిర్భవించులక్ష్మివోలెనమ్లానకుసుమమాలయు నక్లిష్టసర్వావయవయు నయి యస్పృష్టవిస్ఫులింగంబయి యథాపూర్వముగఁ దోఁచుచుండు ధౌతవస్త్రంబుతో నుండి నంగాంచి జనంబులు మహాశ్చర్యమగ్నమానసులై యాదేవిపరమపతివ్రతాత్వంబు నస్తుతింప భోజభూపతి యది గాంచి మించినప్రేమభరంబున నాదేవిని కరంబు పట్టి యగ్నికుండంబునుండి యెత్తి దవ్వుల నిలిపి లజ్జావనతశిరుం డగుచుఁ బశ్చాత్తాపాభిభూతుండై దేవి క్షమింపుము! నేను పరమపాపిష్ఠుండను. నన్ను నే నే మనుకొందును. నీపరమపతివ్రతాత్వం బెల్లరకుం దెల్లం బైనయది. ఇట్టి నీశీలంబుఁ దలంపక నీయం దన్యథాబుద్ధిం గావించిననన్ను నీ వెట్టిదండనంబు సలిపినను సమ్మతంబె. ఇన్నిదినంబులు నీతో సహవాసం బొనర్చియు నీవిశుద్ధస్వభావం బెఱుంగనివాఁడ నైతిని. కట్టా! నాచదివినచదువులు గాల్పనే! నాయొనర్చినవృద్ధసేవయుఁ నేఫలంబుం గాంచె! దేవీ నీయెడ నపరిమితసంతోషంబు నొందితిని. నీకోరినవరంబు లొసంగెదను. నాధారానగరరాజ్యంబు నీదియ. నామంత్రి సామంతపురోహితదండనాథప్రముఖులును నీవారలు. నేను నీ వాఁడను. ఏ మాజ్ఞ యిడెదవు. అని యనునయింప దేవియుఁ గించిదంకురితమందహాససుందరవదనారవింద యగుచు రాజుం గాంచి యోప్రాణనాథ! ప్రణయవిశేషంబునం జేసి క్రమనిరపేక్షముగఁ బల్కం దొడంగితివి. నాకు వరంబు లొసంగుట నిక్కం బయినచో నీకపటంబుం గావించినవారల దండింపక విడువఁ జనును; ఇదియ నాకు వరం బని పల్క రాజుచే నభినందితయై పౌరజానపదులు వొగడ దయితానుజ్ఞాతయగుచు నాత్మీయసౌధంబునకుం జనియె. ఇదియ నీ జననిహుతాశనవిశుద్ధిచరితాంతం బని నుడివిన విని తరుణాంబుజ మఱియు నిట్లనియె.

ఓసి రాగసేనా! అలీలావతియు భోజభూపతియు నిప్పు డెయ్యెడకు రాఁగతంబు మానసంబునకు స్ఫురింపక యున్నది. అది వినినం గాని మానసంబు సమాధానంబు నొందదు. వచింపుమన నారాగసేన యిట్లనియె.

ఓభర్తృదారికా తదనంతరవృత్తాంతంబు వినుము. నీజనకుండు భోజభూపాలుండు దేవిం దోడుకొని తదీయసౌధంబునకుం జని లీలావతిచే నుపలాలితుం డయ్యును గవియుండుఁ దాఁ గావించిన మహాపరాధంబునకు దురంతచింతా సంతానంబులం దగులువడి పశ్చాత్తాపాతురుండై యాహారం బొల్లక నిదురఁ గూరక యన్యులతో మాటలాడక కేవల ముద్విగ్నమానసుండై దివానిశము తనకుఁ దాన ప్రలాపంబు నేసికొనుచుండెను. నాకు దాక్షిణ్యం బెక్కడిది? నాకును లజ్జ గలదా! నాకు గాంభీర్యం బెక్కడిది! హా కవీ! హాకవికులమకుటచూడామణీ! కాళిదాస! హా నాప్రాణసమానుఁడా! కట్టా మహామూర్ఖుఁడ నగు నే నెట్టియశ్రావ్యవచనంబు లంటిని! ఎట్టియవాచ్యంబులు నెప్పితిని; అని

యిట్లు బహువిధంబులం బల్కుచు రాజ్యకార్యంబులు మాని ప్రసుప్తునిభాతిఁ గొంత తడవు మిన్నక యుండుచు గ్రహగ్రస్తునివలెఁ గొంతతడవు విభ్రమించుచు మాయావిధ్వస్తుండువోలె నిలపయిం బడుచు నిట్లతిదుస్సహవేదనావివశుండై యుండెను. దేవియు నాత్మకరకమలంబులం జలంబులు గొని తెచ్చి యంగంబులం జల్లిన నెట్టకేని లబ్ధసంజ్ఞుండై తన ప్రియురాలిం గాంచుచుం దన్నుం దిట్టుకొనుచుండు. ఇట్లు కొన్ని దినంబులు గడచెను. అప్పుడు ధారాధీశునిసభ కాళిదాసుడు తొలంగినదాదిగఁ జంద్రుండు లేని రాత్రివోలెను దినకరుండు లేనిదినలక్ష్మివలెను వియోగిని యగుతరుణిరీతిని ఇంద్రుండు లేనిసుధర్మవలెను చెలువం బేదియుండె. అది మొదలొక్కని మొగమునందును గావ్యంబు రాదు. ఎవ్వండుగాని వినోదసుందరంబుగఁ బల్కలేఁడు. ఇట్లుండ నొక్కనాఁడు భూపాలుండు చంద్రికాసౌధంబునం దుండి పరిపూర్ణసుధాకరమండలంబుం గనుంగొనుచు నెదుట లీలావతిమోముఁ గాంచి యిట్లనియె.

శ్లో. * తుళణ అణుంఅణుసరఇ ణ్గో సో ముఖచందస్స ఖు ఏదాప.

(గీ. ఈవరారోహముఖ చంద్రు నీశశాంకుఁ, డనుసరించెడిఁ దులనకు నాసచేసి)

అని వచించి సంపూర్ణమండలుం డైనచంద్రుం డుదయింపం గన్నుల కానందంబు గలుగునట్టు లీపూర్ణచంద్రాననం గనుగొన నాతు వాచోవిలసితం బొక్కండు సూపట్టె. ఇట్టివాణీవిలాసంబు వోడసూపి యెన్నిదినంబులో గడచె. అని తలంచుకొనుచు మఱునాఁ డుదయకాలంబున సభకుం జని కవులం బిలిపించి తాఁ జెప్పినసమస్య వచించి ఓ కవుకార! యీసమస్య పూర్ణము సేయుం డని యడుగఁగా నెవ్వరును జెప్పలేక యూరకుండిరి. అంత రాజు వారలం గనుంగొని మీర లీసమస్య పూర్తిసేయనినాఁడు నాదేశంబున మీకుండం జనదు; అని చెప్పి రాజు తా నంతఃపురంబున కరిగెను. కవివరులుతమ యిండ్లకుం జని భయంపడుచుఁ జిరకాలంబు దానియర్థంబు విచారించి యుం స్ఫురింపమిం జేసి

---

ప్రాకృతశ్లోకము. తుళణ అణుంఅణుసరఇ ణ్గో సో ముఖచందస్స ఖు ఏదాప
అణుఇది బంణయిది కహం, అణుకిది తస్స ప్పడిపది చందస్స.

ఛాయ. తులనామన్వనుసరతి శ్లాఘ్నోస్సోముఖచంద్రస్య ఖల్వేతస్యాః
అన్వితివర్ణ్యతేకథ, మనుకృతి స్తస్యప్రతిపదిచంద్రస్య.

గీ. ఈవరారోహాముఖచంద్రునీశశాంకుఁ డనుసరించెడిఁదులనకునాస జేసి
అనుసరించెడినసేలయఃబ్జవైరి, కనుకృతియకాదె ప్రతిపత్తునందుఁదలఁప.

ఇచటఁ బ్రతిపత్తనఁగాఁ జంద్రుఁడు లేని కాలంబని తలంచుకొనవలెను.

చంద్రుఁడు లేనికాలంబున నీకాంతామణి ముఖచంద్రుండు జంద్రపున ర్నిర్మాణానుసరణ సంస్కృతి యని చెప్పవలయును. అని భావము.

యందఱును గలసికొని బాణుని రాజుకడకుం బంపిరి. అతండును సనుదెంచి దేవా! యందఱు విద్వాంసులును నన్నంపిరి. నీయొసంగినసమస్యను బూర్ణము సేయ నెనిమిదిదినంబు లవధి యొసంగుము. తొమ్మిదవనాఁడు ముగింపగలరు; అట్లు పూర్ణము సేయనినాఁడు దేశంబు విడిచి పాఱిపోయెదము; అని చెప్పుకొనియెను. రా జట్లకానిండని ప్రత్యుత్తర మొసఁగెను. ఆవృత్తాంతంబు పండితులకు విన్నవించి బాణుండు తన యింటికిం జనియె. ఎనిమిదవ నాటిరాత్రి పండితు లందఱు జేరియుండ బాణుండు విద్వాంసులం గాంచి కట్టా! తారుణ్యమదంబునను రాజసన్మానమదంబునను గాళిదాసుని దఱుమఁగొట్టితిరి. సమస్థానంబున మీర లందఱును గవులరే! విషమస్థానంబున నన్నిటఁ యతం డొక్కరుండె కవి! అతని వెడలనడచి యిప్పు డేమిమహాత్మ్యంబు సంపాదించినట్టులయ్యె. అతండుండునేని యీయవస్థ మనకుం గలుగంబోవునే! అతని వెడలనడచినందులకు ఫలం బిప్పుడు మీర లనుభవించెదరు. సాధారణవిప్రుని ద్వేషించినను గులనాశంబు గల్గును; సాక్షాద్భారతీ స్వరూపుండగు వానియెడ నపరాధం బొనరింప నీకవికులంబునకు నాశంబు గల్గకుండునే! అని వచియించె. అప్పు డందఱును జగడమాడికొనిరి. మయూరప్రభృతులు కొందఱు వారలకలహం బుడిపి యిట్లనిరి. రాజొసంగినసమస్య పూర్ణము గావించుట కవధి యిప్పుడ సంపూర్ణం బగుచున్నది. తత్పూరణంబునకుం గాళిదాసునికిం గాక యితరునికి సామర్థ్యము గానిపింపదు.

క. వరభటులకు సంగరముల, సరసినిఁ గవ్వడులను గవులసంతతులందుం
స్థిరదీప్తి దీప్తిహానియు, నరయంగఁ దత్క్షణమునంద యగుచుండు ధరన్.

ఇందుకుం జింతించుచుండం జనదు. మీ కందఱకు బ్రియం బగునేని యీమధ్య రాత్రంబునంద చంద్రుండుదయించుటకు మున్ను నిరూఢముగం బురంబు వాసిచనియెదము. మనకుం గలసంపత్తిసంభారంబులం గైకొని పోకపోతిమేని యెల్లి రాజసేవకులు మనల బలవంతముగ వెలువఱుతురు. అప్పుడు మనము శరీరమాత్రములతోడన పోవవలయుం. కాన నిప్పు డీమధ్యరాత్రమునంద పురము వెడలి పోవం జనునని యివ్విధముగ నిర్ణయించి గృహంబున కేతెంచి బలీవర్దంబులం బూన్చినశకటంబులందు సంపద్భారంబుల నెత్తించి రాత్రియంద వెడలిరి. ఇట్లు వెడలి పురబాహ్యోపవనసీమఁ జనుచుండువారలకుం జంద్రోదయసమయంబునందు నొకసు వేషాలంకృతుండగు పురుషుండు హస్తంబున ఖడ్గంబు దాల్చి, యుండువాఁ డెదురేఁగుదెంచి యాయందఱ నిరూపించి జయశబ్దంబు వల్కి చారణ భాషతో నడిగెను. ఓవిద్యావారిధులారా! భోజసభయందు బృహస్పతులవిధంబున నతి మహత్వాతిశయము నొందినవారలారా! మీర లెట్లుఁ జేరుకొని యెక్కడ కేఁగం బోయెదరు. మీ కెల్లరకు సేమంబ కదా! రాజును గుశలంబున నున్నవాఁడు గాదె! నేను కాశీ దేశమునుండి విత్తస్పృహచేత భోజభూపాలుం గాంచ నేతెంచుచున్నవాఁడను. అని

పల్కిన సతనివచనంబులు విని యందఱును బరిహాసించుచుం బోవుచుండిరి. వారలలో నొక్కరుం డతనిని చారణునిగాఁ దలఁచి కుతూహలంబుతో నిట్లనియె.

ఓచారణుఁడా ! వినుము. అనంతరకాలమున నీవును వినంబోవునదే! ఏ నిప్పుడ వచియించెద. రాజు పూరణముసేయుట కీవిద్వాంసుల కొకసమస్య యిచ్చియున్నవాఁడు. దానిని బూర్ణముగావింప శక్తిలేక యీకవులు కుపితుం డైనరాజుచే వెలువఱుచంబడి దేశాంతరంబున నెందైనఁ బోయి చేరుటకు నిశ్చయించుకొని నిర్గమించినవారలు అని చెప్పెను. అది విని చారణుండు రాజొసంగినసమస్య యెట్టిదో నుడువు మని యడుగ నావిద్వాంసుండు,

శ్లో. తుళణ అజుఅణుసరణి గ్గో సో మహాచందస్స ఖు ఏదావి,, అని పఠించెను. చారణుం డది విని యిది గూఢార్థ మగుసమస్య; సాధు వయినదే! ఇది పూర్ణేందు మండలంబుం గాంచి రాజు వచించినది. దీనికి నావచియించునది యుత్తరార్ధంబుగాఁ జనును. శ్లో. అణుఇది బంణయది కహం అణుకిది తస్స పడిపది చంపస్స,, (గీ. అనుసరిం చెడినన సేల యబ్జవైరి, కనుకృతి య కాదె ప్రతిపత్తునందు దలఁప) అని నుడివెను.

అది విని యాకవు లందఱును కడుఁ జమత్కృతు లయిరి. చారణుండును వారి కందఱకు నమస్కరించి వెడలిపోయెను. అంత నాకవు లందఱును ఔరా! సాక్షాత్సరస్వతియె భక్తవాత్సల్యంబుమెయి మనల రక్షింపం బుంరూపంబున నేఁగుదెంచె నని యెంచ నగుంగాని యితఁడు మనుష్యమాత్రుం డని నుడువం జనదు. అది యట్లుండనిండు. ఈ వృత్తాంతం బిప్పటి కెవ్వరు నెఱుంగరు; కానశీఘ్రముగ గృహంబులకుం జేరి శకటంబుల నుండి వస్తుసంభారంబులు డించి ప్రాతఃకాలంబునన యందఱము రాజగృహంబునకు బోవం జనును. కానినాఁడు చారణుండ రాజున కెఱింగించు. వైళంబ చనవలయు. అని యాలోచించి యందఱు నిండ్లకుంజనిరి. మఱునాఁ డాకవివరులు భోజభూపతి సభాస్థలంబునకు వచ్చునంత కాలస్యం బగును; ఆమహీపతిగృహంబునకుం జని సమస్యను బూర్ణము చేసి బహుమతులు వడయ నగును. సమస్యాపూరణంబు విన నత్యుత్సుకుండు గాన త్వేఁడసమయం బయ్యును మనకు మాత్రము దర్శనం బొసంగును అని తమలో నాలోచించి పఱువాత లేచి యావిప్రులు రాజసదనంబునకుం బోయి రాజుం గాంచి స్వస్తి యని పల్కి గృహాంతరంబుం బ్రవేశించిరి. అప్పు డాకవులయందు బాణుం డిట్లనియె. దేవా సర్వజ్ఞుండ వగునీవు నుడివినది యీశ్వరుం డెఱుంగుగాని యుందరంభెరి బ్రాహ్మణులము వరాకులము మే మెఱుంగం గలవారమే ! అయినను దెల్పెదను. అని చారణుండు వచించిన శ్లోకార్థము వచించెను.

అది విని భోజుండు యథావ్యవసిత మయి యొప్పతనయభిప్రాయంబు సర్వవిధంబులఁ గాళిదాసుండ యెఱుంగం గలవాఁడు; మదీయాభిప్రాయం బిందు విస్పష్టం బయి

యున్నది; కాళిదాసుండు నీనగరంబునందొండె నగరసమీపమునందొండె వసించుచున్న వాఁడు. ఉపాయంబులచే నాతనిం గాంచం జనును. అని తలంచి బాణకవికిం బదునైదు లక్షలవరహాలు బహుమానంబు చేసి సంతోషవ్యాజంబున నావిద్వద్బృందంబును తదీయ సదనంబుల కంపి వారు సనిన వెంబడిన ద్వారపాలకునికి నోరీ కొందఱు విప్రులియ్యెడకుం జనుదెంచెదరు; వారల నేనుండుచోటికతిరయంబునం దోడ్కొనిరమ్మని యాజ్ఞ చేసి కాల్యకృత్యంబులు దీర్చుకొనుచుండె.

బాణకవియు రా జొసంగినవిత్తంబు నంతయుం గైకొని తనయింటికిం బోఁగాఁ బండితులు కొందఱు కట్టా! బాణుం డనుచిత మొనరించినవాఁడు. వీఁడును మనతో నగరమునుండి పలాయితుం డైనవాఁడ; అట్టయ్యును ధనంబు నంతయుం గైకొనియె ఎవ్విధి నైనను భోజునికి బాణునిస్వరూపంబు నెఱింగింపనగు. ఎవ్వఁడేని యిఁక నిట్టి యన్యాయంబు విద్వాంసులయందుం జేయకయుండం బ్రయత్నింపవలయు అని యాలోచించి రాజుకడకుం జనిరి. రాజును వారలం జూచి దీనిస్వరూపం బంతయుం విజ్ఞాత మయి నయనియు; కాన మీరలు యథార్థంబు వచింపుఁడు; అని వచింప వార లందఱును జరిగిన వృత్తాంతం బంతయు నెఱింగించిరి. వారలపల్కులు విని తనమనంబున భూమీశ్వరుండు సర్వవిధంబులం గాళిదాసుండు నాయందుం గలుగుభయంబునం జారణవేషధారియై యీనగరంబునన యున్నట్లు నిర్ణయింపంజను నని చింతించి గుఱ్ఱంబులకుఁ బల్లంబులు గట్టించునది; క్రీడోద్యానవనప్రయాణంబునకుం బటహధ్వని సేయుంనది యని తనయంగరక్షకులకు మొదలయిడి వీరభటులు తమమనంబుల భూపతి యిపుడు దేవపూజావ్యగ్రుండయి యుండు నని విందు మిప్పు డుద్యానవనప్రయాణంబునకుం గడంగె నేలకో యని కళవళింపుచు వెనువెంటరాఁ దత్కాలసమానీతంబులగు నశ్వవరంబుల నారోహించినకవివరులు తన్నుం బలసికొనివచ్చుచుండ నుత్తమం బగుకత్తలానిపై నెక్కి విద్వద్బృందనిరూపితంబగుచారణప్రసంగంబు జరిగినయెడకుం బోయి యాచారణునియడుగు లిడిన స్థలంబులు గని కాలిజాడలం గనిపట్టువారల నతినిపుణులయినచారులం బిలిచి యీ మార్గంబున నీరేయి యొకపురుషుండు పోయినవాఁడు; అతనియడుగులజాడ లింకను గానంబడుచున్నవి; వీనింగొనియాతం డుండువలను దెలిసికొని నాకుం దక్షణంబ యెఱింగింప నగును అని యాజ్ఞ చేసి తనతో వచ్చియుండుపండితుల కొక్కొక్కనికి నొక్కొక లక్షవరహాలు బహుమానంబులిచ్చి వారల సంతోషపెట్టి తననగరునకుం బోయె.

ఓభర్తృదారికా వినుము. ఆపదవిన్యాసాభిజ్ఞానకుశలు లగుభటులు రాజాజ్ఞం గైకొని యీచారణునియడుగులజాడలం బరిశీలించి వచ్చి మహీపతికిట్లనిరి. ఓమహారాజ మేము భవదీయాజ్ఞావశంవదుల మయి యతిజాగరూకత మెయి చారణునియడుగులజాడ లార్గసి వచ్చినారము. ఆచారణుండు పండితసంఘుంబుతో మాటలాడి కొంతదవ్వు పాద

చారిణియై చనినవిధంబు తదీయపాదవిన్యాసంబులగుఱుతులంబట్టి యెఱింగితిమి. అనంతర మతఁడు చతురంతయానంబు నెక్కి యాపురంబు వెడలినరీతి గాన్పించుచున్నయది. ఆచారణుండు పల్లకిపయి నెక్కినచోటినుండి యతనియడుగులజాడలు నూపట్టవు. మనధారానగరమునకుం బశ్చిమమున ననేకరథ్యలుగలయొకచోటి కొంకింతయెడగలుగ లోపలనయొకయెడ నాచారణునియడుగులును దక్షిణముఖస్థితయగు నొకకాంతాతిలకంబునడుగుఁదమ్ములజాడలును గనంబడియె. అవి నిరూపించి చూచితిమి. అతండు వెండియు నాపల్లకి నెక్కి వసుమానసనగరాభిముఖుండై చనినవిధంబు మామనంబులకు నిశ్చితముగఁ దోఁచుచున్నయది. చారణునియడుగులును కామినీమణియడుగులును బరస్పరసంముఖంబులై యుండినకతంబునను అక్కాంతాతిలకంబు నడుగులజాడ లయ్యెడనుండి ధారానగరంబు నంతరంబునకుం జనినవిధంబునఁ జూపట్టుచుండుకతంబునను చారణుండు మాత్రమె ధారానగరంబు వాసి చనియెననియుం నాతనితో మాటలాడినమగువ యాపురంబున నున్నదనియుం నాకాంతం గనిపట్టినచో నాచారణునివృత్తాంతంబు దెలిసికొనఁ నగుననియుం నిశ్చయించుకొని మేము మాబుద్ధిశైపుణ్యంబుకొలఁది నతిక్రుద్ధగతి నారసి యాకాంత రాజనగరునం బ్రవేశించిన తెఱంగును గనిపట్టితిమి. అని విన్నవించి మహీపతి యొసంగినవసనంబులు గైకొని యాచారులు సనిరి. భూపతియుఁ దనమనంబున నాచారణునితో మాటలాడినకామినీ తిలకంబుం గనిపెట్టందలంచి తనబుద్ధిబలంబుకొలందినితనదేవి లీలావతీదేవిచాతుర్యంబు కొలందిని బ్రయత్నించియుం దెఱంగలేక యాప్రయత్నంబు మానుకొని యుండె,

## భోజునికి దివ్యమంజీరము దొరకుట.

అప్పుడు రాజభటులు కొందఱు గ్రీష్మసమయమధ్యాహ్నమార్తాండమరీచినిచయంబులం బోలువజ్రమణిదీధితులసంతానంబులు నలుగడలం బర్వంజేయుచు నవధీరితశారదపూర్ణిమాశశాంకబింబంబై యనర్ఘమణిగణఖచితంబై యఖిలజననయనవిస్మయావహంబై యొప్పునొక్కమణినూపురంబుం గొనితెచ్చి భూపతికడ నిడి వినతులై యంజలిగావించుకొని నిలిచిరి. భూమీశ్వరుం డానూపురంబుం గనుంగొని తదీయతేజోవిశేషంబున కచ్చెరువంది తనచేతికిం దీసికొని ఔరా! ఈనూపురంబు దివ్యలోకంబున నున్న వని ప్రసిద్ధివహించియుండు శ్యమంతకాదిమణులచే నిర్మితంబై యున్నది. ఇట్టియపరిమితతేజస్సంపన్నంబు లగుమణులు భూభువనంబునం గానరావు. ఇది యామహాలక్ష్మి ధరించెడునందెయో? కాదేని యాపద్మజునిరాణి దాల్చియుండునూపురమో? కాదేని యాపురందరసుందరి యిడుకొనియుండుమంజీరమో; కాదేనియాత్రిపురహరునితరుణికై సేయఁదగు హంసకంబో? కానిచో నిట్టియతిశయితకాంతి యీచరణాభరణంబున కేలఁ గల్గు? ఇది మనుజలోకంబున మనుష్యులచేత నిర్మితంబు గానిదని దీనియనర్ఘమణిప్రభాపటలంబు దెల్పుచున్న

దేమి యని యడిగిన నాభటు లిట్లనిరి. దేవా! దేవరయాజ్ఞానుసారముగ మేము పణ్యవీథిక యందుఁ బ్రజలకుఁ జోరాద్యుపద్రవములు రాకుండ రక్షించుచుండు రక్షకభటులము. మఱియు నేయేవస్తు లెవ్వ రెవ్వరికడ నుండం దగదో యాయావస్తువులు చౌర్యంబునం గాని వారివారికి లభించియుండవని మేము తలంచి యట్టివస్తువులం గొనివచ్చినవారిం బట్టు కొని యావస్తువులం దీసికొని రాజసన్నిధానంబునం బెట్టుచు భవన్నియోగంబు ననుష్ఠించుచున్నారము.

ఈదినమున నొకవెలయాలియింటిపరిచారిక యీమహార్ఘంబగు నూపురంబుం గొని యొకొ్కకయంగడికిని దిరుగుచుండెను. మే మిది చూచి యోసీ దాసీ యీనూపురంబు చతుస్సముద్రముద్రితభూమండలం బేలుమండలాధిపతులసతులు ధరింపందగినది; ఇది నీ చేతికి రాఁ గతం బేమి? దీనింగైకొని యీయంగళ్లకడఁ దిరుగుచుండెదవేల' అని యడిగితిమి. అందు కాదాసి యేమేమొ నమ్మంగూడనివచనంబుల మాకు సమాధానంబు చెప్పిన యది గాని మామానసంబులకు విశ్వాసంబు జనించినయది గాదు. ఎట్లుండిన నిట్టి యనర్ఘ మణిగణఖచితంబగు నాభరణంబు రాజసన్నిధానంబునకుం జేరవలసినదే? దీనిని నిలువ యిచ్చి కొనందగినవాఁడును రాజుగాక పెరవారలు వలంతులు గారు. అని యాలోచించి యాదాసికందోడ్కొని తెచ్చి ద్వారంబుకడ నిలిపి దాని నడిగి యీ యాభరణంబు రాజునకుం జూపి ధనము నీ కిమ్మన్న ధనం బొండె వలదనిన నాభరణంబు నొండె తెచ్చి యిచ్చువార మని నుడివి యిదె ఈసొమ్ము గొని వచ్చినారము. అని చెప్పఁగా మహీపతి విని యాదాసికం దోడ్కొని రండని యాజ్ఞసేయ నాభటులు నాదాసికం దోడ్తెచ్చి రాజుకడ నిలిపి బహుమతులు వడసి వెడలిపోయిరి.

అంత మహీకాంతుండు దనకుం బ్రణామంబు చేసి నిలుచంబడియుండుదాసికం గనుంగొని యోసీ నీ కీయనర్ఘరత్నగణవిభ్రాజమానం బైనయీకుంజీరం బెక్కడిది? దీని నేల పణ్యవీధియం దమ్ముటకుం జూనితివి. తెల్పు మన నాదాసి యిట్లనియె. ఓదేవా! నే నీయూర నుండువేశ్యావతంసంబగు విలాసవతియింటిదాసిని. ఆసౌదర్యవతికడ భవత్సభాభూషణం బైనమహాకవి కాళిదాసుండు పంజరనిరుద్ధం బగుశుకంబుచందంబునఁ దద్గుణగణబద్ధుండై మెలంగుచుండెడిని. కొన్నిదినంబులనుండి యీమహాత్మునికడ నీయొంటినూపురంబుండ నప్పుడప్పుడు గాంచితిని. గతరాత్రియం దామహామతి తాను దేశాంతరంబునకుం బోవ సమకట్టి స్వకీయవిరహంబున కోడి పరితపించునావిలాసవతి నూరార్చి యానారీతిలకంబు సామాన్య యగుటంబట్టి యీభూషణం బొసంగి సమాధానపెట్టి పోయినవాఁడు. ఆకాంతాతిలకము నిది యొంటిదై యుండుకతంబునఁ దాధరింపననువుగామి దీని నంగడివీథి నమ్ముకొని రమ్మని నాచేతి కిచ్చిపంపె. నేను పెక్కండ్రు వర్తకుల కిది చూపితిని. వా రిది గనుంగొని యీభూషణంబున నుండునొకరతనంబువిలువయే మే మొసం

గంజాల మని పల్కిరి. ఏనును జేయునది లేక దీనిం జేతనిడుకొని యెల్లరకుం జూపుచు
వచ్చుచుంటిని. రాజభటులు నన్నుం బట్టుకొని యేలికసన్నిధానంబునకుం గొనితెచ్చిరి.
ఇదియ వృత్తాంతం బనిన మహీకాంతుండువిని తనమనంబున నాదేవతానుగ్రహపాత్రుని
కడం గాక యితరునికడ నిట్టిదివ్యభూషణం బెట్లు లబ్ధం బగునని తలంచి యాదాసింజూచి
యోసీ యీభూషణం బామహాకవికడ నప్పుడప్పుడు చూచి యున్నా నని పల్కితివే!
ఇది యాకవికి దొరకినవిధంబు నీకుం దెలిసియుండకపోదు; మఱియు నిది జతవీడి యొక్క
టిగ నతనికి సంప్రాప్త మగుట కాతఁ డేమేని కారణంబు విలాసవతికిం జెప్ప నీవు విని
యుండం బోలును. ఎఱుంగుదు వేని తెలుపు మని యడిగిన నాదాసి యిట్లనియె.

స్వామీ! ఒకనాఁ డామహాకవి యీనూపురంబు తనచేతం బట్టుకొని యుండెను.
దీనిం గాంచి విలాసవతి యోప్రాణనాథా యిట్టియతివిలోభనీయంబగు భూషణంబు తమ
కెక్కడిది? సకలభూపాలవరశ్లాఘనీయకవితాకౌశలంబుగలవారి కేదేని యలభ్యంబె!
అయినను మీరు ధారాపతికడ కిప్పుడుసనుట లేదు. అట్లుండ నిది మీకుం దొరకుటకు
గతంబు చూపట్టదు. ఈసందియంబుం బాపుఁ డన నామహాకవి యోకామినీతిలకమా!
ఇది నాపైతృకధనంబు. నేను మంగలి యనియు నాతమ్ముఁడు మంగలి యొకఁ డీయూర
నన్నుం గనుంగొని మాటలాడి తాను గాళిదాసునితమ్ముఁడనని వ్యవహరించుకొనుచు దిరుగు
చుండుట యెల్లవారు నెఱింగినయదియ గదా! వానికిని నాకును బూర్వులు కడుం గౌర
వంబున జీవించినవార లెట్లుసంపాదించిరోగాని యీనూపురంబును దీనిజత యయిన
మఱొక్కటియుం సంపాదించి పూజించుచుండిరి. ఆకారణంబున నపరిమితసంపదచే నత్యధి
కతఁ గాంచి యుండిరి. నాకును నాసహోదరునికిని సహవాసంబు పొసంగక పైతృక
ధనంబుఁ బంచుకొన సమకట్టి గృహోపకరణప్రముఖంబులకుం దుల్యక్రయంబునిర్ణయించి
విభజించుకొంటిమి. ఈనూపురయుగళంబునకు సమాన మయినయాభరణంబు వేఱొండు
లేమిం జేసి తనకె కావలయు నని వాఁడును నాకె కావలయు నని నేనును గొంతతడవు
కలహించి యితరప్రకారంబున నాకలహంబునకు నివృత్తి గలుగ దని నిర్ణయించి యొక
నూపురం బేనును మఱియొకనూపురంబు వాఁడును గైకొంటిమి. కాన నిది యొంటి
యయ్యె. ఇంతదనుక మహీపతి యపరిమితధనరాసు లొసంగుచుండుటం జేసి యవి నీకొసం
గుచు నాపైతృకధనంబు గాన దీనియం దభిమానంబుతో నిన్నిదినంబులు రక్షించితిని.
ఇప్పుడు రాజదత్తము లయినధనరాసులు లేకపోవుటం జేసి యది నీ కీవలసివచ్చె. దీనికిం
జత యయినమఱియొకనూపురము నాసహోదరుఁడైన మంగలికడ నున్నది. దానిని
వాఁ డెచ్చోటఁగాని విక్రయించినవిధంబు గన్పట్టదు. దానికిం గలుగుగుణసంపద యెఱింగి
తగినవిలువ యిచ్చి విలుచుకొనం గలవాఁ డీధారాధీశుండు గాక మఱియెవ్వండును లేఁడు.
అతనికడ కది యింతదనుకఁ జేరినట్లు లవగతంబు గాదు. ఈనూపురం బొంటిది గాన

నీవు ధరింపం గూడక యుండుటంబట్టి దీనిని విక్రయించి లబ్ధమయినంతదనుక ధనంబుఁ దీసికొనుము. అనిచెప్పి గతరాత్రియం దాసురూపవతి కిది యిచ్చి చనియె. ఆతం డెయ్యెడకుం జనియెనో విలాసవతియుం దెలియంగదు.

అని యాదాసి వచింపఁగా విని భోజభూపతి తనమనంబున నత్యాశ్చర్యము నొంది దేవలోకంబున నుండం దగినయిట్టియనర్ఘభూషణంబు మానుషలోకంబున నొకమంగలవానికి లభించుట యెట్లు? ఇది విశ్వసింపం దగినయది గాదు; కాళిదాసుండు తనకు మంగలవాఁడని సంభవించియుండు నీదురపవాదముం బోనడంప నిది దేవీప్రసాదంబునం బడసి దీనివిక్రయింపం బంపిన నెపంబున మదీయమనఃకళంకంబు నివారింపంగడంగియున్నవిధంబు నామనంబునందు స్ఫురించుచున్నయది. కాళిదాసునికి తమ్ముఁడను దా నని యీధారానగరంబునం జెప్పుకొనుచుం దిరుగుచుండుమంగలవానికడ దీనిజత దొరికెనేని నాయాలోచనం బుచితంబు గాదు. దొరకదేని నాయాలోచనంబ యుక్తము. వానిం బిలిపించి విచారించిన నీయర్థంబు సరిపడును. అని చింతించి యానూపురంబు దెచ్చినవిలాసవతిదాసికకపరిమితధనంబు లొసంగి దాని నంపివేసి భటులం బిలిచి కొన్నిదినములకు ముందు గాళిదాసుని నన్నా! యన్నవాఁడు మంగలి యొకఁ డీయూర నున్నవాఁడు., వానిని మీర తెలియుదురే? యని యడిగిన నాభటులు దేవా! యానాపితుండు కడుగర్వంబున విఱ్ఱవీఁగుచు నెవ్వరిం గన్నను దాను గాళిదాసునితమ్ముండ నని నుడువుకొనుచుఁ గరము గర్వించియున్నవాఁడు. వాఁ డీయూర నుండువాఁడె? కడుఁ బేదయై యుండినవాఁడు ఏవిధంబుననో! యెఱుంగము. ఇప్పుడు ధనాఢ్యుండై నాపితకృత్యంబుసయితము మానుకొని సుందరము లయినయంబరములు దాలిచికొని విడెముసేయుచు జూదం బాడుచుఁ గాలయాపనంబులు సేయుచుం బ్రతిమనుజునితోఁ దాను కాళిదాసునితమ్ముఁడ నని చెప్పుకొనుచున్నాఁడు. వానిని మేమందఱమెఱుంగుదుము. అని చెప్పఁగా రాజు వానిం బట్టుకొన్నితెం డని ముదలయిడ నప్పుడ చని రాచనగరున కెదుట రథ్యాపర్యటనంబు సేయుచున్న యవ్వానిం దోడ్కొని వచ్చిరి. ఆమంగలియు రాజునకు వందనంబు లొనరించి నిలువంబడియె. అపుడు రాజు వానిం గాంచి యోరీ పూర్వము కాళిదాసునితమ్ముఁడ నని వచ్చినవాఁడ వీవకావే? నిన్నుం జూడం గోరి రప్పించినవాఁడ ననఁగా మంగలవాఁడును దేవా! ఔను! నేను కాళిదాసునితమ్ముఁడనే? ఏలికనియోగంబునం బ్రవర్తింప సిద్ధపడి యుండెద ననిపల్కెను.

అప్పుడు రాజునకును మంగలవానికిని కొన్నిసంభాషణలు జరిగెను.

రాజు.—ఓరీ, నీకులం బేమి? మంగలవాఁడవేనా?

మంగలవాఁడు.—దేవా! ఔను మంగలవాఁడనే.

రాజు.—ఓరీ కాళిదాసుండును నీవును మీకుం గల పైతృకధనంబును విభజించు కొనియున్న వారలే కదా! ఆయావిభక్తద్రవ్యంబు వారివారికడ సురక్షితంబయి యుండం జనునుగదా ?

మంగలవాఁడు.—దేవా! అట్లె విభక్తధనంబు నాకడ సురక్షితంబై యున్నది.

రాజు.—ఓరీ! కాళిదాసుని వస్తువులు కొన్ని యంగడివీథి కమ్మకమునకు వచ్చిన నందు నొకమంజీరంబు మీపైతృకంబునఁ జేరినది మేము గోరి విలుచుకొంటిమి. దానికి జతయయిన మఱియొకనూపురంబు నీకడ నుండునట్లు మాకుం దెలిసినయది. అది మా కత్యావశ్యకంబు గాన నీకోరినధనంబుఁ గైకొని మా కాభూషణంబుం దెచ్చి యిమ్ము.

మంగలవాఁడు.—దేవా! యే మిరువురమును బిత్రుసంపాదితధనమున నెన్నియో సొమ్ములు విభజించికొంటిమి. ఏలిక యడుగునూపురం బెనియో చూచినం గాని దానిజత బోధపడదు.

రాజు.—తనసమీపముననుండు పేటికయం దుంచియుండెడునూపురంబు నెత్తి చూపి, ఓరీ! దీనిజతయే మేమడుగునది. ఇది కాళిదాసునివలన విలాసవతి వడసి యమ్మం గడంగిన మేము దీని విలుచుకొన్నవారము.

మంగలవాఁడు.—(నూపురంబుం జూచి, గుండెలు తటతటమని కొట్టుకొనఁగా,) దేవా! మావిభక్తద్రవ్యంబునం జేరినది గాదు. దీనిజత నాయొద్ద లేదు.

రాజు.—ఓరీ ! మీ రిరువురును విభక్తదాయంలరైతిరి. అందుం గొంతభాగ మొక్కనికడ నుండెనేని తక్కినకొంతభాగ మింకొక్కనికడ నుండం జనదా ! కాళిదాసుండు తనకడ నీసొత్తున్నదని వెల్లడిచేసినవాఁడు గాఁడు. యాదృచ్ఛికముగ మాకిది దొరకెను. విచారింపఁగా నతనివస్తువని తెలియవచ్చినది. ఈయర్థంబు ప్రమాణంబ యని నమ్మనగును. అది గొనితెచ్చినదాసి కెంతధనం బొసంగినవారమో దానికంటె నధిక ధనంబు నీ కీసమ్మతించినారము. లోభంబునం జేసి నీవు దాఁచెద వని తోఁచెడిని. నీకోరిన ధనంబు లొసంగెదము. నూపురంబుఁ గొనిరమ్ము.

మంగలవాఁడు.—దేవా! సత్యముగఁ బల్కెదను. దీనిజత నాకడన లేదు. ఆకాళిదాసుం డెక్కడ సంపాదించెనో యెఱుఁగను.

రాజు.—ఓరీ యీనూపురద్వయము మీపూర్వులు సంపాదించిరనియు నందుఁ దనకడ నొక్కటియు నాతనితమ్ముండ వైననీకడ నొక్కటియు నున్నదని యతఁడు విలాసవతితోఁ జెప్పినవచనంబులచేత నవగతం బగుచున్నది. గాన దీనిజతయగు మఱియొక నూపురము నీకడ నున్న దనుటకు నడ్డంకి లేదు. నీవు ధనలోభంబునం జేసి యీ నియ్యకొన

కుండుట సువ్యక్తం బయ్యెడిని. అది యత్యుత్తమధనంబు గాన రాజునకడకుం జేరం దగిన దియ. అది యిప్పుడ మా కప్పగింపవేని నిన్నుఁ గఠోరదండనకుం బాల్పఱచెదను.

మంగలవాఁ డేమియుం జెప్పలేకయూరకుండెను. రాజాజ్ఞచే భటులు వానిం బట్టి బిట్టు ప్రహరించిరి. అప్పు డతిచండతరంబులగు రాజభటులు సేయు మహాప్రహారంబులకు నోర్వంజాలక యానాపితుఁడు నాకడ నీసొమ్ము లేదయ్యా యని యాక్రోశింప రాజభటులు ఓరీ కాళిదాసునితమ్ముండవు. అతనితోఁ బంచుకొన్నసొమ్ము నీకడ లేకపోవునా! అది యిచ్చునంతదనుక నీదండనంబు నివర్తింప దని కరము క్రూరముగఁ బ్రహరింపఁగా నామంగలి యోర్వంజాలక యిఁక వాస్తవంబు పల్కుక విమోక్షంబు లేదని యెంచి అయ్యా! నేను కాళిదాసునితమ్ముఁడను గానయ్యా! అతనితో సొమ్ము నేను బంచుకొన లేదయ్యా! బ్రాహ్మణులు కొందఱు నాకు ధన మిచ్చి యీప్రకారము చెప్పు మనిరి, కాన నేను ధనలోభంబునం జేసి యీపనికి లోఁబడితిని. నేను నీచుండ నగుకారణంబున నిట్టితుచ్ఛపుంబని కొప్పుకొంటిని. ఇది నిజము. ఈప్రహారంబులకుఁ బ్రాణంబు లింక నిలువం బోవు. ఓదేవా! రక్షింపు మని భోజునిపాదములపైఁబడియె అంత భోజుండు బ్రాహ్మణులు చేసియుండు కపటంబునకు మనంబున నాశ్చర్యపడుచు నామంగలిని విడిపించి వానివలనం గాళిదాసునియెడఁ గవులు చేసినకపటం బని విస్పష్టముగ నెఱిఁగెను. అప్పుడు తరంగవతియుం భయసంభ్రమంబులతోఁ జనుదెంచి భూమీశునికిం బ్రణామం బాచరించి యభయం బడిగి యిట్లనియె. ఓదేవా! యేను పెక్కండ్రు బ్రాహ్మణులు ప్రాయోపవేశంబు నేసి ప్రాణంబులు వాయం గడంగి యుండ వారలప్రాణత్యాగంబునకోడి దేవిపాతివ్రత్యతేజం బెఱింగియుండుదానంగాన నాపతివ్రతాతిలకంబు తనపయిం గలుగుదూఱు వోఁగొట్టుకొనం గలదు. బ్రాహ్మణమరణపాపంబును దొలంగు నని యెంచి దేవివిషయంబున నపరాధంబు పల్కితిని. ఇందుకు నన్ను దండితం జేసి నన్నను గ్రహింపు మని వేఁడుకొనఁగా రాజు ముసిముసినగవులు నగుచు నోతరంగవతీ నీవు చేసినదియు నాబ్రాహ్మణుల కపటంబె యని యడిగి యాతరంగవతి యొనర్చినకపటం బంతయు దానివలన దెలిసికొని విస్మితుండై లీలావతిం గాంచి యోదేవీ యాకపటం బెఱుంగకయ నీయెడ మహాపరాధంబు గావించితిని. నేను మహాపాపిష్ఠుఁడను. నాకంటెం గ్రూరతముండు లోకంబున నెవ్వఁడుండు? నన్ను మన్నింపుము. ఈక్లేశంబు మనంబున నుంచుకొనకుము. అని యాదేవిని పట్టుపట్టిచి కాళిదాసునియందుఁ దాఁ జేసినయపరాధంబునకు వెచ్చనూర్చుచు నింక నాకవింగాంచి యాతని సమాధానపఱుపక తనమానసం బుండదని యాలపించుచు నాతని నెట్లు గాంతునని తహతహపడుచు నూరటం జెందకయుండె.

లీలావతియుఁ దనసాయకుండు గాళిదాసవిరహంబునం జేసి యతిపరిక్షీణమగు నంగంబుతో ననవరతచింతాసంతానదంతురితస్వాంతంబుతో నానసాభివ్యజ్యమానమగు

దైన్యంబుతో నతిశయితరాజ్యకార్యాదరవిరహంబుతోఁ గ్లేశంబుం గాంచుచు నభ్యవహారాదికృత్యంబులయం దభిరుచి లేక పరులప్రార్థనల బలాత్కారంబునం గాయికకృత్యంబుల నతికృఛ్రగతిం దీర్చుకొనుచు నున్మత్తునిభాతి నుండుటకుఁ దనహృదయంబునందు వగచుచుండునది యగుటం జేసి యాదేవి రాజుకడకుం జేరి యిట్లనియె. ఓప్రాణనాథా! మహాకవిఁ గాళిదాసుని నెడబాసి మీరు దురంతవేదనాసంతానంబులఁ దపియించుచున్నవారు. తత్ప్రాప్తివలనం గాని మీ కీవేదన నివర్తింపం బోదు. మీయంగంబులు గడుదుర్బలంబులై కనంబడుచున్నవి. ఇంక నుపేక్షించి యుండిన నీజగన్మంగళ మయినవస్తువున కేదేని యెగ్గు గల్గునొకో యని సందియంబు వొడముచున్నది. ఊహించి చూడ నాచారణుండ కాళిదాసుం డనుటకు సందియంబు లేదు. ఆతండు గానినాఁడు మీయభిప్రాయం బెఱింగి పల్కుటకు శక్యంబు గాదు. ఆచారణుండు పండితబృందంబుతో విత్తస్పృహచేత భోజభూపాలునిం గాంచ నేతెంచుచున్నవాఁడ నని చెప్పెనుగదా? అది తథ్యంబ యయిన నాచారణుండు మనసభకు వచ్చియుండవలదా? అట్లు రాలేదు గాన నే చారణుండు గాఁడని నిర్ణయింపం జనును. మఱియుం మీయభిప్రాయం బెఱింగి పల్కుటం జేసి యాపురుషుండు కాళిదాసుండ యని నిర్ణయింప నగును. ఆదయాళుండు పండితమండలికి సంభవించినదుర్దశావిశేషంబుం గనుంగొని వారలఁ గావం దలంచి భవద్భీతిచే వ్యక్తుండు గాకయ చారణవేషంబుతోఁ జనుదెంచె. తాఁజెప్పినపద్యోత్తరార్థంబు మీచెవి కెక్కిన నెవ్విధంబున నైనను మీరు తన్నుం గనిపెట్టుదురు. అప్పటికి రాజాజ్ఞాతిక్రమాపరాధంబు తనయందు వ్యక్తము గాఁగలదు. కాన నీధారానగరంబున నుండం జన దని తలంచి వెడలిపోయినవాఁడు. భటుల నంపి యాతనిం గనిపెట్టి తోడ్తెచ్చునంతకు మీ శరీరం బసమానదయనీయావస్థావిశేషంబునకుం బాత్రం బగు ననుటకు నడ్డంకి లేదు. మఱియుం మీరు చేసియుండుమహాపరాధం బాతనిమానసంబునకు గరము నొప్పించి యుండును గాన మీరలె యాతని ననునయింపక యతనిహృద్గతం బగుపరితాపభరంబు శాంతిం జెందం బోదు. ఇట్లగుటం జేసి యతనియుండు నెడకు మనము యరుగుట కర మర్హమైనయది. కానిప్పుడు సేయంగలతెఱంగు నామనంబునకుం దోఁచినది విన్నవించెదను. ప్రాణనాథా! మనమిరువురము వేషాంతరధారులమై యత్యంతావశ్యకంబగు పరిజనంబుతో వసుమానసనగరంబునకుం బోవలయు. అయ్యెడ నుదయాదిత్యసత్కృతంబై కవిపండితమండలంబు కరము దీపించుచున్న దని విందుము గాన నందుఁ గవి నన్వేషింపం జనును. అందుల కిప్పుడ వెడలుట మేలు. ఈనానుడివినయర్థం బనర్థావహంబు గాదని మీమానసంబునకును దోఁచెనేని యనుష్ఠింపుఁడు. అని చెప్పిన భూపతియు లీలావతీదేవి వచించినయర్థంబుం గొనియాడి యందుల కియ్యకొనియె. అప్పుడ లీలావతియు నార్యుని బుద్ధిసాగరునిం బిలిపించి వృత్తంబు విన్నవించి రాజ్యకార్యంబుల నతిజాగరూకతం బ్రవర్తించుచు మే మియ్యెడకు వచ్చియుం జేరునంతకు మే మీనగరంబుం బాసి చనినవృత్తంబు నెవ్వరికి నెఱింగింపక

యుండు మని చెప్పి యప్పు డావృత్తాంతంబు నావలన నెఱింగినవిరజాంబుజ సనుదెంచి తనపాదంబులం బట్టుకొని తన్ను వెనువెంటఁ దోడ్కొని పొమ్మని నిర్బంధింప నందుల కియ్యకొని ప్రయాణంబునకు సన్నాహంబు గావించెను. భూపతియుం లీలావతియు విరజాంబుజయుం సాధారణజనుల కుండెడు వేషంబులు దాల్చిరి. ఏనును లీలాదేవిచే నాజ్ఞాప్తనై తదనుసారంబగు వేషంబు ధరించితిని. అప్పుడు సాహిణులు గొని తెచ్చినయతిజవోపేతములగునుత్తమాశ్వంబు లెక్కి మేము నలఁపురమును బయలు వెడలితిమి. మానసంబునకు నుద్దిష్టకార్యానుకూలతం గనుపఱుచుటం జేసి మహానందదాయకంబులగు సుశకునంబులగుటకు భూపతియు దేవియు సంతసించుచు మహాకవిదర్శనంబు గలుగుటకు సందియంబు లేదని యనుకొనుచు నీమహాఫలసిద్ధిసూచకంబులగు సుశకునంబులకుఁ దమ కింక నెట్టిమహామోదావహంబులగు మంగళంబులు గలుగ నున్నవో యని చెప్పుకొనుచు ధారానగరంబు వెలువడి యారాత్రి యంతయుం బయనం బొనరించి సూర్యోదయం బగుడు నొక కాననంబున నొకమహాతటాకంబు గన్పట్టఁ దత్సమీపమున నత్యున్నతంబు నతివిశాలంబు నగునొకవటవిటపియుండం గాంచి దానిక్రిందం దిగి యాహ్నికకృత్యంబులు దీర్చుకొని యాదినం బెల్ల నయ్యెడం గడపి యివ్విధంబుగఁ దక్కినత్రోవయుఁ గడచి వసుమానస నగరంబుఁ జేరి యయ్యెడకు మహాకవి వచ్చినదాదిగ వృత్తాంతంబు పౌరులు గుంపులు గూడి చెప్పుకొనుచుండ విని వారివలన నుదయాదిత్యుండును గాళిదాసుండును విద్వద్వేశ్యాకన్యకను జయింప సింహపురికిం జని యున్నవారని తెలిసికొని యవ్వసుమానస నగరంబు వెడలి యెడతెగనిపయనంబున నాదిత్యుం డపరగిరి శిఖరంబుం జేరిన వెంబడిన చిమ్మచీకటు లంతటం గలయఁ బర్వ నీసింహపురంబుం జేరి పట్టణమున ననేకస్థలంబులఁ గవిపండితసంఘంబు లుండుపట్టులకుం జని కాళిదాసునాకారంబు సెప్పుకొనుచు నట్టివానిం గాంచితిరా! యని యెదురైనవారల నడుగుచు సంచరించితిమి. ఈనగరంబున నిట్టివాఁడు గానంబడ లే దని వారు బదులు సెప్పఁగా వినుకొనుచు నగరం బంతయుఁ గలయ నవలోకించితిమి. కవిజాడ గనంబడదయ్యె. అవ్విధంబున నడిగి విచారించుకొనుచు నీపురంబు నుత్తరపువైపున వచ్చుచుండ యాతాయాతజనంబులవలన నొకవిస్మయనీయమగువృత్తాంతంబు వింటిమి.

గీ. తరుణు లిద్దఱు నిరుపమోదారరూప, గౌరవశ్రీమనోహరకాయు లరఁటి
యాచకట్టలఁ గట్టెల కుత్తిగాఁగ, నమ్ముచుఁ జరింతు రాశ్చర్య మదియ చూవె.

అని జనంబులు సెప్పఁగా నాపురుషు లెయ్యెడకుం జనిరని యడిగి విద్యాసర్వస్వవేదినిసౌధంబునకుం జనిరని చెప్పఁగా విని యాసౌధం బుండుచోటికిం జనుదెంచితిమి.

గీ. అరఁటియూచలకట్టకు నైనవిలువ, వేయిగద్యాణము లటంచు విన్నకతన
నిది కపటకృత్య మగు నని యెంచి దీని, నారయఁగఁ గోరి తడసితి మమ్మ యిందు.

క. విద్యావేదిని విద్యా, హృద్యత యాతరుణపురుషహేవాకము గు
ర్వేద్యముగ నున్న దయ్యది, సద్యఃకాలమున నెఱుఁగఁ జను మన కనుచున్.

గీ. తలఁచి యీసౌధముఖమున నిలిచి యుండి
మీకు వాగ్వాద మియ్యెడ మెలయుఁ దెలిసి
లోఁ బ్రవేశింప ననువేది లోంగుచుండి
చూచ్చితిమి యీధరాపతి చొచ్చునపుడు.

ఓభర్తృదారికా యిదినీజననీజనకులు నీవుండుచోటికిం జనుదెంచినవృత్తాంతంబు' అని రాగసేన వల్కఁగాఁ దరుణాంబుజ యారాగసేనం గాంచి యోసీ నీనుడివినవృత్తాంతంబు సరి యని నమ్మవచ్చు. నాజనకునికిఁ గాళిదాసునియందు మంగలవాఁ డనుసంశయము మంజీరవృత్తాంతంబువలన నివృత్తం బయ్యె. నాజననికి హుతాశనశుద్ధివలనఁ నించుకేనియుం దోషంబు లేదనియుం దెలిసె. హుతాశనవిశుద్ధికాలంబున నాజనని యొనర్చిన ప్రార్థనంబున నాయపరాధులగు విప్రుల నేమియుం ననక వారలయందుం గలకోపంబును నాజనకుఁడు వదలిపెట్టెను. అదియునుంగాక యితఁడు బ్రహ్మణ్యుండు గాన నోర్చుకొనియె. ఆమహాకవి కాళిదాసుండును తనకు మహాపరాధంబుం గావించియుండువారైనను కవులు ధారానగరంబును బాసి పోవునప్పుడు వారలం గాన దయాళుండై వారల కెదురుపడి రా జొసంగినసమస్య కుత్తరార్థంబు వచించియుండు ననుసంభావన యుంపపన్నంబయినయదియె. ఆమహాదయాళునియుం త్తమప్రవర్తనంబు నెన్నినోళ్లం బొగడినను జాలునని యన నగునా! ఆమహాత్మునిదర్శనంబు నాజనకునికి నెప్పుడు గలిగి తద్విరహక్లేశం బెప్పటికి నివృత్తంబు గాఁగలదో! విధి యెప్పటెప్పటి కేయేవస్తువులఁ జేర్చునో! యెప్పటికెప్పటికి విఘటింపం జేయునో యెవ్వం డెఱుంగు. నాజనకునికిం గాళిదాసలాభంబు గల్గినంగదా యందఱకు ముదంబు గల్గు. ఆమహామహుం డెయ్యెడ నున్నవాఁడో? ఎవ్విధి నతనిసందర్శనంబు నాతండ్రికిం గల్గునో! నిర్ధారణసేయ ననువుపడక యున్నది. ఇది దైవాయత్తంబగునర్థంబు గాన మనుష్యమాత్రులు మంత్రాలోచనంబున సాధింపఁ దగినది గాదు. అది యట్లుండ నిమ్ము. విలాసవతి యింటిదాసివలన సులబ్ధం బయినయామంజీర మిప్పు డెవ్వరికడ నున్నదో యెఱుంగుదువే! అని యడిగిన రాగసేన యోభర్తృదారికా యాదివ్యమంజీరంబు నీజనకుండు తనప్రాణపదముగ నెంచి రక్షించుచున్నవాఁడు. ఆమహారాజుకడన యున్నది యనఁగా నాతరుణాంబుజయుఁ దనసమీపమున నుండుభోజభూపతిం గాంచి యోతండ్రీ సుతావత్సల! యామంజీరంబుం జూడ నా కభిలాష యున్నది;

అనర్ఘంబు లేవేని గలుగ వని తోఁచుట తిరం బగునేని యాభూషణంబుఁ గాన్పింపు మని వేఁడుకొన సాధారణమానుషవేషధారి యయి వచ్చియుండుభోజుండు తనయుత్తరీయాంత రాచ్ఛాదితంబయి యుండుమంజీరంబును తరుణాంబుజచేతి కిచ్చెను.

అప్పు డానూపురమణికాంతులు దీపచ్ఛాయల నడంచి యామందిరాంతరంబును మధ్యాహ్నార్కమరీచినిచయనీరంధ్రంబై వెలయున ట్లొనరించె. అప్పు డాహంసకంబుం గాంచి తరుణాంబుజ మానసంబున నచ్చెరువందుచు రాగసేన వచించినవృత్తాంతం బంతయుం సత్యం బని నమ్మి దిగ్గున లేచి తనజననీజనకులపాదంబులకు వందనంబు సల్పి యోతండ్రీ మీరు నాజననీజనకు లని యీకవియుం రాగసేనయుం జెప్పిన నింతదనుక నమ్మకము జనింపక సముచితాచారవిధానంబు సల్పకుంటిని. ఇప్పు డీయనర్ఘభూషణంబుం గాంచి యిది నీకడకుం జేరియుండినవృత్తంబు విశదానం గాన నిక్క మెఱిఁగితిని. నాయొనర్చిన వ్యతిక్రమంబు క్షమింప వేఁడెదను. ఎన్నియో దినంబులకు వెండియు భవత్పాదాభివందనంబుగలిగె. దేవి యగుభగవతి యనుగ్రహంబు గల్గిన నెది లభ్యంబుగాదు.

అని వచించుచు బాష్పజలవర్షంబుల నడుగులు గడుగుచున్నతరుణాంబుజ నెత్తి భోజుండును లీలావతియు నాఁదల మూర్కొని యంకతలంబున నునిచి యానందబాష్పధారాప్రవాహంబుల నాతనూజాతమూర్ధంబుఁ దడుపుచు గద్గదకంఠులై యేమియుఁ బల్కం జాలక మిన్నకుండిరి. తరుణాంబుజయు విరజాంబుజం గాంచి వత్సా! విరజాంబుజా యిన్నిదినములకు వెండియు నిన్నుం గనుంగొనం గల్గె? భవద్విరహావిక్లబంబు లగు నాయంగంబులు సుఖంబు నొందునట్లు నన్నాలింగనము చేసికొనుము. అనిన విరజాంబుజయు నాలింగన మీక దవ్వుల నిలిచి యుండం గాంచి తరుణాంబుజ తనమనంబున నీవిరజాంబుజ నేను పురుషవేషంబున నున్నా నని యాలింగన మీవెఱచుచున్నది; ఇఁక నీవేషం బుజ్జగింపం జను నని గృహాంతరంబునకుం జని యాపురుషవేషంబుం బాసి తరుణాంబుజవేషంబుం దాలిచి వచ్చెను. విరజాంబుజయు నాతరుణాంబుజ నాలింగనాదుల సంభావించె.

ఇంతకుం బూర్వము భోజలీలావతుల నెఱిఁగినప్పుడ ప్రతాపపాలుండు దాసీజనంబునకుఁ దనదేవికిం దెల్పి తోడ్కొని రమ్మని చెప్పి పంపెను,

తదాజ్ఞావశవర్తిని యై యాసింహపురాధీశునిరాణి శృంగారవతి తనకూఁతు రగు వసుధారిణితో నయ్యెడకుం జనుదెంచెను. ప్రతాపపాలుండు ఓదేవీ ఈయింతి నీసహోదరి యగులీలావతి. ఈతండు లీలావతీభర్తయగు భోజభూపాలుండు. మనవిద్యాసర్వస్వవేదిని లీలావతీగర్భశుక్తిముక్తాయమానం బైనతరుణాంబుజయట. ఈముద్దులపట్టి తరుణాంబుజకేకోదరజనిత యయినవిరజాంబుజ. అనఁగానే వసుధారిణి తరుణాంబుజను విరజాంబుజి నాలింగనముచేసికొని యోయార్యలార! యీదినమున మిమ్ముంగాంచుట కెంతపున్నియంబు

రచించితినో! ఇది తరుణాంబుజ యనియెఱుంగకయ యిన్నిదినంబులు సంతసంబుం గాంచక యుంటిని. బహుదినములనుండి మిమ్ముం గనుంగొనందలంచి మాతల్లితోఁ జెప్పుకొనుచుంటిని. ఈమెయిఁగాలహరణము సేయుచువచ్చినయది. అం దీతరుణాంబుజ భువనేశ్వరీదేవాలయమునఁ గనంబడకపోయె నని విని దుఃఖాకులహృదయనై యుంటిని. నాభాగ్యం బేమనవచ్చు? ఇప్పుడు మిమ్ము నిరువురం జూడం గంటినే యని సంతోషజనితాలాపంబులాడుచుండ శృంగారవతియుం నార్యా లీలావతీ! యని యాదేవి నాలింగనము చేసికొని విరజాంబుజాతరుణాంబుజలను గౌఁగిటం బొదివి గారవించి భోజభూపతియెడ వినయగౌరవంబుం గానిపించి వారలు సనుదెంచినవృత్తంబు విని యథోచితాలాపంబులనిష్టగోష్ఠి పరితృప్తత వహించె. వసుధారిణియు భోజలీలావతులయడుగుల కెఱఁగిన నాకమలాననను గౌఁగిటం జేర్చి లీలావతీభోజభూపాలురు వాత్సల్యంబుం గానిపించిరి. అప్పుడు ప్రతాపపాలుండు విద్యాసర్వస్వవేదిని తరుణాంబుజ యని యెఱింగినంతట నమితానందంబుం బొంది భోజభూపాలునిం గాంచి యోమహీపాలతిలకమా యీకన్యారత్నంబు నీ తనూజాత యనుటకుం దగినయది. దీనివిద్యాచాతుర్యంబు మనుష్యమాత్రులకు జయింపరానిది. ఇది తాను వేశ్యాకన్యక యని వెల్లడిచేసి సంపాదించినధనంబులు సంతతము మహానీయులగు బ్రాహ్మణులకు నొసంగుచు నించుకేనియుం వ్రతభంగము గలుగకుండఁ దనకన్యకాత్వంబును రక్షించుకొనుచున్నది. నాకు సుతాసమాన యగుటం గాఁబోలు దీనింగాంచి నప్పుడు వసుధారిణియందుం బోలె నాకు వాత్సల్యంబు వొడముచుండె. ఈశృంగారవతికి నట్లై కరము దీనియందు వాత్సల్యం బుండు. ఈవసుధారిణియుఁ దనసహోదరిఁగా భావించియుండెను. అది యట్లయ్యె అని కొన్నిసంతోషజనితాలాపంబులు పల్కెను. ఎల్లవారికిని మహామోదంబు గల్గెను. భోజభూపతి కిట్టివినష్టసుతాపునర్లాభంబున నపరిమితామోదంబుం జెందవలసినకాలం బయ్యును మొగంబున నించుకేనియుం సంతసంబు గనంబడకయ కేవలముదైన్యతాకరంబై యుండుటకు నచ్చోటివారలు చింతించుచుండిరి. అది గాంచి తరుణాంబుజ తనమనంబున నీమహీపతికి మహాకవిప్రాప్తి యయినంగాని మొగంబున విన్నదనంబు మానదు; ఆకవివిరహంబున నీరాజునకుం గొన్నిదినములకు శరీరత్యాగంబును సంభవించు నని తోఁచెడిని; ఆకవిఁ గనిపెట్టుట కనువు లేకయున్నది; ఏమి సేయ నగును; నన్ను విద్యల నోడించినయీకవివలన నామహాకవివృత్తాంతంబుం దెలిసికొనం జనును గాని యుపాయాంతరంబునం గాదు; అని యెంచి యాకట్టెలమ్మువానిం గాంచి యోమహాత్మా! నీవు సర్వజ్ఞుండవు. నీకుఁ దెలియని దేదియుం లేదని యెఱుకపడుచున్నది. భవత్ప్రయుక్తమగు నాటకచ్ఛాయచే నాకాళిదాసునివృత్తాంతంబు నీకుగోచరమయి యుండు నని తలంచెదను. ఆకాళిదాసుని ప్రియురాలగు విలాసవతిదాసి వచించిన పల్కులవలన నీదివ్యమంజీరము కాళిదాసుం డాకాంత కొసంగినయర్థం బేర్పడుచున్నది. ఇది యతనికి సంప్రాప్తం బయినయర్థంబున నామానసంబు సందియంబు నెడఁబాయదు.

ఈభూషణంబు దివ్యజనోచితంబు గాన మానుషలభ్యంబు గాదు. కాఁబట్టి యతనికి మనుష్యులవలన సంప్రాప్త మయిన దనునర్థంబు నిరాకృతము. ఇది యామహాత్మునికెవ్విధి సంప్రాప్తంబయి యుండునో, యది యొకటిగ దొరకుటయుం గతం బెయ్యదియో కరుణించి తెల్పు మని యడిగిన నాకట్టెలమ్మువానివేషంబుతో నుండుకాళిదాసుండు నో మగువా! ఆమహాకవి దేవతానుగ్రహపాత్రుండుగానఁ దత్ప్రతిపాదితంబై యతని కీదివ్యజనధార్యం బయినమంజీరంబు లబ్ధంబై యుండుఁ గాని యితరవిధంబున సంప్రాప్తం బయి యుండదు. ఇట్టియపరిమితతేజోవిశేషవిభాసితం బయినయీభూషణంబు భూలోకపాలురకడ లేదు గాన వా రతని కిచ్చిరనుటయును నసంభావ్యమ యగు. ఇది యామహాకవికి లభించినమార్గంబు నెఱుంగఁ గోరెద. దీనికిం జత యయినమఱియొకనూపురం బెయ్యెడ నైన నుండును గాని లేకపోదు. ఇదిదీనిజత యుండుచోటికొండె నదియిదియుండుచోటికొండెఁ జేరుట లగ్గు. ఇం దేదేని యొక తెఱంగుఁ గావింపుము. ఇదియునుంగాక మా జనకుండగు భోజభూపాలుని కాకాళిదాసునియందుం గలనిర్వ్యాజప్రేమభరం బింత యని వచింపఁబోలదు. అట్టిప్రణయం బీమహీపతి కితరులయందుఁ గనంబడదు. జన నాంతర సౌహృదం బుండనినాఁ డీపుట్టువున నిట్టిప్రేమంబు గల్గదు. ఆకవియెడ నీయిలాపతికిం గలయాదరంబు లీలావతియం దైనను జూపట్టదు. ఇందుకు గతంబు దెల్పంజనును. మహీపతికిఁ గవి మంగలి యని విప్రులు చెప్పినకపటవచనంబులం గలిగినసంశయంబు మంజీరవృత్తాంతంబువలన నివృత్తం బయ్యె నీమంజీరం బతనికి లబ్ధమైనవృత్తాంతం బెఱుకపడునంతకు సాకొసారెకు నుద్బుద్ధము గాకపోదు. అదియునుంగాక లీలావతీదేవి యగ్నిశుద్ధిం జెంది తనపతివ్రతాత్వవైభవంబు సకలజనసమక్షంబునం గనంబఱచినది గాన నాదేవియందు దోషము లేదని మాత్రము రాజు నిర్ణయించి యుండెఁజనును గాని యాదేవి యూర్వంతరంబునందుం దిలసదృశకుగు నల్లనిమచ్చ యున్నదని కవి యెఱుంగుటకుఁ గారణముం దెలిసికొనం గోరుచుండకపోఁడు. ఈయర్థంబులందు భోజభూమీశునికి కాదు; తక్కుంగలవారలకును సయితము సందేహము నివర్తింపక యుండును. నీవు మహాత్ముండవు గాని సాధారణుండవు గావు. నీవు ప్రయోగించిననాటకచ్ఛాయవలన నేనడిగినయర్థంబునం గలసంశయంబులు దీర్పం గలవాఁడ వని నిశ్చయంబు గల్గియున్నది. ఈదీనజనంబును గరుణించి నాసంశయవిచ్ఛేదంబుఁ గావింపుము. అని యడిగిన నయ్యెడ నుండువారలు నీతరుణాంబుజ యడిగినయర్థంబున నెల్లవారలమానసంబులును సందేహాకులంబు లయి యుండునవియ. దీనిం దెలిసికొన నందఱకును బ్రియంబుగలదు. ఇందఱ యభిప్రాయం బెఱింగి తదనుగుణముగఁ బ్రశ్న చేసినయీభోజరాజతనూజబుద్ధివైశారద్యంబు కరమభినందనీయంబ యని పల్కిన నాదారుశిరునివేషంబుతో నుండుమహాకవియుం దనమానసంబున నీభోజతనూరత్నం బతులితచాతురీనిధానంబు గావున నన్నుం గాళిదాసుం డనిసంశయించుచుఁ దన మనోగతార్థంబు నిర్ధారణసేయ నీనిగూఢార్థంబుల నన్నడుగుచున్నది; ఇంతదనుక వారల

వృత్తాంతం బెల్లఁ దెలిపి యిఁక విరమింపుకొనుట యుచితంబు గాదు. ఈయర్థంబు వెల్లడిసేయ నేన కాళిదాసుండ నని విజ్ఞాతంబుగాకపోదు. అయినను గానిమ్ము. అనితలంచి యాచంచలాక్షిం గాంచి యోభోజసుతారత్నమా నీవడిగినయర్థంబు భోజలీలావతుల జన్మాంతరవృత్తంబు. దీనిం దెలిసికొని పలుకంగలవారు త్రికాలజ్ఞానసంపన్నులగు దేవతలు గాని మానుషులుగారు. దేవతను సాక్షాత్కరింపం జేసిపలికింపంగలవాఁ డాకాళిదాస మహాకవి గాక మఱి యెవ్వండును లేఁడు. అయిన నే నాకవిచరిత్రంబుఁ దెల్పం బూనుకొన్నవాఁడం గాన భక్తవత్సలత దోఁప నామహాత్ముఁడగు కాళిదాసునియిష్టదేవత దయామయాంతఃకరణ యై యావిర్భవించి మనయిష్టార్థంబుల నెఱింగింపం గడంగంబోలు. అని యిట్లు వల్కుచుండం గొందఱు ద్వారపాలికలు ససంభ్రమంబుగ నేతెంచి కలయ నవలోకించి విద్యాసర్వస్వవేదిసికిం బ్రణామంబులు సలిపి ఫాలతలకీలితకరాంజలులై యిట్లనిరి. ఓయమ్మా! ఏము భవదీయములయిన ప్రభావసీమ, వినోదసీమంబులనుమండపంబులం గాచియుండెడువారము. మమ్ము నతిక్రమించి యెట్టివలంతులుగాని యామణిమండపముల నాక్రమించుకొన్నది లేదు. ఎట్టివె పరీత్యమో! ఎఱుంగము. ఇప్పుడు కొందఱు మహాసౌందర్యవతులు సకలాయుధధారిణులుసామజసహస్రబలోపేతలుసర్వాభరణభూషితలు చతుర్భుజవిభ్రాజితలు చంద్రకళావతంసలు చదలం బుట్టినయట్లు తోతెంచి బలిమి మెయి మమ్ముం దఱుమంగొట్టిరి. తత్తేజోవిశేషహస్తధైర్యల మయి యేము నయ్యెడ నిల్వలేక పఱువిడి వచ్చి యర్థంబు విన్నవించుకొంటిమి. అని చెప్పఁగా నెల్లవారలు నాశ్చర్యరసపూరమగ్నమానసు లగుచుం దద్విలోకనోత్కంఠాయంతితత్వరావివశులయి సంభ్రమింపఁ దరుణాంబుజయుఁ దనమనంబున నీమహాత్ముఁడు మత్ప్రార్థనం బంగీకరించి దేవతాసాక్షాత్కారంబు గలుగంజేసెడి నని తోఁచుచున్నవి. కాళిదాసుండు గానినాఁ డితని కిట్టిసామర్థ్యం బెక్కడిది? యని యనుకొనుచు నాదారుశిరునియాజ్ఞం గొని యొక్కమ్మడిఁ గ్రక్కున నాసనంబులు విడిచి లేచినసకలజనంబులతోడను తశజననీజనంబుతోడను భోజప్రతాపపాలురతోడను దక్కుంగలప్రణయసఖీకదంబంబుతోడను ఏఁబదియేడవ కక్ష్యాంతరంబుం జొచ్చి యచ్చట నుండుప్రభావసీమ బనుమహామణిమండపమునందు ద్వారపాలికలు సెప్పినయొప్పిదంబు గలయొప్పులకుప్ప లెవ్వరును లేక శూన్యమయి యుండుటం గాంచి దారుశిరునాజ్ఞానుసారంబుగ నెల్లవారు నయ్యెడ నుండుమణిమయాసనంబుల నుపవిష్టులగుడుఁ దాను నొకయుత్తమాసనంబున నుపవిష్ట యయ్యె.

## కాళికాదేవి సాక్షాత్కరించుట.

అప్పు డామండపంబునందు నీహారావరణసదృశమగు నొకయవనికయుఁ దదంతరంబున శారదచంద్రచంద్రికాపూరంబుభాతిఁ బాండురప్రభావిభాసితం బయి యొప్పు రుచినిచయంబును గానిపించె. ఎల్లవారు నతికౌతూహలంబునం గాంచుచుండిరి.

క. తుంగతరవీచికాచయ, రంగన్నవపుండరీకరాజిసితవిభా
సంగతవాఃపూరం బు, ప్పొంగెడుకలశాబ్ధి యందుఁ బొడసూపె వడిన్.

ఇవ్విధంబునం బురోభాగంబునం బొడసూపినక్షీరనీరధిం గాంచి యతులానంద సంభ్రమంబులు పెనఁగొనుమానసంబులతో ననిమేషదృష్టులైయెల్లవారును గాంచుచుండ.

క. అలఘునవచంద్రకాంత, స్థలకలితోదీర్ణశుభ్రతరదీధితులన్
వెలయుమణిద్వీపము త, త్కలశపయోరాశినడుమఁ గన్పట్టె వెసన్.

అది గాంచి యత్యాశ్చర్యరసపూరపూరితాంతఃకరణులై యచ్చోటివారు తదీయ రామణీయకంబుం బొగడుచుండ,

క. జలధరితఘనఘటానిభ, లలితరుచిప్రచయబహుళలాలితమై ని
స్తులమోదదాయకంబయి, యలరారెడుబిల్వవనము సటఁ బొడసూపెన్.

అంత నాబిల్వకాంతారంబునందు,

క. కల్పద్రుమవాటీపరి, కల్పితవృతిహృద్య మయినకాదంబవనం
బల్పేతరమై గన్పడె, జల్పన్మధుకరసుమాళిసాంద్రం బగుచున్.

ఇట్లు సుధాసాగరాంతర విద్యోతమానమణిద్వీపమధ్యబిల్వకాంతారంబునందుఁ బారిజాతద్రుమసమావృతకాదంబవనంబునడుమ నతిరమణీయప్రదేశంబునందు.

క. ఆదరవిరచితగీత, ప్రాదుర్భావానుమోదపరికంపితసత్
కాదంబకుసుమహారా, సాదితకటిచక్రగతలసద్వేణికతోన్.

క. సుందరశశధరరేఖాఁ, మందరుచిప్రచయసద్ధమహితము బగుచున్
సుందరమయి సుస్నిగ్ధతఁ, జెందిననీలాలకములసింగారముతోన్.

క. సుమకోదండధనుర్వి, భ్రమసుభ్రూలతికఁ బొడముబంధురకుసుమో
ద్గమ మనఁ దగుశుభనవకుం, కుమపంకలలామ మింపుఁగొనునిటలముతోన్.

క. కస్తూరిపత్రరేఖా, నిస్తులసౌరభ్యలోభనికటభ్రామ్య
న్నిస్తంద్రమధుపఝుంకృతి, శస్తశ్రీగండయుగళచారుత్వముతోన్.

క. సురుచిరవీణావాదన, పరిపాటీలోలసవ్యభర్మమయశ్రీ
కరతాళీదళకలిత, స్ఫురదురుతాటంకయుగళశోభాయుతితోన్.

క. హాలామదభరభవనవ, హేలాలసదక్షియుగళహేవాకశుభాం
దోళనవిలాసవిగళ, ద్గాలితకర్ణావతంసలాస్యశ్రీతోన్.

క. స్వేదకణజాలకాంచిత, మేదురశుభఫాలగళితమృదులావణ్య
శ్రీదర్శనీయనాసా, సాదితమౌక్తికరుచిప్రచారంబులతోన్.

క. కుందసుమనిచయకోమల, మందస్మితమధురవక్త్రమానితవీటీ
కందళితదివ్యభోగీ, సందోహమహాసుగంధసంతానముతోన్.

క. వరకుందకుసుమకోరక, సురుచిరదంతావళీవిశుద్ధద్యుతిభా
సురమందస్మితసుందర, పరిపాటలవిలసదధరపల్లవరుచితోన్.

క. అభినవతారుణ్యశశి, ప్రభవసముద్వేలకాంతిపటలజలనిధి
ప్రభవవరశంఖశోభా, సుభగత్వముఁ గాంచుచుండుశుభకందరతోన్.

క. మణిమయకేయూరద్వయ, ఘృణిపల్లవతల్లజప్రకృష్టనవలతాఽ
గణితకరద్వయకంకణ, మణిగణతేజోవితానమహనీయతతోన్.

క. అరుణోదయసమయస్ఫుట, దరవిందసమానపాణిపల్లవయుగళో
దరరుచిసంధ్యావిలస, న్నిరుపమనఖచంద్రకిరణనీరంధ్రతతోన్.

క. తారాగణహారావళి, చారుకుచాభోగభారసన్నతమధ్యో
దారవళిచ్ఛేదపథ, స్ఫారసముల్లాసదేహసౌందర్యములోన్.

క. గంభీరవృత్తనాభీ, శుంభత్తటినీసువర్ణశోభాసుతటీ
సంభూతశైవలశ్రీ, సంభృతరోమావళీనిజశ్యామతతోన్.

క. మారజయచాపమౌర్వీ, చారునినాదానుకారచణమణిరశనో
దారశుభకనకకింకిణి, కారాజిఝ్ఝుణంఝుణప్రకారముతోడన్.

క. నీరంధ్రపద్మరాగో, దారరుచిప్రచయనిచితతతశుభకాంచీ
సారతరదామభూషిత, చారుపృథునితంబబింబశైలతటులతోన్.

క. కింశుకసుమచయరుచిర, క్షౌమాంశుకసంవళితకుంకుమారుణసురరా
ట్ప్రాంశుకరిహస్తశుభశో, భాంశమనోజ్ఞోరుకాండహైమప్రభతోన్.

క. కోమలనీలోత్పలకృత, కామనవనిషంగయుగళఘనతరకాంత్యు
ద్దామశుభజంఘికాలతి, కామానితమత్తదంతిగతిసుభగతతోన్.

క. నతదిక్పాలవధూసం, తతికుంతలనీలరుచివితానజనితభా
వితదూర్వాంకురశంకా, మతిసారంగావలీఢమణినఖరుచితోన్.

క. దేవపతిమౌళిమణిరుచి, భావితబాలాతపప్రభాయుతలాక్షా

కాళికాదేవి యావిర్భవించిన నాసురవరవందితచరణసరోజాతం గాంచి యంచిత భక్తిప్రశ్రయంబులతో సభాస్థలంబుననుండువారలు నమస్కరించి ఫాలభాగకలితకర కమలపుటులై సంస్తుతించిరి.

అప్పుడు తరుణాంబుజయుఁ దనమనంబున నీకవి మహనీయుండును దేవతానుగ్రహ పాత్రుండు ననుటకు సందియంబు లేదు. ఈయపూర్వప్రభావునిమహాప్రభావంబున నీమహా కాళిసందర్శనము తదనుగ్రహపాత్రుల కెల్లరకు లబ్ధం బయినయది. సాధుసమాగమంబు మహాభ్యుదయదాయకం బగు నని పెద్దలు పల్కుట సత్యంబయ్యె. ఈమహాత్ముఁడు మహా కవి కాళిదాసుండు గాని యితరుండు గాఁడు. ఇందు సందియంబును లేదు. ఈయుత్తమ చారిత్రుండు నాయందుఁ దనకుండువాత్సల్యంబున నన్ననుగ్రహించి నాదురవస్థా విమోచనార్థంబు నిష్కారణదయావిశేషంబున నియ్యెడకుం జనుదెంచి యుండునట్లు దోఁచెడిని. కానినాఁడు బ్రహ్మాదులకును దుస్సాధ్యం బయినయీదేవిసందర్శనంబు సాధారణ జనులకు లభించుట యెట్లు? పూర్వ మీదేవి నాకు సాక్షాత్కరించి యానతిచ్చినవచనం బులకుం దగురీతి నీదారుశిరుండు కాళిదాసుం డయి యుండంబోలు. నన్ను జయింపగల వాఁడు కాళిదాసుండ యనియు నామహాత్మునివలన నాయభీష్టంబు లబ్ధం బగుననియు నీ దేవి పూర్వము నాకు వరమొసంగియున్నయది. దేవతలవచనంబు లేనాఁడును కల్లలు గావు. మఱియు నీదేవిపాదంబులయం దొక్కట నామంజీరమునకు జతయయినమంజీరంబు గన్పట్టుచున్నది. వేఱొకపదంబు మంజీరవిరహితంబై యున్నయది. ఈదేవి దీనిజత యగు భూషణంబును భక్తవాత్సల్యంబున నాకాళిదాసుని కొసంగి యుండం జను నని నిర్ణయింప నొప్పు. అని తలంచుకొనుచుండఁ గాళికాదేవి తరుణాంబుజం గాంచి యోకుమారికామణీ యీమహనీయుం డగుమదీయభక్తుండు నన్ను సంస్తుతింపఁగా నేనాతనిప్రియంబు సేయం దలంచి మదీయలోకంబుతోడ మీకు దర్శనం బొసంగితిని. తత్ప్రార్థితం బగుటం జేసి భవ న్మనోగతార్థంబునం గలసందేహంబు నపనయింప నుద్యుక్తనై యున్నదానను. వలయు నర్థం బడుగు మని నుడివిన నాసుందరీతిలకంబు నిటలతటఘటితకరాంబుజయై దేవికి నమ స్కరించి యిట్లనియె. ఓసర్వలోకజననీ నీవు భక్తవత్సలవు గాన వత్సంబులకుం బాలు సేపు ధేనువు వెఱవారల సయితము పరితృప్తులం జేయువిధంబున నీకవియందుం గలవాత్సల్య విశేషంబుచేఁ దదగ్రంబుగ మా కందఱకుం దర్శనం బొసంగి ధన్యులం జేసితివి. భవద్దర్శ నంబునం జేసి మాభవంబులు కృతార్థంబు లయినవి. నిన్నుం గనుంగొని నీయసమానతేజో విశేషంబునకు మానసంబున నచ్చెరు వందుచు నీరామణీయకశరణంబులై యొప్పునటిసుకు మారావయవంబులందు మణిమయసర్వాభరణంబులు నలంకృతములై యొప్పుచుండుటం గనుంగొని యతులామోదభరితహృదయులమై యుండుమాకు నీవామపాదంబునందు మాత్ర మొక్కమంజీర ముండుటయుఁ దక్కినపదంబున దానికింజత యయినభూషణంబు

లేకపోవుటయుం జేలకో? ఒకించుకసేపును నూపురవిరహంబున కర్హంబు గానినీపదంబు మంజీరవిరహంబుం గాంచి యుండం గతం బేమియో? వినంగోరిక కలదు. కరుణించి తెల్పుమన నాకాళికాదేవియు నాతరుణాంబుజ యడిగినవచనంబుల కను మోదించుచు మధురవచనంబులనిట్లనియె. ఓకుమారికామణీ! మదీయభక్తశిరోమణియగు కాళిదాసుండు నాపితునికపటవృత్తంబునం జేసి యవమానితుండై వెండియుం భోజునికడకుం బోవుటకు సమ్మతింపక తనవిరోధులు చేసినకృతి నపనయించి భూపతిమానసంబునందుఁ దదీయకపటోపాయకల్పితంబై యొప్పువిపరీతజ్ఞానంబుం బాప సమకట్టి యాత్మలో మత్పదధ్యానంబు సేయుచుండె. నేను నతనిభక్తికి సంతసించి సాక్షాత్కరించి యతనియాత్మగతం బగునర్థం బెఱింగి యున్నదానను గాన నోవత్సా! కాళిదాస! నేను నీకీమదీయపాదమంజీరంబొసంగెదను. దీనిని మహీపతికి నెవ్విధినైన దృష్టిపథంబుఁ జెందఁ జేసితివేని తద్దర్శనమాత్రంబున నామహీపతిహృదయగతసందేహము నివర్తించు నని చెప్పి నాయొకపదంబున నుండుమంజీరం బొసంగితిని. ఆనాయొసంగినపాదకటంబ విలాసవతిచేటికామూలకముగ భోజునికడకుం జేరినయది. భక్తులకు నేను నాప్రాణంబులైన నొసంగం బ్రియపడుచున్నదానను. భక్తజనానుగ్రహంబ నాకుభూషణంబులు గాని యీరత్నంబులుగావు. భక్తానుగ్రహకల్పితంబు గాన నూపురవిరహంబునకు మత్పదం బనురూపం బయ్యె. అని చెప్పిన విని యాతరుణాంబుజయుఁ దక్కుంగలవారును తమహృదయంబులం దీదేవి కాకవియందుంగల వాత్సల్యం బపారంబై తోఁచుచున్నది; ఆమహనీయుండు తొలిజన్మంబున నొనర్చినపున్నియం బెట్టిదియో యని యచ్చెరువొందిరి. ఇవ్విధంబున నచ్చెరువందుచు నాతరుణాంబుజయు కవిం గాంచి యోమహాత్మా యీదేవిచరణంబు నూపురవిరహంబునకుం దగదు. దీని నీదేవిపదంబు జెందం జేయ వలంతివి నీవకాని యితరులు గారు. ఎట్లు విన్నవించి యీయాభరణంబు దేవీచరణవిభూషణంబు గాఁ జేయం జను నట్లు వచించి యిది యీదేవి కర్పింపుమని వేఁడుకొనినఁ దద్వచనంబులు విని కవియుఁ దనమనంబునం దిట్లు తలంచె. ఔరా! ఈకాంతాతిలకంబుచాతుర్యం బేమందును? ఇది నన్నుఁ గాళిదాసుఁడ నని నిశ్చయించి యీభూషణం బర్పించువేళ సత్యంబుగఁ బూర్వోపలబ్ధిమార్గంబు సెప్పనగు నది వచియింప నితనిఁగాళిదాసుండని నిర్ణయింపవచ్చునని యీయుపాయంబు పన్ని యీమంజీరంబు నా కందియిచ్చుచున్నది. నాకు నింకఁ బ్రచ్ఛన్నతతో నుండి కావలసిన కార్యం బేమియుం లేదు. భోజునిమనంబునం గలవైమనస్యంబును తత్ప్రియుక్తం బగుసందియంబును నివర్తించినయది. భగవతికి నాయందుం గలవాత్సల్యంబు ప్రకాశింప జేయం జేయనీభూజానికిమద్విరహంబుననైన క్లేశభరంబు దుర్భరంబై యొసంగుచున్నయది. ఇట్టిభగవతీవరప్రసాదపాత్రునియందు మహాపరాధంబుఁ గావించితి నది యెప్పటికిఁ బాపుకొనంజాలుదునో యనుచింత యంతకంతకు దురంతం బగుచు సంతపించుచుండ నీతఁడు కరము

చలితప్రాణుం డగు నని యెంచెదను. అని యిట్లు తలంచి యాతరుణాంబుజ యిచ్చెడుమణి మయదివ్యమంజీరంబుఁ గైకొని కాళీదేవిం గాంచి యిట్లనియె.

చ. రతికలహంబులందు నుడురాజవతంసుశిరఃప్రణామసం
గతిఁ గనుగౌరవంబు నధికంబుగఁ గాంచుచునుంటఁ బాసియా
శ్రితజనరక్షణైకరుచిఁ జేరెను నాకడ కీవిభూషణం
బతులిత మైనపూర్వపద మబ్బఁగఁ జేయుము దేవి దీనికిన్.

[ఈదేవి శివునిపత్ని యగుటం జేసి యాతనితోఁ బ్రణయకలహంబు ప్రవృత్తం బగును. అప్పు డాచంద్రశేఖరుండు తా నీదేవినిఁ బ్రసన్నం జేయఁ బాదముల కెఱఁగి వేఁడుకొనును. అతనిశిరఃప్రణామంబునం గలుగుగౌరవంబును ఆదేవిచరణ భూషణ మయి యుండుపాదకటకమునకుం గల్గును. అట్టిమహాగౌరవంబుఁ బాసి యీభూషణం బాశ్రిత జనంబులం గావ నభిరుచిం జెంది కాళిదాసునికడకుం జేరినయది. కాళిదాసునికడ నుండు నప్పు డాగౌరవంబు లేదు. అట్టియపూర్వ పదవి వెండియుఁ గలుగుటకు నాదేవి దానిం గైకొని తనపాదంబునకుఁ గైసేయ నాశివునితో వెండియుఁ బ్రణయకలహంబు సంభ వించినప్పు డనుకూల మగుచు.]

అని ప్రార్థించిన నామహనీయచరితయగు కాళికాదేవి తనభక్తునిప్రార్థనంబు విని కరము సంతసించుచు నీహారావరణసదృశమగు యవనిక వెలువడునట్లు తనచరణాంబు జంబుఁ జాఁచినఁగవియయువినయభయభక్తిసంభ్రమంబులు పెనఁగొను మానసంబుతో నాపద పద్మంబునకు మూర్ధంబువంచి ప్రణామంబుఁ జేసి యాదివ్యనూపురంబును దేవిపాదంబు నకుం దొడిగెను. అంతనాదేవి మణిమంజీరవిభాసితచరణకమలయుగళయై యొప్పుచుండుట యెల్లవారలును గనుంగొని పరమానందభరితాంతఃకరణు లైరి.

అప్పుడు కాళికాదేవి తరుణాంబుజం గాంచి యోకుమారీతిలకమా! నీ వడిగిన యర్థంబుం దెల్పితిని. మఱియు నీహృదయగతంబులగు సందేహాంతరంబులు వినోదసీమం బను మండపంబున మదీయపరిచారికలుగాన్పించుమాయాసుందరీవిజయం బనునుపరూప కమువలన నివృత్తంబులు గాఁగలవు. మదీయభక్తిగలదానవు. కాన నీమానసంబునం గలిగి యుండుసంశయాంతరంబులఁ బాప మత్పరిచారికాగణంబుం బంచియున్నదానను. మదా గమనంబునకుంబూర్వ మీమండపమునకు వారలు సనుదెంచి మిమ్ము నీప్రభావసీమమండప మునకు రప్పింపంగోరి యేతద్రక్షకీవర్గంబుచుదఱుమంగొట్టి వినోదసీమంబనుమండపంబునకుం జనియున్నవారు. అయ్యెడకు మీరలుసనుం డనియానతిచ్చి సుధాసముద్రంబుతోడను మణిద్వీపబిల్వకాననంబులతోడ నంతర్హితయయ్యె. సకలజనంబులును బరమాశ్చర్యయుక్త మానసులై కాళిదాసునిప్రభావంబును సంస్తుతించిరి.

భోజభూమీశుండును పూర్వ మీతనిఁ గాళిదాసుం డని సందేహించుచున్న వాఁడు; కవి వచించినపద్యంబు విని అశ్రితజనరక్షణైకరుచిఁ జేరెను నాకడ కీవిభూషణం బని కవి వచియించి యతఁడు దాన గాళిదాసుండ నని యెఱింగించుటవలన నపరిమితామోదపూరపూరితాంతఃకరణుండై వికాసంబుఁ గాంచిన ముఖకమలంబుతో సానందబాష్పధారాబిందుబృందంబు లొలుకుకనుదమ్ములతో నతిత్వరితగమనంబునం జని తన భుజార్గళంబులు సాచి మహాకవిం గౌఁగిలించి యతనిపాదంబులపయిం బడి యోమహాత్మా! మిత్రశిఖామణీ! కవికులవతంసమా ! భవద్విషయంబున నాయొనర్చినయపరాధంబు నిర్హేతుకదయావిశేషంబునం జేసి క్షమింపనగును. ఏనుమహాపాపాచారుఁడను. నీమాహాత్మ్యంబెఱుంగక యవచనీయంబులు కొన్ని పల్కితిని. ఏను భవత్సహవాసంబొనర్చియుఁ దథ్యగతిఁ దెలిసికొన వలంతిని గాక యుండెదను. నేఁ జదివినశాస్త్రంబు వ్యర్థం బయ్యె? కట్టా! సాధుసేవనంబు వమ్మయిపోయె. భారతీనవావతారుండవగు నీవిషయంబున నేనతిమూర్ఖప్రవర్తనం బొనర్చితిని. నీవు న న్నేమి యొనర్చినను నా కది ప్రియంబ. మదీయంబగు ధారారాజ్యం బంతయు నీక నీయది. నేను నీవరవుఁడను. ఈనాఁటంగోలె నన్ను నీవరవుడులం గలపుకొని నావలన దాస్యంబుఁ గొనుచు భవద్దూషణంబున నైనపాపంబు వలన విముక్తునిం గావింపుము. అని వచియించుచు బాష్పగద్గదకంఠుండై కన్నీట నడుగులు గడుగుచున్నం గవియు మహాసంభ్రమంబున నాభూమీశుని కరంబులు వట్టి బాష్పాయమాణనయనుం డయి గవుంగిటం గ్రుచ్చియెత్తి ఓమహారాజా! సంతాపపడకుము అక్కాలంబున విపరీతంబయి యుండువిధి ని న్నిట్టు పలికించినయది యంతియకాని నీవు కావలయునని పలికినది గాదు. ఏరికిం గాని విధివిహితం బతిక్రమింపం దరం బగునే ! తద్విలసితంబు వినుము.

శ్లో. అఘటితఘటితాని ఘటయతి ఘటితఘటితాని దుర్ఘటీకురుతే,
విధి రేవ తాని ఘటయతి యాని పుమా న్నైవ చింతయతి.

[గీ. అఘటితంబుల ఘటితము లాసఁ జేయు,ఘటితఘటితంబులకును దుర్ఘటన యొసఁగు
మానవుం డెప్పటికి నైన మానసమున, దలఁపనట్టివి విధి గూర్చు దారితోడ ]

అని యూరార్పఁగా భోజుండు కవిం గాంచి యోనాప్రియమిత్రమా!

శ్లో. గచ్ఛత స్తిష్ఠతో వాపి జాగ్రత స్స్వపతోపి వా,
మాభూ న్మనః కదాచి న్మే త్వయా విరహితం కవే.

[గీ. తిరుగుచుండెడువేళ సుస్థిరత నుండు, నవసరంబున నిద్రించునపుడు మఱియు
మేలుకొనియుండునత్తఱి మిక్కుటంపుఁ,బ్రేమ నీయందునామదిఁ బెరుఁగుఁగాత.]

అని చెప్పఁగాఁ గాళిదాసుండు లజ్జావనతాననుండై యుండ నతనిచుబుకంబుం బట్టియెత్తి భోజుండు ఓసకలకళావాస! కాళిదాస! మహాకవీ! కాళికావరప్రసాదపాత్ర! కమలగర్భవిలాసినీనవపురుషావతార! ఏల సిగ్గుపడియెదవు!

చ. కవికులచంద్ర నీవు కుతుకంబున సాధుజనైకభావ్యవై
శివము నొసంగుమార్గమును జెంది మహోన్నతిఁ గాంచినాఁడ వో
యవికలకీర్తి! సిగ్గుపడి యోఁదల వంచుట లేల నీకు నీ
భువి నిను దూఱువెట్టినకుపూరుషు లే తలవాంతు రేడ్తెఱన్.

అని పల్కఁగా నాతనివచనంబులవలన మహాకవికిం గనుదమ్ముల నానందబాష్పపూరం బుప్పొంగ భోజమహీపతి యాబాష్పంబులు తనకరాంగుళులచే దుడిచి తత్ప్రీతివలన నయినమహాప్రహర్షంబున నపరిమితధనంబులు మాసికముగ ననంతరకాలమున నొసంగఁదలపోయుచుండఁ బ్రతాపపాలుఁడును మహీపతీ! యీసౌధంబున నుండుధనం బంతయు నీకూఁతురు తరుణాంబుజ సంపాదించినయది గాన నీయది యగుటం జేసి నీయిష్టవినియోగంబున కర్హంబ యనిన నప్పుడు కోశాధికారిణులు తరుణాంబుజాజ్ఞానుసారిణులై కవివరుననుమతివడసి ధనసంచయంబులు గొనితెచ్చి యెదుటం బెట్టిన ధారాపతియు మహాముదంబుతో నయ్యేడ నుండువారల కవ్వారిగ నొసంగెను. తరుణాంబుజయు విరజాంబుజయుఁ గాళిదాసుం డనియెఱింగినతత్క్షణంబ యాదారుశిరునడుగుఁదమ్ములకుఁ బ్రణయభయభక్తిసంభ్రమంబులతో వందనము లొనరింప నామహాకవియు నోకుమారికలార సర్వసర్వంసహాచక్రంబేలురాజకుమారునిం బరిణయంబగుఁ డని దీవించెను. అది విని యచ్చోటివారలు తమమానసంబులందు నీమహానీయుండు విద్యాసర్వస్వవేదినితోఁ బొందు గోరి వచ్చినవాఁడు. ఈకుమారీతిలకము తనకు విజిత యయి వశవర్తిని యయ్యు నీయువతియందుఁ దొంటి తలంపుఁబాసి యేలకో! దీనిని మఱియొకనికిం బత్ని యగునట్లు దీవించుచున్నాఁడు. అని తలంచుకొనుచుండిరి. కవివరునాశీర్వచనంబులు విని తరుణాంబుజయు నపరిమితామోదంబున నోమహాత్మా! నాకు దేవి యొసంగిన వరంబుచేత నీవలనఁ బరాజయంబు గల్గినయది. భవద్దర్శనంబువలనఁ జతుస్సముద్రముద్రితధరామండలమండలాధిపతులకుం దలమిన్నయగు నాప్రాణనాయకునిం జేపట్టం గలభాగ్యంబును గల్గుటకు సందియంబు లేదు; నిన్నెఱుంగక స్వవిషయంబున నాయొనర్చిన కపటంబుల నైనమనఃక్లేశంబు నాజనకునిం గాంచి యోర్వవలయుం. దేవీవరంబున మనుష్యమాత్రులకు సాధ్యంబుగాని చతుష్షష్టిద్వారకలితంబగు నీప్రాసాదంబు నేను నిర్మించుకొని తత్తద్ద్వారంబుల నపరిమితవైదుష్యవిశేషవిభాసితలగు తరుణీమణుల నునిచి సాధారణపండితులకు దుష్ప్రవేశంబుగ నొనరించి భవదాగమనమునకుం బ్రతీక్షించుచుంటిని. నాపిన్ననాటం దొట్టి నీకుం గలిగియుండువాత్సల్యంబున నతిదురవస్థావిహస్తితనై యున్ననన్నుం గావం దలంచి వచ్చి నన్నుం బరాజితం జేసి నాసామర్థ్యంబును

నిర్దోషంబగు కన్యకాత్వంబును నాజననీజనకుల కెఱింగించి నన్ను రక్షించితివి. నీవంటి కరుణాసముద్రుండు గలఁడే! నిష్కారణబాంధవుండ వన్న నీవ కావే! అనిస్తుతియింపం గాళిదాసుండును ఓకుమారికా! తరుణాంబుజా! నీవు నీకన్యకాత్వం బివ్విధంబునఁ గాచు కొనుచున్నందుకుఁ బరము సంతసించితిని. నీవు వేశ్యాకన్యకావేషంబుఁ దాల్చియున్న కారణంబునఁ దదనుగుణముగ నాఁడినవచనంబులు కొన్ని కాముకునివచనంబు లట్లు సంప్రవృత్తంబు లయ్యె. అట్లు సెప్పనినాఁడు నీయొనర్చినరహస్యం బుద్ఘాటి తంబగును. దానం గార్యహాని సంభవించు. ఇట్టితలంపువలన నేను వేశ్యాకన్యకం బోలెనిన్ను నను చితభాషణంబుల నవగణితం గావించితిని. ఈయర్థంబు మనమున నుంచుకొనకుము. వేశ్యాకన్యకావేషంబుతోడఁ దదర్థముగం బ్రయుక్తము లయినవచనార్థములను సహి తము కడకుంద్రోయుము. నాయందుఁ దొల్లింటిభక్తిప్రశ్రయములను గైకొనుము. నీ చెలియలగు విరజాంబుజ నేను ధారానగరముం బాసి యితరదేశప్రయాణోన్ముఖుండ నైనకాలమున నిన్ను నీదురవస్థావిముక్తం జేయనగు ననునర్థము మనమున నిడుకొని యుదయాదిత్యునికడకుం బోవఁ బ్రార్థించినయది. తత్ప్రార్థనాంగీకార మియ్యెడకు రాఁ గారణం బయ్యె నని వచియింప నది విని తరుణాంబుజ తనమానసమున నీమహాకవి వసు మానసనగరపాలకుండగు నుదయాదిత్యునియందుఁ బరమువాత్సల్యము గలవాఁ డతనిం దోడ్కొనక వచ్చి యుండఁడు. ఇక్కవివరునితోడ వచ్చియుండుకుమారుం డుదయాది త్యుండై యుండంబోలు. ఇంతదనుక నీతని నీదారుశిరునికిం బానిసవాఁడని యెంచికన్నెత్తి నైనం జూడకుంటిని. ఇతఁడు జయశంఖధ్వానం బొనరించునప్పుడు మహీమండలాధిపతి కుమారుం డని శంకించియుఁ బ్రతాపపాలభూవిభునిసమావేశసంభ్రమమున మఱచి నిరూ పింపకయుంటిని. ఇప్పుడు నిరూపించిచూడ నీతనియాజానువిలంబం బయినపీవరభుజార్గ ళయుంగళమును బర మున్నత మై వెడందయగు నురస్స్థలమును పుండరీకదళవిరాజితము లగునేత్రములును వ్యాయామకుశలతాసంజాతంబగు జితశ్రమత్వముం దోపించునంగ ప్రత్యంగ సౌష్ఠవమును గంభీరమగు నాకారరేఖయు నితని మహారాజకుమారుం డని యెఱింగించుచున్నవి. దేవి నాయెడం బ్రసన్నయై యొసంగినవరము ఫలించుకాలము గల్గె నని తోఁచెడిని. అని తలంచి యవనతముఖాంబుజయై యుండె. కాళిదాసునిం గాంచి భోజభూపతి ప్రసన్నముఖాంబుజుండై తొల్లింటిదైన్యముఁ బాసివెండియు లబ్ధచేతనుం డయినట్టు లుండుట కచ్చెరువొందుచుఁ బ్రతాపపాలుండు దనమానసమున నిట్లు దలంచు కొనియె. ఔరా ఈభోజునికిం గాళిదాసునందుంగల ప్రణయభర మింత యని వాక్రువ్వం దరము గాదు. వినష్టయయినతనకుమారిక వెండియు నుపలబ్ధయయినప్పుడు నీభోజునిముఖ మునం గవివరప్రాప్తికాలమున నైనకాంతి పొడసూపినది లేదు. ఆహా యానరేంద్ర కవీంద్రుల కిట్టి మైత్రి గలుగుటకుం గారణం బేమొకో. ఈరాజునకుం గవియందుం గల

మిత్రులన్న వీరలగదా! ఇట్టిమైత్రికిం గారణంబు జన్మాంతరప్రాప్తం బుండకపోదు. అని తలంచుకొనుచుండెను. ఇంతలో వినోదసీమం బను నేఁబదినిమిదవకక్ష్యాంతరంబున నుండుమండపంబున వీణావేణుమృదంగాదివాద్యధ్వానము వినంబడియె. కాళిదాసు నాజ్ఞానుసారముగ నచ్చోటివార లందఱును సంగీతకంబు వినంబడుచోటికిం బోయి యావినోదసీమ మనుమండపమున నగ్రభాగము సాంద్రతరచిత్రయవనికాపిహితంబై యుండుటం గాంచి కాళిదాసు నానతిఁ దద్పురోభాగంబునం బొలుపారునర్హస్థితాసనంబుల నుపవిష్టు లయిరి.

# మాయాసుందరీ విజయము

అను

## ఉపరూపకము.

వినోదసీమమండపమున నగ్రభాగమున నుండుచిత్రయవనిక నొకవేత్రహస్త యగు కామిని తొలఁగం ద్రోచి యొకపార్శ్వంబున నిలువంబడిన నామండపమధ్యభాగంబునం దపరిమితతేజోవిశేషనిరంతరితదశదిశావకాశులై దివ్యపురుషులు గొందఱు మణిమయంబు లగుమహోన్నతాసనంబుల నుపవిష్టు లగుచుం బ్రవేశించిరి.

అందొక్కరుండు. ఓమహాత్మా! భరతమహర్షీ! భవదీయశిక్షావిశేషంబునం జేసి యతివిచక్షణత్వము సంపాదించియుండు రంభామేనకాతిలోత్తమామదాలసాదిదివ్యాప్సరః కాంతాతిలకంబులు ప్రయోగించినరూపకంబుల నెల్ల నయనసాఫల్యజనకంబులం గనుంగొని యీదేవసభ కరము సంతసంబుం జెందియున్నది. అయినను నవీనరూపకదర్శనకుతూహలంబు వారల నెడబాయ కున్న దనుట మాకు విదితంబ. తదిష్టార్థపూరణంబు సేయఁ బ్రార్థించెదను. దేవతల కభినయంబు చాక్షుషక్రతువు గాదె!

భరతమహర్షి. ఓసంక్రందనా! సత్యము; అది దేవతలకుఁ గరము సంతోషకరము గాఁబట్టి గాదె! యుమాపతి యనపరతము లాస్యప్రవర్తన మొనరించుచుండుతనవనజాననతో నటనము సేయుచున్నవాఁడు. పురుషుని సరసునిం జేయ దానికంటెం దగినది మఱియొద్ది గలదు? సాంప్రతముదేవసభ యభినవనాట్యవిద్యావిశేషంబుం గాంచఁదలంచియుండుట నెఱిఁగినుమాపముగఁ బుంజికస్థల యనునచ్చరయుం వచ్చియున్నది. ఇది పూర్వము నాట్యవిద్యాకౌశలంబున రంభారంభోరువుతోఁ దా సమాన నని గర్వముం జెంది తదభిభూతయై బ్రహ్మలోకంబునకుం జని పద్మజునిరాణియగువాణి నాశ్రయించి యభినయదక్షతం గాంచి వచ్చినయది. తత్ప్రియుక్తం బయినయుపరూపకం బొక్కటి ప్రస్తుతము దేవతలకు దర్శనీయంబు. అని చెప్పుచుండ నప్పుడు నేపథ్యంబునకు,

సీ. విద్రుమద్రుమలతాభద్రకాంతుల మీఱుబంధురతరజటాపటలితోడ
శారదనీరదచ్ఛాయలఁ దిలకించు పరిపాండుశుభతనుప్రభలతోడఁ
గాలాంబుదచ్ఛాయఁ గడకుఁ ద్రోయఁగఁ జాలులలితమానీలగళంబుతోడఁ
బాండురకర్పూరపటలబంధుర మయి పొలుపారుదివ్యవిభూతితోడ

గీ. ఫాలకలనేత్రవిస్ఫురత్కీలితోడ, మహితమందాకినీసద్ధమాళితోడ
పన్నగేంద్రవిభూషణపటలితోడ, వృషభగమనుండు సనుదెంచె వెలఁదితోడ.

సంక్రందనుఁడు. భయభక్తివినయవిశేషంబులతో ససంభ్రమముగ నాసనం బుడిగ్గి, ఆత్మగతంబున, ఇయ్యిందుశేఖరుం డాకస్మికముగ నిప్పు డియ్యెడకు రాఁగతం బేమొకో, అని తలంచుకొనుచు సర్వాంగాలింగితభూతలంబుగఁ బ్రణామంబు రచింపంబోయెను.

భరతమహర్షి. (మందస్మితముగావించుచు, సత్వరముగ) ఓయిసంక్రందనా! వలదు! వలదు! ఈకార్యం బుడుగు ముడుగుము.

సంక్రందనుఁడు. మునివరా! ఏల నివారించెదవు? బ్రహ్మాదివందితపాదపద్ముం డగునీ భవుండు సర్వజనవందనీయుండు గాఁడె! ఇతం డింతకుముందు సముద్రంబునం జనించిన హాలాహలంబు సకలజంతుసంతతుల లయంబునొందించుచుండ దాని మ్రింగి యస్వాదృశ దీనజనుల రక్షించినకరుణామయుండు. అట్టివానికి నమస్కరింపం జన దనియెదవు.

భరతమహర్షి. ఓసంక్రందనా! హాలాహలాహారి యగుశైవుని నమస్కరింపం బోలును.

సంక్రందనుఁడు. (వైచిత్ర్యంబుతో.) ఓమహర్షీ! ఇతఁడు హాలాహలహారి గాఁడా! మఱి యెవ్వఁడు?

భరతమహర్షి. దేవాధినాథా! తన్నేపథ్యధారియగు హంసుం డనుగంధర్వకుమారుండు.

సంక్రందనుండు. (ఆశ్చర్యపడుచు.) ఔరా! వీనియభినయచతురత కరంబు శ్లాఘనీయంబు. సాక్షాచ్ఛంకరుండ యనుకొంటిని.

ప్రమథగణానుసృతుం డయి పర్వతరాజసుతతో మహాదేవుండు ప్రవేశించె.

మహాదేవుండు. ఓదేవీ! పర్వతరాజపుత్రి! ఏ మిప్పుడు శ్రీవైకుంఠనగరోపకంఠంబుఁ జేరితిమి. ఇయ్యెడ నుండుపురబాహ్యోపవనముల వెలువడువకుళపున్నాగపాటలీపారిజాత పాదపసంతానవికచకుసుమనిర్గళనిర్గళదమందమధురమధుధారాశీకరశీతంబయిన మందమారుతంబు మనల నెదుర్కొని యతిదూరప్రయాణాయాసంబుఁ బో నడచించిన యది. మదాగమనం బెఱింగింపఁ బూర్వము నాపంపు వడసి వైకుంఠునికడకుం జనిన నారదుం డింతకాలమునకె మరలి రాఁ జనును. అట్లు రాక తడయుటకుం గతం బేమొకో! అవిరించి పుత్రుండు సనుదెంచుదనుక నీయుద్యానపాదపచ్ఛాయ నుండె

అనిన నందఱునుజని యొకపాదపంబు క్రిందనిలిచిరి.

మహాదేవుఁడు. ఓహైమవతీ! ఈకలహాశనుండు సెప్పినవచనంబులు విశ్వసింపఁ జనునే! అసురులను విమోహితులం జేసి యమృతంబు సురల కొసంగం దలంచి కాంచనచేలుండు కరము సుందరం బగు మోహినీరూపంబుఁ గైకొనియె నఁట! దానిం గనుంగొని దేవతలు మోహించిరఁట. అంతియ కాదు.ముల్లోకంబులును మోహావిభ్రాంతిం జెందె నఁట. తమతమవిలాసంబు లేపాటి వని యచ్చరలును వ్రీడాభరంబున మోములు వాంచుకొనిరఁట. అదియునుం గాక యూర్ధ్వరేతస్కులై యుండుయోగీంద్రులు సయితము పరమకశ్మలంబుం జెందిరఁట. ఆ! యివి యేటిమాటలు? పుట్టిననాటంగోలె మొఱకుఁదనంబున నత్యంతమూఢము లయినమానసంబులు గలదానవులు దానిం గాంచి విమోహదశకుం జిక్కిరనుట నమ్మ నగుం గాని పరమేష్ఠిప్రముఖులును విభ్రాంతిం జెంది రనియుఁ బంచభూతంబులు సయితము విరహాగ్నితప్తతఁ గాంచె ననియుఁ బల్కినపలుకులు నమ్మం జనవు! ఆహా! ఈసిలుగులతపసి యెంతదబ్బరలాఁడు! ఏను నిది సూడక నమ్మం జాలను! దేవీ పర్వతరాజపుత్త్రి! మనకొలువున నాసారదమౌని పల్కినపల్కులు వింటివిగా!

పర్వతరాజపుత్త్రి. దేవా! యవధారు! ఆమునివచనంబులు వింటి. అవి యట్టుండనిండు. కరుణించి నామనవి వినుఁడు. దేవరయంతరంగంబు నవనీతంబువంటిది. మరుఁడు మీకుం బగవాఁడు. హరియుం మటుమాయలవాఁడు. చవ్వ సేయక మీ రలాతనియాఁడురూపంబుఁ గనం గడంగుట లోకంబులలోన నవ్వగును. నాడెంబును పెంపును దవ్వగు. ఈజగంబు లన్నియు నతనికివశంగతంబులు. జగంబులకుం బ్రధానులగు సంయమధనులు సురలును సరసిజాసనప్రముఖులును దదీయమాయలం బ్రాజ్ఞతలు సెడి భ్రమగొని యున్నవారు. స్వామీ! ఏమొ! ఎట్టులో! ఇది యేటిపరీక్ష! ఇప్పు డీపయనంబు వల దని వేఁడినను వినకపోతిరి.

మహాదేవుఁడు. తలవంచుకొనియూరకుండెను.

పర్వతరాజపుత్త్రి. (నవ్వుచు నతనిమోముదామరం గాంచి యిట్లనియె.)

ఓమహాత్మా! మీకుం దలంపులోన ధైర్యంబు దృఢంబయి యుండెనేని! మానినిం జూచినంత వికారంబులు జనింపవేని! కట్టఁడి యగుమరునికి బొమ్మ గట్టుట గట్టియేని!నీగారవంబున నీమానసంబునకె నమ్మిక గలదేని! యామాయలాఁ డగుహరిని దదీయమానినీరూపంబుం గాన్పింపు మని యడుగుఁడు. అట్లు గాదేని మిన్నక యుంట మేలు.

మహాదేవుఁడు. (వెడనవ్వునవ్వి.) ఓదేవీ! పార్వతీ! ఏమి యిది! నాచిత్తం బెఱింగియు నెఱుంగనిపగిదిఁ బల్కెదవు? మనఃప్రముఖంబు లెల్ల మద్వశగతంబులై యుండునవి నే నెఱుంగక యవి భ్రమయుట యెట్లు? జలజనేత్రునిమాయ యన్నది జగంబులకుం

భ్రమంబు గొలుపునది జగత్పతినగు నన్నేమి సేయఁగలదు. ఓసీ మిముబోఁటితరుణీ మణులం గూడి విహరించుట మరునిబాధకు బరవశుండనై యుండుటవలన నని యనుకొని యెదవేమొ! అట్లు గాదు. అది నాలోకలీల యని తలంచుకొనుము. బాలురకు భ్రమంబు పుట్టింపంగలబూటకంపుమాటలు విని భ్రమించెదవు. ఆహరిమాయ మోహం బెడలిన వానిం గలంపం గలదే! ఊహింపుము. ఇంక నీతో నీవాదులాట యేల? ఓమానినీశిరో మణీ! నేను విష్ణుమాయం జూచి భ్రమయక చనుదెంచితి నేని నావిరక్తిప్రభావంబు తెలు కపడంగలవు గాని మిన్నక యెట్లు విస్పష్టంబు లగును. ఇదె వెన్నుండు తనమాయ యజే యం బనుకొని యున్న గర్వంబుం గోలుపోయెడిని. అట్లు కైలాసశిఖరంబునం బ్రమథగణ ములతోఁ బంతంబులాడినయాకలహాశనునివచనంబులు కల్లలగుటం గాంచం బోయెదవు సుమీ!

నారదుండు ప్రవేశించి. ఆర్యా! చంద్రశేఖరా! ఏను నీపంపువడసి యిందిరా మనోహరునికడకుం జని భవదాగమనంబు విన్నవించితిని. ఆమహాత్ముండు మద్వచనంబు విన్నమాత్రాన భుజంగపుంగవశయనంబు డిగ్గి నన్నాపవిత్రచరిత్రుం డిప్పు డెయ్యెడ నున్నవాఁ డని యడిగిన నేను నీపురోపవనంబగు నిశ్శ్రేయసంబునకుం జేరియుండు నని వచింపనది యాలకించి సూత్రవతీసఖుం జీటీ యోసేనానీ! శ్రీకంఠుండు నన్నుం గనుం గొన నేఁగుదెంచుచున్నాఁడఁట; అతని కెదురేఁగి తోడ్కొని రాఁ దదుచితసన్నాహంబు నం ద్వర పడునది. ఏ నతని గారవింప నతిత్వరితముగం జనవలయుం నని యాజ్ఞయిడి శ్రీదేవియుఁ దాను నంతఃపురంబు వెడలి ద్వారదేశంబునకు వేంచేయ నయ్యెడకు సరసిజ సంభవుండు వాణియు సావిత్రియును సనకాదిమహర్షులును లోకపాలురును మరీచి ప్రముఖులగు ప్రజాపతులును దక్షుండును గోల్వఁ గాఁ జనుదెంచి యంచితభక్తివినయం బులు మెఱయ నమస్కరింప వారలం గుశలప్రశ్నాదు లడిగి బహూకరించుట కించుక తడయపలసినట్లగుటయుఁ నన్నుం గాంచి యోమునివరా! పోలుత నీవు సని యీయర్థంబు పురహారునికిం దెల్పి నాతడయుటకు విమనస్కతం గాంచక యుండునట్లు గతంబు దెలియం జెప్పుమనినను బంచి పెండియు నారదా! నీవెనువెంట నిదె వచ్చుచున్నాఁడను వచింపు మనియె. ఏనును తదాజ్ఞం గొని యచింతితోపనతులగు సరసిజాసనప్రముఖులకుం బాద ప్రణామంబులు సల్పి వారల వీడుకొని వచ్చుటం జేసి యించుక యాలస్యంబయ్యె.

మహాదేవుఁడు. మునివరా! ఆచక్రధరుండు వచ్చుదనుక నియ్యెడన యుండను. ఇప్పు డీనారాయణునికడకు సరసిజసంభవాదులు రాఁ గతం బేమొకో! ఎఱుంగుదువే!

నారదుండు. ఆర్యా! దీనికిం గారణంబు మఱియొం డేమి యుండం బోలదు?

కొనం గలవో యదియుం నమృతంబు పంచిపెట్టుట కప్పుడు దాల్చిన మోహినీరూపంబు నకును భవత్ప్రార్థంబునఁ దాల్పంబోవునట్టిదివ్యమోహినీరూపంబునకును విలాసాదులం దారతమ్యంబుఁ గాంచం గాంక్షించి వచ్చియున్నవారని తోఁచెడిని. వీరలెల్లవార లాహరి మోహినీరూపంబుంజూచి ధైర్యంబు లేమఱినవారు సుమీ! కలకలనగుముద్దుమొగంబును, వలుఁదలగుబటువుఁగుబ్బలును, బెళకులోలుకువాలారుచూపులును, అందములగు గొప్పపిఱుందులను, కాఱుమెఱుంగులరంగులు మరఁగలించుమేనును, చెలువంబు మీఱునిండుకలికి పాయంబును, సింగంపుసొంపు సంపాదించుచిన్నికౌనును, దళుకులీనుకులుకుఁ బెందొడలును గలిగినసింగారంపునంగనామణి యయినయాయోగీశ్వరేశ్వరునిదివ్యమోహినీవిలాసంబుఁ గాంచి భ్రాంతహృదయులు గానివారలు లేరు సుమా! వేయేల యారూపంబుం గాంచినవారలు పంచసాయకుబారిం బడక పోయినవారు లేరు. ఆవిలాసినీమనోహరవిలాసంబులు దేవర యొకయింత తిలకించితిరేని మరులెత్తి యెత్తుకొని తిరుగుచుండరా! యని నేను మిమ్మాడినమాట కల్లగాదు.

మహాదేవుఁడు. (మహాకోపంబుతో.) ఓజగడపుందపసీ! నామాహాత్మ్యం బెఱుంగక పల్కెదవు.

చ. నరసురరాక్షసావళుల నాగవియచ్చరయక్షకిన్నరో
త్కరములఁ బుష్పమార్గణని కాయముచేత మహావిమోహసం
భరితులఁ జేయునట్టిసుమబాణుని వీరుని నొక్కవ్రేల్మిడిన్
బొరిగొని నీఱు చేసినవిభున్ హరిమాయ గలంపఁ జాలునే!.

మఱియుఁ నింద్రియవర్గంబులంజయించి, యపారమగు సంసారపారావారంబుఁ గడఁచి, భువనాధిపుఁడగు ననవిల్తుని రూపుమాపి, కరము క్రూరుండగు మృత్యువునకుం గలకావరం బణఁచి, పరమతపోవృద్ధులగు యోగీంద్రులభావవీథులం బాయక పరమాత్మమూర్తినై వెలుంగుచుండువాఁడ నేను చెడఁగువోలె నావిష్ణుమాయం బడి తిరుగుదునే! కపటముతో వర్తించుకంజదళనయనునివిపులతరమాయావికారంబులు సురాసురులయందుం బ్రసరించుపగిది నాపొంతల విలసిల్లం గలవె! భూనభోంతరాళంబుల నావరించుమహోత్కటమగు నంధకారంబు భానునియెదుటం బొడసూపెడునే! నోటికొలంది మాటలింకేల! అపద్మలోచనునిమాయ నన్ను భ్రమింపం జేయలేదు కదా! మదీయకింకరులను నయితము భ్రమపఱుపం జాలదు.

ఆసమయంబున నయ్యెడకు బ్రహ్మాదిసురలు గొలువ శ్రియఃపతి విచ్చేసి ఖగపతి వాహనంబు డిగ్గిన నహిపతి యతనియంఘ్రులకుఁ బాదుకలయి యానె. పంటలతొయ్యలి నెయ్యంబునం గైదండ యొసంగె. అసంబులవలనం జాఱునుత్తరీయంబు శ్రీదేవి చక్క

నొత్తె. నీళాదేవి సమీపమున నుండి తెలియాకుమడుపు లందిచ్చె. కుముదుండు ముత్యాల గొడుగు పట్టె. కుముదాక్షుఁ డడపంబుం గొని వెంబడించె. ఖగపతి కాళాంజి వహించి నడిచె. శుకుండు బంగరుగిండి దాల్చె. వామదేవుం డాలవట్టంబు పట్టె. సనత్కుమారాదులు వొగడిరి. జయుండు వెనుక జీరాడుపావడఁ బట్టుకొని వచ్చుచుండె. విజయుండు వీవన విసరుచు నేతెంచె. సునందుండు నందకాయుధమును మోచుకొని పఱతెంచె. విష్వక్సేనుండు సందడి మాన్పుచు వేత్రహస్తుండై ముందర బరాబరులు దీర్చె. మణిగణకంకణ ముఖరితంబుగ మానవతీతిలకంబు వీచోపు లిడిరి. ఇరుగెలంకుల నిందుభాస్కరులతో శంఖచక్రంబులు మూర్తులు ధరించి చనుదెంచెను. అడుగుఁదమ్ముల శ్రుతినూపురంబులు ఝుళంఝుళరవంబులు గావించె. ఇట్లు లగణితమగు మహావైభవంబుతో నతిగంభీరమోహనంబగు మందయానంబునం జనుదెంచి యాదంపతులం జేరి పంకజవాసినీవక్షోభకుంభకుంకుమ పంకాంకితంబగు తనయురంబు గౌరీనాథునురంబుతో నొఱయఁ గరివరదుండు గాఁగిటం జేర్చి కేలు కేలం గీలించి పర్వతరాజపుత్రిం గాంచి మధురసంభాషణముల సేమం బడిగి సముద్రరాజసుతచేత నామెకుం బూజ సేయించెను, అప్పుడు ప్రోలం గనంబడినచతుర్ముఖాదులను మహాదేవుండు యథోచితాచరణంబున గౌరవించె. సరస్వతియుం సావిత్రియు నుమాదేవికడకు వచ్చి సేమం బడిగిరి. ఇట్లు శౌరి యతని సంభావించి మించినప్రణయంబున నోయంబికానాథ నీవు నాయింటికి విచ్చేయుము. అని ప్రార్థింపఁ గృత్తివాసుండు నాతనితో నోయిందిరానాథ భవదీయం బగునీనిశ్రేయసవనంబునఁ గొంతతడ వుండి యనంతరము నీనగరుకు వచ్చెదను. ఇది యతిరమణీయంబై యొప్పుచున్నది గాన దీనింబాసి రా మానసంబు ప్రియంపడదు. కావున నియ్యెడఁ గొంతకాల ముండంజనుననిన నక్కమలనేత్రు నానతి నప్పుడ హరిపార్షదులు నాశృంగారవనంబున నుండు పెద్దకొలువుకూటంబునందు నయ్యందఱకును మణిమయాసనంబు లమర్చిరి. శ్రీహరిప్రార్థితుండై హరుండును తక్కంగలవారు నమ్మహాసౌధంబును జొచ్చిరి. అప్పుడు లక్ష్మీపతి నవరత్నఖచిత మగుమహాసనంబున గౌరీనాథు నుపవిష్టుం గావించి యతనియానతి నొక్కమహాసనంబునం దాను గూరుచుండిన నళినసంభవుండు దిక్పాలకులును మునిగణంబులు నుచితాసనోపవిష్టులైరి. అప్పుడక్కొలువునకు నెల్లగంధర్వులు నెల్లదేవతలు నెల్లయచ్చరలు వచ్చి హరిహరకమలగర్భులకుం బ్రణమిల్లి తొల్లి యెన్నండును లేనిమహావిభవంబుతోఁ బ్రకాశించునాసభం గని కరము సంతసించుచుండిరి. రమాదేవియు శ్రీకంఠునిరాణియు వాణీసావిత్రులతో నేకాసనంబులం గూరుచుండిరి. నారదుండును వీణె వాయించుచు శ్రీహరిమాయాప్రపంచంబులెల్లఁగూర్చి గీతంబులం గీర్తించె. మఱియు నచ్చోఁ గ్రమక్రమంబున గరుడకిన్నరయక్షగంధర్వసిద్ధవిద్యాధరులు హృద్యం బగువైశారద్యంబు సభవారు గని మానసంబులం గరంగ గానంబులు పాడిరి. రంభయుం మేనయుం ఘృతాచియుం మొదలగు నప్సరాంబోజ

ముఖులు కరము రక్తి యందయిఁప నాడిరి. ఇట్లు కొంతతడవు జరుగ గజేంద్రరక్షకుని చిత్త మెఱింగి యాలోన సభ యంతయు సందడిమాని యూరకుండె. అప్పుడు సమయోచితములగు సరససంభాషణములు కొన్ని పచించి చంద్రశేఖరుండు శ్రీకాంతునికిం దనరాకకుం గతంబు దెల్ప నలయునను భావంబు ముఖావలోకనంబులం బ్రమథుల కెఱింగించి కడలిరాచూలిపట్టిం జేపట్టినవానినెమ్మొగంబుం జూచి యెలనవ్వుతో ని ట్లనియె.

మహాదేవుఁడు. ఓమురవైరీ! దేవాసురులు కవ్వపుఁగొండవైచి కడలి మథింపఁగాఁ గలిగినయమృతంబును బలంబు మెఱయ నసురులు హరించిన నీ వవ్వేళ నొక మాయావధూటివై వారి వంచించి వేలుపులకు సుధారసంబు నొసఁగితివఁట. ఇవ్వృత్తాంతంబు విన్నంతన నీధరించినకపటమానినీత్వంబుఁ గాంచ మన సయ్యె. భవదీయంబగు నీ మోహినీరూపకలనం బత్యద్భుతం బని నారదుం డెఱింగించినవాఁడు. ఇంతివాలకమును నీ వెట్లు దాల్చితివో! ఎట్టివిభ్రమంబున నిందువిల్కాని నాక్రమించితివో! శక్రాదులను సంయముల నసురుల నేవిలాసంబున వలపించితివో? అట్టిమరులుగొలుపువాలకంబుఁ గ్రమ్మఱం బూనుము. ఈదేవమునీంద్రుండు శ్రీధరునివధూవిలాసం బఖిలలోకముల మోహవారిధి ముంచె; నమ్మాడ్కి నీవు గనుఁగొన్న వలరాజుకాకకుం గ్రాఁగుదు వని నాతోఁ బంతము లాడినవాఁడు. దేవదానవులట్టి భ్రమసి నీవుఁ దిరుగుదు వన్న నీచోక్తులకుం గనలు గలిగియున్నాఁడ. నీవు గావించుమాయం గని మోహింతునో! కాక ధైర్యమున నగుచు గన్గొందునో! మదీయం బగువిరక్తియుఁ ద్వదీయం బగుకపటనాటకము నీదేవత లెల్లఁ దెలిసికొనువారు. ఇఁక నేల పలుకులు! లెమ్ము! లేమ వై రమ్ము.

అని చెప్పిన నప్పుడు శివుని ప్రమథులు కలకలంబున నాహరిపయిం గవిసి కొన్ని మాటలనం గడంగుడు వారల వారించి భృంగీశ్వరుం డి ట్లనియె.

భృంగి. ఓహరీ! వినుము. ఈజడదారి యీయభవునికడ కేతెంచి నూతిలోఁ మునుఁగు మండూకంబుభాతి నీదగుతుచ్ఛమాయలో మునింగి యుండువాఁ డది యెఱుంగక యితరులం బల్కువిధంబున జ్ఞానశూన్యుండై యతిలోకమహిమాఢ్యుం డగుమృత్యుంజయునిం బోనాడె. ఈపోరుదిండి యీభూతేశునితో నావెన్నుఁడు నిన్నైన మాయానిర్మగ్నుం జేయంగలవాఁ డాతనిమోహిల నితరుఁడు వే ల్పెవ్వఁ డని యనుచుం బల్కిన విని యే మప్పుడ యీతనిపండ్లు డుల్లవ్రేయం బూనితిమి. ఈవెక్కురు శివుండు వల దని వారించె. తఱి దప్పిపోయె. ఈదరోపేక్ష లేటికి. ఈతండు పలికినగతి నీవు నీకపటకృత్యంబులం జూపఁ బూనితివేని చూచి తర్జించి సరసిజసంభవాదు లెఱుంగ నిన్నుఁ బొల్లపుచ్చి కీర్తి హెచ్చం జనుట కార్యంబు గాక యిప్పు డీతనిం దిట్ట నేల? ఈమాని నీమాయయు నీమహాత్వంబు నేమాత్ర మెఱింగినవాఁడో! ఎఱుఁగనివాఁ డైన నెల్లయెడల నిట్లు 'పం

తంబుతో వాదించునే! దనుజు లన్న మొదటనే మూఢమానసులు. మఱియు మద సార్తులు. అట్టి మందమతుల మాయలఁ బెట్టుట మఱిమఱి చెప్పవలసినది గాదు. అప్పుడు సిద్ధు లయిన సంయమివర్యులును భ్రమఁ జెంది రని యీతపసి పల్కినది యుపేక్షింపం గూడనిమాట. ఇది కల్లయో నిజంబో యెఱుంగంబడదు. నిక్కముగ నీమాయకు భ్రమసి చేవదక్కిన సిద్ధసంయమి యెవ్వాఁడో! వీఁడని చూపుము! లోకంబున నాఁడువారికిం జిక్కినవాఁడు నొకమునియే?

అని చెప్పిన విని శ్రీకాంతుండు చిఱునవ్వుతో నారదుని మోముఁ గాంచి తల వాంచి యిందు యుక్తం బేదియో యనుచుఁ దడవు చింతించుచు నెవ్వరితోడఁ బల్కక యూరకుండె.

అప్పుడు సభాసదులు కొందఱు హరి మారుత్తరం బీకున్న తెఱంగుం గాంచి యీ తీరున నీమహాత్ముం డుంటకుం గతం బేమొకో యని యనుకొనిరి. కొంద ఱితనిమాయలు మముబోంట్లం గాక యీయష్టతనుని సోకంగలవే యనిరి. కొందఱు నీయిరువుర నేర్పులు నిదె యీక్షణమునందుఁ గనుఁగొందము; ఇందుకుం జింత యేల యనిరి. కొంద ఱీహరి హరుని నెట్టులనైన మాయలం బెట్టు నిది నిక్కువం బని నిర్ణయించిరి. కొంద ఱది యె ట్లగునో! యెవ్వరి కెఱుంగ నగు ననిరి.

కలహాశనుండు హరి మాటలాడకుండుటం గాంచి తన ప్రతిన నిల్పుకొఱకె యీ వితంబున నున్నవాఁ డని యనుకొనుచుండెను.

విష్ణుండు. (ఆత్మగతంబున.) కట్టా! ఏను జడు లయినయసురుల మోహితులఁ జేయ నెలఁతరూపుఁ దాలిచి కాన్పించినధూర్తవర్తనంబులం గనుంగొని వార్తాహారుం డగునీ వీణాముని యాడనాడఁ బ్రకటించుచు నీపురహరునిపాలికిం బోయి వినోదార్థముగఁ బ్రసంగించియుండు. అత్తఱి ప్రమథు లేమనిరో? దానఁ గథానుకథనంబుగ మీరలైనఁ జూచిన్న మోహామందుదు రని యక్కజంబుగం గొని యాడియుండు. అది విని యీవిరూపాక్షుండు దన్నీ తపసి తక్కువసేసె నని యనుకొని యభిమానంబుం గొని యేలుక వహించి వచ్చి యీసభ యెల్ల విన నన్నుఁ జౌకగా నాడి నా మోహినీవేషనటనలం గాంచి కామించకయ నిర్వికారభావమునఁ గదలి పోవలె నని సంకల్పించి యున్నవాఁడు. ఈమదనారి తిన్ననిమాటలం బోఁడు. ఏ మనువాఁడను. ఈమహాత్మునినిర్మలం బగుబుద్ధిం గలఁగింప వలనెను. ఇతనితమకంబును గొలఁదిగా కున్నది. మఱియు నీప్రమథులు మించినకోపంబున బీరంబులు వల్కుచున్నవారు. శమంబు మెఱయ నిమ్మాటల నిప్పటికిఁ జార్చిపోవిడిచిన నీ నారదునిం గన్నచోటులఁ దల యెత్తనీరు. కావున నీప్రమథనాథుని భ్రమపఱిచి ప్రమథులను సిగ్గుపఱుపవలయును. ఇదియ నిర్ణయంబు. అని యాలోచించి, మొగం బెత్తి మం

దస్మితంబుఁ గావించుచు నిట్లనియె. ఓ ధూర్జటీ! నేను దనుజుల భ్రమియింపం దరుణి వేషంబుఁ దాల్చి యొకకొన్నివగలు చూపినాఁడ. ఆవికారంబులను మహాయోగి వైననీ వ్రాల నెట్లు చూపం గలవాఁడ. అదియునుంగాక నీవు మహానుభావుండవు. అమలానంద రసస్వరూపుఁడవు. యమనియమాదియోగవర్ధిష్ణుతేజుండవు. చిదచిదాకాశసాక్షివి. అట్టి నీకు నాతులం గనుఁగొన్న మనోజవికారంబులుగలుగునే! నమ్ము మంచిసఖ్యంబునం గనుఁ గొన వచ్చితివి. ఈ యించుకపనికిగాఁ గోపగించుకొన నేల! ఈ ప్రమథులు కోపంబున దుర్భాష లాడుచుండం బ్రణయంబుతో వినుచుండుట నీకుం బాడి యగునే! వేడుకగా నాయూఁడురూపంబుం గాంచవలసిన నొక్కప్పుడు చూచెదవుగాక. ఏల యిప్పు డింత పదరెదవు! ఇంద్రియక్షోభ మపనయించిన బుద్ధికిం గలఁక గలుగదే! మిమువంటియోగీశ్వ రుల నూరక వికారమొందించిన నాకేమి ప్రతిష్ఠ. సుజనులయెడదల నుండుతాల్మిఁ ద్రోసిన భవాదృశులు నను గణియింతురే! ఏనిచ్చినపూజలం గైకొని నీచానతోఁ గైలా సంబున కరుగుము.

అనిచెప్పిన నాహరిమాటకియ్యకొనక వెండియు వెండికొండరాయం డిట్లనియె.

మహాదేవుఁడు. ఓ లక్ష్మీపతీ! ఈ కపటోక్తుల కేమి! నారదమునిపంతంబు యథా ర్థం బగుట యొండె; మదీయవైరాగ్యంబు ప్రసిద్ధిం గాంచుట యొండెఁ; గాక యూరక నేను గదలిపోను. నీ సుదతీత్వముఁ జూడ నిదియ వేళ. ఇప్పుడు దప్పించి యెప్పుడు చూపెదవు. లే లెమ్ము. మాయలలేమవై రమ్ము. నాకుం బాళిఁ గల్పింపుము.

విష్ణుండు. (కోపంబుతో.) ఓ కృత్తివాసా! ఈవు మాన్యుండవని యెంచి నేను శ్రవణకఠోరభాషణములు నీ ప్రమథులు పల్కుచుండ సహించి సవినయోక్తులనెంతయు స్తుతించినను నన్నుం గొంచెముగ నెంచి నాయూఁడురూపంబె కనుఁగొనం గోరుచున్నాఁ డవు. మంచిదయ్యె. ఓ ఫాలనేత్రా! సుమధన్వునకుం గలిగియుండుచూడు నేటితో వీఁడ నిదిగొపడఁతి నయ్యెదను జూడుము. అని చెప్పి యెలనగ వంకరింప నారదమునిం గాంచి కరుణామయుండై యిట్లనియె. ఓ మునినాథా! ఏల యీపనికిం గడంగితివి? ఈతండు ఫాలనేత్రాగ్నిని మన్మథుని నీఱుచేసినవాఁడు; మిత్తినెత్తి నఱచి వానికావరంబుం గడ తేర్చినవాఁడు; మఱియు సర్వజ్ఞుఁ డను పేరం బేర్చినవాఁడు. ఈ సురవంద్యునిమ్రోల నేల పంతం బాడితివి. ఇది యిప్పు డీడేరుట యెట్లు! నీ సూక్ష్మబుద్ధికిని నీ తెలివికిని మోసమగునేమొ కదా?

అన విని నారదుం డక్కపటనాటకునికరుణ యెఱింగి కరంబులు మోడిచి యి ట్లనియె.

నారదుఁడు. ఓ దేవదేవా! మహనీయంబగు దేవరదివ్యతత్వంబు దివ్యమానసులు నెఱుంగం జాలరు. సాత్వికు లెఱుంగుదురేమొ? ఈ యర్థంబు నీ పార్వతీశుం డెఱుం

గదా! ఈ యబ్జగర్భాదులు నెఱుంగరా? వాఙ్మానసంబుల కందరానిదివ్యాకృతివి. పరమాత్మస్వరూపుఁడవు. చరాచరాత్మకం బగు ప్రపంచంబును భూరితరంబగు మాయాబలంబున రక్షించెద వనుట ప్రసిద్ధంబ. ఇది వేదభాషితము. ఇట్టినీవు భవదీయమాయానైపుణ్యంబుం బ్రకాశింపం గడంగుడు భ్రమింపక తాలిమిం బట్టువారుగలరే! ఈ యమరులును సంయములు నీవానాఁడు మోహిని వైననీదివ్యసౌందర్యంబుం గాంచి బాళిం జిక్కి మరునిరాయిడికి స్రుక్కి మానములు దక్కి బలుమాఱు వేఁడుచు నిన్ను మేకొన్నవారలు గారా! ఈ కథ వినుట కిపుడు వెఱ గయ్యెఁ గాఁబోలు? ఈ యీశునితో నే నేమియుఁ దప్పాడినది లేదు. అమృతంబు నపహరించినయసురులను భ్రమపెట్టుట కీవు భామినివైనకత సకలలోకములం దెల్పుచు రజతాద్రి నీశునుని సన్నిధానముకుం జని యత్తెఱంగు మిమ్ము వినుతిసేయ విన్నవించితిని. దనుజులను దైత్యులను దేవతాపురోగములను మునులను మోహసముద్రంబున ముంచినాఁ డని యంటిని. వీర లది కల్ల యని హాస్యంబుసేయఁగా మానసంబున నలుక వొడమి నే నోశూలాయుధుఁడా! ఆమాయావధూలలామంబును నీవె చూచినచో బాళిం జిక్కక పోవని పంతంబు లాడితిని. ఇది నేరం బనితోఁచిన నన్నుఁ దండింపుము. నీమది కిది సమ్మత మేని మన్నింపుము.

అనిన వనమాలివచనం బాద్యంతంబు లరసి సుందరంబగు దరహాసంబుతో నభినవ లలితమోహనదృష్టి నాసభవారిని పారిషదులను గౌరీపతిని గనుంగొనియె.

అప్పుడు మహాదేవునికిం జనించినవికారంబు నిరూపించి యిందిరాదేవితో సరస్వతి యిట్లనియె.

సరస్వతి. ఓకమలవాసినీ! ఇది యేమి చోద్యమో చూచితివా! ఈమురహరుని చూడ్కివలన నీతనినగవువలన నంగవైరి కొక్కప్రేల్మిడి వెన్నెలవలనఁ గల్వవనంబునకుం బోలె ననంగకళ లెసంగుచున్నయవి. మేనం జడతయుఁ గంఠంబున వైస్వర్యంబు నవయవంబులఁ గ్రొంజిఱుచెమ్మటలును బొడముచున్నవి. మొగంబు వైవర్ణ్యంబున వెల్లనయ్యె. అఖిలాంగకంబులు గగుర్పాటుఁ గాంచుచున్నవి. నయనంబుల నానందబాష్పంబు లావిర్భవించెడిని. మఱియు నీపురహరుని మోముఁ జూడఁజూడ సరసమగుమన్మథకళాచంద్రిక యొకటి యతిశయించుచున్నట్లు తోఁచెడిని. ఓదేవీ యీకమలనయనుండు పురుషాకారంబున నుండి నవ్వినవ్వునకే యిట్టయిన నీహరుండు హరిణనయనాకారంబుఁ దాల్చిన యతనిరూపంబును విలాసంబులునుగాంచిన నేమగువాఁడో? ఒక్కప్రేల్మిడి నితండు తొల్లింటిదనచందంబు మఱచె నని తోఁచెడిని ఔర! ఈమురహరునిమాయ నేమందును.

లక్ష్మి. ఓచెలీ సరస్వతీ! యీవెన్నునిచిన్నిలేనగవునన గాదె సర్వజగంబులకు భ్రమలు గొలుపుమాయ వర్తించుచున్నయది. ఈమాయకుం గలంగకయుండువారును గలరే! ఇఁక నీయంగజవైరి పడునవంగవ్యథలు గన్నులపండువుగఁ గనుంగొనియెదము.

మహాదేవుఁడు. (ఆత్మగతమున.) ఔరా! ఈశృంగారవనంబునందు.

సీ. కనకరంభాస్తంభకరికరంబులలీల లపహరించెడుతొడ లమరుదాని
విద్రుమద్రుమలతోన్నిద్రపాటలకాంతిఁ గడకుఁ ద్రోసెడుమోవి గలుగుదాని
మదమత్తమాతంగమహితకుంభోన్నతిఁ గాంచుచన్బంతుల మించుదాని
శారదపరిపూర్ణచంద్రబింబద్యుతిలలిత మానెమ్మోము వెలయుదానిఁ

గీ. దప్తహాటకరుచి యొప్పుతనువుదాని
లలితబిసనాళసమబాహులతలదాని
కొమరుపాయంబునను మించుకులుకులాడిఁ
గూడి సుఖియింపఁ గల్గునే కోర్కి నాకు.

బళిరా! మదీయమనోరథంబున కనురూపముగ నెయ్యెడనుండియో యొక్కచక్కని చక్కెరబొమ్మ సరసకుం జనుదెంచుచున్నయదివోలెఁ దోఁచుచున్నయది.

కలయ నవలోకించి,

క. అదె కోమలినునుమైవల, పదె యందెలరవళి యదియె యంగద్యుతి య
ల్లదె మందహాసరుచి య, ల్లదె మదనునివిజయలక్ష్మి యగుమానినియౌఁగా.

అని యివ్విధంబునం దలంచుచుండుసమయంబునందు నొకవైపుననుండి.

## సీసమాలిక.

తళుకులత్తుకడాలు దులకించునెఱ్ఱనియడుగుఁదమ్ములు గలయబ్జగంధి
కమలగర్భాభోగకాహళీవరభాగములఁ బోలుజంఘలముద్దుగుమ్మ
కనకరంభలు గన్నకలిమినిఁ గైకొన్ననును పెందొడలు గల్గుఘననితంబ
గగనంబువలె జోక గనరాక సైకమై వలియుంకొను జెలంగువన్నెలాడి.
అలపొన్నవిరిభాతి నావర్తగతరీతిఁ జెలఁగుపొక్కిలి గల్గు శ్రీకరాంగ
ప్రతిలేనినలచీమపరిఁ జేరురుచిమీఱునూఁగారు దోతెంచునాగయాన
జక్కవకవలీల జుభిలశ్రీ గలనిక్కుచన్గుబ్బలనీరజాక్షి
మదనునిబిసఘాటి మగిడి పో మీటెడుమృదుబాహులత లొప్పుమెలఁతమిన్న.
మఱి త్రిరేఖలఁ గూరి మదనుశంఖముఁ గేరి మెఱయుకంఠం బొప్పుమించుబోఁడి
కమలారికళ యెంతకల దంచు నవ్వెడువిమల మౌనగుమోము వెలయుకలికి
అమృతంబురుచి మీఱి యలబింబమును గేరు కొమరువాతెర గలకోమలాంగి
సరిమీఱుమగరాలసవలీల వెలయించుమురువొందు రదజాలములశుభాంగి.

మొల్లలజిగిఁ దోలి మురువుఁ జెందంగఁ జాలు మొలకనవ్వులు గలముద్దుగుమ్మ
లలితచంపకసూనలక్ష్మీమనోజ్ఞ మై పొలుపొందునాసిక గలశుభాంగి
భీతబాలకురంగిభాతిఁ జంచల మగు బెళుకుఁజూపులభంగిఁ బెరయుపడఁతి
వెలయు కాంతులఁగల్వవిరులఁ గెల్వఁగఁ జాలునొలయుకన్నులచెల్వ మొలుకుచెల్వ.
కెడవింటిదొరచాపవిభవంబు మాపంగఁ గడఁగుభ్రూవిశేషపగళిసురూప
సరవిఁ గ్రొన్నెలచెన్ను సవరింపఁ గలచెన్నుదురుసౌరు గలిగినతోయజాక్షి
హరినీలమణులసొం పడఁచుచల్వైన మించుకురులయందము గలకువలయాక్షి
మణిదర్పణశ్రీల గణనకెక్కఁగనీనిగండతలంబులకంజనేత్రి

గీ. చెలఁగుమదనునినవజయశ్రీ యనంగఁ, జిలుకతేజీవజీరునిజీవ మనఁగ
మరునిసమ్మోహనపుదివ్యమాయ యనఁగ, చారుసంసారసుఖచయసార మనఁగ.
సభకుఁ జనుదెంచి యంతలో సంభ్రమించి, సోలపుఁజూపుల నవ్వుచు వలపుఁజూపి
మోహతిమిరంబుఁ బ్రజలపై నూహఁ జల్లి, మొనసి కలకల నవ్వుచు మోము నెత్తి
నిండువెన్నెల దిశలందు నించుకొనుచు, నోలిఁ బయ్యెద వెసఁ జక్కనొత్తుకొనుచు
చంచలపుముంగురులు సవరించుకొనుచు, నంగజాతుల మగుడెంద మగపఱుచుచు
స్తనభరానత మైనమధ్యంబుతోడ, ఘనజఘనభార మందమాగతులతోడ
నతులితము లగుకుండలద్యుతులతోడ, వలపుఁ గొలిపెడుశృంగారకళలతోడ.
కమలయును బార్వతియుఁ జీకాకుపడుచు, మురువుఁగోల్పోయి సిగ్గున మోము వంప
రత్నపాంచాలికానికరములు దీప్తిఁ, బోవిడిచి వేగ వెలవెలబోవుచుండఁ.
క్రొత్తవెన్నెలపై సోకఁ గొమరు దక్కఁ, కంజములమాడ్కి నచ్చరల్ గాసిలంగ
వడి మహామోహశక్తి పైఁబడినయట్లు, వచ్చి శివుమ్రోల నిలిచె నవ్వన్నెలాడి.

ఇవ్విధంబున నాచిలుకలకొలికి తనసరసకుం జేరినమాత్రమున నస్తమితస్థైర్యుండయి యాపంచబాణునిసమయించిన వైరాగ్యశాలి చూచి తలయూఁచి నివ్వెఱగంది చలచిత్తుండై గుండె జల్లుమనఁ దనువునం గంపంబు వొడమ ధాతువులు సెదరఁ గళవళపడుచు నిట్లు వర్ణింపందొడంగె.

[బ్రహ్మాదులగుసురలును దిక్పాలకవరులును బ్రహ్మయోగులును చూచుచుభ్రాంతిపడి యుండిరి. ప్రమథులు పంచశరసాయకపీడితులయి యన్యోన్యపరిరంభణంబులు సేయుచుఁ జీకాకుపడం దొడంగిరి. సభం గలవారలు శివునంతవార చిల్కతేజీవజీరునికిం జిక్కిన నింకనెంతటిమహాత్ములు; కాంతలం గని భ్రాంతిం గరుఁగనివార లని యనుకొనుచుండిరి.]

మహాదేవుఁడు. బళిరే! తేప్రాయంపుంజెలువ యన నిట్టుగదా యుండవలె! బాపురే! తన్నుంగనుఁగొనుమగవారల, కివ్విధి భ్రమ పుట్టించి వారలమానసంబులం గరంచునీయె

లనాగవంటిమచ్చకంటులును గలరే! శారదచంద్రచంద్రికాపూరంబునను సుధాసముద్ర ముప్పొంగుసంగంబున నీమగువయౌవనశ్రీఁ గాంచి మదీయమానసం బుద్వేలగతి నుబ్బుచున్నయది.

సీ. అకలంకభవ్యాజహాసానురాగం బది శుకవాణిశును మోవిఁ జూచుదనుక
నేమంబువలనఁ జెందినక్షమాగుణ మది తొయ్యలిపిఱుఁదులు దోఁచుదనుక
గడకుఁ ద్రోయఁగరానిగాంభీర్యమహిమంబు పడఁతినాభిని దృష్టి బాఱుదనుక
గురుతరం బగుకులగోత్రప్రసక్తియుఁ గరియానచనుదోయి గనినదనుక
గీ. మహితహరిచింతనాప్రౌఢిమం బదెల్ల, కలికిలేఁగౌనుదీవియ గనినదనుకఁ
గాక నిల్వఁ దరంబె యాకంబుకంఠిఁ, జూచినంతన సరసిజసూతికైన.

కట్టా! మదనునిపట్టపుదంతియగు నీయింతితోఁగలసి రతికలహంబుల నీమిటారి యడుగుదమ్ముల మౌళిచే నలంకరించినం గదా! కమ్మవిలుకాని యనుగ్రహంబునకుం బాత్రుండ నగుదును.

మాయామానిని. సొలపును సిగ్గును బెరసినయొక్క చిన్న చిఱునవ్వునవ్వి, అంతం గాటుకజిగి గలసిన యతిధవళరుచులు నీలోత్పలదళంబుల ముంచు చంద్రికాలహరులతోఁ దులఁదూఁగ బెదరినయేడాదిజింకవలె నతిచంచలంబులై బొలుపారు సరసకటాక్షవీక్షణసాయకనికరంబుల శివునివెడఁదయురంబున నాఁటి వీఁపున దుస్సిపోవం బఱపుచుఁ బయింబయి నూటాఱుమారులు బెళుకు బెదరును వాడిచూపులం జూచి సన్నసైఁగలు కొన్ని యొనర్చె.

సరస్వతి. ఓసెచ్చెలీ! చూచితివే! యీయీశుండు మాయావధూటిలేనగవునకుఁ గిలికిలలకు వెన్నవలెం గరంగి జడియుచు నారదునితో నాడినపంతంబును మనంబున నిడక యిదె కనుఁగొనుచున్న కమలాసనప్రముఖులు గర్హింతు రని యనుకొనక, ప్రమథుల పూన్కియెల్ల భంగంబు నొందు నని తలంపక, తనపాటుఁ గాంచి పర్వతరాజపుత్రి గేరలు నొకో యని యెంచక ఇది శ్రీహరిమాయ యని యొకించుకయుం సందేహింపక, తనదృఢయోగబలంబు నూఁతగొనక, సహజంబగు సర్వజ్ఞత్వంబున నిలువంబడక, చిత్తంబు సంక్షోభంబుఁ జెందుటఁ గానక, మత్తునిరీతి మమతం గాంచి, యీమాయాలలితాంగిమాయావిలాసజలనిధికల్లోలపరంపరల నోలలాడుచున్నవాఁడు. ఇదె చూడు మితఁడు నీచక్కెరబొమ్మచక్కనిరూపు సారెసారెకుం జూచుచు నాహాఁతుక తన్నుంజూడఁ బులకలు పర్వ నొడలితోఁ గళవళపడుచుఁ దటుక్కున లేచి యాటెక్కులాడిం బట్ట గమకించుచు నలువురం గాంచి వెండియుం లజ్జించుచు నీసువతిం జేకొనఁ దఱి గాదు గదా యని వెచ్చ నూర్చుచు నాతరుణి యొనర్చుసన్నసైఁగల కొకింతతడవు దాళుకొమ్మనుచుం దెలుపుచు నీ

యంద చెప్పఁడు పోదురా యని నిట్టూరుపులు నిగుడించుచు నేకాంతం బెందు దొరకునా యని యారయుచు నిర్వ్యథఁ గలంగుచున్నవాఁడు.

లక్ష్మి. ఓచెలీ! ఈలోలాక్షిం గాంచి మాఫాలలోచనుండు దన్నెప్పుడో మఱచెను. మఱియు నితనికి నితరు లున్నారని తలంపును నశించినయది. ఈచెలి ధవళతరమందహాసరుచులు పర్విన ప్పుడ శిరంబున నుండుగంగను మఱచినవాఁడు. ఈలీలావతిఫాలంబుం గాంచినంతన నాళిం గలచందురునిం దలంపనివాఁడయ్యె. అట్లయినం దక్కినవారిం గణింపకపోవు టెంత? అదె నాప్రాణనాయకుండు సర్వమాయేశుండు కనుసన్నల నందఱ నీశివునికిం గనుచాటున నుండం దెలుపుచున్నవాఁడు. తదభిప్రాయానుసారులై బ్రహ్మాదులును మునులును పార్వతియుం దక్కంగలవారు శ్రీచంద్రశేఖరుని కెఱుకపడకుండ మెల్లనఁ గను మొఱంగుచున్నవారు. మన మట్లు సేసి యీసౌధతలోపరిభాగంబున నుండి యితనికి నీమాయామానినివలన నగుమరులవెఱ్ఱులం గాంచెదము. అని యయ్యెడఁబాసి మఱియొండు చోటి కరిగిరి.

మహాదేవుఁడు. (ఆత్మగతమున.) బళా! ఈచెలువ నాయంద యమందానురాగంబుం జూపెడిని. మఱియుఁ గామాంధంబులగు లోలవిశాలలోచనంబుల వెడలు చూడ్కులను సన్నసైఁగలను దనమనోగతంబగు దుస్సహవిరహవేదనాకులత్వంబుం గానిపించి నాబిగికౌఁగిటికి నాసపడుచుఁ గరము సంభ్రమించుచున్నయది. కట్టా! వేళ గాక వచ్చినది. ధైర్యంబున నావేగంబు డించుకొనియున్నాఁడను. ఇఁక నీయోలగంబు చాలించుకొని బలిమి మెఱయించుచు నీజవ్వని నెత్తుకొని పోవుట యుత్తమంబు. అట్లు సేయనేని దీనితో రతికేళిం దేల ననువు లేదు. ఈశౌరిని వీడ్కొని యాతనియంపకము వడసి మదీయమనోరథంబు నెఱవేర్చుకొనియెదను. (అని కొలువుం గనుంగొని ప్రకాశముగ) ఇదియే మచ్చెరువా? చక్రధరుండు గానంబడఁడు.

అని నలువలంకులు వీక్షించి.,,

ఔరా! కమలగర్భాదులు నెయ్యెడకో చనిరి. పర్వతరాజపుత్రియుఁ జూపట్టదు. లక్ష్మియుం సరస్వతియుఁ బొడసూపరు. ప్రమథగణంబును బాసిపోయినది. ఈచిన్నదిమాత్రమున్నది. నామనోరథంబు లీడేరుటకే యిట్టిరహస్యంబు దొరికెను. నేఁడు గదా నాతపఃఫలంబు పండె. ఈకాంచనాంగియు నాచేఁ జిక్కెఁగదా! ఇఁక నెవ్వ రెట్లైన నేమి?

అని యారామామణిం గాంచిన నాకాంచనాంగియుఁ గపటభయసంభ్రమంబులతో నించుక యెడగలుగ నిలచి లజ్జాకులంబు లయిన ప్రణయవీక్షణముల దేరి చూచెను.

లక్ష్మి. ప్రియసఖి సరస్వతీ! అదె చూడుము! శివుండు తనచేతి కీనాతి జిక్కె నను కొనుచుండ మరుండును పగతుండు తనకుం జిక్కెఁగదాయని మిక్కుటంపు శౌర్యంబునం

దనసూఁడు దీర్ఘకోనం గోరి యక్కజంబుగఁ జిలుకతేజీని పైకి దుమికించి సంపెంగి చిక్కటారునం జివుక్కునం బొడిచి యెత్తి మత్తశుకపికార్భటుల నార్చి పేర్చిన నతని సహాయుండగు వసంతుండును మధుపముల మ్రోఁతలం జెలువు జిందరవందరచేసి రాయంచ గములను మయూరంబుల నెగిచియెగిచి కళవళింపం జేయుచు మలయమారుతము నెదుర్కొనం జేసెడిని. ఇట్లు పగవానిబలంబులు తనపయిం బడి యేచ మృత్యుంజయుండు మిగుల జాలిం జెంది యున్నవాఁడు చూడుము.

మహాదేవుఁడు. అక్కటా! మారునిశరంబులు మర్మంబులు దూఱి పాఱెడిని. ఈ బాళింబడి యేల జాలిం దూలవలయు? బలిమిమెయి నేకతంబున నుండునీయింతిం బట్టి కౌఁగిటం జేర్చి కామునినికామక్రూరనారాచంబుల పెనుజడిం గలయలజడిం బాసికొని యెదంగాక.

అని చెచ్చెర సింహాసనమును డిగి యాకాంతచెంతకుం బోయిన నానీలవేణియు నచ్చోట నిలువక యాసౌధాంతరంబు వెడలి తన వెనువెంటం జనుదెంచు నాత్రిలోచనుని మోముమరల్చి బెళుకుంజూపులం జూచుచుం జని యొక్కలేఁదీవెమఱుఁగునం బడి కనం బడక బంగారుబొమ్మకైవడి నవ్వలికిం జని నిష్క్రాంత యయ్యె.

మహాదేవుఁడు. (ఆత్మగతంబున.) ఈయింతి నన్నుంజూచి నవ్వులకు డాఁగుకొనిన యది. చతురలగు విలాసినులకుం గాంతు నొకింతం దొలుత యలయించి దక్కంజేసికొనుట సహజగుణంబు. అట్లిమగువయుం జేయుచున్నది. కనిపెట్టి యీవనితం బట్టుకొనియెద.

(అనియనుకొని యాతీఁగెమాటునకుం బోయి.) కట్టా! యియ్యెడ నాతొయ్యలిం గానము. ఇయ్యెడ నున్న యాచిగురాకుబోణి యింతలో నెచ్చటి కేఁగెనో! ఈపూఁబొద రిండ్లయందెందైన నుండకపోవునా? అని యయ్యెడ నుండుపూఁబొదరిండ్లం గలయ నవ లోకించుచు నెదుటం గాంచి. ఈగొనబుమిాఱినతీఁగెగుమి గప్పికొనియుండుపొన్నప్రాని బందున నందంబై యొప్పుచందురాతిన్నియపై యాచెలువ యుండు నని తోఁచెడిని. కర కమల మణికంకణగణనినాదంబులు చెవులపండువు సేయుచున్నవి. మఱియుం మైపలపుగల సిన మృగమదఘనసారచందనసారసౌరభంబులు మలయుచున్నవి. ఇందుం గనుఁగొందును. అని యొకనికుంజంబునం దొంగిచూచి పరమహర్షంబుతో. అయ్యారె! యిదె యియ్యెడ.

సీ. పయ్యెద జాఱఁ జన్బంతుల ముత్యాలహారము లొప్పుబగుగా నల్లలాడ
చెక్కులు నెమరింపఁ జెదరఁగా ముంగురు ల్గిక్కుల మైతావి పిక్కటిల్లఁ
గరముల రతనంపుగాజులు మొఱయంగఁ గొప్పున విరివాన గురియుచుండఁ
బలుమాఱు చెండు గొప్ప లలాటమునఁ గల్గుచెమ్మటఁ గోటులఁ జిమ్ముకొనుచు
గీ. బంతివెంబడి దృష్టులు బఱపికొనుచు, గ్రహణమోచనవైచిత్రి గానరాక
పొన్నకడ నున్నచల్వరాతిన్నెపైనఁ, గంతుకక్రీడ సలిపెడిఁ గంబుకంఠి.

యథానిర్దిష్టవేషంబుతో మోహిని ప్రవేశించుచున్నయది.

మహాదేవుఁడు. ఇప్పు డెవ్విధి నైన దీనిం బట్టుకొని దీనిభావంబుఁ గరఁగించి దీనితోఁ గుసుమశరలీలావినోదంబులం గాంచవలయు. దీనికిం దెలియపడక పిఱింది దెసన చప్పుడు గానీకచని గొబ్బునఁ బైఁబడి లేవనీక కౌఁగిలించుకొనియెదను. అని నిష్క్రాంతుఁడయ్యె.

సరస్వతి. ప్రియసఖి కమలవాసినీ! అదె కనుంగొనుము. నీలలోహితుండు మాయా వధూటిం బట్టి భోగింప నను వారసి భూమిచొప్పు దప్పించి చప్పుడుగాకుండం జరణము లిడుకొనుచుఁ దన శేనిధవళరుచులు ముందుకుఁ బోదలనీక పూఁబొదలయందుఁ గ్రుంగి క్రుంగి చనుదెంచి యాకపటచంచలాక్షి యుండెడుపొన్నబోదియకుం జేరినయచటితరుని కరంబు నండఁగొనుచు నలపున్నాగంబుమాటున నిలిచి వంచనచేసి నెలఁతం బట్టుటకుం గడంగుచున్నవాఁడు. ఔరా! యీమదనారికి నింతతమకంబును భ్రమంబును గలుగునే! (సత్వరముగ) ప్రియసఖి ప్రియసఖి చూడుము చూడుము! ఈచంద్రశేఖరుండు పున్నాగంబు మాటున నొక్కింత నిలిచి కరము దమకించి యల్లనం దరువుచాఁటుడిగి వెనుక పాటుగం గడువడిఁ బరతెంచి లఘించి మాయాకాంచనాంగిం గవుంగిటం జేర్చె.

అంత యథానిర్దిష్టుండై శివుండు ప్రవేశించుచున్నవాఁడు. మోహినియు నిష్క్రాంత యయ్యె.

మహాదేవుఁడు. ఓసుందరవదనా! యిఁక నెందుఁ బోయెదవు. ఓచందనగంధీ! ఓమంద యానా! నన్ను నీబిగికౌఁగిటం జేర్పుము. ఓచంద్రవదనా! నీయధరసుధారసం బొసంగుము' అని ముద్దిడుకొనం బోయి భుజాంతరంబు బట్టబయలై యుండుటం జూచి. ఔరా! కలలోఁ గనంబడినచిలుకలకొలికిని కౌఁగిట నలమినట్టు లయ్యె. ఈసుస్తని యిపు డెందు సురిగెనో కదా! కలికిని నిజంబుగాఁ గనుఁగొంటినే. ఇది కలయుఁ గాదే! భ్రమయును గాదే! కల్లయును గాదే! అట్లుండఁ గౌఁగిలించినం జిక్కక పోవు టేమకో! ఇది పువ్వువిల్తుఁ డాడించుమాయబొమ్మ యని తోఁచుచున్నది. హా! ఇఁకేమి సేయుదు. మానసంబున కేమియుం దోఁచదు. ఆయొలనాగ రామణీయకంబుం గాంచి మరుండె మోహించి యీ పూఁబొదరిండ్లయందు దానిం గొనిపోయి దాఁచి యున్నాఁడని యెంచం బోలు. కాని నాఁడా మగువ నాపయి మక్కువం జొక్కుచుండునది నాచేతంజిక్కి యొక్కవ్రేల్మిడి నెక్కడ కేఁగు. ఈపొదరిండ్లయందు వెదకుదు నని నిష్క్రాంతుండయ్యె.

సరస్వతి. ప్రియసఖి కలశపయోరాశిసుతారత్నమా! చూచితివఁటే! ఈచంద్రధరుండు తనహస్తగతం బగునర్థంబుఁ గోలుపోయి యస్తంగతవివేకుండై కడుజాలిఁ గస్తిం

పొదరిండ్లం జొచ్చి విప్పుచూపులం బఱపుచు నందుఁ గేకి యాడెనేని కాంతయోయని తొంగి తొంగి చూచుచు నెయ్యెడనైనఁ గలకంఠకంఠనాదంబు వినంబడియెనేని కంబుకంఠి సంభాషించుచున్నదని చెవియొగ్గి వినుచు మత్తమధుకరకులంబుం గాంచి మానవతీమణి పెన్నెఱు లని చేతం దువ్వఁబోవుచు మలయమారుతంబున వ్రాలు నెలదీఁగెంగని బాలామణి వచ్చెనని భ్రమసి మైఁజేర్చుచు విరితేనియ సెదరి యొకింత మోవిం బడినం దరళలోచనయధరామృతం బని గ్రోలుచుఁ జేతనాచేతనస్థితుల నెఱుంగలేక భ్రమించుచున్నవాఁడు. శ్రీకంఠుండు వైకుంఠునిమాయం బడి వలనుచెడి యుండెడిని.

లక్ష్మి. ప్రియసఖి! సరస్వతీ! విష్ణుమాయ యజేయం బని పంతంబులాడిన సారదుని పలుకులు గెలిపింప నీభక్తవత్సలుం డీప్రమథాధిపుని నిట్లలయించుచున్నవాఁడు. అదె కనుంగొనుము. మాయావధూటి మఱియొకవిడంబనంబునం దోఁచుచున్నది. మహనీయమగు మల్లికామండపము నడిచక్కినొకకాంచనస్తంభమణిడోలికాతల్పంబున నధివసించి; బటువుగబ్బిచనుగుబ్బలపయిం గదియుఁజిలుఁగుపయ్యెద జాఱఁ; బెందొడలపయిం బొలుపాఱు జిలుఁగుపలువమ్ముంగొంగు దొలంగ; సారెసారెకుఁ బుడమి మెట్టి యూఁగునుద్ధతిఁ జరణనూపురములు ఝుళంఝుళధ్వనులు గావింపఁ; దీపమెఱుంగులు వోలె మేనికాంతులు తీఁగెలుసాఁగఁ; ద్రోవరహి రాకపోకలం బదకమలకాంతు లాకాశరమ కర్చనలొనర్ప; వనదేవతలు చెలికత్తెలయి సరసకుం జేరఁ; దళుకులేఁజెక్కుటద్దంబుల నిద్దంపు మగరాలకమ్మలనిగన్నిగలు వెలయ; మొలకనవ్వులు దద్దయు ముద్దుమొగంబు నలంకరింప; మరునిమీఁదిపాటలు వాడుచుం బ్రియంబుమెఱయ డోలావిహారంబు సల్పుచున్నయది.

సరస్వతి. ప్రియసఖి ! అదె చూడుము! దానివెనుక శంభుండు మునుపటివలె వంచించి పట్టుకొనంగ నెంచి భూజహంబులయెడలను బూఁబొదలమఱుఁగున నొదుఁగుచు నొదుఁగుచు వచ్చుచున్నవాఁడు. వెండియు నీతనియుద్యమం బేమయ్యెడినో! కనుఁగొందము.

డోలారూఢ యయి మోహినియుం దానిపిఱుచక్కిఁ జంద్రశేఖరుండును బ్రవేశించిరి.

మహాదేవుఁడు. ఆత్మగతంబున. ఔర ! నాభాగ్యం బేమనవచ్చు ! కడచిపోయిన ప్రాణకళ వెండియు వచ్చినట్లు లీయెలనాగ నాకు లభించినయది. ఇఁక దీని విడుతునే.

అని కడువేగంబునందూఁగుటుయ్యెల డాసిపట్టుకొనంబోయెను.

మాయామోహినియుఁ నతనిపదట మొఱంగి కలకల నవ్వుచు ముందఱఁదూఁగి యందియలు గల్లన శివునిడెందంబు జల్లనం జెంపుతో నేల కుఱికి చల్లనఁ గబరీభరంబున విరులం రాలఁ జకితమగు సారంగికైవడిం బెగడుచూపులు బెరయ నీశునిఁ దెరిగి చూచి

(ఆత్మగతంబున.) ఈనికటంబున నుండు సౌధరంధ్రములోఁ బడి పోయి డాగెద. అని చింతించి నిష్క్రాంతయయ్యె.

మహాదేవుఁడు. (దుఃఖంబుతో.) కట్టా! యాకాంచనాంగి విహంగిచందంబునం జయ్యన నెగసి చిక్కక చనియెను. ఇఁక నేమి సేయం గలవాఁడను. అని దేహమున వడఁకును గనుంగవం బాష్పంబులును గంఠంబున గద్గదభావంబును గదుర వెచ్చ నూర్చుచుం జేష్టలుడిగి చేయునది లేక దైవమా! నీ వెంతకఠినుఁడవురా! యని దూఱుచు నాయుయ్యాలకడకుం జని యామోహినీకామిని మెయి నుండినకస్తూరితావి యొరసినడోలం గరములం దెమలించి కౌఁగిటం బొదివికొనుచు. ఓరత్నడోలికా! ఆయందములగని నిన్నంటు పుణ్యయంబుం దొలిపుట్టువున నేమి చేసితివో! ఆబాలికామణి నీపయిఁ గూరుచున్నది గదా! ఇంతకంటె భాగ్యం బేమున్నది. అని యయ్యింతి దుమికినచోటికిం జని మహామోదంబుతో, ఇదె యాకాంతామణి కచబంధవిగళితం బయి పడినవికచవిచికిలదామంబు గన్పట్టుచున్నది. అని యాపూలమాలికం దిగిచి యక్కునం జేర్చుకొని పులకలెసఁగ సానందం బభినయించుచు ఆకాంతామణిం గౌఁగిట నలమినట్ల యున్నది. అని స్పర్శసుఖంబునభినయించి ఇలకు దృష్టులనిగుడించి. ఇదె యాతరుణీమణిగుబ్బలనుండి భూమి నిండఁ బడినసరసకుంకుమపంకంబు గానంబడియెడిని. ఇది నాకు రక్ష. అని దళముగా నుండునాపంకంబు నేరి యళికంబునం దాలిచి యానందించుచు నెదుటం గనుంగొని అయ్యన్నులమిన్న చరణపంకజంబులజాడ లవె కానంబడుచున్నవి. అని తత్సమీపమునకుం బోయి సకరుణముగ, శిరీషకుసుమకోమలంబులై మహితకమలమహిమామనోహరంబులై కుంకుమపంకసంకలితములై మహనీయభాగ్యకారణరేఖావిలాసంబులై యమరు నీయెలనాగపాదకమలంబులు రెండును మదీయఫాలభాగంబునం గదియించుభాగ్యం బిఁకఁ గలుగుట యెన్నటికో. అని వగచుచు నాపాదంబులం బూజసేసి కొండొకచోటికిం జని, ఔరా! ఈక్రీడాపర్వతంబునకు సమీపమునం బొడసూపు కమలసరసియందు నామనోహరాంగిన న్వేషింప నగును. అని దానిపరిసరంబునకుం జని కరంబు ముదంబు నందుచు, ఆహా! ఏమి నాభాగ్యము! నాప్రియురా లిందు జలకేళి సల్పుచు గనంబడియె. అని యయ్యెడకుం జని సందేహించుచు, అమ్మాయలాడి యానో కాదో! అరవిందంబులకును మొగంబునకును భేదంబు గనంబడదు. మఱియు నళికదంబంబులును నలకలును సమానంబులై యున్నవి. తళుకుం జూపులనియుఁ బెళుకుమీనములనియు నిర్ణయింప ననువు లేదు. గురుతరంబు లయినకుచకుంభంబులు జక్కవలకవల టెక్కుఁగాంచుచున్నయవి. కానఁ గనకగాత్రి యని నిర్ధారణసేయం జాలకున్నవాఁడను. అని పేరంబోయి అయ్యారే; యీయొయ్యారి వననిధియందు విద్రుమలతవిధంబునం గన్నుంగవ కింపు నింపుచున్నయది, విరివి యగుతరఁగలు వేగంబున వచ్చి గురుతరోన్నతంబు లగుకుచకుంభంబులం దాఁకి విఱిగి పడుచుండం

దన్ను వెంటనంటి యంచలు నీఁదుచు రానుత్కటంబులగు పరిమళంబులతోఁ గమలంబులం బాసి మధుకరంబులు నెమ్మోమున నాడుచుండం గల్లోలనిహతిం గదలుఫుల్లాబ్జంబులవలన మధురజఃపుంజంబు లెగయ నంచలలోన రాయంచ తెఱంగునను గాంచనపంకజంబుల లోనం గమలవాసినియుంబోలెను, ఈపంకజనేత్ర యీఁదుచున్నయది. ఈయరవిందముఖి నేమరుపాటునం బట్టుకొందునని సమకట్టంజనదు. ఇట్టు లూహించినపని తొలుత నిష్ప్రయోజనం బయ్యె. నాభాగ్యరేఖ యెండియుం గనుఁగొంటి. ఏమాడ్కి దీని మేకొందును. ఈయుఁవిద పలుకరించిన మాఱుపలుకక ఎంతయును దలంకుచుఁ దనకెడనున్న నన్నును దయఁగనుంగొనక జలకేళిఁ దేలుమహోత్సవంబున నొరులఁ దిలకింపక యంచలలోఁగలిసి యంచవోలెఁ దనలోకమై యున్నయది. శంక యేల! ఇదియె గ్రహియింప సమయము. కాంచనగాత్రిని జరమదేశంబునఁ జని పట్టుకొందుం గాక యని నిష్క్రాంతుండయ్యె.

సరస్వతి. ప్రియసఖి రమాదేవి! అదె చూడుము! ఈశివునిమన్మథతాపం బదెట్టిదియొ! కొలను సొచ్చినంతన యీతనిమదన తేజస్తప్తమగుమూర్తిం దాఁకి యీసరోవారి భుగభుగ నెగలును బొగలు నెగయుచున్నవి. ఔర! మకరకేతనుండు మగలకును మగం డనుట నిక్కము. ఈశివునిమౌళిం గలచందురునివెన్నెలలు పర్వ నీసరసిం గైరవంబులు వికసిల్లె. కమలంబులు మొగిడె. జక్కవలు కవవీడి తపించెడిని.

లక్ష్మి. ప్రియసఖి సరస్వతి! అదె చూచితే! ఈచంద్రధరుండు కొలను సొరంబడి మాయామానినిం బట్టుకొనం బఱతెంచుచున్నాఁడు. ఇతని కామాతురత్వంబుం గని నవ్వుచు మోహినీకాంత నునుసిగ్గుతో నేమియో వచియించెడిని. విందము.

నేపథ్యంబున. ఓమహేశా! రాకుము రాకుము! ఇవ్విధిఁ గాకుసేయు నీకు లాభంబుండునే! మానిను లొంటిగ మజ్జనంబు సేయుచుండ మగవారలు మర్యాద మాని యయ్యెడకుం జనుదెంచుట పాడియే! ఓపార్వతీపతీ! నీ వన్న మగలమాత్రమా! మన్మథునిం బొలియించినవాఁడవు గాదె! మఱియు నీవు విగతేషణుండవు. విజ్ఞానసాధ్యుండవు. ఉత్తమయశోనిధివి. సర్వజ్ఞుండవు. ఈ వెఱుఁగకుండిన నెఱింగించువా రెవ్వరు? అదియునుం గాక యేను వివస్త్రనై యుండెదను. పదరవలదు. ఈపూఁబొదపజ్జ నుండుము.

లక్ష్మి. సరస్వతి! సరస్వతి! చూడుము. ఈకొండవీటిజంగము మాయామానిని గనుసైగచేసి చెప్పినది సత్యం బని యెంచి యీయువిద పంచినవిధంబున మరలి తత్సరోవరతీరనిరూఢంబగు నొకమాధవీలతానికుంజంబుచెంతకు నేఁగుదెంచుచున్నవాఁడు. కట్టా! ఈశివుం డీమాయామానవతి మోమోటుమాటలు నమ్మి జవదాఁటక దానికనుసైగలవలనం దనయందు వలపుగలది యని భ్రమించి మోసపోవుచున్నవాఁడు.

మహాదేవుఁడు. (సంతసంబుతో) ఇంక నా మనోరథంబు లీడేరు. ఆమంజువాణీవతంసంబు నన్నుం గామార్తునిగ నెఱింగి కనికరించి నన్నుం దిలకించి లాలించి కనుసన్నఁ గావించి తేనియ లొలుకం బలికి నాపయిం గలమోహంబుఁ గానిపించినయది. (సఖేదముగ) ఏలకో! జలకేళిఁ జాలించి యిదె వచ్చితి నని చెప్పిన యాయొప్పులకుప్ప యింతదనుక రాకయున్నది. వెండియుం గొలనిచెంగటికిం జని కనుంగొనియెదను. అని నిష్క్రాంతుండయ్యె.

సరస్వతి. ప్రియసఖి యిందిరా! అదె కనుఁగొంటివా! చంద్రశేఖరుండు మాయావధూటిమాటల కేమఱి చాటుననుండుమన్న నుండి యాకాంత దనకడకు రాకయుండుటకుం జింతించి వెండియు నాకొలనిచెంగటికిం జని యందుం దానిం గానక భయభ్రాంతుండగుచుం గలంగుచు ధైర్యంబు వోనాడి పురంబురం బొక్కుచు స్రుక్కుచుఁ గన్నుల నుండి వెడలుచుండు బాష్పంబులఁ గొనగోటుల నెగమీటుచు విన్నదనంబుతో నందెల్లెడల వెదకి వెఱ్ఱిపట్టినవానివిధంబునం భ్రమించుచు నించుక సద్దైనచోటుల నట్టిట్టి చూచుచుం దిరిగి తిరిగి విరహవేదన కోర్వంజాలక యాసరస్సైకతంబునం జతికిలంబడినవాఁడు. కట్టా! యితని యవస్థ కరము శోచనీయం బైనయది.

అంత యథానిర్దిష్టుండై మహాదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు.

మహాదేవుఁడు. కట్టా! ఎట్టికపటాత్మురాలా జవరాలు! చేతికిఁ జిక్కినట్టులు మాటలాడి యొకసక్కెములు కొన్ని యొనరించుచు నిచట నిల్వకయె చనియె. ఆ యిందీవరాక్షి కపటంబుఁ గానలేనైతిని. మోసపోతిని. ఆస వేఁచినకారణంబున నట్టిమోహంబుఁ బూని నిజం బని నమ్మితిని. విషయలోలునకు విగతవస్త్ర గాక సవస్త్ర యేల యని యారయక; కోక లేకయున్నదానన నీయానాతి యన్నం జడిసి గ్రక్కున మరలి వచ్చితిని. అదియ తగుసమయం బని తిగిచి కౌఁగిటఁ జేర్పక పోతిని. అట్టిశుభం బిట్టి యభాగ్యునకుం జేకురునే! ఆయతిమనోహరమగు గమనంబును ఆముఱిపెంబును ఆమేని క్రొమ్మించులును ఆ బల్పిఱుందులయందంబును ఆగుత్తంపుబటువుంగుబ్బలగౌరవంబును ఆసోగమెఱుంగు వాల్చూపుల సొరును ఆచిగురాకువంటి చెంగావిమోవిసొంపును ఆముద్దులుగుల్కు నెమ్మోము ఠీవియు ఆ మరులుపుట్టించు లేనగవుల తళుకులును ఆపిక్కలుదాఁటు పెన్నెఱుల చెలువంబును ఆస్వేచ్ఛావిజృంభణవృత్తియుఁ దలంచిన నిల్వఁ దరముగాకయున్నది. తాలిమియుం దూలిపోయె. ఆకలకంఠి కన్నులంగట్టినట్లు మాటిమాటికిం దోఁచుచుండుటం జేసి మానసంబు మఱపుం జెందదు. ఇదేటి మోహముపుట్టినయది. ఇఁక నేమి సేతు. ఈ మన్మథతాపం బెన్నటికిఁ దగును. ఆకలువకంటి యారసి చూడఁగా నన్నలయింప వచ్చినట్టు లున్నదిగాని వలఁచివచ్చినట్టు తోఁచదు. అలరువిలుకాని మాయామృగ మీచెలువయై భ్రమపెట్టి తుదకుఁ జేరక చేజాఱిపోయెడువిధం బొకో యని. కానిసాఁడు

సహజతరుణుల కిటువంటితిరితీపు గలదే! ఆ చపలలోచనయు మెఱుఁగుఁదీవియవిధంబున మెఱయుచుం దోఁచియు మృగతృష్ణవలెం బట్టుకొనం గూడక కలయుంబోలె నిద్ర జాలకలనంబుభాతి నసత్యం బగుచు మణిదర్పణంబునం బొడసూపు ప్రతిబింబంబు తెఱంగున గ్రహింపం దరంబు గాక యున్నది. ఈతమి పీడమింజేసి మగిడిపోఁ జాలక యుండెదను. ఏవుపాయంబున వెండియు దానిం గ్రహింపుదును. ఈసైకతంబున నుండ మనంబు లేదు. ఈకొలనికెలంకులం గలపూఁబొదరిండ్లయందును జలువ లొలుకుతరుల నీడలయందును మనోహరములగు నెలదోఁటలందును గృతక పర్వతంబులందును వెదకుద నని నిష్క్రాంతుఁడయ్యె.

సరస్వతి. ప్రియసఖి సముద్రరాజపుత్రి! మాయావధూటి జలకేళి సాలించి సరస్తీరంబునకుం జేరనయని యెటువోయెనో యెఱుక పడదు.

లక్ష్మి. ప్రియసఖి! సరసిజసంభవునిరాణీ! వాణీ! అల్లదె కనుంగొనుము. ఈకొలని కుత్తరతీరంబున నొకచిన్నిపొన్నబోదియచెంతఁ గలయ నల్లికొనియుండు మాధవీమల్లికాలతానికురుంబనిరంతరంబగు నికుంజంబునకు డాసి కాంచనలలితంబగు దుకూలంబు ధరియించుకొనుచున్నది. అదె చూడుము. వనదేవతలు ప్రణయంబు మెఱయఁ బువ్వుసొమ్ములు దెచ్చి యొసఁగఁ దొడిగి తమ్మిపుప్పొడులు తనూలత నలందుకొని తన్నికుంజాంతరంబునం బొలుపారుపూసెజ్జం జేరి నెత్తావు లొలుకుమరందపూరంబులు సుమనాళంబుల నించి సారెకుఁ గ్రోలుచుం జలువపైఁటాణిజిలుఁగుంబయ్యెదకొంగు సిబ్బెంపుగబ్బిగుబ్బలం జాఱం గొదమపాయంపుమదంబుతో ముదంబు మెఱయ మనసిజరాజ్యరమాపరిపాలనోన్ముఖత్వంబున నుండెడిని. కనుంగొనుము.

సరస్వతి. ప్రియసఖి! ఇప్పు డీమాయావధూటి యొయ్యారపుహొయలుం గాంచినం గాంచనాంగులు సయితము మదనబాధాపరవశ లగుట నిక్కంబు. అట్టుండ నీచక్కెరబొమ్మ టెక్కుల నిప్పుడు గనుంగొని దారుకావనచారిచారుముఖీమణిజారుండు తాళం గలవాఁడె?

లక్ష్మి. ప్రియసఖి! చూడుము చూడుము! అయ్యింతి విశ్రాంతికై యొంటిగాఁ బవళించియుండుపూఁబొదరింటిం గనిపెట్టి యీవ్యోమకేశుండు తదంతరంబునం జొచ్చినవాఁడు. ఇఁక వీరలవృత్తం బలిరపోదారంబై యుండం గలదు. అల్లదె నిరూపించి చూడుము. ఈశ్రీకంఠుండును,

సీ. ఒంటిగాఁ బవళించి యుండెడునద్దానిఁ దుంటవిల్తునిమాయ దొలఁకుదానిఁ
గడలేనిక్రొఁ జూడ్కుఁగలమోముగలదాని నొడలితావులఁ దిక్కు లొలయుదాని
నాచారుదరహాస నాచకోరేక్షణ నానవమోహన నాశుభాంగిఁ
గనుఁగొని యలరి ఠీవిఁ గలిఁగొన్నముకుటాడు ఘనసుధారసధారఁ గన్నయట్లు

గీ. తన్నుఁ గనుఁగొని సిగ్గును దయయుఁ గౌర
వంబుఁ బెనఁగొనఁ బూపొన్నపలన డిగ్గు
నవ్వుదలకించుచుండెడుపువ్వుఁబోణి
వేగమున డాసె సంభ్రమోద్వేగ మదర.

అంతం గుంజాంతరంబునం బూలపొనపు డిగ్గంబోవుచుండుమాయామోహినియును దానియెదుట దైన్యంబుతోఁ జేయిమోడ్చి నివారించుచుండు చంద్రశేఖరుండును ప్రవేశించిరి.

మహాదేవుఁడు. సత్వరముగ. ఓప్రాణనాయికా పూఁబొనుపు డిగకుము డిగకుము! ఈయుపచారంబె చాలును! ఓశుభాంగి యిట్టిసాహసంబు నీకుం జనదు.

క. అవతరణసంభ్రమంబున, స్తవనీయకుచోరుభారసంజాతమహా
నవనవఖేదముఁ గనునీ యవలగ్నము భిన్న మగునో యని దిగు లయ్యెన్.

ఓచారుముఖి నీవంటిసూనృతవతి గలదే! నాకుం జెప్పినచొప్పు దప్పిపోక నన్ననుగ్రహింప వేచియున్నదానవు. ఓకరివరగమనా! దుస్సహం బగువిరహతాపంబునకు వ్రేఁగునన్ను నీబిగికౌఁగిటం జేర్పుము. ఘనసారశీతలం బయియొప్పు నీగాఢతరవక్షోజయుగళంబున నన్నుం జేరిచి చందనపంకసంకలితాంగునిం గావించి రతులయిక్కువలం దెలిపి నన్నురక్షింపుము. నన్నేల యిటులు వెతలఁబెట్టెదవు. వెడవింటివానిదుస్సహంబు లగు వెతలకు లోనైతిని. దురంతంబగు విరహవారాశి మునింగితిని. వల పనియెడివలయందుం జిక్కితిని. కరంబు స్రుక్కితిని. నాజీవంబు నిలుపు మిదె నీకు మ్రొక్కెదను.

అని హస్తంబులు ముకుళించి మ్రొక్కి కన్నుంగవ నశ్రువులు వొడమఁ గుసుమశరోన్మాదంబునం జయ్యన నాతొయ్యలిం డాసి దానిపయ్యెదం జార్చి గుబ్బలు ముట్టం గడంగెను.

మాయామోహిని. ఆహా! ఇట్టు గొట్టుసేయుం దొరకొంటివే అని యతనిపాణిపద్మంబుం దట్టివేసెను.

మహాదేవుండు. ఓలతాంగీ! నీవు నాచేయిఁ దట్టివేసినను విడుతునే! నిన్నుం బట్టి కౌఁగిటం జేర్చెదను. అని సంరంభంబునం గదిసె.

మాయామోహిని. శివునిచేతులం జిక్కినట్లు దోఁచి చిక్కక విడిపించుకొని తొలఁగి చనియె.

మహాదేవుండును. సుఖంబున శరీరపారవశ్యం బభినయించి, దేహంబుదెలిసి లజ్జావనతశిరస్కుండయి నిలువంబడి తనమనంబున. ఔరా! యేమందు నీచక్రధరుని మాయను! దీనిం దగులువడి మదనునిబారింబడినదియునే యిట్లయ్యెని. తక్కఁగలవారి నన

నేల! ఎప్పటికిని హరిమాయ యజేయం బనునది నిక్కము. అని తలంచుకొనుచుండె.

విష్ణుండును బ్రహ్మయు మహర్షులును లోకపాలురును పార్వతియుం బ్రవేశించిరి.

బ్రహ్మ. ఓమహాత్మా! చంద్రశేఖరా! నీవు మాయాతీతుండ వగుటం జేసి యింతటం దప్పించుకొంటివి. ఇతరుల కెప్పటికిని దప్పించుకొనం దరంబు గాదు. ఈశ్రీహరి మాయం జిక్కి యీసచరాచరం బగుప్రపంచం బంతయు భ్రమించుచున్నది. ఇందులకు సిగ్గుపడవలసినది లేదు. ఎల్లవారు నితనిమాయం జిక్కి యివ్విధంబున గౌరవంబు దక్కినవారల. నీకుమాత్రము సిగ్గుపడవలసిన దేమి ?

మహాదేవుండు. ఓమహాత్మా కమలగర్భా! యేను విష్ణుమాయ యజేయం బని యెఱింగియు మోసపోతిని. ఇట్లు మోసపోవువారును గలరే! ఇతనిశక్తికి విజ్ఞానఘనులు మోసపోరనియు నజ్ఞానులు మోసపోదురనియుం జెప్ప నొప్పదు. ఇది యాత్మేచ్ఛానుసారిణి యయి యెట్టివారి నేని ముంపంగలదు. అని చెప్పి విష్ణునింగాంచి, ఓపరమాత్మా యే నభిమానంబున నిన్ను నిర్లక్ష్యంబు చేసి కొన్నిపలుకులు పలికితి. అవి క్షమింపం గోరెదను. భవల్లీలార్థం బయినయీప్రపంచంబునందు బాలుండు బొమ్మరింట నునిచినబొమ్మల మాడ్కి నేము ప్రవర్తించెదము. అంతియ కాని యేము స్వతంత్రులము గాము. గర్వంబు దక్కితిని. నీమాయం దెలిసికొనలేక మిక్కిలి స్రుక్కితిని. ఇడుమలం జిక్కితిని. నాయం దనుగ్రహింపుము. నన్ను నాసదనంబునకుం జన ననుజ్ఞ యొసంగుము.

విష్ణుండు. ఓమహాదేవా! నీవు యోగీశ్వరేశ్వరుండవు. నిన్ను సర్వవేదంబులు సంస్తుతించు. నీవు నీపార్వతియుం బ్రమథగణంబులతో మదీయసదనంబున కేఁగుదెంచి నాయొసంగునాతిథ్యంబుం గైకొని బ్రహ్మప్రముఖులతో నేఁగుము.

మహాదేవుండు. ఓదేవమందార! నీచెప్పినపల్కులకుం గాదనువారును గలరే! యని బ్రహ్మాదులతోడను విష్ణునితోడం దన్నుఁ గలవారలతోడను నిష్క్రాంతుండయ్యె.

సంక్రందనుండు. మహాత్మా భరతమునీ భవత్ప్రయుక్తంబగు నీయుపరూపకంబు పూర్వ మేము కనియు వినియు నుండమిం జేసి మామానసంబులకుం గడు మోదావహం బయినయది ఇందు ప్రవృత్తంబు లగుపాత్రంబులందు మాయామోహినీ నేపథ్యంబుం బూనినదాని యభినయచతురత యింతింతని నుడువం దరంబుగాదు. ఈవాలకంబుం దాల్చినయది రూపకాభినయచతురలగు రంభాద్యప్సరఃకాంతాతిలకంబులకంటెం గరము నైపుణ్యంబునం బరఁగుచున్నది యనుటకు నభ్యంతరం బేమియు లేదు. ఈమానినీమణి పద్మజుని రాణికడ నాట్యవిద్యావైశారద్యంబు సంపాదించినపుంజికస్థలయాయేమి? తెల్పుము. ఈమానినీమణి ప్రయోగించిన యుపరూపకము రసోదారంబై యొప్పెడిని.

భరతముని. ఇంచుక కన్ను లెత్తిఁ జేసికొనుచుం బుంజికస్థల యనునచ్చరం గ్రేఁగంటి చూపులం జూడ నాయచ్చర వచ్చి దేవేంద్రునికి వాదనంబు చేసి యిట్లనియె.

పుంజికస్థల. ఓదేవేంద్రా! నేను పుంజికస్థల యనునచ్చరను. రూపకాభినయ చాతుర్యంబు బహుతరంబుగఁ గడింప నెంచి పద్మసంభవురాణి యగువాణిని వేఁడి తదాశ్రయంబున ననేకవిధరూపకాభినయచాతుర్యంబుం గడించితిని. ఇప్పు డీభరతమునిచే ననుమతంబై ప్రవృత్తం బయినయీమాయుపరూపకమునందు నాబూనిన మాయామోహినీ నేపథ్యాభినయంబున విధివశంబునం జేసి యంతంబున విరోధంబు గానంబడియె. ఏను నీహంసుం డనుగంధర్వకుమారుండును మాయామోహినీచంద్రశేఖరులవాలకంబులం బూని యభినయించుచో నాచంద్రమౌళి మాయామోహినిపయ్యెద నంటినయర్థంబు గాన్పించునెడ నభినయగతి కనురూపంబులగు కొన్నిభావంబులు హంసుని వలచియుండు నామానసంబున నుదించుట స్తంభప్రళయాదులవలన సూక్ష్మదర్శనుండగు నీభరతముని యెఱింగి కోపంబు మెఱయ నన్నుం జూచి యోసీ! నీవు మానవవేశ్యయుంబోలె మనసుఁ బట్టలేక హంసునియందుంగలయనురాగంబున నభినయానురూపములగు భావంబులఁ బయలుపఱిచితి వట్లగుటం జేసి భారతవర్షంబున మానవవేశ్యాకన్యకవై జన్మింపు మని శపియించె. ఈయర్థంబు రసపరవశతం జేసి మాయిరువురకంటె నితరు లెవ్వరు నెఱింగినవారు గారు. ఆమనఃకాలుష్యంబున నీమహాముని మీర లడిగినవచనంబుల కుత్తరం బొసంగక నాకు నీవృత్తాంతంబు నీవె విన్నవించుకొను మనునభిప్రాయంబు సూచితము గావించుచుం గెంపారుచూపులం గనుంగొనిన నే నీయర్థంబు మీకు విన్నవించుకొంటిని. నా యవివేకంబునకుం దగుశిక్ష యొనర్చిన యీమహర్షిని నే నెట్లు క్షమింప వేఁడుకొందు నని భయంపడి యూరకున్నదానను.

సంక్రందనుఁడు. ఓమహాత్మా భరతమునీ! అతిస్వల్ప మగునపరాధంబునకై యిట్టి బెట్టిదంపుదండన విధింపం జనునా! మీవంటిజ్ఞాననిధులు తప్పు లేర్పఱుపం గడంగిన నీజడస్వభావ లేపాటివార లగుదురు. దీనియందుఁ గరుణించి యీశాపంబు మరల్పుము.

భరతముని. ఓసంక్రందనా! అకాలంబునకు రసభంగం బగునని రోసగించుకొనియంటి నంతియగాని యిప్పుడు నామానసంబు నీదీనయందుఁ గరుణాయత్తం బయియున్నయది. పలికినపలుకు మరల్పం జనదు. ఈయిందువదన నాశాపంబుచేత నిడుమలు వడక మానవలోకంబునందుఁ గడుసుఖంబుం గూరుచుండివచ్చుటకుం దగినవెర వూహించి పల్కెదను. ఈపుంజికస్థల సరస్వతికడ నభినయశాస్త్ర మభ్యసించినయది పూర్వదినంబునం దత్సమాప్తి వడసి యీదిన మాయలివకు భవత్సభాస్థలంబున నాడవలసినవంతై యుండుకారణంబున నేతెంచి భవదనుగ్రహంబునకుం బాత్రత వహియించె. ఎల్లి చతుర్ముఖునిసభయందు నతనిమ్రోల నీమగువ దా నభ్యసించినయభినయచతురతం గనంబఱప నిర్ణీతంబయి యున్నయది గాన నయ్యెడకుం జనినప్పుడీయింతికిం గొంత సహాయంబు

సంక్రందనుఁడు. ఓపుంజికస్థలా మహానీయంబకోపంబు సయిత మభ్యుదయదాయకంబు యగు. చింతింపకుము. మేలు గల్గంబోయెడిని. బ్రహ్మసభకుం బొమ్ము. అని చెప్పి సభాసదులం బంపి, ఓభరతమునీంద్రా! రూపకవిలోకనకుతూహలంబున నెఱుంగనైతిని. రేయి బహుకాలంబు గడచె. ఎల్లి బ్రహ్మసభం జరుగువృత్తాంతంబుఁ జూడం జనవలయు. ఇప్పు డిండ్లయందుఁ గొంచెము విశ్రాంతిం జెందనగును. పోయి వత్తముగాక. అని యిరువురు నిష్క్రాంతులయిరి.

చతుర్ముఖునిసభయందుఁ జతుర్ముఖుఁడును సావిత్రియుం బ్రహ్మర్షులును బ్రవేశించిరి.

చతుర్ముఖుఁడు. ప్రియురాలా సావిత్రీ! ఏల యిత్తఱి మనసభకు దిక్పాలకులును సర్వలోకమునను డు నప్సరఃకాంతలుం జనుదెంచి యున్నవారు?

సావిత్రి. దేవా! దేవి యగుసరస్వతి తన్నాశ్రయించినపుంజికస్థల యనునచ్చర లేమకు నభినయశాస్త్రసారంబుల నభ్యసింపం జేసినయది. తదీయవిద్యావైశారద్యంబుం బరీక్షింప నిత్తఱి యుచితసంవిధానం బని నిర్ణీతంబయ్యె. దాని యభినయచాతుర్యవిశేషంబుం గాంచుట కీసురవరులును మహర్షులును జేరియున్నారు. సరస్వతీదేవియానతి నిది ప్రవృత్తం బయినయది.

చతుర్ముఖుఁడు. సావిత్రి! సరే! అట్లయిన నీయర్థంబున మాకును గుతూహలంబు గలదు. దేవగాయనులగాంధర్వంబు ప్రవృత్తంబగుటకు నాలస్యంబేమి?

సావిత్రి. దేవ! దేవి సరస్వతి సభకు నేతెంచిన ననంతరముగాని యుపక్రాంతంబు గాదు. తదాగమనంబునకు భరతశాస్త్రపారీణులగు నర్తకులు నర్తకీజనంబులును వేచి యున్నవారు.

దుర్వాసమహర్షి. ఓరీ విశ్వామిత్ర! తొలిదినంబునందు సుధర్మసభలోనం బుంజికస్థల మాయామోహినీ నేపథ్యంబుం దాలిచి యామోహిని చంద్రశేఖరుని నలయించిన యర్థంబున నతిమనోహరాభినయవిశేషంబుచే సురవరుల కత్యానందంబు సమకూర్చిన దని వింటిని. ఈ వప్పు డయ్యెడ నున్నవాఁడ వని విందు. ఆయర్థం బెట్టు లుండెనో వినిపింపుము.

విశ్వామిత్రుఁడు దూర్వాసోమునీ! పుంజికస్థల మోహినీరూపంబున నభినయించిన యర్థంబులలోనెల్ల మోహిని పూలపానుపునం బరుండి తనకడకుం గరము సంభ్రమంబున నేతెంచి ఫాలనేత్రుండు పయ్యెదఁ దొలంగం జేయునప్పు డతనికిం దనతనులతాసంస్పర్శము గాకుండం బ్రవర్తించునర్థంబునం గానిపించినవిలాసంబులు కొన్ని యామెన్నుండును గన్నె యయియుండి గానిపించినవాఁడు గాఁడని నుడువవచ్చును. ఆచాతుర్యంబు గనుంగొని సభాసదులు సయితము తమతమయొడళ్లు మఱచిరి. దూర్వాసోమునీ! ఏమి సెప్పుదును!

పురుషుండు దాల్చినతరుణీవేషంబుం గనుంగొనియు యాశంభుం డట్టిమనోభవవేదనావివశత్వంబుం జెందె! ఈయచ్చరమచ్చకంటి యొనర్చిన నవనవమనోజ్ఞ శృంగారచేష్టాభినయంబుఁ గాంచెనేని యేమగునో! అసురుల భ్రమింపఁజేయ వెన్నుండు తొలుత మోహినీరూపంబుఁ దాల్చి లీలమెయి వారల మోహితులం జేయం గనంబఱచిన విలాసంబులకంటె మదనారిని వంచింపఁజేసిన తన్మాయామానినీవిలాసంబులు కరంబు మనోహరంబులు తొలుత నసురులు నంతఁ గౌరీకాంతుండును జూచి విభ్రాంతిం జెందినవారు. ఈయచ్చరలేమ ప్రదర్శింపఁజేసినవిలాసంబుల నందఱును గందర్పవేదనలం బడినవారల! వేయేల! ఆమోహిని నయితము దీనివిలాసంబులు గన్న మోహింపక పోదు.

దూర్వాసోముని. ఓరి విశ్వామిత్రా! ఈపుంజికస్థలచాతుర్యంబు నట్టిదే యని నమ్మవచ్చు! మేనకావిలాసవశంవదుండవై యెల్లకాలము నాకంబునన కాఁపురంబుండు నీవు నయిత మింత వొగడుచున్నాఁడవు. ఈపుంజికస్థల యిట్టిచాతుర్యంబు సంపాదించెనా! కనుంగొన నగు. అని లేచి యచ్చరలు నిలిచియుండుచోటికి దృష్టులు నిగుడించుచుఁ బుంజికస్థలం గనుంగొను నుత్కంఠవలన నిటు నటుం దిరుగుచుండెను.

దేవగాయనులును విద్యాధరులును జతుర్ముఖుని మ్రోల నిలువంబడి వీణావేణు మృదంగతాళాదివాద్యధ్వనులు గావించిరి. పుంజికస్థల మనోహరవేషాలంకృతయై యతిశయితరతిపతిమానినీవిలాసమనోహరంబగు సౌందర్యంబుతో వచ్చుటఁ గాంచి సంచలితస్వాంతులై సభవార లనురాగపూరంబుల వెలిగొల్పువీక్షణమాలికానికరంబులు గడలుకొనం జేయుచుండిరి. అప్పు డాయచ్చరలేమయు నేతెంచి భరతాచార్యులకు వలగొని బ్రహ్మకుం గేలుమొగిడ్చి నిలిచినం గాంచి దూర్వాసోముని దానిరూపరామణీయకంబునకుం గరంబు శిరఃకంపంబు సేయుచు దాని నిట్లు వర్ణింపం దొడంగె.

దూర్వాసుండు. అయ్యారె! ఈయొయ్యారియాభిరూప్యం బేమని వర్ణింపంగల వాఁడ.

సీ. తళుకువాల్గనులు గుత్తపుగబ్బిగుబ్బలు మొలకపాయంబు డాలొలుకు మేను
చిలుకపల్కులును మేల్చిలుకుఁగుల్కులును నుందళుకుఁజెక్కులునునందంబుమీఱ
నలరువిల్తునిమోహనాయుధలక్ష్మి నా వరలుశృంగారదేవత యనంగ
భువనముల్ భ్రమియింపఁ బుష్పాస్త్రుఁ డొడ్డినచారుకాంచనపుఁబాంచాలి యనఁగ
గీ. నొప్పుచుండెడునీచానయొప్పిదంబు, దీనిశృంగారలీలలు దీనిహాయలు
దీనిమదనోన్ముఖత్వంబు దీనిసొగసుఁ, గాంచ మరు లెవ్వరికి నైనఁ గలుగకున్నె.

విశ్వామిత్రుఁడు. ఓరీ దూర్వాస! ఈపుంజికస్థలవలపువలంబడితివే! పూర్వము కందళిం దగులుకొని తపంబు దారబోసితివి, వెండియు నీయండజగామినియం దాసపడి యేమయ్యెదవో!

దూర్వాసమహర్షి. మందహాసంబు సేయుచు. ఓరీ విశ్వామిత్రా! మేనకం దగులుకొని మానంబు చూరవిడిచిన మానసీయుండా! నీకితరుల నాక్షేపింపం జనునా!

విశ్వామిత్రుఁడు. (ఇంచుకకోపంబుతో.) ఓరీ దూర్వాస! మేనకయన్నఁ దక్కిన యచ్చరల నలువురం బోలినదాన యని యెంచెదవేమొ! పదలనిష్ఠతో నుండువాఁడను గాన దానివలపునం జిక్కి కొన్నిహాయనంబులకైనం గడమట్టితిని. ఈవ యగుదువేని మోహజలనిధి మునుంగ కుందువే!

కండుమహాముని. ఓరీ విశ్వామిత్రుఁడా! నీవు కొన్నిహాయనములేకదా! యీ మేనకతో నుండినది. ఊరుకాండజితమోచయగు ప్రమ్లోచతోడ వసించుమాకుఁబెక్కు మన్వంతరము లొకత్రుటికాలం బయి చనియె. అట్టేమై యుండుట దానిసోయగంబునం గదా! దానినీటున కీమేనక దీటగునే!

విభాండకమహర్షి. ఓరి కండూ! ఆటుండుము. ఆ యర్థంబు నారసిచూడ హరిణికి సమానయగుకరిణిగమన లేదు. ఇప్పుడు దలంచికొన్నను మోహంబుప్పతిల్లుచున్నయది. పెక్కుకల్పంబులం జేసినతపంబు దారవోసి యాహరిణితో నడవిమెకంబుభాతిఁ దిరిగిన వాఁడను.

మాంధకర్ణిమహర్షి. ఓరీ! యేల యూరక వివాదంబు సలిపెదరు. ఈపంజెల కెందఱెవ్విధి నెన్నిగుణంబు లారోపించిన నేమి? అనికామకామజన్య సహజన్యయుం విజితకనకతనూరోచి ఘృతాచియుం ఘనకచభార తారయుం జనతాసుతనామ హేమయుం ననుపమరతిలాలస మదాలసయుం ననువార లచ్చరమచ్చకంటులలోరత్నంబు లని ప్రసిద్ధివహించినవారలు. వారిముందఱం దక్కినవారల నెన్న నగునే!

దూర్వాసుండు. (అసూయతో.) ఓ వృద్ధతపస్వీ! అప్పటిమాట అవి యిప్పటి కించుకేని యుపయోగింపవు. నోరు మూసికొనుము.

సరస్వతీదేవి ప్రవేశించెను. ఆ దేవిం గాంచి మరీచి, పులస్త్య, అంగీరస, భృగు ప్రముఖులును దక్కుంగల బ్రహ్మర్షులును బీఠంబులనుండి లేచి భక్తివినయసంభ్రమంబులతో నమస్కరించి తదాజ్ఞం గైకొని తమతమయాసనంబుల నుపవిష్టు లయిరి.

మందపాలమహర్షి. ఓరీ దూర్వాస! క్రొత్తకోమలిపై వలపున నీచిత్తంబు సత్తచెడి వృద్ధు లగుమహాత్ముల నధిక్షేపింపఁ దెంపు చేసినయది. ఇది నీకుం దగునే! సకలసురమునిసేవ్యుం డగునీపద్మగర్భునిమ్రోల మహామునిజనగోష్ఠియందు నీ విట్లు కాముకుని రీతి నేమం బుడిగి నేమంబుఁ గణింపక యచ్చరలేమం గొనియాడుట యొచ్చెంబు గాదె! నీవు నీలోకమై లోకులు నవ్వ నూరక ప్రేలుచున్నావు. మొలచీరె పీడిపడుటయు నెఱుంగక భుజంబు లెగరవేసికొనుచుం బోకరాకలఁ జేయుట యనుచితం బని తలంపవు.

ఈ పనిమానుకొనుము. జగద్వందనీయ యగువాణికి నమస్కరింపుము. ఆదేని సభ కేఁగు దెంచుటయుం నీవెఱుంగవు గాఁబోలు.

దూర్వాసుండు. (కోపంబుతో.) ఓరీ! మందపాల తనతరంబు నెదుటివానితగంబు నెఱుంగక నిన్న మొన్న కన్నులు దెఱచినవానింబోలె నన్నుఁ దూలనాడెదవు. ఈ యోలగంబునం గలవారల వృత్తంబులు నాయెఱుంగనివియే. చాలుం జాలు. మనోహారిణు లగు నేణీవిలోచనలలీలావిలాసంబుల నభినందించి మించని మోటునోటికిని ఆోటినోటికిని భేదంబు గలదే! కన్నులపండు వగునీయన్నులతలమిన్న చెలువంబుఁ గనుంగొని యభినందింపక యుండుగుదునే!

అని యానెలంతం గాంచి మించినమోహావేశంబునం నిట్లనియె.

సీ. అంతకంతకు లతాంతాయుధుకేళిలోఁ బంతు వహించి యిప్పద్మగంధి
మొనపంటినొక్కులమోవితోఁ గొనగోటిచెనఁకులఁ గొమరొందుతనువుతోడ
కులుకులాడిమెఱుంగుగుత్తంపుగుబ్బలతళుకుఁగుంకుమపుమైతావితోడ
కల్కివాల్గన్నులకాటుకనునురేక లొలసినచెక్కులయందుటుతోడ.

గీ. నతివకీల్జడవ్రేట్లపాలైనవీపు, తెఱవగాజులయొరపుసందిళులు చెల్వ
యడుగులత్తుకజొత్తులు హత్తుఫాల, మాసఁ గాంచినవాఁడె ధన్యాత్ముఁ డరయ.

అని పలుకఁగా విని వనజాసనునిరాణి యాముని మరులవెట్టి యెత్తుకొని యసమ యం బని యెఱుంగక యాత్మీయమోహావేశప్రకటనంబుఁ గావించినందుకుం గైతకళిఖా కృతిం దోఁతెంచురదనకుందకుట్మలరుచినిచయరేఖలు బింబాధరంబునన విశ్రాంతిం జెంద నలఁతి లేనగవుఁ గావించెను.

తక్కంగలసభాసదులును బట్టరానినగవును బాణిపద్మంబుల మొగంబులు మూసి కొని యితఁడు సులభకోపుఁడుగానం దిట్టం గడంగునోయని భయంపడుచుఁ బయలు పడనీకుండం జేసికొనుచుండిరి.

దూర్వాసుఁడు. మహారోషంబుతో సరస్వతిం గనుంగొని. ఓసీ దురాత్మురాలా! నీను సరసజనస్పృహణీయం బగునర్థంబు వచింపఁ బరిహసించితివి. ఇట్టి పరావమానంబు సేయుప్రకృతి ఖరప్రకృతులకుం గాక సురనరప్రకృతుల కుండదు. కాన ఖరప్రకృతు లగుమనుజులం గూడి సంచరించెదవుగాక అని శపించెను.

ఆకఠోర మగుదూర్వాసునివచనంబు విని సభవార లెల్ల హాహాకారంబులు సేయుచు హరిహరీ యని చెవులు మూసికొని కట్టా! ఈమహాదేవి నిట్లనం జనునె! సరస్వతి యన సకలలోకంబులకు సృష్టికర్త యగుసరసిజగర్భునికిం బట్టంపురాణి! వాగధిష్ఠాతృ దేవత. కావ్యనాటకగీతకలాభిమాన. విద్యాకైరవసంతానంబులకుం గౌముది. శ్రుతి

వధూసీమంతముక్తాయమానచరణనఖరుచినిచయ. సర్వలోకైకజనని. భక్తపాలనకళా వినోద. హరిశివసనకప్రముఖసంస్తవనీయయశోవిభవ. ఇట్టి యీజనని నిట్లనం జనునె! ఇసీ! ఈదూర్వాసుండు కడు దురాత్ముండు. సంతతసులభకోపుఁడు. అని చెప్పుచుండఁగా సరస్వతియుఁ నాదూర్వాసుం డొసంగినశాపంబునకు భయంబునొంది దండతాడిత యగు నాగకన్యకకైవడిం దొడరిపడి లేచి కడుసంతాపంబు నొందుచుండెను. కమలభవుండును దనప్రాణదయిత కచింతితగతి సంప్రాప్తం బయినయాదురవస్థం గనుంగొని యోర్వలేక మూర్ఛ నొంది యిలకు వ్రాలఁగా మరీచిప్రముఖు లాతనిపాటుఁ జూచి యతిరభసంబున నాసనంబులనుండి లేచి యాకమలసంభవునిం దమచేతులం బట్టుకొనిరి. వాణియు శాపోపహత యగుటం జేసి తనచెలువునిం దాఁకం గూడక సంతాపంబున మిట్టిపడుచు దుఃఖవివశ యై మూర్ఛనొంది భూతలంబున కొఱఁగఁబోవ సావిత్రి యతిరయంబున నేతెంచి యాభారతి నాదుకొని యాభాషావధూవతంసంబు వడుబలవంతంబగు వలవంతం గాంచి సంతపించుచు దూర్వాసుం జూచి యిట్లనియె.

సావిత్రి. ఓరీ విప్రాధమా! జగన్మాతయగు నీదేవి నిట్లు పల్కుట నీకుం దగునే! ఓబుద్ధిహీనుఁడా! సకలబ్రహ్మర్షిసమేతుండగు నీపరమేష్ఠిమ్రోల భయంబును లజ్జయు నుజ్జగించి వెలయాలివయిఁ గామంబున నాకలువకంటిని వర్ణింపం దొడంగినతప్పు నీపయిం బెట్టుకొని యది యెఱుంగక నీవెంగిలితనంబుం గాంచి నవ్వినయీవాణి నిట్లు శపించితివి. ఇసీ! నీ వింతదనుక నొనరించినతపంబు నీకోపంబున నొక్కవ్రేల్మిడిం బోఁగొట్టుకొంటివి. కామాద్యరివర్గంబుం జయించి శమదమాదుల నభ్యసించెడు నీకీకామక్రోధంబు లవిజేయుంబులై పొడముట యేలకో! పాపవర్తనుల కుచితంబగుమార్గంబునం బడి నీవు బ్రాణనాయకుని యంకతలంబునకుం జేరంబోవు నీపంకజభవురాణిని శంకాతంకంబులు లేక శపియించినకారణంబున నీపాపఫలంబుఁ గుడువక తప్పించుకొనం జాలవు గాన భర్తృసమాగమకాలంబునం బడఁతి కది విహతం బగుడుం బొడముకడుదుస్సహంబగు విరహంబున నగునిడుమలు నీ వెఱుంగుటకుం దెఱవవై జన్మించి తజ్జన్మఫలం బగువిదగ్ధనాయక సమాగమమునకుం గరము కష్టములు నొంది యది సంప్రాప్తం బగుడు నతని నెడబాసి వియోగవ్యథావిశేషంబునకుం బాల్పడియెదవు గాత.

అని యాదూర్వాసుని శపియించి సరస్వతిమోముదామరం దనభుజంబుపై నిడుకొని యాదేవి ప్రజ్ఞావిరహితయై యుండుటకుం జింతించుచు నావిద్యావధూనయనకమలంబులం దొరఁగువేఁడిమిగులుబాష్పజలధారాబిందుబృందంబులం దనపయ్యెదకొంగునం దుడుచుచున్న నందొక్కబాష్పబిందువు కడువడిం బయింబయినదరునెడరునఁ(సందునం) దప్పి యాసావిత్రితొడం బడిన నాజలకణంబు జిలుఁగువలువ నడంగక తదంతరంబునంజొచ్చి యావేదమాతచిఱుతొడం దగిలె. సావిత్రియు నాభాష్పబిందువు వేఁడి

మికిం దనతోడ కందినను సహించుకొని హా ! ఈవేఁడిమివలన నతికఠోరవిరహ వ్యథకు నీదేవి వివశయైయున్న దని తోఁచెడి; నింక నేమి సేయ నగును. భక్తపాలనపర తంత్రయగునాకమలాలయగాని తక్కినవార లిప్పుడు వీరలం గావలేరు. ఆదేవిని సంస్తుతింప నగునని ధ్యానంబుచేఁ గనుదమ్ములు మూసికొనియె.

కమలాలయ. (ప్రవేశించి.) ప్రియసఖి సావిత్రి! ఇప్పుడు నన్నుం దలంప నేల ?

సావిత్రి. (కన్నులఁదెఱచి.) దేవీ; నందకపాణిరాణి ! ఈదూర్వాసుని శాపంబున నైనరొమడరుశంబున గమలగర్భునికి నీసరస్వతికిం గరము దుర్భర మగునెర (వ్యసనము) యొకటి సంప్రాప్తం బయ్యె. ఈవిపత్సాగరమునుదరిఁ జేర్ప నీవకాని యితరులు వలంతులుగారు. సర్వజగత్పరిపాలనకళాభారంబు వహించియుండుపద్మనేత్రుని కీవ కావె బాసటయైయుండుదానవు.

కమలాలయ. ప్రియసఖి! సావిత్రి! నీప్రార్థనానురూపముగ మదీయకృపామృతవృష్టిచే నీవాణీవనజగర్భులు మూర్ఛావిముక్తు లయ్యెదరు. అని వారలం గరుణార్ద్రంబులగుదృష్టులం జూచె.

బ్రహ్మయుం సరస్వతియు మూర్ఛావియుక్తులై, ఆశ్వాసంబునొంది, కన్నులు దెఱచి చూచి, ససంభ్రమంబుగ లేచి భక్తిప్రశ్రయంబులతో నంజలిగావించి యాకమలాలయకు నమస్కరించి శ్రీసూక్తంబుల నుతియించిరి.

అంత నాభార్గవియుం సంతుష్టాంతరంగయై బ్రహ్మతో ని ట్లనియె.

కమలాలయ. ఓ బ్రహ్మ! సర్వవిద్యాధిదైవతంబు గావున నీసరస్వతి యిప్పుడు సంకోచంబుం గాంచియుండు సంస్కృతభాష నుద్ధరింప భూలోకంబునకుఁ బోవలసియున్నది. తదర్థంబుగ నీఋషిశాపంబు భగవదిచ్ఛానురూపంబై కలిగినయది. ఈసరస్వతి కాళిదాసుం డనంబరఁగుచు భారతవర్షంబునందు భరతఖండంబున విశాలయశోవిభవయై యతిమనోహరరసప్రసారంబులగు కావ్యనాటకాదులు రచియించి గీర్వాణవాణి కుర్వీతలంబున నితరభాషలకంటెం గలిగియుండుసాధుసరసనసమాదరణీయతను బెంపుఁజెందం జేయం జనును. భగవంతుండగు శ్రీమన్నారాయణుండు వ్యాసరూపంబున నావిర్భవించి వేదవిభాగంబుసలిపి పురాణాదులం బ్రవర్తింపం జేసినవాఁడు. మీర లీకావ్యనాటకాదులం బ్రవర్తింపం జేయనగును. ఈసరస్వతి కాళిదాసుండై యుండ నితని బహూకరింప నీవు ధారానగరపతియగుసింధులరాజునకు భోజుండవై జనించి చేరంబట్టి గారవంబున నాదరింపుచుండఁ జనును. నీకు మదనుగ్రహంబున నపరిమితంబులగు ధనంబులు తఱుగక యుండు. వానిచే భారతవర్షనివాసులను సారకవితాభిరాములను సన్మానితులం జేయుచుండువు. అప్పు డీసావిత్రీదేవి లీలావతి యనురాజకన్యకయై జనించి నీకుం బట్టపు

రాణి గాఁబోయెడిని. ఈసరస్వతియుఁ బురుషావతారంబు చేసి విప్రశాపంబున కసురూపముగ గొంతకాలము కిరాతవృత్తి ఖరంబుల మేపుచుండి కాళీవరంబున నఖిలవిద్యావిచక్షణత్వంబుం జెంది సకలకవికులసంపూజ్యతం బడయు. సావిత్రి సరస్వతికిం బ్రియసఖియగుటం జేసి యీజననంబునం గలసౌహార్దబలంబున లీలావతీరూపంబునం దను బురుషాకృతియగు సరస్వతియందుఁ గరము ప్రణయం బొనర్చుచుండు. తన్నిమిత్తంబుగ నీయిరువురకుం గలిగెడుదూఱు నివర్తింప నీసరస్వతిబాష్పబిందువు వడి దానివేఁడిమివలనం గందియుండు నీసావిత్రిచిఱుతొడయందు లీలావత్యాకారమునం దిలసదృశమగు నల్లనిమచ్చ యొకటి యేర్పడి యదివ్యక్తమయి మీదివ్యత్వాదుల నెల్లరకుం బయల్పడం జేయు. ఈభారతి జాతిస్మరత్వంబుతో నాపురుషాకారంబున నుండు. ఈసరస్వతికి శిష్యుడై యతిప్రణయవృత్తి నుండు నీపుంజికస్థలయు విలాసవతియను వేశ్యయై పురుషాకృతినుండు నీవాణికిం బ్రాణప్రియ యయ్యెడిని. ఈదూర్వాసుండును రాజకన్యకయై జనించి సావిత్రిశాపం బనుభవించు. మీరలు మీయంశంబుల భారతంబునకుం జని నావచనంబు లనుష్ఠింపుఁడు. మే లగుంగాత. అని యాకమలాలయ యంతర్హిత యయ్యె.

బ్రహ్మయుం సావిత్రియు సరస్వతియుం దక్కుంగలవారును శ్రీదేవిని సంస్తుతించిరి.

బ్రహ్మ! ఓసావిత్రీ! యీయెడరున నీపుంజికస్థలవిద్యావిశేషంబుం గనుంగొననువు లేకపోయె. ఇందిరాదేవివచనంబు లవశ్యానుష్ఠేయంబులు. మనము తన్నిర్దిష్టకార్యం బనుష్ఠింపం బోవలయు. అని యందఱు నిష్క్రాంతులైరి.

ఇచట విద్యావేదినిసౌధమునందలివినోదసీమం బనుమండపము నగ్రభాగమునం జిత్రయవనికను మూసికొని వేత్రహస్త యగుకామిని తదంతరంబునకుం జనియె.

మాయాసుందరీవిజయమను నుపరూపకము సమాప్తము.

గీ. ఈకథాకల్పలతఁబుట్టియింపునింపు, పంచమగుళుచ్ఛమునరమాప్రాణనాథ
నీపదార్చనఁజేసితిభూపమాళి, యాచభూజానితగుసహాయంబొనర్ప.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమానమానస భారద్వాజకులపవిత్ర తిరుమలార్యపుత్ర పెరుందేవీగర్భజన్మ చి లకపాటి వేంకటరామానుజశర్మ ప్రణీతంబైన వినోదకథాకల్పవల్లియందుఁ బంచమగుళుచ్ఛము సంపూర్ణము.

శ్రీ రామజయము.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

# వినోదకథాకల్పవల్లి

## షష్ఠగుచ్ఛము.



### మంగళాచరణము.

క. శ్రీరాధానవనవశుభ, తారుణ్యవిలాసనక్తతావంచితహృ
త్సారస సురవరనతపద, నీరజ వినుఁ గొల్తు భక్తి నీరజనేత్రా.

ఇట్లు కాళికాదేవి పరిచారికాగణంబుచే బ్రయుక్తంబగు సుపరూపకంబుఁ గనుంగొని యాసభాసదు లత్యాశ్చర్యరసపూరపూరితాంతఃకరణులై భోజలీలావతీకాళిదాసులు మనుష్యమాత్రులు గారు దివ్యప్రభావసంపన్ను లని నిశ్చయించి వారలయెడభక్తిప్రశ్రయంబులు సూపుచు నిట్టితోలిపుట్టువునం గలిగియుండుననుబంధంబులేనినాఁ డీభోజకాళిదాసుల కిట్టిప్రేమం బేల గల్గు? ఈభోజభూపతి బ్రహ్మాంశసంభూతుండు గాని నాఁడు కవికులంబుల కగణితంబులగు వసుసంచయంబు లవ్వారిగ నొసంగుమహాభాగ్యం బెక్కడిది. సరస్వత్యంశసంభవుఁడు గానినాఁ డీకవికులాభరణంబున కతిసరసమగు వాణి ప్రవృత్తం బగుట యెట్లు? తక్కుంగలకవులు భారతీప్రసాదపాత్రు లనియు నీకాళిదాసుండు భారతియే యనియు నెల్లజనులు వాడుకొనుట యథార్థం బని యిప్పు డెఱింగితిమి. ఈమహాత్ములం గాంచి ధన్యుల మయితిమి. అని సంస్తుతించిరి. అప్పుడు ప్రతాపపాలుండు మహానందపరవశుండై భోజభూమీశుని బహువిధంబుల సంస్తుతించి యాతనితో ని ట్లనియె. ఓ మహాత్మా భవదీయంబగు మాహాత్మ్యంబు మాఁబోఁటిమనుష్యమాత్రుల కెఱుంగం దరంబు గాదు. భవత్పాదరజంబు సోకి నాయిల్లు పవిత్రంబయ్యె. ఈమహాకవికింగల యతిమానుష ప్రభావంబు నేను బలుమాఱు విని యితనిపాదవందనంబు సేయ బహుకాలంబుగ వేచియున్నవాఁడ. నాభాగ్యవిశేషంబున నామహాత్ముఁడు నీతోఁగూడఁ దానె నాయింటికిం జనుదెంచి నిష్కారణప్రేమంబును నాయం దగపఱిచినవాఁడు. ఇంతకంటె నభ్యుదయంబు మఱియొండు గలదె? విధి యనుకూలంబునం బ్రవర్తింప సకలసంపదలు నచింతితోపనతము లగు ననువచనంబు సత్యం బయ్యె. ధన్యుండనైతిని. నాయుల్లంబునఁగలసందియంబు నివృత్తంబయినయది. తొలుత నీవిదుషీశిరోరత్నంబు విద్యాసర్వస్వవేదిని యనం బరఁగు

వేశ్యాకన్యకఁగా నిరూపించి యది యొనరించియుండుకట్టడల కెందును విభ్రంశంబు నొం
దక జయించినవాఁడు గాన నీకపీంద్రుండ యీమగువకు నధికారి యయినవాఁడు. ఈ
విద్యాసర్వస్వవేదిని నాస్తికనేపథ్యంబున నుండుట యెఱుఁగక యేతదభిభూతయయి ప్రాణ
పరిత్యాగం బొనరించెనో? యని సంశయించి మదీయసుతానిర్విశేషయగు నీకుమారిక
యందుం గలవాత్సల్యవిశేషంబున నేను నితనికి విద్యాసర్వస్వవేదినిం గాన్పించితి వేనిఁ
దదీయసర్వస్వమ్ముతో నామదవతి నీక యొసంగెద నని నుడివితిని. కాళిదాసుండని యెఱింగి
నంతన యాతరుణాంబుజయు విరజాంబుజయు భక్తిప్రశ్రయంబులతోఁ బ్రణతలైన
నితండు వీరల నుత్తమభూభృత్కుమారతిలకంబులకు భార్యలు గం డని దీవించినవాఁడు.
ఇది పూర్వోద్దిష్టవిధానంబుతో ననువుపడం జేయుట యెట్లొకో? యని యడిగిన భోజ
భూపాలుండును సింహపురపాలకుం గాంచి యిట్లనియె. ఓమహితచారిత్ర! నీనుడివిన
యర్థం బడుగం దగినదియ. ఈతరుణాంబుజ యితనికి విజితయైనకతంబున నీతనిదియ. నీకు
సుతానిర్విశేష యగుదీని నీయిష్టగతి నొసంగుటయుం నాక్షేపార్హంబు గాదు. చెల్లం దగి
నదియ. ఈకవివరుండు వీరల కిడినయాశీర్వాదంబును నసత్యంబు గాదు. ఈకవివరుండు
తనయిష్టార్థంబు నొకదానిని మానసంబున నుంచుకొనక యీపనికిం గడంగినవాఁడు గాఁడు.
ఇతఁడు తనయిష్టార్థంబని యెది గోరినను నే నితని కొసంగం గూడనిది లేదు. అదియు
నుం గాక యీమహాత్మునిసమాగమము వెండియుం నాకుం గలుగుటం జేసి సర్వస్వదానము
సేయ నగుమహోత్సవసమయంబున నీతరుణాంబుజ నితని కొసంగుట కడ్డు గలదా! తరు
ణాంబుజను మాత్రమే కాదు! మఱి యేమి యితండు గోరినను మాఱు పలుకక యీఁ
గడంగి యున్నాఁడను. తనవశవర్తిని నితఁడు యథాభిలషితముగ వినియుక్తం జేసికొనును
గాక. వినష్టం బగుసుతారత్నంబు వెండియు లభించుట యితనివలనన కాన దీని నితని
హస్తగతం జేయుటకు విచారింపవలసిన దేమి యున్నది. అని చెప్పి యోమిత్రమా! మహా
కవీ! యీతరుణాంబుజను భవదీయహస్తగతం జేసితిని. దీని నెవ్వనికిఁ బాణిగృహీతిం
జేసినను నీ సేయుకార్యంబు నాకుం గడుం బ్రియంబ. అనినం గాళిదాసుండు మంద
స్మితంబుఁ గావించుచు నోనరపతీ! ఇది నాచే విజిత యగుటం జేసి నావశవర్తినియె. ఇందుల
కీ వేమియుం జెప్పవలయు నను నది లేదు. అది యట్లుండ నిమ్ము. నీవు మదీయాభి
లషితం బెద్దియైన నీఁ గడంగియున్నాఁడ నని చెప్పినవచనంబు సత్యంబు సేయందు వేని నా
వేఁడినదాని నా కొసంగుము. భవద్విధులగు మహాపురుషులు తామాడినమాట మరల్పరు
గదా! యనిన రాజు నోకవికులకమలదివాకరా! నీ కీరానియర్థంబును గలదే! వేఁడు మిచ్చెద
ననఁగాఁ గవివరుండు ధారాపతిం గాంచి యిట్లనియె. తొలుత నే నీవిదుషీశిరోమణి యగు
విద్యాసర్వస్వవేదినిం జయింపం దలంచి దీనిచే నభిభూతుండగు నొకకట్టెలమ్మువానివలన
దీనివృత్తాంతం బెఱింగినవాఁడం గాన నం దదభిమానంబునం బరఁగునీతని కుపకార

రూపముగ నీవిద్యాసర్వస్వవేదినిని దానివంటిమఱియొక కన్యారత్నంబు నిచ్చెద నని చెప్పి వీనిం దోడ్కొని వచ్చితిని. నుడివినపడువున నితనికిం గన్యారత్నంబుల రెంటి నొసంగి పూర్ణమనోరథుం జేసెదను. కాన నీతరుణాంబుజతో విరజాంబుజను సయితము వీని కిచ్చి వివాహంబు జరుప నింపుఁ గొని యున్నవాఁడ. న్న విందుల కొడంబడి నామనోరథంబు నెఱవేర్పం జనును. అని యడుగుచుండఁగా రాగసేన యనులీలావతిప్రియసఖి రాజునకుఁ జేతులు మొగిడిచి యిట్లనియె. ఓరాజచంద్రమా! తొల్లి మనవిరజాంబుజ నుదయాదిత్యున కొసంగు మని తదీయజననీజనకులు విప్రముఖంబులం బ్రార్థింపఁగా నాతని కీఁ దలంచి వాగ్దానముఁ జేసితిరి. పూర్వము ప్రదత్తయైయుండుదాని నిప్పు డీకవివరుహస్తగతం జేయుట కెట్లు సరిపడును. ఈయర్థం బవసరం బగుడు విన్నవించుకొంటిని. అనఁగా భోజభూపాలుం డులుకిపడి పూర్వము నే నుడివినవచనంబు మఱచి కవిసంప్రాప్తిసమయసంజాతమగు మహాముదంబునం బూర్వకార్యసందర్భం బారయక యడిగినయర్థం బొసంగెదనని నీమహాకవియుం దనవలచినకార్యంబున కీవిరజాంబుజనడిగెను. కట్టా! ఒక్క ప్రేల్మిడిని చెప్పినమాట తప్పివలసిన ట్లైనది. ఏమి సేయనగును. సత్యసంధులగుమహీపతులు సత్యంబుఁ దప్ప వలసినట్లు విధి సేయుచున్నాఁడు. కట్టా! మాటతప్పుటకన్న ప్రాణంబులు వాయుట యుత్తమంబు. ఏవిధంబునం గాని తప్పించుకొనుటకు నను వు లేక వచ్చినయది. అని యాలోచించుచుం జింతాసంతానమునం జిక్కి వెక్కసంపుసంతాపంబున వేఁడినిట్టూరుపులు నిగుడ్చుచుం దలవాంచుకొనియుండె. కవియుంరాజుం గాంచి యోసింధులరాజకులోద్ధారకా! నాప్రార్థితార్థంబు నొసంగి నే నీపిన్నవానికిం జెప్పి నమ్మిక పుట్టించి తెచ్చిన నాయుద్యమంబు సఫలంబు సేయుము; కన్యారత్నంబుల కాసపడియె యీకుమారుండు న న్నాశ్రయించుకొని వచ్చి యున్నవాఁడు. వీనియభీష్టార్థంబు నెరవేర్చెదనని యేను బ్రతిన చేసియున్నాఁడ. ప్రతినదప్పినవాఁడు గతిహీనుండై యడంగు ననునర్థంబీ వెఱుంగనిదియే; ఏను బరలోకవిభ్రష్టుండనై యడఁగుట నీ కిష్టం బగునే! అనిన భోజుండు కవిం గాంచి యోమహాత్మా! పూర్వదత్తం బగునర్థంబున కేను గర్త నగుదునా! ఆవిరజాంబుజ యుదయాదిత్యునికిం దత్తం బగునర్థంబు. దానిని మరల నన్యదత్తఁ జేయం జనదు! ఇందు ధర్మాధర్మంబులు నీ వెఱుంగనివి గావు. అది గాక యితర మయిన వస్తువును మదీయరాజ్యంబునైనఁ బ్రాణములనైన నీకుం గావలయునేని నొసంగ నుద్యుక్తుఁడనై యున్నాఁడను; కరుణించి యితరవస్తువుం గోరుము. అనినం గాళిదాసుండు ధారాపతితో నిట్లనియె. ఓరాజశేఖరా! అన్యదత్త యగుదానిని మరల నన్యున కీఁ జన దంటివి. అన్యానురక్త యగుదానిని వేఱొక్కనరునికిం గరగృహీతఁ జేయఁ జనునా! ఈకన్యక శ్రుతశ్రవసుం డనువిప్రకుమారునం దనురక్త యగుట తెల్లంబ గాదె! అదియునుం గాక నీవీవిరజాంబుజను దప్ప నితరవస్తువును బ్రాణంబుల నైన నొసంగెద నంటివి. ఈనిరవద్యరూప

యగువిరజాంబుజాదేవిసుగుణసంపద వినియుఁ గనియు నీకుమారుండు కఠోరమారశరా సారపీడితుండై యాకుమారికారత్నంబుఁ బొందు దొరకనినాఁడు తనప్రాణంబులం బరిత్యజింపం దెంపుఁ జేసి యుండువాఁడు. ఇట్టివాని నీప్రాణంబులు రక్షింపం జాలునే! దీనిం జేపట్టినవానికి భవదీయరాజ్యంబువంటిరాజ్యంబు లెన్నియో చేకూరం గలవని యెఱింగి నీకుమారికారత్నంబు నపేక్షించువానికి నీరాజ్యంబుతోఁ బని యేమియున్నది. కాన విరజాంబుజ నీక యితరంబు లెవి యిచ్చినను ప్రియంబులు గావు. ఆకన్యక నీకుమారున కిచ్చి పెండ్లిసేయుము. అట్లొనర్చనినాఁడు మదీయవాంఛితప్రదాతవు గాకపోదువు. అన విని భోజుండు కవివచనంబులకు మాఱు పల్కలేక యవనతశిరస్కుండై యూరకుండెను. చెంతల నుండెడువారు కాళిదాసుండు తరుణాంబుజావిరజాంబుజలను దనతోడ నేఁగుదెంచిన యొకకుమారునికిం బరిణయంబుచేసి యిచ్చి తనప్రతిన నెఱవేర్పం దలంచుచున్నవాఁ డంతియకాని అనంగరాజరాజ్యాధిదేవతలంబోలినయీలీలావతీమణుల నతిదుర్భగుండగు నీ కట్టిలమ్ముకొనువానికిం బట్టియిచ్చి పదరానియిడుములం బడఁజేయుట యుచితంబు గాదని తలంచినవాఁడుగాఁడు. రాజును దనకుఁ గవిసంప్రాప్తివలన నతిశయితంబగు నామోదంబుచే నొడలెఱుంగక మాటయిచ్చి తప్పించుకొనుట కనువుపడక పరితపించెడిని. ఈకాళిదాసుండు భోజునికి మిత్రమగుటం జేసి యాకన్యకామణులసుఖదుఃఖంబులు దాన పాటించుచుండందగినవాఁడయ్యు నతినిర్ఘృణుండై వీరలం గాఱియపెట్టం దలంచియున్నవాఁడు. మహోదారుండగు నీతని కీకఠోరకార్యప్రవర్తనంబు గలుగుట యస్మాదృశజనపాపపరిపాకం బని యెంచంబోలు! ఇతండు కాళిదాసుం డని యెఱుంగుదనుక నిట్టిమహానీచునికి విద్యాసర్వస్వవేదిని కొంగువేయున ట్లయ్యెనే యనిచింతించుచుంటిమి. ఇప్పు డాచింత తొలంగి యీచింత గల్గుట ముల్లు వెడలిచి కత్తు జొనిపినట్లున్నది. ఇది యప్రతివిధేయం బయినకతంబున నేమియు మానసంబులకుం దోఁపదు. అని యిట్లు వ్యాకులపడుచుం జేయునదిలేక యుండం గాంచి ప్రతాపపాలుండు కవితో నిట్లనియె.

ఓమహాత్మా కవికులతిలకమా! నిన్నొక్కయర్థంబుఁ బ్రార్థింపవలసియున్నది. ఈవిరజాంబుజయుఁ దరుణాంబుజయు నీకుం బాదాభివందనంబు సేయుసమయంబున వీరల నుత్తమభూభృత్కుమారునికిం బత్నులు గండని దీవించితివి. ఈనీవచనంబు సత్యంబు సేయుం జనును. లౌకికులగు సాధువు లప్రాప్యంబులగు నర్థంబులం వచింపరు. వచింతురేని యయ్యర్థంబు ప్రాప్యంబ యగు. నీవు సాధువవు. నీవచనంబులు కల్లలు గాఁ జనదు. మఱియు నీవిరజాంబుజం జేపట్టినవానికి భోజభూమీశప్రముఖరాజేంద్రదుష్ప్రాప్యంబగు మహామహీమండలాధిపత్యంబు సేకూరు నంటివి. ఈవచనంబును సార్థకము సేయుము. ఈ రెండువాక్యంబులయర్థంబులు మా కీవు ప్రత్యక్షానుభూతంబులం గావింపు మహానందపం బొనగూర్పుము. అని వేఁడుకొనినం గాళిదాసుండు నవ్వుచు నోమహీపతీ యాభోజభూమీ

శుండు దా౯ బల్కినపల్కు నెరవేర్పం జాలక తలపంచుకొనియున్నవాఁడు. అట్టులుండ మదీయవచనంబు సార్థకంబు సేయు నెట్లగును? అనిన భోజుండును కవిం గాంచి యో మిత్రరత్నమా నీకుం దెలియనియర్థంబులు లేవు. నీవు మదీయాభ్యుదయకాంక్షివి గాని యన్యుండవు గావు; ఈకట్టెలమ్ము వానికి నాకుమారికారత్నంబులం బరిణయంబు చేసి యిచ్చుట భవదభిమతం బేని నాకు నభిమతంబు. నే నుదయాదిత్యునికి విరజాంబుజ నిచ్చెద నన్నవచనం బపార్థంబు గాకుండ నీవిదుషీశిరోమణులమానసంబులకు ఖేదంబు జనింపక యుండ నీ వెవ్వనికిచ్చుకొన్నను నాకభిమతంబ యనినం గవియుం గడుమోదం బందుచు నోమహీపతీ యావిదుషీశిరోమణులహృదయంబునకు ఖేదముపుట్టింపక యుండం బ్రవర్తింప వలసినది మాత్రమే గాదు. నీమనంబునకును నీదేవియగు లీలావతీహృదయంబునకును ప్రతాపపాలునిహృదయంబునకును నాహృదయంబునకును నాకడనుండునీకుమారుని హృదయంబునకును ఖేదము జనింపకుండం జేసి యెల్లరకు నభిమతంబై యొప్పునట్టులు నాయుద్యమంబు నెఱవేర్చుకొనియెదను. అని చెప్పుచుండం గొందఱు వీణావేణుమృదంగ తాళాదివాద్య ధారులు మనోహరవేషాలంకృతులు గీతకళాకోవిదులు భరతశాస్త్రపారం గతులు సనుదెంచి భోజునికిని ప్రతాపపాలునికిని వందనంబు లొనరించి నిటలతటఘటిత కరాంజలులై స్తుతించి యిట్లనిరి.

ఓరాజచంద్రులారా! ఏము భరతశాస్త్రపారంగతులము. రూపకప్రదర్శనపాటవంబున మాకు సాటియగువారు లేరు. మీ కిపు మహాభ్యుదయకాలం బని యెఱింగి యస్మదభ్యస్తవిద్యావైశారద్యంబున మిమ్ము మెప్పించి మీయిచ్చుబహుమానంబులం బడయ నేఁగుదెంచి యున్నవారము. మీరలు మాయందుఁ గరుణించి మాప్రదర్శితం బగురూపకంబుం గాంచి యస్మదీయగురుకులక్లేశంబు సఫలంబు సేయం జనును. అని ప్రార్థింపఁగా భోజప్రతాపపాలురు కరము సంతసించుచు వారిం గాంచి యోనాట్యాచార్యులార! మీ యుద్యమంబునకుం గర మనుమోదించితిమి. మీర లిప్పుడు ప్రదర్శింపం గడంగినరూపకంబు సమయోచితం బగునేనిఁ గాంచం బ్రియంబగు ననిన నాకుశలవులు నట్ల యగునని వచియింపం దరుణాంబుజయు నీసౌధముం దాఁటిన నేఁబదియొందొమ్మిదవకక్ష్యాంతరంబునందు రూపకప్రదర్శనం బనుమహామండపంబు గల దది రూపకప్రదర్శనోచితంబై యుండు, దానికడకుం జని ప్రస్తుతకార్యంబుం బ్రవర్తింపం జేయునగు ననిన నట్ల యగుంగాకయని భోజప్రతాపపాలురయాజ్ఞచే నయ్యెడ నుండువారలెల్ల రూపకప్రదర్శనమండపంబునకుం బోయి యథోచితస్థలంబులం గూరుచుండిరి. కుశలవులును నేపథ్యంబునం బ్రవేశించిరి.

శ్రీరస్తు

# రససంజీవనము

అను

## నాటకము.

### నాంది

శ్లో. *లోలే బ్రూహి కపాలికామిని పితా క స్తే పతిః పాథసాం
కః ప్రత్యేతి జలా దపత్యజననం ప్రత్యేతి యః ప్రస్తరాత్
ఇత్థం పర్వతసింధురాజసుతయో రాకర్ణ్య వాక్చాతురీం
సస్మేరస్య హరే ర్హరస్య చ ముదో నిఘ్నంతు విఘ్నంతు నః.

---

* నాందియనఁగా! రూపకంబులయందుం దొలుతదేవతానమస్కారాద్యాత్మకముగా పఠియించుమంగళము. రూపకప్రారంభంబున నొకసూత్రధారుండు రంగంబునం బ్రవేశించి నాందీశ్లోకంబుం జెప్పి నిష్క్రాంతుండగును. తత్సదృశుండు మఱియొక్కరుండు రంగంబుఁజొచ్చి కావ్యార్థసూచనంబు సేయంజనును.

ఇందుకుం బ్రమాణశ్లోకములు. నాందీశ్లోకంపఠిత్వైవసూత్రధారేవినిర్గతే, ప్రవిశ్యతద్వదపరః కావ్యార్థంసూచయేన్నటః. రంగంప్రసాద్యమధురైశ్శ్లోకైః కావ్యార్థసూచకైః, ఋతుంకంచిదుపాదాయ భారతీంవృత్తిమాశ్రయేత్. అని.

ఈనాందీశ్లోకము లక్ష్మీపార్వతీచమత్కారసంవాదరూపము.

టీ. పార్వతి లక్ష్మింగాంచి వేడుకగాసంబోధించుచున్నది. లోలే=ఓచంచలురాలా! అని. ఒకయెడనైనను స్థిరముగనుండవే! యేమి యానీగుణమనుభావము సూచితము. అందుకు లక్ష్మిలోనఁగనలుచునిట్లనుచున్నది. కపాలికామిని = కపాలము చేతంబట్టుకొని తిరియువానిని వలచిన యోచానా! బ్రూహి=నన్నుంబిలిచినపనియేమి? వచింపుము! తన్నుంజపలురాలాయన్నందుకు ఓబిచ్చపుదానా! యని యధిక్షేపోక్తులాడెననిభావము. పార్వతి లక్ష్మి చేసిన యధిక్షేపోక్తివిని యాకాంతకుంబితృకులప్రశస్తి లేదని పుల్లవిఱుపుమాటలాడుచున్నది. తే=నీకు, పితా=తండ్రి, కః=ఎవ్వఁడు? అని. అందుకులక్ష్మి తనకుఁబితృకులప్రశస్తిలేకపోలేదని యనుచున్నది. పాథసాంపతిః = సముద్రరాజు. నాతండ్రి యని యర్థము. క్షీరసాగర సుతయనుప్రసిద్ధి తనకున్నదని తెలియపఱచుచున్నది. అందుకుంబార్వతి లక్ష్మివచన మవిశ్వసనీయం బనిపింపం గడంగియిట్లనుచున్నది. జలాత్ = జలంబువలన, అపత్యజననం=శిశువుద్భవించుటను, కః = ఎవ్వఁడు, ప్రత్యేతి = నమ్మును. నీవుసముద్రమునం బుట్టినదానవనుమాట నమ్మంజనదనిభావము, అందుకులక్ష్మి నాజననము నవిశ్వసనీయంబయగు నేనినీజననంబు నట్టిదయగుననుచున్నది. యః=ఎవ్వఁడు, ప్రస్తరాత్ =

అని నాందీశ్లోకంబు పఠించి సూత్రధారుండు నిర్గమింప నట్టివాఁడు మఱి యొక్కరుండు ప్రవేశించె.

సూత్రధారుఁడు. (కరము మోదముతో నలువలంకులం దిలకించి.) ఔర! సాభాగ్యం బేమందును? శ్రీభోజకాళిదాసులయెదుట నానేర్చినవిద్యం బ్రదర్శింపం గంటిని.

నటి. (ప్రవేశించి.) ఆర్య! శ్రీభోజకాళిదాసులమోలి నేర్చినవిద్యం బ్రదర్శింపం గంటి ననిమాత్రమే సంతసింపకుము. వీరలు నత్యుదారరసప్రశస్తంబులగు రూపకంబులం గల్పించియుండువారు? అభ్యస్తవిద్య నగపఱచి యీయభియుక్తులమన్న నలువడసినచోఁ గదా సంతసింపం జనును?

సూత్రధారుఁడు. ఓఁ టీ! ఇట్టియనవద్యవైదుషీవిశేషభూషితుల నత్యల్పతరం బగు విద్యంగొని యలరింప నగును. పండితంమన్యులసభ యగునేని మనకు సర్వజ్ఞత్వంబు గల్గిన నారాధింపలేము. ఇందుకుం దవనురూప మగుపద్యం బొండు గల దది వినుము.

శ్లో. అపి సర్వవిదో నశోభతే వచనం శ్రోతరి భావవర్జితే,
పరిణేతరి నేత్రవర్జితే రుచిరం కిన్ను కళత్రభూషణమ్.

---

చట్రాతివలన, ప్రత్యేతి=అపత్యజన్మ మయినదనినమ్మునో; వాఁడె జలంబువలననయిన యపత్యసంభవంబునుసయితము నమ్మునని యన్వయము. చట్రాతివలనం నపత్యసంభవమయిన దని నమ్మువాఁడు జలమువలన నదియగునని యేలనమ్మఁడు. విశ్వసనీయంబులన్న రెండును విశ్వసనీయంబులే; కావన్న రెండను గావే. లక్ష్మీకింగలిగిన పితృకులప్రశస్త్యభావము పార్వతికింగలదని సూచితంబయ్యె. ఇత్థం=ఈప్రకారము, పర్వతసింధురాజసుతయోః = పర్వతరాజసముద్రరాజకుమారికలగు గౌరీశ్రీదేవులకుఁ బ్రవృత్తమగు, వాక్చాతురీం = వాక్చమత్కారమును, ఆకర్ణ్య=విని, సస్మేరస్య=మందస్మితము సేయుచుండెడు, హరేః= విష్ణునియొక్కయు, హరస్యచ = శివునియొక్కయు, ముదః = సంతోషములు, వః=మన యొక్క, విఘ్నం = పనిచెఱుపును, నిఘ్నంతు = పోఁగొట్టుంగాత.

* టీ. శ్రోతరి=వినువాఁడు, భావవర్జితే=భావవిరహితుఁడయియుండునేని, సర్వవిదోపివచనం = సర్వజ్ఞుఁడగువానివచనముసయితము, నశోభతే=ప్రకాశింపదు. అదెట్లనఁగా! పరిణేతరి = వివాహముచేసికొన్నవాఁడు, నేత్రవర్జితే=కన్నులులేనివాఁడగునేని, కళత్రభూషణం=పత్నిధరించుకొనుసొమ్ములు, రుచిరంకిన్ను=మనోజ్ఞత్వమునుగాంచునా! ఏమి?

వినువారలు రసికులయియుండినచో స్వల్పజ్ఞునివచనము సయితము ప్రకాశించును. వా రరసికు లగుదురేని సర్వజ్ఞునిపలుకు సయితము ప్రకాశింపంజాలదు. భర్తకుం గన్నులున్నచో భార్య దాల్చిన సొమ్ము లందగించునుగాని వాఁడు గ్రుడ్డియైన నేమి యుపయోగము.

నటి. ఆర్య! భవదుక్తం బాదరణీయంబ. సామాజికులు సర్వవిద్యావిచక్షణు లయి యుండినను ప్రబంధంబు రసోదారంబు గానిసాఁడు ఫలంబు గల్గంబోదు.

1 శ్లో. కిం తేన కిల కావ్యేన మృద్యమానస్య యస్య తాః,
ఉదధే రివ నాయాంతి రసామృతపరంపరాః.
అని చెప్పంబడియుండ లేదా?

సూత్రధారుఁడు. నటీ నీనుడివినవచనంబు సత్యంబు. ఇప్పు డట్టిరూపకంబు సమయోపయోగమగునది దొరకునే!

నటి. ఆర్యా! మఱచితిరా మీరు! రససంజీవనంబను నాటకంబు ప్రస్తుతోపయోగి గాదే!

సూత్రధారుఁడు. ఆ! ఔను! స్మరణంబునకు వచ్చె! ఈరూపకవరంబు సామాజికులమనంబు నావర్జింపం గలదు. వేఱొండుచింత యేల? జంపు మాని సొంపు లొలుకు నీవసంతసమయంబును వర్ణించెదను వినుము.

2 శ్లో. స్థానే స్థానే మలయమరుతః పూరయం త్యంకపాళీం
పుష్పాళీషు స్మరగజరజస్నానయోగ్యాః పరాగా,
జాతం చూతే మధు మధుకరప్రేయసీజానుదఘ్నం
నిర్విఘ్నత్వం సపది భజతే రాగరాజ్యాభిషేకః.

---

1 టీ. మృద్యమానస్య=నలపఁబడుచున్న దయ్యును; అనవరతపరిశీలనమున నాస్వాదింపంబడుచుండిన దయ్యును, యస్య = ఏకావ్యముయొక్క, రసామృతపరంపరాః = శృంగారాదిరసాత్మకములగు నమృతపరంపరలు, ఉదధేరివ = సముద్రమువలనంబోలె, నాయాంతి=పొడముచుండవో, తేనకావ్యేన=అట్టికావ్యముచేత, కిం=ఏమియుపయోగము.

ఆస్వాదింప నాస్వాదింపంబడియుఁ బయి రసపుష్టినిచ్చుచుండుకావ్యమే కావ్యము. అట్లు రసపుష్టినొసంగ లేనికావ్యము వలన నేమి యుపయోగము లేదు.

2 టీ. మలయమరుతః=మలయమారుతములు, స్థానేస్థానే=ప్రతిచోటను, అంకపాళీం=కౌఁగిటిని, పూరయంతి=నిండించుచున్నవి. ఆశకొలఁది౯ గౌఁగిలించుకొనునంతటి మలయమారుతము లెల్ల చోటులనొలయుచున్నవి యని భావము. పుష్పాళీషు=పువ్వుల గుంపులయందు, పరాగాః = పుప్పొడులు, స్మరగజరజస్స్నానయోగ్యాః=మరుఁడను మత్తదంతిరజస్స్నానము సేయుటకుందగినవియైయున్నవి. ఏనుఁగు భూపరాగమును దనపై నంజల్లుకొనుటను రజస్స్నానమందురు. అట్లె స్మరదంతి కావలసినంతఁ బయింజల్లుకొనుటకుందగినపుప్పొడి పువ్వులందుఁగలిగి యున్నదని యర్థము. చూతే=మామిడిచెట్టుయందు, మధు=తేనె, మధుకరప్రేయసీజానుదఘ్నం = మధుకరకాంతలకు మోకాలిబంటిగా,

నటి. ఆర్యా! మీర లొనరించిన వసంతసమయవర్ణనంబు కరము రమణీయం బయి నది. ఇందు.

* శ్లో. రణత్కంకణానాం ఝణన్నూపురాణాం చలత్కుండలానాం క్వణత్కింకిణీనాం,
వధూనాం ముఖాంభోరుహం ద్రష్టుకామో రథం మంథరం చక్రబంధు శ్చకార.

సూత్రధారుఁడు. నటీ! ఈవు గావించిన వసంతానురూపమగు దినమణివర్ణనంబు ఛేకసర్వసర్వంసహాచక్రపరిపాలకుండగు రాజకుమారుండు సర్వాభరణభూషితలై విహరించుచుండు నెలజవ్వనుల మోముదామరలు గనుంగొనుచుం దదర్థంబుగ రథగమనంబు మందము సేయుచు వచ్చుచున్నవాఁ డనునర్థంబు సూచితం బగుచున్నయది. ఇట్లు సేయుటకుం గతం బేమొకో? (అగ్రభాగంబునకు దృష్టులు నిగుడించి.) ఇదె యొకరాజ కుమారుండు రథారూఢుం డయి నలువలంకులం గలయంబరికించుచు నేఁగుదెంచెడిని. ఇతం డెవ్వఁడో తెలిసికొనం దగును. (అని నిష్క్రాంతులైరి.)

## ప్రస్తావన.

---

## ప్రథమాంకము.

అంత మందగమనసుందరస్యందనారూఢుండగు రాజకుమారుండును మంత్రిపుత్త్రుఁడును బ్రవేశించుచున్నారు.

---

జాతం = అయెను. తుమ్మెదలకుం జాలినంత మకరందము మామిళ్లయందుఁగలిగెనని యర్థము. సపది=ఇప్పుడు, రాగరాజ్యాభిషేకః=అనురాగమునకు రాజ్యాభిషేకము, నిర్విఘ్నత్వం=విఘ్నములు లేకుండుటను, భజతే=పొందుచున్నది. రాగమునిరంకుశముగ భూమి నేలుచున్నది యనియర్థము. ఎల్లజనులును శృంగారరసోదారులై సంతసించెదరని భావము.

* టీ. రణత్కంకణానాం=రణాత్కారముసేయు హస్తవలయములుగలవారును, ఝణన్నూపురాణాం=ఝణాత్కారముసేయు నందెలుగలవారును, చలత్కుండలానాం= కదలుచుండుకుండలములుగలవారును, క్వణత్కింకిణీనాం = శబ్దించుచుండుచిఱుగంటలు గలవారునుఅగు, వధూనాం=స్త్రీలయొక్క, ముఖాంభోరుహం = ముఖకమలములను, ద్రష్టుకామః=చూడనిచ్ఛగించినవాఁడై, చక్రబంధుః=సూర్యుఁడు, రథం = అరదమును, మంథరం=మందగమనముగలదిగా, చకార=ఒనర్చెను. వసంతరుతువునందుఁ బగలధికము గనుక సూర్యుఁడు మందగమనముననఁబోవుచున్నాఁడనియందురు. ఆవిధమున నతఁడు తనరథమును మందముగానడిపించుకొనుట. వసంతర్తువునందు మహోల్లాసంబున నఖిలభూషణ భూషితలై కాంతామణులు కంకణరణాత్కారంబుతో నూపురఝణాత్కారంబుతోఁ గుండలద్యుతులొప్పుగండభాగంబులతోఁ జిఱుగంటల మ్రోఁతలుగలకాంచీదామంబులతో విహరింపఁగా వారలమనోజ్ఞముఖాంభోజములం గనుంగొనంగోరియే యనిభావము.

రాజపుత్త్రుఁడు. (మంత్రిపుత్త్రుం జూచి.) ప్రియవయస్య! ఈగహనంబు గజగవయగండభేరుండవరాహమహిషశల్యకతరక్షుఖడ్గకంఠీరవప్రముఖక్రూరమృగయూథభయంకరంబై యున్నయది. ఇందుం జొరరానిదంబున నెట్టిదిట్టలకేని ధైర్యంబు వొడసూపదు. అట్టియీ మహారణ్యమధ్యంబున సాలరసాలపున్నాగనీపకదంబకకాంతంబైనచోటం గొందఱు చందనగంధులు గన్పట్టెదరు. చూచితివే? ఇది చిత్రంబై తోఁచుచున్నది. ఇట్టి యతిసుకుమారాకారలగు పల్లవాధరల కీయెడ సంస్మరణమాత్రోపలబ్ధం బయ్యెడు భీతిం గలుగఁ జేయుంగాదె!

మంత్రిపుత్త్రుండు. యువరాజ! అతివిశాలంబగు నీయిలాతలంబున నెన్నియో మహాశ్చర్యంబులు గలవు. అందు నిది యొండై యుండంబోలు!

రాజపుత్త్రుండు. ప్రియవయస్య! మన మీయరణ్యంబుం జొచ్చి విచ్చలవిడి సింహశరభశార్దూలభల్లూకఖడ్గప్రముఖంబులగు దుష్టసత్త్వంబుల వధించుచు మృగయావినోదంబున నతిదూరం బఱుగుదెంచితిమి. ఈ రథ్యంబులు బహుయోజనపరిమితం బగు మార్గంబు నడుచుటం జేసి కరము శ్రమంబుం జెందినయవి. ఇయ్యెడ ప్రోలం గనంబడు నుద్యానంబునకుం జని చల్లనితరుచ్ఛాయల విడిసి యించుక విశ్రాంతిం జెందుదము.

మంత్రిపుత్త్రుండు. యువరాజ! అట్లు కానిమ్ము. ఈ యతిమనోహరం బగు కాంతారంబున మార్గాయాసంబు వోనడంచుకొన ననుకూలములగు, మాకందతరుచ్ఛాయలును కలహంససంచారచలితకమలషండనిరర్గళనిర్గళన్మకరందబిందు సందోహావహానమంథరంబులగు మారుతకిశోరంబులును గలయం బర్వుచుండుటం జేసి యిందుండి దీనిరామణీయకంబుం జూడక పోవుటకు మనంబు రాదు. భవదభిప్రాయం బెఱింగియో సూతుండును రథగమనం బించుక మందంబు సేసె.

రాజపుత్త్రుఁడు. ప్రియవయస్య! బాగుగ నిరూపించిచూచిన; నీకాంతాకదంబంబు,

ఉ. స్త్రీమయమై తనర్చునొకజీవనికాయమొ కాక యుత్తమ
శ్రీమహిళామణీనికరచేష్టితమై తగునట్టిద్వీపమో
భామినులం ద్రిలోకసువిభావితరూపలఁ దెచ్చి యొక్కెడన్
సేమ మెలర్పఁ జేరిచినచిత్రమొకో యనఁ దోఁచె నాత్మకున్.

ప్రియవయస్య! ఇది పురుషవిరహితమగు స్త్రీరత్నమయప్రపంచసృష్టి మఱియొకటి యనం బోలియున్నది. ఔరా! వీరలసౌందర్యంబు కరము చిత్రము.

చ. కలువలతేనిసక్కెళలొ కాముని మోహనదివ్యమాయలో
నలపులదీవులో యమృతవర్షపుదారలొ కార్మెఱుంగులో

సలిలజబాణబాహుయుగసారజయోజ్జ్వలలక్ష్ములో యనం
దలఁపఁగ నయ్యె నీవికచతామరసేక్షణలం గనుంగొనన్.

వీరభటసురక్షితం బయి, యఖిలభోగభాగ్యభరితం బయి పరమహర్ష దాయకం బగు మహీపాలాంతఃపురంబుల వసింపం దగినయి య్యగణితరామణీయకనిధులు తా మీగహన మధ్యంబున నుండం గతం బేమొకో? వీరల నిర్యోడ నునిచి రక్షించువార లెవ్వరో?

మంత్రిపుత్త్రుఁడు. యువరాజ! ఈ బాలికాకదంబకంబునందు,

ఉ. జవ్వన మంకురించు మెయిచాయయుం బాల్యము వీఁడుపాయముల్
బువ్విలు కానిరాజ్యరమఁ బూనుచునుండెడుసంగకంబులున్
మవ్వము మీఱునాకృతులు మన్మథరమ్యకళావిశేష మిం
దెవ్వతెఁ జూచిన స్సమత నిం పగుచుండుట చిత్ర మెన్నఁగన్.

ఈ కారణంబునం జేసి యీయసమానరూపవయోవిలాసంబుల నొప్పువిలాసవతు లను సర్వవిధముల సదృశలగువారి నెవ్వఁడో యొక్కరుం డెడ్డియో యొకయర్థంబుం దలంచి నేర్పు మెఱయ నేర్పరించి తెచ్చి యీనిర్జనం బగువనంబునం జేర్చుచున్నవాఁ డని తలంప నగును. కాదేని సమానరూపవయోవిలాసలు బాల్యంబు వాయునిప్రాయంబున నుండువారలు రాజకన్యకలం బోలినవారలు నొకయెడం జేరుటకు గతంబు లేదు. ఇది మనకు విచారణీయం బగునర్థంబు.

రాజపుత్త్రుండు. ప్రియవయస్య! భవదీయంబగు విచారంబు సారతరంబని తోఁచె డిని. కాన నాకన్నియ లున్నచోటి కఱిఁగి వారలవృత్తాంతంబు విచారింతము. సూత పుత్త్ర! రథం బారథాంగశ్రోణులుండుకడకు మెల్లనఁ బోనిమ్ము.

సూతపుత్త్రుండు. యువరాజా! ఇదె భవన్నియోగం బనుష్ఠించువాఁడను. (అని రథముం దోలుచున్నాఁడు.)

నేపథ్యంబున మహాఘోషంబు గల్గ నందఱుం దిరిగిచూచిరి.

మంత్రిపుత్త్రుండు. యువరాజ! అల్లదె యాతరునికరంబు మాటుననుండి,

గీ. ఇరులు గవియుమేను నింగలంబుల కెన, యయివెలుంగుకన్ను లధికఘోర
నరకకూపమునకు సరి యయినవదనగ, హ్వరముతోడ నొకఁడు వచ్చెఁ గంటె.

రోదోంతరంబులు నిండినయత్యున్నతఘోరాకారంబు నస్పృష్టభూతలంబు లగు చరణంబులును గాంచిన నీదుర్భగుండు పిశాచం బని తోఁచుచున్నది. ఈ క్రూరకర్ముండు మనకేదేని యనిష్టంబు సేయం బరుగువాఁడి వచ్చుచున్నవాఁడు. చాపంబు సజ్యంబుచేసి కొని యవధానంబుననుండుము. ఏను నట్లుండెదను. ఈ యరణ్యంబు భూతభేతాళశాకిని

ఢాకినీప్రముఖఘోరప్రాణిశరణ్యం బని తోఁచెడిని. కాన మన మవహితత్వంబుతో నుండ వలయుం.

రాజపుత్త్రుండు. (మహోల్లాసంబుతో.) ప్రియవయస్య! రానిమ్ము. మన మిందనుక నీ కాంతారంబునం గలదుష్టమృగంబుల వేఁటాడితిమి. ఇంకం బిశాచరాక్షసనివహంబుల వేఁటాడి యీరమణీయస్థలంబు తపస్విజననివాసయోగ్యంబు గావించెదము గాక. అని విల్లెక్కువెట్టి సన్నాహంబుతో నుండెను.

పిశాచంబు ప్రవేశించి. ధిక్ ధిక్, ధిక్, ధిక్ అనుచు సత్వరముగ రాజకుమారుని పయికిం బోవఁ గడంగెను.

రాజకుమారుండు మందస్మితంబుతో ధనుష్టంకారంబుఁ గావించెను.

పిశాచంబు. అదరిపడి యిలకుం ద్రెళ్లి సంబళించుకొని లేచి పాఱిపోయె.

మంత్రిపుత్త్రుండు. నవ్వుచు. యువరాజ! భవదీయం బగుధనుర్గుణధ్వానంబునకు నీతుచ్ఛపిశాచం బదిరిపడి లేచి పరువిడుట యొక్కయెక్కువే?

చ. ప్రళయఘనాఘనోచ్చలితపక్తినిఘట్టనజాతఘర్ఘరా
కులితదిశావకాశమతిఘోరము నీధనురారవంబు నీ
సలిలజసంభవాండమును జయ్యన వ్రక్కలు సేయఁజాలు న
య్యలఘుగుణారవంబునకు నన్యము లోర్వఁగఁజాలునే ధరన్.

నేపథ్యంబున వెండియుం మహాఘోషంబు గల్గుచున్నది.

మంత్రిపుత్త్రుండు. యువరాజ! అదె కనుంగొనుమా! ఇప్పుడు భవత్పరిభూతంబై పిశాచంబు తనకుం బాసటగా నొండుపిశాచంబుం దోడ్కొని మనపయిం గవియ నతిత్వరితంబుగ నేఁగుదెంచుచున్నయది. దీనిం బిలుకుమార్చినం గాని మనల వదలదు.

పూర్వపుఁబిశాచంబు మఱియొండుపిశాచంబుతో ధిక్ ధిక్ ధిక్ ధిక్ అనుచు సత్వరముగఁ బ్రవేశించి రాజకుమారుని పయికింబోవం గడంగెను.

రాజకుమారుఁడు. (సజ్యంబయిన చాపంబున శరంబుదొడిగి హుంకరించి పిశాచంబుతో.) ఓపిశాచాపశదమా!

చ. మదమున నీవు మాపయికి మాటికి మాటికి రాఁ గడంగితీ
విదె కను మస్మదీయశరమిప్పుడ చండదవాగ్నికీల భీ
తిద మయి యెందుగాదముగతి న్భవదీయముఁ బాపకాయమున్
గదియుంచు నీఱు చేసెడిని కాలము దగ్గఱె నీకుఁ దుచ్ఛుఁడా?

పిశాచము. (భయసంభ్రమంబులతో,)

చ. నరపతివంశమండన ఘనం బగునీభుజవీర్యసంపదన్
దిరముగ నే నెఱింగితిని దేవరపైఁ కిఁ క రాఁ గడంగ మా
గురువును మాకు ధిక్ ధిగని గూరుచుఁ బైఁ బడ దాని కర్థ మే
నరుఁడు వచింపఁ డాతనిఁ దినం జను నంచు వరం బొసంగినన్.

తదాజ్ఞానుసారుల మయి యేము ద్రిమ్మరుచు నీఘోరకాంతారమున మిమ్ముం గంటిమి. అతిఘోరం బగుమాయాకలిఁ దీరుచుకొనుకోరికిం గొంటిమి. మీరు దీని కర్థంబు వచించితిరేని స్వేచ్ఛం జన నగును. దానియర్థంబుం దెలుపక భుజవీర్యంబున నతిక్రమింపం దలంతురేని మద్గురునాజ్ఞాప్రభావవిధ్వస్తు లయి యడంగం బోయెదరు సుమీ!

రాజపుత్త్రుఁడు. (స్మరణ మభినయించుచు. ఆత్మగతంబున.) భద్రగిరి పత్తనపతికుమారుండు కాంతచందనుండు తనకాంతతోడం బిశాచంబై ధిక్ ధిక్ ధిక్ ధిక్ అనుచుం బయింబడి యనేకుల వధించుచున్నాఁడని వింటి. ఈపిశాచంబులు వారుగా నుండం బోలును. తద్వృత్తాంతం బెఱుంగుదును గాన నీతఁడు నుడువుధిక్పద్యంబున కర్థంబు వచింప నగును. (ప్రకాశముగ.) ఓపిశాచమా! నీవు నుడువు ధిక్పద్యంబున కర్థం బిదియ వినుము.

* శ్లో. కిం వా ర్ద్రభావ మయతే సితవీర్యకాష్ఠ
మంతర్జలే సుచిరకాల మవస్థితంచ
భామావృతో న లభతే తదురోజసంగ
సౌఖ్యం తదీయ మపి జన్మ ధిగేవ ధిక్ ధిక్.

పిశాచములు. ఓరాజకుమార! నీనుడివినవచనంబులు విన్నతోడన మాకు జాతిస్మరత్వంబు గల్గునట్టులున్నది. గురువచనం బనుల్లంఘనీయంబు గాన మిమ్ము వదలికొంటిమి. అ

*టీ సితవీర్యకాష్ఠం=తెలుగుకట్టె (బెండు) అంతర్జలే=నీటిలోపల, సుచిరకాలం=బహుకాలము, అవస్థితంచ=ఉండినను, ఆర్ద్రభావం=ఆర్ద్రత్వమును, అయతేకిం = చెందునాయేమి? చెందదనుట. అట్లే భామావృతః = స్త్రీలచేఁగోరంబడినవాఁడయ్యును, తదురోజసంగసౌఖ్యం=వారలకుచసంగసుఖంబును, నలభతే = పొందఁడో! తదీయమపిజన్మ=అతనిజన్మంబును, ధిగేవ=ఛీ! ఛీ! ధిక్ ధిక్ = ఛీ! ఛీ!

బెండు బహుకాలము నీటియందుమునింగియుండియుఁ లోన నార్ద్రభావంబుం జెందదు. అవ్విధమున నరసికుండగుపురుషుండు నుత్తమకాంతామణులు తన్ను వలచి వచ్చినను లోన సరసతాదులులేమింజేసి తదాలింగనాదులంగాంచక తదురోజసంగమహాసుఖంబుంగోలుపోయెడిని. ఇట్టినిరుపయుక్తజన్మంబుంగాంచినవానిని ఛీ ఛీ యని పలుమా ఱన వలయును. ఇది కాంతచందనుఁ డనురాజకుమారునికథయందుఁ జూచుకొనవలయును.

దె యత్యుజ్వలం బగుదేవయానంబు మాయుండుచోటికిం జనుదెంచెడిని. ఎయ్యెడనుండి వచ్చెనో? ఎవ్వరి కది యారోహింపం దగునో? ఇవి మొదలగునర్థంబు లారయాం జనం గుతూహలం బయ్యెడిని. పోయివచ్చెదము. అనినిష్క్రాంతంబులయ్యె.

మంత్రిపుత్త్రుఁడు. యువరాజా! అదె కనుంగొనుము! ఈపోయినపిశాచంబులలోఁ బుంపిశాచంబు దివ్యపురుషాకారంబును స్త్రీపిశాచంబు దివ్యకామినీరూపంబును దాల్చి దివ్యలోకసమాగతంబగు విమానంబు నధిరోహించి యియ్యెడకేఁగుదెంచుచున్నవి.

విమానారూఢు లయి దివ్యపురుషుండును దివ్యకాంతయుం బ్రవేశించిరి.

దివ్యపురుషుఁడు. ఓరాజకుమారశేఖరా! ఏము నీ చ్చెదిరించినపిశాచములము. మాకు నీవు పరమాప్తుండవు. భవద్దర్శనంబున మాకుం బిశాచజన్మంబు దొలంగిన యది. ఇప్పుడు దివ్యాకారంబులు దాల్చినారము. పిశాచజన్మమునకుం దొలుతటిభవంబున నేను కాంతచందనుం డనురాజకుమారుండను. ఈకాంతాతిలకంబు నన్ను వలచిన కళావతి యనురాకన్నియ. ఏ మిరువురమును బరస్పరప్రేమఫలంబుఁ గాంచక పంచత నొంది పిశాచములమయి తజ్జన్మప్రాప్తివలన నపరిమితంబయినదుఃఖం బనుభవించుచు క్షుత్పిపాసాదులకుం దాళలేక కొందఱం బంపి భక్షించుచుఁ బరిభ్రమించుచుండి ధారానగరసమీపమున నొకవటవృక్షంబుపయిం గొన్నిదినములు వసించితిమి. ఆన్యగ్రోధపాదపమును భువనేశ్వరీదేవాలయసమీపవర్తి యగుటం జేసి యాజగదంబికాచరణకమలవందనం బొనర్చి మహాకవి కాళిదాసుండు మాయుండునిటపిక్రింద నించుకసేపు నిలిచియుండె. అప్పుడు జనసంచారంబడంగినరాత్రివేళ యగుటం జేసి జంకు మాని యేము నరుం డొంటరిగఁ జిక్కెఁగదా యనిసంతసించుచు నతనిం బట్టిచంపి తినందలంచి ధిక్, ధిక్, ధిక్, అనుచు నతనిపయిం బడఁబోతిమి. అప్పు డామహాత్ముండు హుంకారంబున నధిక్షేపించి యిట్లనియె.

* శ్లో. యో వా నో బుబుధేమనోజవివశప్రౌఢావిలాసాన్ బహూన్
యస్తాళీదళలేఖనం కరకృతం జానాతి నో వా భువి
తం ప్రాసూత సుతం సుదుర్భగవధూ ర్భూమండలస్థాన్ జనాన్
సర్వాన్ స్త్రాసయితుం హి కష్టచరితాం ధిక్ ధిక్ ధి గేనంచ ధిక్.

* టీ. యోవా=ఎవ్వఁడు, మనోజవివశప్రౌఢావిలాసాన్ = మదనపరవశమైన ప్రౌఢయగుకాంతామణి వలపునిలుపలేక తన్నుంగనుంగొనియొనరించుశృంగారచేష్టలను, బహూన్ = పెక్కుతెఱంగులైయొప్పువానిని, నోబుబుధే = తెలిసికొనఁజాలఁడో, యఃఽ=ఎవ్వఁడు, కరకృతం=హస్తముతోఁజేయంబడిన, తాళీదళలేఖనం=తాటాకువ్రాత, భువి=భూమియందు, నోవాజానాతి=ఎఱుంగనేరియెఱుఁగఁడో,తం=అట్టి,సుతం=కుమారుని, సుదుర్భగవధూః=పరమనీచురాలయిన కామిని, ప్రాసూత = కనియెను. భూమండలస్థాన్

అనఁగా విని యేను నాతొల్లిజన్మంబునం జరిగినయతిదుర్భగచరితంబు నెఱింగి పలికినందుల కచ్చెరువంది యాతని మహాత్ముం డని తలంచి యాపావనచరిత్రుని యనుగ్రహంబున నీపిశాచజన్మంబుం బోఁగొట్టుకొన నగునని యెంచి యతనియడుగులకు వందనం బాచరించి యతిదీనుండనై యీపిశాచజన్మంబు వాసిపో ననుగ్రహింపు మని వేఁడుకొనఁగా నామహితచరిత్రుండు దయమానమానసుండై యోచందనకాంతుఁడా కొన్నిదినంబులకు ని న్నొకసాధకుండు కార్యార్థియై వశగతునిం జేసికొంచు గొంపోయి యొకమహారణ్యమధ్యంబునం గొందఱకురాజకన్నియలకుం గాఁపు పెట్టంగలండు. అయ్యెడ కెవ్వండు సనుదెంచి నీనుడువుధిక్శబ్దంబున కర్థంబుగ మత్ప్రోక్తపద్యబావానుసారి వచనంబుల సుశ్లోకంబు వచియించు. వానిమ్రోలన నీ కీదుర్భగజన్మంబు వాసి దివ్యశరీరంబు గల్గును. నీపత్నియుం నీకుం దోడ్పడుచుఁ బిశాచియయి యుండి నీతో దివ్యవధూరూపంబుఁ దాల్పం గలదు. పిశాచంబవై యుండ నీవు నీనుడివినధిక్శబ్దంబున కర్థంబు వచింపనివానిన భక్షింపుచుండుము. ఇది నేను నీకుం జేసినకట్టడ. నీకు మేలు గలుంగుంగాత మని చెప్పి మమ్ముం బోవం బనిచి తాను జనియె.

రాజపుత్రుండు. ఓచందనకాంతుఁడా! నీకుం గలిగినదుర్దశావిశేషంబు విని కరము చింతం గూరుచుంటిని. నీ కిప్పుడు శాపవిమోచనంబు గల్గి దివ్యాకృతి సంభవించుటకుం గడు సంతసం బందినాఁడను. మహాత్ముండగు కాళిదాసునియందు గురుభక్తి సలిపినపున్నియంబ నిన్నుఁ గ్రన్నన రక్షించె. మహాత్ములయనుగ్రహంబు సంపాదించినచో నందరానివియుం గలవే? మేలయ్యె. ఈచోటుఁ గన్నదిమొదలు నామనంబునం గొన్నిసంశయంబులు గలిగియున్నవి. అవి యీవ పాపంగలవాఁడవు. ఈయతిభీషణంబగు మహారణ్యమధ్యంబున కీకన్యకలం గొనితెచ్చినవాఁ డెవ్వండు ? వాఁ డీయుత్తమకన్యకానికురుంబంబువలనం దన కేమి గాఁగలకార్యంబుం దలంచి తెచ్చెను? వాఁ డిప్పు డెయ్యెడ నున్నవాఁడు? నీవెట్లు వానికి వశగతుండ వైతివి? ఈవృత్తాంతంబు సవిస్తరముగాఁ దెల్పుము.

దివ్యపురుషుఁడు. ఓరాజకుమారకా! ఇయ్యెడఁ గఠోరకపాలుం డనుకాపాలికసాధకుం డొక్కరుండు గాలభైరవుని నారాధింపం గడంగి యాత్మగురూక్తకల్పప్రకారంబున మంత్రోపాసనంబు సల్పి యాభైరవుండు తనకు వశంవదుండై యుండ నాతనికిం బలిపూజాదులు సమర్పింప నిర్ణయించి తెంపుఁజేసి నగరంబులకుంబోయి సర్వలక్షణోపేతలగురాచకన్నియలం దొంగిలించి తెచ్చి యియ్యెడఁ జేర్చుచున్నవాఁడు. ఆభైరవుని కొక్కదినంబున సహస్రసంఖ్యల నీకన్యకలం బలిపెట్ట నుద్యుక్తుండయియుండెడిని. తొలు

---

జనాన్=భూమండలమున నుండుప్రజలను, సర్వాన్=ఎల్లరను, హసయితుంహి=నవ్వించుటకే కదా కనియెను. కష్టచరితాం=నీచపువడవడిగలయాయాఁడుదానిని, ఏనంచ= అర్థానికిం జనించిన యీమనుష్యుని, ధిక్, ధిక్ ధిక్,ధిక్ ఛీ. ఛీ! ఛీ! ఛీ యనవలయుఁను.

తన యీదారుణకార్యంబు వీరి కెఱుకపడినచో నుద్దిష్టకార్యంబునకు భంగంబు గల్గు నని యెంచి బహుకాలముగఁ దెచ్చుచుండినయీకన్యకలకు బంధుజనవిరహదుఃఖంబు దక్కఁ దక్కినకష్టంబులు గలుగనీక పరిజనంబులవలన సమస్తదైహికకృత్యంబులు నెర వేర్చుచు నుత్తమభూషణవస్త్రదానాదుల నలరించుచు వీరి నితరు లపహరింపకుండ నన్నుం గావలియుంచి యీసాధనానుష్ఠానంబునకుం దాఁ గడంగినదాదిగా భైరవునికిం బలివెట్ట నుద్దేశించియుండు ధారానగరాధిపతితనూజాతల వంచించి తేఁ బోయి యున్న వాఁడు. వీరల నపహరింప నీతండు పెక్కుమాఱులు సనియుం నిరర్థప్రయత్నుండై వచ్చెను. ఒకమాఱు వచ్చి వీఁడు వటవృక్షంబున నుండునన్నుం దెలిసికొని మహామంత్రవేది యగు టం జేసి మంత్రబలంబున బంధించి యిచ్చోటకుం దెచ్చినవాఁడు. బాహుబలంబునను ప్రతాపంబునను వాఁడు కాలాంతకతుల్యుండు. కరము క్రూరకర్ముండు. పాపాచర ణంబునందు బద్ధదీక్షుండు ఆపాపసమాచారుం డర్చించుభైరవునియాలయంబు నీయెదుటం గనుపట్టుకొండకోనలో నున్నయది. దానికిం బోవుమార్గం బతిగూఢము. ఈచాపతాలి పయిం గొంతదూరం బఱిగి యది డిగ్గం దత్ప్రాంతంబున నొకమహావటవిటపివామ పార్శ్వంబున నాత్రోవ గనంబడును. నీవు మహాబలపరాక్రమసంపన్నుండవు. ఎవ్వి ధంబుననైన నీకాంతాజనంబును రక్షింపం బూనుట పుణ్యంబు. ఈ వెఱుంగనిధర్మంబు లేదు. సమస్తవిద్యలయందు నేర్పరివి. ఏధర్మంబుగాని యాపన్నజనరక్షణంబునకు సమా నంబు గాదు. ఏ మూర్ధ్వలోకంబునకుం జనువారము. మీకు శుభంబు గలుగు. అనుచు నిష్క్రాంతులైరి.

రాజపుత్రుండు. ప్రియవయస్య ! యీవొనరించినయూహయే సమంజసము. ఆ దుర్భగచరితుండగు సాధకుం డెట్టిదారుణకర్మంబునకుం బూనినవాఁడు! ఇట్టిపాపకర్మునిం బట్టి తలగొట్టుట రాజవంశంబునం బుట్టినవారికి యశస్కరంబు గాదె ! ఇప్పుడు మన మిచ్చోట నీకన్యక లుండుటకుం బోక భైరవాలయంబుకడకుం జనుట కార్యాను కూలంబు. అనుచు నిష్క్రాంతులైరి.

రససంజీవననాటకంబునం బ్రథమాంకము సమాప్తము.

---

## ద్వితీయాంకము.

కఠోరకపాలుండు ప్రవేశించుచున్నాఁడు.

కఠోరకపాలుండు. (ఆత్మగతమున.) కట్టా! యేను నీధారానగరాధిపతితనూజాతల నపహరించి భైరవపూజ సమాప్తంబుచేసి యిష్టార్థంబులు వడయ యత్నించి సమయంబు వేచుచు నిచ్చోటనొకనెల జరిపితిని. ఇంతదనుక నుద్యుక్తకార్యంబుజరుగు ననునిశ్చయంబుఁ

లేదు. బహుకాలంబుగ ననేకనగరంబులందు నానేర్పున నసమానరూపవయోవిలాసల నేకాకారల బాల్యంబు వీడి యౌవనప్రాదుర్భావంబునం బొలుపొందువారల వేలకొలంది కన్యకామణుల సంపాదించితిని. ఏఁగడఁగిన యీభైరవార్చనమహాయజ్ఞంబున కిట్టిపశు సముదయంబు దొరకుట కర మాశ్చర్యకరంబు గాదె! రాజకుమారులం బలియిచ్చుచు నీమహాయజ్ఞంబు మగధపతి జరాసంధుండు తొల్లి సల్పినవాఁడు. అది యక్కాలంబున భీమార్జునవాసుదేవులవలన విధ్వస్తం బయ్యె. ఇప్పుడు నాగడంగినకార్యంబునకుం జెరుపు సేయ నాపురహరుండైనను జాలండు. నా కీపాశుపతవ్రతం బుపదేశించినయఘోర ఘంటుండు నాగురువు. నన్నుం జూచి యోరీ! కఠోరకపాల! నీవీకఠోరవ్రతంబు నెర వేర్పం గలవాఁడవు. ఇందుం బశుసముదయంబు విశుద్ధంబుగ నుండంజను. అది కులరూప వయోవిద్యావిశేషంబులఁ దద్దయుం బెద్దయగునేని యుద్దిష్టకార్యంబు గ్రక్కున సిద్ధించు. అందుం బ్రథమోపహారంబుగ నిచ్చెడుకన్నియ లోకోత్తరదివ్యరూపోపేత యై నిరవద్యావయవసౌష్ఠవంబుతో రామణీయకనిధియుంబోలె నొప్పుచుండుగౌరి యనుకన్నెగా నుండవలయు. ఈసంపాదితపశుసముదయంబున నేకన్నెకయందేని సాధకునికి మనోభవ వికారంబు గల్గెనేని తత్క్షణంబునన వానికిఁ బ్రాణాపాయంబు గలుగక మానదు; ఇం దతి జాగ్రతతోఁ బ్రవర్తింపం జను నని నా కాజ్ఞచేసి యున్నవాఁడు. ఇంతదనుక నేవిధ దోషంబును బొడసూపినది లేదు. ఈభోజతనూజాతలు మునులమానసంబులనయితము మరులుగొనం జేయఁజాలినచక్కదనంబున నొప్పెడువార లని వినియున్నాఁడను. దేవతలు నయితము కనుంగొనంగూడని మహావిభవంబున నుండునీయండజగామినుల నేవిధిం గందు? ఏవిధి వారల నపహరింతు? కాలభైరవునికి నాయందు నిజమయినకరుణ గలదేని వీరల నపహరింప ననుకూలసమయంబు దొరకును. ఈకన్యకాతిలకంబులు మహాకవిబాణునికడ నొక్కతెయు భవభూతికడనొక్కతెయు విద్యాభ్యాసంబు సేయుచున్నవా రని విందు. వీరల నేవిధంబునైన వెలికిం దీసికొనిరా మదీయప్రాణప్రియయగు కర్ణకపాల కన్యాంతఃపురమునం బ్రవేశించి యున్నది. అది జరుగుచుండువృత్తాంతంబు వినిపింప రాఁ గానము. గతంబు దెలియదు. అని చింత నభినయించుచుండెను.

అప్పు డొకయెలజవ్వనియగు పువ్వుంబోడి ప్రవేశించెను.

జవ్వని. ఓప్రాణనాథా! ఏల చింతాకులమానసంబుతో నుండెదరు ?

కఠోరకపాలుఁడు. (సందేహించుచు, ఆత్మగతంబున.) ఈజవ్వని యెవ్వతెయో నన్ను నేకతంబుననుండువానిం జూచి మందహాసముతోఁ బల్కరించుచున్నయది. ఇది నన్నుం బ్రాణనాథా! యని పిలుచుట యేలకో యెఱుంగ. పట్టణంబులందు రాజులు వసియించుచోటుల వగలాడులు పెక్కండ్రు పురుషుని వంచించువార లుండెదరు. అందుం జేరినమ్మందయాన యని తోఁచెడిని. దీనితో సంలాపంబుఁ జేసితినేని యీమాయలాడి

సేయుంవంచనావిలాసంబుల కేమటి సంచలితస్వాంతుండ నైతినేని నియమంబునకు భంగంబుగల్గు. కాన దీనితో సంలపింపం బోలదు. అని యొండువలనికిఁ జూచుచుండె.

జవ్వని. ప్రాణనాథ! ప్రాణనాథ! ఏల నాతోఁ బలుకరు? వైళంబ వచ్చి నియుక్తకార్యంబుగతి సెప్పనయితి నని కోపమా? ఇన్ని దినంబులదనుక మీపనిచిన పని యందు జాగరూకతతోఁ బ్రవర్తించుచుంటిని. మనము గడంగినకార్యంబునకు నెల్లి యనుకూలకాలం బని విన్నవింపం జనుదెంచితిని.

కఠోరకపాలుఁడు. (సాసూయముగఁ గనుంగొని.) ఓసీ! నీ వెవ్వతెవు? పూర్వాపరిచితయట్లు మాటలాడెదవు! నేను నీ కొకపని సెప్పి పంపినట్టులు నది యిప్పటి కనుకూలింపం బోవునట్లును బల్కెదవు. నే నింతదనుక నీ మొగంబైనం జూడలేదే! అట్లుండ నొక పనికి నిన్ను నియోగించితిననుట యెట్టిది?

జవ్వని. (నవ్వుచు.) ప్రాణనాథ! ఏల యట్లు వల్కెదరు? ఏను భవత్ప్రియురాల నగుకర్ణకపాలను గానా? నన్ను మీరు భోజతనూజాతలను వంచించి తోడ్కొనిరాఁ బంపియుండుట మఱచితిరే?

కఠోరకపాలుఁడు. (సానందముగ.) ఓసీ నా ప్రాణదయితా! నీవు మాయారూపంబు ధరించియుండుట మఱచితిని. అనవరతకార్యనిర్వహణచింతనంబున నిట్లయ్యె. ఇది యట్లుండనిమ్ము. నీవు సనినకార్యం బేవిధంబున ననుకూలం బయ్యె. విశదీకరింపుము.

కర్ణకపాల. ప్రాణనాథా! ఇయ్యెడ నేకతంబు చిరకాలలభ్యంబు గాదు. కాన సంగ్రహంబుగ నుడివెదను వినుఁడు. ఇయ్యెడ లాలివా రెవ్వరును లేరు గదా?

అని నలుదిక్కులు గలయం జూచి,,

ప్రాణనాథా! యేను మీవలనం బంపువడసి రాచనగరు సొచ్చి యీ యాకారంబున నందుఁ గలదాసీనికరంబుతో మెలంగుచుం గన్యాంతఃపురంబు సొర నను వాగసి మన మాయాదేశంబులందుం జరియించునప్పుడు సంపాదించియుండు నానాదేశ రాజకుమారుల యాకారంబులు గల తెఱంగున లిఖించియుండు కొన్ని చిత్రపటంబులు గైకొని యొక్కనాఁడు రాజతనూజ లుండుగృహంబునకు బహిర్ద్వారదేశంబుననుండి రాకన్యకలు సేయుపరిచారికాజనంబుతో నేఁ జిత్రపటవిక్రయకారిణిని. నానారాజకుమారుల యాకారము లుండుచిత్రఫలకంబులు నాకడ నున్నని. రాజకుమారికలకుం జూపి వార లివి విలుచుకొని యిచ్చినధనసంచయంబులను గైకొని పోవ వచ్చియున్నదానను. నా తెఱంగు మీరలు రాకన్నియలకుం దెల్పి నాయందుం గరుణఁ గాన్పింపుఁ డని నుడివితిని. వార లటి సరళహృదయ లగుకతంబున నా నుడువులు రాకన్నియలకుం దెల్పి తదాజ్ఞావహులై నన్ను వారికడకుం దోడుకొని పోయిరి.

ప్రాణనాథా! ఏమి చెప్పుదును వారలరూపరేఖావిలాసంబులు! సురగరుడోరగ విద్యాధరకాంతలకునైనఁ ముండవని చెప్ప నొప్పును. పులుఁగడిగినముత్తియంబు లమ్మత్తకాశినీతిలకంబులు. ఏను వారలం గాంచినమాత్రాన దేవకన్యకలని భ్రమించి యనిమేషత్వంబు లేమింజేసి మానవకన్యక లని నిర్ణయించితిని. వారలరామణీయకంబు వర్ణించి చెప్ప నిప్పుడు చొప్పడదు. ఇంతదనుక మనము గాంచినరాచపడుచులు వీరిసౌందర్యరేఖ నించుకయేనిం గాంచినవారు గారు. వారు నన్నుం గాంచి ప్రణయపరిపూరితాంతఃకరణంబులతోఁ దమసరసకు రమ్మని కనుసైగ సేయ దాసీజనపురస్కృతనై యేను వారికురంగటకేగి తదాదిష్టనై చిత్రఫలకంబులు పెక్కులు గాన్పించితిని. క్రమక్రమంబుగ ననేక ఫలకంబులం గనుంగొనుచు నాకాంచనాంగులు వసుమానసనగరవల్లభుండగు ప్రతాపాదిత్యునికుమారుం డైనయుదయాదిత్యునాకారంబు గలఫలకంబుం గాంచి మించినయనురాగంబున విస్ఫారితేక్షణలై ఱెప్పవేయక చూచి యతనిరూపంబునకు నాశ్చర్యంబు నొందుచు రూపం బన నిట్లుగదా యుండవలె! నని యనుకొని నన్నుం గాంచి యీ రాజకుమారుం డెవ్వఁ డని యడిగిరి. ప్రతాపాదిత్యునికుమారుం డుదయాదిత్యుం డని చెప్పితిని. ఇంతలో నాయెడ నుండునండజగామినులలో నొక్క పుండరీకపత్రాక్షి సత్వరంబుగ వచ్చి యాఫలకంబునం గాంచి మాభర్తృదారికల మేనత్తకుమారుఁ డుదయాదిత్యుం, డాతం డటే యిందుఁ జిత్రింపంబడియుండువాఁడు! ఔరా! ఏమని పొగడందగు నితని సౌందర్యంబు! మన్మథుండును వసంతుఁడును వీనికొనగోటికిని సాటిరారు. వసుమానసనగరంబునుండి యీ ధారానగరంబునకుం రాకపోకలు సేయుజనంబులవలన నతనినిరవద్యరూపరేఖాదుల వినియున్నవారము. ఇది యెందుకుం దగియున్నది. అనఁగాఁ దక్కుంగలవారలు కన్యకాంతఃపురనివాసిను లెల్లరు కడుం బ్రియంబు మెఱయ ననుదెంచి కాంచి యీ ఫలకంబు నిలుచుకొనుమని రాజతనూజలం బ్రార్థింప వారలు లజ్జావనతవదనలై యిన్నకుండఁగా దాసీజనులు కొందఱు బరువిడి లీలావతికి విన్నవించి యా ఫలకం బాదేవికిం గాన్పించి యా యుదారహృదయ యిచ్చినపారితోషికధనంబులు నాకొసంగి యా చిత్రఫలకం బారాకన్నియలకు దేవి యిమ్మన్నదని యిచ్చిరి. అంత నేను రాజసుతల వీడ్కొని వెడలిపోవ సమకట్టితిని. రాజపుత్రికలు నన్నుం గాంచి యోగిమించు బోడీ నీ వీయెడకు నిచ్చవచ్చినప్పుడు రావచ్చును, పోవచ్చును, మాకడ నిలువవచ్చును. అని చెప్పఁగా నేను వారికి రాజకుమారునాకారంబుం గాంచినదాదిగ మెయిం బులకలు గ్రమ్ముటయుఁ గంపంబు సర్వాంగసంగతం బగుటయుం గనిపెట్టుచున్నదానం గాన వీరిరువురు నొండొరులం బాసి యుండు వేళల వచ్చితినేని వీరిసఖ్యంబు సంపాదింపవచ్చును. దాన నుద్దిష్టకార్యంబు సాధించుటకు సందియంబుండదని యెంచుచు నానాఁ డాయెడ వాసిపోతిని.

కతోరకపాలుఁడు. ప్రాణవల్లభా! ఈవు పూనినవెరవు కరము ముఱియైనదియ. నీ బుద్ధికి మెచ్చితిని. అనంతరం బెట్లు వారిసఖ్యంబు సంపాదించితివి.

కర్ణకపాల. ప్రాణనాథా! రాచకన్నియల కిరువురకును రాకొమరునిదర్శనంబుం దొట్టి వలపు జనించి యంతకుందొలుత నొక్కనిమిషం బైన నొండొరుల నెడబాసియుం డనివారి కేకాంతం బాకాంక్షితంబగుట మానసంబున నెఱింగి సమయంబు వేచి వార లొంటరిగ నుండం బోయి మాటలసందున నుదయాదిత్యుని ప్రస్తావంబు ప్రసక్తంబు గావించి లజ్జవలన వార లడుగక పోయినను వారిమనోవృత్తి యెఱింగి యుదయాదిత్యుని గుణగణంబులు వర్ణించి చెప్పుచు నిరువురకుం బ్రాణసమాననగుసఖి నైతిని.

కఠోరకపాలుఁడు. ఓసి నీవు ప్రాణాపహారిణియగు సఖి వని నుడువం దగియుండ బ్రాణసమాన యగు సఖి వనుట యొప్పునే? అనంతరం బేమయ్యె?

కర్ణకపాల. ప్రాణనాథా! విద్యాభ్యాసకాలంబునం గాక తక్కుంగలసమయంబులందు సంతతము మనితరసఖీజనులనువదలి వారలేకతంబున మద్వార్తాశ్రవణకుతూహలంబుతో నుండుదురు. ఏనును శాకుంతలాదులగు నితిహాసంబుల నన్యపరంబులగువాక్యంబులం బ్రస్తాపించి చెప్పఁగా వారలు నాతోడలపయుం దమయంగకంబు లర్పించి చింతాస్తిమితలై కొంతకాలంబు గడపుచుండుదురు.

కఠోర కపాలుఁడు. ఓసి! నీపంచ నాప్రణయం బంచితరీతిం గాంచినయది.

కర్ణకపాల. ప్రాణనాథా! వినుము. ఇట్లుండ నొక్కనాఁడు వారు నన్నుంగని మాకుం జింతితార్థంబు నీకూర జగదంబికాప్రసాదంబ సాధకంబు; తత్ప్రాప్తి యెట్లగు? అని యడుగ నేను దేవీప్రసాదంబు తదర్చనంబునం గాక యితరంబుచే గలుగ దని నుడువ నందుకు వార లాడంబడి తదర్చనావిధానం బడిగిరి. నేను వారికి భృగువాసరంబులందు సంధ్యాసమయంబుల భువనేశ్వరీదేవాలయమునకుం జనుదెంచి దానిపెనుక నుండు కమలసరోవరంబునం దానమాడి స్వకరాపచితంబు లైనకమలంబుల నాఱిట నాదేవి నర్చించి మజ్జనధూపదీపనైవేద్యాదు లర్పించి సంస్తుతులు సల్పుచుండ ననతిచిరకాలంబునన యిష్టార్థంబు సమకూరును. అని యుపదేశించితిని. వార లావ్రతము సేయం గడంగినవారు. ఎల్లి శుక్రవారంబునఁ బత్తనబహిస్థలంబున నుండుభువనేశ్వరీ దేవాలయంబునకు రాఁబోయెదరు. ఈశ్వరీసన్నిధానంబున మదేక సహాయలై యేకతంబ యుండురు గాన వారల నపహరించికొనిపోవ మీకు ననువు పడును. జాగరూకతతోఁ బ్రవర్తింపం జను. అతిప్రణయంబుచే నొకత్రుటి నేను విళంబనము సేసినను వారు చిత్తస్వాస్థ్యంబు దప్పియుందురు. కార్యంబు సాధించుదనుక నాప్రణయంబునకు భేదంబు గలుగనీక ప్రవర్తింపం జనును. ఏఁ బోయివచ్చెదను. మీరు కార్యనిర్వహణంబునం దతి జాగరూకతతో నుండుఁడు. అని నిష్క్రాంతులైరి.

## శుద్ధవిష్కంభము

నేపథ్యంబునంగలకలంబు.

అంత గాఢమూర్ఛాక్రాంతయగు విరజాంబుజను జేతులందుధరించుకొని రాగసే నాప్రముఖులగుకొందఱుదాసికలు ప్రవేశించిరి.

రాగసేన.( శోకంబుతో సత్వరముగ.) అయ్యొలు ! అయ్యొలు ! ఓసి తరంగవతి ! ఓసి కామజన్యా ! ఓసి సురోచీ ! మనభర్తృదారికలకు ఏమిమహావిపత్తు సంభవించెనే! కటకటా! యేమిసేతునే? తరుణాంబుజగతి యేమయ్యెనో తెలియలేదే! భువనేశ్వరీసన్నిధానంబునం జూడుండు. ౨.

తరంగవతీ, కామజన్యా, సురోచు లురంబుఁగరంబుల మోఁదుకొనుచు ససంభ్రమంబుగ నేపథ్యంబులోనికిం జని వెండియుం బ్రవేశించి చేతులు పిసికికొనుచు,

ఓసీ రాగసేనా ! తరుణాంబుజ భగవతీసన్నిధానంబునం గనంబడలేదు. ఏమిసేయుందుమే !

రాగసేన. తరుణాంబుజ లేనేలేదటె! కలయం గాంచితిరే ! ఇది యేమియచింతితోపనతమగుకష్టము. ఓసీ ! ఆక్రొత్తమాయలాడి రాజకుమారుని చిత్రఫలకంబుం గాని పించి మనము లేనప్పుడు వచ్చివచ్చి వంచనాప్రణయంబుం జేయుచు వీరల వశగతలం జేసికొని యీాయనర్థంబు పుట్టించినది; అనంగసాచియైన నున్నదటే?

కామజన్య. ఓసీ ! అంతటం గాంచితిమి. ఎవ్వతెయుం గానఁబడదు. ఏమిసేయ తగునే!

రాగసేన. కటకటా! తరుణాంబుజ నెవ్వరో వంచనమున నపహరించి రని తోఁచెడిని. ఆహా ! ఏమిఘోరము సంభవించె! ఏగతి నీవిపత్సముద్రంబు దాఁట సగును? ఇంక మన మిప్పుడు జంపు నేసిన నుపయోగంబు లేదు. రాణియగులీలావతికిని రాజునకును వృత్తాంతం బతివేగంబునం దెల్ప నశ్వారోహకులం బంపుము త్వరపడుము.

కామజన్య. ఓసీ యిదె పంపెద (నని నేపథ్యంబులోనికిం జని వెండియుం బ్రవేశించి) రాగసేనా! కన్యకలకు గాఁపుగా వచ్చి దేవాలయబహిర్ద్వారంబున నుండునశ్వారోహకుల నిరువుర నొక్కని రాజునకును మఱియొక్కని రాణికిని వృత్తాంతంబు విన్నవింపం బంచితిని. ఇక్కడనయున్నట్టులుఁగ బోడొక్కని రమ్మంటిని.

రాగసేన॥ ఓసీ ! కామజన్యా ! భగవతీసన్నిధానంబునను దక్కుఁగలచోటులను గలయ నన్వేషింపుఁడు. తరుణాంబుజం గనిపెట్టుఁడు? ఈవిరజాంబుజ గాఢమూర్ఛాక్రాంతయై యున్నది. దీనిం డించి రాననువుపడలేదు. ఆకుమారిక యతిభీతహృదయ. ఏమయ్యెనో ! గ్రక్కున నందఱును గూడియన్వేషింపుఁడు.

కామజన్య. ఓసి భ్రమప్రమాదంబులు లేక వెండియు వెదకెదము. రాజకన్యక దొరకిన నింతకంటె మహామోదంబు గలదే! అని నిష్క్రమించుచున్నయది.

రాగసేన. భర్తృదారికా! విరజాంబుజా! విరజాంబుజా! (అని పిలిచి.) కట్టా! భర్తృదారిక గాఢమూర్ఛాక్రాంత యయి యున్నయది. ఏమి సేయుదు.

నేపథ్యంబునం గలకలంబు.

సురోచి. (పురోభాగంబునకు నిక్కి చూచి.) ఓరాగసేనా! ఇదిగో భోజభూపతి తనకుమారికలకుం గలిగినవిపత్తు విని ససంభ్రమముగఁ బాదచారియై మహాకవి బృందంబుతోను బుద్ధిసాగరునితోను భువనేశ్వరీదేవాలయపురోభాగంబునం గూడికొన్న లీలావతీదేవితోడ నేఁగుదెంచుచున్నవాఁడు.

అంత యథానిర్దిష్టులగు భోజలీలావతులు ప్రవేశించిరి.

లీలావతి. (త్వరితగతింజని, రాగసేనచేతులనుండి విరజాంబుజను దనయంకతలంబునకుం దీసికొని, శోకంబుతో.) ప్రియసఖి రాగసేనా! తరుణాంబుజను బోఁగొట్టికొంటిమటే? ఈవిరజాంబుజయైనను జీవించునే! అని బాష్పధారాకలితకపోలయుగళ యయి విరజాంబుజసర్వాంగంబులు స్పృశించుచు శోకభారంబు వెగ్గలంబుగా గద్గదకంఠయై. ఓసిరాగసేనా! ఈవిరజాంబుజకు నిశ్వాసంబువెడలుటయులేదు. ఇది జీవించుట దుర్లభంబనితోఁచుచున్నది. దీనియాకారంబైనం గనంబడుచున్నది. తరుణాంబుజయాకారంబును గనంబడదు. మహారాజాం గాంచి. ఈకన్యకారత్నంబులు మనబోటిభాగ్యహీనులకుండున వియే? (విరజాంబుజచుబుకంబు నెత్తి.) ఓసీ! నాజీవితనిబంధనమా! తల్లి యనునాసచేనైనఁ గన్నులు దెఱచి చూచి యొకపలుకు పల్కుం జనదా! నీ బహిశ్చరం బగు ప్రాణంబు వోయినదని యాలోకంబును గనుంగొన నీసడించుకొనియెదవో? పట్టీ! నీకు నీతండ్రికడ నాకంటె నధికముగు మాలిమి గదా! తల్లీ! బాష్పాయమాణేక్షణుండై యొక పలుకు పలుకుటకును గంఠంబురాక మోర్లి నిలువంబడియుండునీజనకునికైనఁ గనుదమ్ములు విప్పి చూడవా! నీవు జనకవత్సలవు గదటే!

సహజన్య. (ప్రవేశించి.) ఆర్య! బుద్ధిసాగర భవదాదిష్టు లయినరాజభటులును గూఢచారులును నగరంబు నంతయును బహిరుద్యానంబులను గలయ నన్వేషించి తరుణాంబుజం గానక వృత్తంబు మన్ముఖంబుగ నీకు విన్నవించుకొనుచున్నవారు.

భోజుఁడు. (మహాశోకంబుతో.) హా తరుణాంబుజా! మమ్ము విడిచిపోలివటే! నీ వే గతివట్టితివో యెఱుంగంబడదు! మీరు పుణ్యశీలలరు. మాయొనరించినమహాపాపపు ఫలంబు మిమ్ము నిట్టు లొంచర్చె ఓజగదంబికా! భువనేశ్వరీ! మాయం దిందనుక నీకుం గృప యుండినది. నాబాల్యంబున ముంజునిదుర్ణయంబుచే వత్సరాజు నన్ను శిరంబుద

ఉగఁ గడఁగ నాతనిమాంసంబునం గరుణవుట్టించి రక్షించితివి. అట్టియానీనిర్హేతుకం బగు కరుణ నాయందిప్పుడు లేకపోవుటకుం గారణం బేమొకో? అనవరతము భవత్పాదకమలవందనంబునందుఁ బ్రవణుండనై యున్నాఁడను. నీ ప్రోలన నీశిశువులకుఁ గడు ఘోరంబగు నాపద గలుగ నొప్పరికించి యుండెదవు. భక్తజనరక్షణదీక్షిత వైననీవ యుట్లూరకుండ మా కింకేమి గతి యున్నది.

లీలావతి. (శోకబాష్పంబులు దుడుచుకొని, రాలుపడుకంఠస్వరంబుతో.) ప్రాణనాథ! మనకుం గల రెండురత్నంబులలో నొక్కటి పోనేపోయెను. మఱియొక్కటియైన దక్కునను నాస గనంబడదు. ఇంతతడ వయ్యె నిశ్వాసంబును వెడలదు. ఇది యిట్టి కఠోరదశావిపర్యాసంబునకుం బాత్రం బగునట్టిబెట్టిదంపుటులు కేమిపుట్టెనో? ఏపాపాత్ముండేకఠోరకర్మంబు గావించెనో? ఈరత్నంబునుసయితము గోలుపోయి భూమిపయి జీవించుట యేల!. (అని మూర్ఛాక్రాంతయై యిలకు వ్రాలెను.)

భోజుండు. (దేవినాదుకొని కన్నీరువిడుచుచు,) ఓదేవీ! యూరటం జెందుము. ఊరటం జెందుము. మోహముఁగాంచి. దేవియుఁ నపత్యశోకంబున నస్తంగత యయ్యెనని తోఁచెడిని. ఓదేవీ! ఓదేవీ! అనిపిలిచి. ఎంతబిలిచినను బలుకక యున్నది. ఒక్కక్షణం బపత్యశోకంబున కోర్వంజాలక యీదేవి యిట్లయ్యె. హా! యే నెంతకఠినాత్ముఁడనో? అపత్యశోకంబును భార్యాశోకంబును గలిగియుం జీవించియుండెద. నలువ శోకభారంబునకుం జోటులేక నన్ను సృజియించెం గాఁబోలు! కాదేని యీకఠోరదశాపరిణామంబున శరీరంబువాసి పోవలసినప్రాణంబులు హృదయంబున వజ్రకీలలచేఁ గీలితంబు లట్ల దృఢంబులై యుండునే? అప్రతివిధేయంబైనయీయతిసంకటంబున నాకు శరణంబు మరణంబ.

అని తానును మూర్ఛాక్రాంతుండై యిలపయికి వ్రాల బుద్ధిసాగరుండు రాజును దనయురంబున నానించుకొనెను.

రాగసేనయు సహజన్యయు సురోచియుం రాజునకును రాణికిని విరజాంబుజనును శిశిరోపచారంబులు కొన్నియొనరించిరి.

బుద్ధిసాగరుఁడు. భోజకుమార! భోజకుమార! ఇంచుక శోకంబు సంబళించుకొనుము (. మొగంబుం(గనుంగొని. ట్టా గాఢదుఃఖవేగసమాక్రాంతుండై యీకుమారుండు కరము దురవస్థం జెందియున్నాఁడు. అహో! దైవంబు సల్పుకఠోరకృత్యం బేమందు? ఈధారానగరవాసులకుఁ గ్రమక్రమంబున నఖిలసుఖములు నొసంగి యొక్కప్రెల్మిడి నన్నియుం హరించె. ఎల్లి రాజకుమారుండు సింహాసనం బలంకరింపకున్నం బౌరజనానీకంబు వృత్తం బారసి మహాశోకసముద్రంబున మునింగి ప్రాణంబులు సయితము పరిత్యజింపం

గడంగుట నిస్సంశయంబు. ప్రకృతులకష్టసుఖంబు లారసి ప్రజలం దన ప్రజలరీతిం బాలించుచు సర్వకాలము తదీయసుఖంబు తనసుఖంబుగా భావించి సాధుసమాదరంబును దుష్టనిగ్రహంబును సలుపుచునుండెడు రాజపుత్రుం డీతనిం బోలెఁ గలఁడా? కవివరులకుం గనకధారావర్షంబులు గురియుఘనాఘనంబు వేఱొండు గలదే! విద్యల కాశ్రయంబు లేకపోవునే! సింధులుండు వృద్ధరాజు తనపుత్త్రునిం జూచుకొను మని చెప్పి పోయెనని కంటికి రెప్పవలె సర్వావస్థలం గాంచి పెంచి పెద్దచేసి యేడవయేటన ముంజాందును నావశంబున నొప్పగించి పోవ రాచఱికపుంబనులయందు దిద్ది తద్దయుఁ బెద్దచేసి యితని నీడన గాలంబు గడపవలయుం నని యనుకొనుచు బాల్యదశయంద సమానరూపకులవిద్యావయోవిలాస యగునీలీలావతిం బెండ్లిచేసి తదనురూపంబుగ రెండుకన్యారత్నంబులు సకలభువనజన స్తవరపాత్రంబులై యుదయించుటకు మహానందాంబుధిం దేలుచున్నందుకు నా కీకుమారుని నిట్టిదశయందుం జూడవలసినట్లయ్యె. ఎంతపాపంబుఁ జేసితినో! వీర లిట్లైన నెల్లి యెవ్వరి మోము నే నెట్లు గాంతును. హా! ఏమి సేతును.

అని మూర్ఛాక్రాంతుండయి భూమిపయి కొఱగిన నాగసేన యాతనిం బట్టుకొనియెను. కామజన్యాదులు సేయునది లేక విలపించిరి.

[కాళిదాసభవభూతిదండిభట్టబాణప్రభృతులగు మహాకవు లొండొరులు మొగంబులు సూచుకొనుచుం గొంతతడవు పూరకుండి యాత్మగతంబున నిప్పు డీయెడరు దప్పించి రక్షించునది భువనేశ్వరీప్రసాదంబు గాక యితరంబు గాదని తలంచి యాదేవిని సంస్తుతించిరి.]

కవులు.

గీ. భోజకులదేవతా! దేవి! పూజ్యచరణ, సకలకవిజనకల్పకసాలు మిట్లు
బిట్టు దురవస్థఁ బొరయ నుపేక్ష చేసి, యుండఁ బాడియె నీ కిట్టిఖండవిభవ.

గీ. భక్తపాలనదీక్షాప్రసక్తిఁ గాంచి, దుష్టజనశిక్షణమున నుద్ధురబలంబుఁ
జూపె లోకంబులకుఁ గడు శుభము లొసఁగు,నీవుపేక్షింపదగునె యోనీరజాక్షి.

నేపథ్యంబున మహాఘోషంబు గల్గిన నందఱును దిరిగి చూచి,

ఔర! యీదేవతాభవనంబునందు భువనేశ్వరిపావకమలారాధనం బనారతము సేయుచు దేవతానైవేద్యాదిభోజనంబులం గాలంబుఁ గడుపుచుండెడు నొకవృద్ధకాంత భూతవిశేషములు నక్షివివర్తనంబులు గావించుచు భూతావేశంబుం బొందినచందంబున నతితీవ్రావష్టంభంబుతో నొత్తిలుచు మహాహాసంబుఁ గావించుచు దేవగానంబు పాడుచు నియ్యెడ కేఁగుదెంచెడిని.

అంత యథానిర్దిష్ట యయి వృద్ధకాంత ప్రవేశించెను.

వృద్ధకాంత. ఓమహాకవులార! మీర లీపరదేవతార్చనోపయుక్తం బయిన యీ తీర్థంబును వీరిమోములం బ్రోక్షించి కన్నులు దుడిచి తచ్చరణకమలపూజానిర్వర్తనప్రశస్తంబులగు నీకమలంబులు వారలయంగంబుల నిడిన మూర్ఛదేరుదురు.

అనిన విని కవులు ససంభ్రమముగ నాయమ యందిచ్చుతీర్థంబును గమలంబులును గైకొని తదుక్తప్రకారంబుఁ గావించిరి.

విరజాంబుజా, లీలావతీ, భోజ, బుద్ధిసాగరులు మూర్ఛదెలిసి లేచిరి.

వృద్ధకాంత. ఓవత్సా ! ఓభోజకుమారకా ! నీకుం గలిగినయీయెడరునం దీవును ద్వదీయులగు నీమహాకవులు నొనరించినసంస్తవంబుల కలరి భువనేశ్వరినగు నే నీవృద్ధకాంతపై నావేశించి మీభయంబుం బాపి శుభం బొనగూర్ప వచ్చియున్న దానను. నీకుం గులదేవతనై మీయోగక్షేమంబు లారయుచుండుదానను.

అనిన విని లేచి కృతాంజలులై యాదఱు నాయమ్మకుం బ్రణమిల్లిరి.

వృద్ధకాంత. ఓవత్సా ! భోజకుమార! నీవు నీసుతయగు తరుణాంబుజకొఱకు దుఃఖింపకుము. నన్ను భక్తిభావంబునం బూజలొనరించినవారికి శుభంబులు గల్గు. మహాసంపదలకు ద్వారంబు లాపదలు గాన నీకూఁతు రవి యనుభవింపవలసియున్నది. తదీయసంరక్షణంబున నేను కర మాదరంబునం బ్రయత్నించుచున్న దానను. మీ కిలువేల్పు నగుటం జేసి మీభరణరక్షణంబులు నాపనియై యున్నయవి. మదర్చనంబు నిరర్థకంబై పోదు. నీకూఁతురు తరుణాంబుజ విపత్సముద్రంబుం దరించి దిగంతవిశ్రాంతం బగుయశంబు సంపాదించి కాళిదాసునిసహాయంబునఁ దనయభీష్టార్థంబు వడయును. దానికై యించుకేనియుం జింతం గూరకుము. అది మీయింట నున్నట్టుల దలంచుకొనుము. విరజాంబుజం దోడ్కొని యింటికిఁ బొమ్ము. ఈకుమారికయుం సహోదరీవిరహదుఃఖంబు నించుకేని యెంచం జనదు. అట్ల యీదేవియుం నుండం జనును. మీర లేయేబందుగులైయుండువారలే మేమి గావింపం గలరు; ఆయావిధానంబు లాకుమారిక కే జరిపెదను.

అని చెప్పి యొడలువిఱుచుకొనుట మొదలగువానిని మానుకొని యూరకుండె.

బుద్ధిసాగరుఁడు. ఓభోజకుమార! ఓతయమ్మతీ! దేవీ! సింధులవంశంబున నీయంబిక కెంతప్రీతి యున్నదో! గనుగొంటిరిగా! మనబిడ్డలు మఱకడ నన్నును రక్షింపఁగలది యీజగదంబికయే గదా! ఆభగవతియె యిప్పుడు మనతరుణాంబుజను రక్షింపం బూని యున్నచో నాకుమారికనుగుఱించి మన మేల చింతింపవలె! నిస్సమం బగుయశంబు వడయుటకె యిట్టియాపద యాకన్యక కయ్యె.

భోజలీలావతులు. ఆర్య బుద్ధిసాగర! భవదీయంబగు నీతిమార్గంబునం బ్రవర్తించు చుండుటం జేసి రాజ్యసుఖంబులును బ్రాహ్మణులయాశీర్వాదంబులకలిమిం జేసి యీ జగన్మాతృదయావిశేషపాత్రతాజనితసంతోషములును మాకు సంతతవితతంబులై జరుగుచున్నవి.

బుద్ధిసాగరుఁడు. అయ్యుష్మతి! బ్రాహ్మణానుగ్రహంబు వడయుఁవారల కలభ్యంబులును గలవే! కుమారికలకు మహావిపత్ప్రాప్తి యయ్యె నని విన్నమాత్రాన నేమియుం దోఁచక యార్తిం బొరయుచు నతివేగంబునం బరువిడివచ్చుభోజకుమారునితో నున్మత్తునిభాతి యేను వెనువెంటం బరువిడి వచ్చితిని. రాజకార్యనియుక్తులగు నియోగిజనులు వారివారియిండ్లకుం జనుటకు మన్నియోగం బాకాంక్షించుచు వేచియుండుదురు. వారల ననుప గ్రక్కునఁ బోవలయుం. ఇదె యీభువనేశ్వరీమందిరంబునెదుట సారథి యరదం బాయత్తంబుచేసి కొనితెచ్చి యున్నవాఁడు. మీరలు భువనేశ్వరీపాదవందనంబుఁ గావించుకొని రథారూఢులై మెల్లన యింటికి రండు. ఏను ముందుఁ బోయెదను. (అని నిష్క్రాంతుండయ్యె.)

భోజుఁడు. ఓసి రాగసేనా! ఈకుమారిక లిప్పు డిచ్చోటకు రాఁగతం బేమొకో? ఇట్టి మహావ్యతిక్రమంబు జరుగుటకుం బెఱయతివ యెవ్వతెయొ మీతోఁ గలసియుండ వలయును! అయతివ సిద్ధకాంతగా నుండం జనును గాని సాధారణకామినియై యుండదు. జరిగినవృత్తాంతం బంతయు సవిస్తరముగఁ జెప్పుము.

రాగసేన. మహారాజ! విన్నవించెదను. కొన్నిదినంబులకుముందు నానారాజకుమారులయాకారంబులు లిఖించినచిత్రఫలకంబు లమ్ముకొన నొకయింతి వచ్చి భర్తృదారికల నిరతిశయప్రణయంబు సంపాదించి యనారతము వీరలఁ బాయక మెలంగుచుండె. దాని చేష్టలు ప్రత్యక్షపరోక్షంబుల విభిన్నంబులైయుండుట యారసి యిది కపటవధూటియని యెంచియుఁ భర్తృదారికల కెఱింగింప సమయంబు దొరకమి వేచియుంటిని. ఏ నీదినంబున దేవికడ నున్నవేళఁ గుమారికాప్రేషితయై యాకామజన్య దేవికిం బ్రణమిల్లి భర్తృదారిక లీదినమున భువనేశ్వరికి నష్టోత్తరశతశతపత్త్రార్చనము సేయం దలంచి మీ మదల కెదురుచూచెద రని విన్నవింప దేవి యంతదనుక నేకార్యంబును న న్నడిగియే యొనర్చునది యిది యేమంత విచారణీయమా! యని యనుకొనికాఁబోలు నన్నడుగకయ యాజ్ఞ యొసంగె. ఏనును భర్తృదారికలు సేయుశతపత్త్రార్చనంబుఁ గనుంగొన నాసయయ్యెడుమని దేవి నడిగి యతిశీఘ్రగమనంబునం జనుదెంచి యీదేవతానిలయంబుమ్రోలన వీరితోఁ గలసికొంటిని. కుమారిక లిరువురును మజ్జనంబాడి స్వకరాపచితంబులైన శతపత్త్రంబులు దెచ్చి యునిచి ధౌతాంబరాద్యలంకృతలయి మ మ్మెల్లవారిని వెలుపలన యుండంబనిచి తద్వ్రతోపాధ్యాయినియైయుండు నాకపటవధూటితో సంవిదానన్నిధిం బ్రవేశించిరి. కొంతతడవునకు "హాసఖులార! రక్షింపరే! రక్షింపరే!" యనుభర్తృదారికలయార్త

నాదంబు వినంబడిననంతరము మున్న సంశయాకులాత్మనైయవనికాభ్యంతరంబున నప్పుడప్పుడు గాంచుచున్నదానం గానఁ దక్షిణంబ లోనికిం బరువిడితిని యమకింకరునివంటి వాఁడొక్కరుండు విరజాంబుజం బట్టుకొని సరభసంబుగ నేగుదెంచుచుండె తద్దర్శనంబున నేను మహాభయాక్రాంతనై నిల్వలేక యిలకుం ద్రెళ్లుచు నింతలో నేఁ జని పట్టుకొన మదీయ హస్తగత యైనదాని నపహరింప జాలక యాకాశమార్గంబునం జనియె. తరుణాంబుజయు విరజాంబుజచందంబునఁ గడుభయంబుఁ జెంది సత్యమగుసఖి యని నమ్మి యా యుపాధ్యాయినిని రక్షింపవే యని యాలింగన మొనరించుకొన నది దానిం జేరందీసికొని భయంపడకు మని యూరార్చి తత్క్షణంబున నవ్వలికిం దోడ్కొనిపోయె. ఏను విరజాంబుజను విడిచినచో నాఘోరకాయుండు దీని నపహరించుకొనిపోవునని తరుణాంబుజం బట్టుకొననైతిని. తరుణాంబుజ నాకుం దవ్వుగనుండుటచేత, ఘోరకృత్యంబున నాయింతి యుం జేరిన దని హృదయంబునకుం దోఁచకపోవుటచేతను, దానిని భర్తృదారిక కౌఁగిలింపఁగానే యాపురుషుండు దొలంగుటచేతను నేను విరజాంబుజకుంబోలె తరుణాంబుజకు నాకాంత రక్షకురాలయ్యెనని తలంచి అరనిమిషంబునం జరిగిన యీయనర్థంబునందుఁ బరులఁ బిలువ నోరెత్తకుంటిని. వెండియు సంశయించుచుం బిలిచితిని. తరుణాంబుజను వెదకించినం దొరకలేదు. ఇదియె నాయెఱింగిన యర్థంబు. అయ్యెడ వీరల కింతభయంబు గల్గుటకుం గారణంబు నాకు నవగతంబు గాదు. ఈభర్తృదారిక యెఱింగియుండంజనును.

భోజుఁడు. పట్టీ విరజాంబుజా! అయ్యెడ మీర లిట్లు భయంపడుటకుం గారణం బేమి? తెల్పం గలవే!

విరజాంబుజ. తండ్రీ! ఆమహాఘోరంబు తలంపునకు వచ్చినను భయంబు వొడముచున్నది. ధైర్యంబుం గొని చెప్పెదను వినుము. నే నొకింత యెడగలుగ నిలువంబడి యార్యతరుణాంబుజకు నర్చనావస్తువు లందిచ్చుచుంటిని. ఆయుపాధ్యాయుని మంత్రంబుల పఠియించుచుండె.

ఇట్లుండం గొంతతడవునకు నయ్యెడ మాకు మహాక్రూరగహనంబై కనుపట్టె ఉపాధ్యాయుని నడిగిన 'నేమియుం గానమే! మీకు భ్రమ మేమో' యని యనియెను. మఱియుం గొండొకతడవునకు సింహవ్యాఘ్రభల్లూకతరక్షుఖడ్గగజవరాహసూకరప్రముఖంబులగు నారణ్యకజంతువులు భయంకరంబులగు నోళ్లు దెఱచుకొనియుం దొండంబులు విసరుకొనియుఁ గొమ్ము లొడ్డుకొనియుం ఘుర్ఘురించుకొనియుం బయికింగవిసెను. అప్పుడ యొకవంక రక్తంబులు నించిన నరశిరఃకపాలంబులు నేతం బూని భూతభేతాళశాకినీఢాకినీప్రముఖంబులతిఘోరాకృతులు నర్తనంబు సలుపుచు మాపయిం బడవచ్చెను. మఱియొండువైపున నింగిముట్టు పోతుకరళ్లతో మహాభీలంబై ప్రళయపయోనిధియో యనఁ బయోధి పొంగి వచ్చుచుండెను. మే మప్పటికి నేయుండది తోఁచక భయసంభ్రమంబులం బొర

యుంచుఁ దత్తరింపం గడంగితిమి. అయ్యవసరంబున నాయాలయపునొకమూలనుండి యమకింకరాకారుం డొక్కరుండు వెడలి ప్రచండతరవేగంబునం దరుణాంబుజం బట్టుకొనం బోయిన నది కడు బెగడి ప్రక్కన నుపాధ్యాయునిం గౌఁగిలించుకొనియె. నన్నుం బట్టుకొన వచ్చిన నేను తత్తరపడుచుం జేయునది లేక సఖులారా! రక్షింపరే! రక్షింపరే యని యార్తనాదంబుఁ గావించుచు నాచేయి యందుకొనంబోవు నాభయంకరపురుషునికిం దొరకక చేతులు విదిలించుకొని యింతలో వచ్చినరాగసేనచేతుల నాయొడలు భయవేగంబున మూర్ఛాక్రాంత నయితిని.

భోజుఁడు. ఆహా! దేవి లీలావతీ! యేమికఠోరసందర్భంబు. ఎవ్వండో కఠోరకర్ముఁడగు సాధకుండు మనతనూజాతల నిరువురం గొనిపోవ సమయంబు వేచి తనపత్నికి నాఁగరిక కాంతాకారంబు దాల్పం బంచి దానిం గొని వీరి నియ్యెడకు రప్పించి యింద్రజాలంబు సూపి భయపెట్టి తనకార్యంబు పూర్ణంబుగ ఫలియింపక తరుణాంబుజం గొని చనెను. కులక్రమాగతు లగుదాసదాసీజనుల నుపేక్షింపం జన దనియుఁ గ్రొత్తగ వచ్చిన వారిం జేర్చుకొనఁ గూడదనియుఁ బెద్దలు సెప్పుటకు ననురూపంబుగఁ బ్రవర్తింపం జనును.

లీలావతి. ప్రాణనాథ! మనతరుణాంబుజ యాకఠోరకర్మునిచేతం జిక్కువడి యెట్టి కష్టంబు లనుభవించుచుండునో! ఏమి సేయ దీని నపహరించెనో ?

భోజుఁడు. దేవి ! లీలావతీ ! ఆయర్థంబులెల్లఁ ద్రవ్వి త్రవ్వి పరితపింపనేల? భగవతి భువనేశ్వరియె తద్రక్షణంబునకుం బూనుకొనియున్నది. తత్పాదవందనంబు సలిపి యింటికిం జని తదీయక్షేమంబుఁ గాంక్షించుచుందము. పోవుదము రమ్ము.

అనుచు నందఱునిష్క్రాంతులైరి.

రససంజీవననాటకంబున ద్వితీయాంకము సమాప్తము.

---

## తృతీయాంకము

వనంబున నొక యశోకపాదపముక్రిందఁ గూరుచుండినతరుణాంబుజ ప్రవేశించుచున్నది.

తరుణాంబుజ. వెక్కివెక్కి యేడుచుచు. కట్టా! ఒక్కప్రేల్మిడి నెట్టిదురవస్థకుం బాల్పడితిని. ఈపాపపుంబడంతిని బ్రియసఖి యని నమ్మితిని. దీనిఘృతమధుమయాము లగు వచనములు వింటిని. ఆహా ! ప్రాణసమాన లగుసకియల నందఱ ననాదరించితిని. నావిధి వైపరీత్యంబున దుష్టబుద్ధి నాకుం జనించినయది. నేను భయంపడి కౌఁగిలించికొన నన్నూరార్చుచు నవ్వలికిం గొనిచనినంతదనుక నిది ప్రియసఖి యనియే యెంచియుంటి.

తత్క్షణమున నన్నుంగొని యాకాశయానంబునఁ జనం దొడంగుడు నిది కపటవధూటి యనియెంచి ఇది పిశాచియొ యక్షిణియొ సిద్ధకాంతయొ యని చింతించుచు వెండియుం మించుచుండిన భయంబున నార్తిం జెందుచుం జేయునది లేక యిది నన్నుం బ్రాణములు దీయం గొనిపోయెడు నని నిర్ణయించుకొని దానితోఁ బలుకుటకు వెఱచి రాదగునది రాకమాన దని గుండె రాయిచేసికొంటిని. చనినరాత్రి యంతయుం నన్ను మోసికొనివచ్చి యీవనంబున నియ్యెడ నుండుమని డించి దూరాగమనప్రయాసంబు నాపుకొన నా పాపపుంబడంతి వోయినయది. అది వచ్చిన న్నేదురవస్థం బట్టింపఁబోయెడినో యెఱుం గను ఓభువనేశ్వరీ! జగదంబికా! భవదీయపాదారవిందార్చనంబున నున్న నన్ను నీపాప పుంబడంతి యిట్లు సేయ నుపేక్షించియుండుట నీభక్తవాత్సల్యంబునకుం దగునా! బాల నగుటం జేసి యట్టిభయాపాదకం బగునది యింద్రజాలం బని యెఱుంగక మోసపోతిని. అక్కటా! యీమహాకఠోరమగు నెడరునుండి తప్పించుకొనుట కనువేమి యున్నది‌ ఇచట నే నెవ్వనితో నేమి నెప్పుకొందును. అని యేడుచుచున్నది.

(ఇద్దఱు ముద్దియలు ప్రవేశించిరి.)

అందొకతె. ఓసి యిందురూపా! కొన్నిదినంబులనుండి యాపాపపుంబిశాచము రాకపోవుటవలన మనకు యథేచ్ఛావిహారంబు సేయ ననువయినయది. వెండియుం నదియవచ్చునో! ఆమృత్యుసమానుం డగుసాధకుండె వచ్చునో? వానిపత్ని వచ్చునో! ఎవరు వచ్చినను మనల నడుగెత్తిపెట్టనీరు.

మఱియొక్కతె. ఓసిచంద్రరూపా! మొఱబంటిదుఃఖంబున మోకాలిబంటి సంతోష మనుసామెత నీయెడల యథార్థం బయ్యె. ఇంచుక సంచారంబుసేయ నిర్బంధంబు లేకుండుంటకు సంతసంపడియెదవు. ప్రాణంబులం బాయవలసినకఠోరదశయందు నొకయూరట గలదా?

చంద్రరూప. ఓసి యిందురూపా! వలలోఁదగులుకొన్న మీలకును మనకును గతి యింకనొక్కటియె. తొలిజన్మంబున నేపాపం బొనరించితిమొ? తత్ఫలం బనుభవింప నీ పాపకర్మునిచేతం జిక్కితిమి. వీఁ డేమి యొనరించినను వల దనువారు గలరా! ఇందుకుం జింతించి యేమి యుపయోగము.

ఇందురూప. ఓసి! అట్లని మానసం బుండ లేదే!

చంద్రరూప. ఓసి మానసం బుండకపోయినను మన మేమి సేయఁగలమే. జీవంబుతో నుండుదనుక నీయరణ్యంబున నాచెట్టు నీచెట్టును జూచుకొనుచు నటు నిటుం దిరుగుచుందము. మృత్యువునోటం బడితిమి. పండ్లనడుమం దగులుకొనం బోయెదము.

అనుచుం గొన్నియడుగులు నడిచిరి.

చంద్రరూప. (క్రోలం గనుంగొని ఆశ్చర్యంబుతో.) ఓసి యిందురూపా! అల్లదె కనుంగొనుము. మన మనుభవించు మందుదురంతం బగునుతాపంబుం గాంచి కరుణామయ యయి తాను దుఃఖించుచుండు వనదేవతయో యన నొకవనజాతనయన యీయశోకతరువుమొదట నిలువంబడియున్నది. ఔర! ఈలతాబాహ యీయశోకశాఖికిం బ్రాకం బోవునెలతీవియవోలెఁ దోచుచున్నది. దీనిం గనుంగొని యీశాఖియు మందమారుతచలితంబు లయినతనశాఖాకరంబుల వలపునం జేసి తాఁకం గడంగినట్లు దోఁచెడిని. పోయి దీనిం గనుఁగొందము రమ్ము. అని కొన్ని యడుగులిడి చూచి ఓసి యిందురూపా! ఇది యెక్కడి చక్కదనంబె! ఔరా! ఎక్కడెక్కడనుండి వచ్చినచక్కనిచెక్కులాడులం గాంచలేదు? ఈసౌందర్యం బేమి? ఈరామణీయకం బేమి? ఈలావణ్యం బేమి! ఈరూపం బేమి? ఈవిలాసం బేమి? ఈయంగప్రత్యంగసౌష్ఠవం బేమి? ఈసౌకుమార్యం బేమి? ఈకాంతి యేమి? ఈసొం పేమి? ఈయిం పేమి? ఈతేట యేమి? ఈసీ టేమి? ఇట్టివి యెవ్వతెకైన నుండం గాంచినది లేదు.

ఈకాంతామణిని బాగుగ నిరూపించిచూడుము. సకలకళాపరిపూర్ణం బగునమృతకరబింబంబునకుం బ్రతిబింబంబయి యొప్పుముద్దుమొగంబు సౌభాగ్యలక్ష్మి కభిమతవిహారోదారంబగు నభినవసారసం బయి పొల్పొందుచున్నయది. మారధనుర్విభ్రమభ్రమసంపాదకంబులగు కనుబొమలు సూడుము. చక్కెరవిలుకాఁడు నెక్కునేర్పునం దన యంగుళులచేఁ దీర్చినచందంబునఁ గరము మనోహరంబులై యొప్పెడిని. ఔరా! దీని కన్నులయందంబుం జూచితివటే! అతి నిబిడపక్ష్మమాలికాసుభగంబులై వికచనవకైరవవనకాంతిపూరంబుల వెల్లిగొల్పుచుం గరంబు భయంపడినబాలకురంగియుంబోలె బెదరు గదరుచుం దరంగితంబులై యొప్పుకటాక్షవీక్షణంబులఁ బొలుపారుచు నతివిశాలధవళదీర్ఘంబులై ప్రణయరస పరీవాహమంథరంబులై వెలయుచున్నవి. అన్నన్న! దీనికంఠంబుం గన్న నాక్రొన్ననవిలుకాని శంఖంబునకు ముమ్మాఱు మాఱొడ్డి యోడించి విజయకంకణంబులు దాల్చినరేకలో యనం బొలుపారురేఖాత్రయంబునం జెలంగుచున్నది. ఈ యెలనాగ జడం జూడుము. జఘనభాగపరిగతంబై కాలభుజంగంబు నంగంబునం దోఁచుచు నతినీలదీర్ఘంబై యొప్పారుచున్నయది. ప్రవాళలతాపరిపాటలం బైయొప్పు నధరంబుకోమలత జెప్ప శక్యంబు గాదు. బాహులతలు గణింప నంసనతంబు లగుచుఁ బీనవృత్తంబులై యంచితచారుతాసారతరంబులై మృణాళహారంబులం బోలియున్నవి. ఈ మించుబోడి పార్శ్వంబులు చేతులచేఁ దుడిచినట్టులు కరము నున్ననయి చెన్నుమిగిలెడిని. ఔరౌర! దీనికరతలంబు లభినవవికచకల్హారోదరసహోదరంబు లయి కర మనురాగంబుం బొడసూపెడిని. ఈసింగారపుంగనిపనంబులు పల్లవరుచిపూరంబుల మీఱుచున్నయవి. నడుము చూతమటన్నం గానము. ఈయెక్క డేమనను? దీనికటి సైకతంబుతో

గయ్యముసల్పం జాలి యున్నది. ఈబిడయూరువులు మలిచివేసినహాటకస్తంభంబులకు నైన యనం జాలు. అడుగులు స్థలకమలంబులె యనంబోలు. దేహకాంతి సంతప్తహాటకద్రవరుచిపూరంబుల నఖిలదిశల వెలింగించెడిని. ఇందురూపా! ఈయిందువదనకుం గలిగిన యనవద్యరూపరేఖావిలాసంబులం గన్న సర్వసర్వంసహామండలమండలాధిపతి తనూజాతునిం జేపట్టి యెల్లభూవల్లభపల్లవాధరలు దాస్యంబు సల్ప ననల్పామోదంబునం జెలంగుచుండవలసిన ట్లున్నది. ఇట్టి రామణీయకశరణం బయినయీతరుణీమణి సర్వసుభగలక్షణోపేత యగునది యిట్టిశోచనీయావస్థకుం బాల్పడవలసిన ట్లైన నిఁక సులక్షణంబులకు నతికష్టంబ ఫలం బని చెప్పనొప్పు.

ఇందురూప. ఓసి నీనుడువులు యథార్థంబుల. ఈయాభిరూప్యనిధిం గాంచిన దాదిగ నీవనితతో నెయ్యంబు సల్ప మన సయ్యెడు. మన మేయేబందుగులం బాసినారమో; యాయాబందుగులెల్ల నీచందనగంధియ మన కని తోఁచుచున్నది. ఏతద్దర్శనంబున బంధుజనవియోగదుఃఖంబును శాంతిం జెందుచున్నట్లు దోఁచెడిని.

చంద్రరూప. ఓసి యిందురూపా! ఈమానినీతిలకంబు నాకారంబుం గాంచినంతన హృదయంబున నానందరసపూరం బుప్పొంగెడిని. దీనిసరసకుం జని దీనిసల్లాపసుధాధారలం గ్రోలిన నింతకంటె నెంతో సంతసంబు గలుగును. పోవుదము రమ్ము.

అని యాతరుణాంబుజయుండు నశోకపాదపంబుచెంతకుం జేరిగి.

చంద్రరూప. ఓమనోహారిణీ! ఎవ్వతె నీవు? ఇవ్వనదేవతవే! పువ్వులుకాని నెడ బాసివచ్చియున్నరతి యనుజవ్వనివో? మనుజలోకంబుం గనుంగొననేతెంచిన నాగవనజనయనవో! కానినాఁడు పుణ్యంబు క్షీణించి భూమికిం జాఱినదేవకాంతవో! భూమియందుం బడినతారకవా! కావేని యీయతిమానుషంబగు రూపంబు మనుష్యకామిని కెక్కడిది? ఓ యిందుముఖీ! నిన్నుం గాంచిన యూథపరిభ్రష్టం బయి సింహాసంరుద్ధం బగుగజరాజవధువువిధంబునం దోఁచుచున్నది. కరము శోకభారంబున నీనిగుడ్చునిట్టూరుపులు సోకి యీకురంగటం జెలంగువృక్షంబులపల్లవంబులు దగ్ధంబు లగుచున్నయవి. మాకుం గలిగిన యీదురవస్థకంటె నీకు సంభవించినయవస్థ మఱియు శోచ్యం బయి కానంబడుచున్నయది. మన మందఱ మిప్పటికి సమానసుఖదుఃఖులము. నిన్నుం గనుంగొనినంతన నీయాభిరూప్యాదులకు నచ్చి మేము నీకు సకియల మైతిమి. ప్రియసఖులకుం జెప్పినచో దుఃఖంబు సంవిభక్తం బయిన తెఱంగున సహ్యవేదనం బయి యుండుం గాదె.

తరుణాంబుజ. (విప్పుకన్నులెత్తి దేరిచూచి. ఏమియుం బల్కఁజాలక పయిం బయింబొడముచుండుబాష్పంబులు దుడుచుకొని వెక్కుచు డగ్గుత్తికతో),

ఓయయవ్వలారా! నావృత్తం బేల యడిగెదరు. కరము పరితాపకరం బైనమన వృత్తంబుల నొండొరుల నడిగి తెలిసికొని మనము దుఃఖించుటకంటె మఱేమి సేయఁగలము. మిమ్ముం గనుంగొనినదాదిగ నాకు సర్వబంధుజనంబులును సమీపమునకు వచ్చినట్టు లున్నది. అయిన నాపాపకర్మ రాలు మరలివచ్చునంతదనుక నేకద మన మొక్కొక్కరిం జూచుకొనంగలము. ఇందఱు నియ్యెడకుం జేర్చినయీపాషండకామిని యాత్మాభిలషితంబగు నేదేని యొకక్రూరకర్మంబునకు నందఱఁ బడలువడం ద్రోయదా! మీరలు నీ చేరియుండుసారసవదనలును నావలె సర్వవిధభోగంబుల ననుభవించుచుండి విధివిహితం బతిక్రమింపం జాలక యీపాలసులకుం జిక్కితి రని మానసంబునకుఁ దోఁచినయది.

(నేపథ్యంబునందు.) ఓయిందువదనా! నిన్నుం గనుంగొనిన దాదిగ మాకు దుఃఖంబులు నివృత్తంబు లగునట్లును నీవు మాకు సర్వవిధబంధుభావంబులు గలదానివలె నున్నట్టులును మాహృదయంబులం దోఁచి నీసౌందర్యాదిసుగుణసంపదలం గాంచి మించిన యనురాగంబున నీకు దాసికలమై మెలంగుటకుం గడంగి యీసుఖం బొక్కనిమిషం బేని యాదరణీయం బని యెంచి యంచితప్రేమభరంబున ని న్నాశ్రయించినారము. మమ్ముం దాసికలనుగాఁ గొని మాభవంబులు సార్థంబులు సేయం జను.

చంద్రరూప. ఓయవ్వా! బహుకాలంబుగ నీమృచ్ఛలచే మ్రుచ్ఛిలింపంబడుచు నియ్యెడకుం జేరియుండునండజగామిను లందఱును నిన్నుం జూచి తమతమప్రణయభరంబుల వెలియిడుచున్నవారు.

తరుణాంబుజ. (ఆపరానిశోకంబుతోఁ.) హాదైవమా! నీయొనర్చినకఠోరవృత్తంబున కేమనవచ్చు! ఏ నొంటరిగ నేదేని దుర్దశాపరిణామంబుం బొరయకుండ నీదీనలగు ననాగ్రుల కష్టంబులసయితము చూచి వేదనపడునట్టులు నాకుం గల్పించితివే. ఈనీదుఃఖదానమై పుణ్యం బేమనవచ్చు?

కర్ణకపాల ఆంత్రనాసిక యనుపాషండకన్యకతోఁ బ్రవేశించి,

ఓబాలికా! ఆంత్రనాసికా! నీజనకుండు కఠోరకపాలుండు; వ్రతానుష్ఠానం బుపక్రమించినకాలంబునం గాలభైరవుని కొసంగెదనన్నప్రథమోపహారంబగు పశువు సంపాదితం బగుటం జేసి కరము సంతసించుచు నీసినంబు కృష్ణపక్షచతుర్దశి గాన తన సంపాదిత పశుసముదయంబు నుపహారంబొసంగి భైరవునికరుణ వడయం గడంగి తదీయ సమ్ముఖంబునం బూర్వానుష్ఠేయంబు లగు కొన్నికంత్రంబులును మంత్రానుష్ఠానంబులును నల్పుచు నన్నుం జూచి యోసి! నీచాతుర్యంబు మెచ్చి సంపాదించినప్రథమోపహారపశువున కభ్యంజనస్నానభోజనాదులు నిర్వర్తింపం జేసి వధ్యచిహ్నంబులతోఁ గాలభైరవునికి మ్రోలం గొనిరమ్ము. తదనంతర మవిచ్ఛిన్నగతిం దక్కుఁగలపశుసముదయంబును దాని

వెంబడిన నిలిపి యుంచవలయును. వైళంబ కార్యం బనుష్ఠింపు మని యాజ్ఞ చేసిన వాఁడు. కాన నీవు తొలుత నాయశోకపాదపము నధఃప్రదేశమునం గూరుచుండిన యతిరూపవతియగు నెలజవ్వనిం దోడ్కొని పోయి తైలాభ్యంజనాదులు రచించి స్నాతం జేసి భైరవాలయంబునకుఁ దోడ్తెమ్ము. ఏను నీతక్కుంగలవారి వారిజాననల నయ్యయ్యెడల నుండువారిం గుంపుగఁ జేర్చి తోలుకొని వచ్చెదను. ఉచితకాలంబునఁ బూజ కభ్యంతర ముండంజనదు. పొమ్ము.

ఆంత్రనాసిక. తరుణాంబుజకడకుం జని. ఓసీ! రమ్మని భుజంబుం బట్టి తిగుచు కొనిపోయెను. చంద్రరూపయు నిందురూపయుం భయసంభ్రమంబులతో నొండొరుల మొగంబులు సూచుకొనుచు. ఓసీ! ఏమి యీవైపరీత్యము? కటకటా! అఖండమహీమండల మండలాధిపతికుమారుండు ప్రణయజనితస్వేదంబులం గడిగి పట్టుకొనం దగునీయన వద్య రూపోపేతయగుపట్టభద్రునికూఁతుహస్తపల్లవం బీచండాలకన్యాకాకరంబునం బట్టు పడవలసివచ్చె. దీనిదశ గాంచంగూడ లేదు. అహాహా! అని కన్నులు మూసికొని విలపించు చున్నారు.

కర్ణకపాల. ఓసి రాజకన్యకలార! ఏల దానియవస్థ కనుతపించెదరు? మీమీయవ స్థల మీరు సూచుకొనుఁడు. ఈయెదుటనుండు చాపరాతిపయిం గొంతదూరం బరిగి యది డిగ్గం దత్ప్రాంతంబునం బొడసూపుమహావటవిటపి వామపార్శ్వంబునం బోవుమార్గంబున నీకొండకోనలోనికిం జనుఁడు. కదలుఁడు. చంద్రరూపయుం నిందురూపయుఁ గదలిరి.

కర్ణకపాల. ఓసీ! రాకన్నియలార! రండు ఈముందువోవువారి ననుసరింపుఁడు. ఆత్మగతంబున. నానుడివినవచనంబులు విని చేయునదిలేకదీనాననలై యీవనజాననలు దారిపట్టి యేఁగుచున్నవారు. ఇందఱ నిందువదనల నేకకాలంబునం బలియిచ్చి భైరవుని దయపడసి యీ లోకంబున నకంటకంబుగ విశంకటసుఖం బనుభవింపం గలదానను. తలంచుకొన్నప్పుడు స్వర్గాదిలోకంబులకుం బ్రియునితో నేఁగెదను. ఇచ్చకువచ్చినట్లెల్ల నీభూభువనంబున నఖిలరాజశేఖరచూడామణిమరీచిచుంబితచరణుఁడై నాయకునితో సుఖంబుం గాంచెదను. ఇంతయైన నాకుం బడయరాని దేమున్నది. (అని వికటనర్తనంబు సలుపుచునడిచి. శంకించుచు.) నానాయకుండు తరుణాంబుజం గాంచె నేని తదీయసౌందర్యం బునకు వంచితుండై పంచశరసాయకవ్యథావివశుండు గాకపోఁడు. అట్టయిన నాతనికిఁ బ్రాణహాని యగును. కాన నేనతిజాగ్రతతో దాని నతనిదృష్టిపథంబునం బడనీక రక్షించు చున్నదానను. విరజాంబుజం బట్టుకొని తేవలయు నని గడంగెం గాని దానిం బట్టుకొని దానిసౌందర్యంబుం గనుంగొనెనేనియు నితఁడు నియమవిభ్రష్టుండు గాకపోఁడు.

స్వవశమున నాకన్యక చిక్కవడకపోవుటయ మేలయ్యె. అది చిక్కెనేనిఁ దరుణాంబుజ నొండె విరజాంబుజనొండె భైరవోపహారం బొనరించి దానితో సహస్రసంఖ్యాపరిపూర్తిం గాంచినకన్యకాసముదయంబుం బలిపెట్టి తక్కినదానిని దనకుం దరుణిగాఁ జేసికొనును. అది దొరకమిం జేసి నాకు మేలయ్యె. అనుచు భైరవాలయంబు త్రోవఁ బట్టెను.

చంద్రరూప. (దుఃఖించుచు.) ఓసియిందురూపా! ఈపాపకర్ముండు ఇందఱఁజందన గంధుల నొక్కవ్రేల్మిడిఁ బ్రాణంబులు గొనంబోయెడిని. దైవంబు వీఁడు సేయుకఠోర కృత్యంబున కోర్చునటే! ఎవ్వనినేని నొక్కమహాబలపరాక్రమసంపన్నుని నత్తఱినడ్డ పడంజేయదా? (ఇలకుంజూచి.) ఓసీ! యిదె కనుంగొనుము. ఈవాలుకాస్థలంబున నొక పురుషసత్తముని యడుగులజాడలు గనంబడుచున్నవి. ఈపాదంబులు చతురుదధివేలావల యితంబగు భూమండలంబు నేలునతిశక్రవిభవంబు సూచింపం జేసెడిమహాభాగ్యరేఖలు గలిగినవని యతిమృదులసికతాస్థలంబులందు విశదపడుచున్నయవి.

ఇందురూప. (సంతోషపడుచు.) చంద్రరూపా! నీయొనర్చినతర్కం బభ్యుపియో దర్కం బయ్యెనని యనుకొనియెదను. ఇందఱ కిందుముఖులకు; నిరపరాధలకు; నిరుపమ రామణీయకనిధులకు; నిరంతరనియమపరాయణల; కతిపూతచరిత్రల; కానగలిగినంతకాల మాతృభర్తలంగూడి సుఖసాగరంబులం దేలంగలవారలకుఁ; బుత్రపుత్రికాపౌత్రదౌహిత్రాదిసంతతులం గలిగింపవలసినవారల; కొక్కకాలంబునం దిట్టికఠోరకర్మంబునఁ గంఠంబులు దఱుగుసాహసకర్మంబు సహింపక దైవం బెవ్వనినో యొక్కరాకొమరుని నియ్యెడకు రప్పించినట్లు లవగతంబగుచున్నది. మనము సాధకుండు వర్తించుభైరవాలయంబు సమీపమునకు వచ్చితి మని తోఁచెడిని. అల్లదె నినుము కార్యత్వరాకులితు లైనకొందఱ సంలాపంబులు వినంబడుచున్నవి.

ఇరువురును. (భయసంభ్రమంబుల సాంజలిబంధంబులతో. నిమీలితనేత్రలై.) ఓ గజేంద్రరక్షకా? ద్రౌపదీమానపాల! ఆపన్నజనరక్షాదీక్షావిచక్షణ !

గీ. అజరాసంధుచేఁ దొల్లి యఖిలరాజ, చక్రముల కైనభయమును సవక్రగతిని
బాపి ప్రోచినవాఁడ వోపంకజాక్ష, దీన లగుకన్యకలఁ బ్రోవు దేవ యిపుడు.

రాజపుత్రుండును మంత్రిపుత్రుండును బ్రవేశించుచున్నారు.

రాజపుత్రుండు. ప్రియవయస్య! స్త్రీవధమహాపాతకం బొనర్పంగడంగినసాధకుండు నీదిన ముదయకాలంబునన వచ్చినవాఁడు. గుడియందు భైరవపూజయు నుపక్రాంతంబయ్యె. అల్లదె కనుంగొను ముపహారంబుగ భైరవుని యెదుటం దలలుతఱుగుటకుం గొలువకంటులగుంపులు నొకయెడం జేర్పంబడుచున్నవి. మన మెవ్వరిదృష్టిపథంబునను

దగులువడక తప్పించి యొగసి భైరవాలయంబులోనం జేరి యేకతంబున నుండి కాఁగల పనులు గనుఁగొందము.(అని యిరువురు నాట్యంబున దేవాలయప్రవేశం బభినయించిరి.)

రాజపుత్రుండు. ప్రియవయస్య! కనుగొంటివా! ఈఘోరకర్ముండగు సాధకుండు భైరవునెదుట రక్తకుసుమమాలికలును రక్తచందనంబును రక్తాంశుకంబును నింబపల్లవతల్లజంబులు నునిచి యేకాగ్రచిత్తుండై భైరవు నుపాసించుచున్నవాఁడు. అదిగో! ఆకోవెల మొగసాలన చండాలకామినీప్రచోదితంబులై యభినవయౌవనానికరంబులు కాఱుమెఱుంగుల తెఱంగున వచ్చి చేరుచున్నవి. కట్టా! వీఁ డీకలువకంటులయెడం గరము క్రూరకర్మం బాచరింపం బోయెడిని. ఇప్పుడ వీనిం దలదునిమి యీమెలఁతలకుం బ్రియంబుం గావించెదను. (అని ఖడ్గం బోఱ వెఱికిన.)

మంత్రిపుత్రుఁడు. యువరాజ! త్వరపడకుము. మహానసంబునం దొరికినకుందేలు క్రిందుగఁ దప్పించుకొనునే! వీఁ డెక్కడకుం బోఁగలఁడు? వీఁ డపరాధంబు సేయం గడంగినప్పుడు దండింతువుగాక!

యథానిర్దిష్టం బగుకఠోరకపాలుండు ప్రవేశించి,

కఠోరకపాలుఁడు. ఏమి యిది? కాలయాపనం బగుచున్నయది. నిర్దిష్టకాలంబునన ప్రథమబలి నిర్వర్తింపం జనును. సంధ్యాసమయంబు దగ్గఱిల్లుచున్నయది. దేవతోద్దిష్టం బయినప్రథమపశువుని నిందనుకంగొని తేఁబడినయది గాదు.

సత్వరముగ నాంత్రనాస ప్రవేశించి. అయ్యా ప్రథమోపహారం బనినిర్దిష్టం బగు పశువుం దెచ్చితిని. ఈయెదుట నుండునిర్ఝరంబున స్నాతంగావించి నిలుపంబెట్టియున్నదానను. దాని నలంకరింపం దగు వస్త్రమాల్యాదుల నిచ్చితిరేని కృతవధ్యచిహ్నం జేసి తోడ్కొనివచ్చెదను.

కఠోరకపాలుండు. బాలికా! ఆంత్రనాసా! నీ కీకార్యం బప్పగించి పీజనని యెటకేఁగె?

ఆంత్రనాస. అయ్యా! ప్రథమపశుప్రయోజ్యంబు లగుకార్యంబులకు నన్ను నియోగించి తక్కినపశుసముదయంబుం దోలుకొనివచ్చి యొకయెడనీదేవతాయతనంబు నెదుట నిలిపి కొందఱు మాతంగవీరుల వారికిం బళికరముంచి శైశిర నిర్ఝరజలంబునం దానమాడి ప్రథమపశువుకడ నిలువంబడి తద్వధ్యచిహ్నంబులు దే నన్నుం బంచినయది.

కలభాషిణి. అట్లయిన సరే! త్వరితముగఁ బశువుం గొని రాఁ జనును. ఇవి దాని కలంకరింపవలసినమాల్యాదులు! (అని మాల్యగంధవస్త్రంబు లొసంగెను. అంత్రనాస యవి గైకొని వెడలిపోయె)

రాజపుత్రుఁడు. ప్రియవయస్య! ఆ ప్రథమోపహారపశు వెట్టిదో చూతము. పూర్వము కాంతచంద్రునందు నుడివినభోజతనూజాత యై యుండునే మొ! దానిఁ దీసికొనిరా సాధకుండు వోయి యున్నట్లుగా నెప్పియున్నాఁడు గాదె!

మంత్రిపుత్రుండు. యువరాజ! ఆకుమారికామణులలో నొక్క తెయె యిరువురొ దొరికినందువలనన యీపాపాచారుండు వ్రతసమాప్తి సేయం గడంగినవాఁడు.

రాజపుత్రుఁడు. కట్టా! ఎంతటిదారుణకర్మంబున కొడిగట్టినవాఁడు. వీనిం బట్టి యారాజకన్యకకుం బ్రియంబుగ శిరంబు తెగఁగొట్టి యీభైరవునికిం బలివెట్టినంగదా! రాచపట్టినగుటకు ఫలంబు! ఇట్టిసమయంబున నీబెట్టిదంపుంబని యొనరించి యాభోజుని ముద్దులపట్టి నిర్వ్యాజప్రేమంబునకుం బాత్రం బయ్యెదను. భోజరాజతనూజాతలు నిరుపమరూపసంపదలఁ దద్దయుఁ బెద్ద లని వినియున్నారము గాదె? బహుదినములనుండి వారలం జూడవలయునన్న కోరిక గల దది యీనాటికి సమకూరినయది.

అని ముందుకుం గొన్నియడుగులిడి దృష్టులు నిగుడించి మహాశ్చర్యంబుతో,

ప్రియవయస్య! చూడు మదియ కాఁబోలు భోజునితనుజాత! అయ్యారే! ఈతొయ్యలి యియ్యిలాతలంబునం గలలీలావతులకుం దలమిన్న యై యున్నది.

ఉ. ఈమగువ న్సృజింప నలయిందుఁడె ధాతృపదంబు నందెనో
కోమలి సృష్టిచేసిన యకుంఠరసోత్తరుఁ డావసంతుఁడో
కామిని నాసుమాస్త్రుఁడె నిజామముదంబునఁ గల్గఁ జేసెనో
తామరచూలిసర్గమునఁ దన్వులు దీనిని బోల నేర్పరుల్

ఔరా! ఈకాంతామణి కుత్తమసత్త్వశాలినీలక్షణంబు లమరియుండుట మాడ్కిఁ జూడ నానందంబు గల్గించుచున్నయది.

గీ. మోము సౌభాగ్యలక్ష్మికి మొదటినెలవు, వాలుఁగన్నులు చాంచల్యవాసపదము
లంగకంబులు లావణ్యరంగభూము, లింద నఖిలనూత్రలోచనానందకరము.

ప్రియవయస్య! ఈవనజాతనయనామణి కితరతరుణులకుంబోలె సృష్ట్యుపకరణంబు లుండవని తోఁచెడిని.

ఉ. అందము లెల్లఁ జేరి యొకటై పనిఘాస్కృతిఁ దాల్చి పొల్చెనో
క్రందగు రామణీయకమె కామినియై యిటు లుద్భవించెనో

పొందగులక్షణావళిం తె పొల్తిశరీరముఁ గాంచి మించెనో
చందనగంధివంటియెలజవ్వని సెందను గాన నే నిలన్.

ఓరిచెలికాఁడ! ఈసర్వాంగసుందరియాభిరూప్యంబు నేమని వర్ణింపంగలవాఁడ.

ఉ. అంగన సెన్నడల్ గనిన నంచలు గర్వము జెందఁబోల దీ
మంగళరూపపల్కులకు మానముఁ దాల్పఁగనౌ పికాళి యీ
యంగమృదుత్వసంపదకు నక్కసమానము తాను మాలతుల్
భృంగశిరోజరూపరమ పేరిమిఁ దూరము సేయుం లక్ష్మికిన్.

మఱియు నీయందంబునకుం దగినయట్టు లీయిందుసుందరముఖికి బాల్యంబు వీడి తారుణ్యంబు వొడసూపుచుండుట కరము మనోహరము. ఎట్లనిన?

గీ. రమణినును మోవిఁ గిసలయరాగ మంటె
బాహువులు కోమలమృణాళదోహదములు
యౌవనము లోభనీయమై పూవుఁబోఁడి
మేనఁ గిసలయ మట్టులు మిసిమిఁ గనిరె.

ఇట్టి త్రిభువనైకరత్నంబునకుం జెట్ట జేసి వీర లెట్టులుఁ దప్పించుకొనం బోయెదరు?

నేపథ్యంబున.

ఓసి! యింక నేడిచినం దేరునా! ఎప్పటికింగాని కాలుఁడు మ్రింగంగాచియున్న వాఁడు. ఈమహాయజ్ఞంబున కుపయోగపడినసేతనువు సార్థకంబు గాదె! గట్టిగుండె చేసికొని యుండుము. ఓసి! యాంత్రనాసికా! ఇది మరణంబునకు భయంపడి మూర్ఛనొందుచున్నయది. ఏను దీనిం బట్టుకొనియెదను. నీవు వధ్యాలంకారంబులంకరింపుము.

రాజకుమారుండు. ప్రియవయస్య! ఇట్టిసౌకుమార్యైకసారంబగు వస్తువు కడు నిడుమలం బడుచుండం జూచుచు నుపేక్షించియుండుటకు మానసము బొప్పక యున్నది. కడువడిం జని యాగకునీయగాత్రను గాఱియం పెట్టుపాపపుంద్విట్టల నాట్టిపడినట్టులు సెట్టనఁ దలలుగొట్టినం గాని సమాధానంబుం గాంచదు.

అని ఖడ్గంబు ఝుళిపించుచు సనంభ్రమముగ రెండుపదము లరిగెను,,

మంత్రికుమారుండు. యువరాజ! త్వరపడకుము. అట్లైన నీసాధకుం డూడనిఁబోడు. అపరాధము సీయంగడంగకయ దండించుట రాజధర్మంబుగాదు. భగవతికరుణవలన నీరాజసుతారత్నంబు మూర్ఛాక్రాంతయై యుండునది. ప్రాణంబులు విడువదు. ఓర్చుకొనుము. దీనిం దేవతాయతనమధ్యంబునకుం దీసికొని రానిమ్ము.

నేపథ్యంబున రోదనంబు వినంబడి యడంగిన నందు వెండియుం.

కటకటా! ఓప్రియసఖి! నీకీయనవద్యంబయి యఖిలజనవిలోభనీయంబగురూపంబు గల్పించుట యిట్టియతిపాపమగు దారుణదశావిపర్యయంబుం జెందుటకుం గాఁబోలు? నిన్నుం గాంచుచుండినయొకక్షణంబు సుఖంబులెల్ల నొక్కట మమ్ముం బొదివికొనునట్లుండెనే! ఇట్టినిన్నుం బాసి యెట్టు లోర్తుము. ఓకన్యకారత్నమా! నీ వేయఖండ మహీమండలమండలాధిపతికిం జనించినదానవో! ఈచండాలునిపాలం బడితివి? ఏకారణంబుననో మాప్రాణంబులు వోవుటకు మాకు దుఃఖంబు గలుగలేదు. నీప్రాణంబులకు దుఃఖింప దుఃఖింపం దీర కున్నది. నీయీకుసుమసుకుమారం బయి లావణ్యసారం బైన తనువున కేదేని యొకక్రూరకర్మంబు జరిగినచో మమ్మీకటికివాఁడు వేఱుగ హింసింప వలసిన యక్కర లేదు. చెట్టులు గట్టులు గుట్టలు సయితము రోదనము సేయం బూను నీ దురవస్థ యీకట్టిఁడిచండాలురకు నక్కటికంబుం గలిగింపక యున్నది. హా ప్రియసఖి! హా ప్రియసఖి! నీచంద్రసుందరమగు ముద్దుమొగంబు నింకఁ గన్నులఁ గానముగా! హా దైవమా! కఠోర! యీయకఠోరయౌవన నిట్లుసేయుట న్యాయమా! ఓభూతంబులార! యీయతిపాపవర్తనులం బట్టి మట్టుపెట్టలేరా! ఓదేవతలార! ఈధర్మశీలను రక్షింపం జనదా! ఓయనాథరక్షకా! ఓయాశ్రితరక్షణదీక్షాగురూ! జగన్నాథ! ఆపద్బాంధవ! అఖిల లోకైకశరణ్యా! గజేంద్రరక్షకా! ఆనాఁడు పాంచాలరాజతనయం గాచిననీవె ఈ బాలికావతంసంబుం గావం గలవాఁడవు. అయ్యో! నాప్రియసఖీ! నీకుం జేయునతిఘోరాలంకారంబులు నీవుసూచుకొనకుండ మూర్ఛనీకుం బ్రియసఖియై యెడలెఱుంగకుండం జేసె. నీవు ధన్యురాలవు. ఈయతిపాపంబుం గనుంగొన మేమేమిపాపంబుం గావించినారమో? ఓపాపాచారలార! ఈమాలతీలత మహావాత్యయందుం దగులువడి యిలపయిం బొరలాడుట కరము దుఃఖకరం బై తోఁచలేదటే! మమ్మిందఱఁ బలియిచ్చి యీలేఁగొమ్మను వదలిపెట్టఁ గూడదటే! ఓచండాలలార యీభూభువనలక్ష్మిని భైరవునికిం బలిపెట్టుటకుం గడంగినమీశిరంబులపయి నడుగడుగునకుం గడువడిం బిడుగులు వడుఁగాత. ఈభైరవుండ మిమ్ముంపఱం గ్రందుగఁ బొలియించుఁగాత. ఓసీ! ఈసీమంతినీరత్నంబును సకలలోక సౌభాగ్యసారనిర్మాణను హింసింపం గడంగిననీశిరంబున నకాండపతితం బయినయమ దండంబుభాతి నీగండశిలల నీవనదేవతలు బడవ్రేయరే! హా దైవమా! ధర్మంబు నిర్మూలం బయ్యెనా! ఏ నెంత మొఱవెట్టుకొన్న నేమియు ఫలంబు గానమే! అయ్యో! అయ్యో! ఏమిసేయుదును! ఈపాపపుంబడంతులు మరణభయంబున మూర్ఛం గాంచియున్న నాసఖిం; జంచలనయనం; బంచశరునిచేతిచిల్కను; రక్తవస్త్రంబుగట్టి రక్తకుసుమమాల్యంబులు వెట్టి యఱడంబట్టి సందిటం గరంబులు సొనిపి తిగుచుచు భైరవుని పురోభాగంబునకుం గొనివచ్చుచున్నవారు. కట్టా! ఇఁకం గతి యేమి? అంధకారం బింక లోకంబు నావరించుకొనును.

రాజపుత్రుఁడు.(కరుణతో.) ప్రియవయస్య! కంటివే! ఈరాజతనూజం గనుంగొని దీనిదారుణదశకుఁ బరితపించి దర్శనమాత్రసుగుణసంప్రీత లయిరోదనము సేయంరాకన్నియలలో శాతోదరియలిరూపగుణగణోపేత యొక్కతె గడు వాపోవుచున్నయది.

మంత్రిపుత్రుఁడు. ఈమానవలోకలక్ష్మికిం గలిగినకష్టంబుం గనుంగొని తరుశిలాప్రముఖంబులును దుఃఖించుచవి వోలెఁ దోఁప చైతన్యంబుగలవారలు; నవనీతహృదయలు; నబలామణులు; నుక్కివం బెఱుంగనివారలు; చక్కెరబొమ్మలుఁ; బొక్కిపొరలాడుట యెక్కువయే!

అంత యథానిర్దిష్ట యగుతరుణాంబుజ పాషండికాధృతయై ప్రవేశించుచున్నది.

కర్ణకపాల. ఓసీ! యింక నేడిచినం దీరునా! ఎప్పటికిఁగాని కాలుండు మ్రింగం గాచియున్నవాఁడు. ఈమహాయజ్ఞంబున కుపయోగపడు నీతనువు సార్థకంబుగాదె? గట్టిగుండె చేసికొనుము. మరణంబునకు భయంపడకుము. ఇంచుక కష్టంబున కోర్చికొని మించిన యైశ్వర్యంబుం గాంచుము. బ్రాహ్మణోత్తములు రచియించుమహాక్రతువులందుఁ గ్రతుహతం బగుపశుసముదయంబునకు స్వర్గంబు వోలె నిందును భైరవోపహారార్థము నిహతలగువారలకుం దదీయలోకప్రాప్తియు నష్టైశ్వర్యంబులును గల్గుట నిక్కంబు. ఆయపరిమితైశ్వర్యసుఖంబున కీనరకలోకసుఖంబు లతితుచ్ఛంబులు. నీకు నేను బ్రియసఖినైనందు కీయఖండసుఖంబు నీకుం గల్గ జేసితిని.

[అప్పుడు సభాసదులలో నుండుభోజుండు మహారోషంబు దీపింప నట్టహాసంబు చేసి యొడలు వడంక కటము లదరఁ గన్నులనుండి యగ్నికణంబులు రాల నౌడుకరచుచు నడిదంబు నొఱవెలికి ఝుళిపించి యోసీ! నాముద్దులపట్టిని ప్రియసఖవేషంబుం దాలిచి మోసపుచ్చి యపహరించినదాన వీవ కావె అబలాజనంబును బ్రబలతరమాయచే వంచించిననీసామర్థ్యం బిప్పు డీయెడ నీశిరంబు నఱికి యిలకుం బలిపెట్టఁ గడంగిననాఁడె నేమి సేయంగలవో చూతము. నిన్నుం బట్టి తెగఁగొట్టక నారోషావేశంబు మానదు. చిక్కితివిగా నా చేత! ఇం కెందుఁ బోయెదవు. కన్నులుదెరవని యీచిన్నిమన్నీసులకొమరితలం జంపి యేలోకం బేలవలె నని యనుకొంటివి. నావెక్కసంపుంగక్కసంబు దీఱ నిన్నొక్కొక్కయవయవంబును చెక్కలుచెక్కలుగఁ దఱిగి యిక్కన్యకామణులవెత లుడిపెదను. అని పటలుబెటికినసింగంబుకరణి నాటోపింపం గాళిదాసుండు మహారాజా! ఇది నాటకము గాని యథార్థంబు గాదు. నిలుము! నిలుము! నీమనోరథంబు లందిర్చురాజకుమారునివరాక్రమంబుం గాంచెదవుగాక, అని శాంతవచనంబులు సెప్ప నుపశాంతుండై గూరుచుండె. అంత విరజాంబుజ యేడ్చుచు ఆర్యా తరుణాంబుజా! నీకెట్టికష్టంబు గల్గెనే! హా! ఏమి సేతు! ఇట్టిసమయంబున నీకే మియుం సహాయంబు సేయని యట్టినానిజీవితం బేల? హా! యని మూర్ఛం జెందినఁ దరుణాంబుజ వచ్చి కరంబున స్పృశించుచు వత్సా

విరజాంబుజా! దుఃఖింపకుము. ఇదె నే నప్పుడు మెప్పులువడయుసహాయంబుం గాంచిన చరిత్రంబుం జూచెదవు గాక యని యూరార్చిన నూరటం జెంది లేచి కూరుచుండెను]

కర్ణకపాల. ఈడిగిలంబడకుము. నీ పలితసుకుమారదేహావు. వెనుకంజలిడకుము. ఎను బోతురీతి వీరలు నిన్ను బాధింపం గడంగుదురు. జన్నిగట్టులు జన్నంపుంబశువును గదు బాములువెట్టి ప్రాణంబులుదీయువిధంబున నిన్ను హింసింతురనియనుకొని యెదలో దిగులుపడియెదవో? ఇం దాచందంబు గాదు. వ్రేల్మిడిన సకలైశ్వర్యసంపదలు గలిగి నిర్జర దేహంబుం దాలిచి లీలమెయి నభిమతంబులు ననితరదుర్లభంబులు నగుభోగంబులు వడ యుచు నీమహాకాలభైరవుని మోలం గ్రీడించుచు ననితర సాధారణరూపరేఖావిలాసం బుల నతిభాసురం బగుదేహంబుం జెంది కరుణాతరంగితంబు లగునపాంగంబుల మమ్ముం గాంచి యంచితముదంబున మాకు నీవ వరంబు లీంబోయెదవు!

అని వల్కి_ దాని నిరూపించిచూచి యాంత్రనాసం గాంచి,

ఓసీ యాంత్రనాసా! ఇది కడుఘోరం బగుమరణభయంబునం గఠోరమూర్ఛం జెంది యున్నది. ఇది కొంతతడవునకుం గాని నివర్తింపదు. భైరవునిమ్రోలం బట్టుకొని నిలిచెదము.

అని పరవశదేహాయై యుండుదానిం జేతుల నెత్తికొని తెచ్చి కఠోరకపాలుని దగ్గఱ భైరవునిమ్రోల నిలువంబెట్టి యాయిరువురును దాని కానికగా నిలిచియుండిరి.

రాజపుత్రుఁడు. ప్రియవయస్య! వింటివే యీచండాలవధూవచనంబులు? దీని యెుక్కటికపలుకున కొక్కొక్కపలుకుగ నీ పాపాచారదేహంబు ఖండింపకున్న నీమం డలాగ్రంబు నాచేత నుండియుం బ్రయోజనం బేమి?

కఠోరక పాలుఁడు. ఓప్రాణనాయక! ధారానగరంబున సంపాదించి తెచ్చిన యుత్తమపశు విదియే! దీనినేకద మనము భైరవునికిం బ్రథమోపహారముగ నిర్ణయించి యుండునది?

కర్ణకపాల. ప్రాణనాథ! ఔను! ఇదియె. ఇది స్వభావభీరువు. మరణభయంబున మూర్ఛాక్రాంతయై యున్నయది. పశువు సచేతనంబ యుత్తమంబు గాన నీభైరవ పూజోపయుక్తంబు లగుతీర్థజలంబులం గన్నులందుడిచి మోహం బపనయింప నగును.

అని సాధకదత్తంబు లగుతీర్థంబులం గన్నులందుడువం గడంగి మోమునకుం గట్టి యుండిన నింబపల్లవమాలికలం దొలఁగం ద్రోసెను.

కఠోరకపాలుఁడు. ఆయిందుబింబాననం గాంచి. ఆశ్చర్యంబునొందుచు. ఆత్మ గతంబుగ.

ఉ. ఎక్కడిరూప మీకువలయేక్షణచక్కదనంబుఁ జూడఁగా
నక్కుసుమాస్త్రరాణి యన నౌఁ జెలిముద్దుమొగంబు చంద్రుఁడే
చొక్కపుగుందనం బొడలు సొంపగుకన్నులు గండుమీ లహో
నిక్కముగాఁగ దీనికిని నిర్జరకన్యలు సాటి రా రొగిన్.

అదియునుంగాక.

చ. కను లత్యాయతభావ నీలసితరక్తశ్రీలఁ జెన్నారు శో
భనబాలేందుకళావిలాససుషమాపాటచ్చరం బంగకం
బనుమానం బవలగ్నరేఖ నవలా కయ్యారె యొయ్యారిఁ జే
కొనువాఁ డేల్కొనువాఁడె సర్వజగతీగోప్తృత్వభాగ్యం బిలన్.

మఱియును.

ఉ. సారసగంధిఁ జేకొని భృశంబుగ మోదముఁ జెందఁ గోర కీ
భైరవపూజ కంచుఁ బెనుపాపము సేయఁగఁ బూన నేల యీ
నీరజలోచనాప్రణయనిర్భరభద్రకటాక్షవీక్షణో
దారరమాస్వయంవరము దప్పక కల్గిన లేని దే దిలన్.

అని యులిక్కిపడి. కట్టా! వ్రతభంగంబు గల్గె! మదీయగురువుసెప్పిననియమం బిందుకఁ దప్పకయుంటిని. ఈదుర్భగకుం గలరూపరేఖావిలాసంబులు నామనంబు నప హరించె. ఒకించుక భ్రమించితిని. కట్టా! నావంటికాపాలికులకుం గామంబును గరుణ యుం దగునె! భైరవునియనుగ్రహంబున నాపాపంబు దొలంగుం గాత. అని ఖడ్గధరుండై లేచెను.

కర్ణకపాల. తరుణాంబుజకన్నులు ముడిచెను.

తరుణాంబుజ. కన్నులువిచ్చి చూచి. హా! యని నిట్టూరుపులు విడిచి, అతిదీన స్వరంబుతో. కట్టా! దైవమా! న న్నీబెట్టిందంపుటిడుమ పడుటకా పుట్టించితివి? హా! అంబ నన్నుం గానక యెంత ప్రలాపించెదవో? హా సుతావత్సల! తండ్రీ! భోజ! నా వలన నీకుఁ బుత్రికాశోకంబు దురంతం బయ్యెఁగా? హా! వత్సా విరజాంబుజ! నావలె నీతో నాడుకొనువార లెవ్వ రున్నారు? హా సఖులార! మిమ్ముం బాసి వచ్చితినే! హా సర్వ లోకైకశరణ్యా! ద్వారకానాథ! అనాథనగు నన్ను రక్షింపవే!, అని బాష్పఝుళఝుళంబు లగు లోచనంబులు మూసికొనియె.

కఠోరకపాలుఁడు ఓసికర్ణకపాల! అంత్రనాసికా! మీరిరువురు నీకన్యం బరిత్య జింపుఁడు ఇదె దీనికంఠము ఖడ్గఖండితము గావించెద. దీనిరుధిరధార లిలపయిఁకిం దొరం గుటకులోపలన పశువుల నెల్ల నుపహారం బీవలయు. కానఁ దక్కుంగలకన్యకలనందఱిం దోలుకొని రండు.

అని చెప్పఁగా వల్లె యని వారలు సనిరి.

రాజపుత్త్రుఁడు. ప్రియవయస్య! ఈకుమారికామణివచనంబులచే నిది భోజతనూజాత తరుణాంబుజ యని నిర్ధారితంబయ్యె.

కఠోరకపాలుఁడు. (తరుణాంబుజనుద్దేశించి.) ఓసీ!

ఉ. దారుణుఁ డొకృతాంతుఁడు నితంబిని నిన్నుఁ దినం ద్వరాతులుం
డై రహి నున్నవాఁడు హృదయంబునఁ గోరెదునిష్టవస్తువుల్
ధీరతతోఁ దలంచుకొను దీవ్రరయంబునఁ గల్గు నన్నియుఁ
సారసలోచనా! విబుధసంఘము నిన్ను ననుగ్రహించెడిన్.

తరుణాంబుజ. (బాష్పాకులంబులైనకన్నులు విప్పి యాకసంబు లక్ష్యంబుఁ జేసి చూచి, కరుణఁ గాన్పించుచు.) హా! మదీయజీవితనిబంధన! సర్వలోకసుభగ సుకుమారమూర్తీ! సద్గుణగణావాస! నీకుంగింకరినై నీపాదపద్మార్చనంబు సేయంగోరియుంటిని. నీసౌభాగ్యశరణంబులగు చరణంబులకు సేవసేయుభాగ్యంబు లేకపోయె. ఏ ననాథనై యివ్విధి నిహత నగుచున్నదాన. ఓధాతా! నాయందుం గరుణించి యీనాప్రార్థితార్థంబు సమకూర్పుము. ఇదె నీ కంజలి యొనరించెదను.

ఉ. పోయినఁ బోవుఁగాత మెయి భూతము లెల్లను దత్తదంశముల్
బాయక చేరుచో నతనిపాదమహీస్థలియందుఁ బృథ్వి ద
త్కాయమునందుఁ దేజమును దన్నిలయంబుల నాకసంబు నుం
డోయము తత్సరోజినులఁ దూఁగొన నా శ్వసితంబు లూర్పులన్.

రాజపుత్త్రుఁడు. వయస్య! ఈకుమారికామణికి నొక్కరునియందు, మహాభాగ్యంబునం బావనజన్మంబుం బడసినవానియందుం బ్రణయంబుగల్గియుండుట విస్పష్టంబయ్యె. ఆపుణ్యశీలుం డొనరించినదియే పున్నియంబు. ఎవ్వనియం దీమగువ కాశ యుండునో యెఱుంగం బడదు.

మంత్రిపుత్త్రుఁడు. యువరాజ! ఇట్టియనవద్యరూపోపేతుండవగు నీయందుం గాక యితరునియం దీభోజతనూజాత యాసగొనునే! సత్కులజాతలగు శాతోదరులుకులశీలవయోవిద్యావిశేషంబులం దమకుం దగినవారలం గాని యితరుల వరియింపరు. ఇట్టివాఁడవు నీవె కాని యొండురాజకుమారుండు లేఁడు. ఇదె యీసాధకుండు దారుణకర్మంబునకుం గడంగం బోయెడిని. దీనినిరక్షింప జాగరూకతతో నుండుము. సాధకనియుక్తులగు చండాలభటుల తలలుగొట్టి యీరాజకన్యకాసమూహంబుం గావంజనియెద. ఏకన్యకయం దెట్టిమనిష్టంబుగాని వారు సేయకముంద రక్షించుటమేలుగదా? (అని నిష్క్రాంతుండయ్యె.)

రాజపుత్త్రుఁడు. తరుణాంబుజారక్షణ వ్యగ్రుఁడై యుండె.

కఠోరకపాలుఁడు. అంజలిబంధంబుఁ గావించుకొని ప్రదక్షిణంబు లొనరించి ప్రణమించిలేచి ఖడ్గంబు ఝళిపించి భైరవునిం జూచి,

ఉ. దేవ భవత్పదాంబుజము దీర్ఘతపంబునఁ గొల్చితిం దగన్
భావమునందు నేఁ దొలుత భక్తిఁ దలంచినభోజకన్య నిం
పావహిలంగ నీకు నుపహార మొసంగెద గ్రోలు మద్భుజా
భావితఖడ్గఖండితసుపాణిగళోత్థితరక్తపూరముల్.

అని ఖడ్గంబునం దరుణాంబుజను బ్రహరింపం బోయెను.

రాజపుత్త్రుండు. సరభసగతి నేతెంచి వానిచేతిఖడ్గంబుం దట్టివేసెను.

కఠోరకపాలుండు. నివ్వెఱపోయి చూచి పెటపెటపండ్లుగొఱికి. ఓరీ పాపిష్ఠ! యెవ్వఁడవురా నీవు! నా నేయుభైరవపూజకుం బ్రతిఘాతంబు సేసితివి. ఇదె దారుణంబగు మదీయపరాక్రమంబును గనుంగొనుము. తొలుత నీగళరక్తంబుల భైరవునికిం జవిచూపి యనంతర మీకాంతను వధింతుంగాక. పురుషరక్తం బతిరుచ్యంబుగ భైరవుండు గ్రోలం బోయెడిని.

రాజపుత్త్రుఁడు. ఛీ! ఛీ! పాపాత్మ! ఎట్టిపనికిం బూనితివిరా! ఇంటివా రేమఱి యుండం బొంచియుండి కన్యారత్నంబుల హరించి యీకాలభైరవునికిం బలిపెట్టం గడంగితివి. ఇదె యీపట్టియమున నిన్నుం గట్టెదురం బట్టి తలగొట్టి యీభూమికి బలిపెట్టి నీశిరం బీభైరవాలయంబువాకిటం గట్టింప వచ్చియున్నవాఁడను. ఇఁక నెట్టును నీకుం దప్పించుకొనం గాదు.

కఠోరకపాలుఁడు. ఓరీమూఢ! నిన్ను నే నెఱుంగుదును. ఈతపస్వినియందు నీ వాసపడి వ్యాఘ్రాక్రాంతం బయినమృగియందుఁ గరుణ గలిగి వ్యాకులపడుచుండు మృగముచందంబున దారుణహింసాదరుండనైన నానికేతనంబునకుం జనుదెంచిరి. ఓరీ పాప! నేను నీ కేయపకారంబును సేయకయుండ నాయుద్దిష్టకార్యంబునకు విఘాతంబుఁ గావించినాఁడవు. నిన్నూరక విడుతునే!

రాజపుత్త్రుఁడు. ఓరీ పాంసుల! ఇంతకంటె నీ వేయపరాధంబు సేయవలె! ఓ చండాల! ఇట్టిస్త్రీవధమున కెవ్వండేని పూనుకొనునే! అందును సంసారంబునం గలసారంబు దూరీభూతంబు సేయం గడంగితి. ముల్లోకంబుల కొక్కరత్నం బుండఁగా దానిం దొంగి లింపం బూనితివి. లోకంబులయాలోకంబులందు మట్టిగొట్టుచు కొడిగట్టితివి. భోజ మహీపాలుని ఘరణంబు శరణం బని ప్రాణంబులు వాయం జేయుటకు సమకట్టితివి.

దర్పకునిదర్పంబును ద్రెళ్లిడి నపహరింపఁ జెంపుచేసితివి. కట్టా! జగంబును జీర్ణారణ్యము గావింప మొదలుబెట్టితివి. ఇట్టి నిన్నార్తాపరాధునిం జేపట్టుఁగఁబట్టి దండింప వచ్చియుం న్నాఁడను.

చంద్రరూప. (మహామోదంబుతో ససంభ్రమంబుగఁ బ్రవేశించి తరుణాంబుజ నాలింగనముచేసికొని.) ప్రియసఖి! నీకష్టము దొలంగె. కన్నులు దెఱచి చూడుము.

ఉ. కానఁగఁ గానవాగ్నిశిఖ గ్రమ్మి వనావళిఁ గాల్ప సాఁగఁగా
దీనత నీమృగీగణము దేహవియోగభయవ్యథాగళిక్
బూని తపింప నీజలదపుంజదయారస మేమి చెప్ప నోఁ
బూని సుధాప్రవర్షమున భూతల మంతయు ముంచె మించుచున్.

తరుణాంబుజ. (స్పర్శసుఖం బభినయించుచుం గనుదమ్ములు దెఱచి,ఆత్మగతంబున) ఎవ్వతెయో! యీపువ్వంబోఁడి!దీనిసౌకుమార్యశరణంబు లయినయంగకంబులసంస్పర్శంబు చందనపల్లవతల్లజంబులరసంబు సల్లినయట్లు లున్నది. ఇది యశోకతరునికటదేశంబునం బూర్వ ముండునప్పుడు నిష్కారణస్నేహంబు గాన్పించినయుదారశీల యై యుండంబో లును. (ప్రకాశముగ) ఓప్రియసఖి! అట్టిమహోదారదయాసుధాసముద్రునింగనుంగొను టకు మానసంబు కరము త్వరాకలితంబయి యున్నయది. కన్నులు బాష్పపూరపూరితం బులయి యుండుకతంబున నెదుట నుండువస్తువు వొడసూపదు. మఱియుం నేమేమొ యతి ఖరస్పర్శంబులగు నాకులదండలు నామొగంబున వ్రేలాడుచున్నయవి. వీనిఁ దొలంగఁ ద్రోయుము.

చంద్రరూప. ప్రియసఖి! ఇదె యట్లు గావించెదను.

అని దానిమొగంబునకుం గట్టియుండు నింబపత్రసరములు విప్పివేసి జలంబులం గన్నులు గడిగి తనపయింటచే దుడిచెను.

తరుణాంబుజ. కన్నులెత్తిచూచి మహాముదంబుతో. ప్రాణనాథ! అనంబోయి లజ్జించుచు నవనతముఖియై యానందబాష్పధారాకలితంబులగు కపోలంబులతోనుండె.

చంద్రరూప. ప్రియసఖి! సంతసం బయ్యె. కఠోరకృతాంతనితాంతఘోర దంష్ట్రావిశంకటభయంకరాస్యగర్తంబునం బడినదాని నవ్యాజప్రేమభరంబునం గాచి జీవంబునిల్పినవానికి, నత్యుదారదయాసముద్రునకు, మహాప్రభావసంపన్నునికి, మానినీ మణినవమన్మథాకారునికిం బ్రణయపరిగ్రహంబునం గృతయథోచితసత్కార వైతివి.

ఉ. ఘోరదశావిశేషమునఁ గోమలిఁ గాచినయత్యుదారు ష్టా
ధారకుమారు విష్ణుఁగనుదమ్ములఁ బర్వెడుచూపుఁగల్వపూ

బారులఁ బూజచేసితివి భామిని నీమెయిఁ గ్రమ్మఱెమ్మటన్
వారక బాధ్యమిచ్చితివి వర్ణ్యము లయ్యె భవద్గుణావళుల్

తరుణాంబుజ. మందస్మితముగావించుచుఁ దలవంచుకొనియె.

రాజపుత్రుఁడు. (చంద్రరూపం గాంచి.) ఓకన్యకామణీ! దీనియందు నీకుం గలిగిన నవ్యాజప్రణయవిశేషమునకుం గరం బలరుచున్నవాఁడను. ఈ కుమారికామణిం దోడ్కొని చని వధ్యచిహ్నంబులెడలించి యుత్తమవస్త్రాభరణాదులం గైసేయుము. ఇదె యీపాపునిశిరంబు దెగనఱికి మిమ్ముం గాన వచ్చెదను. నాప్రాణసఖుండగు మంత్రిపుత్రుండు మదాదేశంబుం గొని మున్న చని యీ కన్యకామణులకుం గావలియుండు చండాలభటులతలలు దునుమాడుచున్నవాఁడు. అదె కనుంగొనుఁడు. హతశేషు లగువారు భయసంభ్రమంబులం బలాయనం బొనరించెదరు. భయంపడవలదు. సుఖంబున వర్తింపుఁడు.

చంద్రరూప. ప్రియసఖి కుమారునిదేశంబుం గావింతము రమ్ము.

తరుణాంబుజ. ప్రియసఖి! అట్ల కానిమ్ము! పోదము.

అని కన్నులెత్తి లజ్జాకులితంబు లయినవీక్షణంబుల రాజపుత్రునిం గాంచి చంద్రరూపం జూచుచుఁ గదలి పోక నిలువంబడి యుండె.

చంద్రరూప. కుమార! ఈ కుమారికామణి తనభావంబుం జూపుల నెఱింగించుచున్నది. ఈ సాధకుండు కడుఁబాపిష్ఠుండు. అఘోరబలసంపన్నుఁడు. వీని వధించునప్పుడు కుమారుండు మాయెడ నిర్వ్యాజప్రణయభరంబుం జెంది ప్రాణంబులు గాచినదయావిశేషంబు మఱవక యతిజాగరూకతతోఁ బ్రవర్తింపంజనునని విన్నవించుకొనుచున్నది.

రాజపుత్రుఁడు. (స్మితంబుగావించుచు.) ఓకామినీతిలకమా! మీకుం గలయీయతిప్రణయభరంబ నాకు జయప్రదం బగును. శంకింపవలవదు. పొండు.

చంద్రరూపయుఁ దరుణాంబుజయు నిష్క్రాంతలైరి.

రాజపుత్రుండును కఠోరకపాలుండును. ఓరిపాపిష్ఠ! రమ్ము! ఈ దేవాలయంబు నెదుటనుండు నతివిశాలంబగు యుద్ధసముచితభూమికిం బోవుదము.

అనుచు నిరువురు నిష్క్రాంతులైరి.

రససంజీవన నాటకంబునఁ దృతీయాంకము సమాప్తము.

---

## చతుర్థాంకము.

కర్ణకపాల. (ససంభ్రమంబుగఁ బ్రవేశించి.) హా! ఏమి సేతు! నామగనికిమహాసంకటము గలిగెనే! పాపపుదైవ మీరాజకుమారు నెక్కడనుండి కొనితెచ్చెనో! కట్టా! నా మగనియెదుట నెట్టిదిట్టలును నిలువం జాలరు. ఈరాచపట్టి యెట్టిధైర్యవంతుం డనవచ్చు! కృతాంతతుల్యపరాక్రముఁడగు నీసాధకు నించుకేనియు సరకుసేయక యతఁడు ప్రయోగించినశరంబులం దునిమివేయుచున్నాఁడు. రాజకుమారునిమేయి సోక నెన్నియేని నారసంబు లాసారముగతి వర్షించి వర్షించి యం దొక్కండేని మధ్యవిచ్ఛిన్నంబు గాక పోవమికిం జింతించుచుఁ దనభుజంబులబలంబుకొలందిం బెనంగునీసాధకునిపయిఁ జేఱు నగవునెమ్మోముతోడన నీకుమారుండు బాణంబు లవగణనమెయిఁ బ్రయోగించుచున్నవాఁడు. ఆహా! యేమి వీనిభుజసారంబు! లోకంబున ననేకరాజకుమారులం గాంచియున్నదానను. ఇట్టిమహాశూరుని నెందుం గనుంగొనలేదు. హా! వీనిచేతినుండి తప్పించుకొనుట యీసాధకుని కశక్యంబు యని తోఁచుచున్నది. ఏమి సేయనగును. మఱియు నీరాజకుమారునితోఁ జనుదెంచినయొక్కరుండు కన్యకాసమూహంబునకుం గావలియుంచినవారలం దలలుదఱుగుచు నక్కలకంతులకుం దాన కాఁపై యున్నవాఁడని నావారు మొరపెట్టుకొనినను నామగనిగతి యేమగునో యనుచుం జింతాకులస్వాంత నగుటం జేసి యాయర్థంబుఁ బరికించక యుండెదను. ఆ! ఇదియేమి విధివైపరీత్యము! శార్దూలచరణాక్రాంతంబగు మృగీకదంబకం బాకస్మికంబగు విధియోగంబునం దప్పించుకొని యావ్యాఘ్రంబులం జూచి వెక్కిరించున ట్లయ్యె.

(పురోభాగంబునకు నిక్కిచూచి, మహాహర్షంబుతో,)

నామగం డిప్పుడు కఠోరగదాదండపాణియై భూపాలకుమారునిపయి నడుచుచున్నవాఁడు. అయ్యయో! పాప మీకుసుమసుకుమారునియంగంబు లీయశనిసంపాతభీతిదములగుగదాప్రహారంబులకు నుగ్గునూచంబుగాఁ బోయెడిని. ఈసాధకుం డప్పుడప్పు డీమహారణ్యంబున వేడుకమెయి వనగజఘటల వేఁటాడుచో నీమహాగదం గొనియె యామదకరికుంభసంచయంబులం బగల్చుచు నశ్రమంబున విహరించు.

(నేపథ్యంబున.) ఓరీ రాచములుచ! ఇప్పటికైనం బఱువుపాఱియొండె; నాచరణంబులకు శరణాగతుండవై యొండెఁ బ్రాణంబులు గాచుకొనుము. అట్లు సేయవేని యిదె మహాగద నీయంగంబు వ్రక్కలు గావింపకపోదు.

(వెండియు నేపథ్యంబున.) ఓరీ చండాల! ఏలరా యీమూఢగర్వంబు! ఇంతదనుక నెన్నెన్నో నీచేత నైనంతదాఁకఁ బ్రయోగించితివి. అవి యెల్ల నే మైనదియు నీ

వెఱుంగవా! ఇదియంను శ్రేయంము. నేను చేయిచేసికొనునంతదనుక నీవేమేమి సేయుదువో చూతము. అనంతరము నీ కేమ్మియుం జేయఁ దరంబు గాదు. ఇదె చూడుము.

కర్ణకపాల. అయ్యో! అయ్యో! నామగనిబాహుదండంబు గదాదండంబుతోడఁ దెగి పూర్వోపక్రాంతంబగు మహాభ్రమణంబుతోడనఁ గడు దవ్వులకు నాకసంబున కెగసి యిలపయిం బడుచున్నయది. ఇఁకఁ బ్రాణంబు లుండియుం నితఁ డేమి సేయంగలండు. హా! నిహత నైతినే!

(నేపథ్యంబున.) ఓరీ చండాల! కన్నులు దెఱవనిచిన్నకన్నెలం బెదరించినట్టు లను కొంటివా! ఇది సింగంపుంగొదమతో సయ్యాటంబు లనుకొనకపోతివి! ఇదె నీయొక్కొక యవయవంబును నెక్కొనుకినుక నుక్కుమెఱయం దఱిగెదను. నీ వీకన్నియల నెన్ని యిడుమలం బెట్టం దలంచితివో, నిన్నన్నికష్టంబులు పెట్టి యంట్టిపడం దల గొట్టెదను.

కర్ణకపాల. హానాథ! దక్షిణభుజంబు పోయినదని యూరకుండకుము. నీ కను వైనంతదనుక నేవెరవున నైన నీపాపపురాచములుచను దెగటార్చుపని నారయుము.

ఆత్మగతముగ. ఆ! మద్వచనంబున నీసాధకుండు దనసమీపమునందుండుసాలతరుశాఖ విఱుచుకొని యీకుమారుని శ్రేయం గడంగెడిని.

(ప్రకాశముగ. ఆర్తనాదంబుతో,)

అక్కటా! ఇతనిభుజశాఖ మహాతరుశాఖతో నాకసంబున కెగిరనే! అయ్యో! అయ్యో! నామగని నీపాపిష్ఠుండు ముక్కును గన్నులును జెక్కులును బిక్కలును జిత్ర గతిం దఱుగుచున్నవాఁడు. కట్టా! ఏమిసేయుదును. ఈక్షత్రియాపశదునిబాణంబులం కరము క్రూరంబు లయినవి. వీనిమార్గంబునం దగిలినదానిం బొలియింపక పోవు. దగ్గఱ కుం జని కాతు నటన్నను భయంబు గదురుచున్నది. హానాథ! హానాథ! ఏమిసేయుదును?

(సవ్యాకులయయి,)

కష్టము కష్టము! ఒక్కబాణంబున నామగనిదలయుఁ దెగి యాకసంబున కెగిరె. హా! అని మూర్ఛపోయి కొంతవడికి లేచి,

హా! ప్రాణనాథ! ఏ ననాథ నైతినే! ఎట్టిబలశాలురం జయించినవాఁడవు. ఈ మీసమురానివానిచేతం జిక్కి ప్రాణంబులు గోలుపోతివి. ఇఁక నాకు దిక్కెవ్వరున్నారు. ఉపక్రాంతంబగువ్రతంబు సమాప్తంబు చేసి భైరవునిదయవలన నెట్టియెట్టిసుఖంబులో యనుభవింపవలయు ననియున్నందు కున్నది కొంచెము నశించిపోయె.

(సమాధానముతో,)

(సాసూయముగ.,)

చీ! చీ! తపస్సిద్ధి వడసి యాకాశగమనంబును కామరూపంబును శాంబరీమాయలు నేర్చి యెంతటికార్యం బైనం జేయ వలంతి నగునే నివ్విధంబున నలంతివోలె నేఁచుచుం డుట తగునా! ఈక్షత్త్రియాపశదుం డీకామినియం దాసజేసిగాఁడె నా కిట్టియపకృతిం గావించినవాఁడు. వీని కిట్టిపత్యపకృతిం జేసి స్వర్గలోకగతుం డయినమగని కనృణ నయ్యెదను. (భయముతో.) చండపరాక్రముండగు రాజపుత్త్రుండు కృతకృత్యుండై తన యుండుచోటి కేఁగంగడంగియే మొ యీత్రోవంబట్టి యేతెంచుచున్నవాఁడు. నన్నుం గనెనేని చంపకవిడువఁడు. వీనిం గనిన నొడలు వడంకెడిని. పాఱిపోయి ప్రాణంబులు గాచుకొనుటలగ్గు. (అని పలాయనంబున నిష్క్రాంతయయ్యె.)

విష్కంభము

---

అంత రాజపుత్త్రుండు ప్రవేశించుచున్నాఁడు.

రాజపుత్త్రుఁడు. ఆత్మగతంబున. కరము పాపిష్ఠుం డీసాధకుండు నాచేతం జిక్కి దైవయోగంబున నిహతుం డైనకతంబున నీకన్యకాసహస్రంబు జీవించె. కానిచో నతి దైన్యంబున దిక్కులేక ప్రాణంబులు గోలుపోయి యుండదే! విధి యీకన్యకాజనంబు నీసాధకునిమూలకముగ నియ్యెడం జేరిచి వీరలకు రానుండినమహావిపదంబుఁ దొలఁగఁ ద్రోచి రక్షించుటవలన నీయండజయానలపిండునకు మహాభ్యుదయం బొందు గలిగించు టకే యని యూహింపం జనును. నాకు మాతులుండగు భోజభూపతితనూజాతయగు తరు ణాంబుజరూపరేఖావిలాసంబులు కర మాశ్చర్యకరంబు లని వినియుంటిని. అది తథ్యంబ యయ్యె. ఈయుత్తమమత్తకాశినీరత్నంబునకుం బుణ్యవిశేషసంప్రాప్తం బగు జన్మంబు గలయొకపురుషసత్తమునియం దనురాగంబు గలిగియుండుట యభివ్యక్తంబయ్యె. ప్రాణాపాయసమయంబున రక్షణంబు గల్గం బ్రియసఖివలన నెఱింగి యాయన్నులతల మిన్న నన్నుం గాంచి చిరపరిచితుం డైనతనదయితునిం బోలెఁ బ్రాణనాథ యని ప్రణయ విశేషవశంవదయై సంబోధించి యంతలో గాఢలజ్జాక్రాంతయై స్మితసుధామధురంబు లగుకటాక్షవీక్షణంబులం జూచుచు నవనతముఖాంబుజయై యుండె. దీని నారయం జిర కాలంబుగ ననురాగంబు వొడమి యది క్రమక్రమంబుగ నుత్కంఠారూప మయియుండి మరణసమయంబునం గలిగినరణరణకంబువలన నిరస్తాశంకం బై వెలువడి కులకుమారికా జనోచితంబగు సహజలజ్జానుయోగంబుచే వెండియు మానసంబున నడంగె నని నిశ్చయింప నయ్యెడు. మఱియుఁ దనప్రియసఖీముఖంబుగ నాకామినీతిలకంబు సాధకుని వధించు నప్పుడు కుమారుండు మాయెడ నిర్వ్యాజప్రేమభరంబుం జెంది మాప్రాణంబులు గాచిన

దయావిశేషంబు మఱవక యతిజాగరూకతతోఁ బ్రవర్తింప నగునని చెప్పి యతివిశాల ధవళంబు లయినకనుదమ్ము లెత్తి లజ్జాకులితములగు కటాక్షవీక్షణంబులం గనుఁగొనిన యర్థంబు మానసంబున కాశ్వాసంబె కల్పించుచున్నయది.మహాభాగధేయంబున జన్మంబు వడసియుండునట్టివారల కొక్కరునియందు మనోనురాగంబును మఱియొక్కరునియందుఁ జక్షూరాగంబును గలుగదు. ఏనును దానిప్రియసఖితో నీబాలికామణిం దోడ్కొని పొమ్మనిచెప్పఁగా నావరారోహ సఖీనీతయై.

ఉ. పోవుచు నాపయోదక చ భూరివివర్తితకంధరంబుగా
భావజసద్విలాసళతబంధురమై తగ మోము ద్రిప్పి యిం
పావహిలంగఁ గాంచె నది యాక్షణ వేగ సుధావిషాక్తమా
భావజుఁడేయువాఁడిగలబాణమువోలెను దాఁకె వీకతోఁ౯.

ఈప్రణయం బిప్పుడ యప్పుడంతికిం గలిగినది గాదు. బహుదినోపచీయమానంబై యున్నయదియని గండతలాభివ్యజ్యమానంబగు నీషత్పాండిమంబువలన నవగతంబగుచున్నది. ఈయింతి యింతదనుక నన్నెన్నడును గాంచినది గాదు. ఈవిధం బౌఱయ నిట్టిది యని నిర్ణయింపం గూడక యున్నది. ప్రియవయస్యుం డగుమంత్రికుమారుండు కన్నెలకుం గాఁపుండువారల సాధకనియుక్తులం బొఱందఱుమంబోయినవాఁడు వెండియు వచ్చి దినంబుగడచియు వృత్తంబు సెప్పకయ యున్నవాఁడు.

మంత్రిపుత్రుఁడు (ప్రవేశించి.) యువరాజ జయం బగుఁగాత.

రాజపుత్రుఁడు. ప్రియవయస్య! ఇంత తడవేల యయ్యె? దీనం బయినకన్యకాజనంబునకుం దగునుపాయం బారసి యభ్యవహారాలంకారాదులకుం గొఱంత లేక యుండం జేసితి కే!

మంత్రిపుత్రుఁడు. యువరాజ! మన మిప్పుడు క్రొత్తగ నేర్పఱుపవలసిన దేదియు లేదు. పూర్వము సాధకుండె తాఁ గొని తెచ్చినకన్నియల కెద్దానం గొఱంత లేకయుండ దాసీబృందంబుచే నభ్యవహారాదులకుం దగినపనులు నిర్వర్తించుచుండె. వాఁడు భవత్పరాక్రమవిజితుండై నిహతుండుగా నాదాసీజనం బస్మన్నియోగంబునఁ బ్రవర్తిల్లుచున్నయది. మఱియు రాజకన్యకాసహస్రంబు భోజతనూజాతకుం గలయసమానరూపగుణవిభవంబులకు నచ్చియచ్చిలుకలకొలికికిం దమతమయిచ్చవచ్చినవిధంబున నాశచీదేవిని దేవకన్యకలవిధంబునం గొలుచుచున్నయది. ఈవేడుకలు గనుంగొనుచు రాత్రి దడసితి. మఱియు నుత్తమరత్నపరిపూరితంబు లయినవజ్రఘటంబులు నాలుగు భోజభూపాలనామాంకితంబు లగునవి సాధకుండు వసించుపర్ణకుటీరంబునం దొరకినయవి. మఱియు

ననేక ధనసంచయంబులం దుపలబ్ధంబు లయ్యె. ఇవి యన్నియుం నీభైరవపూజ నిర్వర్తింపం గడించినవాఁడని తోఁచెడిని. ఇవి యెల్లను జండాలాపహృతంబులు గాకయుండఁ గన్యకాజనంబునకుఁ గాఁపుగ నేగతయామిని నయ్యేడనుండి యిప్పు డందు మన సూతపుత్త్రునిం గావలియుంచి తదధీనంబుగఁ గావలసినపనులు జరుగునట్లు ముదలయిడి వచ్చినవాఁడ. ఇఁక నీచిత్తానుసారంబుగఁ జరుపుకొనుము.

రాజపుత్త్రుఁడు. ప్రియవయస్య! నీ యొనరించినకట్టుదిట్టంబులు నాకుఁ గరంబు ప్రియములు. అట్లె జరుగవలయు. ప్రియవయస్య! ఆభోజతనూజాతగుణంబులకె యా కన్నియలు సౌహృదంబుఁ గాంచి తదీయదాస్యం బంగీకరించియున్నవారుగా! అనితర లోకసాధారణం బారామణీయకంబు!

చ. కలువలఁజేనిసత్కళలు గౌముదియుం బొడిచేసి యందులో
పల నమృతంబు వోసి బహుభంగుల నూటి విధాత ప్రీతితో
నలపురవైరిఘోరనయనాగ్నిని గ్రాగినకామమూర్తికిన్
జెలువపుఁజీవనౌషధముఁ జేసె నొకో యన నింతి యొప్పెడిన్.

ప్రియవయస్య! వినుము. ఆ బాలికామణికిం గలజగదనవద్యహృద్యం బయిన రూపంబు నేమని వర్ణింపవచ్చు?

ఉ. ఒచ్చెము లేనిరూపము శుభోన్నతిఁ జేయఁగ లేనిపద్మజుం
డిచ్చపలాక్షిఁ జేసె నను టెక్కడిప ల్కఖిలాంగసుందరిన్
జిచ్చుఱకంటికిం దలఁకిఁ జెచ్చెరఁ బద్మశరుండె ప్రాణముల్
నిచ్చలు గాఁచుకోఁ గడఁగి నీరజలోచన యయ్యె నీవిధిన్.

మంత్రిపుత్త్రుఁడు. యువరాజ! ఆ యుత్తమమత్తకాశినీతిలకంబునకును బురుషసత్తముఁడవగు నీకును బరస్పరసమాగమం బన్యోన్యశోభాకరం బగు. నీవలె నామధుకరవేణియుం నిన్నుం దలంచుచుండు.

ఉ. ఆవనితాశిరోమణికి నాత్మమనోరథబంధబం ధువై
తీవు సరోరుహాక్షి శరదిందుమనోహరరేఖ యయ్యె నీ
భావపయఃపయోధికిఁ గృపాకలితుం డయి యావిధాతయుం
భావజుఁడుం గడంగిరి శుభస్థితి నొక్కటి సేయు మిమ్మెగిన్.

దాన నాసారశిరోమణిపాణిగ్రహణంబు నీకు సమకూరుట యద్దంకి యుండదు.

రాజపుత్త్రుఁడు. (గించిల్లజ్జాకలితుండై నవ్వుచు. మోముపంచుకొని. ఆత్మగతంబున) ఆ కన్యకామణి సౌందర్యాదిగుణంబులకు వివశుండనై యించుక ప్రమాదపడితిని.

లజ్జ యుండిగి తదీయవర్ణనంబునకుం గడంగితిని. వృత్తశీలంబులం గాచుకొనువారల కిట్టి కాముకకృత్యంబులు సెల్లునే!

మంత్రిపుత్రుఁడు. యువరాజ! అల్లదె భవన్నిహతుండగు కఠోరకపాలునిపత్ని కర్ణకపాల యీమహీజంబులమాటునం బొంచి పొంచి సంచరించుచున్నయది. ఇది మన కొండెఁ దరుణాంబుజకొండె నేదేని యప్రియంబు సేయం దలఁచి వేచియున్నయది యని తోఁచెడిని. దీని నసువుమెయి దండింపం జను. లేనిసాఁ డివ్విధి నితరరాజకన్యకలకు నహితంబు సేయక మానదు.

రాజపుత్రుఁడు. ప్రియవయస్య! ఇదియుం దీనికూఁతురాంత్రనాసయుం దమ వారివధంబుం గని భయంబునం బాఱిపోయిరి. ఆమాయలాడులఁ జేరంబట్టి చంపవలయు. అపథం బాలోచించినం గాని శిక్షింప నసువు గాదు. ఇందు కేమి సేయవచ్చు?

మంత్రిపుత్రుఁడు. యువరాజ! ఈదారుణ కపటకర్మలను వంచింప నాలోచింప వలయునే! వినుము. (అని చెవిలో రాజకుమారునికిం గొన్నియర్థంబులువచించి.) యువ రాజ! ఉచితసంవిధానంబునం బ్రవర్తింపంజను. (అని నిష్క్రాంతుండయ్యె.)

రాజపుత్రుఁడు. (ఆత్మగతమున.) నాప్రియవయస్యుండు రచియించు నుచితో పాయంబున కనురూపప్రవర్తనుండనై యేను నెదుట గుజ్జుమావులనడుమం గనంబడు మాలతీలతానికుంజంబుపొంత నెవ్వరికిం గనంబడక తీవెపిందువులచాటున డాగి యుండె దను (అనికొన్నియడుగులుసని. ఎదుటంగాంచి.)ఇదె చంద్రరూపానుసృతయై భోజతనూ జాత నాపోవంగడంగినలతానికుంజంబునకె వచ్చుచున్నయది. వీరల దృష్టిపథంబునం బడక పొంచియుండి యేకతంబున వీరలకు జరగువిస్రంభాలాపంబులు వినియెదను గాక. (అని లతాకుడుంగంబులమాటున నిగూఢుండై యుండె.)

(అంతం జంద్రరూపాసహాయురాయై తరుణాంబుజ ప్రవేశించుచున్నయది.)

చంద్రరూప. ప్రియసఖి మంత్రిపుత్రుండు మనల నితరులకంటం బడక యతి నిగూఢముగఁ జని యీ పర్వతసానుతటీనిరూఢమాకందశాఖిసమూహంబునం దుండెడి మాలతీలతానికుంజంబునంతరంబున నతిజాగరూకతతో నుండి తన్నికటధరాస్థలంబునం జరుగు వేడుకలం గనుంగొన నగు నని చెప్పి పంపినవాఁడు గదా! మనము నట్ట చేయుం దము రమ్ము. అల్లదె యీగిరినిర్ఝరంబుం దాఁటిన నారసాలవనం బున్నయది. ఏలకో! లీలావతీ! సంకోచించెదవు?

తరుణాంబుజ. (చంద్రరూపహస్తంబు పట్టుకొని) కడు మందగమనంబునం జనుచు నడుగడుగున నిలువంబడుచు. ఓసి చంద్రరూపా! మనము ముగుదలము. మగవారలు సంచరించుచోటి కేకతంబునం బో నగునే!

చంద్రరూప. (నవ్వుచు.) ప్రియసఖి మగవారలపాలఁబడ లేక యెన్నిదినంబులుండఁ బోయెదవు. పెరవార లెవ్వ రేని యుండినం గదా జంకుపడవలయు! అట్టిమహాకష్టంబు సంప్రాప్తం బయినసమయంబున నాదరించిన మహోదారస్వభావుండు సన్నిహితుండై యుండ భయం బేల?

తరుణాంబుజ. (సలజ్జముగ.) ఓసీ యట్లైన నే నాచోటికిరాను.

చంద్రరూప. ప్రియసఖి! నావచనంబులభావం బన్యథాగాఁ దలంచితివి. పెర వార లుండిన వారివలనిభయంబు గల్గెనేని మనలం గావ నాకుమారుండు మునుగిటి పెన్ని ధానమయి యున్నవాఁడని వచించితి నంతియకాని యతం డయ్యెడసన్నిహితుండై యున్నాఁడని భావంబు గాదు. అట్లగు ననియే మొ భయపడితివి కాఁబోలు! వలదువల దాభావంబు! రహస్యముగఁ బోవలయుం గాన నడుగులిడి రమ్ము. ఇదె మాలతీనికుంజంబు దరిసిన యది. ప్రవేశింతము. (అని ప్రవేశ మభినయించిరి.)

చంద్రరూప. ప్రియసఖి! 'ఆపదలకోర్చి సంపదలనుభవింపు, అనువచనంబు సత్యం బయ్యె. మనకుం గలిగిన మహాకష్టంబుల కోర్వం జాలియుండినం గాదె యీయలిమనో హారస్థలంబులు గనుంగొను నామోదంబు సమకూరినయది.

తరుణాంబుజ. ప్రియసఖి! నీనుడివినవచనంబు సత్యంబ. (సపులకోద్భేదముగ.) ఈ సాధకుండు మనలం జంపం దెచ్చినవాఁ డయ్యును మనకియ్యెడఁ గొన్ని బహుకాల ప్రార్థితార్థంబులు సమకూరినకతంబున మేలు సేసినవాఁడ యనం దగును.

చంద్రరూప. (సస్మితముగ.) ప్రియసఖీ! ఇపుడు నీనుడివినవచనంబులలో సంప్రార్థి తార్థంబు లనుచో నీకు మొగంబున వింత లేనగవును గండతలంబులం బులకలును సర్వాంగంబులం జెమటచెమ్మటలును గల్గె నది యేలా?

తరుణాంబుజ. చిఱునగవుతో మొగంబు వాంచుకొనుచున్నది.

చంద్రరూప. ప్రియసఖి! నీవు నాకెఱింగింపక పోయినను నీ వామహాపురుషునిఁ గ్రొత్తగఁ జూచినకాలంబున నొకనిమిషంబు జిత్తజుం డనుసూత్రధారుని చేతిపుత్తడికీలు బొమ్మవయి యుండినవిధం బైన నెఱింగింపవే!

తరుణాంబుజ. (అసూయపడుచునదియుంబోలె.) ఓసీ కరము కఠోర మగునట్టిసమ యంబున నిర్వ్యాజప్రేమభరంబుం గానిపించిన మహోదారునికి మన మొనరించిన సత్కారం మున్నది? అట్టిపురుషపుంగవుని గన్నులం గాంచి యేని యతనియెడ

చంద్రరూప. ప్రియసఖీ! పరిహాసంబటే యిది? అన్నులకలమిన్నల వధింపఁబూనిన వానివలన నిర్వ్యాజప్రేమభంగంబునం గాచిపట్టిమహోదారునికిం దగుసత్కారం బొన రింపవలయునన్నది వన్నెకెక్కఁదగిన మాటయే. అట్లు లొనరింపవేని నిన్ను మాత్రంబు గాక యాయతిచండతరపరాక్రమసంపన్నుని సయితము కడు నిడుమలం బడం జేయఁగు నొక కటకటెఱుకుచేతం జిక్కి పెక్కువిధంబుల నప్రతీకారంబు లయినకష్టంబు లను భవింపంబోయెదవు. అప్పటికి నయ్యుదారచరిత్రుండె వచ్చి కావవలయును. ఒక కన్యకాజన వధమహాపాతకునివలనం దప్పించుకొన్నప్పుడ యీవు మఱియొక వియోగివధూవధమహా పాతకునిచేతం బడితివి. వానిబారికిం దప్పించుకొను నుపాయంబు నన్వేషణీయంబు.

రాజపుత్రుఁడు. (ఆత్మగతంబున.) వీరల లీలాలాపంబులు మానసంబున కొకించుక యాశ్వాసంబు గల్పించుచున్నయవి ఈతరుణాంబుజ యతిగభీరస్వభావ యగుటం జేసి మానసంబు బయలుపఱుపదు కానిమ్ము. క్రమక్రమంబుగ విశదంబు గాకపోదు.

తరుణాంబుజ. ఇంచుకకోపముతో. ప్రియసఖీ! యేల యీగేలిమాటలు! ఈనికుం జంబుననుండి మంత్రిపుత్రుండు సెప్పిన వినోదంబులు గనుఁగొందము.

రాజపుత్రుఁడు. (సంతోషముతో.) సుముఖి యగు నీచంద్రరూప యతిచతురతం బలుకుపలుకులకు నీభోజసుత యళీకకోపంబు నభినయించుచున్నది; కాని లోన నిర్భర ప్రణయ రసపూరితాంతరంగ యయి యుండుట మందస్మితంబువలనను సాత్వికచిహ్నం బులవలనను వెల్లడిం జేసెడిని.

తరుణాంబుజ. ప్రియసఖి. ఎ. అదె కనుంగొనుము. సర్వప్రకారంబులను నిన్నుం బోలిన యొకమచ్చకంటి యీరసాలశాఖివాటికలమాటునం దిరుగుచున్నయది. భయ ముతో. దీనిచేష్టలు గాంచిన మాయావధూటియని తోఁచుచున్నది. తొలుత నొక మాయలమారిదానిచేతం జిక్కియేకద కష్టం బయ్యె! ఇది యేమి సేయునో యని మది యందు భయంబు వొడమెడిని.

చంద్రరూప. ప్రియసఖి! భయంపడకుము. ఎ. అట్టిమహాక్రూరకాలంబున నచింతి తోపనతుండై కావం గడంగిన నిర్భరప్రణయనీరంధ్రమానసుం డిప్పు డొప్పురికించునే! ఓయొుప్పులకుప్ప! మఱియు నాకుమారుండు నీపయిం గన్ను వేసియున్నవాఁడు.

అంతఁ జంద్రరూపావేషధారిణియగు కర్ణకపాల ప్రవేశించుచున్నది.

కర్ణకపాల. (ఆత్మగతముగ.) కట్టా! నామగనికిం గడుఘోరం బగువధంబొనరించిన యాపాపపు రాచకట్టి కెట్టులైన నరిష్టంబు సేయక మానసంబున నుత్తలంబు వాయదు. ఈమూర్ఖుం డాదీర్ఘాక్షియందుఁ గరమనురాగంబు గలవాఁడు. కాన సులభసాధ్యం బగుటం జేసి యాకన్యక నేదేని నొక యిడుమకుం బాల్పడం జేయ నగును. వంచనా

చాతుర్యంబునం గాక వేఱొంట నదివాటపడదు. తదర్థంబ దాని ప్రియసఖియగు చంద్రరూపవేషంబు దాలిచివచ్చియున్నదానను. తరుణాంబుజయుఁ జంద్రరూపయుం నీనిర్ఝరిణీతటనికటభూముల వేడ్కమెయి సంచరించుచున్నవా రని విని యియ్యెడకుం జనుదెంచితిని. అయ్యెయ్యెడల నన్వేషించుచు ననువునఁ గని పెట్టి వారలకురంగటం జేరి నాయిష్టార్థంబు నెరవేర్చుకొనం బోయెదను. అని వనసంచారం బభినయించుచున్నది.

(తరుణాంబుజావేషధారిణియై యాంత్రనాసిక ప్రవేశించెను.)

ఆంత్రనాసిక. (ఆత్మగతంబున.) నాజనని కర్ణకపాల మదీయజనకునివధంబుం గని భయభ్రాంతయై పాఱిపోయినయది, యిప్పటికినెయ్యెడ నున్నదో యెఱుకపడదు. జననీజనకవియోగదుఃఖంబును నాకంత లేదు. రాజపుత్రునికిబాసటయై వచ్చియున్నమంత్రికుమారునిం జేపట్టి వానితోఁ గలసి యథేచ్ఛావిహారంబుల నానందంబు నొంద నాడెందంబు కరంబు కుతూహలపడుచున్నయది. ఆమంత్రికొమారునిపయిం గన్ను వేసి యతని ప్రణయపరిరంభాధిసుఖంబులకుఁ జంద్రరూప యువ్విళులూరుచున్నయది. ఆకుమారుండును దానియం దత్యుత్కంఠావిశేషంబునం బొలుపారుచున్నవాఁడు. తరుణాంబుజ చంద్రరూపకును జంద్రరూప తరుణాంబుజకును బ్రాణసమానలగు సకియలు. నే నిప్పుడు తరుణాంబుజవాలకంబుం బూనియున్నదానను. కాన నన్నుం తరుణాంబుజనుగా భావించి నాకడకాచంద్రరూప యేఁగుదెంచు. కపటవిధానంబునం దానిం దునిమి తదాకారంబుతో నాప్రాణనాథునిం గూడి సుఖింతుంగాక. నిండుజవ్వనులగు పువ్వుంబోఁడులకు నతిమనోహరరూపగుణ విభవంబులు గలపురుషసత్తమునితోఁ బొత్తుగలయుటకంటె సుఖంబు గలదె! అతనికింగలయావినయంబును అగాంభీర్యంబునుఆపరాక్రమంబును ఆచాతుర్యంబును ఆరూపంబును ఆయొలప్రాయంబును జూచినంతన నామనంబు కడు నచ్చెరువొంది కందర్పశరాసారంబులకు వెత లొందుచున్నయది. ఉద్దిష్టకార్యంబు సాధింప నగును చంద్రరూపవచ్చుచోటు లారయుచుం దదాగమనంబునకుం బ్రతీక్షించుచుండెద. అని యావనసంచారం బభినయించుచున్నది.

తరుణాంబుజ. ప్రియసఖ! కనుగొంటివే! ఈనిర్ఝరిణీతటంబునకు నావంటిది యొక్కతె యెక్కడనుండియొ చనుదెంచెడిని. ఇది యంతయుం నన్ను మోసపుచ్చి యిచ్చటకుం దెచ్చినయప్పాషండవధూవిలసితంబు గాని యొండు గా దని తోఁచెడిని. వీరలు మాయాబలంబున మన కేదేని యపకృతి సేయం బూనుకొందు రని మనంబున నులుకు గలుగుచున్నది.

చంద్రరూప. ప్రియసఖి! మన మాలతానికుంజంబునం డాగి యుంన్నారము గాన నీకపటవఘాటులు మనలం గని పెట్టలేరు. మఱియు నారాజకుమారుండు నీనికుంజపుం

జంబులకడ నెయ్యెడనైన నుండు నని మంత్రిపుత్రుండెఱింగించి పంపినవాఁడు సుమీ! కానభయంపడవలదు. ఈకపటవధూటు లొండొరులం గూడుకొనం బోయెదరు. వీర లొండొరుల వంచించు వేడ్కలు గనుగొందము.

అంత్రనాసిక. (సోల్లాసముగ. ఆత్మగతమున.) అల్లదె! ఆరసాలవాటికమాటునం జంద్రరూప సంచరించు చున్నయది. ఇది యొంటరిగఁ దిరుగుట యేలకోయెఱుకపడదు. ఏకతంబ యిది దొరకుట మేలయ్యె. దీని నాచెంగటికి రాఁబట్టం దగునుపాయంబు రచియింపంజనును. ఈనిర్ఝరిణీ తటంబున నొకయెడం గూరుచుండి సఖీవిరహావిధుర యయిన దానవుబోలె నంగలార్చుచుండెదం గాక. (అనికూరుచుండి. ప్రకాశముగ,.)

హా? ఏమి సేయుందును! ఓసి నిష్ఠురహృదయలార! అబల నపరిచితోద్దేశను నన్నిట్టు లొంటరిగ నీవిజనంబున విడిచి పో నగునే! నిష్కృతిమెయి నన్నిక్కడకుం దోడ్కొని వచ్చి యీవ్యాఘ్రభల్లూకసింహవరాహఖడ్గశల్యకప్రముఖక్రూరసత్త్వశరణ్యం బగునీయరణ్యమధ్యంబున డించి యేఁగితిరి గదే! ఇట్టిక్రూరకార్యంబు గావింప మీ కే నేయపకారంబుం గావించితినే. హాప్రాణనాథ! నాప్రాణాపాయకాలంబున నచింతితోపనతుండవై నిర్వ్యాజప్రేమభరంబునం గాచినవాఁడవు. ఇప్పు డివ్విధి సఖీజనవంచితనగు నన్నేల యుపేక్షించెదవు? తొలుత నీసాధకునిపత్ని సఖీవేషంబుతో నేతెంచి వంచించినగలివీరలును సఖీరూపంబుల న వంచింపం గడంగిరి. హా! ఏమి సేయుదును? నాప్రియసఖి చంద్రరూప నన్నుం బాసి పోయి కడుఁ దడ వయ్యె. అయింతి యొక్కతె నాకుం బరమార్థసఖి గాని యన్యలు గారు. ఆ నాబహిశ్చరం బగుప్రాణం బెయ్యెడ కేఁగెనో! ఎట్లునైతు! ఎవ్వతెను దిక్కనుకొందును. ఎవ్వతెతో సంలాపంబు సేయుదును! కట్టా! నేనుఅఖండభూమండలమండలాధిపతికి సుతనై జన్మించి నాతలవ్రాఁతవలన నీసాధకుని కిం జిక్కి యక్కొరునివలనం బ్రాణంబులు పోక యింక నెన్నియే నిడుమలం బడఁ బ్రదుకుపడసి యీగహనంబునఁ బులుల కెలుఁగులకు నోటంబడం బోవుచుఁ దప్పించుకొనినదయాడుచు నింతటితోఁ బోక యీకిరాతవధూవ్రాతంబుచేతం జిక్కి వారిలేని మాటలకు మోసపోయి యీనిర్జనవనంబుపాలైతిని. న న్నిఁక నెవ్వరు రక్షింతురు!. అని రోదనంబు సేయుచున్నది.

తరుణాంబుజ. ప్రియసఖి! ఈమాయలాడిమాటలు వింటివటే! ఔరా ఏమి దీని మోసము!

చంద్రరూప. ప్రియసఖి! దీనిమోస మటుండనిమ్ము. మఱియొకఁడు దాని మోసం బుంగనుంగొనుము.

కర్ణకపాల. (మహోల్లాసంబుతో.) ఆత్మగతమున. నాసేయంగడంగినకార్యంబునకు ఫలంబు సమకూరినయది. ఈతరుణాంబుజ సఖీవంచితయై యీనిర్జనస్థలంబున విలపించుచుం జంద్రరూపం జీరుచున్నది. సమయంబును సందర్భంబును గర మనురూపంబులై ఘటియించినవి. అచిరకాలంబునన యిష్టార్థంబు సమకూరం గలదు. దీనిచెంగటికిం జనియెదను. (అనియుపసర్పించుచున్నయది)

ఆంత్రనాసిక. (పురోభాగంబునకు దృష్టులు నిగుడించి. కపటపుసంతసంబుతో.) ఇదె నాప్రియసఖి చనుదెంచెడిని.

కర్ణకపాల. సరభసగతి నాంత్రనాసకడ కరిగి, ప్రియసఖి తరుణాంబుజా! వంత మానుము. ఏల యిట్లు కరంబు బరితపించెదవు. ఇయ్యెడ కేల చనుదెంచితివి? నిన్నెవ్వరు దోడ్కొని వచ్చిరి? శిరీషకుసుమరజంబు సోకినను నొచ్చునట్టిపేయకుసుందమ్ము లిట్టి శర్కరోస్థలంబుల నెంతవంతంగుందెనో! నవమృణాళసుభగంబై యొప్పు నీయంగకంబు లాతపక్లిష్టంబులై కాంతి దొరంగినయవి. ఉత్ఫుల్లశతపత్త్రసుందరంబగు నీనెమ్మోము ఖర కిరణకరంబులు సోకి కరంబు దీనభావంబుం గాంచినయది. ఇది నాకొనితెచ్చియిచ్చు నిర్ఝరిణీజలంబులం ద్రావి యీపాదపంబుక్రింద నొకింతతడ వుండి సేదదేర్చుకొని యనం తరం బిష్టం బయినచోటికిం జన నగును. అని నిర్ఝరిణీజలంబులు దోయిటం గొనితెచ్చి యిచ్చుచున్నది.

ఆంత్రనాస. (జలంబులంగైకొని. ఆత్మగతంబున,,)

దీనికంఠరక్తంబులు గ్రోలం దలంపుగలిగిననాకీజలంబులు గ్రోల మన సయ్యెడినే! అని యనుకొనుచు మొగంబు దుడుచుకొని యది కొనితెచ్చియిచ్చుజలంబులం గ్రోలినట్లు శ్రమాపనయనం బభినయించుచు. చంద్రరూపా! ప్రియసఖి వన్న నీవ కావే? నిన్నుం బాసి ప్రాణంబుం బాసినట్లుంటిని. ఇయ్యెడ నీపాటి నన్నాదరించువారు లేకపోవుట యట్లుండఁ బిలిచినం బలుకువారును లేకపోయిరి.

కర్ణకపాల. ప్రియసఖి తరుణాంబుజా! నీ కియ్యెడకేల రా నయ్యెను. తెల్పుము!

ఆంత్రనాస. ఓసీ యీకన్యక లిందఱు నిట్టిమోసగత్తె లని యెఱుంగక పోతినే! నే నీకపటకల్పితంబుల నెఱుంగను. తెల్లని వెల్ల పాలు నల్లని వెల్ల నీళ్లు ననుకొనుదానను. ఏమి సెప్పుదును. ఇట్టినాయందు కన్యకాకదంబం బెల్లఁ బయికిం బ్రణయసఖీజనంబు భాతి దోఁచుచు లోన నీసుఁ గొని యంక్కువంబునం బ్రవర్తించుచున్నయవి. అట్లుండు టకుం గారణం బేమొకో స్ఫురియింపదు. నే నేమియు వారల కపకారంబుఁ జేసిన దానం గాను.

కర్ణకపాల. ప్రియసఖి! నీ వెవ్వరికేని యపకారంబు సేసెడిదాన వని తలంప నైనం గాదు పో! నీపయి వార లీర్ష్యఁగొని యుండుటకుం గారణం బే నిరూపించి చూచితిని. నీరూపగుణవిలాసంబులందు రాజపుత్త్రుండు కరం బనురాగంబుం జెంది వారల నొప్పరికించుట యిందుకుం గతంబు గాని మఱియొండు గాదు.

అంత్రనాస. ప్రియసఖి నీబుద్ధిచతురతకు నేను మెచ్చుకొనియెదను. కలిగియుండు రహస్యార్థంబు యథార్థంబుగఁ గని చెప్పితివి. నీవంటిచతురలు గలరే! వినుము వార లొనరించినకపటకార్యంబు! నన్నిట్టిబెట్టిదంపుటిడుములు వడం జేసి విచ్చలవిడి నాప్రాణనాథునిం గూడివిహరింపం దలంపుఁగొనియే కాఁబోలు! నన్నందఱు ననారతంబు నిర్బంధించి తరుణాంబుజా! ఈకొండనెత్తమ్మున నొకసెలయే ఉద్భవించుచోటు గలదది చూడందగినయది. వేడ్కమెయిం బోయి వత్తము రమ్మని కడు నిర్బంధం బొనరించి తోడ్కొనివచ్చి నన్నియ్యోడం నిగనాడి యథాయథలై చనిరి. నీ వేకారణంబున నియ్యోడకు రానయ్యెను?

కర్ణకపాల. ప్రియసఖి! మీర లీప్రయాణంబునకుం గడంగునప్పుడే నయ్యోడ లేను. అనంతర మేఁగుదెంచినదానను. నీ వియ్యోడకుఁ బోవ సమకట్టుట విని యతిస్నేహంబు పాపంబ శంకించు ననునట్లు నీ కేమియిడుమ వాటమునో యని యుత్తలంపడుచు మీరువచ్చినజాడ లారయుచుం జనుదెంచితిని. నామనంబు దలంచునట్లు నీ వియ్యోడ నిట్టులు గోడుగుడుచుచున్నదానవు. దైవయోగంబున మన మిరువురమును జేరితిమి. ఇఁక భయంబు లేదు. ఈవును సేదదేరితివి. ఇంక మెల్లమెల్లన మనయిరవున కరుగుదమా! లేక యుద్దేశించినచోటికిం జని యీనిర్ఝరిణి యుద్భవించునయ్యోడం గలపెక్కువేడ్కలఁగలయం గాంచి మరలుదమా! ఇక్కానచరు లక్కడ ననేకవినోదంబులు గలవని చెప్పెదరు. నీయిష్టం బేమొకో? తత్ప్రకారంబునం బ్రవర్తింపుదము.

అంత్రనాస. (ఆత్మగతంబున.) దీనిని జమునియిరవున కనుపక నాయిరవునకుం జనుదునే! ఇదియ నాయభీష్టంబు. అది నిర్వర్తించునుపాయంబునం బ్రవర్తింపవలయు. (అని యనుకొని. ప్రకాశముగ.) ఏనొకప్పుడేని యిట్టివినోదంబులం గాంచినదానం గాను. శ్రమావహం బయ్యు నయ్యోడకుం బోయి రా నాసగొనుచున్నదానను.

కర్ణకపాల. అట్లైన లెమ్ము. శీఘ్రముగఁ బోయి మరలి వత్తము రమ్ము.

(అంత్రనాస లేచెను.)

ఇరువురును. (ఆత్మగతంబున.) దీని నీకొండపేటునకుం గొనిపోయిన నుద్దిష్టకార్యం బతిలఘుతరంబుగ నిర్వర్తింప నగును. అందు కిది యొడంబడునే!

అంత్రనాస. ప్రియసఖి! మనము వోఁ గడంగినచోటికి సమీపమార్గం బుండినం బోవుట సుఖకరంబు గాదె! అట్టిత్రోవం బరికింపుము.

కర్ణకపాల. ప్రియసఖి! ఈయెదుటం బొడసూపుకొండపేటు కెక్కిన నక్కడ కచ్చోటు కతిపయపదవిన్యాసగమ్యం బ యనియు; మఱియొందు క్రోవం బోయినం గడుద వ్వనియు నీవనచరులు సెప్ప విన్నదాన. నీ కెయ్యది యియ్యకోనం బోలు?

ఆంత్రనాస. ప్రియసఖీ! ఈకొండపేటున కెక్కియే సంకుచితమార్గంబునం బోదము.

అనియిరువురును దరలి గిరశిఖరారోహణ మభినయించిరి,,

చంద్రరూప. ప్రియసఖి! ఈ మోసకత్తె లిరువురు నన్యోన్యవంచనాచణలై పడఁ బోవుపాటులు కన్నులపండువుగం జూతము. నిశుంబంబు వెడలి రమ్ము.

తరుణాంబుజాచంద్రరూపలు వెడలి వచ్చిరి. రాజపుత్త్రుండును వారిపిఱుందనతరుణాంబుజ కెఱుకపడకుండ నిలువంబడియెను.

కర్ణకపాలయుం నాంత్రనాసయు నుల్లాసంబుతో నాత్మగతంబున,

దీని ననువుమెయి నీకొండపేటునకుం గొని తెచ్చితిని. ఇట్టి యుంక్కువంబున నీగిరి ప్రపాతంబునం బడఁద్రోసితినేని కార్యంబు చక్కంబడును. దేవునికరుణచే నిర్విఘ్నంబుగ జరుగవలయుంజూవే!

ఆంత్రనాస. (భయంబభినయించుచు.) ప్రియసఖి! ఏ నెన్నడిట్టిచోటులకుం జనుదెంచినదానం గాను. భయంబు వొడముచున్నది. నీచేయూఁతంగొని యియ్యెడ నిలువంబడి మనముందులోయయడుగునేలం గాంచెదను. అని కర్ణకపాలహస్తంబు వట్టుకొనుచున్నది.

కర్ణకపాల. ఓసీ! పడఁబోయెదవుసుమా! జాగ్రతతోఁ జూడుము.

ఆంత్రనాస. ఓసీ! వదలఁబోయెదవేమో! గట్టిగాఁ బట్టుకొనుము. నిన్ను నేను బట్టుకొనియున్నదానను.

ఇరువురును. (ఆత్మగతంబున.) నేను పట్టువదలుకొని దీనింబట్టి యీప్రపాతంబునం బడంద్రోయుఁదును. నామనోరథంబును సమకూఱినయది. (అని యిరువురు నొండొరుల చేతిపట్టులు వదలించుకొని వైళంబ యన్యోన్యగళంబులం జేతులు వైచి.) పడవే! పాపిష్ఠి ముండా! అని యొండొరులం బ్రపాతంబునఁ బడఁద్రోసికొని పడునట్టు లభినయించుచు నిష్క్రాంతలైరి.

తరుణాంబుజయుఁ జంద్రరూపయు. (నవ్వుకొనుచు.) తమతమ మోసము తమ్ముం జెఱుపకపోదు. ఇరువురు మోసకత్తియలును బరస్పరవంచనం బ్రవర్తించి భృగునిపాతం

తరుణాంబుజ. (హర్షంబుతో.) ప్రియసఖి! యీవినోదంబు రాజపుత్త్రుండు గనుంగొనినచో బాగుండునుగదే. (అని తిరిగిచూచి. వెనుకప్రక్క నారాజపుత్త్రుం డుండుట గనుంగొని. లజ్జావినయసంభ్రమంబులతో మోము వాంచి మందస్మితము సేయుచు. కడువడి నికుంజాతరంబు సొచ్చె.)

చంద్రరూప. (క్రీగంటం జూచి ఆత్మగతంబున.) ఈముగుద యచింతితోపగతుం డగురాజకుమారునిం గాంచి భయలజ్జాసంభ్రమంబులం గార్యం బెఱుంగక తానె యీతని చేతికిం జిక్కువడుదు నని తలంపక ముగుద యగుటం జేసి పరువుపాఱి నికుంజాంతరంబునం జొరంబడినయది. ఆకస్మికదర్శనంబున సంభ్రమించుచు నాకుం దెలుపక పోయె. లజ్జావిజితమన్మథ యగుటం జేసి మనోరథంబు రాజపుత్త్రునియందుండుటం బట్టియాకప్రవర్తించుచున్న దంతియ కాని యంతరంగంబున నతనితో సంభాషింప నిచ్ఛగించుచునె యున్నది. రాజపుత్త్రుండు నట్ల యున్నవాఁడు. నే నియ్యెడ వాసి యుండుట యిప్పటికిం దగవు. నెపం బొక్కండు సూచితంబు చేసి యవ్వలికిం బోయెదను. (ప్రకాశముగ.) ప్రియసఖీ! ప్రియసఖీ! ఎక్కడ కేఁగితివి! ఎక్కడకేఁగితివి? అని వెదకున ట్లభినయించుచు. ఓరాజకుమార! నాసఖిం దరుణాంబుజం గాంచితివే! నావెనువెంట నిలువంబడి యుండి యెక్కడకో చనియె. వేడుకకై న న్నలయింప నియ్యెడన తరులతాదులమాటున డాఁగి యుండును. అన్వేషించి తోడ్కొని వచ్చెదను. అని నిష్క్రాంత యయ్యె.

తరుణాంబుజ. (ఆత్మగతంబున.) ఆ! ఈచంద్రరూప నన్నుం గానక యన్వేషింపం బోయెడిని. ఎలుంగెత్తి పిలుతు నటన్న నీకుమారుండు చేరంగట నుండుటం జేసి సిగ్గగుచున్నయది. కట్టా! చంద్రరూప దవ్వులకుం బోయినయది; వెనువెంటం జనుదు నటన్న నీకుమారుండు దప్పించుకొనిపో ననువులేకయుండ నికుంజద్వారంబున నిలువంబడియున్నవాఁడు. ఏమిసేయుదును! ఈకుమారుని చేతం జిక్కితిని. ఈలేఁదీవియచాటున నైన నుందుం గాక. అని యట్లు సేయుచున్నది.

ఇంతలో నొకషట్పదంబు తరుణాంబుజ మోమున వ్రాలెను.

తరుణాంబుజ. (ఆత్మగతమున.) నే నీపూఁదీవియమాటునకుం జేర నాయంగంబు దాఁకి కదలిన యీ లేఁదీవియనుండి ఝుంకారముఖరితంబై లేచి గండుతుమ్మెద నామోమున వ్రాలుచున్నది. భ్రమరబాధనిరూపించి. కష్టము కష్టము! ఈతుమ్మెద యెంత దోలినను విడువక బాధించుచున్నయది. ఓ భ్రమరహతకమా! కన్యకలయం దిట్టిరట్టడిపనులు సేయు నిన్నుం బట్టి యపరాధి వని దండించువారలు లేరా!

రాజపుత్త్రుండు. (చిఱునగవుతో.) సమీపమునకుం జని. ఓముద్దులగుమ్మా! ఇం దపథంబు భ్రమరరాజంబు గాదు సేయునది! మఱి నీయంగకంబుల! విను మీషట్పదంబునకు·

ఉ. కామిని నీకరద్వయము కంజము లన్భ్రమఁ గొల్పె దీనికిన్
వేమరు గల్వపూసరులవిభ్రమము ల్గలిగించె చూపులున్
గోమలబంధుజీవ మని కోర్కులు గొల్పెను నీదు మోవియున్
కామద మైననీకబరి కల్పనజేసె స్వయూథమోహముల్.

తరుణాంబుజ. (ఆత్మగతంబున.) ఇప్పు డీకుమారుండు నన్నుం బల్కరింపం గడంగెడిని. మాటల కవకాశమును గల్పించుకొన్నవాఁడు. కులకుమారీజనోచితంబగు సహజలజ్జావశంవదత్వంబు మాని యితని కెట్లు ప్రత్యుత్తరం బొసంగం గలను. ఏకతంబునఁ జిక్కుకొంటి. ఇంక నేమిసేతు.

రాజపుత్త్రుఁడు.

ఉ. మత్తమతంగయాన యనుమానము మానుము నీకు నేను మే
నత్తకుమారుఁ డైనయందయార్యుఁడ నన్యుఁడఁ గాను నీదులో
కోత్తరసద్గుణావళుల నోలి జను ల్వొగడంగఁగూర్మి చే
నుత్తల మందుచుంటి నిను నుగ్మలి గాంచితి మోద మందితిన్.

ప్రాణదయితా! వినుము.

చ. సరసిజపత్త్రనేత్ర నిను సాధకుఁ డిందుల కర్థిఁ దెచ్చుటల్
సరసతతోఁ దలంపఁగను సారసగర్భుఁడు నామనోరథం
బరసి ఫలింపఁ జేయుటకె యాదటఁ దెచ్చె నటంచు నెంచెదన్
తరుణిరొ చూడు న న్వికచతామరసప్రతిమేక్షణంబులన్.

తరుణాంబుజ. (లజ్జావినయసంభ్రమంబులతో.) ఆర్యపుత్త్ర! నీవు నా మేనత్తకొమరుండ వని చూచినంతటన యెఱింగితిని. కులకుమారీజనంబునకు శీలంబును గులంబును లజ్జయుం రక్షణీయంబు లని యీవెఱింగినయర్థంబు గాదె.

గీ. వరునికరమున నిడునంతవఱకుఁ గన్య, తల్లిదండ్రులసొమ్మాట తథ్య మట్లు
గాన కులకన్యకల కెల్లఁ గాదు తామ, వరుని వరియించుటలు ధర్మవర్తనలకు.

రాజపుత్త్రుఁడు. కుమారీతిలకమా! నీనుడివినపల్కులు సత్యంబుల. పెద్ద లెఱింగియె పెండ్లిసేయుదురు గాక. నూలినీట్లు వెల్లువపోవు నని వితర్కింపవలసినది లేదు. అయినను నీకు నాయందుఁ బ్రణయభరం బుంట నిజంబగునేని మనయిరువురకుం జరిగిన యేకస్థలసమావేశంబునకుం దార్కాణగా నాకొక యభిజ్ఞానంబొసంగుము. నీవు గోరుదువేని నావలనం గైకొమ్ము.

తరుణాంబుజ ఏమియుం జెప్పక యూరకుండె,

రాజపుత్త్రుఁడు. తనకరంబుననుండు నంగుళీయకంబుందీసి తరుణాంబుజకరపల్లవం బందుకొని దానివ్రేల నిడి దానియంగుళీయకంబుఁ దాఁ గైకొని తనవ్రేల నిడుకొని యా వరారోహాముద్దుమొగంబు గరంబులం బుణికి ముద్దిడుకొనం బోయెను.

తరుణాంబుజ. వలదువలదు. (అని మోముమరలించుకొని.)కుమార! మీయంతటివారి కిది మేరలా! విరజాంబుజయు నేనును సమంబుగ భవత్ప్రాప్తికై వ్రతంబాచరించితిమి. ఈభాగ్యంబు దానికిందొరకినఁ గాని నాకుం బ్రియంబుగాదు.అదె చంద్రరూప యవ్వలి నికుంజంబుపొంత నిలువంబడి యున్నది. నే నియ్యెడం దడసిన నేదేని సంశయంబు గల్గును. ఏఁ జని దానితో నెలవున కేఁగెద. (అని నిష్క్రాంతయయ్యె.)

రాజపుత్త్రుఁడు. (దైన్యంబుతో.) ఇప్పు డియ్యెడనుండి,

గీ. అంబుజాతాక్షి దృష్టిపథంబుఁ బాయ, నత్తులకు భాగ్యదేవత యస్తమించి
నట్లు మానసమున కుత్సవావసాన, మట్లు దోఁచుచునున్న దిం కెట్లు నైతు.
బళీ! మంత్రిపుత్త్రుండు రచించినమంత్రం బిఱుదెఱంగుల ఫలంబు నొందినయది.
అయినను,

ఉ. సారెకు సారె కంగుళులఁ జయ్యన నేనును మోవిఁ గప్పుచుం
వారనిప్రేమతో వలదు వల్దని కోరిక లూరఁ జేయుచుం
పారఁగ నంసభాగమున వాస మరల్చినకాంతనెమ్మొగం
బారసి నెత్తితి న్స్మదము నందుచు ముద్దుగొనంగ లే దొగిన్.

ఇప్పు డట్టిమహామదం బబ్బకపోయినను నాచిత్తం బానందాంబుధి నోలలాడు చున్నయది.

ఉ. స్వేదము కంపమూం జెలఁగుచిన్నియొయారికరంబు పట్టి సం
మోదముతోడ నావలపుముద్రిక వ్రేల నిడంగఁగంటి నే
నాదరహాససుందరముఖాంబుజమం దుదయించుమన్మథో
ద్భేదకళావిచిత్రమృదుపేశలనూత్నవయోవిలాసముల్.

ఇదియ క్రమక్రమంబుగ నాకు మహాభ్యుదయంబు నొనగూర్చు. ఇదె సూర్యుం డస్తంగతుం డగుచున్నవాఁడు. ఇది నామనంబునకు నింపు సంపాదించెడిని.

గీ. ఆకళానాథుఁ డంబరం బందుఁ దమినిఁ, గరమిడఁ గడంగుటను గాంచి కరముసిగ్గు
పడుచు వేగ నిశాకాంత భానుబింబ, దీపకళికను వేడ్కమై దీసె నిపుడు.

ఏను నెలవునకుం బోయెదను. అనుచు నిష్క్రాంతుఁడయ్యె.

రససంజీవన నాటకంబునఁ జతుర్థాంకము సమాప్తము.

## పంచమాంకము

తపస్విని. (ప్రవేశించి.) సంతసము నందుచు. దైవవశమునం జేసి యాతపోవనమును బాయక యియ్యెడనుండుతపోనిష్ఠులం గరము కాఱియ వెట్టుచుండిన కర్ణకపాలయు దానికూతు రాంత్రనాసయు గిరిశిఖరమునుండి యన్యోన్యసంబద్ధలయి పడి ప్రాణవిహీన లయిరి. ఇట్లు వీ రగుటకుఁ గారణం బేమొకో? (విమర్శతో.) ఇతరకారణం బుండునని సంభావింపవలయునా! ఆపాషండకాంతలు సేయుచుండినసాధుజనోపద్రవంబ వారలం జంపియుండు. చేసేతఁజేసినకర్మం బనుభవింపక తీరునే! ఇంతదనుక నీపాపకర్మల వలని భయంబునం జేసి యాయాశ్రమమున నుండునేతపస్వి గాని స్వస్వనియతానుష్ఠానంబులు వైకల్యంబుం బొరయనీక యనుష్ఠించినవాఁడు లేఁడు. ఇది యౌర్వలేక విధి వీరికి భృగుపతనంబునమరణంబుఁ గావించెం గాఁబోలు? రమణీయంబులగు నీనిర్ఝరిణీతటనిరూఢ విటపినికరనిరంతరతపోవనంబుల నిరాతంకంబుగ నెయ్యెడఁ గాని యేకతంబ నిర్విఘ్నం బగుతపోనుష్ఠానంబు సల్ప నిఁక నేమియు నంతరాయంబు గన్పట్టదు. అని కొంతదవ్వు నడచి.(నలువలంకులు దిలకించి.) ఆ! ఏమి యీయాశ్చర్యము! ఏను నీయాశ్రమపదంబునం జేరిననాటంగోలె ననారత మతిభీభత్సంబులగు కార్యంబులు సలుపుచుఁ దపస్విల స్వాంతంబులకు దురంత తాపంబుఁ గల్పించుచుండిన చండాలకన్యకలును దదాశ్రయు లయినచండాలురును చేరువ నైనం గానరారు. (పురోభాగంబునకు దృష్టులునిగుడించి. భీభత్సముతో.) ఆచండాలురమృతకళేబరంబులు వికలంబు లయినకరచరణాద్యవయవంబు లతో నికృత్తకంఠనాసికాసహితంబులయి గృధ్రధ్వాంక్షసృగాలశునకభక్షితంబు లగుచుఁ దదాకర్షణబహిష్కృతంబులగు నాంత్రమేదోస్థి సంచయంబులతోఁ బొదలుచు నీ యాశ్రమభూములం గప్పియున్నవి. ఇది గనుంగొన నెవ్వండో తపస్వి జనసౌఖ్యవిధా యకుండగు ధర్మవత్సలుండు మునిజన విరోధంబు సేయుచుండిన యీపాపసమాచారులం బట్టి శిక్షితులం జేసినచందంబు మానసంబునకుం దోఁచుచున్నది. నేనుండినయాశ్రమంబు నందుఁ గర్ణకపాలాంత్రనాసికల మృతకళేబరంబులు వడి యాచోటు దూషితమగుటం జేసి యాశ్రమాంతరమునకుం జనంగోరి యీనిర్ఝరిణీతటంబునన యేఁగుదెంచుచుండునా కింత దనుక శుద్ధంబగు నాశ్రమపదం బుపలబ్ధంబు గాకయున్నది. ఎయ్యెడలు గనుఁగొన్నం జండాలశవాక్రాంతంబులై చూపట్టెడిని. ఏమి సేయనగును మఱియుం గొంతదూరంబు సని యన్వేషించెదను. అని గమన మభినయించుచున్నది.

(నేపథ్యంబున.) ఓసీ చంద్రరూపా! మనప్రియసఖి తరుణాంబుజ యించుక దుర్మనాయమానమానస యయినట్లు కనంబడుచున్నది. అట్లగుటకుం గతం బేమే! ఓసీ

యుండురూపా! మనప్రియసఖికిం గోపంబు గలిగి యుండుట సత్యంబ. అది ప్రణయ కోపం బని యెంచుకొనుము.

తపస్విని. (ఆకర్ణించి. మహాహర్షంబుతో.) ఆ! ఏమి నాభాగ్యము! పుత్రిక లిందు రూపయుం జంద్రరూపయు మాటలాడుచున్నట్లు వినంబడుచున్నది. (వితర్కంబుతో.) ఇయ్యెడకు వారలు రాఁ గతం బేమి? (ఉక్తవచన మాక్షేపించుచు.) అనవరత మాపుత్రికలం జింతించుటచేతఁ దన్మయత్వంబు నొందిన మానసంబునకు వారలవచనంబులు వినంబడునట్లును వారు ప్రేలం బొడసూపినట్లును దోఁచుచున్న దంతియకాని తథ్యంబు గాదు. అదియునుంగాక తరుణాంబుజ భోజరాజతనూజ. అదియు నియ్యెడకు రా గతంబు లేదు. (మహాశోకంబుతో) ఈదౌర్భాగ్యశాలినికి వెండియుం బుత్రికలవచనంబులు విను నంతటిభాగ్యంబుగలదే ! అభినవ వికసిత శతపత్రశోభామనోహారంబులై యొప్పునా కుమారికలముద్దునగుమొగంబులింకం గనుంగొనం బోయెదనే! బాల్యంబుందొట్టి యధ్యాత్మవిద్య నభ్యసించుచు సంసారంబున నాసఁగొనక పరబ్రహ్మపదావలంబనంబ జీవనంబుగాఁ గొని కామాదులం దలత్రొక్కనీక జీర్ణపర్ణజలాశననై సాంసారికసంసర్గంబు వాసి నా జననీజనకులు పుత్రి! రాజపుత్రిక వగునీ కీతపస్వినీవృత్తి దగునా! మాప్రార్థనం బంగీకరించి మాయెడం గలుగుప్రణయంబు సార్థకము సేయుచు గృహంబున నుండు మని వేఁడుకొనినను వారివచనంబు లభ్యుపగతములు సేయక నిష్కళంకం బై యొప్పువైరాగ్యంబుతోఁ దపోవృత్తి వనంబునన కాలము గడుపుచుండిన నాకు; మదీయాశ్రమంబునం దపంబునలుపవచ్చిన జననీజనకులపితృలోకప్రాప్తివృత్తాంతం బెఱింగింప నాతోఁబుట్టువు నింటికిం జనియుండుదాని కాతనిశిశువులం గాంచినంతన యట్టిమోహంబు వుట్టనేల ? ప్రతికూలం బయినవిధి గాదె! నన్నిట్టు లొనరించె. హా! ఏమందును! ఆబాలికారత్నంబులం గాంచిన దాదిగ నెడబాసిపోఁ గాల్దురాక పంజరనిరుద్ధంబగు శారికచందంబున నాశాపాశసంబద్ధనై రేపు పోవచ్చును మాపు పోవచ్చు ననుకొనుచు రాజగృహంబునన యుండి యనంతరము వారిశైశవక్రీడలం జూచుకోరికతోఁ గాలంబు గడపుచు వారితల్లుల కంటెం గడుబ్రియంబునం బెంచి యనారతము తదీయవిద్యావినయ సౌభాగ్యరూపసంపదల కానందపడుచు నుప్పొంగుచుంటిని. సంసారసంబంధము మానుకొనిననాకు విధి వారలయం దట్టిప్రేమావేశంబు పుట్టించుట వారి నెడఁబాపి దుఃఖసంతతులం ద్రోయుటకే కాఁబోలు? కానిచోఁ దల్లులకంటె నాయం దాయిరువురుకన్యకలకు నట్టినిర్వ్యాజప్రేమభరంబు గల్గునే! హా! నాయంకతలంబునం బెరిగిన యాచిన్నికన్నియ లేమయిరో? ఏగతివట్టిరో? ఎవ్వ రపహరించిరో ? ఎవ్వరిచేతం జిక్కువడిరో? ఏవగలం బొగిలెదరో? ఎట్లయిరో? (కన్నులనుండి వెడలు వేఁడిబొష్పములు వల్కలాంతంబునం

దుడిచికొనుచు. గద్గదకంఠంబుతో.) కట్టా! నాతమ్ముఁడు నాయుత్సంగతలంబున నాముద్దు బాల లుండం జూచినప్పుడెల్ల ముసిముసి నగవులు నగుచు ఓ అక్కా! యీపిల్లలకుం దల్లియుం దండ్రియు నీవయ్యైనవిధంబునం బెంచుచున్నదానవు; గాన వీరలకు విద్యాభ్యాసాదులయందు ననురూపవరసంపాదనంబునందును నీవ భరంబు వహింపంగలదానవు. నాకుఁగాని నీమఱఁదండ్రకుంగాని యిందుం బ్రయత్నింపవలయునన్నది లేదు. అని చెప్పుచుండును. అట్లై యేను వారలసర్వవిద్యావిచక్షణలం జేసితిని. ఏమిచేసియుం ఫలంబేమి? ఇప్పుడు నాపుత్త్రికలు పోయినవల నెఱుంగలేక దుఃఖసాగరంబున మునుంగవలసి వచ్చె. హా! ఏమిసేయుదు. ఇంతదనుక నాతమ్ముఁడు స్వసుతారత్నంబులు కరగళితంబులగుట విని యెట్టివగలం బొగులుచుండెడినో! ఏమైన నేమి సేయంగలను. కేవలము కన్యకామణులం దలంచుకొని యనవరతరోదనంబు సలుపుటదక్కం దక్కినపను లెవ్వియు నాకు స్ఫురింపకయున్నయవి. అని రోదనము సేయుచున్నయది.

(నేపథ్యంబున.) ఓసి చంద్రరూపా! ప్రియసఖికిం గోపం బెట్టి దయ్యె ననునయింపవలయుఁనటన్నది సఖీన్యాయంబునకు సముచితంబు గాదే. ఓసి యిందురూపా! నీనుడివినవచనంబు లవశ్యానుష్ఠేయంబుల. ప్రియసఖి యుండుపూఁబొదరింటికిం బోదము రమ్ము.

తపస్విని. (చెవియొగ్గి విని. మహాముదంబుతో.) తొలుత నేను పరస్పరసంవాదాత్మకమగుపుత్త్రికలవచనంబు లాకర్ణించి యది భ్రమంబని యనుకొంటిని. వెండియుఁ దొలుతటివిధంబున వినంబడియెడిని. ఇది భ్రమంబని తలంచుటకును గూడకయున్నది. విధి యిప్పు డనుకూలతం బ్రవర్తించి వెండియుం గుమారికామణుల నాకుం గానిపించునేమొ! నియతికిం గలసామర్థ్యం బనిర్వచనీయంబు. (కుతూహలంబుతో.) కుమారికామణులసంలాపంబులు వినంబడుచున్నవిగాని వారలయుండుచోటు లెఱుంగంబడవు. మానసంబు కరంబు రయంబున పుత్త్రికలంజూడ సంభ్రమించుచున్నది. (వెండియును చెవియొగ్గివిని.) ఇయ్యెడకు దక్షిణంపువృక్షవాటికల మఱుంగున నీనిర్ఝరిణీతటనిరూఢమాధవీలతానికుంజంబున నుండి కొందఱు కన్నియలు మాటలాడుచుండెడువిధం బవగతం బయ్యెడిని. ఉద్వేగంబుతో. ఇందాపుత్త్రికలు గనంబడరేని యేనుప్రాణంబులు ధరింపం జాలను. ఎట్లయ్యెడినో? పోయికనుగొందు. (అని నిష్క్రాంతయయ్యె.)

విష్కంభము

---

తరుణాంబుజయుఁ జంద్రరూపయు నిందురూపయుం బ్రవేశించుచున్నారు.

నుండి మరలివచ్చినది మొ ప లించుకదుర్మ నాయమానంబగు మానసంబుతో నున్నటులు ప్రియసఖిని దలంచెదను. ప్రియసఖి! నేను నీ కేమేని యప్రియంబుం గావించితినే!

తరుణాంబుజ. మోముద్రిప్పుకొని యూరకున్నది.

చంద్రరూప. (తరుణాంబుజం గౌఁగిటకిం దీసికొని మోముమోమునం జేర్చి చుబు కంబుపట్టియెత్తి.) ప్రియసఖి! ప్రియసఖి! ఏలనే మాటలాడవు? నేను నీకు విప్రియంబు నేదేని జేసితినటే?

ఇందురూప. ఓసిచంద్రరూపా! నీ వేదేని విప్రియం బొనర్పక ప్రియసఖి కింత మనస్తాపంబు గల్గునటే! నీకుం బుట్టిననాటందొట్టి యెదటివారి నించుక నీయుల్లా సంబునంజేసి చమత్కారంబుమెయిఁ బలుకులనొండెఁ జేతలనొండె విరసడంజేయుంట కాదా చిత్రమగు స్వభావగుణమయి యున్నది. అట్టిప్రియసఖియందుఁ బ్రవర్తిం చితివని తోఁచెడిని.

చంద్రరూప. (నవ్వుచు) ఓసి యిందురూపా! ఆగుణము నా కుండిన నుండుంగాక. ఎల్లవారలకు నన్నియు సద్గుణంబులే యుండెడినే? ఇప్పుడట్టు లేదేని ప్రియసఖియందుఁ గావించిన తెలుంగు నామనంబునకుసయితము దోఁపదే! (తరుణాంబుజంజూచి.) ప్రియ సఖీ! ప్రాణంబులకంటెం బ్రియురాల వగునీవు నాతోఁ బలుకవేని నా కీప్రాణంబులేల? నాప్రాణంబులపై యాస విడ వదలిపెట్టెదను.

తరుణాంబుజ. (సానునయముగ.) అట్లనకుము. ఎ. నిన్ననీవు మాకందతరువాటిక నడుమ నన్నొంటిగా వదలిపోతివి. ఇట్లునేయనగునా! ఇది నామనంబునం గలకోపము!

చంద్రరూప. ప్రియసఖి! నా వెనుకప్రక్క నున్నట్టులుండి నీవు కనంబడకపోతివి. నవ్వటాలకు దాఁగికొంటివో యని చెంతల నుండుపూఁబొదరింట నొక్కొకదానియం దును వెదకుచుంటిని. ఎక్కడఁ జూచినను గనంబడకపోతివి. పూర్వ ముండినపూఁబొద రింటం జూతమని మగిడిరా రాజకుమారుండు తదంతరంబున నుండునట్లు తెలిసినకతం బునఁ దన్మధ్యవర్తినివగు నీకడకు రా నయితిలేక యుండె. ఇది నేఁజేసినవిప్రియంబటే

ఇందురూప. (నవ్వుచు.) ఓసి చంద్రరూపా! చాలుంజాలు! మాటలునిలుపవే!ఇట్లొ నర్చిన నెవ్వతేకేని కోపంబు గలుగక యుండునటే! ఏమియుం నెఱుంగనిగోల నొంటిమై వదలిపెట్టం జనునా.

చంద్రరూప. ఓసి అట్టిప్రాణాపాయసమయంబున నచింతితోపనతుఁడై కాచిన కరుణాయత్తచిత్తుండగు రాజకుమారసత్తముండు దగ్గఱకుం జనుదెంచియుండ నొంటరిగ వదలిపెట్టితినటన్నమాట యెట్టిదే!

ఇందురూప. ఓసి అన్యపురుషసన్నిధానంబునఁ గన్నె నొంటిగ వదల నగునా?

చంద్రరూప. ఓసి యిందురూప! ఆ రాజకుమారుం డన్యుం డని యనుకొంటివో! కాదుకాదు! ప్రియసఖికి మేనత్తకుమారుం డుదయాదిత్యుండు.

ఇందురూప. (వైలక్ష్యంబుతో.) ఓసి చంద్రరూపా! మనయన్న యుదయాదిత్యుఁడటే యీ కుమారుండు. ఔర! కరము కఠోరమగుసందర్భము కడువడిం గడు మోదావహం బయ్యె. ఇట్టియపరిమితామోదామృతలహరీపరంపరల నోలలాడుసందర్భంబును భగవతి కాత్యాయని గనుంగొనెనేని యెట్టియసదృశామోదంబుం జెందునో! ఈమహాభ్యుదయకాలంబున మనలం గాంచి సంతసించుచు నా భగవతి ప్రేమభరపరవశ యయి కౌఁగిటం బొదివి యాఁదల మూర్కొని యానందజలబిందుబృందంబుల నభిషేకంబు సేయుభాగ్యంబు లేకపోయెఁగా!

చంద్రరూప. (ముందుకు దృష్టులు నిగుడించి. వైళంబ లేచి. సత్వరముగ.) అదిగో! మన మేనత్త భగవతి కాత్యాయని యియ్యెడ కేఁగుదెంచుచున్నది. ఎదుర్కొందము రమ్ము.

ఇందురూప. (మహోహర్షంబుతో. సత్వరముగ లేచి.) ఓసీ! భగవతి యెక్కడెక్కడ!

చంద్రరూప. ఇదె యంత్తరమున మాకందతరుచ్ఛాయలం బొడగనుము.

ఇందురూప. (నిక్కిచూచి. ససంభ్రమముగ.) ఇదె భగవతి సమీపమునకె వచ్చినది. ఎదుర్కొందము రా! (అనుచుఁ జంద్రరూపను జేయిపట్టి తిగుచుచు దానితో నిష్క్రాంతయయ్యె.)

తరుణాంబుజ. (పురోభాగంబునకు దృష్టులు పఱపి. ఆత్మగతంబున.) ఔర! ఈ భగవతి,

ఉ. పావనభూతిపుండ్రయుతఫాలతటంబు ద్రవాళవల్లరీ
భావితపాటలద్యుతివిభాసుర మైనజటాసమూహముఁ
పావకదీప్తిజాలపరిపాటిఁ దనర్చుశరీరకాంతి యుఁం
పాపహిలంగఁ జేయఁ దను వందినశాంతియొ నాఁ గఁ బొల్చెడిన్.

అంత నిందురూపాచంద్రరూపలం గౌఁగిటంబొదవికొని కాత్యాయని ప్రవేశించుచున్నది.

కాత్యాయని. పుత్రి చంద్రరూపా! మాకంటె భగవతీప్రసాదంబునకుం బాత్రము గావలసినమాప్రియసఖి యెక్కడతె గల దంటివే! ఆయుత్తమగుణనిధి యెక్కడ నున్నది? చూపుము చూపుము. అ.

చంద్రరూప. భగవతి యిదె మాప్రియసఖి తరుణాంబుజ.

కాత్యాయని. (తరుణాంబుజను నిర్వర్ణించి.) ఔర! ఈ బాలికామణి చక్కందన మేమని పొగడంగలదాన.

ఉ. ఇందిర కీవినీలకచ యింపుగఁ జేసినమాయసృష్టియో
యిం పుకళాకలాసరమ కీమృదుశాంగి నవాలిదేశమో
అందపుఁగార్శ్యయుంగులకు నబ్జముఖీమణి పూఁటకాపో యీ
చందనగంధి యబ్జభవుచక్కనితోల్తటిసృష్టియో యిలన్.

చంద్రరూప. ప్రియసఖి తరుణాంబుజా! ఈ భగవతి విదర్భదేశాధీశుండగు మానపాలమహీపతికి సహోదరి కాత్యాయని యనం బరగు. మాకు మేనత్త. బాల్యంబుం దొట్టి సంసారవిరక్త యగుచుఁ దపోవృత్తి నుండి మాయందలివాత్సల్యంబునం గొన్ని హాయనములుగ విదర్భనగరంబున నస్మద్విద్యాభ్యాసాదికార్యవ్యాపృత యగు చుండె.

తరుణాంబుజ. ప్రియసఖి చంద్రరూపా! ఈభగవతి మీకు గడుగౌరవ్య యగుచుట్టం బయినచో నాకట్టిద కాదా! వేఱుగఁ జెప్పవలయునే! (అని లేచి ప్రణామం బాచరించుచున్నది.)

కాత్యాయని. వత్సా! సకలభూపాలమౌళిమాలామరీచినికురుంబచుంబితచరణకమలుండగు నభిమతక్షత్రియకుమారునిం జెట్టపట్టుదువు గాత. (అని యాశీర్వదించె)

చంద్రరూప. భగవతి! నీనుడివినయర్థంబు ప్రియసఖికి మున్న సంప్రాప్తం బయ్యె. భవదుక్తంబులగు వచనంబులు సంప్రాప్తార్థకథనంబునం జేసి నిరర్థకంబులం గావు.

కాత్యాయని. (తరుణాంబుజను గౌఁగిటం జేర్చుకొని మూర్ధంబాఘ్రాణించుచు.) పుత్రి చంద్రరూపా! ఇదేలకో యెఱుంగ! విమ్ముం బాసి యుండి యిప్పుడు వెండియుం బడసినప్రాణంబులరీతి భవల్లాభంబుం గాంచుటంబట్టి నిస్సీమం బైకలుగు మహామోదంబుకన్న నీబాలికావతంసంబుం గనుంగొనుటం బొడమినసంతసం బు కరం బధికంబై యున్నది. నేనీమృగశాబనయన కిడినదీవన సంప్రాప్తార్థం బయ్యె నంటివి. దీని నిర్వ్యాజప్రణయభరంబునకుం బాత్రత వహించి జన్మసాఫల్యంబును గావించిన మహాభాగధేయుం డెవ్వఁడే రాజకుమారుండో? ఈ సుకుమారీతిలకంబు ననురాగపూరతరంగి

తంబు లగుకటాక్షమాలికలచే నీరాజితుం డగునాతని యడుగుందమ్ములకు సర్వసర్వంసహా చక్రభూపాలమౌళిమణిమరీచినిచయంబులు నీరాజనంబులు సలుపకున్నే

చంద్రరూప. భగవతీ! ఈమహాభాగ్యంబునకు మాయన్న యుదయాదిత్యుండ తగినవాఁ; డతండ యీయతిశయంబునకుం బాత్రంబయ్యె.

తరుణాంబుజ. (సిగ్గుచేఁ దలవంచుకొనుచున్నది.)

కాత్యాయని. (మహామోదంబుతో నానందబాష్పంబులువిడుచుచు.) పుత్రీ! మన ప్రతాపాదిత్యునికుమారుం డుదయాదిత్యుండటే దీనిమనోనిబంధనం బయినవాఁడు. ఇంత కంటె మనకుఁ గావలసిన దేమి యున్నది. (అని యాతరుణాంబుజచుబుకంబు గరంబుల నెత్తి.) వత్సా! తరుణాంబుజా! నీవు వధు వగుటం జేసి మానిజయాదిత్యునివంశంబు వన్నె గాంచె. అని ముద్దిడుకొనుచున్నది.

చంద్రరూప. భగవతీ! సింధులునికూఁతు రార్యధరాపతి ప్రతాపాదిత్యునిం జేపట్టినవిశేషంబున కాతనికుమారుండగు భోజభూపతిముద్దులపట్టి ప్రతాపాదిత్యునిపట్టి యగునుదయాదిత్యునిం గోరినతీరు కరంబు సరసజనాభినందనీయంబై యుండలేదా!

కాత్యాయని. (శ్లాఘించుచు) పుత్రి చంద్రరూపా! ఈసంబంధము సరసజనానంద నీయ మనుట యట్లుండ నిది యెఱింగి వచించిననీవచనంబు లతిశ్లాఘాపాత్రంబు లన వలసియున్నవి. వచించెదను వినుమా.

క. ఈమగువ కాకుమారునిఁ, గామించుట సుగుణగణము గలుగుటకు ఫలం
బీమానినీమనోరథ, సీమం బోలుపాయటయ విశేషమనికిన్.

ఇందురూపాచంద్రరూపలు. భగవతీ! నీనుడివినవచనంబులు సత్యంబులు.

గీ. అపరస్పరనిర్వ్యాఘ్ర మయినప్రణయ, భరము శ్లాఘ్యాన్వయంబును భద్రగుణము,
లక్షులకు నుత్సవవిశేష మబ్బఁజేయు; నతిశయంబును గూర్పవే యతివ నతని.

కాత్యాయని. పుత్రి చంద్రరూపా! మాటలపరాకున నడుగ మఱచితిని గదే.

నయనోత్సవము లాండోరులకుం గలుగం జేయుంవా రని నీనుడివినవచనంబుల స్మరణంబునకు వచ్చె. ఒకయర్థంబు నిన్నడుగవలయు. నేను తొలుత నీమృగశాబక యననాశీర్వదించునప్పు డుత్తమభూభృత్కుమారునిం జెట్టపట్టుదువుగాక యని చెప్పిన వచనంబున కీవు నాతో భగవతి నీనుడివినయర్థంబు ప్రియసఖికి మున్న సంప్రాప్తంబయ్యె ననియంటివే! అదెట్లు? ఆయుదయాదిత్యుండు కుమారుండు గా నియ్యెడ కేతెంచెనో? కాక వేఱువిధంబున నిర్వృత్తం బయ్యెనో?

చంద్రరూప. ఆకుమారుండకదా! యీతరుణాంబుజను మన్మ నియ్యెడం గఠోర కపాలుం డనుక్రూరకర్మునిచేతం జిక్కికొని మృత్యుగ్రస్తలైనవారిం గాచినవాఁడు.

కాత్యాయని. ఆ! కఠోరకపాలునిచేతనా మీరు సిక్కుకొన్నవారు? కష్టము, కష్టము! దైవవశంబునం జేసి మృత్యుదంష్ట్రలనుండి మీర లాకుమారునిచే విడిపింపం బడినవారల! ఎట్లు చిక్కుకుంటిరి? ఎట్లుకుమారునివలన విముక్తలయితిరి. ఆవృత్తం బనంతరము వినంగలను. మీర లతని నెప్పుడును గాంచనివారు గదా! అతండు మాయన్నయుదయాదిత్యుండని యెట్లెఱింగితిరి?

చంద్రరూప. భగవతి ప్రియసఖి తరుణాంబుజకు మేనత్తకుమారుం డుదయాదిత్యుం డితఁడని వింటిని. దానంజేసి తక్కినసంబంధంబును దెలిసికొంటిని.

తరుణాంబుజ. (సభయోత్కంపములతో. ఆత్మగతంబున.) ఈసాహసురాలు నే నేకతంబుననుండం బూఁబొదరింట నార్యపుత్రుండు నాతోనాడినమాటలు పొంచియుండి విని భగవతీసన్నిధానంబున నుద్ఘాటితము సేయుచున్నది. ఏమిసేయుదును ?

కాత్యాయని. పుత్రి చంద్రరూపా! అట్లయిన నాకుమారుం డియ్యెడన యున్నవాఁ డని యవగతం బయ్యె. వానిం గనుంగొన మానసంబు త్వరాకులితం బయి యున్నయది. ఇందురూపా! ఈవు సని యాకుమారునిం దోడ్కొని రమ్ము పొమ్ము.

ఇందురూప. (పోవం బ్రయత్నించుచున్నది.)

తరుణాంబుజ. (ఆత్మగతంబున.) ఈచంద్రరూప పూర్వదినంబునం బూఁబొదరింట నన్ను నాకుమారునిచేతం జిక్కుకొనున ట్లొనర్చినది. కడు సాహసురాలు. సంతతము పరిహాసము సేయుస్వభావముగలది. ఆర్యపుత్రుని మోము పీరలయెదుటం గనుంగొనఁ గడు సిగ్గగుచున్నది. ఇది నన్నుఁ గేలి సేయకపోదు. ఏమిసేయనగును. (ఆలోచించి.) సరి! ఇది యుపాయము! మంత్రిపుత్రుం గూడఁ బిలిపింపు మనిన నీసఖులు తదనురక్తలగుటంజేసి లజ్జాకులితలయి యించుక యడకువం గొని ప్రవర్తింతురు. అతనిని రప్పింప నగును. అని చింతించి. ఇందురూపం బోనీక పట్టుకొని. భగవతి అతనిప్రియసఖునింగూడఁ దోడ్కొనిరా నానతిసేయుము.

కాత్యాయని. పుత్రి చంద్రరూపా! ఉదయాదిత్యునిప్రియసఖుండు మిత్రసహుండును సనుదెంచియున్నవాఁడా! మిగుల సంతసంబయ్యె! ఆకుమారునిగూడ దోడ్కొనిరమ్ము.

ఇందురూపాచంద్రరూపలు. మందస్మితంబు సేయుచుం దలవాంచుకొనియుండిరి.

తరుణాంబుజ. (నవ్వుచుఁ గాత్యాయనిమొగంబుం గాంచుచున్నది.)

కాత్యాయని. (హర్షంబుతో.) పుత్రికలార! ఏల తలవంచుకొంటిరి. (ఆత్మగతమున.) ఈయిరువురు నాతనియం దనురాగంబుం గాంచియుండువా రని విస్పష్టంబయ్యెడిని. ఈకన్నియల కనురూపవరసంపాదనార్థంబు నాపడినపాటులు సార్థకంబు లయ్యెం గాంబోలు! ఇదియుం మఱియొందు సంతోషవిశేషంబు గాదె! (ప్రకాశముగ.) పుత్రికలార! యతనిదోడ్కొనివచ్చుటకు మీ కంత సిగ్గయ్యెనేని మనమందఱమును వా రిరువు రుండుచోటికిం బోవుదము. (అని వారలతోఁ గొన్నియడుగులు సనియె.)

తరుణాంబుజ. (నవ్వుచుం జంద్రరూపేందురూపల మొగంబులు గాంచుచున్నది.)

కాత్యాయని. (పురోభాగంబునకు దృష్టులు నిగుడించి. నయనంబులం దొరఁగు నానందబాష్పంబులతో.) పుత్రి చంద్రరూపా! ఆగుజ్జులేమావినీడం గూరుచుండి మన్మథవసంతులు వోలె నొప్పుచుండెడు వారలేకదా! మిత్రసహోదయమాదిత్యులు.

చంద్రరూప. భగవతి! ఔను.

కాత్యాయని. ఓసి బాలికలార! అట్లయిన దగ్గఱకుఁ బోదము రమ్ము. (అని పరిక్రమించుచున్నది.)

రాజపుత్రుండును మంత్రిపుత్రుండును బ్రవేశించిరి.

రాజపుత్రుఁడు. ప్రియవయస్య! మనము కఠోరకర్ముండగు నీసాధకునివలన నీ బాలికామణులప్రాణంబులు గాచితిమి. వీరి నియ్యెడ డించిపోవుట భావ్యంబు గాదుగదా! వీరల మననగరంబునకుం దోడ్కొనిపోదమటన్న ననేకసంధర్భవిరోధంబులు వొడసూపెడిని. ఈభోజరాజసుతం దీసికొని చనిన నే నీకన్యక నపహరించితి నని ప్రవాదంబు గలుగకపోదు. ఇది నామేనమామ యగుభోజునికిని నాజననీజనకులకును నాయెడలనసూయ పడుటకుం గారణంబగును. ఇందు జరిగినయర్థం బెఱుంగక వారు నన్నుం దూలనాడుట సత్యంబు. అదియునుం గాక యీయిందురూపాచంద్రరూపలును విదర్భేశ్వరునిదుహితలయి యుండనోపుదురు. అట్లయిరేని నాకుం జెల్లెండ్రగుదురు. వీరల నెవ్విధి నెయ్యెడ కంపఁజను! భోజకుమారియుం వీరును బ్రాణంబులకంటె సోదరులకుం బ్రియలై వర్తించుచుండెదరు. వీరల నెడబాప మానసంబు రాకున్నది. ఒక్కయెడ నుంతు మట న్ననో వారివారిజననీజనకులు వృత్తాం తెఱింగిరేని మన మేదేని యప్రియంబు సేయం గడంగినట్లు దలంతురు. ఇందు సేయంగల యర్థం బిట్టిదని నిర్ధారణము సేయంజాలక యున్నాఁడను. మనము మనజననీజనకులకడ నాజ్ఞవడసి వచ్చినదినములు గడచినయవి. ఇఁక నియ్యెడం దడయుటకు ననువుపడదు. తక్కుంగల రాజకన్యకాసహస్రంబులలోని వారును స్వకీయగురుజనప్రదర్శితు లగునుత్తమరాజకుమారులం జేపట్టవలసినవారలకాని కన్యకాత్వంబుతో నుండవలసిన వారలు గారుగా! వారివారిపుట్టినిండ్లకడ కంపివేయుద

మటన్ననో వారికిం జెట్ట సంభవించు నని తోఁచుచున్నది. సాధకానసమ్మత లయినవార గుట యప్పటి కెవ్వరికిం దోఁపదు. పంపినవానియందు దోషారోపణ మొనర్చి రాజపుత్రులు పరిణయంబు చేసికొన విరమించుకొందురు. ఇందు ధర్మవిరుద్ధంబు గాకుండ నందఱకు సుఖావహంబుగ నపవాదవిరహితంబుగం బ్రవర్తింపవలసియున్నది.

మంత్రిపుత్రుఁడు. యువరాజ! ఊరక యేల విచారించెదవు? ఈకన్యకలకు విధి యనుకూలప్రవర్తనపరాయణుండై యియ్యెడకు రప్పించినవాఁడు. నిన్ను హేతువుగఁ జేసి వారలకు సంప్రాప్తం బయినయిడుమం దొలంగించె! ఈపాటి మేలు చేసినవాఁడు తక్కిన కార్యంబున నిదురించుచుండునా! మఱియొక ప్రేల్మిడిం గలుగంబోవు సంతోషాదుల మన మించుకయుం నెఱుంగం జాలముగా!

రాజపుత్రుఁడు. (ఎదుటం గనుంగొని.) ప్రియవయస్య! అదె కనుంగొనుము. ఒక వృద్ధతపస్విని యిందురూపాచంద్రరూపలను భోజతనూజాతను వెనువెంటం దోడ్కొని మన ముందుకడకుం జనుదెంచెడిని. ఈతపస్విని యెవ్వతయో?

మంత్రిపుత్రుఁడు. యువరాజ! ఈమువ్వురబాలికామణులం దోడుకొని వచ్చుటం జేసి యీతపస్విని యిం దొక్కతెకొండె నిరువురకొండెఁ జుట్టమ యై యుండునని తోఁచెడిని. అదియు నుత్తరనిమిషంబున నెఱుంగం బోయెదము.

రాజపుత్రుండు. ప్రియవయస్య! నీచెప్పినవచనము సంగతార్థంబ యని తోఁచెడిని. ఎట్టయినను గారవింపందగినదియు కాదె!. అని మంత్రికుమారునితో లేచి నిలువం బడియెను.

కాత్యాయని. (దగ్గఱకుం జని.) ఆయుష్మంతులార! ఉత్తమరత్నలాభంబుచే వర్ధిల్లుదురుగాత.

చంద్రరూప. ఆర్య! ఈతపస్విని మామేనత్త! నీకును మేనత్తయె! ఈభగవతి పేరు కాత్యాయని. ఈపావనచారిత్ర యింతకుం దవ్వులం దపంబు సేయుచుండి మనపుణ్యావిశేషంబుచే యాదృచ్ఛికప్రయాణంబున నియ్యెడకుం జనుదెంచినయది.

రాజపుత్రుఁడు. ససంభ్రమముగ. భగవతి! నే నిదె యుదయాదిత్యుండ నభివాదన మొనర్చెదను. (అని నమస్కరించెను,)

కాత్యాయని. వత్స చిరంజీవ! (అని యాశీర్వదించి. రాజకుమారునిం గౌఁగిటం జేర్చి. మంత్రిపుత్రుండభివాదనముసల్ప నాశీర్వదించెను.)

కాత్యాయని. (రాజకుమారు నంకతలంబునం గూరుచుండం బెట్టుకొని యౌదల మూర్కొని, బాష్పవృత్తికలుషంబగు కంఠంబుతో నిట్లనియె.) వత్స! ఉదయాదిత్యుఁడా! నీవు పసివాఁడ వగుటం జేసియు విద్యాభ్యాస సమాసక్తుండ వగుటం జేసియుం నెఱింగియుండవు. నీ పితామహుండగు విజయాదిత్యుని సహోదరుం డైనబలపాలుని విదర్భదేశాధీశ్వరుండు జయపాలుండు సంతానశూన్యుం డయినకతంబునం దనకుం గృతకాపత్యునిగ నంగీకరించి విదర్భరాజ్యాభిషిక్తునిం గావించె. బలపాలునికి నేను మానపాలుండును జనించితిమి. మానపాలునిముద్దుకూతు లీయిందురూపయుం జంద్రరూపయు ననువారు. కాన నీకుం జెల్లెండ్ర యయిరి. నిన్నుం గనుంగొనం బెక్కుపర్యాయంబులు వీరు నన్నడిగియుం వీరలకు విద్యావ్యాసంగంబు నెడ ననర్థంబు మనంబున నుంచుకొని వీరల ప్రార్థనంబులకుఁ గానిందు కానిం డని కాలహరణంబు సేయుచువచ్చితిని. నేను బాల్యంబుదొట్టి తపోవృత్తి నుండుటం జేసి వసుమానసంబునకు రాక యున్నదానం గాన నన్ను నీ వెఱుంగవు. విదర్భనగరంబున నే నుండునప్పుడు నీకు భోజసుతారత్నంబులఁ బరిణయము సేయవలయునని ధరావతియుఁ బ్రతాపపాలుండును బ్రయత్నించుచున్నారని విని కరము మనంబునందిన నాతమ్ముఁడు మానపాలుఁడును నామఱఁదండ్రు మదనమాలినీమదనవతులును పుత్రికలం దోడ్కొని వచ్చి మిమ్ముఁ జూడవలయు నని యుంటిమి. నీకు నీతరుణాంబుజావిరజాంబుజలకుఁ గాఁబోవునత్యనురూపదాంపత్యంబుం గని సంతసింపఁ దలంపుఁ గొని యుంటిమి. ఇప్పుడు నిన్ను నీతరుణాంబుజను గనుఁగొను భాగ్యంబుం గంటిని. నీ వీయభిజనవిద్యారూపవయోవిభవంబులఁ దద్దయు సమానలగు భోజతనూజాతలం బరిణయంబగు మహోత్సవంబును గనుంగొనం బోయెదను. నీ వీభోజతనూజాతను దక్కంగల కన్యారత్నంబులను సాధకునిబారిం బడినవారలం గావిన వృత్తాంతంబు భోజభూపాలునికిని మానపాలునికిని వారలకాంతలకును క్రమంబునం దెలిసి యసంపూర్ణషోడశవర్ష వయస్కుండ వైనీయొనర్చిన శూరకృత్యంబు వీరలోకశ్లాఘ్యం బగుచు దిగంత విశ్రాంతకీర్తిం గాంచంబోయెడిని. కాలాంతకతుల్యపరాక్రముం డగు కపోలకపాలునికి నెల్లరాజులును భయంపడుచుండిరి. అట్టి యాక్రూరకర్ముని నఖిలరాజకన్యాపహారమహాపాతకుని నపరిమితచండాలచమూసమేతుని నపరిమేయమాయామహాబలధీయుక్తుని దునుమాడి మృత్యుముఖంబువలన నీయనాథకన్యలను విడిపించి రక్షించుట యియ్యెడం జేరినకన్యకలజననీజనకులు స్తుతించుట లట్లుండ నఖిలభూమండలజనంబులును బొగడం బోయెదరు. ఈ యిందురూపయుం జంద్రరూపయుం నా చేయి జారిపోఁగా నాకడిన యిడుమలు నేఁ జెప్పఁ దరంబు గాదు. ఇట్లే యీ రాజకన్యకలబందుగులును గోడుగుడుచుచుండరా! ఇఁక నీభూభువనస్త్రీరత్నంబును గోలిపోయి భోజలీలావతు లెట్టిపరితాపంబు గాంచుచున్నారలో చెప్పవలయునా! వినష్టసుతాపునఃప్రాప్తి గలుగంజేసి నీవు భూతలంబున కెల్లసంతసంబును గల్పించినవాఁడ వైతివి. విజ

యాదిత్యుని వంశంబునకుం గరము కీర్తి సంపాదించితివి. మన యిలువేలుపులకు నేఁ డను గ్రహంబుగలిగె.

రాజపుత్త్రుఁడు. (సవినయంబుగ.) భగవతి ! కాత్యాయని ! నీవు విరక్తవై తపో వృత్తి నున్నదాన వని వింటి. ఈనాఁడు నిన్నుం గాంచి నీపాదవందనముఁ జేసి కృతార్థతం గాంచితిని. నీవంటి మహితచారిత్ర లనుగ్రహింప నెట్టివిశేషంబుగాని లభిం పకపోవునే ! ఈ యిందురూపాచంద్రరూపలం గాంచినదాదిగ నామానసంబు కరంబు వాత్సల్యంబునఁ బొలుపారుచుండుటం జేసి నాకుం జెల్లెండ్ర యగుదు రనియూహించు చుంటిని. అది యథార్థంబగుటకుం గరంబు సంతసం బయ్యె. వీర లెట్టిసాధకుని చేతం జిక్కిరి. అతీతానాగతవర్తమానంబు లెఱుంగంగల నీ వెట్లాపాపకర్ముని కపటం బెఱుంగ లేకపోతివి. ఇది విన నాకుం గుతూహలం బయ్యెడిని.

కాత్యాయని. వత్సా ! ఉదయాదిత్య ! వినుము. ఈ యాయుష్మతుల కనురూప వరప్రాప్తికై యనారతము చింతంగూరుచుండి విదర్భనగరంబునకుఁ గొన్ని యోజనముల దూరంబున నుండు మృగేంద్రవాహానానిలయంబునకు వీరలం దోడ్కొని చని యా దేవికిం బ్రతిదినము ప్రదక్షిణ నమస్కారంబులును మజ్జననైవేద్యార్పణాదులును సమ ర్పించి కొలుచుచుండుఁడని నియమించి నేను వీరలకుం గాఁపుగా నయ్యెడనుంటిని. అయ్యె డకుం గొంతదవ్వుల నాయాచార్య సౌదామని వచ్చియున్నవృత్తం బెఱింగి తత్పాదాభి వందనం బొనర్పం బోవ సమకట్టి కొన్నిదినంబులుంగ నాకడన యధ్యాత్మవిద్య నభ్యసింపం జేరి గురుభక్తి యథావిధి సల్పుచు నించుకేని విభ్రంశంబు లేక నామానసంబున కతి ప్రీతిఁ గల్పించుచుండిన కాళికా, భవానిక లనుతపస్వినీకన్యకలం గాఁపువెట్టి యొక దినోదయంబునం బయలువెడలి సౌదామనీ సన్నిధికిం జని యాపావనచారిత్రకు నమస్క రించి యామహనీయ యొకదినము తనకడ నిలువుమన్న నిలువక యాదినము ప్రొద్దు గ్రుంకకముంద మృగేంద్రవాహానానిలయంబున కేఁగుదెంచితిని. ఈ కుమారికలును గాళికా, భవానికలును గనంబడరైరి. ఈ పుత్త్రికలం గానక నా పడినపాట్లు వచింపం దరంబు గాదు. అతిప్రణయపాత్రములగు నీకుమారికలవిరహంబున నైనమనోవ్యథకు లోనైతిని గాన యోగంబు విభ్రష్టం బయి ధారణాశక్తి చెడినకతంబున వీరలతెఱంగు యోగజ్ఞానంబునం దెలిసికొనలేక యున్మత్తురాలివిధంబునం దిఱుగుచు నింతకు నికటంబున నుండు తపోవనంబుఁ జేరితిని.

రాజపుత్త్రుఁడు. ఆయుష్మతి ! చంద్రరూపా ! భగవతి సనినయనంతరము మీర లెక్కడ కేఁగితిరి.

చంద్రరూప. అర్య! ఎక్కడ కేఁగఁ గలము. పులులచేతం జిక్కికొన్నమృగశాబ

దుర్దర్శములగు నాకారంబులు దాల్చి మాకుఁ బొడసూపిరి. మే మిరువురము భయభ్రాంతలమై మూర్ఛఁగూరియిలపయింబడి యాభయంకరాకారలు సాయంసమయంబున నియ్యెడ నిలపయి జించుచుండ నొడలెఱింగి చేయునది లేక బెగ్గడిలుచుండ నామృత్యురూపలు తమపరిజనంబులకు మమ్మప్పగించి చనిరి. వారు కర్ణకపాలయు నాంత్రనాసికయుం నని కొన్నిదినంబులకుం దెలిసికొంటిమి.

రాజపుత్రుఁడు. (నవ్వుచు.) భగవతీ! ఈబాలికలంగాఱియ పెట్టినందుకు ఫలంబు వారలకయ్యె. అదిపోనిమ్ము. మృగేంద్రవాహనాప్రసాదంబున మాకోరినయర్థంబు నీయాయుంష్మతులు పడసినవార లనియెంచెదను.

కాత్యాయని. నవ్వుచు. వత్స! అదెట్లు ?

రాజపుత్రుఁడు. భగవతి! మనముద్దుబాలికలకుం దగినవాఁ డీమిత్రసహుండెకాని యితరుండు గాఁడు. వీరలకు విధియుం మన్మథుండును సంఘటనంబు సేయం గడంగియున్నవారు.

కాత్యాయని. వత్స! అనవద్యవిద్యావైదుష్యవిశేషంబును రూపౌదార్యగుణసంపత్తియుంగలిగి తద్దయుం బెద్దలయనుగ్రహంబునకుం బాత్రలైనయీకన్నియలకు నట్టివాఁడ యగునీమంత్రికుమారునికి వివాహంబు జరిగి యీయిందురూపాచంద్రరూపలు తమ ప్రియసఖియగు నీతరుణాంబుజతో సఖ్యంబు నెడతెగక భవద్బాహుపరిపాలితం బగు వసుమానసనగరంబున నుండుట నాకే కాదు, మదనమాలినీమదనవతులకును మానపాలునికిని గడుం బ్రియంబు గాకపోవునే! ఇట్టిమహోముదం బొనగూర్చిన నీ కేమేని యిష్టార్థం బొనగూర్చుదానను. అడుగుము.

రాజపుత్రుఁడు. ఓభగవతి ! ఈభోజరాజతనూజ జనకగృహవినిర్గత యయిన వృత్తంబు ప్రజాసముదయంబునకుం దెలియదు. దీనిని నేఁ బిలుచుకొని చని జననీ జనకుల దగ్గఱ విడుతునేని నాపయి వారలకు సందియంబు వొడము. తక్కుంగలరాకన్నియల విధంబు నిట్టిదియ. వీరల కేవిధంబునం గాని కష్టంబు గలుగనీక ప్రవర్తించుటయందు నామనంబున వెరవు దోఁపక యున్నది. ఇం దనురూపవృత్తంబు ప్రవృత్తంబు సేయుట నీభరము. ఇది నాకు నీ వొనగూర్పంగలయిష్టార్థంబు.

కాత్యాయని. వత్స! ఈతరుణాంబుజకుం గలనిర్దుష్టంబగు కన్యకాత్వంబు నెల్లవారల కెఱుకపడం జేసి యందుకు ముదంబు నందినదీనిజననీజనకులు నీకొసంగ నఖిలజనసంస్తవనీయతం గాంచినయీకాంచనాంగిం బాణిగ్రహణంబుచేసికొనుట నీకు లగ్గు. అదియ సకలరాజమాళిమణిమరీచిమాలికాలంకృతచరణుండ వగునీకుం దగినకార్యంబు. అందుకుం దగినవెరవు వచించెదను. వినుము. ఈతరుణాంబుజను గాంచినదాదిగ దీని

కేదేనిమహాతిశయంబు గలిగింపం దలంపు నాకుం గలిగియున్నయది. ఈస్త్రీబృంద పరివేష్టితయగు భోజసుతను నేఁ దోడ్కొనిచని మృగేంద్రవాహనానిలయంబున నుంచుకొని నా యిష్టార్థం బొసంగి యీకన్యక జగద్విఖ్యాతయశోవిభవ యగునట్లు సేయుట నాభరంబు. అందు నీవు చింత మానుకొనుము.

(పురుషుండు ప్రవేశించి,)

యువరాజ వర్ధిల్లుము. ఏ. సకలభూపాలకిరీటమణిమరీచిమాలికానీరాజితపాద కమలుండగు మహారాజప్రతాపాదిత్యుండు నిన్నుం దీవించి నీకుం జెప్పుమన్నవృత్తాంబు వినుము. నీమేనమామకూఁతులం దరుణాంబుజను విరజాంబుజను నీ కడుగవలయు నని యుంటిమి. విధివైపరీత్యంబున నం దొక్కకన్యారత్నంబు గానంబడకపోయెనట. అది విన్నదాదిగ నీతల్లి కరము చింతించుచు నాహారాదు లొల్లక కడు దయనీయావస్థం జెందిన యది. బలవదస్వస్థశరీర యగునీజననిని వైశంబ సను దెంచి యూరార్పంగలవు. మాయాజ్ఞా వచనశ్రవణాంతంబునన బయలుదేరం జనును. ఇది మహారాజాజ్ఞ. (అని యూరకుండె.)

రాజపుత్రుండు. భగవతి ! ఈయర్థంబు తరుణాంబుజం గాంచినప్పుడ యేను జింతించినదియ. గురుజనాజ్ఞానురోధంబు గావింపం జనును. కాన భగవతిని వీడ్కొను చున్నాఁడను.

కాత్యాయని. వత్స ! ఉదయాదిత్య! తోడంబుట్టినవానికూఁతులందుఁ గడుం బ్రియంబు గలిగియున్నది యని వింటి. ఆదేవి నావదినె ధరావతి తద్దయు సుగుణ గణంబులం బెద్ద యనియెఱుంగుదును. వైశంబప్రియస్నుషాయుంగళపూర్ణపార్శ్వ యై యుండ నిన్నుం గాంచెద నని నానుడువు వచనంబుగ నాదేవికిం జెప్పుము. సుఖంబునం జని జనని నూరార్పుము.

రాజపుత్రుండు. వత్సలార! చంద్రరూపేందురూపలార! భగవతీపరిచర్యయం దప్రమత్తలై యుండుఁడు. ఏఁబోయివచ్చెదను. (అని చెప్పి మిత్రసహుం గాంచి.) ప్రియ వయస్య! భగవతికి సహాయుండవై యుండి యీసూతపుత్రుని రథంబుతో నీకడ నుంచు కొని యీరాజకన్యకాసమూహంబును మృగేంద్రవాహనానిలయంబునకుం జేర్పం దగు ప్రయత్నంబులు నిర్వర్తించి సమాప్తకార్యుండవై భగవతియానతిం గాంచి నాకడకు రమ్ము. (అని నిష్క్రాంతుఁడయ్యె.)

కాత్యాయని. కుమార! మిత్రసహ! రాజపుత్రుండు సెప్పినపనులు జరుపం బోవు దము దమ్ము. (అనితరుణాంబుజేందురూపాచంద్రరూపలతో మిత్రసహునితో నిష్క్రాంతయయ్యె.)

రససంజీవన నాటకంబునఁ బంచమాంకము సమాప్తము.

## షష్ఠాంకము.

(పికసుందరాంగియుఁ జేటియుం బ్రవేశించిరి.)

సుందరాంగి. ఓసి చేటీ! మనము కతిపయదినప్రయాణంబుల నీసింహవాహనానిలయంబుం జేరితిమి. ఇయ్యెడ నేవిన్నవిధంబున నేకతంబుగాఁ గనంబడదు. అనేక రాజకన్యకలు తామేకారణంబుననో యియ్యెడం బరిభ్రమించెదరు. తదీయదాసీగణంబుచే నీచోటు నిబిడితాంతరంబై యొప్పెడిని. ఇదేలకో యెఱుంగ.

చేటి. ఓయమ్మ రతిరూపా! మనవలె నీసింహవాహనాప్రసాదార్థిను లెందఱు లేరు. అట్లేఁగుదెంచినవార లని తోఁచెడిని.

రతిరూప. ఓసి మనము కొన్నిదినము లియ్యెడ వసింపంబోయెదము గాన వీరియ్యెడకుంజనుదెంచినవృత్తాంతంబుం దెలిసికొనం గలము. ఇదె సింహవాహనానిలయద్వారంబు. ఇయ్యెడం బ్రణామం బొనర్చి దేవీసన్నిధానంబునకుం బోవుదము. (అనియట్లు రచించిరి.)

రతిరూప. ఓసి అదె కనుంగొనుము. దేవి సింహవాహనయుండుగర్భాలయంబునకుం జేరువన బహిస్థలంబునందు నతివిశాలమగు నంతరాళంబుం గప్పుకొని యతివితతశాఖాశతమనోహరంబు ననవరతసమాపతన్మధుకరపటలపరిపాటితకుసుమముకుళనిరంతరనిర్గళన్మధుధారాసారకర్దమితపుష్పపరాగపరిషిళితలలితతరాధస్స్థలంబునై చెన్నుమిగులుచున్న పొన్నబోదియక్రింద నొకతపస్విని గూరుచున్నయది. ఆనియతవ్రతకు నమస్కరించి దేవీగర్భమందిరాంతరంబుం బ్రవేశింతము. అయ్యెడకుం బోదము రమ్ము. అని యుపక్రమించెను.

పున్నాగపాదపచ్ఛాయయందుం గూరుచుండినకాత్యాయని ప్రవేశించుచున్నది.

కాత్యాయని. ఆత్మగతంబున. ఔర! ఈతరుణాంబుజ మదుపదిష్టంబగు దేవీమంత్రంబు వడసి యథావిధిఁ దన్మంత్రోపాసన మొనరించుచు నిప్పుడు పదిదినముల నుండి సమాధి వదలక రేయింబగలు నెఱుంగక మంత్రాధిదేవతాధ్యానస్తిమితయై కఠోరంబగు తపంబు సల్పుచున్నయది. సర్వవిధసుఖంబులం గూరుచుండినరాజకన్యక యయ్యోనిట్టి నిరశనాదికఠోరవ్రతచర్యల నించుకేనియుం విభ్రంశంబు దోఁపనీక యతిసుకుమారమగుతనదేహలతికపయి నభిమానంబు మాని యుద్దిష్టకార్యసాధనంబునన వ్యగ్రయై యత్యుగ్రయోగచర్యం గావించుచున్నయది. దానిసౌకుమార్యైకసారంబులగు నంగకంబులు కఠోరవ్రతచర్యకు నెంత పరిక్లిష్టంబు లగునో యని యనారతము నామనంబులుకుఁ జెందుచున్నయది. ఈబాలికావతంసంబు సేయుఁనవ్యాజభక్తికిం గరంగి దేవిభక్తవాత్సల్యంబు మెఱయ వైళంబ యీకన్యకకుం గోరినవరంబు లొసంగుంగాత.

రతిరూప. (కాత్యాయనిసమీపమునకుం జనుదెంచి ప్రణామంబు సలుపుచున్నది.)

కాత్యాయని. ఓకాంతాతిలకమా! నీమనోరథంబు సిద్ధించుఁగాత. (అని దీవించెను.)

రతిరూప. (సంతోషముతో.) ఓభగవతి మీవంటితపస్వినులవచనంబులను లోకి కార్థంబు లనుసరించుచుండును. కాన మన్మనోరథం బీడేరుటకు సందియంబు లేదు.

కాత్యాయని. ఓకాంతాతిలకమా! భక్తజనులపాలిటికల్పలత యయినయీదేవిని సింహవాహనను గొలిచి యభీష్టార్థంబులు వడయనివారలును గలరే! నీమనోరథం బనతి చిరకాలంబున నీడేరక పోదు.

రతిరూప. ఓభగవతి యట్లయిన ననుగృహీత నయితిని. దేవియగు సింహవాహన భవన్ముఖంబునన నాయభీష్టంబు లొసంగినట్లు లవగతం బయ్యెడిని.

కాత్యాయని. ఓకాంతాతిలకమా నీ వెవ్వతెవు? ఏయభీష్టార్థంబు వడయం గోరి సింహవాహనాసంసేవకుం జనుదెంచినదానవు? నీవృత్తంబు వినిపించి శ్రవణసుఖం బొనర్పుము.

రతిరూప. భగవతి విన్నవించుకొందు వినుము. ఏను సింహపురపాలకుం డగు ప్రతాపపాలునికిం బ్రణయపాత్రంబను.

కాత్యాయని. (స్మరణ మభినయించి.) ఓకాంతాతిలకమా! నీవు రతిరూప యను దానవుగదా! ఈపేరు గలసుదతీవతంసం బామహీపతికిం గరం బనురాగవిషయం బగు భుజిష్య యని విందు. ఆయంగనామణి నీవె కాఁబోలు?

రతిరూప. భగవతి! ఔను ఆధరాధీశుని ప్రణయబహుమానంబు నాయం దించుక గలదు.

కాత్యాయని. ఓకాంతా తిలకమా! రతిదేవివంటి యిట్టిరూపంబు నీ కుండుటం జేసియే రతిరూప యని పేరును మహీకాంతుని ప్రణయబహుమానంబును బడసి యుండెదవు. ఇట్టివిశేషంబు నీకుం గలిగియుండ నేయర్థంబున నీకుం గొఱంత? అది నివర్తింపం జేసికొనం గోరికాదె నీ వియ్యెడకు రా నయ్యె.

రతిరూప. భగవతి! భూపతి ప్రణయబహుమానం బెంత యుండినను గొఱంత యొకటి యున్నది. ఆఱేనికి రూపౌదార్యగుణంబులం గరంబు మనోహారిణి యగుదేవి శృంగారవతికి వసుధారిణి యనుముద్దులపట్టి యొకతె గలదు. దానివిద్యావినయ సౌభాగ్యరూపరామణీయకప్రముఖంబులకుఁ దద్దయుం నరపతి సంతసించుచు నతివిదగ్ధు లగు పండితుల నేర్పఱిచి యాకన్యకాతిలకంబునకు నఖిలశాస్త్రంబులు కావ్యనాటకాలం

గోష్ఠియందు దానిచే నభినవకల్పనానల్పరసభరితంబులగు పద్యంబులు సెప్పించియు మానసంబునకు నింపు దులకింపం జేయు నతిమాత్రరసోదారంబులగు గీతంబులు వాడించియు ననల్పామోదంబుం జెందుచుం దనదేవితో నిష్టగోష్ఠిం దనసుతారత్నంబును శ్లాఘించుచుండును. అట్టిసుతారత్నంబుఁ బడసినకారణంబున నాదేవి కపరిమితంబగు గౌరవంబును బ్రణయంబును భూపాలకుం డొసంగి యిట్టికన్యకారత్నంబుం గన్న నీ భాగ్యంబకదా భాగ్యం బని యాదేవిం గొనియాడుచుండును. అప్పు డప్పుడే నది గాంచెడిదానంగాన వసుధారిణివంటి కన్యక యుండిన నాకును శృంగారవతికింబోలె బహుమానంబు గల్గుంగదా యని తలంచుకొనుచు సంతానశూన్యతకుం గుందుచు నేయుపాయము లేకయుండి సాధువులగు విప్రులకు నాసదనంబున కేతెంచువారలకు నాకుంగలకొలంది ధనసంచయంబు లొసంగుచు నుపాసించుచుండ నొకసాధుచరిత్రుండు నన్నుం జూచి నీవిషణ్ణవదనంబునకుఁ గారణం బేమని యడిగిన మనోగతార్థంబు వివరించి యతఁ డీసింహవాహనాపదకమలపరిచర్య సేయం దడయక యభీష్టార్థంబు వడయుదువని నుడువ నావృద్ధబ్రాహ్మణుని పల్కులు నమ్మి యియ్యెడకుం జనుదెంచితిని. ఇదియ నావృత్తాంతంబు.

(ససంభ్రమముగఁ జేటి యొకతె ప్రవేశించి,) భగవతి నమస్కరించెదను. మన తరుణాంబుజ యోగాసనంబునఁ బదిదినములనుండి లేవక ధ్యాననిమీలితాక్షియై దైహికకృత్యంబులు మానియుండుట భగవతికి విదితంబ కదా! ఈబాలిక యాహారాదులుమాని యిట్టికఠోరవ్రతంబు సేయుచున్నదే! ఏ మగునో యని సంశయాకులలమై మేము దానిం బరివేష్టించుకొని యున్నారము. ఇప్పు డున్నట్టుండి యాబాలికారత్నం బాహారవిరహంబునం జేసికాఁబోలు భూమిపయికిం బలుమాఱొఱఁగం బోవుచున్నది.

కాత్యాయని ససంభ్రమముగ లేచి దేవతాయతనంబులోనికిం జనుచున్నది. రతిరూపాప్రముఖులును వెంబడిం జనుచున్నారు.

దేవకాంతాధృతయై తరుణాంబుజ ప్రవేశించుచున్నది.

దేవకాంత. వత్సా! తరుణాంబుజా! ఊరడిల్లు మూరడిల్లుము. (ఆత్మగతమున) ఈరాజసుత నాయందు నిశ్చలంబగు భక్తిఁ గావించుచున్నదయ్యును నేను దీనిమనస్థైర్యం బింకను బరికింపగల నని యనుకొని యించుక యాలస్యం బొనరింప నతిసుకుమారయగునీకుమారి యతికఠోరంబగు దీర్ఘవ్రతంబునకుం దాళంజాలక తనవశంబుదప్పి యిలకుం దూలె. కట్టా! ఏను భక్తజనులకష్టంబులు గనుంగొనలేనిదానను. (తరుణాంబుజ శరీరము స్పృశించుచు. ప్రకాశముగ.) ఆహా! యీరాజవదనామణి మత్సేవావ్రతం బుపక్రమించుటం దొట్టి సుఖమజ్జనాదు లొనరింపమిం జేసి దీనిశరీరంబు పాంసుజాలంబు పయింబడి యించుక పరుషభావంబుం జెందియున్నది. దీనికుటిలకుంతలంబులు ధూళి

ధూసరంబులై జడగొనియున్నయవి. సద్భక్తజనశిఖామణి కిట్టిశోచనీయంబగు నవస్థ సంభవించుట కేను గరంబు పరితపించెదను.

కాత్యాయనీప్రముఖులు తరుణాంబుజాదివ్యకాంతలసన్నిధానంబునకుం జేరిరి.

కాత్యాయని. (ఆత్మగతమున.) ఈకాంతామణి యెవ్వతయో! ఎన్నఁడు గనుంగొని నది లేదు. భక్తవత్సలయగు దేవి సింహవాహనయె యీకుమారికారత్నంబుభక్తికి మెచ్చి కావ వచ్చియున్నది కాఁబోలు! కాదేని యీదివ్యరూపంబు మనుజకాంతల కెక్కడిది? ఏదియుఁ గ్రమంబుగ నెఱుంగంబడును.

దేవకాంత. కుమారి! తరుణాంబుజా! ఊరడిల్లు మూరడిల్లుము. ఏను నీప్రార్థితార్థంబు లొసంగం జనుదెంచియున్నదాన. నీధ్యానసమారాధనగు సింహవాహనను.

కాత్యాయనీ ప్రముఖులు. ఆ! ఈదేవి భక్తవత్సలత నేమని పొగడంగలవారము. (అని యంజలులుసేసికొని సాగిలి మ్రొక్కిరి.)

దేవకాంత. కట్టా! తరుణాంబుజ యింతదనుక నూఱటం జెందకయున్నయది. గాఢమూర్ఛాక్రాంత యయినవిధంబునం దోఁచెడిని. ఇఁక నూరక యిది సుస్వస్థతం గాంచదు. మదీయకృపామృతవర్షంబున నీబాలికం బూర్వపువిధంబుం గాంచం జేసెదను. (అని యాతరుణాంబుజ యాకారంబుం గనుంగొనుచున్నది.)

తరుణాంబుజ. (కన్నులువిప్పిచూచి.) ఆ! నాధ్యానయోగంబు సెడియె. కట్టా! ఏమిసేతు. పలుమఱు మూర్ఛనయొకటి నన్ను బాధించుచున్నది. ఈదేవియనుగ్రహంబు నసఁగాక యిది నివర్తింపదు. ఓ యవ్వ! నన్నుం దాఁకకుము. నేను దేవీచరణధ్యానంబున నుండుదానను! అనిలేచి వెండియు యోగాసనంబునం గూరుచుండఁగడంగుచున్నది.

దేవకాంత. ఓబాలికారత్నమా! నీధ్యానయోగం బేమియుఁ జెడలేదు. ఇదె యేన నీధ్యానసమారాధనగు సింహవాహనను నీయభీష్టార్థంబు నొసంగుటకు సాక్షాత్కరించితిని. వేఁడుము. నీయాచార్యయగు కాత్యాయని నీకుంగృపగలిగి యుపదేశించిన దేవీమంత్రంబును యథావిధి భక్తిభావంబున నుపాసించినందుకు ఫలంబుం గైకొనుము.

తరుణాంబుజ దేవవధూరత్నంబు నెగాదిగ చూచి యూరకుండెను.

కాత్యాయని. ఓవత్సా తరుణాంబుజా! ఈదేవి దివ్యస్వరూపంబులో సాక్షాత్కరింపక సాధారణ దేవకాంతవిధంబున ననవద్యరూపోపేతయై కనంబడుట ఏలకో యని సంశయించెదవేమొ? నీవు బాల వగుటంజేసి యీదేవి దివ్యరూపంబు శతభుజసకలాయుధోపేతంబుం గాంచి భయభ్రాంత వగుదు వని యతిసౌమ్యరమణీవేషంబుతోఁ

తరుణాంబుజ. (తటాలున లేచి నమస్కరించి యంజలిగావించికొని.) ఓదేవీ! భక్తరక్షణదీక్షావిచక్షణురాలా? నన్నుం గరుణించి నాకోరినవరంబు లొసంగెదనన్నమాత్రాననయే కృతార్థనైతిని. ఈభగవతి యగుకాత్యాయనికి నిర్వ్యాజప్రేమం బొక్కటి నాయందుదయించి నిన్ను సాక్షాత్కరింపఁగలమహాతిశయమును నాకుం గలుగఁజేసినయది. ఇట్టిసాధుశిరోమణి సమాగమం బబ్బదేని చతుర్ముఖప్రభృతులకు నందరాని నీయతిరమణీయాకృతిదర్శనం బొనగూడునే! నన్నుం గరుణించి నాకు హితంబు సమకూర్చుట నిక్కంబేని నాజనకునిసదనంబు వాసి యేను దేశాంతరగతనయినవృత్తంబున నాశీలాదులందు సంశయం బించుకయేనిఁ జెందకుండ నాజననీజనకులు వెండియు నన్నను మోదించి నా ప్రాణనాయకుని కిచ్చి పరిణయంబుసేయునట్లును; నట్లు నాతో నిడుమలువడుచుండు నండజయానలకుఁ దమతమవలసినవల్లభుల జేపట్టి సుఖించునట్లును వరం బొసంగుము. ఇదియ నాకుం గావలసినవరంబు.

దేవకాంత. కుమారీరత్నమా! నీమనోరథంబు కరం బభినందనీయంబు. ఈనీతో నుండురాజకన్యకలకష్టంబులుగాంచి వారికి సుఖంబుం గాంక్షించి యడిగినవరంబు నామనంబున కత్యామోదదాయకం బయ్యె. తనసుఖంబుతోడం బరులసుఖంబు నపేక్షించుట యుత్తములలక్షణంబై యున్నది. నీ వడుగకపోయినను నీహితంబుఁగోరి నీప్రార్థితార్థంబుతో మఱియుం గొన్నిహితార్థంబులు నీకుం గలుగంజేసెదను.

నీకు సకలపండితసంఘసంశ్లాఘనీయంబై కాళిదాసేతరుల కెవ్వారికేని నవిజేయంబయినవిద్య యొసంగితిని. కాళిదాసుండు విద్యాధిదేవతయగు సరస్వతీమానుషావతారంబు గాన నతనిం జయింప నితరులకు శక్యంబు గాదు. మఱియు మదీయభక్తజనాగ్రగణ్యుండు. భవదిష్టార్థప్రాప్తిం గోరి నాచెప్పినచొప్పున నీవు ప్రవర్తింపుము. సేమంబు గల్గు. అదియెద్ది యంటివేని? ఈభగవతియగు కాత్యాయనివెనుక నిలువంబడినకాంత రతిరూపయనునది. నీమాతామహునికిం బట్టమహిషియందు లీలావతియు శృంగారవతియు నను నిరువురు కన్యకలు జనియించిరి. అందు లీలావతిని ధారాపతియగు భోజుండు వివాహంబయ్యె. శృంగారవతిని బ్రతాపపాలుం డనుసింహపురాధ్యక్షుండు పెండ్లాడెఁ. నీమాతామహునికి భుజిష్యయందు జనించినవారు రాగసేన యనియు రతిరూప యనియు నిరువురు. అందు రాగసేన లీలావతికిం బ్రియసఖి యయి ధారానగరంబుం జేరెను. రతిరూప శృంగారవతికిం బ్రియసఖియై ప్రతాపపాలునిప్రణయగతికిం బాత్రం బయి సింహపురినున్నది. ఆకాంత సంతానార్థినియై నాకడ కేఁగుదెంచియున్నదిగాన నీవీరతిరూపకడకుం జేరి దీనిసుతవలె నడుచుచుండి వేశ్యాకన్యకావేషంబుం దాలిచి నీయందతివత్సలతంగొని నీయిష్టార్థంబు లొనగూర్చి ప్రతాపపాలునిచే విద్యావిశేషంబున గారవింపం బడుచు విద్యాసర్వస్వవేదిని యనుపేర జగద్విఖ్యాతిం గాంచుచు నీప్రియసఖు లగునిందు

రూపా చంద్రరూపలు సంగీతసర్వస్వవేదిని యనియుఁ సాహిత్యసర్వస్వవేదిని యనియుం పేరువడసి యెల్లవిధంబుల నిన్నుం దోడ్పడం దక్కుఁగలరాజకన్యకాసహస్రంబు నీకు సైరంధ్రికలయి కొలువ ననసంఖ్యాతలగు పరిచారికలు గల్గి యగణితంబగు వైభవంబుతోఁ బరగెదవు.

సింహపురంబున నీవు ప్రతాపపాలునిసభకుఁ బ్రతిదినము వోయివచ్చుచుండు నప్పుడు నిన్నుం గాంచి నీసౌందర్యాదుల కనురాగంబుఁగొనివచ్చినవారివలన నొకరాత్రికి వేయివరహాలు గైకొని వారల కేదేని సమస్య లిచ్చి యోడించి వెడలనడుచుచు నీకన్యకాత్వంబు చెడకుండఁ బ్రోచుకొనుచు నావిధంబున సంపాదించిన ధనసంచయంబులను బ్రాహ్మణసాత్కృతంబులు సేయుచుఁ బ్రవర్తించుచుండునది. కొంతకాలంబునకుం గాళిదాసుండు నీజనకునిచే ననాదరింపంబడి ధారానగరంబు వెడలి జాతిస్మరత్వంబుగలవాఁడగుటంజేసి నీదుర్దశావిశేషంబు నెఱింగి కరుణించి యితరులప్రార్థనంబును నెపంబుఁజేసికొని వచ్చి నీసౌధంబున నిన్ను నోడించి నీనిర్దుష్టంబగుకన్యకాత్వంబు నీజననీజనకులకును దక్కుఁగలవారలకును దెల్పి నీవలచిన యుదయాదిత్యునికి నిన్ను నిప్పించి పరిణయంబు సేయింపంగలండు. ఈరతిరూప యన్యురాలు గాదు. కాన నీవు దానికిఁ గుమారిక వలె నుండుట తప్పుగాదు. వేశ్యాకన్యకావేషంబున నుండుటకు మది నేవగించుకొనకుము. నీకన్యకాత్వంబున కేవిధదోషంబును గలుగనేరదు గాన నది యపకీర్తికరంబు గాదు. ఉదయాదిత్యుండు నిన్నుం బరిణయం బగునప్పుడ నీతో వచ్చియుండురాకన్నియలకు వారువారు బ్రియంపడియుండువల్లభులు సంప్రాప్తులయ్యెదరు. నీవు నుభయకులంబులకుం గీర్తిఁ దేఁ బోయెదవు. నానుడువువచనంబు లనుష్ఠించునది. నీకు మేలగును. (అని వచించి రతిరూపం గాంచి,) ఓయతివా నీవీతరుణాంబుజను బుత్రికాసమానను గాఁ దలంచుచు నీతరుణిం దోడ్కొనిచని దీనివలన భవదభీష్టంబులు వడయుము. దీనిం దోడ్కొని పొమ్ము. ఈరహస్యంబు కార్యానుకూలం బగునంతదనుక నుద్ఘాటితంబు సేయకుము. శృంగారవతి కంటె నీభర్త నిన్నుం గారవింపంగలండు. దేవీప్రసాదంబున నీకుమారిక నాకులభించినదగు రాజునకుం జెప్పుము. (అని చెప్పి కాత్యాయనిం జూచి.) ఓతపస్వినీ నీ వీయిందురూపా చంద్రరూపలం దరుణాంబుజతోఁ బంపివేయుము. నీ వియ్యెడన యుండి నాకుం బరిచర్య సేయుచుం గాలంబుగడిపి నే నుడివినదినంబున సింహపురి కరిగితివేని యాకుమారికల పరిణయమహోత్సవంబుం గనుంగొందువు. నేఁ బోయెదను. (అని తరుణాంబుజ నాదల మూర్కొని.) ఓకుమారికారత్నమా! నే నొసంగినవరంబులకుం బరితృప్తిం జెందక యుండు నట్లు విన్ననయినసీముద్దుమొగం బెఱింగించుచున్నది. నీమనోగతార్థంబుఁ దెలిసికొంటిని. నీతోడంబుట్టువు విరజాంబుజయుం నీమహాతిశయంబుం బడయఁబోయెడిని. మఱియుం నీయిందురూపాచంద్రరూపలును సర్వవిధంబుల నీకు సమానలై యుండెదరు. ఇదియు నీవు గోరునది. (అని వచించి నిష్క్రాంతయయ్యె.)

తరుణాంబుజ. (ఆశ్చర్యంబుతోఁ, పురోద్దేశంబునకు దృష్టులు నిగుడ్చి.) భగవతి! చూడుము. ఈపోయినదివ్యకాంత సింహవాహనాప్రతిమయం దంతర్హిత యయ్యె.

ఎల్లవారు నచ్చెరువునొందుచు సింహవాహనకు నమస్కరించిరి.

రతిరూప. (కాత్యాయనింజూచి.) ఓ భగవతి నాభాగ్యం బేమందు! ఇట్టిదేవీ ప్రసాదపాత్రురాలు నాకడకుం జేరుటకంటె నింక నతిశయంబు గలదె! అదియునుం గాక. ఆర్య యగు లీలావతికిం దనుజాత యిది. నాసుతకంటెం బ్రణయంబున నధికు రాలు. లీలావతియు నేను శైశవంబున నొండొరులం గలసి బాల్యక్రీడలు సల్పినవారము.

కాత్యాయని. రతిరూపా! నీనుడివినదియు సరే! దేవీనియోగం బనుష్ఠింపుము. వీరలం దోడ్కొని నీనగరంబునకుం బొమ్ము. (తరుణాంబుజం గాంచి.) కుమారీరత్నమా! నీప్రియసఖులతోఁ జని రతిరూపకడ నుండుము. ఏ నియ్యెడన తపంబు సలుపుచు దేవీ నిదేశంబుం బ్రతీక్షించుచుండెదను.

తరుణాంబుజ. భగవతికి నమస్కరించి, కనుదమ్ముల బాష్పబిందువులు రాలుచు చున్నది.

కాత్యాయని. వత్సా తరుణాంబుజా! మద్విరహంబునకు దుఃఖింపకుము. నీ హృద యాదిత్యునిం జేపట్టినయనంతరము నీకడన నే నెల్లప్పు డుండం బోయెదను. పోయిరమ్ము.

తరుణాంబుజ. భగవతి! ఈమాట మఱువం జనదు.

కాత్యాయని. (ఆత్మగతమున.) ఇక్కన్యకారత్నంబు మద్విరహంబునకు దుఃఖిం పఁగా దీనినూరార్పంబోయి మాటలవలం దగులుకొంటిని. నా జీవితకాలంబు వసునూనస నగరంబునన జరిపెద నంటిని. ప్రమాదంబు నాటిల్లె. ఐనను చెఱు పేమియుం లేదు.

చ. ఘనతరయోగమార్గపరికల్పితసంసృతిసంగమోక్షుఁ డౌ
మనుజునికిం దపోవనము మానితవాస మనంగ నేల యా
యనుపమదివ్యదృష్టికి గృహంబు తపోవన మౌను జూడ వే యా
వనజదళాక్షభక్తిరుచివైభవ మెయ్యెడ నైనఁ జెల్లదే.

(ప్రకాశముగ.)

ఓ తరుణాంబుజా! అట్లకానిమ్ము, మీరలుపొండు, సేమంబుగల్గు. (అన నందఱు నిష్క్రాంతలైరి.)

రససంజీవన నాటకంబున షష్ఠాంకము సమాప్తము.



## సప్తమాంకము.

ఇరువురు మనోహరవేషాలంకృతలగు తరుణులు ప్రవేశించిరి.

అందొకతె. ఓ విప్రవధూవతంసమా! నే నీధారానగరంబునకుం జనుదెంచిన దాదిగ విరజాంబుజాసన్నిధానంబున ననయము నిన్నుంగనుంగొనుచుండెదను. ఏలకో యెఱుంగను. నిన్నుంగనుగొనునప్పుడెల్ల నాప్రియసఖి రతిమాలయని యనుకొనియెదను. ఏకతంబువోరకిన నడిగి తెలిసికొనం దలంచియున్నదానను. విప్రకామినీవేషంబున నుండుట యొక్కటిదక్క తక్కినసర్వాంశంబులచేత నీ వారతిమాలవే యనుటకు నొకించుకయుం విరోధంబు సూపట్టదు.

మఱియొక్కతె. (మందహాసంబు సేయుచు.) ఓసీ రాగమాలా! నీ వతిచతురవు గానం దెలిసికొంటివి. తక్కినవార లెఱింగిరా! ఏను వసుమానసనగరంబున నుండిన మేఘమాలకూఁతురను. మనమిరువుర మతిస్నేహవశంవదలమై శైశవక్రీడలం బ్రొద్దుపుచ్చుచుండినవారముగదా? నీతల్లియగు కదంబమాలకును నాయందతిప్రణయభరంబు గలదు. అది నీవ యెఱుంగుదువు.

రాగమాల. (సంతసంబుతో.) ఓసీ! నాయూహ సరిపోయినది. మేలయ్యె. బహుదినములుగ నిన్నుం గనుంగొనం బ్రయత్నపడుచుంటిని. నీవు యువరాజుపరిచర్యయందు నియుక్తవై యతనివిద్యాశాలయందె యున్నదానవు గాన నాకుం జూచుటకు లేకపోయె. దేవిధరావతికిం బ్రియంబుగ గానవిద్యావిశేషంబునం బ్రొద్దులుపుచ్చుచు నేను దేవీసన్నిధానంబునన యుంటిని. ఆవృత్తాం బట్లుండనిమ్ము. నీ వీబ్రాహ్మణకామినీవేషంబుతో నీధారానగరంబున వసించుటకుం గతంబేమి? ఈ వేషంబుతో నీ వెట్లీవిరజాంబుజాసఖ్యంబు సంపాదించితివి? ఏ ప్రయోజనము నీ కీవేషంబున సాధనీయము; అది యలంతిగా నుండంబోలదు చూవె! నాకుం దెలియం బల్కుము.

రతిమాల. ఓసీ రాగమాలా! ప్రియసఖి! మదీయాగమనప్రయోజనంబు ప్రకాశ్యంబు గాదు. అయినను బ్రాణసమానవగు నీకు వచింపం గూడనిది లేదు గానను నీవును నాగడంగిన కార్యంబున కనుకూలప్రవర్తనంబున సహాయపడుదానవు గానను అయ్యుం డగుమనయువరాజున కిది కర మతిశయవిధాయకం బగునని గావునను మనకు నప్రమేయమోదావహంబ యయి వెలయుహితంబు గానను నీకుం దెల్పవలయు. మనయువరాజార్యుండగు నుదయాదిత్యుండు కొన్నినెలలకు ముం దాఖేటకావిహారంబు సలిపి వనంబువలన వినివృత్తుండై పట్టణంబునకుం జనుదెంచె. అదిమొదల తనిశరీరమునం బాండురత్వాది

నది యెఱింగి నే నతనిజనకునిభుజిష్యాపుత్త్రిక నగుటం జేసి చెల్లెల నగుదును గాన నరమరిక లేక యువరాజు నడిగి యతనికి విరజాంబుజయందు భావనిబంధనం బయినయర్థముఁ జాతుర్యంబున నన్యపరంబులగు వచనంబులం దెలిసికొని విరజాంబుజభావనిబంధనం బెవ్వనియం దుండునో యాయర్థంబు నెఱుంగం గోరినకుమారునిచేఁ బంపుపడసి యీధారానగరంబునకుం జేరియున్నదానను. నే నీపత్తనమునం బ్రవేశించినదినమునందె యీవిరజాంబుజకు విద్యాపరీక్షణము సేయునవసరం బయిన భోజభూపతిసభాభవనంబునకుం జన నను వారయుచుండి యామహీపతివలన ధనము వడయం గోరి వచ్చియుండు నప్పన్నగరవాస్తవ్యుల బ్రాహ్మణవేషధారులం గూడి యేను విప్రకామినీనేపథ్యంబుఁ దాల్చి సభకుం బోయి నావిద్యావిశేషంబున ధారాపతిని మెప్పించి తానొసానెయ్యంబుఁ గోరినవిరజాంబుజకుఁ బ్రాణసఖినై లీలావతీదేవిచే నను మోదిత నగుచుఁ బారితోషికంబుగ నొసంగినయాదేవిభూషణంబులు దాల్చుకొని యిందు వసియించెదను. నీ వేల యియ్యెడకు రా నయ్యె. ఎఱింగింపుము.

రాగమాల. రతిమాలా! ప్రియసఖి! దేవి ధరావతి తనకుమారుండగు సుదయాదిత్యునికి నీవిరజాంబుజ నడుగ విప్రముఖ్యులం బంపి వారివలనం గార్యానుకూలం బెఱింగి సంతసంబునం దనకోడలికి నతిమనోహారంబులగు జాంబూనదాంబరాభరణంబుల నాచేతం బంపినయది. అవి యిచ్చి విరజాంబుజం జూచి పో వచ్చినదానను. మనయువరాజు విరజాంబుజభావం బెఱుంగం గోరి కాదె నిన్నుఁ బంపినవాఁడు. అది నీ కించుకయేని విదితం బయ్యెనే! ఆయర్థంబు వచింపుము.

రతిమాల. ఓసి మనయువరాజు రూపరేఖావిలాసంబు లేపువ్వుఁబోండ్లమానసంబుల నేని ననురాగపేశలంబులం గావింపకపోవునే?

క. వినవుఁగిని గమలినీగుణ నా, వనజారినిఁ గైరవణిఁగణ వాంఛించినయ ;
ట్టనఘుల రూపవిద్యా, పనయముని సుదయాదిత్యుఁ గోరె విరజాంబుజయున్.

ఆవిరజాంబుజ యతిగంభీరస్వభావ యగుటం జేసి యప్రకాశితానురాగ యయ్యుం బ్రవృద్ధిలలితం బయి యొప్పుతనూలత నించుకించుక పొడముపిరహపాండిమాకృశతాదుల నిపుణమతిసఖీజనానుమీయమానవిరహావ్యథాకులితహృదయ యయి యున్నది. మనయుదయాదిత్యునిరూపరేఖావిలాసంబులు గల తెఱంగున నమరించియుండు చిత్రఫలకం బీవనజాననకడ నొక్కటి గల దది యొకచిత్రపటవిక్రయకారిణి దెచ్చి యిచ్చెనట సఖీజనంబులు లేనప్పుడు తద్వీక్షణానందలహరీపరంపరల నోలలాడుచుండును. ఈ యర్థంబు మస్నానసనిర్విశేష యగుకనకమాల యనునాసఖివలన - యువరాజున కెఱింగించియు నతం డింతనుక నియ్యెడకు వచ్చినపోలడి నూపట్టదు.

రాగమాల. ఓసి ప్రియసఖి! ఇది నీ వెఱుంగవా! ఈయూర నుండుభేవభూతి యనుమహాకవికడ ముగ్గురు విప్రకుమారులు వచ్చి చేరి యతనికి శిష్యులై కొన్ని దినములుగ విద్యాభ్యాసము సేయుచున్నవారు. వా రెవ్వరో తెలిసికొంటివా!

రతిమాల. (కుతూహలముతో.) ఓసి రాగమాలా! మనయుదయాదిత్యుండు సవయస్కులతో విప్రకుమారవేషంబు దాలిచి యేతెంచియున్నాఁడా! ఏమి?

రాగమాల. (నవ్వుచు.) ఓసి రతిమాలా! ఔను. అందు శ్రుతశ్రవుం డనుకుమారుండు మనయుదయాదిత్యుండే. కౌశిక కళావంతు లతని ప్రియసఖులు. నే నీయూరికివచ్చిననాఁడె వారు నీనగరంబునకుం జనుదెంచిరి.

రతిమాల. (ఉల్లాసముతో.) ప్రియసఖి యట్లైన మఱియు మేలయ్యె. విరజాంబ జను నుదయాదిత్యునికిఁ బరస్పరసందర్శనం బగునేని మన్మథుండును దనపనులయందు వ్యగ్రతం గాంచు. ఇఁక మన మందుకుం బ్రయత్నింపవలయు.

రాగమాల. ఓసి రతిమాలా! ప్రస్తుతము జరుగుచుండువృత్తాంతంబు నీకు విదితంబు గాకయున్న దని తోఁచెడిని. నీ కన నేల? ఈరహస్యంబునం బనిపూని నేనుం వారలకునయితము సాకల్యముగ నెఱుంగం బడదు. ఓసి నీ వందులకై యియ్యెడం గాఁపురంబుసేయుచున్నదానవు. నీకు నెఱుంగంబడకయుండుటచే శీఘ్రకార్యసిద్ధిద్యోతకముగ రహస్యంబు సురక్షితం బయి యున్నదని యెంచందగును.

రతిమాల. (కుతూహలముతో నవునవ్వుచు.) ఓసి రాగమాల! నేను కొన్ని దినములుగ నీయూర లేను. భోజభూపతిపుత్రియగు కుంతలేశ్వరదుహిత నాయెడం గరంబు ప్రియంబు గలది. మదీయసంగీతసాహిత్యవిద్యలయం దపరిమితామోదంబుం జెంది యుండునది. యా ధారానగరంబునకుం గొంతదవ్వుల నుండు ధారాతీర్థంబునం దానమాడం బోవుచు నన్నుఁ దనతోఁ దోడ్కొని చనియె. ఆదేవి గుహాతీర్థంబునం దానమాడం దానుద్దేశించిననాఁడిదినములు నే నాదేవితో నయ్యెడం గడయవలసివచ్చె. కాన నీమధ్యకాలంబునం జరిగినవృత్తాంతం బెఱుంగను. కుమారీకుమారకులకుం బరస్పరదర్శనంబు గల్గినదా ఏమి! అట్లయిన నందు కెట్లనుకూలించె? ఇది వినం గుతూహలం బయ్యెడు. వినిపింపుము. ఆ.

రాగమాల. ఓసీ! దర్శనంబుగల్గెనా యని యడుగుచున్నా వట్లడుగకుము. సమాగమం బయ్యెనా యని యడుగుము.

రతిమాల. (అత్యుల్లాసంబుతో.) ప్రియసఖి. ఆ. ఇది కరమాశ్చర్యము! ఈదుర్ఘటం బగుకారం మింత వేగిరంబ యనుకూలించుటకు సాధనసామగ్రి యించుకయేని న్యూనతం

చ. అనుపమరూపకాంతిగుణహారివయోవిభవంబు గల్గునా
మనసిజరూపుఁ జూడ ననుమానవిలగ్నయు లోఁ గరంగదే
ఘనకచయొప్పిదంబును నిగారపురూపు వయోవిలాసముల్
గని మరుకాకకున్వశుఁడు గాఁడే నృపాత్మజుఁ డాత్మలోపలన్.

సఖి కరము కౌతుకం బయ్యెడిని. వీరల కన్యోన్యదర్శన మెప్పుడు గల్గె? అది వచింపుము.

రాగమాల. ఓసి వచియింతు వినుము. కాళిదాసభవభూతు లొక్కనాఁడు భోజసభయందు సీత యనుచామరగ్రాహిణి సెప్పినకతలంబున రత్యంతవర్ణనంబు సల్పి యందు వార లొండొరులు దమతమనుడివినపద్యంబుల రసోత్తరంబు లని వివాదపడి రాజాజ్ఞచేత భువనేశ్వరీసన్నిధానంబున రసఘనతం గాంచినదాని నిర్ణయింపం గోరి తత్సమక్షమునందు తమపద్యంబులను దులనిడి తూఁచుటకుం గడంగిరి. ఈతారతమ్యపరీక్ష మనుష్యమాత్రకల్పనీయంబు గాని దగుటం జేసి యత్యాశ్చర్యావహం బని పౌరజనంబు లెల్లం జేరిరి. అమ్మహోత్సవంబుం గనుంగొన సర్వవిద్యావిశారద గావున విరజాంబుజలోచనం గుతూహలపడుచు మదితరసఖీజనంబులలోఁ గొందఱు లీలావతికడకును గొందఱు దేవాలయంబుకడకును జని యున్న హేతువుంబట్టి యలభ్యం బయినయేకాంతంబు దొరకుటకు సంతసించి మనోగతార్థంబు నాతోఁ జెప్పెను. నేను దానికి సామాన్యచేటీవేషంబు ధరింపం జేసి సంధ్యాసమయంబు గాన నించుకించుక పర్వుచీకటులలో నితరుల కెఱుకపడకుండ గూఢమార్గంబునం దోడ్కొనిపోతిని. అక్కడ భవభూతిశిష్యులలో శ్రుతశ్రవుండు విరజాంబుజకుం గనంబడియెను. అతనిం గాంచినంతన,

మ. కను లత్యాయతవృత్తిఁ గాంచెఁ బెలుచ స్గాత్రంబునం గంపముం
జనియించె స్ఫులక ప్రసలంగె నెస నుచ్ఛ్వాసంబు లుష్ణంబులై
పెనుబాం డాం ప్రళయంబు లైకొనియె నావింబాధరోత్తంస మొ
య్యన వైవర్ణ్యము మించఁ దా మఱచె నన్యం బాత్మలోఁ గ్రన్ననన్.

అప్పు డక్కుమారుండును చేటీవేషధారిణిం గాంచి నిరూపించి,

ఉ. ఆఁచెఱఁ గేలిసేయఁ దగునందముమీఱెడుమందయానముల్
జంచలదీర్ఘనీలరుచిచారుసుపక్ష్మలనేత్రపద్మముల్
మించినచంచలాలతల మేలములాడుశరీరకాంతియుం
గాంచి యతండు భోజసుతగా నవయౌవన నెంచె నెమ్మదిన్.

అప్పుడు నాకనుసైగల విరజాంబుజ యని యెఱింగి యాకుమారుండు మందహాసంబుతో విలాసంబు మెఱయం జనుదెంచి యాసుందరికుఱంగట మెలంగుచు నిట్లనియె,

గీ. ఔర యాచక్కుఁదన మేమి హరువి దేమి? లలితసౌభాగ్యలక్ష్మీవిలాస మేమి?
అభినవోద్భూతతారుణ్యవిభవ మేమి? వసుధ సుందరి యిట్టుండ వలదె చూడ.

అనిన నయ్యెడ నుండుపౌరులు కొందఱీయిరువురం గనుంగొనిరి. అంత నావిర జాంబుజాయం సంభ్రమంబున నన్నుం దోడ్కొని తనయింటికిం జనియె.

రతిమాల. ఈసందర్భంబు కరము రసావహం బయ్యె మనంబున నుత్కంఠంబుఁ జేయుచున్నది. దైవానుకూల్యంబున భోజనికంటం బడక తప్పించుకొనిరి. భువనేశ్వరి యూనుకూల్యంబు సేయుం గాత. అనంతరవృత్తం బేమి? చెప్పులకు విం దొనర్పుము.

రాగమాల. ఓసి రతిమాలా! వినుము. అప్రకటితానురాగలగు ముగుదల ననేక ప్రకారంబుల ననుసరించి వారలమనోరథంబులు దెలిసికొనం దగుజాణతనంబుగలదానం గాన నేనకాంతాతిలకంబునకు విస్రంభభూమిగ నగుటం జేసి తనదండ నుండుచిత్రఫలకంబునవిలిఖితుండగు రాకొమరురూపరేఖావిలాసంబులమరినవాని; భువనేశ్వరీదేవాలయంబునఁ దాఁగాంచినవాని నడుగ నతం డుదయాదిత్యుండు. భవదర్థం బాకుమారుండు శ్రుతశ్రవసుండను విప్రకుమారునివేషంబుతో వచ్చియున్నవాఁ డని నుడువ నది విని దురంతమారవ్యథాకులితహృదయ యయి కులకుమారికాజనోచితంబగు నభిమానంబు వదలక యెన్నరానిక్లేశంబు లనుభవించుచున్నయది.

సీ. అభినవసుకుమారసుభగ మాకాయంబు గాంచి యేతెంచినకంతుఁ డనఁగ
భువనేశ్వరీసౌధనవమహాలంకారుఁ డగుకుమారునిఁ గనునవసరమున
ఘనపరస్పరదృష్టివినిపాతవంచనావసరజ్వరితచిత్తవర్ధమాన
కౌతూహలోల్లాసకలితసాధ్వసమంథరాంగలగ్న స్వేదసంగతముగ
నొండొరులఁ జూచుకొన్నయామోత్సవంబు,హైమవతియింట జరిగిన దాదిగాఁగ
దుస్సహాయాసదారుణదుర్దశావి పాకభరమున కాశాంత పాలుపడియె.
ఇట్లుపడి,

సీ. ఖరకిరణాక్లిష్టకమనీయకమలినీకలితాభినవకందలితలీలఁ
బొలుపారునంగకంబులసొంపు సుమశరశరతాపవేదనాభరముఁ దెలుప
మ్లాయమానమనోజ్ఞమహితహస్తన్యస్తపాండురశుభగండపాళి యగుచు
వికసితసారసవిస్రుమరమకరందబిందుబృందంబుల నందగించు

గీ. మందిరోద్యానపర్యంతమారుతమున, కంగక ములొప్పగించి యాయుసలరుబోడి
యాటపాటలపయి మది నాసవీడి, చెలుల విడనాడి యొంటిమైసొలయుచుండు.
విరజాంబుజాదర్శనంబునం గుమ్మారుండు నతిదుస్సహామారవేదనావిహస్తితధైర్యం

కీయిరువురకుం గరము శోచనీయావస్థ సంభవింప వీరికిం బరస్పరప్రణయవిశేషంబు విను చుండిరేని యావిరహంబు సహ్యావేదనంబై యుండునని యెంచి యందుకుం దగినవెర వూహించి రాజసుత పెంపుడుచిల్క తమాలిక యనుదానికి విరజాంబుజావిరహావస్థాబోధ కంబు లగుపద్యంబులు గఱపి దానినంపి కుమారుని కెఱింగించియు నతని పెంపుడు చిల్క హారీత యనుదానికిఁ దదీయావస్థావర్ణనపరంబులగు పద్యంబులు గఱపి దాని నిక్కడకుఁ బంపునట్లుచేసి దానివలన రాజకుమారికకుం దెలుపుచు విరజాంబుజచేత నాతనికి స్మరసం దేశంబుం బంపి యున్నారము. అనువుమెయి నన్యోన్యసల్లాపంబు లపరోక్షంబుగ జరుగు నట్లు సేయవలయు.

రతిరూప. ప్రియసఖి కావలసినపను లింక గరము దుస్సాధ్యంబులు గావు.

విరజాంబుజ కరము దుర్బలావయువ యని యెఱింగించి లీలావతియనుజ్ఞం గైకొని వినోదార్థము కుసుమాకరోద్యానంబునకుం గుమారికం దోడ్కొని చని. అయ్యెడకుం గుమారునిరప్పించి యభీష్టకార్యంబు నెఱవేఱుతము రమ్ము. ఇంక నీ కార్యం బున జాగుసేయుంజనదు. పోవుదము. (అని రాగమాలతో నిష్క్రాంతయయ్యె.)

## ప్రవేశకము.

అంత విప్రకుమారవేషధరుండగు రాజపుత్త్రుండు ప్రవేశించుచున్నాఁడు.

రాజపుత్త్రుండు. (స్పర్శసుఖం బభినయించి.) ఈ యుపవనమారుతంబు కరంబు మనోహరంబై యొప్పుచున్నయది.

ఉ. సారసినీపరాగనవసౌరభభార మలందుకొంచు వి
స్ఫారమనోహరస్తబకసన్నతలా లతలాసఁ గాంచుచుఁన్
సారసలోచనామదవశంవదయానవిలాస మేలుచున్
మారుతుఁ డేగుదెంచెడిని మందగతి న్ననిలాసిక్తైపడిన్.

(ఆత్మగతమున) తరుణాంబుజ దనవలె విరజాంబుజగూడ నన్నె కోరియున్నదని చెప్పి నను స్త్రీహృదయంబు దూరం బారయక నిశ్వసనీయంబుగాని దగుటంజేసి రతిమాలా రాగమాలల నిగూఢ దూతికలుగాఁ బంపి భోజసుతామానసంబుం దెలిసికొంటిని. ఈ దూతికలచతురత్వంబున నాపూర్ణేందుముఖిం గనుంగొంటి. రహస్యంబు దొరికి యాయిందీ వరాక్షితో సంలపించి తరుణాంబుజాప్రణయవృత్తం బెఱింగించినంగాని కార్యంబను కూలింపదు. ఇదిజరుగక గురుజనంబు ప్రార్థించినయర్థంబును నెఱవేఱదు. కాన నీపురోప వనమునం బ్రవేశించి రతిమాల నెప్పినచోప్పునం బ్రవర్తించెదను. (అని యుద్యానం బునం బ్రవేశించి.) ప్రకాశముగ. ఔర! ఈకుసుమాకరోద్యానంబు నామనంబున కత్యామోదంబుఁ గలిగించుచున్నయది.

చ. అరుణనవప్రవాళరుచి యందము మీఱెడుమోవి గాఁగ శ్రీ
కరఘనపుష్పగుచ్ఛములు గబ్బిచనుంగవయుబ్బు సూపఁ గాఁ
దరుణులఁబోలి యొప్పెడిలతాతతిఁ గాంచి వినమ్రశాఖ ల
న్గరములఁ గౌఁగిలించెడి నికామరతిం దరురాజి లీలతోన్.

అల్లదె! రతిమాలానిర్దిష్టంబగు మాధవీనికుంజంబు గనంబడుచున్నది. దానిపర్యంతభూమికిం బోయెదను.(అని పరిక్రమించుచు. ఆత్మగతంబున.) ఔర! భోజతనూజకుంగల రూపరేఖ నేమని పొగడంగలవాఁడను. ఆకన్యకామణి రాజకన్యకోచితంబులగు విభూషణంబులు గైసేయక సామాన్యచేటీవేషంబుఁ దాల్చియుండుట యతిమనోజ్ఞం బయి తోఁచె. ఇట్లననేల? అరూపసారనిర్మాణకు భూషణంబులవలన నొకయతిశయంబు గలుగవలయు నన్నది లేదు.

క. నిరుపమసహజసురూపో, త్తర కాసౌభాగ్యగుణనిధానంబునకున్
వెరతొడవు లేల సురభిళ, వరదమనకవల్లి కితరవాసన లేలా.

అవరారోహ పుత్తెంచినస్మరసందేశంబుం గనుఁగొన్న దాదిగ దుస్సహావిరహవేదనావివశుండ నగుటం జేసి.

చ. సురుచిరపాండుగండయుగసూచితగాఢవియోగవేదనా
భరపరిహీణ మై నవవిభాసుభగత్వరమావిలాసమున్
దరమయి యొప్పునావికచతామరసేక్షణమోముఁ జూడఁ గాఁ
గరము కుతూహలంబుఁ గొని కామితసిద్ధికి నుత్సహించెదన్.

అని తనహృదయం బుపలక్షించి,

చ. ఘనకచఁ గౌఁగిటం బొదివి గ్రక్కున సౌఖ్యము గాంచకుండుటన్
దను విది వెల్లఁబాఱి కృశతం గను టొప్పనుగాని యుల్లమా!
వనజదళాయతేక్షణను బాసి యొకప్పుడు నుండనట్టినీ
వనయము తాపభారమున కాశ్రయమై వెత లొంద నేలకో!

(మరలిచూచి. సంతసంబుతో.) మదీయభాగ్యదేవత సన్నిహిత యగునట్లు లీమదవతీమణి విరజాంబుజ రాగమాలానుసృతయై నాయుండుచోటికి దరిసి వచ్చుచున్నయది. దీని కామయమానావస్థ కరము మనోహరంబై యొప్పెడిని.

గీ. దళితహరిద్రరుచిగౌరలలిత మైన, భామతనువు వియోగజపాండిమంబు
గదురుచుండుట రజతంబు గలపి కరిగి, నట్టిబంగారమునఁ జేసినట్టు లొప్పె.

ఈవరారోహ యియ్యెడకు వచ్చుటం జేసి రతిమాల యొనరించినతంత్రంబు ఫలియించు నని తోఁచెడిని. ఈ విరజాంబుజకు నే నియ్యెడ నుండుజాడ తెలియకపడు నేని

కార్యంబు సెడును. కాన నే నీగుజ్జులేమావిమాటునకుం బోయి నీరంధ్రంబు లయి యిలకు వ్రేలాడు తదీయ సుకుమారశాఖానికరంబుల సంఛన్నమూర్తి నై వర్తించెదను.

(అని యట్లు సేయుచున్నాఁడు.)

రాగమాలానుసృతయై విరజాంబుజ ప్రవేశించుచున్నది.

విరజాంబుజ. ప్రియసఖి! రాగమాలా! ఈయుద్యానవనంబుం గాంచితి వే! కరము మనోహరంబై యొప్పెడిని.

రాగమాల. భర్తృదారికా! ప్రియసఖి! ఇది కరము మనోహరంబై యొప్పుట చిత్రమటే!

గీ. * లలితసౌభగరుచిమృదులవలిమధ్య, మగుచుఁ బృథులకుచం బయి యధికవిపుల
భూజఘనమయి పున్నాగభోగ్యమైన, వనము నీయావనమువోలె వన్నెఁ గాంచె.

విరజాంబుజ. (స్మితము గావించుచు.) ప్రియసఖి రాగమాలా! నీయొనరించినవర్ణనంబు కర మానందకరంబ యయ్యును బున్నాగభోగ్యం బనుటచేత నుల్లంబున శోకించుక వ్రీడాకులతం గలిగించెడిని. నీవెల్లప్పుడును జమత్కారముగఁ బల్కుచుండుదానవు అది యట్లుండనిమ్ము. ప్రియసఖి రతిమాల యెక్కడ కేఁగె?

రాజపుత్త్రుండు. (ఆత్మగతమున.) ఈరాగమాల వచించినయుక్తి శ్లేషానుప్రాణితంబై యుద్యానవనమునకును విరజాంబుజాయావనంబునకును సామ్యంబుం దెల్పుటం జేసి యత్యంతాభినందనీయంబై యున్నది.

రాగమాల. భర్తృదారికా! మనము నేయఁ గడంగినహరీతతమాలికాప్రణయపాలనమహోత్సవంబునకు హరీతకంబుం దేబోయి యున్నయది. వైళంబ యేఁగుదెంచు.

విరజాంబుజ. ఓసి ప్రియసఖి! మనతమాలిక తనచక్కఁదనంబునకును నేర్పునకుం దగినసాయకునం దనురక్తిం గాంచుటకుం గరము సంతసం బయ్యెడిని. పిన్ననాటం గోలె

* ఈపద్యమునకుఁ బ్రస్తుతముల రెంటిని భోధించునర్థద్వయముగలదు. అందు నుద్యానవనపరమగునర్థము. లలిత......మధ్యము = మనోజ్ఞమగుసౌభాగ్యమునురుచియును గలిగి మృదువులగు లవలియనులతలుమధ్యభాగమునఁగలది. విరజాంబుజయావనపరమగునర్థము. మనోజ్ఞమగుసౌభాగ్యమును రుచియునుగలిగి మృదుళములగుత్రివళులు గలనడుముగలది. పృథులకుచంబు=(ఉద్యా.) గొప్పనిమ్మపండ్లుగలది. పృథు లకుచ మని పదవిభజన. (విర.) పృథులములగుకుచంబులుగలది. అధిక...ఘనము=(ఉద్యా.) అధిక విపులమయిన భూజములచేత (వృక్షములచేత) నిరంతరంబు. (విర.) అధిక విపులమయిన భూమివలె విశాలములగు పిఱుందులుగలది, పున్నాగభోగ్యము=(ఉద్యా.) పున్నాగతరుచేత భోగార్హము. (విర.) పున్నాగమునకు (ఉత్తమపురుషునికి) భోగ్యము.

నిది నేఁ జెందినయది గాన దీని కభిలవిధంబుల మేలగుట నా కిష్టంబు. హారీతకంబు నన్ని విధంబుల దీనికిం దగినయదియ.

రాగమాల. భర్తృదారికా! మేముచు నీయం దిట్టు సంతసంబు నొందుచున్నా రము గాదె!

విరజాంబుజ. (వైవర్ణ్యంబుతో. ఆత్మగతముగ.) నే నాపురుషపుంగవునియం దను రాగముగొనియు ఫలం బేమి? ఆర్యతరుణాంబుజయు నేను నుదనూదిత్యునిం జేపట్టం దలంచి వ్రతంబు సల్పితిమి. ఈయతిశయం బనుభవింప మాకు లేకపోవుటంబట్టిగాదె యీయార్యపోయినవల నెన్నాళ్లకు నెఱుకపడక యున్నది. అల్పభాగ్య నగునా కీవిశే షంబు గల్గుటయుం జింతావహం బయ్యె. (ప్రకాశముగ.) ప్రియసఖి! ఈతమాలిక హారీ తంబు నెప్పుడు గాంచె. ఈరెంటికిని బరస్పరవిలోకనంబులు నయితము గూడవని మన మనుకొని యట్లు జరుపుచుండ లేదటే!

రాగమాల. భర్తృదారికా! ఔను! మన మావిధంబునం బ్రవర్తించుచుంటిమి. ఎల్లకార్యంబులును మనకువశ్యంబు లటే! ఆహారితకము నీకడకుం జనుదెంచి మాటలాడు చుండునప్పు డీతమాలిక పంజరనిరుద్ధంబై యుండి పడుచుండునుత్కంఠావిశేషవికారం బులు మనము దినదినము గాంచుచున్నవియేకద! అట్లె యీతమాలిక రాజకుమారునొద్ద మాటలాడుసమయంబున హారీతకమును సంభ్రమించుచుండు. ఇది నీసఖిజనం బెఱింగిన యర్థంబు. గతదినంబున నేకారణంబుననొ హారీతకంబు విడిపడి మనకన్యకాంతఃపురోప వనంబున కభిముఖంబై చనుదెంచుచుండె. అప్పుడ నేఁ బంజరనిర్గతంబు గావించి యభ్యవహారంబు లిడుచుండునీతమాలిక హారీతకంబువచ్చెడుజాడ లారసి తటుక్కున నెగసి తదభిముఖంబుగఁ జనిన నది దీని నాక్రమింపం బ్రయత్నించియు విఫలమనో రథంబై వెనువెంటం దగిలె. అంత నీరెండును భోజభూపాలునియెదుటికిం బోయినం గళావంతుండు హారీతకంబును రప్పించుకొనియె. రత్నావళీసాగరికల నంపి యీతమాలి కను దెప్పించితిమి.

విరజాంబుజ. అట్లయిన నింక నీవిహంగంబులకుం బ్రణయనిర్వహణంబ మోదా వహం బని తోఁచెడిని.

రాగమాల. భర్తృదారికా! విరహోత్కంఠితలకు నిష్టసమాగంబు కరము మోదా వహంబు గాకపోవునటే!

విరజాంబుజ. (ఆత్మగతమున.) ఈచతుర తమాలికావ్యాజంబున నన్ననుచున్నది. వికతంబు గాన నిది యూరకుండదు. రతిరూపయు రాక యున్నది.

రతిరూప. ఇదె యెదుట విరజాంబుజ రాగమాలాసహితయై యున్నది. సమీప మునకుం జని యీహారీతకంబును దానిచేతి కిచ్చెదను. దీనిం గాంచెనేని యత్యాశతోఁ గైకొని దీనిముద్దుపలుకులకు మానసంబున నభినందించుచు నత్యాదరంబుఁ గాంచు. (అని సమీపమునకుం బోయి.) ఔర! యీహారీతము కరము పరిచయవశంబున విరజాంబుజం గాంచినతోడన దానియంసంబుపై వ్రాలెడిని.

విరజాంబుజ. ప్రణయభరంబు మెఱయ హారీతకంబును చేతికిం దీసికొని చెక్కులు దువ్వుచున్నది.

రాగమాల. ఓహారితకమా! నీవు మాభర్తృదారిక సేయుఁబహుమానంబు వడయుచుండుదానవు. ఆకుమారికకు మనోవినోదనంబు గల్గునట్లు రాజకుమారుండు వచించిన పద్యం బేదేని వచింపుము.

* హారీతకంబు. శ్లో. చంద్రశ్చండకరాయతే మృదుగతి ర్వాతోపి వజ్రాయతే
మాల్యం సూచికులాయతే మలయజాలేప స్స్ఫులింగాయతే
రాత్రిః కల్పశతాయతే విధివశా త్ప్రాణోపి భారాయతే
హా హంత ప్రమదావియోగసమయ స్సంహారకాలాయతే.

రతిమాల. భర్తృదారికా! వింటివా ఆకుమారుండు పడుచుండుకఠోరదశావిశర్య యంబు? ఆజగదేకమంగళంబగు నాతనియంగంబున కేదేని యెగ్గు గలుగునో యని భయంబు నొందుచున్నారము.

---

టీ. * చంద్రః=చంద్రుఁడు, చండకరాయతే=కఠోరకిరణుండగుచున్నాఁడు. విరహిజనులకుఁ జంద్రాతపమలయమారుతాదులుద్దీపకములుగానఁజంద్రుండుదాపంబుగలిగించువాఁడగును గాఁబట్టి సూర్యుఁడువోలెఁదపించుచున్నాఁడని భావము. మృదుగతిర్వాతోపి=మలయమారుతమును, వజ్రాయతే=వజ్రమగుచున్నది. వజ్రాయుధమువలెఁ గరముబాధఁ గలిగించుచున్నదనియర్థము. మాల్యం=పుష్పమాలిక, సూచికులాయతే= సూదులగుంపగుచున్నది. పుష్పవయింబడిన సూదితోఁ బొడిచినట్లున్నదని భావము. మలయజాలేపః = చందనపుంబూఁత, స్ఫులింగాయతే=మిడుంగురులగుచున్నది. చందనముబూసినచో నది మిడుంగురులు గ్రమ్మినట్టులున్నదనిభావము. రాత్రిః=రాతిరి, కల్పశతాయతే = పెక్కుకల్పంబులగుచున్నది. కార్యాంతరాసక్తియుం నిద్రయులేదుగాన నొకరాత్రినూఱుకల్పంబుల కాలముగఁ బెఱుగుచుండునట్లు దోఁచుచున్నదియనిభావము. విధివశాత్=దైవవశంబున, ప్రాణోపి=ప్రాణమును, భారాయతే = బరువగుచున్నది. శరీరదౌర్బల్యముచేతఁ బ్రాణంబులునయితము భారమయి తోఁచుచున్నవనిభావము. హా! హంత! = కటకటా! ప్రమదావియోగసమయః=దయితతోవిరహమనుభవించుకాలము, సంహారకాలాయతే = ప్రళయకాలమగుచున్నది. ప్రాణములు నిలుచునట్టు లుండ లేదనిభావము.

రాగమాల. ఓసీ రతిమాలా! మీరాజకుమారుండే యిట్టియిడుమ లనుభవించుచు న్నాఁడని యనుకొంటివా! మాభర్తృదారికకుం గలఖేదంబును వినుము. ఓసీ తమాలికా మన భర్తృదారిక యిపుడు కాలంబుగడపువిధంబు నెఱిఁగించుపద్యంబు వల్కుము.

తమాలిక

* శ్లో. అగారేస్మిన్ కాంతే గిరిశ మనిశానాథశకలం
భుజంగా నుత్తుంగాన్ సకల మపి వాతాయనపథే
నిఖంజేషు శ్యేనా నధిగృహశిరో రాహువలయం
లిఖంత్యా నీయంతే శివ శివ తయా హంత దివసాః.

రాజపుత్రుండు. కట్టా! ఈకుమారీతిలకం బున్మాదావస్థం గాంచినయది.

రాగమాల. ఓసీ రతిమాలా! వింటివటే మాభర్తృదారిక యనుభవించునవస్థా విశేషంబు ఇంత కలిశయించెనేని యీవిరహవ్యథవలన లావణ్యసారంబగు దీనిశరీరంబున కెట్టిశోచనీయస్థితి గల్గునో యని మే మనారతము భయంపడుచున్నారము.

విరజాంబుజ. ఓసీ సఖులార! యీమాట లేటికే! మనము వచ్చినపని నిర్వర్తించు కొని యింటికిం జనుదము. హారీతతమాలికా ప్రణయపాలనమహోత్సవంబునకుం దగిన

* విరహవ్యథచేతనున్మాదావస్థజెందినకాంత మన్మథోపద్రవము తనకుంగలుగక యుండుటకుంద దుద్దీపకములకుం బ్రతిక్రియ సేయుంవిధంబు వర్ణింపంబడియెడిని.

టీ. కాంతే, అస్మిన్, అగారే=మనోహరమయినతనయింటియందు, అనిశానాథ శకలం=చంద్రకలావిరహితుండగు, గిరిశం=శివుని, సకలమపివాతాయనపథే=ఎల్లసోరణ గండ్లవాకిళులయందు, ఉత్తుంగాన్=ఉన్నతములగు, భుజంగాన్=సర్పములను, నిఖం జేషు=పొదరిండ్లయందు, శ్యేనాన్=డేగలను, అధిగృహశిరః=చంద్రశాలయందు, రాహు వలయం=రాహుగ్రహముయొక్కచుట్టను, లిఖంత్యా-తయా = వ్రాయుచుండునట్టి యీకాంతచేత, దివసాః=దినములు, నీయంతే=గడపంబడుచున్నవి. హంత = అయ్యో! శివశివ=కష్టముకష్టము.శివుఁడుమన్మథునిసంహరించినవాఁడుగాన మన్మథుఁడు తనయందకు రాకుండ నతనికిమారకుండగుశివునినింటిగోడలపైవ్రాయుచున్నది. సర్పములు వాతాశన ములుగాఁబట్టి మలయమారుతములు తన్నుబాధింపకుండ నావాయువులువచ్చుమార్గంబుల నెల్లయెడలను సర్పములనువ్రాయుచున్నది. వచ్చినవాయువు నవిమ్రింగివేయుననిభావము. పొదరిండ్లయందుఁ బారావతము లుద్దీపకములుగాన వానిని దినుటకు డేగలును వ్రాయును. చంద్రశాలపయికిం జంద్రుండు వచ్చునుగాన వానిమ్రింగుటకు రాహుగ్రహమును

పను లుపక్రాంతంబులు సేయుఁడు. ఈరెంటికి నలంకరింపం దగుభూషణంబులు గొని తెచ్చితిరా? ఈమాలతీకుంజాంతరంబునం గూరుచుండి వీని కలంకరింతము.

అని సఖులతోఁ గుంజప్రవేశం బభినయించుచున్నది.

రాగమాల. ఓసీ రతిమాలా! యత్నించినపనికిం బూర్వభావికార్యం బింత యుండఁగా నిది మఱచి పోయినదాన వట్టై పోతివే మే!

రతిమాల. ఓసీ రాగమాలా! ఈహారీతంబుం జేఁ బోయినదానను. మహాకవి భవభూతి భోజరాజాహూతుండై తత్సభాస్థలాభరణం బయిననూతనసమాగతుండగుబ్రాహ్మణ బ్రహ్మచారి నవధీరితదినమణి ప్రభాభాసమానబ్రహ్మతేజోవిరాజితుం డగువాని నఖిల విద్యావైదుషీవిభూషితుని నతనునిబోలురూపరేఖావిలాసంబుల నొప్పువాని నభినవయౌవనాగమమనోహరాంగు నంగనాసంగసుఖపరాఙ్ముఖునిం గనం బోయెను. ఆకారణంబున నాతనిశిష్యవర్గంబులు పాఠంబులు లేమిఁ బ్రమోదమేదురహృదయంబులతోఁ గ్రీడించుచు నన్నెదుర్కొని యీకీరంబును ముద్దుగొనుచు నాలస్యపఱచుటంబట్టి రాఁ దడ వయ్యె.

రాగమాల. (చేచాటుచేసికొని.) ఓసీ యట్లయిన శ్రుతశ్రవుండు రా ననువయ్యెఁ గాఁబోలు. ఇంకను రాకయున్నాఁ డదేల?

రతిమాల. (చేచాటుచేసికొని.) ఓసీ యతండు ముందె వచ్చి మాకందతరుశాఖాసముదయంబునం బ్రచ్ఛన్నుండై యున్నవాఁడు.

రాగమాలయుఁ రతిమాలయు. ఓభర్తృదారికా! మే మీశుకశారికల యలంకారంబులకుం దగినసుమంబులు గోసి తదుచిత సుమభూషావిశేషంబులును గల్పించెదము. నీ విందుండి యీవిహంగంబులకు రత్నాలంకారంబులు గైసేయుము. (అని నికుంజంబు వెలికిం జనుదెంచి కనుసైగల రాజపుత్రునికి నికుంజాంతరంబు సొరం దెలిపి నిష్క్రమించిరి.)

రాజపుత్రుఁడు. నికుంజద్వారదేశంబునకుం జనుదెంచెను.

విరజాంబుజ. (హారీతంబును ముంజేతిపై నెక్కించుకొని.) ఓశుకరాజమా! నీ కీ తఃమాలిక నొసంగి పరిణయముఁ గావించెదను. నాప్రాణనాథుండు సెప్పిపంపినపద్యంబు మరల నుడువుము.

హారీతము. చంద్ర శ్చండకరాయతే అనుశ్లోకమును వెండియుఁ బఠించుచున్నది.

విరజాంబుజ. (కనుదమ్ములం గ్రమ్ముబాష్పంబులతో.) ఇట్లు ప్రకృతిసుకుమారుండా కుమారుం డతిదుస్సహవిరహవేదనాయాసం బనుభవించుచుండినను నేని ట్లతికఠోర

హృదయనై యతని కుపయోగపడక యున్నదానను. ఇట్టియుపకృతిశూన్యం బయిన యీ మందభాగ్యురాలిజన్మం బెందుకు? అర్క శరుణాంబుజం దలంచుకొనుచుఁ దదర్థంబు లగుమథామనోరథంబుల నవిరతవిజృంభమాణదుర్వారదుఃఖావేగోద్వర్తమానహృదయనై సఖీజనంబును సంతపింపఁజేయుచు మలయమారుతచంద్రాతపప్రముఖంబులగు ననర్థపరంపరలకు నోర్చుకొనుచు దివసయాపనమాత్రఫలంబుం గాంచుచుండు నాయందుఁ బ్రణయం బుంచి దుస్సహాయాస సంతాపితుండగు నతని త్రిభువనసౌభాగ్యలక్ష్మీపరిగ్రహైకమంగళం బగుతనూరత్నంబు కరము పరిహీణం బగుచుండుటకుం బరితపించుచున్న దాన. ఇయ్యిలాతలంబునం గలమందభాగ్యలలో నావంటి దెవ్వతెయుఁ గాదు. భువనేశ్వరీదేవాలయాలంకారకారియగు నాప్రాణనాథునిముఖచంద్రమండలంబును వికసచ్ఛతపత్రలక్ష్మీ మనోహరం బగుదాని స్వచ్ఛందంబుగఁ గాంచుచు లోచనమహోత్సవం బొకింత తడవైన ననుభవింపకపోతిని. ఇది యట్లుండుం గాత. (అని తమాలికం జూచి.) ఓసి తమాలికా! నీవైన నాయకసమాగమంబుం బడసి సుఖింపుము. ఓసి నీభాగ్యం బేమి? నాప్రాణనాథునికరకమలోపలాలితంబగు నీహారీతకంబుం బతిగాఁ బడసితివి. దీనిసౌందర్యంబును చాటుకారితయుం నీ కత్యంతముదం బొనగూర్చు. వైళంబ భవత్ప్రణయపరిపాలనంబు నిర్వర్తింప నొప్పు. తొలుత నీనాయకుని కలంకరించి యంత నీకుం గైసేసెదను. (అని నాట్యంబున నలంకరించి.) నవవివాహమండన మనోహరం బైనయీహారీతకంబు తద్దయుం ముద్దులు గుల్కుచున్నయది. (అని ముద్దిడుకొనం బోయి దానిచేఁ గొఱకంబడి. ఇంచుక కోపంబుతో.) ఓరీశఠ! విహంగాపశద! ఇట్టి యవినయంబా! యొనరించెదవు. నిన్నుం బట్టి పంజరనిరుద్ధంబు గావించి దండించెదను. (అని యట్లు సేయం బోయె.)

రాజపుత్త్రుండు విరజాంబుజకడకుఁ ద్వరితగతిం జని. చేయియొడ్డి నివారించుచు. ఓకాంతామణీ వలదువలదు నీ కీసాహసంబు! ముగుదవు గాన నవిమృశ్యకారిత్వంబునఁ బ్రవర్తించి యీఁదటియనర్థంబు నారయక యుండెదవు? వినుము.

ఉ. ముద్దియ నీదుకెంజిగురుమోవి మనోహరబింబవిభ్రమం
బుద్దవిడి న్నిగుడ్చ శుక ముఖ్విఖలూరుట దానితప్పె యో
ముద్దులగుమ్మ యామరుని మోహనవాహన మీఖగంబు సు
స్మైద్ధియుం నప్రియంబు రచియింపఁగ నాతఁడు రోసగింపఁడే.

విరజాంబుజ. రాజకుమారునిం గాంచి లజ్జాభయసంభ్రమంబులతో నవ్వలి కేఁగుచున్నయది.

రాజకుమారుండు. విరజాంబుజ కడ్డంబు సని

ఉ. ఓరమణీశిరోమణి నయోన్నతి నీశుకశారికంబులన్

గోరికఁ దీర్పఁగాఁ గడఁగి కోమలి నీ విది సేయకున్న నం
భోరుహబాణతాపమున భోరనఁ బొక్కెడి వీ యావిహంగముల్.

ఇట్టు లీరెంటి కాసగొలిపి వానికోరికలు దీర్పక పోవుటంజేసి కామినీకాఁక్ష వధపాతకంబు సంభవింపకపోవునే! ఇట్లుపోవం జనదు. కడంగినకార్యంబు నిర్వర్తింపుము.

విరజాంబుజ. (అవనతముఖియై. ఆత్మగతమున.) ఈరతిమాలయు రాగమాలయుఁ జేసిన కపటం బిది. ఈకుమారుని నియ్యెడకు రమ్మని శుకశారికాప్రణయపరిపాలనోత్సవ వ్యాజంబున నన్నుం దోడ్కొని వచ్చి నిర్జనం బగునీనికుంజంబున నునిచి కృతసంకేతలై వారు సనిరి. ఆ! వీరలచాతుర్యం బేమందును. వీరిమాయలకు లోఁబడి కుమారునికిం జిక్కితిని. ఇతఁడు నన్ను మాటలాడించుటకుం దగుసందర్భంబుం గల్పించుకొని తన్ను విడిచిపోఁగూడదని వెరవునం బ్రవర్తించెడిని. ఏమి సేయంగలను. (ప్రకాశముగ.) (హారీతకంబుం గాంచి.) ఓశుకమా కన్నియ లేకతంబున నుండం దన్నిలయంబులకు రాకొమరులు వచ్చుటకు న్యాయం బెట్టిదియో ఈప్రజాపాలనక్షము నవనతితో నడుగుము.

రాజపుత్త్రుఁడు. ఓకుమారీతిలకమా నీసేయంగడంగిన హారీతతమాలికాప్రణయ పాలనమహోత్సవంబున కాహ్వానంబు వడసి వచ్చినవాఁడ.

క. వరునికి వరవర్ణినికిని, ధర నిష్టజనంబు వచ్చి తత్పరిణయముం
జరిపించుట న్యాయం బని, తరుణీ నీవెఱుఁగవే సుధాధామముఖీ.

విరజాంబుజ. (సుస్మితంబుతో. ఆత్మగతంబున,) ఔర! రతిమాలతో నే నీ మహోత్సవంబున కిష్టజనసమాహ్వానము సేయుమంటిని. ఆమాట కీకుమారునిం దోడ్తెచ్చి నయది. ఏమి దానిచతురత. ఇంత మోసగత్తె యని యెఱుంగక పోతిని.

రాజపుత్త్రుఁడు.

గీ. భీరు నీపాటలాధరబింబమందు, స్మితసుమం బుదయించినచెలువ మానఁ
గాంచిన మదీయమానస మంచితముగ, ఫలముఁ జెందిన దిదె చిత్ర మెఱమిఁజూడ.

(మందహాసంబుతో.) ఓసుందరీతిలకమా! మేము పెండ్లికొమారునివైపువార మగు టంబట్టి పెండ్లికూఁతుపక్షంబుదానవగు నిన్నొకయర్థం బడుగవలసియున్నది. ఈప్రవృత్తంబగు పరిణయంబునందు,

ఉ. శారిక యాత్మనాథునికి సమ్మతిఁ గూర్చిన దయ్యు నిప్పుడో
సారసపత్త్రనేత్ర యది చండితనంబున మోడిసేయు సు

స్మారసి తానటంచు భవదాత్మసఖీమణి సెప్పె సాకు నీ
చారుముఖీవతంసము నిజంబుగ నట్టులొనర్ప కున్నదే.

విరజాంబుజ. (ఆత్మగతంబున.) నేను దయితవిరహంబున వేగుచుండ నీశారిక దనపలింగలయుంటకుం బ్రియంపడ దనునీయర్థంబు మత్సఖీజనంబు వాడుకొనుచున్నదియు. ఇప్పు డది ప్రశ్న చేయంనితనివచనంబులకు భావం బన్యంబు. అది సుకుమారం బగువిధంబున నుద్ఘాటితము సేయుచున్నాఁడు. ఏమి సెప్పుదు. (ప్రకాశముగ.) ఓహారీతకసా! ఈకుమారునికి సామనవి విన్నవింపుము.

చ. ఇరువురు సెచ్చెలు ల్దమకు నిష్టసమాగమ మాత్మఁగోరి యా
దరమున సువ్రతంబులు నితాంతరతి న్రచియించి యుండ సుం
దరి కొకదానికే ఫల ముదారతఁ గల్గిన మోద మందునే
నిరుపమశీలకీర్తి గుణనిర్మలవంశసుజాత యాత్మలోన్. అని.

రాజపుత్త్రుఁడు. ఉ. ఆరయ బాల నీవు తరుణాంబుజకై మదిఁ గుందుచుండుటల్
నేరిమి నే నెఱుంగుదును నిక్కము తత్ప్రణయాభిమానల
క్ష్మీరమణీయవైభవము మేలిమిఁ గాంచిన వాఁడ నైతి సు
స్మారజనీకరాననకరాంగుళిభూషణ మాసఁ జూడుమీ.

అని తనవ్రేల నుండుముద్దుటుంగరమును విరజాంబుజకుం జూపెను.

విరజాంబుజ. (ఉంగరముంగాంచి సంతసించుచు. ఆనందబాష్పంబులతో.)

ఓసుగుణమణిభూషణమా! నీవలన నిన్నిదినంబుల కార్యతరుణాంబుజ నేమంబున నున్నవృత్తం బెఱింగితిని. 'సిధ్యంతి కుత్రసుకృతాని వినా శ్రమేణ'(శ్రమంబనుభవింపక పుణ్యంబులెయ్యెడనైన ఫలించునే)అనువచనార్థంబు నాప్రియసఖికి ఫలించుట కపరిమితామోదం బయ్యె. నీవలె నిష్కారణభాంధవు లెవ్వరున్నారు? ఇట్టిమహోపకారంబుఁ గావించిననీకు నే నేమిప్రత్యుపకారంబు సేయఁ జాలుదును.

రాజపుత్త్రుఁడు. (ఆత్మగతమున.) ఈచతుర చతురతతో నంగుళీయకమునెపంబున నన్నభినందించుచున్నది. గుణమణిభూషణమా! యనుపదంబున నిది నన్నె సంబోధించినది కాన నీవరవర్ణినీతిలకంబు ననుమతింపంజేయ నిదియ తగుసమయము.

ప్రకాశముగ. ఉ. ధీమతి నీవు ప్రత్యుపకృతిం దగఁ జేయుట నిక్కమేని నన్
వేమరు నిర్భరప్రణయవీక్షణలీలలఁ జూచి సత్సుధా
ధామమయూఖసారసుఖదం బగునీబిగికౌఁగిటం దగన్

విరజాంబుజ. (లజ్జాప్రణయభయసంభ్రమంబులతో.) ఓశుకమా! ఈ కుమారునికి విన్నవింపుము.

ఉ. ఏను భవత్పదాంబుజ మహీనతఁ గొల్వఁ దలంచి యుండుటల్
మానుగ నివ్వనంబు నభిమానమునం దగఁ గాచుదేవతల్
మానసమం దెఱుంగుదురు మాగురుబంధుజనంబు మీకె న
న్నానిక నీఁ గడంగి రతిపుణ్యచరిత్ర త్వరార్తి యేలకో? అని.

సంతోషసంభ్రమంబులతో రతిమాలయుం రాగమాలయుం బ్రవేశించి.

ఓ భర్తృదారికా విరజాంబుజా! శారదచంద్రకళాసమానం బయినతనూలతయుం దతిసుకుమారమనోహరంబు లయినకుసుమమయాభరణంబులు దాల్చి యొకతీవెబోఁడి నీ పంటిసర్వావయవసుందరిం దోడుకొని చనుదెంచుచున్నది. ఆలతాంగి యెవ్వతెయో యెఱుంగంబడదు గాని యాతన్వంగితోఁ జనుదెంచుకనకాంగి నీసహోదరి తరుణాంబుజ యని సర్వవిధంబుల నీతోసమానంబు లయియొప్పునతిసముజ్జ్వలరూపకాంతిసౌభాగ్య విభవభద్రలక్షణంబులచే నెఱుకపడుచున్నది.

విరజాంబుజ. ప్రియసఖి! ఆకాంతారత్నంబు లెక్కడ? ఎక్కడ?

తరుణాంబుజతోఁడఁ బుష్పమయాభరణంబులు సర్వావయవంబులం దాల్చిన యొక లతాంగి ప్రవేశించె.

విరజాంబుజయుం రాజపుత్త్రుండు నచ్చెరువందుచు నత్యుత్కంఠాతరంగితమానసులై చూచుచున్నారు.

పుష్పాభరణంబులుదాలిచియుండుసుందరి. విరజాంబుజఁగాంచి. ఓ భోజసుతా తిలకమా! నే నీకుసుమాకరోద్యానవనదేవతను వాసంతి యనుదానను. అప్పు డప్పుడు నీవు నీ తరుణాంబుజయు నిందు విహరించుచుండ మీకుం గల రూపవినయసౌభాగ్యభాగ్య విశేషంబులకుం గరం బలరి మీకుం దగువరుం డుదయాదిత్యుం డని యెంచి యతని మీతోఁ గూర్పం దలంచియుంటి. దైవవశంబున మీకుం బరస్పరానురాగంబు ప్రవర్తిల్లె. ఇందు కమందానందంబుం జెందెదను.

చ. అనుపమరూపయౌవనకళాభిజనప్రముఖంబు లైనశో
భనగుణసంతతు ల్గలుగుభవ్యకుమారుల కాత్మలందుఁ దూఁ
కొనునసురక్తి యొండొరులకుం జనియింపఁగ దానిఁ బ్రోవ మే
మనయము నుత్సహింతుము రమారమణీసమ భోజకన్యకా.

మఱియు నిప్పు డీవు భువనేశ్వరీగతార్థంబునకు సాక్షిగ నన్నుం దలంచితివి. తరుణాంబుజయు నీవు నీ కుమారుని నొక్కటిగం జేపట్టుదు మని యనుకొనియుండువారలగుట యెఱుంగుదును గాన నామాహాత్మ్యవిశేషంబునం బెరవారి కెవ్వరి కెఱుకపడక యుండ నీ సహోదరిం దరుణాంబుజను దదీయసౌధతలంబున నేకతంబ యుండుదానిం గొని యాకాశయానంబునం దెచ్చినదానను. మీయం దతిప్రణయభరంబునం జేసి శరీరంబు దాల్చి మీకుం బొడసూపితిని.

విరజాంబుజ. దేవి వాసంతి యిదె నీకుం బ్రణామంబు! నీయొనర్చిన యతిప్రణయ విశేషంబున ననుగృహీతల మైతిమి. (అనిచెప్పి తరుణాంబుజం గౌఁగిలించుకొని.) ఆర్యా భువనేశ్వరీసన్నిధానంబున నన్నెడఁబాసి పోయినదానవు. ఈవాసంతీప్రసాదంబున నిన్నిదినములకు నిన్నుం జూడఁగలిగె. (అని యానందబాష్పంబులు విడుచుచున్నది.)

తరుణాంబుజ. (విరజాంబుజనొవలమూర్కొని.) ఆయుష్మతి! విరజాంబుజా! అప్పుడట్టికష్టంబు గలుగుట భువనేశ్వరీప్రసాదంబుచేత నీమహాతిశయమునకు మూలంబయ్యె! అని. లజ్జాప్రణయగౌరవబంధురంబులగు క్రేఁగంటిచూపుల రాజకుమారుని బహుమానించెను.

వాసంతి. ఓ కుమారికలార! భువనేశ్వరీప్రసాదంబునన యీయాతిశయంబు సమకూరె. ఇందు జంపు సేయంజనదు. ఈ తరుణాంబుజ నతిత్వరితగతి నయ్యెడకుం జేర్పకున్న దీనిచెలికత్తెలు దా మెఱింగి రేని సంతపింతురు. కాన నీమానినీతిలకంబు నొక్కగడియలోనన యిదియున్నచోటికిం జేర్పందగు. ఇప్పుడు జంపు మాని మీ ముప్పురకుం గలిగియుండు నన్యోన్యశోభాకరం బయినప్రణయభరంబు నిర్వర్తింపంజనును.

రాజకుమారికలు లజ్జావనతాననలై యుండిరి.

రతిమాలయుం రాగమాలయు. భగవతి వాసంతి నీచెప్పినవచనంబులకును బ్రతివచనంబులుగలవా! బహుదినములుగ నీ మహోత్సవంబుం గనుంగొన మేము ప్రార్థించుచుంటిమి. మా భాగ్యవశంబున నేటి కిది సమకూరినయది.

వాసంతి. ప్రియసఖులార! అట్లయిన నీకుమారునికి విప్రకుమారవేషంబుఁ దీసి రాజకుమారవేషం బలంకరింపుఁడు.

రతిమాలయుం రాగమాలయు నాట్యంబున నట్లలంకరించిరి.

వాసంతి. ప్రియసఖులార! వివాహకౌతుకంబు నిర్వర్తింపం జనును. మంగళపుష్పమాలికలు దెండు.

రతిమాలారాగమాలలు పుష్పమాలికలు గొనితెచ్చి. భగవతి! యివె మంగళకుసుమ మాలికలు.

వాసంతి. (పుష్పమాలిక లందుకొని.) రాజకుమారునిం జూచి. కుమార! యీరెండు కుసుమమాలికలును దరుణాంబుజా విరజాంబుజలగళంబుల నిడుము.

రాజపుత్త్రుండు. భగవతి! భవదాదేశంబున కీజనంబు వశగతంబ. (అని రాజకుమారి కల గళంబులం బుష్పమాలిక లిడెను.)

వాసంతి. (రాజకన్యకలచేతికిం గుసుమమాలిక లొసంగి. ఓకన్యకలార! ఇవి మీకుం జిరకాలసంప్రార్థితుండగు మీ మేనత్తకుమారునిగళంబుల నిడుండు.) అని వారలచేఁ గుమారుని కంఠంబునం బూలసరంబులు వేయించి. తరుణాంబుజావిరజాంబుజలకరపల్లవంబులఁ బట్టుకొని యుదయాదిత్యుని హస్తంబునం బెట్టి. కుమార!

చ. అనుపమభాగ్యరేఖ లన నాజలజాయతనేత్రలన్ ముదం
బున నినుఁ గోరినట్టివరభోజతనూజలఁ జెట్టపట్టి యీ
వననిధిమేఖలావలయవారితమైనధరన్ సమస్తభూ
జనతతి మోద మందుచును సంస్తుతి సల్పఁగ నేలు మాసతోన్.

రాజపుత్త్రుఁడు. భగవతి ఇప్పుడ యఖిలదేవతలచే ననుగ్రహింపఁబడితిని.

వాసంతి. రాజకుమారికల నర్పించుచున్నది.

రాజపుత్త్రుండు. భోజసుతలకరపల్లవంబులు తనహస్తంబునం బట్టుకొని మహా మోదంబుతో,

చ. అనుపమశారదేందుకిరణామృతసారము నూత్నభవ్యచం
దనరసపల్లవంబులు నుదారతఁ బిండినరీతి నొప్పనీ
వనజముఖీలలామములవర్ణ్యకరాంబుజసంగసౌఖ్యము లో
గనఁ గలిగె న్మహోదయముఖం బిది నాకుఁ దలంచి చూడఁగన్.

వాసంతి. కుమార! ఉదయాదిత్య! కుమారికామణులార! తరుణాంబుజావిరజాంబుజలార! ఈరహస్యవివాహమంగళంబు మీర లొండొరులు గోరినప్రకారంబుల నా యొనరించిన కౌతుకంబు. భువనేశ్వరీప్రసాదంబున మీజననీజనకులు జగద్విదితంబుగ మీగుణంబులకు సంతసించి జరుపంగలపాణిగ్రహణమంగళంబు మహావిభవంబుతోఁ బ్రవృత్తం బగు. మహాకాళికాదాసు ననుగ్రహంబున నెల్లశుభంబులు మీ కగును. హారీతకతమాలికల కింకం బ్రణయమహాలనోత్సవంబు జరుపుండు. అని రాజపుత్త్రుం గాంచి.

ఓకుమార! ఈభోజసుతారత్నంబులు భవదీయగుణవిశేషవశంవదమానసలై ప్రణయ బహుమానంబున నిన్నుం గారవించిరి. ఇంతకంటె నీకు నాచేయంగల కాంక్షితార్థ ప్రాప్తియేమి ?

రాజపుత్త్రుఁడు. భగవతివాసంతి! ఇంతకంటె నాకుం బ్రియం బొండు గలదే! అయిన నిదియగుంగాత.

భరతవాక్యము

సురవరు లెల్ల మర్త్యులకు శోభనము ల్గృప సేయుఁగాత నీ
ధరయును సర్వసస్యము లుదారగతి న్ఫలియించుఁ గాత శ్రీ
కరనవయావనాగమసుఖంబు విలాసుల కౌను గాఁత శ్రీ
ధరునిదయావిశేషమున ధన్యతఁ గాంతురుగాత సజ్జనుల్.

అనియందఱు నిష్క్రాంతులైరి.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమాణమానస భారద్వాజకులపవిత్ర తిరుమలార్యపుత్త్ర పెరుందేవీగర్భజన్మ చిలకపాటి వేంకటరామానుజశర్మప్రణీతంబైన వినోదకథాకల్పవల్లియందు రససంజీవననాటకంబున సప్తమాంకంబును సర్వము సంపూర్ణము.

ఇట్లు రూపకంబు సాంగంబుగ నభినయింపంబడుటం గాంచి యయ్యెడ నుండు వారలు మహామోదజలధిం దేలుచు నుదయాదిత్యునియందు భోజతనూజాత లనురక్త లగుటకుం గరము వారిగుణంబులు గొనియాడిరి. భోజుండు కనుదమ్ముల బాష్పబిందు బృందంబులు దారలుగట్టి ప్రవహింప నపరిమితామోదంబునం జెలంగుచు నోప్రాణ మిత్రమా కాళిదాస మహాకవీ! నాముద్దులపట్టిం దరుణాంబుజను సాధకునిబారిం బడిన దానిని గాచినయుదయాదిత్యుని నభినందించుటయు నిప్పు డత్యావశ్యకంబు గాదు. నా ముద్దుకూతు లొండొరులు చేసికొన్నదృఢవ్రతంబుం బట్టి విరజాంబుజా ప్రణయవిశేషంబు సంపాదింపవలసినవాఁడు గాన నాభాగినేయుండు తదర్థంబుగం బ్రయత్నింప నే నదియెఱుంగక శత్రువునిరూపంబున నున్నవానిం బ్రాహ్మణకుమారుం డని యెంచి నాకూఁతునెడ నపరాధంబుఁ జేసినవాఁడని నిశ్చయించి విరజాంబుజ జన్మదివసోత్సవంబున కాహ్వానంబొనర్చి యానాఁడు వానియం దతిపాపకార్యంబు సేయ సమకట్టినన్ను సరస్వతీసాక్షాత్కారంబున నుపశమితక్రోధునిం జేసిన మహోపకారం బెన్నినోళ్ళ వచించినను జాలునే! ఆకుమారునిం గాచి మాయెల్లరం బ్రతికించినవాఁడవు. మిత్రమ వన్న నీవ కదా! అతీతానాగతవర్తమానంబులు దెలిసి పద్మజురాణిని సాక్షాత్కరింపఁజేసిన వాఁడవు. కవి వన్న నీవకావె! నా జామాతం గాచి నన్ను జీవింపఁజేసినవాఁడవీవ కాన నాప్రాణంబులు నీయవి యయ్యె. ఇంక నే నీజనువర్థం బేమి యున్నది. ఏన నీకుం దాస జనంబనయితి. కరుణించి నాజామాతం గనుంగొన నతిత్వరాకులహృదయుండనై యున్న నన్ను నభీష్టార్థసంప్రాప్తివలనం గృతార్థునిం జేయుము. అతని గనుంగొని నాతనూజాతల నతని కర్పింపకున్న నాకుమారునియెడ నేనొనరించిన పాపచింతనమున నైనమహాతాపం బుపశమింపదు. ఇప్పుడు నీ వాకుమారునికి మేలు గూర్ప వచ్చియున్నవాఁడవు గాని

## మిత్రసహోదయాదిత్యులు బయల్పడుట.

యుత్తరమునకు వచ్చినవాఁడవు గావు. అని యిట్లు సంభ్రమానునయవచనంబుల నాత్మయందుం గలిగిన త్వరార్తి యెఱింగించుచుండ నప్పుడు రూపకప్రదర్శనమహామండపంబు నుండి యొకతరుణుఁడు వెడలివచ్చి రత్నపరిపూరితంబు లైనవజ్రఘటంబుల నాల్గింటిని భోజభూపాలునికడ నునిచి యివి యాకతోరకపాలుం డనుసాధకునిపర్ణకుటీరంబున నుపలబ్ధంబు లయినవి. ఇవి భవన్నామాంకితంబులుగాన భవదీయంబు లని యెంచి భవత్సన్నిధానంబునకుం జేర్చితిని. అని నుడువఁగా భోజుండు విని యాశ్చర్యంబు నొంది యాత్మహృదయంబున నివి సాధకునివలనం గైకొనంబడినవి, ఉదయాదిత్యునికడనుండం జనును గాని నర్తకులకడకు వజ్రఘటంబులు రాఁ గారణంబు లేదు. వీరికడ నివి యుపలబ్ధంబు లగుటంబట్టి యీనాటకం బాడినవారు నర్తకమాత్రులు గారు; మఱి యుదయాదిత్యునివారలై యుండం జనును. ఈవృత్తిం బారయఁదగు. అని యాలోచించి

యతనిం గాంచి యోమహాభాగ! సాధకగృహోపలబ్ధంబులై యుదయాదిత్యునికడకుఁ జేరందగిన యాఘటంబులు నర్తకుల రగుమీకుం దొరకుట యెట్లు? ఇందు నాకుం గల సందియంబు నివారింపుమని యడుగుచుండఁగా నావజ్రకలశంబులు దెచ్చిన యతని ముఖంబుఁగని సంగీతసర్వస్వవేదినియు సాహిత్యసర్వస్వవేదినియుఁ బ్రణయపరిపూరితాంతరంగంబులతో లేచి లజ్జాకులంబులగు కటాక్షవీక్షణంబుల నాతని మొగంబుం గాంచుచు నవనతముఖాంబుజాతలై యచ్చోటు విడిచి యవ్వలి కఱుగం గడుంగడుఁ దరుణాంబుజ నవ్వుచు వారల నడ్డగింపం బ్రతాపపాలుండు మొదలగువార లదిగాంచి యితనింజూచి యీకాంతలు లజ్జాకలిత లగుట యేలకో? యని యెంచుచుండిరి. వెండియు భోజుండు తరుణాంబుజం గనుంగొని పట్టీ! ఇతనిం జూచి యీసంగీతసర్వస్వవేదినియు సాహిత్యసర్వస్వవేదినియు సిగ్గుపడియెద రేలా! యని యడుగఁ దరుణాంబుజ తండ్రీ! వీరలే యాయిందురూపాచంద్రరూపలు. ఇతఁ డాసాధకునికడ నన్నుం గాచిన రాజకుమారునికిం బాసటయై వచ్చిన మంత్రిపుత్రుండు. ఇక్కుమారునియందు వీర లనురక్తలయి యుండువారు గాన నితనిం గాంచి లజ్జించెదరు. అనిన భోజుండు మహాముదంబుతో నితఁ డుదయాదిత్యునిసఖుఁ డగుమిత్రసహుండా! ఇప్పు డీతనిం గాంచం గల భాగ్యంబు నాకుం గలిగె. ఇఁక నుదయాదిత్యుని సయితము గాంచం గల్గుదు. అనిలేచి యతనిం గౌఁగిలించుకొని యానందబాష్పంబుల నాతనియంగంబులు దడుపుచు నప్పుడు తనకు నమస్కరించిన యిందురూపాచంద్రరూపలం జూచి యోవిదర్భతనూజాతలార! మీయసదృశంబులగు రూపాభిజాత్యలక్షణాదులకుం దగినవాఁడగు నీమిత్రసహునిం గోరితిరి. ఇది సకలజనాభినందనీయంబు. అనిన లీలావతియు విదర్భరాజసుతలయభివాదనంబు వడసి వారలం గౌఁగిలించుకొని యోకుమారికామణులార! తరుణాంబుజావిరజాంబుజలతో మీకుం గలిగిన నెయ్యంబు వియోగవిరహితంబై సుఖోత్తరంబై యుండుంగాత. అని యాశీర్వదించె. శృంగారవతీ ప్రముఖ లొండొరులతో నీతరుణాంబుజకుం గలిగిన మహావిపత్తు దాని కభిమతుండగు నాయకుండు దొరకుటకునీసఖు లగునిందురూపా చంద్రరూపాదుల సంప్రాప్తికిని హేతు వగుటం జేసి మహాభ్యుదయదాయకం బయ్యె. ఇది సర్వజనశ్లాఘనీయ మని కొనియాడిరి. భోజుఁడు మిత్రసహునింగాంచి యోకుమార! ఈ వజ్రఘటంబులు పూర్వము నాసభ కొక్కమాంత్రికుండు వచ్చి మూఢయగుకాంతను కవితానిపుణం జేసి తనసామర్థ్యంబుఁ గానిపింప నతనికి బహుమానింపంబడినయవి. ఇవి గొనిచనినవాఁ డీసాధకుండె కాఁబోలు! ఎందరో? ఎన్నియో గొనిపోయిరి. ఎవిగాని యెట్లు నిర్ణయింపం జనును. మీరు మీవృత్తంబుల మాకుం దెలియం జెప్పుటకు మీకూనిన రూపకప్రదర్శనంబు కరము సంశ్లాఘనీయంబై నయ్యున్నది. సంతసంబయ్యె. నీప్రాణమిత్రుం బగునుదయాదిత్యునిం గనుంగొన మనంబు త్వరాకులితం బగుచున్నది. అన మిత్రసహుండును మహారాజా! పైశంబ తద్దర్శనోత్సవంబు నీ కయ్యెడు. సంశయింపకుము.

జనంబుల కేరికిని ప్రవేశింపఁగూడదని మహారణ్యమధ్యంబునఁ జరిగినవృత్తాంతంబు సర్వజనంబులకు నెఱుకపడ నీకుం దెలిపి తరుణాంబుజాకుమారికకుం గలనిర్దోషంబగు కన్యకాత్వంబు వెల్లడిసేయంగోరియే మేముతద్వృత్తాంతవస్తు సంగ్రథితంబుగ నీరసంజీవన నాటకమాడితిమి. అని చెప్పెను. అది విని సభికు లందఱును వీరు ప్రదర్శితంబు చేసిననాటకంబుచేతఁ దరుణాంబుజావిరజాంబుజ లుదయాదిత్యునికిం బత్ను లయిరని వెల్లడియగుచున్నది. అర్థాచకోమరుని మిత్రుండు మిత్రసహుండే యీనాటకము ప్రవర్తింపం జేసినవాఁడు. కాన నిది నమ్మం జనును. సింహవాహనాప్రసాదంబు లేని నాఁడీతరుణాంబుజ కఖిలకవిపండిత సంఘసంశ్లాఘనీయంబగు సర్వవిద్యాచతురత యబ్బుట లేదు. ఆసింహవాహనావచనానుగుణముగ నీవిద్యాసర్వస్వవేదిని కన్యకాత్వంబు సెడకుండుటయు విశ్వాసంబు గల్పించుచున్నది. కాన నీనాటకప్రదర్శితవస్తుసందర్భంబు వాస్తవంబ యనం జను. అట్లయిన నీవిరజాంబుజాతరుణాంబుజ లుదయాదిత్యుని వరించినవారల యయిరి. ఈరాజకన్యకల నీకవివరుండు తనతోఁ జనుదెంచియుండు కట్టెలమ్ముకొనువానికిం బాణిగృహీతలఁ జేయం గడంగుటకుఁ గతం బెఱుకపడక యున్నది. ఇందు డెందంబులు సందేహాకులంబులై యుత్తలంపడుచుండెడిని. అని యనుకొనుచుండ నావిద్యాసర్వస్వవేదినీ సౌధంబులోపలనుండి చనుదెంచి కొందఱు మందయానలు తరుణాంబుజకుం జేతులు మొగిడ్చి యిట్లువిన్నవించిరి. ఓయమ్మా మేము భవదీయంబగు నీసౌధంబునందు నఱువదవహజారంబున నుండు చిత్రితానందం బను మహామండపమునం గావలియుండుదాసీజనములము. మనభర్తృదారికయగు వసుధారిణి వసించు కన్యాంతఃపురంబున వినోదార్థమనారతము కనకమయశృంఖలికానిబద్ధ మయి రాజసుతచేత నతిప్రేమంబునం బెనుపంబడుచుండు కేసరగండం బనునీలవానరము విడివడి వచ్చి యామండపమునం జేరి యయ్యెడ నుండునతిరమణీయములగు వస్తుసంచయంబులం బగులనడఁచుచుఁ గంబంబులనుండి యొండుకంబంబులకుం దుముకుచుఁ దోలంబోయిన వారలపై కుఱికి కరవం గడంగుచు ఘుర్ఘురించుచుఁ గిలకిలారవంబులు సేయుచుఁ గడు నలుగులపడం జేయుచున్నది. దానికరంబున నొకచిత్రఫలకం బుండెడిని. అది యనర్ఘమణిగణఖచితంబై యొకరతిమన్మథులతోసమానం బైనమిథునంబుచేనలంకృతంబై యొప్పుచుండెడిని. ఆచిత్రఫలకంబుం గాంచి యందు వసుధారిణీరూపంబు గల సుకుమారి యగుకుమారి లిఖింపంబడియుండుటం గనిపెట్టి భర్తృదారికచేత నుండుచిత్రఫలకం బని నిర్ణయించి మాకుం జేయుందగినయుపాయంబుల నెల్లఁ బ్రయోగించియు నాఫలకంబుం గైకొనుటయందు విఫలోద్యమలమై కార్యం బేలికకు విన్నవింపం జనుదెంచితిమి. అనినుడువ నావసుధారిణి త్వరాకులిత యయి ఆ! ఇప్పుడేమిసేయంగలను. ఈకేసరగండము రాజకుమారునికేకాక యితరులకు వశగతంబు గాదు. దీని నతిజాగరూకతతో శృంఖలాబంధంబువలన వదిలించుకొననీక ప్రయత్నపడుచుంటిని. ఏవిధంబుననో యిది బంధంబుఁ దెంచుకొని విడివడినయది రాజపుత్రునిచిత్రితాకారంబునకు నేవిధమయిన

భంగంబు గలిగింపకముంద దానిం బట్టుకొని యాఫలకంబుం గైకొనవలయును. ఏమి సేయం జనును? అని తత్తరించి లజ్జాకులిత యయి యంతరంగంబునందు నే నాయందయాదిత్యుని యం దనురాగంబు గాంచియుండుట యాఫలకంబువలన నెఱుకపడును. ఇందు కేమి సేయవచ్చును అని సంభ్రమించుచుండెను. అప్పు డెల్లవారును వసుధారిణీరహస్య వృత్తం బొక్కటి యుద్ఘాటితం బయినయది. ఇది తాను మనంబునం గోరి యే రాజకుమారుని యందుం గూరిమి యుంచెనో? అదియు నింక నెఱుకపడకపోదు. ప్రవృత్తంబగు వృత్తంబు కరము సమ్మోదకర మయినయది. అని యనుకొనుచుండం బ్రతాపాదిత్యుండు తనసమీపమున నిలువంబడియుండు వీరభటులం జీరి మీరలు సని యావానరంబుం బట్టుకొని యనువు మెయిం దానిచేతిచిత్రఫలకంబులు దెండు. అని యాజ్ఞ సేయం దరుణాంబుజ వసుధారిణీముఖాంబుజం బుపలక్షించి దాని మోమునం గదురు వైలక్షణ్యంబు నిరూపించి ప్రతాపపాలునితో నిట్లనియె. ఓతండ్రీ! కేసరగండము విడివడివచ్చిన వృత్తాంతంబు విన్నతోడన మనవసుధారిణి యావానరము రాజకుమారునికే కాక యితరులకు వశంబు గాదని త్వరాకులితయై నుడివిననుడువు వినలేదా! బలవద్రాజ కుమారునిచేత శిక్షితంబయి యుండునది యీభటులకు వశం బగునా! వీరు దానిం బ్రాణంబులతోఁ బట్టుకొనం జాలరని తోఁచుచున్నది. కోఁతికొల ఘోర మయిన పాపము. ఈకార్యంబున నీభటుల నివృత్తులం జేయుట లగ్గు. మనవసుధారిణి నడిగి యారాజ కుమారునిం దెలిసికొని తదనుగుణముగం బ్రవర్తింతము. ఇది సిగ్గువలనం జెప్పకున్న మదీయవిద్యావిశేషవిజితు లయి యీయూర నుండు రాజకుమారుల నొక్కొక్కరునిం బంపి దానిని వశము జేసికొనం బ్రయత్నింతము. వారివలనం గాకున్న నంతటఁ బయి నాలోచింతము. అని నుడివిన నందు కెల్లవారును సరి యని యామోదింపం దరుణాం బుజావిరజాంబుజలు కర మనునయంబున వసుధారిణి నడిగియుం బ్రత్యుత్తరము వడయక యుండిరి. ఇంతలో రాజభటసమాహూతులై విద్యాసర్వస్వవేదినీవిజితులై యుండిన రాజకుమారులెల్ల నయ్యెడకు రా వారలందోడుకొని భోజప్రతాపపాలురును దక్కుంగల సభాసదులును తరుణాంబుజాదికుమారికలును లీలావతీప్రముఖదేవీజనంబు నఱువదవహజా రంబుం జొచ్చిరి. అందుం బ్రతాపపాలప్రచోదితులై రాజకుమారు లెల్లవారును గేసర గండంబును డగ్గఱి బహువిధంబులం బిలిచియు నది యెల్లవారిని బొమముడితో బెదరించి క్రూరవీక్షణంబుల నీక్షించి పండ్లిగిలించి పరిహాసనీయులం జేయుచుండెను. అది గాంచి ప్రతాపపాలుండు తనమనంబున నీవానరంబును స్వాధీనము చేసికొనంజాలినవాఁడు వసు ధారిణి ప్రేమబంధనంబైనవాఁడ కావలయును. ఇది యితరునికి వశగతము గాదు. ఇప్పు డోకసమయానుగుణవచనంబు సెప్పినచో నెవ్వఁడైన దీనిప్రణయబహుమానపాత్రం బైనవాఁడుండిన బయలుపడును. అని యెంచి యిట్లనియె. ఈసభం జేరియుండు రాజ కుమారుం డెవ్వఁడేనిం ఈకేసరగండంబును వశగతంబు జేసికొనిన నాతఁడు

వసుధారిణి నతని కిచ్చి పాణిగృహీతిం జేసెదను. అనినం గవివరుండగు కాళిదాసుండు రాజుం జూచి ప్రతాపపాలమహీపాలా! నీనుడివినవచనంబు సత్యంబ కదా యని యడిగి యతనివలన నౌనని ప్రత్యుత్తరము వడసి సమీపమున నుండుకుమారునిం జూచి యోకుమార! నీ వీకేసరగండంబును బిలిచి దగ్గఱకు రప్పించి దాని చేతి చిత్రఫలకంబుం గైకొను మనిన నాకుమారుండు నట్ల కానిమ్మని లీలమెయి నావానరంబుకడకుం బోయి కేసరగండమా! యని పిలిచిననంతట నావానరవీరము మహామోదంబునం గిలకిలారవంబు సేయుచుం దోఁకయెత్తుకొని యుదయాదిత్యుని పాదంబులకడ నిలపుఱుకిం దూఁకి యాతని పాదంబు లాఘ్రాణించుచు నతని మొగంబుం గాంచుచు నపరిమితామోదభరంబుఁ జూపు నెల్లవా రాశ్చర్యమునొంది చూచుచుండిరి. అది గనుంగొని ప్రతాపపాలుండు తనమనంబున ని ట్లనుకొనియె. వసుధారిణివచనంబువలన నీవానరము తన కిష్టుఁడైన రాజకుమారునికే కాని యితరులకు వశము గాదని విదితమయ్యె. ఇప్పుడీవానర మితనిని గాంచిన యంతన నితనిచేఁ బెనుపంబడి నదియుంబోలె నితనికడ నతిప్రేమభరంబుఁ గాన్పించుచున్నయది. ఈకట్టెలమ్మువాఁడు వసుధారిణివలచినరాజకుమారుండుగాని యితరుండు గాఁడు. ప్రచ్ఛన్నవేషంబున వచ్చియున్నవాఁ డని తోఁచెడిని. వసుధారిణి తనవలచిన రాజకుమారునినే గాని యితరునిఁ జిత్రఫలకంబున వ్రాసియుండదు. ఆచిత్రఫలకంబులోని యాకారం బీకట్టెలమ్మువాని కుండునేని యితఁడ వసుధారిణిమనోవర్తి యగువాఁ డని నిర్ణయింపఁజనును. అని తలంచి యాకట్టెలమ్మువానిం జూచి కుమార! ఆచిత్రఫలకంబు నాచేతి కిమ్మని యతఁ డిచ్చినయాఫలకం బందుకొని చూచి మహామోదంబుతో వసుధారిణిం గాంచి యోకుమారికామణీ! నీ వీతరుణాంబుజావిరజాంబుజలతో నొక్కటిగ నుండున ట్టుదయాదిత్యునిం గోరితివి. ఇది నాకుం గరం బభినందనీయంబు. ఆమహాగుణనిధియందు మానసంబుంచి నాకులము పవిత్రతం జెందం జేసితివి. నీవంటిగుణనిధిం గన్న నాకు నిట్టిమహోదయంబు గలుగుట యొక హెచ్చా! యని యానందబాష్పంబులతో నావసుధారిణి నాదల మూర్కొన భోజుండును లీలావతియుఁ గరము సంతసించిరి. తరుణాంబుజావిరజాంబుజలు ప్రేమపరవశలై దానిం గౌఁగిలించుకొనిరి. వసుధారిణియవనతాననయై యుండె. అంతం బ్రతాపపాలుండు చిత్రఫలకంబు భోజునికిం గానిపింప నతండు తత్ఫలకం బుదయాదిత్య నామాక్షరాంకితంబై యుండుటయు నం దుదయాదిత్యునిరూపం బమరియుండుటయుం జెప్పి సభాసదుల కెల్ల నాఫలకంబుం గానిపింప నందఱు గనుంగొని యాకట్టెలమ్మువానివేషంబున నుండువానియం దుదయాదిత్యునాకారం బుండుట నిరూపించిచూచి యాతఁడ యాకట్టెలమ్మువానివేషంబునం జనుదెంచియున్నాఁడని నిర్ణయించి జయశబ్దంబులు వలికిరి. తరుణాంబుజయుం విరజాంబుజయు నాతని నిరూపించి తమప్రాణవల్లభుం డీవిధంబున వచ్చియుండుట కాశ్చర్యపడుచుఁ బ్రణయరసపరి

భోజుండు మహామోదంబునఁ గాళిదాసునిం గనుంగొనిన నాతండు నవ్వుచు కుమార! ఇంక నీవు ప్రచ్ఛన్నవేషంబుననుండ నక్కఱలేదు. నిన్నుం దెలిసియుఁ దెలిసికొనక కడు నాకులహృదయుండై యుండునీమాతులునికి నిన్నుం బ్రకాశింపం జేసి ముదం బొనగూర్పుము. ఈప్రతాపపాలు నట్లయానందితునిం జేయుము. అనిన నుదయాదిత్యుండు నాకుమారికామణుల వ్రీడావ్యాకుల కటాక్షవీక్షణనీలనీరజమాలికార్చితుం డగుచు భోజుని కడకుం జని వినయంబు మెఱయ నిదె ప్రతాపాదిత్యునికుమారుఁడ నుదయాదిత్యుఁడను భవద్భాగినేయుఁడ నభివాదనంబునల్పెద నని ప్రణామం బాచరింప భోజభూపతి సంతోషపరవశుండై బాహువులు సాచియాకుమారు నెత్తి కౌఁగిటం జేర్చి మూర్ధం బాఘ్రాణించి యానందబాష్పంబుల నతనిశిరంబు దడిపి సంతోషాతిశయంబున మాట వెడలి రాక డగ్గుత్తికతో వత్స చిరంజీవయని యాశీర్వదించె. లీలావతీదేవికిం బ్రణామంబు సల్పిన నాదేవియుం గడు సంతసించుచు నాకుమారుని దీవించె. ప్రతాపపాలశృంగారవతులును దత్ప్రణామంబులు గైకొని యతనికి స్వస్తి యగుఁగాత మనిరి. తరుణాంబుజయు విరజాంబుజయు వసుధారిణియుం జంద్రరూపయు నిందురూపయుఁ గుమారులసన్నిధి నుండ లజ్జించుచు నొకగదిలోనికిం జని యప్పుడు భోజునిహస్తంబువలన లీలావతి గైకొన్నచిత్రఫలకంబు నాదేవినడిగి రాగసేన తీసికొనిరాఁగా నదియందుకొని కరముఁ గుతూహలంబునం గనుంగొనుచు సంతోషసముద్రంబునం దేలుచుండిరి. అందుఁ జంద్రరూప చిత్రఫలకంబుం దిలకించి యోనెచ్చెలులార యిందుంగలవిశేషంబుఁ గాంచితిరటే! ఈవసుధారిణి రాజకుమారుని ప్రతిబింబంబుతో మనోరథసమాగమసుఖంబు లనుభవించిన లక్షణంబు లాలక్షణవతికిం గల ప్రణయవిశేషంబు నభివ్యక్తము సేయుచున్నయది.

మ. తమి నేకాంతమునందు ముద్దిడుకొనం దన్వంగిసింగారపుం
దములంపుంజిగి యంటియున్న దిదిగో తథ్యంబుగా మోమునన్
రమణీరత్నము గుబ్బపోటు లివిగో రాజీవనేత్రామనః
కమలాదిత్యునురస్స్థలిం గనుము శ్రీగంధాంకలక్ష్మీయుతిన్.

అనినం దరుణాంబుజ ప్రియసఖి చంద్రరూపా! తనరహస్యవృత్తంబు బయల్పడుటం జేసి కర మతిశయించు లజ్జావిశేషంబున నుత్తలపడు నీముగుదను బరిహాసవచనంబులం బలుమఱు నలయింపం గడంగుట మీకుం దగదు. అని చెప్పి వారలపరిహాసంబుల నివారితంబు సేసె. అప్పు డాచిత్రితానందమండపంబున నుండువారలెల్ల నపరిమితామోదంబునం దేలంగుచు భోజప్రతాపపాలురం గాంచి యేకవాక్యముగ ని ట్లనిరి.

చ. సురపతితుల్యులార యతిశోభన మీసుమహూర్త మంచు నా
దరమున విప్రవర్యులు పదంపడి పల్కుచునున్నవార లీ

నిరుపమరూపగణ్యునికి నీరజనేత్రల నిచ్చి పెండ్లి య
చ్చెరువుగఁ జేయుఁ డిప్పుడ నిశీథిని మూఁడవయామ మయ్యెడిన్.

అనిన భోజుండు వారలపల్కు లభినందించి యోయార్యులార మీరలు సెప్పిన వచనంబు లవశ్యానుష్ఠేయంబుల యగుటనది నాతోడంబుట్టు వార్య ధరావలియుం నా బావ యార్యుండగు ప్రతాపాదిత్యుండు నిట్టిమహామోహావహం బగుసమయంబున మాతో వియ్యంబు నెఱపుట లేక యుండుట కొంతయని మనంబున నుల్లాసంబు దగ్గియున్న వారము. అనుచుండం గొండఱు బ్రాహ్మణవర్యులు బహుమనోహరవేష ధారులు మందస్మితముఖారవిందంబులతోఁ జనుదెంచి భోజప్రతాపపాలురం జూచి స్వస్తి యగుంగాత మని దీవించి యిట్లనిరి. వసుమానసనగరవల్లభుం డగు ప్రతాపాదిత్యుం డాత్మదేవీసహితుండై చనుదెంచి మీతో వియ్యం బందుకొనం దలంచి యాత్మమంత్రి పుంగవునితో నీసౌధ బహిర్ద్వారసమీపభూమికి నేతెంచి కాకతాళీయన్యాయవిధానంబున సంగతుండైన విదర్భదేశాధీశునితో మానపాలమహీపాలునితో నాత్మమహిషీసమాగతునితో మఱియు నవ్విధంబునం జనుదెంచినయనేకదేశాధీశచక్రంబుతో నంతఃప్రవేశంబునకు సంభ్రమించుచు భవదాజ్ఞావచనంబున కెదురుచూచుచున్నవాఁడు. అని వచింపఁగా భోజుండు మహానందలహరీవీచికల నోలలాడుచు నానందబాష్పంబులు కను దమ్ములనుండి జడిగొని ప్రవహింప నాబ్రాహ్మణులకు నమస్కరించి మించినప్రేమభరంబున నప్పు డయ్యెడ నుండునసంఖ్యాతరత్నపూరితంబులగు వజ్రఘటంబులను మిత్రసహోపపాదితంబుల బహుమతి యొసంగి ధరావతిని మదనమాలినీమదనవతులను దోడ్కొనిరా లీలావతిని శృంగారవతిని బనిచి తక్కుంగల రాజపత్నుల నెదుర్కొనం దగువారల నియోగించి ప్రతాపపాలునితోడఁ గాళిదాసునితోడం బ్రతాపాదిత్యునిని మానపాలమహీపాలకుని నెదుర్కొనం దాను వెడలి యావిద్యాసర్వస్వవేదినీ సౌధంపు బహిర్ద్వారంబునకుం జనుదెంచి ప్రతాపాదిత్యునికి నమస్కరించి యాతనిచే నాలింగితుండై విడువంబడి విదర్భదేశాధీశుని నాలింగనాదుల సంభావించి కుశలం బడిగి తక్కుంగలరాజుల యథావిధినభ్యర్చించి ధరావలికడకుం బోయి యాసాధ్వీమణి పాదపల్లవంబుల కభివాదనంబుల సల్పి యాదేవికడనున్న సన్యాసినీవేషధారిణికి నమస్కరించి తోడ్తెచ్చి యెల్లవారల మణిమయాసనాసీనులం జేసి యిట్లనియె.

ఉ. ఇత్తఱి నీధరాధిపతు లియ్యెడ కెల్లరు సేరి వచ్చుటన్
జిత్తము సమ్మదప్రకరశృంగతలోపరివాసవై ఖరిన్
జొత్తిలుచున్న దీశుభముఁ జూడఁగ రమ్మని పల్కరించి నా
యుత్తలపాటడంచినమహోన్నతకీర్తిగుణాఢ్యు లెవ్వరో.

అని నుడువఁ బ్రతాపాదిత్యుండు తనమఱందితో నిట్లనియె. ఓధారాపతీ! నేనును ధరావతియుం దొలుత నీసుతల నిరువుర నీ మేనల్లుని కడుగుటకు నీకడకు బ్రాహ్మణులం బనుపం బ్రయత్నించుచుంటిమి. అట్టిసమయంబున నీతనూజారత్నంబు తరుణాంబుజ భువనేశ్వరీదేవాలయంబునం గనంబడకపోయినవృత్తాంతంబు విని ధరావతి తన సహోదరు సుతకుం గలిగినయిడుమకు వగచుచుం దనకుమారునిచే నాశ్వాసిత యయ్యుఁ దనకోడండ్రకు నేమంబు గలుగం గోరి మహాకాళీసమర్చనంబు సలుపుచుండి స్వప్నసాక్షాత్కృత యయినయాదేవి మహాకవికాళిదాసుండు వసుమానసనగరంబునకు రాఁబోయెడి; నాదినమునందు శేయి చతుర్థయామోపక్రమం బగునంతకు మీరు బంధుజనసహితముగ సింహపురంబున కరిగి విద్యాసర్వస్వవేదనీసౌధంబునం బ్రవేశింప నీ మేనకోడండ్రకును నీకుమారునికిని భోజభూపతిప్రముఖులు పరిణయము సేయ సిద్ధపడియుండుటఁజూడవచ్చును. అమ్మహోత్సవంబునకుంజని భోజునితో వియ్యమంది సంతసించెదవు. ఉమ్మలికంబు మానుము. అని నుడువఁగా నాశ్వాసితయయి కాళిదాసాగమనంబునకు నిరీక్షించుచుండెను. ఆదేవి యానతిచ్చినవిధంబున గతదినోదయంబునందు మహాకవిమదీయనగరంబునకు విచ్చేసి మా కీమహోద్యమంబు సమకూర్చినవాఁడు. ఇట్లే యీవిదర్భదేశాధీశుఁడు సింహవాహనాప్రేషితయగుకాత్యాయనిచే నెఱింగివచ్చినవాఁడట. తక్కుంగల రాజులును తమతమపుత్రికలు కనంబడక పోవుటంబట్టి వ్రతంబులు నేసి సింహవాహనాప్రసాదంబునన యెఱింగి యిమ్మహోత్సవంబుం జూడవచ్చినవారలే. ఆకాళికాదేవి ధరావలికి స్వప్నమునందుం బొడసూపినప్పుడు సింహపురంబునందు మీకు మఱియుం నొకయుత్తమరత్నంబు లభింపంబోయెడినని యానతిచ్చినదఁట. ఆ సంప్రాప్తముఁగాబోవు రత్నం బెయ్యదియో యెఱుంగక యున్నారము. అని యిట్లు వచింపఁగా ధరావతియుఁ ప్రతాపాదిత్యునిసమీపమునకుం దరుణాంబుజను విరజాంబుజను వసుధారిణిని దోడ్కొని తెచ్చి ప్రతాపాదిత్యునితో నిదెమద్దుకోడండ్రు మువ్వురు నమస్కరించుచున్నారు. ఆశీర్వదింపుఁడని చెప్పిన నారాజును దనకుం బాదప్రణామంబు సేయురాజకన్యకల మువ్వురను గని సంతసించి యానందాంబుధిం దేలుచు వారల దీవించి మువ్వురను వేర్వేఱ నడిగి తెలిసికొని యప్పుడు చంద్రరూపేందురూపలు ప్రణామంబులు సలుప వారలు కాళిదాసునిచే మిత్రసహుని వలచిన విదర్భరాజకన్యకలుగా నెఱింగి పట్టరానిసంతోషభరంబున నుప్పొంగుచు భోజప్రతాపపాలురసుతలు నాకుమారునిం జేపట్టుటవలనం గలిగినసమ్మోదం బట్టుండ విదర్భదేశాధీశునికన్యకలు మిత్రసహుని వరించుట కరము సంతోషకరమై యున్నది యని వచించి కాత్యాయనిం గాంచి యిట్లనియె. ఓ కాత్యాయనీ ఈభోజరాజసుత లుదయాదిత్యునందును విదర్భేశ్వరసుతలు మిత్రసహునియందును బ్రణయం బుచినవృత్తాంతంబులు నాకువిదితంబు లయినవియ. ప్రతాపపాలునితనూజాత వసుధారిణియు నుదయాదిత్యునియందు ప్రేమంబుఁ గాంచిన

ప్రేమంబుఁ గాంచినవృత్తాంతం బెఱుంగం గోరెదను. ఈ యతీతానాగతవర్తమానంబుల నెఱింగినదానవు గాన నీకుం దెలియనివి లేవు.

అదియునుగాక యీకేసరగండంబు కరము మదోద్రిక్తం బగునది. ఇది యీచేరి యుండుసకలరాజకుమారులకు వశగతంబు గాక యీయుదయాదిత్యునిచే సాహసాశంబై యతనికి భయభక్తులు గనంబఱచుటయేలకో? దీనిం గుఱించినవృత్తాంతంబు నీకు విదితంబ యయియుండంజను. ఇవి వినంగోరి మామానసంబులు త్వరాకులితంబులయి యున్న యవి. కానఁ గరుణించి వినిపింపు మనం గాత్యాయని యిట్లనియె.

## సుందరీదేవి వృత్తాంతము.

ఓ ఆర్యా! ప్రతాపాదిత్యుఁడా వినుము. ద్రవిడదేశంబునందు మధురావతి యను నగరం బొండుగలదు. అందు శ్రుతదేవుం డను బ్రాహ్మణుండు, తనతలిదండ్రులు తన కీడుజోడు గాఁజూచి పెండ్లిచేసినసుందరీదేవి యనునతిరూపగుణోపేతయగు నాతిం గూడి సర్వసుఖంబు లనుభవించుచుం దనకుఁ గాశీగయాదిపుణ్యక్షేత్రదర్శనంబు జన్మఫలం బని యెంచుచుండినవాఁడు గనుక మగుడ యగుటంబట్టి సుందరీదేవి ప్రతిమాట పలుకక పోయి రమ్మనిచెప్పి మరలి రా నెంతకాలం బగునని యడిగిన నందుకు రెండుసంవత్సరముల కాలము గడువు పెట్టి యాసారసాక్షిని వీడ్కొని ప్రయాణగతుండయ్యె. ఆసుందరీదేవియుఁ దానొంటి నింట నుండ నోపక తనతల్లిని దనకుఁ దోడుగ నుంచుకొని ప్రోషితభర్తృక యగుపతివ్రత ప్రవర్తింపవలయువిధంబున సాధుచరిత్రయయి నడచుచు నిర్దిష్టకాలంబు నకుం దనప్రాణనాయకుండు రామిం జేసి కడు ఖిన్నయై ప్రియవిరహావిక్లబంబులగు నంగంబులతోఁ ననారతము కరకలితకపోలతలయై తనదయితాగమనంబె తలంచుచుఁ దుర పిల్లుచుండె. ఇట్టు లుండఁగా నొక్కదినంబున నామదవతీమణియింటికి మణిమంత్రౌషధ సిద్ధుండగు కాపాలికుండు చనుదెంచి సుందరీదేవిఁ గాంచి పంచశరతాపతప్తుండై యాతి థ్యంబునకుం జనుదెంచినవాఁ డట్టై నిలిచి వృద్ధయగు సుందరీదేవితల్లిం జీరి యోషధిరస ప్రభావంబునం జేసిన సువర్ణంబు నపరిమితంబుగ నొసంగి తనతలం పెఱింగింప నావృద్ధ ధనలుబ్ధ యయి యందుకొడంబడి తనకూఁతుం బిలిచి యోసి పుత్రి నీనాయకుండు శ్రుత దేవుండు దేశాంతరగతుండయినవాఁ డిందనుక రాక యున్నాఁడు. అతఁడు రామిం జేసి మనకు భుక్తికొఱకుం బెట్టిపోయినధనం బంతయు నిశ్శేషం బయ్యె. సొమ్ములెల్ల నమ్ముకొని కడుపుఁ బూడుచుకొంటిమి. ఇఁక భిక్షావృత్తిచేతం గాని దేహపోషణము సేయలేము. నీమగండు రాజునొద్ద సేనానాయకాధికారము వహించి కరము ప్రసిద్ధి కెక్కినవాఁడు గాన నట్టివానిభార్య బిచ్చమెత్తుచున్న దనుమాట నలువురచెవి కెక్కె నేని యంతకంటె నవమానము లేదు. అదియునుంగాక నీభర్త పోయినవాఁ డట్లైపోయిన

వాఁడు. ఇల్లని వాకిలియని పెండ్లామని యతనిమానసంబునకుం బట్టినది గాదు. తాను సర్వసైన్యాధినేతయై మంత్రితోసమానంబగు గౌరవంబు రాజుకడ సంపాదించి యతిశయితంబగు గౌరవస్థితి నుండువాఁ డెల్లకాలము సన్యాసులను బైరాగుల జోగులను బూజించుచుఁ దరుణీసంగసుఖంబుల నత్యాదరంబులేక సన్యస్తప్రాయుండై యున్నవాఁడు. తరుణికి నిండుజవ్వనంబునం దరుణపురుషసంగసుఖంబు లేనినాఁడు దానిజన్మంబు నిరర్థకంబ కాన నాచెప్పినహితంబు నీవు వినందగును. అట్లు నావచనంబులకు మాఱాడక ప్రవర్తించెదవేని నీవు సుఖించెదవు. కానిచో నాచే ననాదృత వగుచుం బ్రతిగృహంబులకడ బిచ్చమెత్తుకొని బ్రతుకుచు నీవిలోభనీయావయవంబులం గాంచి రాగంబు మించిన రథ్యాపర్యటనపరాయణులకుం జిక్కి యెక్కుడుదుఃఖం బనుభవింపంగలవు. మనయింటి కిప్పుడు వచ్చియుండు తరుణసిద్ధకాపాలికుండు కరము సౌందర్యవంతుండు. ఔషధసిద్ధుండు గాన నతనిచేయిదగిలినవెల్లను సువర్ణం బగు. ఐశ్వర్యంబున నిఁకఁ జెప్పవలసినదిలేదు. ఇతరుల కెఱుకపడకుండ నీ వీకాపాలికసిద్ధునిం గూడి సుఖింపుచుండుము. మనకు సర్వసుఖంబులును గలవు. జారిణీవృత్తి పాపం బని తలంపకుము. మహర్షివచనంబులందునయితము జనులకుం గలపరస్పరసంబంధంబు దెల్పుచోట, శ్లో. స్వామితుల్యోహి జారశ్చ నవజ్ఞా గృహిణీసమా, దుస్త్యజోయం మహద్భిశ్చ దేశభేదే ప్రవర్తతే. (జారపురుషుఁడు స్త్రీకి మగనివలె నాదరణీయుండు. జారిణి పురుషునికి భార్యతో సమానురాలు. ఈసంబంధము విశ్వామిత్రకల్పితమై విడువంగూడని దగుటం జేసి మహనీయులు నాచరించెదరు. మఱియు నివి కొన్నిదేశంబులం బ్రవృత్తంబగుచున్నవి. ఆఁడుదాని కీసుఖంబుకన్న నొండుసుఖంబులేదు.) అని చెప్పంబడియున్నది. ఇందు మఱియు, నస్త్రీజారేణదూష్యతి; (స్త్రీజారునితోఁ బొందుఁజేసిన దోషంబులేదు.) అని పెద్దలు చెప్పిరి. కానదోషంబుగలదని భయంపడఁ జనదు అని యిట్లు పల్కఁగా సుందరీదేవి విని మనంబునం గడు సంతపించుచు నిట్లనుకొనియె. ఈవచ్చియుండుపాపకర్ముఁడు సిద్ధౌషధుం డగుటం జేసి యేదియే నొకయౌషధంబున మతివిభ్రమంబుఁ గల్పించి నాతల్లి చే నిట్లాడించుచున్నవాఁడు. అట్లు కాదేని చిన్ననాటంగోలె నాకెన్నెన్నోహితంబులు బోధించి సాధుశీలంబును సదాచారంబును దేవభక్తియుఁ బాపాచరణపరాఙ్ముఖత్వంబును బతివ్రతాధర్మనిష్ఠయు నా కుపదేశించి యించుకయేని దుష్పథప్రవృత్తి గలుగనీక సుశిక్షితం జేసి నన్నుం గాచుచు వచ్చిన యీసాధ్వీమణి కిట్టిదుర్వ్యవసాయంబు గల్గునే! నిరుపమతేజోనిధియై బాహుబలవిజితశత్రుభూపాలవరూథినీనికరుండై సాధుచరణసేవాపరాయణుండయి మూర్తిం దాల్చినమన్మథుండు నానొప్పునాదయితుండు నన్నుఁ బాసి పోవుటయుం నతండు చెప్పిపోయిన మేరకు రాకుండుటయుఁ గుడువంగూడును గట్టఁబట్టయును నీకాలమిఁ బరిజనంబెల్లం బరాఙ్ముఖంబై పరిత్యజించుటయుం నిప్పచ్చరంబు చెప్పరానియిడుములు పడఁజేయుటయుం మానసంబుననైనఁ దలంపరాని యీపాపపుం

బనికిం గన్నతల్లియు ప్రేరేపించుటయుం నిట్టియతిదుఃఖకరంబులగు దశావిపర్యయంబులు సంప్రాప్తంబు లగుటకుం గారణంబు విధియ. అతండు సేయందలంచినది కాకపోదు. అతనికంటెం బలవంతుం డెవ్వండును లేడు. ఇప్పుడు సాధకవంచిత గావున నాతల్లి నావచనంబులు గైకొనదు. ఇందు కేమి సేయంజాలుదును. వంచకునివంచనోపాయం బునం జిక్కుకొన్నదానను. ఏమిసేయుదును. అపన్నుం డైనగజేంద్రుఁడు పాహిపాహి యనం బరువిడుచువచ్చినదయామయుండు, ప్రల్లదులచేఁబడి పరాభవంబు నొందుపాంచాలిం గాచిన పతివ్రతారక్షణదీక్షావిచక్షణుండు శ్రియఃపతి దీననగు నన్నుం గావఁడే, నిజం బగుభక్తి సలిపెడివారి నాయార్తరక్షకుం డోప్పరికింపఁడు. నన్నుం గాచు. అని మనంబున దృఢనిశ్చయంబు గావించుకొని తల్లిపల్కులకు వల్లె యని నుడివి తదనుసారముగఁ గొన్నియలంకారంబులు రచియించి పానుపుఁబఱచి యారేయి కృతాభ్యవహారయై సాధకాధిష్ఠితంబగు శయనగృహంబుం జేరి యొకయెడ నిలువంబడెను. రతిసుందరివలె వచ్చి నిలువంబడిన యాసుందరీదేవిం గాంచి మోహంబు మేరమీఱి పంచాయుధభల్లభిన్నహృదయుండై శయనంబునుండి లేచి నవ్వుచు రతిశయ్యకుం దార్ప నాతన్వంగికరపల్లవంబు తనకరంబునం బట్టుగొనం బోవుడు నాపల్లవాధరి యెడగలుగ నిలిచి కనుదమ్ములనుండి వెడలువేఁడిబాష్పంబులతో దుఃఖాకులయై యుండంగాంచి యోమించుబోడీ! యేల వగచెద వని యడుగ నాస్త్రీతిలకం బిట్లనియె. ఓరీ నావగచుటకుం గారణంబు వినుము.

ఉ. అన్నము నిద్రయుం జెఱుఁగ నన్ను వలపై మది నాసఁ గాంచ నే
నన్నివ వార మంచు దిన మంచు నెఱుంగ ధవుండు వోయినన్
మన్ననతోడఁ గైకొనినమత్తగజం బెదురొత్తి యుబ్బినా
చన్నులు పిల్లిజిత్తులఁ గృశత్వము నొందఁగనయ్యె నక్కటా.

అనిచెప్పిన నాసిద్ధుండు వెఱఁగుపడి తనమనంబున నిట్లుతలంచె. కట్టా యీకాంత తనప్రియుండు మదదంతివంటివాఁ డనియు నేను మార్జారమువంటివాఁడ ననియుం నట్టియుత్తముని పక్షంబునం బ్రేముగలనాఁడు పైపైఁ బొగరుమీఱు తనగబ్బిగుబ్బలు పిల్లివలె బొంచువేసినయధముఁడనగు నా నీచంపుంబనులకు ప్రక్కి పో నున్నవనియు నీయర్థంబు సూపి యీకాంత దీనిచేఁ దనకుఁ దననాయకునిపైఁ గామంబున్నదిగాని నాపై లేదని యెఱింగించెను.

శ్లో. అకామాం కామయానస్య శరీర ముపతప్యతే, ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతి ర్భవతిశోభనా.

(క. తనపైఁ గామము వొడమని, కనకాంగికి నాసపడినఁ గాయము గ్రాగున్
తనుఁ గామించినకామిని, నొనరం గామింపఁ బ్రీతి వొడమును మదికిన్.)

అని చెప్పంబడియుండుకతంబునఁ గుక్కుటన్యాయంబునకైన దీని నతిక్రమింపం గూడకయున్నది. అదియునుంగాక పతివ్రతాతేజంబు భామినీమణులకు రక్షకంబై యుండుంగాన నీమగువను దురాక్రమంబునం బట్టి భోగింపంబోతినేని నాసంపాదితమగుమణిమంత్రౌషధసిద్ధి నశించిపోవును. దీని నివ్విధంబునం జెనక ననువుపడదు. ఇది తననాయకుండు కొన్నిదినంబులకయినను రాఁగా యనునడియాసగలిగియున్నది. ఆయాశకు భంగంబు గావించితినేనిఁ గామవ్యథావివశ యయి క్రమక్రమంబుగ విస్రంభణోపాయవంచిత యగుచు నన్నుం గలయు. ఇపుడు వేగిరపడినఁ గార్యంబు సెడును. అని తలంచి యారాత్రిరంతయుఁ జింతాసంతానదంతురితస్వాంతుండై సంతపించుచుండి తెల్లవారఁగా లేచి తా విడిసియుండుచోటికిం జనియె. ఆరేయియెల్ల నామానవతి నానికడ నిలువంబడి యుండి వేకువన పడకటిల్లువాసి చనియెను. అదిమొదలా సిద్ధుం డాయూరనుండి విస్రంభణోపాయంబు లెన్నియేనిఁ జేయుచుఁ దదీయ ప్రణయంబు వడయక యావృద్ధకాంతతో నాసుందరీదేవిం దోడ్కొని పెక్కుచోటుల సంచరించుచు నొకపుణ్యక్షేత్రంబున శ్రుతదేవుండు తీర్థస్నానార్థ మాగతుండై యుండుట యెఱింగి తన మనంబున నీసుందరీదేవి యితనిం గాంచెనేని వీనిం గూడి నాకనర్థంబు సేయక మానదు. నా యాశావిశేషంబునకు భంగంబె యగును. కాన నిప్పుడు వీనికి నాసిద్ధౌషధప్రభావంబున వికృతరూపప్రాప్తి గలుగం జేసెదను. అని నిశ్చయించి యతనికడకుం జని కాకతాళీయన్యాయముగ సంప్రాప్తుం డయినవాఁడువోలె సంలాపము సేయుచుఁ దన సిద్ధౌషధప్రభావంబుఁ జూపుకొనుసంబున నాతని యంగంబున కొకయౌషధరసంబుఁ బూసిన నప్పుడ యాబ్రాహ్మణుండు లొంటిరూపంబు వాసి యానీలవానరం బయ్యె. అంత నితండు సేయునది లేక దుఃఖించుచుండ నీరూపంబు వోవ మఱియొక సిద్ధౌషధరసంబుం బూసెదనని నమ్మించి యట్లు సేయ నదిమొదలీ వానరంబు బుద్ధిచాంచల్యంబును దమోమయత్వంబును గలిగి యొక్కొకవేళ నది నివర్తించుచుండునప్పుడు దుఃఖాతురుం డగుచుండె యాసిద్ధునిచేఁ దఱుమఁగొట్టంబడి నీలాద్రితటకాంతారంబునకుం జేరెను. అయ్యెడ వసించుచుండి దాను వాసార్హముగ, నేర్పఱచుకొనియుండు నొకన్యగ్రోధపాదపంబునకు మఱియొకభల్లూకంబు చేరి తన్ను వెడలనడచుటకుం బ్రయత్నింప నాయెలుంగుతో బోరుచుం దినములు గడపి వేసరిలుచుండి భల్లూకంబుం దఱుమునుపాయంబుం గానక చింతించుచుండెను. మనయుదయాదిత్యుండు వేటకై యాకాంతారవీథికిం బోయిన నిది యతనిం గాంచి ప్రీతి మెఱయ వచ్చి యడుగులకడఁ బడి వినయంబు సూప నితండు దానిసైగలచే దానికి భల్లూకాభియోగంబు గలదని యెఱింగి యావానరంబును భల్లూకంబుతోఁ బోరం దొడరించి యాక్రూరజంతువును సంహరించి వానరంబునకుం బ్రియంబు గావించె. అంత నీవానరంబు రాజపుత్రుండు తనకుం గావించినయుపకారంబున కలరుచు

సుకుమారునికిం ద్రోవఁజూపుచు నితనిం దోడ్కొనిచని యొకకొనలో నతిమనోహరంబై యొప్పు నెలమావితోఁటకుం గొనిపోయెను. అది కడు రమణీయప్రదేశంబు గావున నయ్యెడన కొన్నిదినంబులు మనయువరాజు వసించె. అట్లుండి యొక్కనాఁ డయ్యెడ సంచరించుచు స్ఫటికమణిశిలాసంబద్ధంబులగు నవతారమార్గంబులతో నచ్చెరువు గలిగించు నొకసరసిం గని తదీయతటంబున నుండి దానిరమణీయతకు ముదం బందుచుండ నయ్యెడకుం జేరువన యొకవీణావాదనవిరావంబు చెవులపండువుగ వినంబడియె. అది విని యీ నిర్జనవనంబున నతిమనోహరమగు వీణారవంబు వినంబడుటకు హేతు వెద్దియో యని విచారించుచు నాసంగీతధ్వని వినంబడుదిశ నాశ్రయించి యొకింతత్రోవ నని యయ్యెడ నొకమణిమయస్థలీసంబద్ధంబగు మండపంబును దానినడుమ నొకమందిరంబుం గాంచి తదంతికమునకుం జని,

సీ. శారదచంద్రికాపూరపాండురదుకూలావృతమృదుశాంగయష్టిదాని
మృదుళదూర్వాదళమిళితకుంచితనీలలలితకుంతలనిటలంబుదాని
శరకాండపాండురచారులక్ష్మీవృతకమనీయగండయుగంబుదాని
నంకురితోరోజ యయి ముకుళోద్గమచారులతాకృతిఁ జెలఁగుదానిఁ
గలితపయోదారభూషణకలిత యగుచు, నాదృతానూననియమ యై యఖిలజనని
హైమవతిఁ బూజచేసెడునట్టిదానిఁ, గన్యకాలోకతిలకంబుఁ గాంచె నచట.

ఇట్లు గాంచి; యీపంచాననమధ్య యియ్యెడకు వచ్చుచుండుట యెఱిఁగినదిగాన నిది నాకుం దెలిపి సేమంబు సేయ నీవానరంబు నన్నుందోడ్కొనివచ్చె నని తలంచి యీ కాంచనాంగిరూపరేఖావిలాసంబులకు మానసంబున నచ్చెరు వందుచు నిది దేవకన్యకయో దైత్యదానవగరుడగంధర్వనాగవిద్యాధరకన్యకలలో నొక్కతెయో యని సంశయించుచు సమీపస్థలంబున కరిగి నిలువంబడి యొయ్యెయ్యెంగక యాకాంతాతిలకంబు భక్తిపరవశ యగుచు భగవతిప్రీత్యర్థం జేత విపంచికానిని స్వరసంయోజనంబు సేయుచుండుటఁ గాంచి యుచితప్రీతిభరంబునఁ దదీయగానకళాకౌశలంబుం గనుంగొన వేంచుచుండ నప్పడు,

శా. ఆరామామణి భక్తిభావమున లోకారాధ్యగౌరీసతిక్
సారోదారవిపంచికాస్వరసుధాసారంబు తోరంబుగా
నీరేజాననబింబ తత్సుచరితోన్నిద్రోరుగీతావళీ
శ్రీరమ్యంబుగఁ బాడెఁ గోకిలరవశ్రీ మీఱుకంఠధ్వనిన్.

ఇవ్విధంబున బహుకాలంబు పాడి యిందుధరసుందరీచారిత్రమనససంజాతపారవశ్య యయి యుల్లాతలంబునకు ద్రెళ్ళంబోవుచుఁ గుమారుండు గరుణాతరంగితాంతఃకర

ణుండై సత్వరంబుగఁ జని యిలఁ బ్రాలుచున్నయాయండజగామినిం బట్టుకొనిన నింతలో దాని నెచ్చెలులు దూరంబున కలిగియుండువారు త్వరితగతిం జనుదెంచి రాజపుత్త్రవిధృత యయి యుండుకుమారికం గాంచి యిదియేమి? యితం డెవ్వం డీమానవలోకచంద్రుండు తా నీయిందుబింబాస్య నేల పట్టుకొనియె. అని యొండొరులు పల్కుకొనుచు శీతోపచారంబులు సేయం గడంగుడు నంతలో నాకాంతామణి యొడలెఱింగి తనకుం బురుషశరీరస్పర్శంబువలన రోమాంచాదివికారంబులు గల్గుటం బరికించి మోముదమ్మి మరల్చి చూచి తటాలున నవ్వలి కేఁగి యావాలుగంటి వాలారుతళుకుంబెళుకుచూపులం జూచి తానువినియున్నరూపాదిగుణంబులు గలిగియుండుటంబట్టి యుదయాదిత్యుం డని తలంచి మించినలజ్జాతిశయంబున నవనతాననయై యుండం జెలికత్తె లదిగాంచి మనంబుల సంశయించుచుఁ గుమారు నిరూపించి యందఱును మనభర్తృదారికసేయుతపంబు పండెనని యనుకొనుచు రాజకుమారునిం జూచి యి ట్లనిరి. ఓకుమార! భవదీయం బయినపరిపాలనంబున నేదేశంబు రాజన్వంతం బయి యున్నది? ఏనగరంబుననుండుజనులు నిన్నుం గనుచు నయనసాఫల్యంబుం గాంచెదరు? ఏయక్షరంబులు భవన్నామాంకితంబులై ధన్యత్వంబుం గాంచుచున్నయవి? ఇయ్యెడకు రాఁ గతం బేమి! ఇవి మాకుఁ గర్ణపీయూషంబులు గావింపుము. అని యడిగిన యుపరా జిట్లనియె.

ఓకామినులార నే నుత్తరాపథంబున వసుమానసనగరం బేలుప్రతాపాదిత్యునికుమారుఁడ నుదయాదిత్యుఁడను. నానాదేశవిలోకనోత్కంఠచే సంచరించుచు నీవనంబున నాఖేటావినోదంబు సలుప వచ్చినవాఁడను. ఈనీలవానరంబు మీకడకుం దోడ్కొనిరా నియ్యెడకుం జనుదెంచియున్నాఁడ. ఈకామినీతిలకం బెవ్వతె! ఎందు కీవ్రతంబు సలుపుచున్నయది? ఇది వినవలతుం గావ యుక్తం బయ్యెనేని వివరింపుఁ డన వార లి ట్లనిరి. ఇక్కన్యకారత్నంబు సింహపురపాలకుం డగుప్రతాపపాలునికూఁతురు. వసుధారిణి యను పేరుగలది. ఇది భవద్గుణశ్రవణసంజాతప్రీతియై నిన్నుం గోరి వ్రతంబు సల్పుచున్నయది. దేవీప్రసాదంబున భవత్ప్రాప్తి గల్గె. మాపడినకష్టంబులు ఫలించె. అని నుడువఁగా రాజకుమారుం డి ట్లనియె.

మ. నవసౌభాగ్యవిలాసలక్ష్మియగు నీనాళీకపత్త్రాక్షి నా
భవము న్ప్రాప్తఫలంబు సేయఁ దలఁప న్భావింప దుష్ప్రాప్యమే
యవని స్త్రీఁ గనఁ గోరువాఁడు గనునో యాశ్రీనిఁదాఁ గానఁడో
భవ మం దాసిరి తా నె కోరినను దుష్ప్రాప్యంబునుం గల్గునే.

అని యిట్లు వచించి యాకాంతామణులం గాంచి యోకన్యకాతిలకంబులారా! ఈమంగళంబు నేను బహుదినములుగఁ బ్రార్థించుచుండినదియు, మీభర్తృదారికాసుగుణ

గణంబులు సింహపురంబుననుండి సనుదెంచినవారలవలన విని యుత్కంఠితుండనై యుంటిని. ఈయిందువదనాసందర్శనంబు సమకూరుటకుం గడు సంతసం బయ్యె. ఈ కేసరగండం బను వానరంబువలన శివదర్శనంబు నాకుం గల్గెం గాన నిదియ యీసుందరీపాణిగ్రహణంబునకును హేతువు గాంగలదు. దీనివలనన యీమనయేకస్థలసమావేశవృత్తంబు వెల్లడియై గురుజనాభిమతంబుగఁ బరిణయమంగళంబు జరుగు. అని చెప్పి వారల కావానరంబు నప్పగించి యోసుందరులార మరలి మీనగరంబునకుం జన యానాదిసాధనంబులాయత్తంబులై యున్నవియె? అని యడిగిన వారు రాజపుత్ర! నరపతిప్రేషితం బైన సేనాచక్రంబు రథగజతురగపదాతంబులతో సమీపాశ్రమమున నున్నయది. ఇది వివిక్తం బై యుండఁ జను నని కన్యకారక్షణార్థం బరుదెంచిన సైన్యంబు నాశ్రమాంతరమున నిలిపి యున్నవారము; అని చెప్ప వారల వీడుకొని యచ్చోటు విడిచి కతిపయదినంబులకు వసుమానసంబునకుం జేరె వసుధారిణియుం సర్వానందంబులమూర్ధంబున కెక్కినదియుం బోలె ననదృశామోదంబునం జెలంగుచు సేనాచక్రపరిపాలితయై తననగరంబు సేరె. ఈ రాజపుత్రి మనయుదయాదిత్యునిరూపంబు నాసమయంబునం గాంచినది గాన నితని రూపంబును జిత్రఫలకంబుననమరిచి బ్రాణసమానంబుగఁ గాపాడుకొనుచున్నది. ఈ వానరం బప్పుడప్పుడు పూర్వస్మృతిఁ జెందుచుండును గాన నీసమయంబునకుం దగినట్లు చిత్రఫలకంబుం గొనితెచ్చి యీవృత్తంబు వెల్లడిచేసె. రాచనగరునకు నిక్కడకు రాకపోకలు సేయుదాసీజనంబు లాడుకొనువచనంబులవలన నుదయాదిత్యునియాగమనంబు విని తద్వచనానుష్ఠానంబును రచించినయది. అనినం బ్రతాపాదిత్యుండు కాత్యాయనితో నోయార్యా! ఇప్పు డాసుందరిగతి యేమైనది.? అసిద్ధునికి వశగతయై చెడియెనా! లేక సద్వృత్తంబునన యున్నదా! తెల్పుము అని యడిగినం గాత్యాయని యి ట్లనియె. అసిద్ధుండు తరుణాంబుజ నపహరించినకతోరకపాలునికి మిత్రుండు. వాఁడు భైరవపూజానిర్వర్తనంబునం బ్రవర్తించినదినంబునందు బ్రాహ్మణకామినిం దజ్జననితోఁ దోడ్కొని చనియుండి మిత్రసహుని సెదిచ్చి యితనిచే నిహతుండయ్యె. ఆయిరువురును మిత్రసహరక్షితం బయినరాజకన్యకాచక్రంబునం గలసి మనతరుణాంబుజకు బానిసలై యున్నవారు. అని యందుంగలసుందరులలో నొకవంక మలినవసనధారిణిం జూపి యిదియ యాసుందరీదేవి; ఉత్తమగుణసంపన్నురాలు, తనప్రాణనాయకునివృత్తాం తెఱుంగక సంతపించుచుం జేయునదిలేకయుండి నావలన నీవానరంబ తనమగండని యెఱింగి యాపరాని శోకభారంబునం గన్నులనుండి వేఁడిబాష్పంబును బ్రవహింప నేడుచుచున్నది. అనిన నందఱు నత్యాశ్చర్యరసపూరమగ్నమానస లగుచు నాదేవశ్రుతసుందరీదేవీవృత్తంబులకుం గరంబు వగచుచు నింక నీశ్రుతదేవుని కీవానరరూపంబు దొలంగునుపాయం బెద్ది? ఈ పతివ్రతాతిలకంబునకుం దొలిజన్మమునం జేసినపాపఫలంబునం జేసి యిట్లు పతివిరహంబు

ప్రాప్తంబయ్యె. దీని కింక గతి యేమియో! యని యనుకొనుచుండిరి. భోజుండు మహా కవిం గాంచి యోమిత్రమా! యీవానరమునకుం దొంటిరూపు గలుగ ననుగ్రహింపు మని యడుగ నాకాళిదాసుండు,

శ్లో. కపివ ద్విప్ర సర్వాంగసుందరీం త్వా మనువ్రతాం,
త్యక్త్వా కపి రసీ ప్రాప్తో మానినీం మానవో భవ.

[గీ. వినుము సర్వాంగసుందరి వెలఁదిఁ బాసి, కపివలెఁ జరించుటనుబట్టి కపివె యైతి
పాపతివ్రత నిప్పుడ యాసఁ బడిసి, నాఁడ వీఁక వేగ బూర్వంపునరుఁడ వగుము.]

అని చెప్పిన నప్పుడు నానీలవానరంబు మన్మథసమానసౌందర్యసంపన్నుం డగు విప్రుం డయ్యె. అది గాంచి యెల్లవార లాశ్చర్యంబు నొందిరి. అబ్రాహ్మణునిం గాంచి సుందరీదేవి పరమహర్షపరవశయై తననాయకునితోడఁ గాళిదాసునిపాదంబులకుఁ బ్రణామంబుఁ గావించి సంస్తుతించి యుందయాత్మ్యునిం దీవించి యప్పుడ తరుణాంబుజాక్షానుసారిణు లగుపరిచారికలు దెచ్చియిచ్చినమహార్ఘంబులగు మణిమయభూషణాదులు దాల్చి య ట్లలంకృతుండైనమగనితో సంతోషపూరితాంతరంగయై నిలిచె. ఎల్లవారును గాళిదాసుని యసదృశప్రభావంబున కాశ్చర్యపడిరి. అప్పుడు ఆవసుధారిణీవృత్తాంతంబు విని ప్రతాపాదిత్యుండు మహాముదంబున నుబ్బుచుఁ బ్రతాపపాలునిం జూచి భోజునితోడం బోలె నీతో వియ్యం బందునట్లు సంప్రాప్తం బగుట మావంశంబునం జనించినపూర్వుల పుణ్యంబ యని యనుకొనుచున్నాఁడను. నీకూఁతురు భోజతనూజాతలతోడ మాయింటి కోడలగుటకంటె మఱియొండు లగ్గు గలదే. అని నుడివి భోజునింజూచి వివాహకార్యంబు వేగముగఁ జరుగంబోలు; అనిన నామహీపతి యీమహాతిశయంబుం జరిపింపంగల వాఁడు మహానీయుండగు కాళిదాసుండ యని నుడివినఁ గవియుం సంతసించుచు నోరాజా నీచెప్పినది యొప్పును. ఐనను మీయిరువురకు నాప్తబంధు వైనయీ కాత్యాయనియ యీమహోత్సవంబు జరిపించుట యుత్తమంబు. ఎల్లవారును దదాయత్తతం బ్రవర్తించు నది. అని కాత్యాయనిం జూచి యోయమ్మ! బహుదినములనుండి నీకాంక్షించుచున్న మహోత్సవం బిప్పుడు నిర్వర్తింపంగలిగినయది. పరిణయకార్యంబులు భవదభిప్రాయానుగుణముగఁ జేయుము. అనిన నాకాత్యాయనియుఁ దాసదాసీజనంబును బంపి ప్రతాపపాలునినగరునం గలసమస్తపరిజనుల రప్పించి వారిం గొని తొలుత భోజలీలావతుల నిజవేషాలంకృతులం జేయించి మహాకవిని సుస్నాతునొనరించి యనర్ఘమణిగణప్రభాభాసమానంబులగు భూషణంబుల నుత్తమవస్త్రమాల్యాదుల నలంకృతునిం గావించె. అంత నాభగవత్యాజ్ఞానుసారంబుగ నతిరూపవతులగు సుందరులు సకల రాజకుమారులకును రాజకుమారికలకును మంగళస్నానంబులు సేయించి సర్వాలంకారాలంకృతులం గావింప భగవతీసమాదిష్టులగుపురోహితులు వెక్కండ్రు తన్మందిరంబున

నఱువదొకటవహజారంబునంతరంబునం గలమహనీయగృహంబులందు నగ్ని వ్రేల్చి యే యేరాజకుమారిక కేయేరాజకుమారునిపయి మక్కువగల్గియుండెనో యాయాకన్యకలకు నాయాకుమారులకుఁ దత్తద్బంధుజనానుమోదితంబుగఁ బాణిగ్రహణమంగళంబు నిర్వర్తించిరి. అంత నెల్లవా రాహజారంబుఁ గడచి యఱువదిరెండవహజారంబునం గౌతుకకృతకం బనుమహామండపమునకుం బోయిరి. అందుఁ గాత్యాయనియాజ్ఞావహులయి పురోహితులు మదనమాలినీ మదనవతీసహితుండై యుండువిదర్భదేశాధీశ్వరుండగు మానపాలునిచేతం జంద్రరూపేందురూపలను మిత్రసహునికిం దారబోయించి విధియుతంబుగఁ బాణిగ్రహణమంగళంబుం జరిపిరి. అప్పుడు విదర్భరాజు తనయల్లునికి నపరిమేయంబులగుధనంబులొసంగి తనకూఁతులకు మిత్రసహునిం జేపట్టుటయుఁ దన్మూలకంబుగ భోజసుతలతో సహవాసంబు లభించుటయుం గొనియాడి యానందంబుం జెందిన వాఁడయ్యె. అంతం గాత్యాయనియాజ్ఞావిధానంబున నచ్చోటువాసి చని పరిణయోచితంబులగు సమస్తవిధాలంకారములు గావించి రత్నతోరణంబులుగట్టి ధ్వజపటంబులెత్తి కుట్టిమస్థలంబులం బువ్వులును గంధోదకంబులును జల్లి యగరుధూపంబులచేత సువాసితంబు గావించి యతిమహితంబులగు రత్నకంబళంబులు బఱచి కన్నులపండువై యొప్పునఱువదిమూఁడవహజారంబుం దాఁటి యయ్యెడ దేవేంద్రభవనంబునకు దీటగు నభ్యుదయశేఖరం బనుమహామణిమండపంబుం బ్రవేశించి యెల్లవారును భోజసుతోదయాదిత్యులవివాహమహోత్సవంబుం గనుంగొన నుత్సుకులై యుండిరి. మంగళవాద్యంబులు మ్రోఁగెను. పావనలగు విప్రకామినులు మంగళస్నానంబు సేయించి పరిణయాలంకారంబులు రచించికుమారుని నుదయాదిత్యునిం గుమారికలఁ దరుణాంబుజావిరజాంబుజావసుధారిణులను దోడ్కొని తెచ్చిన నప్పుడు మహాకవికాళిదాసుండు తానె పురోహితుండై విధివిహితంబులగు వైదికకృత్యంబులు సేయించి భోజునిం జూచి యోమహీపతీ నీవు బహుకాలంబుగఁ గోరుచుండిన యీమహాతిశయంబు వడసితివి. ఉదయాదిత్యునికి నీముద్దుకూఁతుల నొసంగి పాణిగ్రహణమంగళంబు నిర్వర్తింపుము అని చెప్పఁగా భోజుండును లీలావతీకరకమలకలితకనకకలశవాంత పావనతీర్థంబులచే నానందబాష్పబిందుబృందసంకలితంబులచే నాయుదయాదిత్యునియడుగులు గడిగి యాకుమారునిం జూచి,

చ. అనుపమబాహువీర్యవిజితాఖిలభూపతి వై యసాధకు
న్వనజదళేక్షణానికరవంచకు నంచితశౌర్యలీలమైఁ
దునిమి ధరాధినేతలకు దుఃఖనివారణ మాచరించి పా
వనతరకీర్తిఁ గాంచితివి వర్ణ్యము లయ్యె భవద్గుణావళుల్.

అని నుడివి మఱియు నిట్లనియె. ఓశౌర్యసాగర! కుమార!

చ. అనుపమరూప నీగుణము లాసజనింపఁగ నాలకించి నా
తనుజలు నిన్నె గోరిరి సుధాకరకీర్తి భవన్మృణార్ద్ర ళా
తనుతరగర్వసాధితల దర్పకసుందరిఁ బోలువారలన్
ఘనకచల స్వరించి మముఁ గౌతుకవారిధిఁ దేల్చుమీ వెసన్.

అని చెప్పి యాతరుణాంబుజావిరజాంబుజల నుదయాదిత్యునికి ధారవోసెను. అంతం గవివరచోదితుండై ప్రతాపపాలుండు కన్యాప్రదానోన్ముఖుండగుచు నా కుమారునింగాంచి యిట్లనియె.

మ. విజితారిప్రకరప్రతాపకలనావిధ్వస్తకన్యాజనా
ర్తి! జగత్పావనకీర్తి! సద్గుణగణశ్రీప్రోల్లసన్మూర్తి! యా
విజయాదిత్యునివంశ మిప్పుడు జగద్విఖ్యాతిఁ గాంచె న్భవ
ద్భుజనీయోద్భవమంగళోదయరమాపాత్రత్వముం గాంచుటన్.

అని మఱియు నిట్లనియె.

క. వినుతగుణవితతిమండితఁ, గనకాంగిని దేవకన్యకాసమ నీమ
త్తనుజాతను గైకొని త, జ్జననము సఫలంబు సేయఁ జనును గుమార!

అనిచెప్పి వసుధారిణి నుదయాదిత్యునికి ధారఁబోసెను.

అప్పుడు తూర్యధ్వానములును విప్రాశీర్వాదనాదంబులును పారావారరవంబు వోలె నెలంగె. అప్పుడు భోజుండును బ్రతాపపాలుండును మహోముదంబున నపరిమిత ధనరాసులను రథాశ్వగజపదాతంబు నల్లుని కరణంబుగ నొసంగిరి. సమస్తపౌరబృందంబు నను దెంచి యమ్మహోత్సవంబుఁగాంచి యత్యానందభరితాంతఃకరణంబై యాశ్చర్యంబు నొందెను. బ్రాహ్మణుల కవ్వారిగ నారాజబృందంబు ధనంబు లొసంగె. మఱియుఁ ననేక యాచకవందిమాగధసముదయంబునకుం దృప్తియగునట్లు ధనసంచయంబులు వెదచల్లిరి. అంతం గాత్యాయని యాజ్ఞానుసారంబుగ నెల్లవారు నాచోటు దాఁటి యఱువది నాల్గవమాజారంబున సారసమాజం బనుమహామండపంబునకుం జని తద్వచనానుసారముగ సంతుష్టులై గూరుచుండిరి. రాజకుమారసహస్రసంశోభితంబయి యాసభ సహస్రకిరణకర ప్రకాశితం బైనదివంబును బోలెఁ దేజరిల్లెను. అప్పుడు సమస్తజనంబులును కాళిదాసుని భోజుని నుదయాదిత్యుని మిత్రసహునిం బొగడిరి. అప్పుడు రాజకుమారు లెల్లవారును మహాకవిని సంస్తుతించి భోజప్రతాపపాలురతో ని ట్లనిరి. ఈమహాప్రభావసంపన్నుఁడగు మహాకవి కాళిదాసుఁ డుదయాదిత్యునియం దిట్టియనూనానురాగం బుంచుట నారయ నితనిపున్నియంబుఁ గొనియాడఁ దరంబు గాకయున్నయది. సర్వగుణసముదయంబు లీతని నలంకరించుటం జేసి కాదె యీమహనీయుని కిట్టిప్రేమభరం బితనియందుఁ గల్గెను.

ఇంతకంటె మహాతిశయం బొండు గలదే! సాధుజనానుగ్రహంబునకుం బాత్రంబగువాఁ డెట్టియైశ్వర్యంబు నేరి పడయక పోవునే! ఈచేరియుండు మహాసభ నెల్లవారు గని యానందింప నీమహాకవిచరితంబు రూపకంబుగ రచియించి యభినయింపం గాంక్షించుచున్నార మని యనఁగా నయ్యెడ నుండు వార లెల్లనిది యందఱ కతిప్రియం బవశ్యానుష్ఠేయంబ యిది యెప్పు డెప్పుడు గాంతుమా యని యతికౌతూహలోత్ఫుల్లమానసులై యున్నార మని కోలాహలంబు సలుపఁ గాత్యాయని యామహాకలకంబు చేసన్నల నివారించి యాసభికులం గాంచి యోయార్యులార! ఈమహాకవి కాళిదాసునిచరిత్రంబుం జూచుటకు మీర లాసించుట యభినందనీయంబ. ఇది సాకల్యముగ నెఱింగి యభినయించువార లుండినంగాని నిర్వర్తితంబు గాదు. అది యిప్పు డొక్కరుఁడు రచియించుటయు నది యభ్యసించి యభినయించుటయు నివి వైశంబ కానిపనులు. అభినయవిద్యాపారంగతులై సంగీతసాహిత్యసర్వస్వం బెఱింగి సకలవిద్యాపరిచయ ప్రశస్తచిత్తులైనవారలు గాని యిప్పు డీకార్యంబు గావింపం జాలరు. ఇట్టివార లిం దుదయాదిత్యుంను మిత్రసహుఁడును వీరియనుంగునెచ్చెలు లగుకాశ్యపకళావంతులును తరుణాంబుజావిరజాంబుజలు వసుధారిణియుఁ జంద్రరూపేందురూపలు గాక మఱి యెవ్వరును లేరు. ఈమహాకవియందుంగల గౌరవవిశేషంబునం జేసి యీకార్యంబు సేయుట వీరలకుం గొఱంతగాదు. అని నుడువఁగా నెల్లవారును గాత్యాయనిపల్కు లభినందించి రూపకవిలోకనోత్కంఠాకుంఠితప్రణయపరిప్లుతమానసులై యుండ నుదయాదిత్యప్రముఖులు సమస్తవిద్యావిచక్షణులై నకతంబున నతిమనోహర సందర్భరసోదారం బయి యొప్పు *కాళిదాసచరితవస్తుసంగ్రథితం బగురూపకం బభినయించి యెల్లజనంబుల నానందాంబుధిం దేలించిరి. ఇంతలో సూర్యుండు నుదయగిరిశిఖరం బలంకరించె. అప్పుడు కాళిదాసుండు తనయందు భక్తివిశేషంబు నలిపిన యుదయాదిత్యునిం గాంచి యాతని గుణంబు లభినందించి యిట్లనియె.

చ. నిరుపమవైదుషీతులితనీరజసంభవకాంత లైనయా
 యరుణసరోజపాణి చరుణాంబుజ మున్నగువారిఁ బెండ్లియై
 పరఁగిన సచ్చరిత్ర మిది భద్రతరం బయి యొప్పుఁగాత నీ
 యరుదగుకీర్తిలక్ష్మి యుదయార్క! కుమార! నిధానమై యిలన్

అనిన నెల్లవారును మహాముదంబున జయజయశబ్దంబులు వల్కిరి. అంతఁ బ్రతాపాదిత్య ప్రముఖులు పరిణయమంగళంబు మహావిభవంబుగ నైదుదినంబులు జరిగిన యనంతరము వధూసహితుఁ డైనయుదయాదిత్యుని మున్నిడుకొని ప్రతాతపాలునితో

* ఈగ్రంథము కాళిదాసచరిత్రప్రకరణమను పేర శాకుంతలాది నాటకములవలె

భోజరాజసమాహూతులైన సమస్తరాజులతో ధారానగరంబునకుంబోయి మహామోదంబున నాపురవరంబునందు వసించిరి. ఇట్లు కొన్నిదినంబులు నానాదేశాధీశులు ధారానగరంబున భోజభూపాలసత్కృతులై యుండి యంత భోజోదయాదిత్యుల వీడ్కొని వధూసహితులగుకుమారులం దోడ్కొని సంతసంబునం దమతమనగరంబులకుం జనిరి. ప్రతాపపాలుండు భోజభూపాలునిం దనవియ్యంకుని వీడ్కొని సింహపురికిం జేరె. ప్రతాపాదిత్యభూపాలుండు భోజలీలావతీప్రార్థితుండై కొంతకాలం బందు వసించియుండి ప్రియాసహితుం డై నయుందయాదిత్యునితో వసుమానసనగరంబుం జేరి సంతోషతరంగితస్వాంతుండై ప్రజాపాలనంబు సేయుచుండె. ఉదయాదిత్యుండును నవోఢలగు తరుణాంబుజానిగజాంబుజా వసుధారిణులం గూడి యౌవనసుఖంబు లనుభవించుచు నిందురూపా చంద్రరూపలతో మిత్రసహుం డసదృశామోదంబునం జెలంగుచుం జెలికాఁడై వర్తింప నపరిమితానం దాంబుధి నోలలాడుచుండెను.

గీ. వరవినోదకథాకల్పవల్లిఁ బోడమ, షష్ఠసుగుచ్ఛముగ నిన్ను సరసిజాక్ష
రాజగోపాలకృష్ణభూరమణుసత్సు, హాయమునఁ బూజఁ జేసితి సార్యవినుత.

ఇది శ్రీరాధానాథచరణకమలచంచరీకాయమాణమానస భారద్వాజగోత్రపవిత్ర
తిరుమలార్యపుత్ర పెరుందేవీగర్భజన్మ చిలకపాటి వేంకటరామానుజ
శర్మ ప్రణీతం బైన వినోదకథాకల్పవల్లియందు షష్ఠగుచ్ఛము
సర్వంబును సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీ శ్రీ శ్రీ



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1950.